# అష్టావక్రగీత

**స్వామి పరమానందనాథ**

శ్రీ గణపతి సచ్చిదానంద ప్రశస్తి అవార్డు గ్రహీత
విశిష్ఠ విద్యాశిరోమణి, ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు,
చతుర్వేద భాష్యకారులు, శ్రీవిద్యాబ్రహ్మసూత్ర భాష్యకారులు
అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,
ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, అమెరికా.
ఆస్థాన విద్వాంసులు, కనకాభిషేకగ్రహీత,
గండపెండేర సన్మానిత, సువర్ణ ఘంటాకంకణ,
శ్రీవిద్యారత్నాకర, శ్రీవిద్యావిశారద

**డా॥ క్రోవి పార్థసారథి**

ప్రకాశకులు :

**భారతీ గ్రంథమాల**

సత్యనారాయణపురం, విజయవాడ - 520 011 .

సెల్ : 9985616824

# అష్టావక్రగీత

## స్వామి పరమానందనాథ

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 2019

ప్రతులు : 1000



**వెల : రూ. 250-00**

ప్రతులకు :

1. **భారతీ గ్రంథమాల**
   సత్యనారాయణపురం,
   విజయవాడ - 520 011.
   సెల్ : 9985616824

2. **శివకామేశ్వరి గ్రంథమాల**
   41-22/4-36, భ్రమరాంబాపురం,
   కృష్ణలంక, విజయవాడ-520 013.
   ఫోన్ : 0866-2522824

3. **శివకామేశ్వరి ఆర్ష గ్రంథమాల**
   27-18-59, కాంగ్రెస్ ఆఫీస్ రోడ్డు,
   గవర్నర్‌పేట, విజయవాడ-520 002.
   ఫోన్ : 0866-6661777

ముద్రణ :
నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
గాంధీనగర్, విజయవాడ-3.

# ప్రణతులు

మహాభారతంలో ఒక ఉపాఖ్యానము అష్టావక్రగీత. జనక మహారాజు ఆస్థాన పండితుడు కహోలుడు. అతని భార్య సుజాత. వీరి సంతానమే అష్టావక్రుడు. ఇతడు గర్భంలో ఉన్న సమయంలో తండ్రి వేదపాఠాలు చెబుతున్నాడు. శిష్యులు సంత చెబుతున్నారు. ఇందులో తప్పు దొర్లింది. గర్భంలో ఉన్న శిశువు హేళన చేశాడు. దాంతో కోపం వచ్చి నువ్వు అష్టవంకరలతో జన్మించవలసింది అని శపించాడు. కహోలుడు, ఈ కారణం చేతనే అతడికి అష్టావక్రుడు అని పేరు వచ్చింది.

ఒకసారి యాగం చేస్తున్నాడు జనక మహారాజు. అదే సమయంలో యాగం తలపెట్టాడు వరుణుడు. కాని వరుణుడు చేస్తున్న యాగానికి పండితులు ఎవరూ పోలా. అందరూ జనక మహారాజు యాగానికే వచ్చారు. దాంతో వరుణుడు తన కుమారుడైన తర్కకుశలుణ్ణి పిలిచి ఎలాగైనా సరే పండితులను తన యాగానికి తీసుకురమ్మన్నాడు. తర్కకుశలుడు పండితుడుగా జనకుని యాగానికి వెళ్ళి, అక్కడి పండితుల్ని రెచ్చగొట్టి వాదనకు దింపి, అందులో ఓడిపోయిన వారిని సముద్రంలో మునిగిపొమ్మన్నాడు. అలా మునిగిన వారిని వరుణుడి భటులు వరుణుడు చేస్తున్న యాగానికి సగౌరవంగా తీసుకువెళ్ళి, ఉచితరీతిన సత్కరించారు. ఆ సమయంలో కహోలుడు కూడా వాదనలో ఓడిపోయి సముద్రంలో మునిగిపోయాడు.

అప్పుడు అష్టావక్రుడు పన్నెండు సంవత్సరాలవాడు. తండ్రికి జరిగిన అవమానం విని, జనకుని ఆ స్థానానికి వచ్చి, వాదనలో తర్కకుశలుణ్ణి ఓడించి, తండ్రిని రక్షించాడు. తరువాత కాలంలో జనక మహారాజుకు గురువైనాడు.

జనక మహారాజు గొప్ప తత్త్వవేత్త. అందులో నిష్ణాతుడు బాగా పండిపోయాడు. అటువంటి జనక మహారాజుకు అష్టావక్రుడికి మధ్య జరిగిన

సంభాషణే అష్టావక్రగీత. ఆధ్యాత్మిక సాహిత్యంలో ఉన్నతమైన స్థానం అలంకరించింది. ఇది సామాన్యులకు అర్థం కాదు. ఉత్తమాధికారుల కోసం చెప్పబడింది. జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే. అంటూ జీవాత్మ పరమాత్మగా మారే విధానం వివరించాడు అష్టావక్రుడు.

నాకు చాలా ఇష్టమైన గ్రంథం ఇది. దీనిమీద గతంలో 25 గంటలపాటు ఉపన్యాసాలు చెప్పి సిడి కూడా ఇచ్చాను. ఇప్పుడు దీన్ని గ్రంథస్థం చెయ్యాలనిపించింది.

ఇంత ఉత్తమోత్తమమైన గ్రంథాన్ని వ్రాయగలిగినందుకు ఆనందిస్తూ ... గతంలో నేను వ్రాసిన 42 గ్రంథాలలాగానే దీన్ని కూడా ఆదరిస్తారని భావిస్తూ....

**స్వామి పరమానందనాథ**

విళంబి నామ సంవత్సర

శ్రావణ శుద్ధ పౌర్ణమి

సోమవారం 30-04-2018

# విషయసూచిక

# అష్టావక్రగీత

## 1. అజ్ఞానం

అనాదిగా మానవుడు అజ్ఞానంలో పడి కొట్టుమిట్టాడుతున్నాడు. ఈ అజ్ఞానం వల్ల సంసారమనే సాగరంలో పడి మునుగుతూ, తేలుతూ కుడితి తొట్టిలో పడ్డ ఎలుకలాగా, అందులో నుంచి బయటకు రాలేక సతమతమవుతున్నాడు. ఈ విషయం అందరికీ తెలిసిందే. అయితే అసలు అజ్ఞానము అంటే ఏమిటి ? అజ్ఞానము అంటే తెలివి లేకపోవటం, బుద్ధి లేనితనం, ఎరుక లేకపోవటం, అవిద్య, మాయ, జ్ఞానం లేకపోవటం. మానవుడు తను చూస్తున్న విషయాలలో, వస్తువులలో ఏది సత్యమైనదో తెలుసుకోలేకపోవటం. ఈ జగత్తులో సత్యము, నిత్యము, శాశ్వతమైనదేదో తెలుసుకోలేక పోవటమే అజ్ఞానము. దృశ్యమానమైన జగత్తులో, కంటికి కనిపించేదంతా శాశ్వతం కాదు. దృశ్యమానమైనదంతా నశించేదే. రూపం కలిగినది, నామం కలిగినది అంతా నశించేదే. ఈ విషయం తెలుసుకోలేక ఈ జగత్తు శాశ్వతము అనుకుంటున్నాడు. తన ముత్తాతలు, తాతలు, తండ్రులు అందరూ గతించారు. నేడో, రేపో, తానుకూడా మరణిస్తాడు. అయినప్పటికీ అది నిజమని నమ్మడు. అనేకమంది రాజులు, చక్రవర్తులు ఈ ధరామండలాన్ని పాలించారు. వారంతా గతించారు. వారిలో ఏ ఒక్కరూ లేరు. అయినా తన జీవితం మీద అత్యంతమైన ప్రేమ. రాజులు పోయారు, రాజ్యాలు పోయాయి. వారు కట్టిన భవనాలన్నీ కుప్ప కూలిపోయినాయి. అయినా సిరిసంపదల మీద ఆశ. ఈ దేహము అశాశ్వతమైనది. మహా అయితే వంద సంవత్సరాలుంటుంది. ఆ తరువాత మట్టిలో కలిసిపోతుంది. తనకు ఆ విషయం తెలుసు. అయినా దేహంమీద మమకారం "నేను అంటే దేహమే" అనే భ్రాంతి. ఇదే అజ్ఞానము, అవిద్య, మాయ. దీనికి కారణం మానవుడు తనను తాను తెలుసుకోలేకపోవటం.

గాలి బుడగలాంటిది జీవితం. ఇది క్షణభంగురం. ఇక యవ్వనం సంగతి చెప్పనే అవసరం లేదు. అటువంటి ఈ దేహాన్ని, మలమూత్రాలు, రక్తమాంసాలు, ఎముకలు, నరాలు మొదలైన అసహ్యకరమైన పదార్థాలతో కూడిన ఈ దేహాన్ని చూసి చాలా అందమైనదిగా భావన చేస్తాడు. కడుజాగ్రత్తగా దాన్ని పోషిస్తాడు. అజ్ఞానము అనేది రెండు రకాలుగా ఉంటుంది. 1. అగ్రహణం 2. అన్యథాగ్రహణం. ఏదైనా వస్తువును చూసినప్పుడు దానియొక్క స్థితిని సరిగా గ్రహించలేకపోవటాన్నే 'అగ్రహణము' అంటారు. త్రాడును త్రాడుగా గుర్తించకపోవటం. ఆ వస్తువును ఇంకొకటిగా భావించటాన్నే అన్యథా గ్రహణము అంటారు. త్రాడును చూసి పాము అనుకోవటం. ఒక త్రాడు నేలమీద పడుతుంది. మసకచీకట్లో ఆ త్రాడును చూసి పాము అనుకున్నాడు. భయంతో కేకలు వేశాడు. ఇక్కడ త్రాడును త్రాడు అని గుర్తించకపోవటం అగ్రహణం. అది పాము అని భ్రమపడటం అన్యథా గ్రహణం. ఇలా భావన చేసేటప్పుడు అది తనకు హాని చేస్తుందనో, దానివల్ల తనకు లాభం ఉంటుందనో అనుకుంటాడు. మసకచీకట్లో త్రాడును చూసి పాము అనుకుని భయపడతాడు. అంతేకాని పామును చూసి త్రాడు అనుకోడు. అలాగే సముద్రం మీద తేలియాడుతున్న ముత్యపు చిప్పను చూసి వెండిపాత్ర అని, స్థాణువును చూసి దొంగవాడని భ్రమ చెందుతాడు. ఈ విధంగా సత్యాన్ని గ్రహించలేకపోవటమే అజ్ఞానం. ఈ అజ్ఞానము లేదా అవిద్య అనేది నిన్ననో, మొన్ననో వచ్చింది కాదు. అనాదిగా ఉన్నది. అందుకే ఈ అజ్ఞానము అనేది అనాదియైనది అంటున్నాం. దీనివల్లనే మానవుడు సంసారమనే సాగరంలో పడి మునుగుతూ తేలుతూ సతమత మవుతున్నాడు. అశాశ్వతమైన ఈ దేహమే శాశ్వతము అనుకుంటున్నాడు. ఆ దేహాన్ని సుఖపెట్టటానికి అనేక కర్మలు చేస్తున్నాడు. తత్ఫలితంగా అనేక జన్మలు ఎత్తుతూ గానుగకు కట్టిన ఎద్దులాగా సంసార సాగరంలో పడి కొట్టుమిట్టాడుతున్నాడు. ఈ ఊబిలో నుంచి బయటపడాలని అందరికీ ఉంటుంది. కాని పట్టుదల కొద్దిమందికే ఉంటుంది. అటువంటి వారు ముందుగా సద్గురువును ఆశ్రయించాలి.

**అజ్ఞాన తిమిరాంధస్య । జ్ఞానాంజన శలాకయా ।**

**చక్షురున్మీలితం యేన । తస్మై శ్రీ గురవే నమః ॥**

అజ్ఞానము అనే కారుచీకటిని పారద్రోలి, జ్ఞానజ్యోతులను వెలిగించే గురువుకు నమస్కారము.

**బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం**
**ద్వంద్వాతీతం, గగనసదృశం, తత్త్వమస్యాది లక్ష్యం**
**ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం**
**భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥**

బ్రహ్మానందమే స్వరూపంగా గలవాడు, శ్రేష్ఠమైన సుఖాన్ని ఇచ్చేవాడు, జ్ఞాన స్వరూపుడు, ద్వంద్వాలకు అతీతుడు, ఆకాశ సమానుడు, తత్త్వమసి మొదలైన మహావాక్యాలను వివరించి అద్వైతాన్ని బోధించేవాడు, అన్నింటికీ సాక్షియైనవాడు, గుణాతీతుడు అయిన గురువుకు నమస్కారము.

గురువు యొక్క మహాత్మ్యాన్ని 275 శ్లోకాలు గల 'గురుగీత'లో వివరించటం జరిగింది. అటువంటి సద్గురువును ఆశ్రయించాలి. అలాంటి గురువు ఎలా దొరుకుతాడు? లోకంలో కనిపించేవారందరూ గురువులే. వీరందరూ మనకు ఏదో ఒక సందేశాన్ని ఇస్తూనే ఉంటారు. వాటిని జాగ్రత్తగా గ్రహించాలి. దత్త చరిత్రలో దత్తాత్రేయుడు తనకు 24 మంది గురువులున్నారు అని చెబుతాడు. మన కర్మ పరిపక్వమైన తరువాత, అసలైన గురువే మనకోసం ఎదురు చూస్తుంటాడు. శంకర భగవత్పాదులకు గోవిందపాదాచార్యునిలాగా. అంతవరకు మిగిలిన వారి దగ్గర సందేశాలు తీసుకుంటూ ముందుకు వెడుతుండాలి.

చతుర్విధ పురుషార్థాలలో ఆఖరుదైన **'మోక్షమే'** అసలైన పురుషార్థం. ఆ మోక్షసాధనకే మిగిలిన ధర్మార్థ కామాలు ఉపకరించాలి. మోక్షము అంటే ముక్తి. లౌకిక బంధనాల నుంచి విముక్తి. మమ అంటే బంధము నమమ అంటే మోక్షం. 'అజ్ఞానం'లో 'అ' అనే అక్షరాన్ని చెరిపేస్తే, మిగిలినదేది? జ్ఞానమే, ఎప్పుడైతే 'మమ' అనే పదానికి 'న' అనే అక్షరం ముందు చేర్చావో, అప్పుడు అజ్ఞానంలో 'అ' అనే అక్షరం మాయమై పోతుంది. మిగిలేది జ్ఞానము, పొందేది మోక్షం. సాధకుడు సద్గురువును ఆశ్రయించి, ఈ చరాచర జగత్తులో పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశము, నేను కాదు, ఈ దేహము, నేను కాదు. నేను చిద్రూపమైన సాక్షి

చైతన్యాన్ని. బ్రహ్మక్షత్రియాది వర్ణాలు నాకు లేవు. ధర్మాధర్మాలు, సుఖదుఃఖాలు మొదలైన ద్వంద్వాలు ఏవీ నాకు లేవు. సర్వానికీ నేనే ఏకైక సాక్షిని. నాకు కర్తృత్వము లేదు. భోక్తృత్వము లేదు. ఈ జగత్తులో నేను తప్ప ఇంకెవరూ లేరు. నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని ఈ రకంగా త్రికరణ శుద్ధిగా భావన చెయ్యాలి.

**ముక్తాభిమానీ ముక్తోహి బద్ధోబద్ధాభిమాన్యపి ।**

తనను ముక్తునిగా భావించేవాడు ముక్తుడే అవుతాడు. బద్ధుడుగా భావించేవాడు బద్ధుడవుతాడు. **'యద్భావంతద్భవతి'** కైవల్యోపనిషత్తులో చెప్పినట్లుగా,

**అపాణిపాదోహ మచిన్త్యశక్తిః । పశ్యామ్యచక్షుః సశృణో మ్యకర్ణః ।**
**అహం విజానామి వివిక్తరూపో । నచాస్తి వేత్తా మమ చిత్సదాహమ్ ॥**

ఆ పరమేశ్వర స్వరూపానికి కాళ్ళు చేతులు మొదలైన అవయవాలు ఏవీలేవు. కాని కళ్ళు లేకుండానే చూస్తుంది. చెవులు లేకుండానే వింటుంది. అవయవాలు లేకుండానే ఆయా పనులు చేస్తుంది. ఆ పరమేశ్వరుడికి అన్నీ తెలుసు. అందరూ తెలుసు. కాని ఆయనను తెలుసుకున్న వారెవరూ లేరు. నిత్యశుద్ధ బుద్ధ జ్ఞాన స్వరూపమే ఆ పరమేశ్వరుడు.

**న భూమిరాపో న చ వహ్నిరస్తి న చానిలోమేస్తి నచాంబరంచ**
**ఏవం విదిత్వా పరమాత్మరూపం గుహాశయం నిష్కలమద్వితీయం ।**
**సమస్త సాక్షిం సదసద్విహీనం ప్రయాతి శుద్ధం పరమాత్మ రూపమ్ ॥**

పృథివి మొదలైన పంచభూతాలు నేను కాను. నేను సర్వసాక్షియైన చిన్మాత్రను అని భావన చేసినవాడికి పునర్జన్మ ఉండదు.

## ౨. ఆత్మ

దేన్నిగురించి తెలుసుకున్నంత మాత్రంచేత జగత్తులో ఇంకా తెలుసు కోవలసినది ఏమీఉండదో అదేఆత్మ. దేన్నిగురించి తెలుసుకుంటే జగత్తులో అన్ని విషయాలు అవగతమవుతాయో అదేఆత్మ. ఈ ఆత్మ తనకు తానేసాక్షి. తనకుతానే తెలియబడుతుంది. అందుచేత ఈ ఆత్మే పరబ్రహ్మ. అంతకుమించినది, వేరైనది ఇంకొకటి లేదు. ఈ ఆత్మపురుషుడే సృష్టిస్థితిలయలకు కారణమైనవాడు

ఆద్యంతములు లేనివాడు. నిరాకారుడు, నిరంజనుడు, నిర్గుణుడు, సత్యము నిత్యము అయినవాడు, సర్వాంతర్యామి. సర్వవ్యాపి. తలవెంట్రుకలో వెయ్యోవంతుగా అణుమాత్రుడై ఉన్నాడు. అతడు జన్మించడు, మరణించడు, శుష్కించడు, తడుపబడడు, దహించబడడు, కదలింపబడడు, భేదింపబడడు. జగత్తులో జరిగే విషయాలన్నింటికీ అతడే సాక్షి. భూతాలను అభివృద్ధి చేసేవాడు. ఆ పరమాత్మ పరిశుద్ధుడు. అతనికి కాళ్ళు చేతులు తల మొదలైన అవయవాలు ఏవీలేవు. మమకారము లేనివాడు. శబ్ద స్పర్శ రూప రస గంధాలు లేనివాడు. కోరికలు లేనివాడు. చింతించటానికి వీలు కానివాడు. రంగు లేనివాడు. అశుద్ధాన్ని శుద్ధంగా, అపవిత్రాన్ని పవిత్రంగా చేసేవాడు. క్రియాశూన్యుడు. నిర్వికల్పుడు. రాగద్వేషాలు లేనివాడు. ఆ పరమేశ్వరుడు ఆత్మసంజ్ఞ గలవాడు. శుద్ధుడు. ఒక్కడుగానే ఉన్నాడు. అతనితో సమానమైన వారు గాని, అతనికన్న అధికులైన వారు గాని ఎవరూ లేరు. బ్రహ్మరూపంలో సమస్త జగత్తులోను ప్రకాశించేది అతడే. విద్య అవిద్య, భావము అభావము, గురువు శిష్యుడు అనే భేదాలతో ఆ పరబ్రహ్మ ప్రకాశిస్తోంది. విద్యలేదు అవిద్యలేదు. జగత్తు అంతకన్నాలేదు. పరాపరములు లేవు. ఆత్మని పోల్చి చెప్పటానికి ఇంకొక ప్రమాణము ఏదీలేదు. ఆత్మను తెలుసుకోవటానికి దేశము, కాలము, బుద్ధి. ఇవి ఏవీ అవసరంలేదు. నేనే పరమేశ్వరుణ్ణి అనే విజ్ఞానంమాత్రం చాలు.

జాగ్రత్స్వప్నసుషుప్తి మొదలైన అవస్థలలో స్పష్టంగా వ్యక్తమయ్యేది, అంతరంగంలో ఎప్పుడూ నేను నేను అంటూ అనేకవిధాలుగా స్ఫురించేది, సర్వసాక్షిగా ఉండేది, సచ్చిదానందస్వరూపమైనది ఆత్మ. అది మానవుడి హృదయంలోనే ఉంది. అన్నమయకోశం నుంచి ఆనందమయకోశం వరకు గల పరంపరనే 'గుహ' అంటారు. ఆగుహలో ఉన్నాడు కాబట్టే గుహుడు అనబడుతున్నాడు. కుండలో నీరు నిండా ఉంది. ఆ నీటిలో సూర్యుడి ప్రతిబింబం కనిపిస్తోంది. ఆ ప్రతిబింబాన్ని చూసి మూర్ఖుడు అదే సూర్యుడు అనుకుంటాడు. అలాగే భ్రమవలన బుద్ధిలో ప్రతిబింబించిన చిదంశనుచూసి అదే తన సహజరూపం అనుకుంటాడు. వివేకవంతుడు కుండని, నీటిని, ప్రతిబింబాన్ని వదలి స్వయంప్రకాశంగా ఉన్న సూర్యుణ్ణి చూడగలుగుతాడు. అలాగే జ్ఞాని ఈ మూడింటినీ ప్రకాశింపచేసే స్వయంజ్యోతి అయిన పరమసత్యాన్ని స్పష్టంగా చూడగలుగుతాడు. తన హృదయ కమలంలో ఉన్న నిత్యము, సత్యము,

శాశ్వతము, సూక్ష్మరూపము అయిన పరమేశ్వరుణ్ణి గుర్తిస్తాడు. ఆత్మ వేరు నేను వేరు అనుకోవటమే బంధం. ఈ రెండూ ఒకటే అనుకోవటమే మోక్షం. ఈ విధంగా జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అని భావనచేసేవాడు, అలా బ్రహ్మత్వభావన పొందినవాడు తిరిగి ఈ లోకంలో జన్మించడు.

## 3. మనోజయము

మనోజయము అంటే మనస్సును జయించటం. దీన్నే మనోనాశనము అని కూడా అంటారు.

**'మనయేన మనుష్యాణాం కారణం బంధమోక్షయోః'**

బంధ మోక్షాలకు కారణం మనస్సు. **మమ** అనుకుంటే బంధం **'నమమ'** అనుకుంటే మోక్షం. మనసుతోనే సంసారం సృష్టించబడుతున్నది. ఏ పదార్థం మీద మనకు ప్రేమ అభిమానం ఉంటుందో దాని స్వరూపంగానే మనసుంటుంది. ఇది మనసు యొక్క లక్షణం. మోక్షం కావాలి అంటే మనసును అదుపులో పెట్టుకోవాలి. మనసు ఎప్పుడూ అదుపులో ఉండదు. ఒక విషయం మీద నుంచి ఇంకొక విషయం మీదకి దూకుతూ ఉంటుంది. పరుగులు పెడుతుంది. ఇంద్రియాలు మనసు యొక్క అధీనంలో ఉంటాయి. మనసు సక్రమంగా ఉంటే ఇంద్రియాలు సక్రమంగానే ఉంటాయి. మనసు సక్రమంగా ఉండటము అంటే అదుపులో ఉండటం. విషయవాసనల యందు చిక్కకుండా ఉండటం. ఎవరి మనసు విషయ వాసనల యందు చిక్కకుండా ఉంటుందో, అతడు మనసును జయించినట్లే. అజ్ఞానాన్ని వదిలి జగత్తంతా బ్రహ్మమయము అని భావన చేయగలిగినవాడే మనసును జయించినవాడు. మనసును జయించటం తేలిక కాదు అంటారు. ఇది అజ్ఞానులు చెప్పే మాట. ఆత్మజ్ఞానం కల పురుషుడికి మనసును జయించటమనేదికళ్ళుమూసి తెరిచినంత తేలిక. 'సర్వవ్యాపకుడైన బ్రహ్మమును నేనే' అని భావించిన వాడి మనస్సు అతని అదుపులోనే ఉంటుంది. జగత్తంతా పరబ్రహ్మలో కల్పించబడినదే. శబ్దాది విషయాలకు ప్రత్యేకమైన ఉనికి లేదు. అని తెలుసుకోవటమే మనోజయము. చరాచర జగత్తులో వినబడేవి, చూడబడేవి, మనసుతో భావించబడేవి అన్నీ పరబ్రహ్మ స్వరూపమే అని తెలిసిన జ్ఞానిమనసు అదుపులో ఉంటుంది. జీవబ్రహ్మలకు భేదము లేదని తెలిసిన జ్ఞానిమనసు అదుపులో ఉంటుంది.

ఈ రకంగా మనసును లౌకిక విషయాల యందు లగ్నం కానీకుండా కట్టడి చేసి జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే అని భావన చేయగలిగినవాడే మనసును జయించిన వాడు. **మోక్షం కావాలంటే మనోనాశనము జరిగి తీరాలి.**

## 4. తత్త్వవేత్త

తత్త్వాన్ని తెలుసుకున్నవాడు తత్త్వవేత్త. అతడే మహాజ్ఞాని. బ్రహ్మవేత్త. దేహమే నేను అని భావన చెయ్యటమే అజ్ఞానం. దేహమువేరు నేనువేరు. నేనుఅంటే త్వగాదిధాతువులలో కూడిన, అశాశ్వతమైన ఈదేహంకాదు. నేను అంటే ఆత్మ. పరమేశ్వరుడికి నాకు తేడాలేదు. చరాచర జగత్తులో ఉన్నది నేనొక్కడినే. నాకన్న వేరైనది ఏదీలేదు అని భావనచెయ్యటమే జ్ఞానము. తత్త్వవేత్త తనకున్న జ్ఞానంతో మహదానందాన్ని పొందుతాడు. ఈ ఆనందం నాలుగు రకాలుగా ఉంటుంది.

1. దుఃఖాభావము 2. కామానాస్తి 3. కృతకృత్య భావన 4. ప్రాప్యప్రాప్తభావన. ఈ రకమైనభావనలతో జ్ఞాని ఆనందడోలికలలో తేలియాడుతుంటాడు. వీటిని 'జ్ఞానానందము' అనే అధ్యాయంలో వివరించాం.

తత్త్వజ్ఞానం పొందిన జ్ఞానికి 'జిజ్ఞాస' అనేది ఉండదు. అందుచేత ప్రవృత్తి మార్గంలో అతడికి అపేక్ష ఉండదు. ఇంకా పొందవలసినజ్ఞానము ఉండదు కాబట్టి, నివృత్తికి అవసరమయ్యే ఇతరసాధనాల అవసరంఉండదు. పొందిన జ్ఞానం స్థిరంగా ఉండటానికి నివృత్తి రూపమైన ఏ సాధనము అవసరంలేదు. అవిద్యవల్ల కాని, దాని కార్యరూపమైన ద్వైతజ్ఞానంవల్ల గాని ఇతర జ్ఞానానికి హాని ఏ మాత్రం కలగదు. తత్త్వజ్ఞానం వల్ల అతనికి ముందే ద్వైతము, అవిద్య పూర్తిగా నశించినాయి. నాశనమైన ఇంద్రియాల ద్వారా ద్వైత జగత్తును ఎంతగా చూసినా నష్టంలేదు. అందువల్ల అతని జ్ఞానం ఏమీనష్టంకాదు. ఇక్కడ చిన్న ఉదాహరణ చూడండి. ఎలుక బ్రతికుండగా పిల్లినిచంపలేదు. చచ్చిన ఎలుక పిల్లిని ఎలాగూ చంపలేదు. ఇక్కడ నాశనమైన ఇంద్రియాలు చచ్చిన ఎలుక లాంటివి. తత్త్వజ్ఞానం లోగడ విజృంభించిన అవిద్యతో యుద్దం చేసి దాన్ని జయించింది. ఆ యుద్ధంలో అవిద్య నశించిపోయింది. అలా నశించిపోయిన అవిద్య మళ్ళీ రాలేదు కదా ! చచ్చిపోయిన శత్రువు వల్ల భయం లేదు.

# అధ్యాయం-1

# సర్వసాక్షి

నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. అతడు చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. పరమేశ్వరునిలోనే జగత్తుంది. జగత్తులోనే పరమేశ్వరుడన్నాడు. జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. **ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పినట్లుగా పరబ్రహ్మ నాలుగు పాదాలుగా ఉన్నాడు.

1. నాలుగు దిక్కులు పరబ్రహ్మ స్వరూపంలో మొదటి పాదం.

2. నదీనదాలు, అడవులు, కొండలు, ఎడారులు, సముద్రాలు, లోయలు, పర్వతాలు ఇవన్నీ రెండవ పాదము.

3. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, పంచభూతాలు మూడవ పాదం

4. ప్రాణం బ్రహ్మ, దృష్టి బ్రహ్మ, శ్రోత్రం బ్రహ్మ, మనస్సు బ్రహ్మ ఇది నాల్గవ పాదం.

అంటే చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. ఈ జగత్తులో చలనమున్నవి చలనం లేనివి, ప్రాణమున్నవి, ప్రాణం లేనివి అన్నీ పరబ్రహ్మ స్వరూపమే.

**ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా పరమేశ్వరుడు మానవ దేహాన్ని సృష్టించిన తరువాత, తాను అందులో ప్రవేశించి, అజ్ఞానంతో ఇంద్రియాల ద్వారా లౌకిక సుఖాలు అనుభవిస్తూ పంజరంలో బంధించబడిన పక్షిలాగా, శరీరంలో బందీ అయిపోయాడు. అతడే జీవాత్మగా పిలువబడుతున్నాడు. ఈ రకంగా సృష్టిలోని 84 లక్షల రకాలైన జీవరాసి లోను ప్రవేశించి అంతర్యామిగా ఉన్నాడు. అని **బృహదారణ్యకోపనిషత్తు, సుబాలోపనిషత్తు** చెబుతాయి.

వీటిని బట్టి చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. 84 లక్షల జీవరాశి పరమేశ్వర స్వరూపమే.

**ముండకోపనిషత్తు**లో చెప్పినట్లుగా, సంసారమనే వృక్షం మీద ఒకే రూపం గల రెండు పక్షులు కూర్చుని ఉన్నాయి. అందులో ఒకటి దొరికిన కాయలు, పండ్లు తింటున్నది. అదే జీవాత్మ. కాయలు పండ్లు అది చేసిన కర్మఫలాలు, రెండవది

ఏమీ తినకుండా దిక్కులు చూస్తూ కూర్చుంది. అది పరమాత్మ. పరమాత్మ ఏ కర్మలు చెయ్యదు. కాబట్టి కర్మఫలితాలు ఉండవు. అయితే జీవాత్మ, పరమాత్మ రెండూ వేరు వేరా? లేక రెండూ ఒకటేనా? అంటే రెండూ వేరు కాదు. రెండూ ఒకటే. కేవలము అజ్ఞానం వల్ల రెండూ వేరు వేరు అనుకుంటున్నాము. అజ్ఞానం గనక తొలగిపోతే జీవాత్మ పరమాత్మలు ఒకటే అవుతాయి. అప్పుడు అక్కడ రెండు పక్షులు ఉండవు. ఉండేది ఒకటే. అదే పరమాత్మ లేదా పరబ్రహ్మ.

శరీరంలో లేదా జీవిలో ప్రవేశించిన జీవాత్మ ఇంద్రియాలతో లౌకిక సుఖాలు అనుభవిస్తూ దేహం చేసే కర్మలన్నింటికీ తానే కర్త, భోక్త అనుకుంటోంది. అందుచేతనే కర్మ ఫలితాన్ని తాను అనుభవిస్తున్నాను అనుకుంటోంది. నిజానికి కర్మలు చేసేది దేహము. ఆత్మకాదు. ఆత్మకీ కర్మలకీ సంబంధం లేదు. కర్మలన్నింటి కర్తా భోక్తా దేహమే తప్ప ఆత్మకాదు. ఆత్మ కేవలము సాక్షి మాత్రమే. అన్నింటినీ చూస్తూ ఉంటుంది. ఆత్మసర్వానికి సాక్షి. జగత్తులో జరిగే ప్రతిపనికీ సాక్షిగా ఉంటుంది. అందుకే ఆత్మని సర్వసాక్షి అంటారు.

ముక్తిని సాధించాలంటే సాధన చతుష్టయము, సత్ప్రవర్తన అలవరచుకోవాలి. జగత్తులో కనిపిస్తున్న పంచభూతాలలో ఏవీ నువ్వు కాదు. నువ్వు సచ్చిదానంద రూపుడివి. సర్వసాక్షివి. దేహమే నేను అనే భావన వదిలిన మరుక్షణమే పరమశాంతుడు, ముక్తుడు అవుతావు. నువు ఏ ఆశ్రమానికీ, ఏ వర్ణానికీ చెందవు. సర్వసాక్షివి. మనసుకు, బుద్ధికి సంబంధించిన లక్షణాలు ఏవీ నీకు అంటవు. నువ్వు దేనికీ కర్తవు కాదు భోక్తవు కాదు సర్వసాక్షివి. సర్వాన్నీ చూస్తే ఏకైక సాక్షివి నీవే. నీవు సర్వస్వతంత్రుడవు. కర్తృత్వభోక్తృత్వాలు వదలి నేను సర్వసాక్షిని అనే మాట గుర్తుంచుకో. అజ్ఞానమనే అరణ్యాన్ని చైతన్యం అనే అగ్నితో దహనం చెయ్యి, సమస్త దుఃఖాల నుండి విముక్తుడవు కావలసింది. పరమానంద స్వరూపడివి నువ్వు. అది మరిచిపోయి భ్రమలో పడుతున్నావు. బంధనము, ముక్తి అనేవి కేవలము నీ చేతిలోనే ఉన్నాయి. నువు ఎలా భావిస్తే అలాగే అవుతుంది. ఆత్మకేవలము సర్వసాక్షి. సర్వవ్యాపి, అదే నువ్వు. నువ్వు అహంకారానివి అని భ్రమించకు. నువ్వు సర్వసాక్షివి. దేహము నీవు కాదు. నువ్వు ఏ పనీ చేయవు. దేనితోను నీకు సంబంధం లేదు. నీవే ఆత్మవు సర్వసాక్షిని. నువ్వు స్వయంజ్యోతివి. నిర్మలుడవు. సర్వసాక్షివి. జగత్తంతా నువు

ఆక్రమించి ఉన్నావు. జగత్తంతా నీలో ఉన్నది. నీవు కోరదగినది ఏదీ లేదు. సమదృష్టి కలిగిన సర్వసాక్షివి. ఈ జగత్తులో దృశ్యమానమైనవన్నీ నశించిపోయేవే. **బ్రహ్మ సత్యం జగన్మిథ్య.** ఆ పరబ్రహ్మమే నీవు. సర్వసాక్షివి అని చెబుతున్నాడు అష్టావక్రుడు జనక మహారాజుతో.

అంతకు ముందు జనకమహారాజు ముక్తిమార్గం చూపమని అష్టావక్రుణ్ణి కోరాడు. దానికి సమాధానంగా పై విషయాలు చెప్పాడు అష్టావక్రుడు.

మొదటి అధ్యాయంలో 20 శ్లోకాలున్నాయి. మొదటి శ్లోకం జనక మహారాజు ప్రశ్న. ముక్తి మార్గం చూపమని అభ్యర్థన, రెండవ శ్లోకం నుంచి అష్టావక్రుని సమాధానము చెప్పబడ్డాయి.

**కథం జ్ఞానమవాప్నోతి కథం ముక్తిర్భవిష్యతి ।**
**వైరాగ్యం చ కథం ప్రాప్త మేతత్ బ్రూహి మమప్రభో ॥ 1**

ప్రభూ! జ్ఞానార్జనకు మార్గం ఏది? ముక్తి సాధించటం ఎలా? వైరాగ్యం ఎలా నిలుస్తుంది? ఈ విషయాలను నాకు చెప్పండి.

మహాత్మా! గురుదేవా! జ్ఞానవైరాగ్యాలు ఎలా కలుగుతాయి? ముక్తి ఎలా కలుగుతుంది? ఈ విషయం నాకు వివరంగా చెప్పండి అని అడిగాడు జనక మహారాజు.

ఒక రోజున అష్టావక్రుడు జనకమహారాజు ఆ స్థానానికి వచ్చాడు. వచ్చిన మహర్షిని స్వాగతించాడు జనకమహారాజు. ఆసనమిచ్చి గౌరవించాడు. ఇక్కడ ఆసనం ఇవ్వటం అంటే సభలో ఉన్న ఒక ఆసనం చూపటం కాదు. పెద్దవాళ్ళు వచ్చినప్పుడు, ఎదురు వెళ్ళి వారిని గౌరవంగా తోడ్కొని వచ్చి, తాను కూర్చునే సింహాసనం మీద వారిని కూర్చోబెట్టి, పట్టమహిషితో కలిసి వారి పాదాలను కడిగి, అర్చన చేసి, కుశల ప్రశ్నలు అయిన తరువాత వారు చెప్పే విషయాలు వినటానికి సన్నద్ధుడై రాజుగారు చేతులు కట్టుకుని సింహాసనం ప్రక్కన నుంచుంటాడు. రాజుయొక్క సేవలకు ప్రీతి చెందిన మహర్షి, రాజును అనుగ్రహిస్తాడు. ఆ రోజులలో ఇలాగే జరిగేది పండితులైన రాజుల సభలలో. అదే పనిచేశాడు ఇప్పుడు జనకమహారాజు కూడా. అష్టావక్రుడు జనకుని శ్రద్ధాభక్తులు, వినయ విధేయతలకు సంతసించినవాడై రాజా! నీకేం కావాలో కోరుకో అన్నాడు.

ఇక్కడ ఒక చిన్న అనుమానం. అష్టావక్రుడు మునా? ఋషా? ఇది సంశయము. ముందుగా ఈ విషయం చూద్దాం.

ముని అంటే మౌనంగా ఉండేవాడు. తపస్సు చేసుకునే వారు ఎవరితోను మాట్లాడకుండా దీక్షతో ఉంటారు. వారిని మౌని అంటారు. అదే కాలక్రమేణా పలకటంలో ముని అయింది. అయితే ముని అనే శబ్దం కూడా విడిగా ఉంది. దానికి ఋషి అని అర్థం.

ఋషి అంటే – జ్ఞానముచే సంసారాన్ని దాటినవాడు, శాస్త్రకారుడు, ఆచార్యుడు, మంత్రద్రష్ట.

రేస్కలనము లేక సత్యప్రజ్ఞులైన వారిని **ఋషులని**, సంపూర్ణ తత్త్వజ్ఞానం కలవారిని **మునులని** అంటారు.

అష్టావక్రుడు మహాజ్ఞాని. ఆచార్యుడు కూడా. ఇప్పుడు జనకమహారాజుకు తత్త్వజ్ఞానాన్ని ఉపదేశిస్తున్నాడు. ఈ రెండు కారణాల చేత అష్టావక్రుడు ఋషి అంతేగాని మునికాదు. అష్టావక్ర మహర్షి.

జనక మహారాజు చాలా గొప్ప పండితుడు. మహాజ్ఞాని. ఉపనిషత్తులలో ప్రత్యేకంగా బృహదారణ్యకోపనిషత్తులో ఇతని పేరు చాలాసార్లు వినిపిస్తుంది. యాజ్ఞవల్క్యుడు ఇతడి గురువు. ఇతడు చాలామంది ఋషీశ్వరుల దగ్గర బ్రహ్మవిద్యను గురించి తెలుసుకున్నాడు. ఏ మహర్షి కనుపించినా తన అనుమానాలడిగి నివృత్తి చేసుకునేవాడు. యజ్ఞాలు యాగాలు అనేకానేకాలు చేసి భూరి దక్షిణలిచ్చాడు. నిర్మలమనస్కుడు. నిరంతరము సత్యాన్వేషణలో కాలం గడిపేవాడు. ఇతడు అజ్ఞాని కాదు. శాస్త్రపరిజ్ఞానం బాగానే ఉంది. ఆ రోజుల్లో ఆధ్యాత్మికవిద్య తెలిసిన రాజు ఎవరు అంటే జనకుడి పేరే ముందు చెప్పేవాళ్ళు. ఇప్పుడు జనకుడు మోక్షమార్గాన్ని అన్వేషిస్తున్నాడు. అందుకే అష్టావక్రమహర్షిని వైరాగ్యప్రాప్తి, జ్ఞానసముపార్జనల గురించి వివరించమని, మోక్షమార్గం చూపమని ప్రార్థిస్తున్నాడు.

**బ్రహ్మసత్యం జగన్మిథ్య అనేది జ్ఞానం. నేను అంటే దేహము అనేది అజ్ఞానము,** అజ్ఞాని దృష్టిలో ఈ జగత్తు, దేహము, ఇంద్రియాలు, అంతఃకరణ చతుష్టయం, విషయ వాసనలు అన్నీ యథార్థము. సిరిసంపదలు, భోగభాగ్యాలు, భార్యాపుత్రులు, పాపపుణ్యాలు, సుఖదుఃఖాలు అన్నీ శాశ్వతం కాకపోయినా యథార్థం. కాని జ్ఞాని

దృష్టిలో ఇవేవీ లేవు. జగత్తులో పరబ్రహ్మ తప్ప వేరేది ఏదీలేదు. జగత్తంతా బ్రహ్మమయం. అందుకే **బ్రహ్మసత్యం జగన్మిథ్య**. జగత్తంతా మనస్సంకల్పంతో ఏర్పడింది. అజ్ఞానం వల్ల, భ్రమవల్ల జగత్తు ఆవిర్భవించింది. ఈ విషయాలన్నీ తెలిసిన వాడు జనక మహారాజు. సంపూర్ణంగా జ్ఞానసముపార్జన చేసి వైరాగ్యంతో ముక్తి పొందాలని అతడి కోరిక. అందుకే జ్ఞానవైరాగ్యాలు, ముక్తి మార్గము చూపమని అడుగుతున్నాడు అష్టావక్ర మహర్షిని.

పూర్వకాలంలో పుణ్యానంద మునీంద్రుడు తన ఆశ్రమ ప్రాంగణంలో తపస్సు చేసుకుంటున్నాడు. ఆ సమయంలో ఆశ్రమం మీదుగా ఆకాశంలో రెండు హంసలు ఎగురుతున్నాయి. అందులో ఆడుహంస మగహంసను అడిగింది. 'స్వామి! ఏ విషయాన్ని తెలుసుకున్నంత మాత్రం చేత జగత్తులోని అన్ని విషయాలు తెలుస్తాయో దాన్ని గురించి చెప్పండి" అని ఆ మాటలు విన్న మగహంస 'దేవీ! కుమ్మరివాడు మట్టి కలిపి బాగా తొక్కి, ఆ మట్టితో కుండలు, చట్టులు, బానలు, మూకుళ్ళు ఇలా అనేకమైన వస్తువులు తయారుచేస్తాడు. రూపం వేరైనా, పేర్లు వేరైనా వాటిలో ఉన్నది మట్టే. కంసాలివాడు వివిధ ఆభరణాలు తయారుచేస్తాడు. ఆ ఆభరణాల నామరూపాలు వేరైనా అందులోని బంగారం ఒక్కటే అంది. వెంటనే ఆడుహంస 'నాథా! తెలిసింది. పరమేశ్వర తత్త్వాన్ని తెలుసుకుంటే జగత్తులోని అన్ని విషయాలు తెలుస్తాయి' అంది.

ఈ మాటలు విన్నాడు పుణ్యానందముని ఆ హంసలు శివశక్తుల స్వరూపం తనకు తత్త్వబోధ చెయ్యటానికే వారు ఇలా వచ్చారు అని భావించి 55 శ్లోకాలతో చిన్న పుస్తకం వ్రాశాడు. దాని పేరే **'కామకలావిలాసము'** దీనికి నేను వ్రాసిన వ్యాఖ్యయే **శ్రీవిద్యాసర్వస్వము.**

పరమేశ్వర తత్త్వాన్ని తెలుసుకున్నవాడు జ్ఞాని చరాచర జగత్తంతా పరబ్రహ్మ రూపమే. అంతకన్న అన్యమైనది ఏదీ లేదు. దృశ్యమానమైనదంతా బ్రహ్మమే. ఈ విషయం తెలిసిన జ్ఞాని జన్మరాహిత్యం పొందుతాడు. ఇది జ్ఞానం. ఇక వైరాగ్యం అంటే.

**వైరాగ్యము :** ఐహిక సుఖాల యందు విముఖత. ఈ లోకంలో మనం అనుభవించే సుఖాలనే ఐహిక సుఖాలు అంటారు. సిరిసంపదలు, భోగభాగ్యాలు, అధికారము, స్త్రీ సౌఖ్యము మొ॥వి. ఈ సుఖాల యందు విముఖత కలగటమే

వైరాగ్యము అనబడుతుంది. అయితే వీటి యందు విముఖత ఎలా కలుగుతుంది? ఈ సుఖాలు ఎక్కువగా అనుభవించినట్లైతే విముఖత కలుగుతుంది అని చాలామంది భావన చేస్తుంటారు. అది సరికాదు. ఎందుచేతనంటే అగ్నిలో ఆజ్యం పోస్తే, అగ్ని ఇంకా ప్రజ్వరిల్లుతుంది అంతే గాని చల్లారదు. అలాగే అనుభవించటం వల్ల కోరికలు తీరవు. వాటిపట్ల విముఖత పెంచుకోవాలి. నీళ్ళు పోస్తే అగ్ని చల్లారుతుంది. అలాగే విముఖత వల్లనే వైరాగ్యం వస్తుంది. ఈ విముఖత అనేది మనసా వాచా కర్మణా రావాలి. ఈ లోకంలో ఏ రకమైన సుఖాన్నైనా ఇంద్రియాల ద్వారానే అనుభవించటం జరుగుతుంది. కాబట్టి వైరాగ్యం రావాలి. అంటే ముందుగా ఇంద్రియాలను అదుపులో ఉంచుకోవాలి. ఇంద్రియాలు రెండు రకాలు 1) అంతరింద్రియాలు 2)బాహ్యేంద్రియాలు. కాలు, చెయ్యి, కన్ను, ముక్కు ఇలాంటివన్నీ బాహ్యేంద్రియాలు. ప్రయత్నం మీద వీటిని కట్టడి చేయవచ్చు. కాని అంతరింద్రియాలను కట్టడి చెయ్యకపోతే విముఖత కలగదు. అందుకే త్రికరణ శుద్ధిగా వైరాగ్యాన్ని అలవరచు కోవాలి. ఇక్కడ ఇంకొక విషయం చూడాలి. అదేమంటే వైరాగ్యము అంటే కేవలం ఇహలోక సుఖాలపట్ల విముఖత మాత్రమే కాదు. పరలోక సుఖాలపట్లకూడా విముఖత రావాలి. బ్రహ్మనుండి స్తంభం వరకు అన్ని వస్తువులు నాశనమైపోయేవే. ఇక్కడ స్తంభము అంటే చెక్కదో, సిమెంటుదో కాదు. స్తంభము అంటే – చిన్న కీటకము. బ్రహ్మ నుండి స్తంభమువరకు అంటే పిపీలికాది బ్రహ్మ పర్యంతము అన్న మాట. స్వర్గసుఖాల మీద కూడా ఏ మాత్రము కోరిక ఉండకూడదు. ఇంకా చెప్పాలి అంటే మోక్షం కావాలనే కోరిక కూడా ఉండకూడదు. అందుకే ఇహలోక సుఖాలు కాని, పరలోక సుఖాలు కాని ఏవైనా సరే కాకి రెట్టతో సమానంగా భావన చెయ్యాలి. దీన్నే వైరాగ్యము అంటారు. ముక్తిని సాధించటం ఎలా ? అని అడుగుతున్నాడు.

**ముక్తి :** ముక్తి అంటే విముక్తి. ఐహిక బంధాల నుంచి విముక్తి. ఇక్కడ ముక్తి అనే పదం మోక్షము అనే అర్థంలో వాడబడింది. కాని ముక్తి అంటే మోక్షం కాదు. ఉపాసనలు రెండు రకాలు 1.నిరాకారోపాసన 2.సాకారోపాసన.

**1. నిరాకారోపాసన :** నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. జగత్తంతా నిండి ఉన్నాడు. ఇతన్ని గురించి తెలుసుకున్న వారు కూడా పరబ్రహ్మమే అవుతారు. మరణానంతరము వారికి మోక్షం లభిస్తుంది. వీరికి పునర్జన్మ ఉండదు.

**2. సాకారోపాసన :** నిరాకారాన్ని ఉపాసించటం చాలా కష్టమైనది. అందుచేత

సాధకానాం హితార్థాయ బ్రహ్మణోరూపకల్పనా సాధకుల కోరికలు తీరటం కోసం పరబ్రహ్మకు ఒక రూపం కల్పించబడింది. అదే శ్రీమన్నారాయణుడు, ఈశ్వరుడు, పరాశక్తి మొదలైనవి. సాధకులు వీరిని పరబ్రహ్మగా భావిస్తారు. ఈయనే కార్యబ్రహ్మ, అపరబ్రహ్మ ఇతడు ప్రత్యేకమైన లోకంలో ఉంటాడు.

| | | |
|---|---|---|
| శ్రీమన్నారాయణుడు | – | శ్వేతద్వీపంలో ఉంటాడు. |
| ఈశ్వరుడు | – | కైలాసంలో ఉంటాడు |
| శ్రీమహావిష్ణువు | – | వైకుంఠంలో ఉంటాడు |
| పరాశక్తి | – | మణిద్వీపంలో ఉంటుంది |
| శ్రీకృష్ణుడు | – | గోలోకంలో ఉంటాడు |

అపరబ్రహ్మ అర్చన, ఉపాసన అంతా నామరూపాత్మకం ఆ లోకం చేరి, అపర బ్రహ్మను సేవిస్తూ బ్రహ్మానందాన్ని అనుభవిస్తూ అక్కడే ఉండిపోతారు. ఇది శాశ్వతమైన స్థితి. బ్రహ్మానందాన్ని సాకారోపాసనకులు మాత్రమే అనుభవిస్తారు. నిరాకారోపాసన చేసిన వారి జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. వారికి ప్రత్యేకంగా గుర్తింపు ఉండదు. అందుచేత వీరికి బ్రహ్మానందాన్ని అనుభవించే అవకాశం కూడా ఉండదు. కాని జీవన్ముక్తుడైన వాడు జీవించి ఉండగానే బ్రహ్మానందాన్ని పొందుతాడు. ఇప్పుడు జనకుని పరిస్థితి అదే. ముక్తి పొందే మార్గం చూపమని అడుగుతున్నాడు జనక మహారాజు, గురువు గారైన అష్టావక్ర మహర్షిని.

**ముక్తిమిచ్ఛసి చేత్తాత ! విషయాన్విషవత్త్యజ ।**
**క్షమార్జవ దయా తోష సత్యం పీయూష వద్భజ ॥ 2**

కుమారా ! ముక్తి సాధించాలనే కోరిక ఉంటే విషయభోగాలు విషతుల్యంగా భావించు. క్షమ, దయ, ఋజువర్తనము, నిత్యసంతృప్తి మొ॥ వాటిని అమృతంగా భావించి, వాటిని సంపాదించి వృద్ధి చేసుకో.

ఓ శిష్యా! జనక మహారాజా! అనర్థాలన్నింటినీ తొలగించి, శాశ్వతమైన పరమానందాన్నిచ్చే ముక్తిని పొందాలి అనుకున్నట్లయితే, ముందుగా ప్రాణహాని

కలిగించే విషాన్ని ఎలా దూరంగా వదిలేస్తావో అలాగే అన్ని అనర్థాలకు మూలమైన విషయ వాంఛలను వదిలెయ్యాలి. వాటి యందు ఏ మాత్రము ఆసక్తి ఉండనీకు. నేను నాది అనే అహంకార మమకారాలు వదలిపెట్టు. క్షమ, దయ, సంతోషము, సత్యము మొ॥ వాటిని అమృతంలాగా స్వీకరించు.

శిష్యుని యొక్క మాటలు విన్న అష్టావక్రుడు చెబుతున్నాడు ఆనందము రెండు రకాలు 1. క్షణికము 2. శాశ్వతము. లోకంలో మనం పొందేవన్నీ క్షణికమైన సుఖాలే. అనుభవిస్తున్నంత సేపే ఇవి సుఖాన్ని హాయిని ఇస్తాయి. ఆ తరువాత దుఃఖాన్ని కలుగచేస్తాయి. ఒక తీపి పదార్థం నాకు చాలా ఇష్టం. చాలా బాగుంటుంది తిన్నాను. బాగుంది. ఆ హాయి ఆనందము అక్కడితో తీరిపోయినాయి. కాని మళ్ళీ మళ్ళీ ఈ సుఖాన్ని అనుభవించాలనే కోరిక మాత్రం ఉంటుంది. అనుభవిస్తున్నంత సేపు సుఖం ఉంటుంది. ఒక్కొక్కసారి ఈ సుఖం దుఃఖానికి కారణం అవుతుంది. బాగున్నది కదా అని బాగా తినేశావు. తింటున్నప్పుడు తెలియలేదు. తిన్న తరువాత అజీర్ణం ప్రారంభమయింది. ఆకలి మందగించింది. కడుపులో ఇబ్బందిగా ఉన్నది. దీనివల్ల విరేచనాలు, వాంతులు కూడా కావచ్చు. బాగా తీపి తింటే ప్రస్తుత రోజులను బట్టి చక్కెర వ్యాధి రావచ్చు. ఇతరత్రా వ్యాధులు రావచ్చు. దానివల్ల బాధలు, దుఃఖాలు కలుగుతాయి.

సుఖాలన్నింటిలోకి రతిసౌఖ్యము చాలా గొప్పది అంటారు. త్రిపురారహస్యంలో దీనిమీదనే చర్చ జరుగుతుంది. హేమలేఖ తన భర్త అయిన హేమచూడుడిని అడుగుతుంది. రాజా! ఇదే నిజమైతే రతికేళి అనంతరము ఆడపశువు వంటి నొప్పితో ఎందుకు బాధ పడుతుంది? అని కాబట్టి లౌకికమైన సుఖాలన్నీ దుఃఖాలకు దారి తీసేవే. ఇంట్లో ఎ.సి.కి బాగా అలవాటయినాం. 24 గంటలు ఎ.సి.లోనే ఉంటున్నాం. సుఖంగా ఉంది. అంతవరకు బాగానే ఉంది. కాని ఒక్కసారి కరంటు పోతే మన పరిస్థితి ఏమిటి? లౌకికమైన సుఖాలకు అలవాటు పడితే ఇలాగే ఉంటుంది. వాటి వెనక దుఃఖాలు వస్తాయి. అందుకే శాశ్వతమైన సుఖం కోసం ప్రయత్నం చెయ్యాలి. శాశ్వతమైన సుఖమే బ్రహ్మానందము, అంతకు మించిన సుఖం జగత్తులో లేదు. బ్రహ్మానందం ఎంత గొప్పగా ఉంటుందంటే, దాన్ని చెప్పటానికి మాటలు చాలవు. అందుకే అది అనుభవైక వేద్యము. అనిర్వచనీయము. బ్రహ్మానందం ఎలా

సాధ్యమవుతుంది? అంటే ముక్తి వలన కేవలము సాకారోపాసన చేసిన ముక్తపురుషులే దీనిని పొందగలరు. వారికి పునర్జన్మ ఉండదు. ఈ విషయం తెలుసు కాబట్టే జనక మహారాజు ముక్తిమార్గము చూపమని అడుగుతున్నాడు.

సామాన్యంగా ప్రతిచోటా ఇలాగే జరుగుతుంటుంది. **ఉత్తరగీత**లో అర్జునుడు భగవానుడైన శ్రీకృష్ణుని అడుగుతున్నాడు.

**యదేకం నిష్కళం బ్రహ్మవ్యోమాతీతం నిరంజనం ।**
**అప్రతర్క్యం అనిజ్ఞేయం వినాశోత్పత్తి వర్జితమ్ ॥**
**కారణం యోగనిర్ముక్తం హేతుసాధన వర్జితం ।**
**హృదయాంబుజమధ్యస్థం జ్ఞానం జ్ఞేయస్వరూపిణమ్ ॥**
**కైవల్యం కేవలం శాంతం శుద్ధం అత్యంత నిర్మలం ।**
**నిర్గుణం పరమం జ్యోతిః అప్రమేయం అనుత్తమమ్ ॥**
**ఆద్యంత రహితం సూక్ష్మం శివం అద్వైతం అవ్యయం ।**
**యద్ జ్ఞాత్వాముక్తిం ఆగచ్ఛేత్ తద్జ్ఞానం బ్రూహి కేశవ ॥**

"ఓ పరమాత్మా ! సజాతీయ, విజాతీయ, స్వగత భేదములు లేనిది, కళలు (అంశలు) లేనిది, పరబ్రహ్మ స్వరూపమయినది, 24 తత్త్వముల కన్న వేరైనది, గుణరహితమైనది, మనసుచేత ఊహింపలేనిది, వాక్కు చేత చెప్పలేనిది, ప్రమాణముల చేత చెప్పనలవి కానిది, జనన మరణాలు లేనిది, ప్రపంచోత్పత్తికి కారణమైనది, తనకు కారణము లేనిది, హృత్పద్మంలో అంతర్యామిగా ఉండేది, జ్ఞానమే స్వరూపంగా గలది, మోక్షస్వరూపమైనది, బంధ మోక్షాలు లేనిది, నిర్మలమైనది, గుణరహితమైనది, సర్వోత్తమమైనది, దివ్యమైన ప్రకాశము గలది, ఇంత పరిమాణము అని చెప్పటానికి వీలు కానిది, తనకన్న ఉత్తమమైనది లేనిది, ఆద్యంతములు లేనిది, వాంగ్మానస గోచరము కానిది, మంగళకరమైనది, రెండవది లేనిది, వికారములు లేనిది, అయిన దేనిని తెలుసుకుంటే ముక్తి వస్తుందో, అటువంటి జ్ఞానాన్ని ఉపదేశించవలసినది" అని అడుగుతున్నాడు అర్జునుడు. అంటే మోక్షమార్గం చెప్పమని అడుగుతున్నాడు. దీనికి సమాధానంగా భగవానుడు **ఉత్తరగీత** చెప్పాడు. అలాగే జనక మహారాజు

ప్రశ్నకు సమాధానంగా అష్టావక్రగీత చెబుతున్నాడు అష్టావక్రుడు. అసలింతకీ ఈ అష్టావక్రుడు ఎవరు? జనకుడు ఎవరు? అనే విషయాలు చూద్దాం.

**అష్టావక్రుడు :** ఏకపాదుడు అనే మహర్షి కుమారుడు అష్టావక్రుడు. ఏకపాదుణ్ణే 'కహోలుడు' అని కూడా అనేవారు. ఇతని భార్య సుజాత. ఉద్దాలకుడి చెల్లెలు. కహోలుడు విద్యార్థులకు వేదం నేర్పుతుండేవాడు. అష్టావక్రుడు తల్లి గర్భంలో ఉండగానే అన్ని శాస్త్రాలు నేర్చుకున్నాడు. ఒకనాడు కహోలుడు వేదం చెబుతున్నాడు. విద్యార్థులు సంత చెబుతున్నారు. గురువుగారు చెప్పిన వేదపాఠాన్ని శిష్యులు రెండుసార్లు చెబుతారు. దీన్ని సంత అంటారు. అటువంటి సమయంలో ఎగతాళితో కూడిన నవ్వు వినిపించింది కహోలడికి. తనను ఎగతాళి చేసేది ఎవరా? అని పరికించి చుట్టు చూశాడు. ఎవ్వరూ లేరు. ఇదంతా తన భ్రమ అనుకున్నాడు. వేదం చెబుతున్నాడు. మళ్ళీ నవ్వు వినిపించింది. ఈసారి కోపం వచ్చింది కహోలుడికి. ఆ నవ్వింది సుజాత గర్భంలో ఉన్న శిశువు అని అర్థమయింది. అది తన కుమారుడే. వెంటనే మితిమీరిన కోపంతో ఎందుకు నవ్వుతున్నావు అని గర్భస్థ పిండాన్ని అడిగాడు కహోలుడు. దానికి "తండ్రీ! నువ్వు విద్యార్థులతో ఎందుకు ఇంత కష్టపడి వేదం చదివిస్తున్నావు? వాళ్ళు నిద్రాహారాలు లేక బాధ పడుతున్నారు. దాంతో వాళ్ళు వేదంలో స్వరం తప్పుగా చదువుతున్నారు." అన్నాడు. దాంతో కహోలుడికి విపరీతమైన కోపం వచ్చింది. వెంటనే వంకర టింకరలుగా ఎదగవలసినది అని కుమారుణ్ణి శపించాడు. తండ్రి శాపం ప్రకారం ఎనిమిది వంకరలతో పుట్టిన కురూపి. అతడే అష్టావక్రుడు. అంతేకాని అష్టావక్రుడు అతని పేరు కాదు. తండ్రి శాపానికి తగిన శిక్ష. అలా ఎనిమిది వంకర్లతో కురూపిగానే పెరిగాడు అష్టావక్రుడు. అతడికి అదే పేరు సార్థకమైంది. అష్టావక్రుడు గొప్ప పండితుడు. ఇతడి తండ్రి కహోలుడు జనకుని ఆస్థాన పండితుడు.

ఒకసారి జనక మహారాజు ఒక యాగం చేస్తున్నాడు. అదే సమయంలో వరుణుడు కూడా యాగం సంకల్పించాడు. లోకంలోని పండితులందరికీ వర్తమానాలు వెళ్ళినాయి. యాగం ప్రారంభం అయింది. వరుణుడి యుగానికి ఎవరూ వెళ్ళలేదు. జనకుడు వచ్చిన వారందరికీ భూరిదక్షిణలిస్తాడు. అందుకనే పండితులంతా జనక మహారాజు చేసే యాగానికి వచ్చారు. దీంతో వరుణుడు బాగా నొచ్చుకున్నాడు.

వరుణుడి కుమారుడు 'నంది'ని పిలిచి ఎలాగైనా సరే పండితులను ఇక్కడికి తీసుకు రా అన్నాడు. వరుణుడి కుమారుడు తర్కశాస్త్రంలో దిట్ట. అందుకని అందరూ అతణ్ణి **'తర్కకుశలుడు'** అంటారు. అతడు జనకుని యాగశాలకు వచ్చాడు. దేశంలో ఉన్న పండితులందరూ అక్కడే కనుపించారు. ఇప్పుడు వరుణ పుత్రుడు సభ మధ్యలో నుంచుని ఓ పండితులారా! నేను వరుణ పుత్రుడైన నందిని. తర్కశాస్త్రంలో ప్రవీణుడను. మీలో ఎవరైనా నన్ను గెలవగలరా? అన్నాడు. ఎవరూ మాట్లాడలేదు. లేవలేదు. అప్పుడు తర్కకుశలుడు జనకుని వైపు తిరిగి 'ఓ మహారాజా! వీరి నా పండితులు అని నువ్వు గౌరవిస్తున్నావు.' అని హేళనగా అన్నాడు. దాంతో సభలో కొంత మంది లేచి వాదనకు సిద్ధము అయ్యారు. అప్పుడు తర్కకుశలుడు 'ఒక షరతు మీదయితే నేను మీతో వాదనకు ఒప్పుకుంటాను. వాదనలో ఓడిపోయిన వారందరూ తమంత తాముగా సముద్రంలో మునిగిపోవాలి' అన్నాడు. అంటే ఓడినవారు ఆత్మహత్య చేసుకోవాలన్న మాట. ఒక్క క్షణం ఆలోచించారు పండితులు. వాదనలో ఓడి జీవించటం కన్న మరణించటమే మేలు అనుకున్నారు. షరతుకు అంగీకరించారు. వాదన మొదలైంది. పండితులు ఒక్కొక్కరుగా ఓడిపోతున్నారు. ఓడినవారు జలసమాధి కావాలి. షరతు ప్రకారం సముద్రంలో మునిగిపోతున్నారు. అలా మునిగిన వారిని వరుణుని భటులు అత్యంత ఆదరాభిమానాలతో గౌరవించి వరణ లోకానికి తీసుకుపోతున్నారు. వారందరినీ భూరి దక్షిణలతో సత్కరిస్తున్నాడు వరుణుడు. ఈ క్రమంలో అష్టావక్రుని తండ్రియైన కహోలుడు కూడా వాదనలో ఓడిపోయి సముద్రంలో మునిగిపోయాడు. ఈ వార్త అష్టావక్రుని తల్లి సుజాతకు చేరింది. ఆమె విపరీతంగా విలపిస్తోంది. అప్పుడు అష్టావక్రుడు ఎనిమిది సంవత్సరాల బాలుడు. తండ్రి మరణించాడనే వార్త విని ఏకాఏకి జనకుని ఆస్థానానికి వచ్చాడు. తర్కకుశలుడితో వాదనకు దిగాడు. ఆశ్చర్యంగా చూస్తున్నాడు జనకమహారాజు. వాదనలో తర్కకుశలుడు ఓడిపోయాడు. సభికులందరూ హర్షధ్యానాలు చేశారు. నియమం ప్రకారం నువ్వు కూడా వెళ్ళి సముద్రంలో మునిగిపో అన్నాడు అష్టావక్రుడు. దానికి తర్కకుశలుడు వినమ్రుడై 'మహారాజా! మీ పండితులకు ఏమీ కాలేదు. వారందరినీ వరుణ లోకానికి తీసుకువెళ్ళారు. అక్కడ వరుణుడు వీరందర్నీ భూరి దక్షిణలతో సత్కరించాడు. ఇదిగో వాళ్ళని ఇప్పుడే తెస్తాను, అని వరుణ లోకం వెళ్ళి

పండితులందర్నీ జనకుని ఆస్థానానికి తీసుకువచ్చాడు. ఈ విధంగా పండితులకు ప్రాణబిక్ష పెట్టాడు అష్టావక్రుడు. ఇతడు గొప్ప పండితుడు. మహాజ్ఞాని. అష్టావక్ర గీతను బోధించింది ఇతడే.

**జనక మహారాజు**

సూర్యవంశపు రాజైన ఇక్ష్వాకువు యొక్క కుమారుడు నిమి. ఇతడు చక్రవర్తి. ఇతడు ఒక యాగం చెయ్యాలని సంకల్పించి, పదార్థాలన్నీ ఏర్పాటు చేసుకుని వసిష్ఠుని దగ్గరకు వెళ్ళి యాగం చేయించమని అడిగాడు. అయితే అంతకు పూర్వమే **పురుహూతుడు** అనే రాజు ఒక యాగం చెయ్యాలని సంకల్పించి వసిష్టుని యాగం చేయించమని కోరాడు. సరేనన్నాడు బృహస్పతి. ఇప్పుడు నిమిచక్రవర్తి వచ్చి అదే సమయంలో నాకు యాగం చేయించాలి అన్నాడు. దానికి వసిష్టుడు ముందు చెప్పిన వాడు పురుహూతుడు. కాబట్టి అతడి యాగం పూర్తి చేయించి వస్తాను అన్నాడు. అంత కాలం ఆగటం ఇష్టంలేని నిమిచక్రవర్తి గౌతముణ్ణి హోతగా పెట్టుకుని యాగం చేస్తున్నాడు. ఈ సమయంలో వసిష్టుడు వచ్చాడు. అప్పుడు నిమి నిద్రలో ఉన్నాడు. దాంతో వసిష్టుణ్ణి స్వాగతించలేదు. వసిష్టుడికి కోపం వచ్చి నిమిని దేహము విడువుము, విదేహుడవు కమ్ము అని శాపం ఇచ్చాడు. నిమిదేహాన్ని చాలించాడు. గౌతముడు నిమిచక్రవర్తి దేహాన్ని నూనెలో భద్రపరచి యాగము పూర్తి చేశాడు. దేవతలు వచ్చి హవిస్సులు స్వీకరించి నిమిని పునర్జీవితునిగా చేస్తాము అన్నారు. కాని ఈ దేహం ధరించటానికి నిమి ఒప్పుకోలేదు. దేవతల మహిమవల్ల దేహం లేకపోయినప్పటికీ ప్రజలకు దేహమున్నట్లే కనుపించాడు నిమిచక్రవర్తి. అందుకనే నిమి పాలించిన దేశానికి విదేహదేశము అని పేరొచ్చింది. నిమికి కుమారులు లేరు కాబట్టి అతని కుడిభుజాన్ని మధించారు ఋషులు. దానిలో నుంచి ఒక బాలుడు జన్మించాడు. అతడే జనకుడు. విదేహుని కుమారుడు కాబట్టి **వైదేహుడని,** మధనజాతుడు కాబట్టి **మిథులుడని** పిలువబడ్డాడు. మిథులుడు నిర్మించిన నగరమే మిథిలానగరము.

జనకుడు మహాజ్ఞాని తత్త్వవేత్త. వేదాలలో కూడా ఇతణ్ణి గురించి చెప్పబడింది. **శతపథబ్రాహ్మణంలో** ఒక చిన్న కథ ఉంది. మిథిలా నగరాధిపతి అయిన జనక మహారాజు ఒకసారి యాగం చేస్తున్నాడు. ఆ యాగంలో భాగంగా వేదాంత చర్చలు

జరుగుతున్నాయి. అప్పుడు జనకుడు ఆధ్యాత్మిక ప్రపంచంలో గొప్పవాడెవరో తెలుసుకోవాలనుకున్నాడు. ఆ రోజు ఆధ్యాత్మిక సభ జరుగుతుండగా బాగా బలిసిన వెయ్యి ఆవులు, దూడలు ఆబోతులు వీటిపైన పట్టువస్త్రాలు కప్పి, కొమ్ములకు, గిట్టలకు, మూపురాలకు, మెడలోను బంగారు హారాలు అలంకరించి సభలోకి తెచ్చారు. ఇప్పుడు జనక మహారాజు లేచి ఆధ్యాత్మిక ప్రపంచంలో గొప్పవాడెవరో, వారు ఈ ఆవులను తీసుకు పోవచ్చు అన్నాడు. అప్పుడు యాజ్ఞవల్క్యుడు సభలోని పండితులనందరినీ ఓడించి ఆవులను తోలుకుపోయాడు.

ఈ రకంగా జనకుడు ఆధ్యాత్మిక విద్యా సంపన్నుడు. ఇతని ఆస్థానానికి వచ్చిన అష్టావక్రమహర్షిని పరిపరివిధాల సత్కరించి మోక్షమార్గం చూపమని ప్రాధేయ పడ్డాడు. ఇప్పుడు అష్టావక్రుడు చెబుతున్నాడు.

ముక్తి సాధించటానికి రెండు రకాల మార్గాలున్నాయి. ఈ రెండూ తప్పని సరిగా ఆచరించాల్సిందే. మనకు ఏదో రోగం వచ్చింది. వైద్యుడి దగ్గరకు వెళ్ళాం. ముందు ఆయన ఈ ఈ పదార్థాలు తినటం మానండి అంటాడు. చక్కెరవ్యాధి వచ్చింది. ముందు వైద్యుడు చెప్పేది ఏమంటే చక్కెర తినటం మానెయ్యండి. పాలలో గాని, కాఫీలో గాని, ఇతరత్రా గాని చక్కెర ఎక్కడా వాడద్దు. తీపి పదార్థాలు చక్కెరతో చేసినవి తినద్దు. ఆ తరువాత కొన్ని మందులు వ్రాసి వ్యాధిని బట్టి వాటి మోతాదు చెప్పటం జరుగుతుంది. అంటే ఇక్కడ 1.వాడకూడని పదార్థాలు ఇవి నిషేధించాలి. వాటిలో చక్కెరతో పాటు పిండి పదార్థాలు, దుంప కూరలు, కొన్ని రకాల పండ్లు 2.వాడవలసినవి. మందుబిళ్ళలు మోతాదు ననుసరించి

అలాగే ముక్తి కావాలి అంటే రెండు మార్గాలు చెబుతున్నారు. 1. చేయకూడనివి 2. చేయవలసినవి.

**1.చేయకూడనివి :** విషయ భోగాలన్నీ విషతుల్యంగా భావించి వదిలెయ్యాలి. దేహం మొదలు అహంకారందాకా దృశ్యాలన్నీ విషయ భోగాలే. ఇంద్రియాలను భోగాలవైపు ఆకర్షించే విషయాలన్నీ విషయ భోగాలే. చరాచర జగత్తులో ప్రతిచోటా, ప్రతిక్షణము ఏదో ఒకటి మన కంటికి కనుపిస్తూనే ఉంటుంది. మిఠాయి దుకాణానికి వెళ్ళావు. అక్కడ అనేక మిఠాయిలు నిన్ను రా రమ్మని పిలుస్తున్నట్లుగా ఉంటుంది.

అందులో నీకిష్టమైన పదార్థాలు నోరూరిస్తూ ఉంటాయి. వస్త్రదుకాణానికి వెడితే అందమైన వస్త్రాలు కనిపిస్తాయి. నగల దుకాణంలో నగలు ఇలా ఒకటేమిటి? అనేకానేక వస్తువులు అవన్నీ నీకు కావాలనిపిస్తుంది. దుకాణానికే వెళ్ళనవసరం లేదు. కొన్ని వస్తువులు మనకు టి.వి.లో చూపిస్తుంటారు. వాటిని గురించి చెబుతుంటారు. ఇలా చూసినవన్నీ కావాలనే అనిపిస్తుంది. కొనాలని అనుభవించాలనే కోరిక. కొనలేకపోయాము. వాటిని దక్కించుకోలేక పోయాము అనే వ్యధ. పోనీ వాటిని తెచ్చుకుంటే మనకోరికలు తీరిపోతాయా అంటే తీరవు. ఇంకా ఇంకా ఏదో కావాలి అనిపిస్తూనే ఉంటుంది. అందుకే **ఆశాపాశము తాకడున్ నిడువు. లేదంతంబు** కోరికలు గుర్రాల లాంటివి. అవి వాయువేగ మనోవేగాలతో పరుగులు తీస్తాయి. వాటిని తీర్చుకోటానికి కర్మలు చేస్తాం. కర్మఫలితాన్ని అనుభవిస్తాం. మళ్ళీ కర్మ చేస్తాం వీటికి అంతెక్కడ? అనుభవించటం వల్ల కోరికలు తీరవు. **నజాతుకామః కామానాముపభోగేన శామ్యతి.** కాబట్టి విషయ భోగాలన్నీ కూడా విషతుల్యంగా భావించి వాటిని పరిత్యజించాలి.

**2. చేయవలసినవి :** ఆత్మనిష్ట కలగాలంటే నాలుగు లక్షణాలుండాలి. వాటినే 'సాధన చతుష్టయం' అంటారు. ఆత్మనిష్ట అంటే మనసును, బుద్ధిని ఆత్మయందు లయం చెయ్యటం. పరబ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోవాలంటే, సత్యాన్వేషణ విధిగా జరగాలంటే, మోక్షమార్గంలో పయనించాలి అంటే సాధనచతుష్టయం ఉండి తీరాలి. అని

| | |
|---|---|
| I. నిత్యానిత్యవివేకము | 3. షట్సంపత్తి |
| 2. వైరాగ్యము | 4. ముముక్షత్వము |

1. నిత్యానిత్యవివేకము – చరాచర జగత్తులో సత్యము, నిత్యము శాశ్వతమైనది ఏది? కానిది ఏది? అనేది తెలుసుకోవటం.

2. వైరాగ్యం – ఐహిక సుఖాల యందు విముఖత

3. షట్సంపత్తి – ఇది మొత్తం ఆరు రకాలుగా ఉంటుంది.

I. శమము – అంతరింద్రియ నిగ్రహము

II. దమము – బాహ్యేంద్రియ నిగ్రహము

III. ఉపరతి – కర్మలను పరిత్యజించటం

IV. తితిక్ష – శీతోష్ణ సుఖదుఃఖాలు సహించే శక్తి. చెయ్యగలిగిన శక్తి ఉండి కూడా ప్రతీకారము చెయ్యక పోవటము

V. శ్రద్ధ – గురువు నందు, శాస్త్రాలు చెప్పే విషయాల యందు అచంచలమైన విశ్వాసము

VI. సమాధి – బ్రహ్మాకారవృత్తిలో లీనమై పోవటం.

4. ముముక్షత్వము – మోక్షం పొందాలనే కోరిక. అన్నింటికన్న ఎక్కువగా ఉండాల్సింది ఇది. ఈ కోరిక లేకపోతే ఏది ఉన్నా, ఎన్ని ఉన్నా ప్రయోజనం లేదు. ఇదే కాకుండా

క్షమ – అన్నింటి యందు సహనము. ఓర్పు.

ఆర్జవము – ఇతరులను మోసం చెయ్యకపోవటం, మంచి నడవడికత

తోషము – సర్వదా ఆనందమయుడై ఉండటము

సత్యము – ఏ కాలంలోను మార్పు లేక స్థిరంగా ఉండేది (ఆత్మ)

ఇవన్నీ కూడా ముక్తికి సాధనాలు అంటున్నాడు అష్టావక్రుడు.

ఇవన్నీ కూడా నైతిక విలువలు. దేన్ని సాధించాలన్నా ముందు ఈ విలువలు కావాలి. ముఖ్యంగా మంత్రశాస్త్రంలో గాని, ఆధ్యాత్మిక శాస్త్రంలో గాని నైతిక విలువలు ఉంటేనే ఫలితం త్వరగా సిద్ధిస్తుంది. అందుకే ఇవన్నీ కూడా ముక్తికి సాధనాలు అంటున్నాడు.

**న పృథ్వీ న జలం న అగ్ని ర్నవాయుర్ద్యౌ ర్నవా భవాన్ ।**
**ఏషాం సాక్షిణ మాత్మానం చిద్రూపం విద్ధిముక్తయే ॥ 3**

కంటికి కనిపించే పంచభూతాలు నీవు కాదు. వీటన్నింటినీ చూస్తున్న సాక్షి చైతన్యమే నీవు. సాక్షి చైతన్యం అంటే సచ్చిదానంద స్వరూపమే. ఈ రెండింటికీ తేడా లేదని గ్రహించటమే ముక్తి.

పంచభూతాలలో ఏదీ నువ్వు కాదు. పంచభూతాలు వాటి గుణాలు ఇవన్నీ దేహధర్మాలు అంతేకాని ఆత్మధర్మాలు కావు. కాబట్టి వాటిమీద అపేక్ష ఉంచద్దు. పొడవు పొట్టి లావు సన్నం ఎరుపు తెలుపు ఇవన్నీ కూడా దేహధర్మాలు. దేహాన్ని చూసే నువ్వు దేహంకన్న వేరుగా ఉన్న సచ్చిదానందుడవు. పరబ్రహ్మవు. అంటున్నారు.

**మనోబుద్ధ్యహంకార చిత్తానినాహం**
**నశ్రోత్రం న జిహ్వే న చ ఘ్రాణనేత్రే**
**న చ వ్యోమ భూమిర్న తేజోనవాయుః**
**చిదానందరూప శ్శివోహం శివోహం ॥**

అంతఃకరణ చతుష్టయం నేనుకాదు. జ్ఞానేంద్రియాలు నేనుకాదు. కర్మేంద్రియాలు నేనుకాదు. పంచభూతాలు నేనుకాదు. తన్మాత్రలు నేనుకాదు. చిదానందరూపుడైన పరమేశ్వరుడను నేను అంటున్నారు శంకరులు తమ **నిర్వాణ షట్కం**లో.

మొదటగా పంచభూతాలు నువ్వు కాదు అంటున్నాడు అష్టావక్రుడు. అది ఎలాగో చూద్దాం.

సృష్టి ప్రారంభం కాక ముందు చరాచర జగత్తంతా శూన్యంగా ఉండేవి. ఆ శూన్యాన్ని పరబ్రహ్మ ఆచరించి ఉన్నది. కొంత కాలానికి పరబ్రహ్మ సృష్టి చెయ్యాలని సంకల్పించుకున్నది. అప్పుడు మొదటగా పరబ్రహ్మ నుంచి సత్త్వగుణం బయటకు వచ్చింది. అదే మాయ. అవ్యక్తము. ఆ తరువాత సత్త్వగుణం నుంచి రజోగుణం వచ్చింది. అదే మహత్తత్త్వము. హిరణ్యగర్భుడు. రజోగుణం నుంచి తమోగుణం వచ్చింది. అదే అహంకారము విరాట్స్వరూపము. ఈ రకంగా సత్త్వ, రజస్, తమోగుణాలు ఆవిర్భవించినాయి. అవే అవ్యక్త మహత్తత్త్వ అహంకారాలు.

అహంకారం నుంచి మొదటగా తన్మాత్రలు వచ్చినాయి. అవే శబ్ద స్పర్శ రూప రస గంధాలు. ఆ తరువాత వాటి స్థూలరూపాలయిన పంచభూతాలు వచ్చినాయి. పంచభూతాలలో ముందుగా వచ్చింది ఆకాశము. ఆ తరువాత

| | | |
|---|---|---|
| ఆకాశము నుంచి | – | వాయువు |
| వాయువు నుంచి | – | అగ్ని |
| అగ్ని నుంచి | – | జలము |
| జలము నుంచి | – | భూమి ఆవిర్భవించినాయి. |

ఈ పంచభూతాలతోనే దేహము ఏర్పడింది. అందుకే దీన్ని పాంచభౌతికము అంటారు.

| **వ.నెం.** | **భూతము** | | **లక్షణము** | **దేహంలో ఉండే ప్రదేశము** |
|---|---|---|---|---|
| 1. | ఆకాశము | – | శబ్దము | చెవి |
| 2. | వాయువు | – | స్పర్శ | చర్మము |
| 3. | అగ్ని | – | రూపము | కన్ను |
| 4. | జలము | – | రసము | నాలుక |
| 5. | భూమి | – | గంధము | ముక్కు |

**1. పృథివి అంశలు:** కపాలము, చర్మము, నరాలు, ఎముకలు, మాంసము, గోళ్ళు.

**2. జలము అంశలు :** రక్తము, మూత్రము, లాలాజలము, స్వేదము

**3. అగ్ని అంశలు :** ఆకలి, దప్పిక, ఉషణము, మోహము, మైథునము

**4. వాయువు అంశలు :** నడవటం, దాటటము, శ్వాస పీల్చుటము

**5. ఆకాశము అంశలు :** కామక్రోధాలు.

వీటితో స్థూలదేహం ఏర్పడింది. సూక్ష్మదేహము ఎలా వచ్చింది అంటే –

పంచభూతాల రజోగుణాన్ని నాలుగు భాగాలుగా చేసి అందులోని మూడు భాగాల నుంచి ప్రాణాన్ని సృష్టించటం జరిగింది. ప్రాణాలు ఐదు రకాలు.

1. ప్రాణవాయువు
2. అపాన వాయువు
3. వ్యానవాయువు
4. ఉదాన వాయువు
5. సమాన వాయువు

ఇవి కాక ఉపవాయువులు ఐదు ఉన్నాయి. అవి

1. నాగవాయువు
2. కూర్మవాయువు
3. క్రుకర వాయువు
4. దేవదత్తవాయువు
5. ధనుంజయ వాయువు

పంచభూతాల రజోగుణం యొక్క నాల్గవ భాగంతో కర్మేంద్రియాలను సృష్టించటం జరిగింది. వాక్కు, పాణి, పాదము, గుదము, ఉపస్థ ఇవి కర్మేంద్రియాలు. మాట్లాడటము, ఇవ్వటము, నడవటము, విడచుట, ఆనందించుటము అనే వికర్మేంద్రియ విషయాలు. పంచభూతాల సత్త్వగుణాన్ని నాలుగు భాగాలుగా చేసి అందులోని మూడు భాగాలతో అంతఃకరణను సృష్టించటం జరిగింది. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనేవి అంతఃకరణ చతుష్టయము. ఆలోచించటము, నిశ్చయించటము, స్మరించటము, అభిమానించటము అనేవి వీటి విషయాలు.

పంచభూతాల సత్త్వగుణం నాల్గవ భాగంతో జ్ఞానేంద్రియాలను సృష్టించటం జరిగింది. శ్రోత్రము, చర్మము, చక్షువు, జిహ్వా, ఘ్రాణము అనేవి జ్ఞానేంద్రియాలు. శబ్ద స్పర్శ రూప రస గంధాలు వీటి విషయాలు. ఇక పంచకోశాలు. వీటిలో మొదటిది అన్నమయ కోశము.

1. అన్నమయ కోశము – అన్న రసంతో జన్మించి, అన్న రసంతో వృద్ధి చెంది, అన్న రసమైన భూమిలోనే కలిసి పోయేది. ఇదే స్థూలదేహము.
2. ప్రాణమయకోశము – కర్మేంద్రియాలతో కూడిన ప్రాణము
3. మనోమయకోశము – జ్ఞానేంద్రియ సహితమైన మనస్సు
4. విజ్ఞానమయకోశము – జ్ఞాన సహితమైన బుద్ధి.

ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలు మూడు కలిసి సూక్ష్మదేహము. అదే లింగ శరీరము.

5. ఆనందమయకోశము – స్వస్వరూపము యొక్క జ్ఞానము. ఇదే కారణదేహము.

ఈ రకంగా మానవదేహం పంచభూతాల నుండి ఏర్పడింది. ఈ విషయమంతా **పైంగలోపనిషత్తు**లో ఉంది. **ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా మానవ దేహాన్ని సృష్టించిన తరువాత బ్రహ్మరంధ్రం ద్వారా పరమేశ్వరుడు ఆ దేహంలో ప్రవేశించి ఇంద్రియాలతో లౌకికమైన సుఖాలు అనుభవిస్తూ, నేను అంటే దేహము అని భావిస్తూ, దేహము చేసే కర్మలన్నింటికీ తానే బాధ్యుడను కర్తా భోక్తాకూడా తనే అనుకుంటున్నాడు. ఇదంతా అజ్ఞానం వల్ల జరుగుతోంది. కాబట్టి ఓ జనక మహారాజా! పంచభూతాలలో ఏవీ నీవు కాదు. శంకర భగవత్పాదుల వారు నిర్వాణ తమషట్కంలో చెప్పినట్లుగా

**నచవ్యోమభూమిర్నతేజోనవాయుః చిదానందరూప శ్శివోహం శ్శివోహం**

పృథివి, ఆపః స్తేజో వాయురాకాశము లనబడే పంచభూతాలు నేను కాను. చిదానంద రూపుడనైన పరబ్రహ్మనై ఉన్నాను. జగత్తులో జరిగే ప్రతి విషయానికి సాక్షి చైతన్యానివి నీవు. ఓ రాజా ! సాక్షి చైతన్యానికి, సచ్చిదానంద రూపానికి ఏమీ తేడాలేదు రెండూ ఒకటే. నువ్వే పరబ్రహ్మవు అంటున్నాడు అష్టావక్రుడు.

**కైవల్యోపనిషత్తు** కూడా ఇదే మాట చెబుతోంది.

**నభూమిరాపో న చ వహ్నిరస్తి న చానిలో మేస్తి న చాంబరం చ**
**ఏవం విదిత్వా పరమాత్మ రూపం గుహాశయం నిష్కలమద్వితీయం ॥**

ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి అనే పంచభూతాలు లేవు. ఈ రకంగా హృదయమనే గుహలో ఏకాకిగా, అద్వయంగా, సర్వసాక్షిగా, వ్యక్తావ్యక్త ప్రపంచానికి అతీతంగా ఎవరైతే తనను తాను గుర్తిస్తాడో అతడే పరబ్రహ్మ.

**యదిదేహం పృథక్కృత్య చితి విశ్రామ్యతిష్ఠసి ।**
**అధునైవసుఖీ శాంతః బంధముక్తో భవిష్యసి ॥** **4**

శరీర తాదాత్మ్యము నుంచి విడివడి, నీ ఎరుకలో నిష్ఠలో నిలబడగలిగిన తక్షణమే శాంతంగా, ఆనంద రూపంగా, ముక్తుడవుగా నిన్ను నువ్వు గుర్తిస్తావు.

ఓ జనక రాజా ! ముందుగా దేహంమీద ఆసక్తిని వదలిపెట్టు. పాంచ భౌతికమైన ఈ దేహం నేనుకాదు, నేను సచ్చిదానందరూపుడిని అని తెలుసుకుంటే ఈ జీవితంలోనే అంటే ఈ జన్మలోనే పరమానందం పొందుతావు.

గతంలో ఈ దేహము పంచభూతాల వలన ఆవిర్భవించింది అని చెప్పుకున్నాం. ఆ భూతాలు ఎక్కడ ఎలా ఉన్నాయో కూడా చెప్పుకున్నాం. అంతేకాదు. పంచభూతాలలో ఏదీ నీవు కాదు అని కూడా చెప్పుకున్నాం. ఈ శ్లోకంలో ఓ రాజా! నువ్వు శరీర తాదాత్మ్యం నుంచి బయటకు రా! అంటున్నాడు అష్టావక్రుడు. శరీర తాదాత్మ్యము అంటే నేను అంటే దేహము అనే భావన వదలిపెట్టు.

**ఐతరేయోపనిషత్తు**లో చెప్పారు చూడండి. మానవదేహాన్ని సృష్టించిన తరువాత ఆ పరమేశ్వరుడు బ్రహ్మరంధ్రం గుండా దేహంలో ప్రవేశించి, ఇంద్రియాలతో లౌకికమైన సకల సుఖాలు అనుభవిస్తూ, దేహం చేసే కర్మలన్నింటికీ కర్తా, భోక్తా తానే అని భావించి, దేహం నుంచి బయటపడే మార్గం తెలియక అజ్ఞానంతో పంజరంలో బంధించబడిన పక్షిలాగా దేహంలో బందీ అయిపోయాడు. ఇప్పుడు నేను అంటే దేహమే అని భావన చేస్తున్నాడు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పినట్లుగా ప్రజాపతి ఒకసారి బ్రహ్మము గురించి ఒక ప్రకటన చేశాడు. "ఆత్మకు పాపం అంటదు. ముసలితనం రాదు. మృత్యువు దాన్ని కబళించదు. ఆత్మకు ఆకలి దప్పికలు లేవు. ఆత్మ కోసం అన్వేషించిన వాడు, ఆత్మను అనుభవించిన వాడు ఆత్మ స్వరూపాన్ని పొందుతాడు. అతడికి పూర్ణస్థితి వస్తుంది" ఈ మాటలు విన్న దేవతలు, రాక్షసులు అందరూ ఆత్మని గురించి తెలుసుకోవాలి అనుకున్నారు. దేవతల తరఫున ఇంద్రుడు, రాక్షసుల తరఫున విరోచనుడు బ్రహ్మ దగ్గరకు వెళ్ళి ఆత్మని గురించి తెలుసుకోవాలని వచ్చాము అన్నారు. బ్రహ్మదేవుడు వారిద్దరినీ 32 సం॥ బ్రహ్మచర్య దీక్ష వహించి అక్కడే ఉండమన్నాడు. వారిద్దరూ దీక్ష పూర్తి చేసి ఆత్మతత్త్వాన్ని చెప్పమని బ్రహ్మను అడిగారు.

"మనుష్యుల కనుపాపలలో మెదులుతూ కనిపించే పురుషుడే ఆత్మ. ఆత్మ అభయము, అమృతము, అదే బ్రహ్మము" అన్నాడు బ్రహ్మదేవుడు.

అప్పుడు వారు 'దేవా! నీటిలో కనిపించే ప్రతిబింబం, అద్దంలో కనిపించే ప్రతిబింబం. ఈ రెండింటిలో ఏది ఆత్మరూపం?" అన్నారు. "నేను ఏ పురుషుణ్ణి చెప్పానో అతడే అన్నింటిలోను కనిపిస్తాడు. మీరు వెళ్ళి ఒకసారి నీటిలోను, ఒకసారి అద్దంలోను చూసుకురండి" అన్నాడు బ్రహ్మదేవుడు. వారిద్దరూ అలాగే చేసి తిరిగి వచ్చారు. వారిని చూసిన ప్రజాపతి 'మీరు ఏం చూశారు.' అన్నాడు.

‘నఖ శిఖ పర్యంతము కేశపాశాలతో నిండిన మా శరీరమే కనిపించింది’ అన్నారు.

‘మీ శరీరాలు శుభ్రం చేసుకుని వెళ్ళి మళ్ళీ చూడండి’ అన్నాడు బ్రహ్మదేవుడు. వారు అలాగే చేసి తిరిగి వచ్చారు. ‘ఇప్పుడు ఏం కనిపించింది?’ అడిగాడు బ్రహ్మదేవుడు. ‘చక్కని వస్త్రాలతో, ఆభరణాలతో అలంకరించిన మా దేహమే కనిపించింది’ అన్నారు వారు. ‘అభయము, అమృతమయము అయిన ఆత్మ అదే. అదే బ్రహ్మము’ అన్నాడు బ్రహ్మదేవుడు. సరే అని వారిద్దరూ అక్కడి నుంచి వారి పట్టణాలకు వెళ్ళిపోయారు. అలా వెళ్ళిపోతున్న వారిని చూసి ‘దేవతలైనా, రాక్షసులైనా శరీరాన్నే ఆత్మగా భావించటం పతన హేతువు’ అనుకున్నాడు ప్రజాపతి. విరోచనుడు తన రాజ్యానికి వెళ్ళి దేహమే ఆత్మ అని ప్రచారం చేశాడు. ఇంద్రుడికి మార్గం మధ్యలో అనుమానం వచ్చి మళ్ళీ బ్రహ్మ దగ్గరకు వచ్చి ఆత్మతత్త్వాన్ని పూర్తిగా తెలుసుకుని వెళ్ళాడు. **దేహమే ఆత్మ అని నమ్మిన రాక్షసులు అజ్ఞానులు.** ఇలా నమ్మటం పతనహేతువు. ఈ అజ్ఞానులు రోజురోజుకూ అజ్ఞానంలో ఇంకా ఇంకా కూరుకుపోతారు.

అందుకే అష్టావక్రుడు చెబుతున్నాడు. ఓ రాజా! దేహమే నేను అనే భావన వదలిపెట్టు. అలా వదలినట్లైతే నువ్వే పరబ్రహ్మవని తెలుసుకుంటావు అంటున్నాడు.

**నత్వం విప్రాదికో వర్ణోనాశ్రమీ నాక్షగోచరః ।**
**అసంగోఽపి నిరాకారః విశ్వసాక్షీ సుఖీభవ ॥ 5**

రాజా ! నువ్వు విప్రాది ఏ వర్ణానికీ చెందవు. ఏ ఆశ్రమానికీ చెందవు. ఇంద్రియాలతో చూడబడవు. నీవు సంగరహితుడవు. నిరాకారుడవు. సర్వసాక్షివి. విచారాన్ని వదిలి సంతుష్టుడవై జీవించు.

చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. 84 లక్షల జీవరాసి పరమేశ్వర స్వరూపమే. అంతే కాని వేదంలో కులము, మతము వీటి ప్రసక్తే లేదు.

ఋగ్వేదంలోని పదవ మండలంలో గల తొంభైయవ సూక్తం ఇదే పురుషసూక్తం. ఇందులోనే వర్ణవ్యవస్థ చెప్పబడింది. పరమ పురుషుణ్ణి వర్ణిస్తూ

**బ్రాహ్మణోస్యముఖ మాసీత్.**

**బాహూ రాజన్యః కృతః ఊరూ తదస్య వైశ్యః యద్వైశ్యః ।**

**పద్భ్యాగ్ం శూద్రో అజాయత।**

ఆ పరమ పురుషుడి ముఖము నుండి బ్రాహ్మణుడు, బాహువుల నుండి క్షత్రియుడు, ఊరువుల నుండి వైశ్యుడు, పాదాల నుంచి శూద్రుడు ఆవిర్భవించారు అని చెప్పబడింది. మరి పంచములు ఎవరు? అన్నప్పుడు నిషాదులే పంచములు అని భాష్యం వ్రాశాడు సాయణాచార్యుడు.

వేదంలో పురుషసూక్తం తప్ప ఇంకేక్కడా వర్ణప్రసక్తి లేదు. అందుచేతనే దీన్ని ప్రక్షిప్తము అంటారు విమర్శకారులు. తరువాత బృహదారణ్యకోపనిషత్తులో వర్ణవ్యవస్థ చెప్పబడింది.

**చాతుర్వర్ణం మయాసృష్టం గుణకర్మ విభాగ చ** వ్యక్తులు చేసే పనిని బట్టి వారిని నాలుగు వర్ణాలుగా నేనే విభజించాను అన్నాడు భగవానుడు గీతలో, ఇప్పుడు అష్టావక్రుడు చెబుతున్నాడు. రాజా! నువ్వు చాతుర్వర్ణాలలో ఏ వర్ణానికీ చెందవు. బ్రహ్మచర్యము, గృహస్త్రాశ్రమము, వానప్రస్థము, సన్యాసము, ఈ నాలుగింటినీ చతురాశ్రమాలు అంటారు. ఓ రాజా ! నువ్వు వీటిలో ఏ ఆశ్రమానికీ చెందవు. నీవు సంగరహితుడవు. నిరాకారుడవు పరబ్రహ్మవు. ఇంద్రియాలచే చూడబడవు.

**కేనోపనిషత్తులో**

**నతత్ర చక్షుర్ణచ్ఛతి నవాగచ్ఛతినోమనః** ఆత్మ ఉన్నచోటకి కళ్ళు వెళ్ళలేవు. వాక్కు వెళ్ళలేదు. మనసు వెళ్ళలేదు. అంటే ఆత్మ పదార్థాన్ని కంటితో చూడలేము, వాక్కుతో వివరించలేము, మనసుతో ఊహించలేము. ఈ ఇంద్రియాలు ఆత్మ ఉన్న చోటికి వెళ్ళలేవు. కంటికి చూసే శక్తినిచ్చేది ఆత్మ. వాక్కుకు మాట్లాడే శక్తినిచ్చేది ఆత్మ. మనసుకు ఊహించే శక్తినిచ్చేది ఆత్మ. కాబట్టి ఇంద్రియాలు ఆత్మను చూడలేవు.

నీవు నిరాకారుడివి. జగత్తులో ఉన్నదంతా నువ్వే. అంటే ఆత్మే. కాబట్టే పరబ్రహ్మ నిరాకారుడు. నిర్గుణుడు అన్నింటికీ సాక్షియైన వాడు. కాబట్టి ఓ జనకమహారాజా! నీవే పరబ్రహ్మ స్వరూపానివి. ఈ విషయం తెలుసుకుని సంతుష్టుడవై జీవించు.

**ధర్మాధర్మౌ సుఖం దుఃఖం మానసాని న తే విభో ।**
**న కర్తాఽసి సం భోక్తాఽసి ముక్త ఏవాసి సర్వదా ॥ 6**

ధర్మాధర్మాలు, సుఖదుఃఖాలు మొదలైనవి మనస్సుకు బుద్ధికి సంబంధించిన లక్షణాలు, నువ్వు సర్వవ్యాపివి. దేనికీ కర్తవూ కాదు భోక్తవు కాదు. నీవు సర్వదా స్వతంత్రుడవు. **ముక్త ఏవాసి సర్వదా**

మానవుడు అనేక కర్మలు చేస్తాడు. అందులో కొన్ని మంచి కర్మలు అంటే సమాజానికి మేలు చేసేవి. కొన్ని చెడ్డ కర్మలు సమాజానికి కీడు చేసేవి. మంచి కర్మలు చేస్తే పదిమంది నిన్ను మెచ్చుకుంటారు. వేనోళ్ళ కొనియాడతారు. తద్వారా చాలాకాలం పాటు స్వర్గసుఖాలు అనుభవిస్తావు. భారతంలో **ఇంద్రద్యుమ్న మహారాజు** కథే ఇందుకు ఉదాహరణ.

పూర్వ కాలంలో ఇంద్రద్యుమ్నుడు అనే మహారాజా ఉండేవాడు. వేదవేదాంగవిదుడు. అనేక యజ్ఞాలు యాగాలు చేసి బ్రాహ్మణులకు భూరిదక్షిణలిచ్చాడు. కొన్ని లక్షల గోదానాలు చేశాడు. గోదానం చేసినప్పుడు ఆవు తోక పట్టుకుని నీరు వదుల్తారు. అలా వదిలిన నీటితో అక్కడ ఒక పెద్దమడుగు ఏర్పడింది. మరణానంతరము స్వర్గలోకంలో సుఖాలు అనుభవిస్తూ చాలాకాలం ఉన్నాడు. ఒకసారి ఇంద్రుడు మహారాజా! నువ్వు చాలాకాలం నుంచీ ఇక్కడే ఉన్నావు. నీ పుణ్యఫలం అయిపోయింది. ఇంక నువ్వు భూలోకానికి వెళ్ళు అని బలవంతంగా అక్కడి నుంచి పంపేశాడు. నేను చేసిన పుణ్యఫలం ఇంకా ఉంది నిరూపిస్తాను అన్నాడు మహారాజు. ఇద్దరు భటులను ఇచ్చి పంపాడు ఇంద్రుడు. మహారాజు భూలోకానికి దేవదూతలతో సహా వచ్చాడు.

తాను గతంలో పాలించిన రాజ్యానికి వచ్చాడు. ఆ ప్రదేశం రూపురేఖలు పూర్తిగా మారిపోయినాయి. అందరూ క్రొత్తవారు కనిపిస్తున్నారు. ఇంద్రద్యుమ్నుడు **మార్కండేయుడి** దగ్గరకు పోయి 'నేను నీకు తెలుసా?' అన్నాడు. నేనెరుగను. నాకన్న పెద్దవాడు **ప్రావాకర్ణుడు** అనే గుడ్లగూబ ఇక్కడే ఉన్నది. దాని దగ్గరకు వెళ్ళు అన్నాడు మార్కండేయుడు. ప్రావాకర్ణుడి దగ్గరకు వెళ్ళి 'నేను నీకు తెలుసా? అన్నాడు మహారాజు. 'నాకు తెలియదు నాకన్న పెద్దవాడు **నాళీకజంఘుడు** అనే బక

శ్రేష్ఠుడున్నాడు. అతణ్ణి అడగండి' అంది గుడ్లగూబ. నాళీక జంఘుడి దగ్గరకు వెళ్ళి 'నేను నీకు తెలుసా' అన్నాడు మహారాజు. 'నాకు తెలియదు. నాకన్న చాలా పెద్దవాడు **ఆకూపారుడు** అనే తాబేలు ఈ సరస్సులో ఉన్నది. దాన్ని అడుగు' అన్నది కొంగ. ఆకూపారుడి దగ్గరకు వెళ్ళి 'నేను నీకు తెలుసా' అన్నాడు మహారాజు. వెంటనే ఆ తాబేలు "మహారాజా! నువ్వు తెలియకపోవటం ఏమిటి? నువ్వు ఇంద్రద్యుమ్న మహారాజువు. అనేక యాగాలు చేసి గోదానాలిచ్చావు. అప్పుడు ఆవుతోక పట్టుకుని వదిలిన నీటితోనే ఈ సరస్సు ఏర్పడింది. అప్పటి నుంచి నేను ఇందులోనే ఉంటున్నాను. ఇందులో కొన్ని లక్షల జీవులు బ్రతుకుతున్నాయి. ఈ సరస్సు ఆధారంగా కొన్ని వేల ఎకరాలు సాగు అవుతున్నాయి. కొన్ని లక్షల మందికి మంచి నీరు లభిస్తోంది." అన్నది తాబేలు. అదిగో నేను చేసిన పుణ్యకార్యం గురించి ఈ లోకంలో ప్రజలు ఇంకా చెప్పుకుంటున్నారు. కాబట్టి నాకు స్వర్గంతో ఇంకా చాలా కాలము స్థానమున్నది అని చెప్పి మళ్ళీ స్వర్గానికి వెళ్ళాడు.

అందుచేత **మానవుడు చేసిన కర్మలవల్ల దేశంలో ప్రజలు ఎంత కాలం సుఖపడతారో, ఎంత కాలం వారి పేరు గొప్పగా చెప్పుకుంటారో అంత కాలం ఆ మానవుడు స్వర్గసుఖాలు అనుభవిస్తాడు. అతణ్ణి గురించి ఎంత కాలం చెడ్డగా చెప్పుకుంటారో అంత కాలం నరకంలో కష్టాలు అనుభవిస్తాడు.**

అయినప్పటికీ ఓ రాజా! ధర్మాధర్మాలు, సుఖదుఃఖాలు అన్నీ మనసుకు, బుద్ధికి సంబంధించినవి. అవి నీవి కావు. నువ్వు దేనికీ కర్తవు కాదు భోక్తవూ కాదు. సర్వదా స్వతంత్రుడవు. సర్వవ్యాపివి.

**ఏకోద్రష్టాஉసి సర్వస్య ముక్తప్రాయోஉసి సర్వదా ।**
**అయమేవ హి తే బన్ధో ! ద్రష్టారం పశ్యసీతరమ్ ॥ 7**

అన్నింటినీ చూసే ఏకైక సాక్షిని నీవే. సర్వదా స్వతంత్రుడవు. నీవు ద్రష్టవు. సర్వసాక్షివి అయి కూడా అన్యథా భావిస్తున్నావు. అదే నీ బంధాలకు కారణము.

ఓ రాజా ! అన్ని శరీరాలలోను ఉండి ద్రష్టవై అన్నింటినీ చూస్తున్నది నీవే. సర్వత్రా వ్యాపించి ఉన్నావు. సచ్చిదానందరూపుడవు. అందుచేత నువు ఎల్లడూ ముక్తపురుషుడివే. దేహంమీద నీకుండే బంధాల కారణంగా నీకు బంధాలు ఉన్నట్లు

అనిపిస్తుంది. కాని నీకు బంధాలు లేవు. నువ్వు సర్వదా ముక్తుడవు. ఈ దేహము, ఇంద్రియాలు, జగత్తులు ఇవన్నీ నీకు సంబంధించినవి అనుకుంటే నువ్వు బద్ధుడౌతావు. అవి నావి కాదు. వాటితో నాకు ఏ రకమైన సంబంధము లేదు అనుకుంటే ముక్తుడౌతావు.

మానవుడు సర్వాన్ని సాక్షిగా చూసే చైతన్యమే నేను అనే సత్యాన్ని మరిచిపోయి, ఆ చైతన్య ప్రకాశంతో పనిచేస్తున్న మనస్సు, బుద్ధి, అహంకారము, దేహములే నేను అని భావిస్తున్నాడు. వాటి బాధలు తనవిగా భావిస్తున్నాడు. వాటికి ఉన్న పరిమితులను చూసి, తనను తాను పరిమితంగా భ్రమపడుతున్నాడు. తాను చూసేవే తాను అనుకునే ఉన్మాదావస్థలో ఉన్నాడు. దీని కారణంగానే నేను అంటే దేహము, ఇంద్రియాలు అని భావిస్తున్నాడు. అని చేసే కర్మలకు కర్తాభోక్తా తానే అనుకుంటున్నాడు. అందుకే బంధాలు ఏర్పడుతున్నాయి.

ఇక్కడ ఉన్నది కేవలము ఆత్మ మాత్రమే. ఆ ఆత్మలో భ్రమచేత జగత్తు కల్పించ బడుతోంది. అసలు నిజంగా జగత్తు లేదు. ఈ దేహం ఉన్నట్లుగా అనిపిస్తోంది. నిజంగా దేహంలేదు. మరి కంటికి కనిపిస్తోంది కదా?

మానవుడు నిద్రించినప్పుడు కల వస్తుంది. ఆ కలలో అనేక దృశ్యాలు విషయాలు కనిపిస్తాయి. తాను రాజైనాడు. ఏనుగులు, గుర్రాలు, సైనికులు, భటులు, రాజమందిరం, పల్లకీలు, అంతఃపురం, సింహాసనం, అధికారం, రాణివాసం. ఇలా ఎన్నో దృశ్యాలు కనిపిస్తాయి. వాటన్నింటినీ అనుభవిస్తాడు. యుద్ధాలు చేస్తాడు జయాపజయాలు. మెలకువ వచ్చింది. కలలో కనిపించిన దృశ్యాలేవీ ఇప్పుడు లేవు. కల కరిగిపోయింది. తన అధిష్ఠానమైన మనసులో లయమై పోయింది. అలాగే జాగ్రదావస్థలో కూడా జ్ఞానం కలగగానే ఈ జగత్తు అదృశ్యమై పోయి తన అధిష్ఠానంలో కలిసిపోతుంది. కలలో మనసు తన అజ్ఞానంతో ఇదంతా ఊహించు కుంటోంది. ఇదంతా భ్రాంతి. కల్పన, కలలోని వస్తువులు మెలకువ రాగానే కరిగిపోతాయి. జాగ్రదావస్థలో అలా కాదు. వస్తువులు కంటికి కనిపిస్తాయి. వాటిని చేత్తో తాకుతాము. అనుభవిస్తాము. తన భార్యాపిల్లలు, ఇల్లు వాకిలి, అన్నీ తన కళ్ళ ఎదురుగా కనిపిస్తున్నాయి. వాటిని తాను అనుభవిస్తున్నాడు. అందుకే అవన్నీ సత్యము అనుకుంటున్నాడు. జ్ఞానం కలిగితే జాగ్రదావస్థలోని విషయాలు కూడా,

స్వప్నంలోని విషయాలలాగానే అసత్యము. ఇదంతా భ్రాంతి అని తెలుస్తుంది. అప్పుడు జగత్తు అదృశ్యమై పోతుంది. అప్పుడు మిగిలేది అధిష్ఠానమైన బ్రహ్మము ఒక్కటే. అదే నీవు.

కాబట్టి ఓ రాజా! అజ్ఞానాన్ని వదిలిపెట్టు. దేహము, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి ఇవేవీ నీవు కాదు. నువ్వు కేవలము పరమాత్మను. **కైవల్యోపనిషత్తు**లో చెప్పినట్లుగా

**అపాణి పాదోహం అచింత్యశక్తిః పశ్యామ్యచక్షుః సశృణోమ్యకర్ణః**

**అహం విజానామి వివిక్తరూపో నచాస్తివేత్తా మమ చిత్సదాహమ్ ॥**

నాకు ఏ అవయవాలు లేవు. నా శక్తి అనంతం. కళ్ళు లేకుండానే చూస్తున్నాను. చెవులు లేకుండానే వింటాను. నాకు ఏ రూపం లేదు. మనస్సు అంతకన్నా లేదు. నాకు అన్నీ తెలుసు నన్ను తెలుసుకునేది వేరే ఏదీలేదు. నేను నిత్యశుద్ధ జ్ఞానజ్యోతిని. జ్ఞానానంద స్వరూపాన్ని.

**అహం కర్తేత్యహం మాన మహాకృష్ణాహి దంశితః ।**

**నాహంకర్తేతి విశ్వాసామృతం పీత్వా సుఖీభవ ॥ 8**

నేను కర్తను అనుకునే అహంకారమనబడే భయంకరమైన త్రాచు పాముచేత కరవబడి విషంతో నిండి ఉన్నావు. నువ్వు అమృతాన్ని త్రాగి సుఖంగా ఉండు. 'నేను సర్వసాక్షిని, నేను ఏదీ చెయ్యటం లేదు అనుభవించటము లేదు' అనేదే ఇక్కడ అమృతం.

నేను కర్మలను చేస్తాను అనే అహంకారమే భయంకరమైన విషనాగు. దాని కాటుకి ఎంతటివాడైనా క్షణాల్లో భస్మమై పోవలసినదే. ఆ సర్పమే కర్తృత్వాభిమానము. అహంకారమనే సర్పం గనక కరిస్తే కర్మలు చేస్తాడు. అహంకారం పెరుగుతుంది. దాంతో ఎంత గొప్పవాడైనా సర్వనాశనం అవుతాడు. కాబట్టి అహంకారం వదిలి అన్ని కర్మలకు నేను సాక్షిని. నేను ఆత్మస్వరూపుడను అని భావన చెయ్యి. ఈ రకమైన దృఢవిశ్వాసమే అమృతము. ఆ అమృతాన్ని త్రాగి పరమానందాన్ని పొందవలసింది అంటున్నాడు అష్టావక్రుడు.

రాజా! దేహంతోను ఇంద్రియాలతోను తాదాత్మ్యం చెందటం మానెయ్యి. నేను చేస్తున్నాను. నేను చూస్తున్నాను. ఇలా భావన చెయ్యటాన్నే ఇంద్రియాలతో తాదాత్మ్య చెందటం అంటారు. కర్మలు చేసేవి ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి. ఇంద్రియాలకు పనిచేసే శక్తినిచ్చేది ఆత్మ. మనస్సుకు మననం చేసే శక్తినిచ్చేది ఆత్మ, బుద్ధికి నిశ్చయించే శక్తినిచ్చేది ఆత్మ. అది నీవే. నువ్వు ఇంద్రియాలకు పని చేసే శక్తిని ఇస్తూ, నువ్వే ఇంద్రియము అని భావిస్తున్నావు. భ్రమతోనే ఈ భావన చేస్తున్నావు. దీనితోనే అహంకారం పుడుతోంది.

అహంకారం గనక పనిచేస్తే విషయభోగాల వైపు బలంగా ఆకర్షింపబడతాము. వాటికి దాసులం కూడా అవుతాము. దీంతో కోరికలు చెలరేగుతాయి. కోరికలు తీర్చుకోటానికి కర్మలు చేస్తాం. అవి నెరవేరకపోతే కోపం, చికాకు, పట్టుదల ఇవన్నీ వస్తాయి. మానసిక సంఘర్షణలు చెలరేగుతాయి. తద్వారా అశాంతి. దీంతో సంసార బంధాలలో ఇంకా ఇంకా చిక్కుకుపోతాము. ఇది అహంకారమనే సర్పం కరవటం వల్ల వచ్చే ఫలితం. దీన్నుంచి తప్పించుకునే దారి ఒకటే. మనసు, బుద్ధి, దేహము, ఇంద్రియాలు నేను కాదు. అనే భావన చెయ్యాలి. అదే అమృతపానము. అందుకే జనక మహారాజా! అమృతపానం చెయ్యి అంటున్నాడు అష్టావక్రుడు.

**ఏకోవిశుద్ధబోధోஉహమితి నిశ్చయవహ్నినా ।**
**ప్రజ్వాల్యా జ్ఞానగహనం వీతశోక స్సుఖీభవ ॥ 9**

అజ్ఞానం అనే అరణ్యాన్ని శుద్ధ చైతన్యమనే జ్ఞానాగ్నితో దగ్ధం చేసి సమస్త దుఃఖాల నుండి విముక్తుడవై సుఖంగా ఉండు.

ఇక్కడ అజ్ఞానం గురించి చెబుతున్నారు. అజ్ఞానమనేది రెండు రకాలుగా వస్తుంది. 1. అగ్రాహ్యము 2. అన్యదాగ్రాహ్యము

1. అగ్రాహ్యము – వస్తువు యొక్క నిజస్వరూపాన్ని తెలుసుకోలేక పోవటం.
2. అన్యథాగ్రాహ్యము – ఒక వస్తువును ఇంకొకటిగా భావించటము.

మసక చీకట్లో త్రాడును చూసి పాము అనుకున్నాడు. ఇందులో ఈ రెండూ ఉన్నాయి. త్రాడును చూసి త్రాడుగా భావించకపోవటాన్ని అగ్రాహ్యము అంటారు.

దాన్ని వేరొకటిగా అంటే ఇక్కడ పాముగా భావించటాన్ని అన్యథా గ్రాహ్యము అంటారు. శరీరంలో ఉండేది రక్తము, మాంసము, ఎముకలు, చీము, నెత్తురు, మలము, మూత్రము. వీటన్నింటిపైనా అందంగా కప్పబడి ఉంటుంది చర్మము. శరీరంలోని ఏ భాగంలోనైనా ఉండేది ఇవే. ఇది గుర్తించలేకపోవటమే అగ్రాహ్యము. శరీరంలోని ఒక్కొక్క భాగాన్ని చూసి మానవుడు ఒక్కొక్క రకంగా స్పందిస్తున్నాడు. ఇదే అన్యథా గ్రాహ్యము. చరాచర జగత్తంతా పరమేశ్వరుడే ఉన్నాడు. ఈ విషయాన్ని గుర్తించకపోవటము అగ్రాహ్యము. దాన్ని జగత్తుగా భావించటం అన్యథా గ్రాహ్యము. ఇలా భావన చెయ్యటం వల్లనే అజ్ఞానం పుడుతోంది. అజ్ఞానం మహారణ్యం లాంటిది. అందులో చిక్కుకుంటే దారితెన్నూ తెలియవు. అడవిలో చిక్కుబడి దుర్భరమైన అవస్థలు పొందుతాము. అలాగే అజ్ఞానంలో కూరుకుపోయి బయటకు రాలేకపోతే నానా అవస్థలు భరించాలి.

సద్గురువును ఆశ్రయించటం, శుశ్రూష, శాస్త్రపరిజ్ఞానము వల్ల జ్ఞానసముపార్జన జరుగుతుంది. దానివల్ల అజ్ఞానం నశిస్తుంది. కాబట్టి ఓ జనకమహారాజా! అజ్ఞానమనే మహారణ్యాన్ని చైతన్యమనే జ్ఞానంతో దగ్ధం చేసి సుఖంగా జీవించవలసింది అంటున్నాడు అష్టావక్రుడు.

**యత్ర విశ్వమిదం భాతి కల్పితం రజ్జుసర్పవత్ ।**
**ఆనంద పరమానందః సబోధస్త్వం సుఖంచర ॥** **10**

పరమ ఆనందరూపమైన చైతన్యం నువ్వు. ఆ చైతన్యంలో ఈ జగత్తంతా రజ్జువులో సర్పంలాగా కనిపిస్తోంది. భ్రమ వదిలిపెట్టి పరిపూర్ణమైన ఆనంద చైతన్యంగా జీవించు. ఓ రాజా! నువ్వు పూర్ణచైతన్యానివి. సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపానివి. ఆ చైతన్య స్వరూపంలో భ్రమవల్ల ఈ జగత్తు కనిపిస్తున్నది. ఆ భ్రమ ఏది అంటే రజ్జుసర్పభ్రాంతి.

ఆధ్యాత్మిక విద్యలో ఎక్కువసార్లు చెప్పే ఉపమానం ఇది. **రజ్జుసర్పభ్రాంతి.** ఒక బాటసారి వెడుతున్నాడు. తాను చేరవలసిన గమ్యం ఇంకా దూరంగానే ఉంది. ఈ లోపల సాయంసమయం కావస్తోంది. దారి అంతా చిట్టడవి. పెద్ద పెద్ద వృక్షాలు ఉండవు. కాని చిన్న చిన్న ముళ్ళపొదలు, ముళ్ళచెట్లు? బాగా ఉంటాయి. అంతా

అటవీ ప్రాంతం. విషసర్పాలు బాగా తిరుగుతుంటాయి. పగటిపూట వాటి సంచారం పెద్దగా ఉండదు. రాత్రిపూట అవి బాగా తిరిగి చిన్న చిన్న జంతువులు, కప్పలు, ఉడతలు మొదలైన వాటిని పట్టుకుని తింటుంటాయి. అడపా దడపా మనుషుల్ని కూడా కాటేస్తుంటాయి. ఆ పాము కరిచిందంటే చాలు కేవలం పదంటే పదే నిమిషాల్లో ప్రాణాలు పోతాయి. గతంలో తనకు తెలిసిన వాళ్ళు ఒకరిద్దరు ఇక్కడే ఈ అడవిలోనే పాము కాటుకు బలి అయినారు. మసకచీకట్లో ఆ పాములు ఎక్కువగా తిరుగుతాయి. బాటకి అడ్డంగా వెడతాయి. ఆ సమయంలో ఎవరైనా అక్కడ ఉన్నారో, ఆ రోజుతో వారి ఆయువు చెల్లినట్లే. "భగవంతుడా. చీకటి పడకుండా ఈ అడవి దాటిపోవాలి. ఇంటిదగ్గర భార్యాపిల్లలు ఎదురు చూస్తుంటారు. త్వరగా ఈ అడవి తరిగిపోతే బాగుండు" అనుకుంటూ దబాదబా అడుగులు వేస్తున్నాడు. ఒక రకంగా చెప్పాలంటే చిన్నగా పరుగులాంటి నడక. త్రోవలో ఎవరూ కూడా లేరు. అడుగులు వడివడిగా పడుతున్నాయి. ఆకాశంలో సూర్యుడు పడమటి కొండలచాటుకు వెళ్ళిపోయాడు చీకట్లు కమ్ముతున్నాయి. దారంతా మసక మసకగా ఉంది. భయం భయంగా అడుగులు వేస్తున్నాడు. ఇంతలో దారికి అడ్డంగా నల్లగా పొడవుగా మెలికలు మెలికలుగా కనిపించింది. పెద్దపాము నాలుగు అడుగులు పైగా ఉంది. నల్లగా నిగనిగా మెరుస్తోంది. ఒక్కసారిగా గుండె ఆగినంత పనైంది. భయంతో వణికిపోతూ పెద్దగా కేకలు పెడుతున్నాడు. మాట కూడా సరిగా రావటం లేదు. వళ్ళంతా చెమటలు పట్టేస్తోంది. పాము, పాము అరుస్తున్నాడు. అదృష్టవశాత్తు వెనకగా కొద్ది దూరంలో ఇద్దరు వ్యక్తులు వస్తున్నారు. ఈ అరుపులు విని వారు పరుగున వచ్చారు. ఏమైంది అని అడిగారు. చేత్తో చూపించాడు బాటసారి. వాళ్ళు చూశారు. పొడవుగా దారికి అడ్డుగా ఉంది. గట్టిగట్టిగా మాట్లాడుతున్నా అలికిడి అవుతున్నా ఏ మాత్రం కదలిక లేకుండా అలాగే ఉంది. ఏ మాత్రం అలికిడి అయినా పాము పారిపోతుంది. అలాంటిది ఇది కదలకుండా అలాగే ఉంది. అసలు ప్రాణంతో ఉందా? లేదా? అనుమానం వచ్చింది. దీపం వెలిగించి పరీక్షగా చూశారు. ధైర్యం చేసి కర్రతో అటూ ఇటూ కదిపారు. కదల్లేదు. పాము చచ్చిపోయింది అని నిర్ధారించుకుని మళ్ళీ జాగ్రత్తగా బాగా కదిపారు. అసలు అది పామే కాదు. ఒక త్రాడు. పొడవాటి త్రాడు. ఎవరో బాటసారి పోతూ పోతూ అక్కడ పడేసి పోయాడు. అది పాము కాదు అని తెలిసిన తరువాత అందరూ నెమ్మదిగా ఊపిరి పీల్చుకున్నారు.

ఇప్పటిదాకా అక్కడ పాము కనిపించింది కదా? మరి ఆ పాము ఏమై పోయింది? పారిపోయిందా? చచ్చిపోయిందా? మాయమై పోయిందా? లయమై పోయిందా! ఏమయింది? అంటే ఆ పాము పారిపోలేదు, చచ్చిపోలేదు, లయం కాలేదు, మాయం అంతకన్న కాలేదు. మరి ఏమైంది? అసలక్కడ పామే లేదు. అక్కడ ఉన్నది కేవలము త్రాడు. మసకచీకట్లో త్రాడును చూసి పాము అనుకుని భయపడ్డావు. ఇదే రజ్జుసర్పభ్రాంతి. దీపపుకాంతిలో పరిక్షిస్తే అది పాము కాదు త్రాడు అని తెలిసింది. జ్ఞానం కలగగానే భ్రాంతి జన్యమైన వస్తువు తన అధిష్ఠానంలో కలిసిపోతుంది. ఇక్కడ అదే జరిగింది. భ్రాంతివల్ల కనిపించిన పాముదీపపు వెలుగు రాగానే తన అధిష్ఠానమైన రజ్జువులో కలిసిపోయింది. అలాగే ఈ జగత్తు కూడా. అసలు జగత్తే లేదు. ఉన్నది అని నువ్వు అనుకుంటున్నావు. అదంతా భ్రాంతి. మనోకల్పితమైన భ్రాంతి. జ్ఞానం కలగగానే భ్రాంతిచేత కల్పించబడిన వస్తువు తన అధిష్ఠానమైన ఆత్మలో కలిసిపోతుంది. కాబట్టి ఓ మహారాజా! ఆ ఆత్మనే నీవు. నీకన్న వేరుగా ఇక్కడ ఏదీ లేదు. కాబట్టి భ్రమను వదిలిపెట్టి సుఖంగా జీవించు అంటున్నాడు అష్టావక్రుడు.

**ముక్తాభిమానీ ముక్తో హి బద్ధో బద్ధాభిమాన్యపి ।**
**కిం వదంతీహసత్యేయం యా మతిస్సాగతిర్భవేత్ ॥ 11**

తాను ముక్తుడుగా భావిస్తే ముక్తుడవుతాడు. బద్ధుడుగా భావిస్తే బద్ధుడుగానే ఉంటాడు. మానవుడు ఎలా భావిస్తే అలాగే ఉంటాడు. ఇది పరమసత్యం.

బంధము, మోక్షము ఈ రెండూ కూడా అభిమానంతో కల్పించబడినవే. కాబట్టి ఉన్నది అనుకుంటే ఉంది. లేదు అనుకుంటే లేదు. ఇదంతా మనోకల్పితము. స్థిరమైన నీ అభిప్రాయము అంతే. అజ్ఞాని అయినవాడు చరాచర జగత్తంతా ఉన్నది. సంసారం ఉన్నది. భార్య, పిల్లలు, మిత్రులు, శత్రువులు, బంధువులు అందరూ ఉన్నారు. నాకు బంధాలు ఉన్నాయి అనుకుంటున్నాడు. నేను లేకపోతే ఇంట్లో ఏ పనీ కాదు. అందరూ నామీదే ఆధారపడి బ్రతుకుతారు. నేను సకాలంలో ఇల్లు చేరపోతే నా భార్య అన్నం తినదు. ఆవిడకు అసలే వంట్లో బాగాలేదు. మా మనవడు చిన్నపిల్లవాడు వాకిట్లోనే కూచుంటాడు ఎదురు చూస్తూ. చివరకు నేను పెట్టకపోతే మా కుక్క పిల్ల

కూడా బిస్కట్లు తినదు అని గర్వంగా చెప్పుకుంటాడు. తన ప్రాధాన్యతను నిరూపించుకోవటానికి ప్రయత్నం చేస్తాడు. ఇవన్నీ బంధాలే. దీన్నే మనం ఇచ్ఛా ప్రారబ్ధం అంటాం. కావాలని తగిలించుకునే బంధాలు. బంధాలు అనేవి మనసున్న వాడికే ఉంటాయి. పిచ్చివాడికి ఎవరిమీదా అభిమానం ఉండదు. మమకారం ఉండదు. అలాగని ద్వేషం అంతకన్న ఉండదు. అతడు పిచ్చివాడు కాబట్టి రాగద్వేషాలుండవు. అహంకార మమకారాలుండవు. పసిపిల్లవాడికి అంతే. సర్వసంఘ పరిత్యాగి అయిన జ్ఞానికి అంతే. జ్ఞాని మనస్సును జయించినవాడు. మనోలయం జరిగింది. మనసు నాశనమయి పోయింది. అతడికి ఏ రకమైన భావాలు ఉండవు. వీరెవరికీ రాగద్వేషాలుండవు.

అందుకే మనం గట్టిగా దృఢమైన సంకల్పంతో ఏది అనుకుంటే అదే అవుతుంది. యద్భావం తద్భవతి. ఒక బాటసారి వెడుతున్నాడు. అపరాహ్నం కావస్తోంది. ఎండ బాగా మండిపోతోంది. ఎక్కడైనా ఒక చెరువు కనిపిస్తే బాగుండును అనుకుంటూ నడుస్తున్నాడు. కొంత దూరం పోయేసరికి ఒక చెరువు కనిపించింది. దానిచుట్టూ పెద్దపెద్ద చెట్లు కూడా ఉన్నాయి. బాటసారి నెమ్మదిగా వెళ్ళి ఒక చెట్టుక్రింద కూర్చున్నాడు నెత్తిమీద మూటను అక్కడ పెట్టి చెరువులో దిగి స్నానం చేశాడు. చల్లటి గాలి హాయిగా ఉంది ప్రాణం. చెట్టు దగ్గరకు వచ్చి ఇప్పుడు షడ్రసోపేతమైన భోజనం దొరికితే బాగుండు అనుకున్నాడు. మరుక్షణంలో భోజనం వడ్డించిన విస్తరి ఎదురుగా కనిపించింది. తినటానికి కూర్చున్నాడు. ఎవరైనా వచ్చి చల్లగా విసురుతుంటే ఇంకా బాగుండును అనుకున్నాడు. ఇద్దరు అప్సరాంగనలు వచ్చి సపర్యలు చేశారు. భోజనం చేశాడు. కాసేపు విశ్రాంతి తీసుకోవాలని ఉంది. నేలంతా ఎత్తు పల్లాలుగా ఉంది. మెత్తటిపరుపు ఉంటే బాగుండు అనుకున్నాడు. మరుక్షణంలోనే మెత్తటి పక్క ఏర్పాటైంది. దానిమీద కూచున్నాడు. పడుకున్నాడు. ప్రాణం హాయిగా గాలిలో తేలుతున్నట్లనిపిస్తోంది. పడుకున్నాడు. ఇప్పుడు అతడికి చిన్నగా అనిపించింది. నేను ఏది అనుకుంటే అది జరిగిపోతోంది. కొంప తీసి ఇక్కడ ఏ బ్రహ్మరాక్షసైనా ఉందేమో? అది కాస్తా నన్ను మింగేస్తుందేమో? అనుకున్నాడు. మరుక్షణంలో ఒక బ్రహ్మ రాక్షసి ప్రత్యక్షమై అతణ్ణి కాస్తా మింగేసింది.

అసలు జరిగిందేమంటే అతడు కూర్చున్నది దేవతావృక్షం దగ్గర. అక్కడ కూర్చుని ఏది కావాలనుకుంటే అది జరుగుతుంది. అదే జరిగింది. బాటసారి అనుకున్నదే జరిగింది.

అదే మాట ఇక్కడ అష్టావక్రుడు చెబుతున్నాడు. రాజా **యద్భావం తద్భవతి**. నీ ఆలోచన ఏదైతే అదే జరుగుతుంది. ఇది పరమసత్యం. మానవుడు నేను బద్ధుడిని అనుకుంటే బద్ధుడవుతాడు. నేను ముక్తుణ్ణి అనుకుంటే ముక్తుడౌతాడు.

**ఆత్మాసాక్షీ విభుఃపూర్ణ ఏకో ముక్త శ్చిదక్రియః ।**
**అసంగో నిస్పృహశ్శాంతో భ్రమాత్సంసారవానివ ॥ 12**

ఆత్మకేవలము సాక్షి. సర్వత్రా వ్యాపించి ఉంటుంది. పూర్ణము, అద్వయము, ముక్తము, చిద్రూపము, శాంతము. మాయా ప్రభావంతో జగత్తుగా, సంసారంగా భావించబడుతోంది.

అసలిక్కడ ఆత్మ అంటే ఏమిటో చూద్దాం. ఆత్మ అన్నా పరమాత్మ అన్నా ఒకటే. ఆత్మోపనిషత్తులో పరమాత్మను గురించి వివరించటం జరిగింది.

**పరమాత్మ:** పరమాత్మ అక్షర రూపంలో ఉపాసింపదగినవాడు. అతడే సృష్టి స్థితి లయాలకు కారణమైనవాడు. ఆద్యంతములు లేనివాడు. నిరాకారుడు, నిరంజనుడు, నిర్గుణుడు. సత్యము, నిత్యము అయినవాడు. సర్వాంతర్యామి. సర్వవ్యాపి. ఆ పరమేశ్వరుణ్ణి యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యానము, సమాధి మొదలైన యోగ ప్రక్రియలతో ఉపాసించటం జరుగుతుంది. అతడు తలవెంట్రుకలో వెయ్యోవంతు (అణుమాత్రుడై) ఉన్నాడు. ఆ పరమాత్మ పొందబడడు, జన్మించడు, మరణించడు, శుష్కింపడు, తడుపబడడు, దహించబడడు, కదలింపబడడు, భేదింపబడడు. అతడు నిర్గుణుడు. జగత్తులో జరిగే విషయాలన్నింటికీ అతడే సాక్షి. భూతభావనుడు. అనగా భూతములను అభివృద్ధి చేసేవాడు. ఆ పరమాత్మ పరిశుద్ధమైనవాడు. అతడికి కాళ్ళు, చేతులు, తల మొదలైన అవయవాలు లేవు. సూక్ష్ముడు, మమకారము లేనివాడు, శబ్దస్పర్శ రూపరస గంధాలు లేనివాడు. నిర్వికల్పుడు కోరికలు లేనివాడు. చింతించటానికి వీలుకానివాడు. రంగులేనివాడు. అశుద్ధాన్ని శుద్ధంగా, అపవిత్రాన్ని పవిత్రంగా చేసేవాడు. క్రియాశూన్యుడు. అటువంటి పరమాత్మకు సంసారములేదు.

అతడే ఆత్మసంజ్ఞగలవాడు. శుద్ధుడు. అతడు ఒక్కడుగానే ఉన్నాడు. అతనితో సమానమైనవారు కాని, అతనికన్న అధికులుగాని ఎవరూ లేరు. బ్రహ్మరూపంలో కేవలము పరబ్రహ్మమే ప్రకాశిస్తాడు. కాని సమస్త జగత్తులోనూ ఆ పరమేశ్వరుడే ప్రకాశిస్తున్నాడు. విద్య అవిద్య, భావము అభావము, గురువు శిష్యుడు అనే భేదాలతో ఆ పరబ్రహ్మ ప్రకాశిస్తున్నది. తత్త్వదర్శనములో ఆ పరబ్రహ్మమే కేవలము శుద్ధముగా గోచరిస్తున్నది. విద్యలేదు అవిద్యలేదు. జగత్తు అంతకన్నా లేదు. పరాపరములు లేవు. ఈ జగత్తు సత్యముగా కనిపిస్తే సంసారం కలుగుతుంది. అయితే వ్యవహారంలో మాత్రమే సంసారం సత్యంగా కనిపిస్తుంది. కాని పదార్థంలో సమస్త సంసారము అసత్యము అవుతుంది. అందులో ఉన్నదంతా మట్టే అయినప్పటికీ, ఆకారాన్ని బట్టి 'కుండ' అని పిలువబడుతోంది. ఇది కుండ అని తెలుసుకోవటానికి ఎలాటి నియమము అవసరం లేదు. అలాగే ఆత్మను పోల్చి చెప్పటానికి ఇంకొక ప్రమాణం ఏదీలేదు. ప్రమాణంలో ఆత్మయే నిత్యసిద్ధముగా ప్రకాశిస్తున్నది. ఆత్మను తెలుసుకోవటానికి దేశము, కాలము, శుద్ధి, ఇవి ఏవీ అవసరం లేదు. 'నేనే పరమేశ్వరుడను' అని చెప్పగలిగే విజ్ఞానం కావాలి. ఈ రకంగా బ్రహ్మవేత్త అనుభవంతో నేనే పరబ్రహ్మను అని తెలుసుకుంటాడు.

మాయా ప్రభావంతోనే జగత్తు ఆవిర్భవిస్తున్నది.

అసలు మాయ అంటే ఏమిటి? ఈ విషయం **లలితా రహస్యోపనిషత్తు**లో చెప్పబడింది.

అనాదియైనది. అంతము గలది, ప్రమాణాలకు, అప్రమణాలకు సాధారణమైనది, సత్తుకాదు అసత్తు కాదు, సదసత్తు కాదు. స్వయముగా అధికమైనది. వికారములు లేనిది, నిరూపించటానికి వీలైన లక్షణాలు లేనిది మాయ.

జీవులకు అజ్ఞానము నశించిపోగా, సత్త్వగుణ ప్రధానులైన వారికి పరమేశ్వర సాక్షాత్కారం జరుగుతుంది. అజ్ఞానులకు అది సాధ్యం కాదు. వికారాలకు అంటే మార్పులకు తల్లియై, శాశ్వతమైన భగవదాజ్ఞారూపమైనది మాయ. ఈ మాయవల్లనే జగత్తులో అనేక పరిణామాలు చోటు చేసుకుంటున్నాయి. దీనివల్లనే జగత్తు నిర్మించ బడుతోంది. మాయ అనేది పరమేశ్వరుణ్ణి ఆశ్రయించి ఉంటుంది. ఇది గౌరవమైనది.

ఆది, అంతము గలది. పుట్టించునది. భూతములందు ప్రకాశించేది. తెలుపు, ఎరుపు, నలుపు మొదలైన రకరకాల రంగులు గలది. రకరకాల రూపాలు గలది. కోరికలు కలిగించేది. కోరికలు తీర్చేది. విషయ శూన్యమైనది. ఈ మాయవల్ల ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు కన్పిస్తుంది. భట్టూ ! నిత్యము సత్యము శాశ్వతము అయినవాడు పరబ్రహ్మ. కాని మాయాప్రభావంతో అతడు లేనట్టుగా అనిపిస్తుంది. అశాశ్వతమైన ఈ జగత్తు, భార్యాపుత్రులు, ధనధాన్యాలు, భోగభాగ్యాలు నిజమైనవి అనిపిస్తాయి. వీటికోసమే మానవుడు ప్రాకులాడతాడు. కాని ఇవన్నీ నశించిపోయేవే. ఎడారిలో ఎండమావిలాగా, సూర్యకాంతిలో ముత్యపుచిప్ప వెండిలాగా కనిపించినట్లు గానే ఈ మాయా ప్రభావంచేత అశాశ్వతమైనవన్నీ శాశ్వతంగా కనిపిస్తాయి. అనిత్యమైనవి నిత్యంగా కనిపిస్తాయి. ఈ మాయా ప్రభావంచేతనే మానవుడు తాను సృష్టించిన ద్రవ్యాన్ని సంపాదించటానికి తాను పరుగులు పెడుతున్నాడు. ఈ జగత్తంతా నిజమనే భ్రమలో ఉంటున్నాడు. ఈ మాయ ఎంత గొప్పది అంటే తనకళ్ళ ఎదురుగా జీవులు మరణిస్తున్నా, కట్టడాలు కూలిపోతున్నా, వస్తువులు నశిస్తున్నా మానవుడు అది నిజమని నమ్మలేడు. చివరకు తనజీవితం శాశ్వతం కాదు. అని తెలిసికూడా దానిమీద వ్యామోహం వదలుకోలేడు. అహంకార మమకారాల నుంచి బయటకు రాలేడు. జీవుడు అవిద్యా సంబంధంచేత మాయ అనే వలలో గట్టిగా చిక్కుకు పోయాడు. సృష్టి జరిగేటప్పుడు ముందుగా అవ్యక్తము, మహత్తత్త్వము, అహంకారము వచ్చినాయి. అహంకారము నుంచి తన్మాత్రలు వాటినుంచి పంచభూతాలు ఉద్భవించాయి. అయితే సృష్టిక్రమంలో మొదటిదయిన అవ్యక్తమే మాయ, అవ్యక్తము అంటే కంటికి కనిపించనిది. అదే మాయ. ఈ మాయ పరమేశ్వరుణ్ణి ఆవరించి ఉంటుంది. అంటే జీవుడికీ, పరమేశ్వరుడికీ మధ్యన అడ్డంగా ఉంటుంది. ఈ మాయను గనక ఛేదించగలిగితే పరమేశ్వర సాక్షాత్కారం జరుగుతుంది.

మాయ అనేది నీటిగుంటలో తేలియాడే నాచువంటిది. ఈ నాచును దూరంగా తోసేస్తే వెళ్ళిపోతుంది. కాని మళ్ళీ వచ్చి చేరుతుంది. అలాగే వేదాంత విచారము సజ్జన సాంగత్యము చేసినంతకాలము ఈ మాయ వదలివేసినట్లుగా కనిపిస్తుంది. కాని ఆ తరువాత వెంటనే వచ్చి చేరుతుంది. అంటే విషయవాంఛలయందు మనసు ఎప్పుడైతే లగ్నమవుతుందో, అప్పుడు మాయ ఆవరించింది అని అర్థం. అయితే

ఈ మాయ పరమేశ్వరుణ్ణి ఆవరించిఉంటుంది. కదా ? దీనివల్ల ఆయనకు అపాయం లేదా ? అంటే–జగత్తులో ప్రతిప్రాణీ మాయకు లోబడే ఉంటుంది. ఆ పరమేశ్వరు డొక్కడే మాయకు అతీతుడు. మాయ అనేది పరమేశ్వరుని అధీనంలోనే ఉంటుంది. పాముకోరలలో ఉన్న విషంవల్ల పాముకు ఏ అపాయము జరగదు. కాని దానిచేత కాటు వేయబడ్డ ఇతరులకు మాత్రం హాని కలుగుతుంది. అలాగే, పరమేశ్వరుని ఆవరించిన మాయవల్ల ఆయనకు ఏ అపకారము జరగదు.

మాయచే కప్పబడిన మానవుడు, తాను మాయాప్రభావానికిలోనై ఉన్నాను. అని తెలుసుకున్నట్లైతే మాయ అతణ్ణి విడిచిపెడుతుంది. ఉదా॥ ఒక మనిషికి దెయ్యం పట్టి పిచ్చివేషాలు వేస్తున్నాడు. అతడికి ఆ విషయం తెలియదు. ఒకవేళ అతడికి ఆ విషయం గనక తెలిసినట్లైతే, మరుక్షణమే దెయ్యం అతన్ని వదిలేస్తుంది. అలాగే మాయకూడా,

నిద్రపోతున్నప్పుడు స్వప్నం వస్తుంది. అందులో రకరకాల విషయాలు అనుభవంలోకి వస్తాయి. నిద్రలేచిన తరువాత అదంతా కల, భ్రాంతి అనిపిస్తుంది. అదే విధంగా కంటికి కనిపించే ఈ జగత్తుకూడా ఒక భ్రమ అని నిశ్చయించగలిగితే మాయ విడిపోతుంది. మాయ విడిపోతే భగవత్సాక్షాత్కారము జరుగుతుంది.

జీవాత్మ పరమాత్మల మధ్య మాయ అనే తెర ఉన్నది. అది పరమాత్ముని దర్శించటానికి అడ్డుగా ఉన్నది. ఆ తెరను గనక తొలగించిగలిగితే పరమాత్మ దర్శనం జరుగుతుంది.

ఈ మాయనే అజ్ఞానము, భ్రాంతి అని కూడా అంటారు. ఈ మాయ మూలంగానే జగత్తు ఆవిర్భవిస్తున్నది అంటున్నాడు అష్టావక్రుడు.

**కూటస్థం బోధ మద్వైతమాత్మానం పరిభావయ ।**
**ఆభాసోऽహం భ్రమం ముక్త్వాభావం బాహ్యమథాన్తరమ్ ॥ 13**

బాహ్యాభ్యంతరాలలో అలజడిని సృష్టించే భావాలు వదిలి, నేను అహంకారాన్ని అనే భ్రమను కూడా వదిలి, సచ్చిదానందమైన ఆత్మను నేను అనే ధ్యానంతో సంతోషంగా ఉండు.

ఓ జనకరాజా! అహంకారమే నేను అనే భ్రాంతిని వదలిపెట్టు తరువాత నేను నాది అనే అహంకార మమకారాలు వదిలిపెట్టు, సుఖము, దుఃఖము మొదలైన పదార్థములందు మమకారము, అభిమానములు వదలిపెట్టు. నేను దేనికీ కర్తను కాను. సర్వవ్యాపకుడు, అద్వితీయుడు అయిన పరమాత్మను అని భావించు అంటున్నాడు అష్టావక్రుడు.

నేను అనే పదం అహంకారానికి గుర్తు. లౌకికంలో నేను అంటే అహంకారమే. మిగిలిన ఇంద్రియాల మాదిరిగానే అహంకారము కూడా ఆత్మయొక్క ప్రకాశంతోనే ప్రకాశిస్తున్నది. ఈ విషయాన్ని వివేక శూన్యులు తెలుసుకోలేరు. నేను నాది అనే అహంకార మమకారాలు నశిస్తేనే గాని మానవుడు మోక్షం పొందడు. వీటిలో అహంకారానిది ఉన్నతమైన స్థానం. సంసారానికీ, బంధాలకీ ఇదే మూలము. అహం అనే శబ్దానికి అర్థం అహంకారము. అయితే ఆత్మ వేరు అహంకారం వేరు. ఈ అహంకారం నుంచే చరాచర జగత్తంతా ఆవిర్భవించింది. అహంకారానికి కూడా ఆత్మే సాక్షి. అంటే అహంకారం వేరు ఆత్మ వేరు. ఆత్మ అహంకారం కన్న వేరుగా ఉండి అహంకారాన్ని చూస్తూ ఉంటుంది. అహంకారానికి ఆత్మకి సంబంధం లేదు. అహంకారం ఆత్మకాదు. నేను అంటే దేహము ఎలా కాదో అలాగే అహంకారం కూడా కాదు. అందుకే అష్టావక్రుడు అంటున్నాడు. ఓ జనక మహారాజా! నేను అంటే అహంకారము అనే భ్రమను వదలిపెట్టు. సచ్చిదానందమైన ఆత్మను నేను అని భావించి సుఖంగా ఉండు.

**దేహాభిమానపాశేన చిరం బద్ధోఽసి పుత్రక ।**
**బోధోఽహం జ్ఞానఖడ్గేన తన్నికృత్య సుఖీభవ ॥ 14**

దేహమే నేను అనే భావనతో చాలా కాలంగా బంధింపబడి ఉన్నావు. నేను సర్వసాక్షిని అనే జ్ఞానఖడ్గంతో ఈ బంధాన్ని ఛేదించి సంతోషంతో జీవించు.

అజ్ఞాని అయిన మానవుడు దేహమే నేను అనే భావన చేస్తాడు. **ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా బ్రహ్మరంధ్రం ద్వారా మానవ దేహంలో ప్రవేశించిన పరబ్రహ్మ అజ్ఞానంతో ఇంద్రియాలతో తాదాత్మ్యం చెంది కర్మలన్నింటికీ తానే కర్తా భోక్తా అనుకుంటున్నాడు. 'నేను అంటే దేహము' అని భావన చేస్తున్నాడు.

ఈ దేహము పాంచభౌతికమైనది. అశాశ్వతమైనది. ఈ లోకంలో చాలామంది ఇంతవరకు జన్మించారు మరణించారు. జీవి మరణించగానే దేహము నాశనమై పోతుంది. అందులోని పంచభూతాలు పంచభూతాలలో కలిసి పోతాయి. ఏమీ మిగలదు. ఈ భూమిమీద అనేక మంది రాజులు జన్మించారు. మరణించారు. నీ తాత, ముత్తాత ఆ పై వాళ్ళు అందరూ మరణించారు. ఎవరూ శాశ్వతంగా లేరు. అంటే దేహము శాశ్వతం కాదు. మరణానంతరము ఈ దేహము భస్మమై పోతుంది. ఏమీ మిగలదు. **వాయురనిల మమృత మథేదం భస్మాంతం శరీరం** మానవుడు మరణించిన తరువాత అతని దేహంలో ఉన్న గాలి గాలిలో, నీరు నీటిలో, ఆకాశం ఆకాశంలో ఇలా పంచభూతాలు పంచ మహాభూతాలలోకలసిపోతాయి. అంటోంది **ఈశావాస్యోపనిషత్తు.** అలాంటప్పుడు నేను అంటే అశాశ్వతమైన దేహము ఎలా అవుతుంది? కాబట్టి దేహమే నేను అనే భావనను వదలిపెట్టు. నీవు సచ్చిదానంద రూపమైన సర్వసాక్షివి. ఈ విషయం తెలుసుకుని, బంధాల నుంచి విడివడి సుఖంగా ఉండు అంటున్నాడు అష్టావక్రుడు.

**నిస్సంగో నిష్క్రియోఽసిత్వం స్వప్రకాశో నిరంజనః ।**
**అయమేవ హి తే బంధః సమాధిమనుతిష్ఠసి ॥** **15**

నీవు నిస్సంగుడవు. నిష్క్రియుడవు. స్వయంజ్యోతివి. నీలో ఏ మాలిన్యము లేదు. ఇదే భావనతో స్థిరంగా ఉండు. బంధాలను తొలగించుకో.

కుమారా! జనకరాజా! నీవు నిస్సంగుడవు. నీకు దేహంతో గాని, ఇంద్రియాలతో గాని దేనితోను సంబంధం లేదు. నిష్క్రియుడవు. ఏ పని చెయ్యవు. స్వయంప్రకాశివి. నువ్వు ప్రకాశించటానికి వేరేదీ అవసరం లేదు. నిరంజనుడవు. ఏ రకమైన మలినాలు లేనివాడవు. అటువంటి నువ్వు సమాధిలోకి వెళ్ళాలనుకుంటే అది ఒక కర్మ అవుతుంది. సమాధి నీకు బంధం అవుతుంది. జ్ఞానం పెంచుకోటానికి చేసే ఏ కర్మ అయినా అది ముక్తికి ప్రతిబంధకం అవుతుంది అంటున్నాడు అష్టావక్రుడు.

నీ మనస్సుతో గాని, శరీరంతో గాని, వాటిలో అనుభవించే వస్తువులతో గాని నీకు ఏ సంబంధము ఉండదు. స్తంభంలో భూతం కనిపిస్తోంది. స్తంభానికి భూతానికి ఏ రకమైన సంబంధము లేదు. అలాగే నీ మనస్సు, శరీరంతో నీ ఆత్మకు సంబంధం లేదు. ఆత్మ ఏ పని చెయ్యదు. పరమేశ్వరుడికి కర్మ అనేది లేదు. గతజన్మలలోని

అనుభవించాల్సిన సంచిత కర్మ లేదు. ఈ జన్మలో చేసే ఆగామికర్మ అంతకన్నా లేదు. అందుకే సంసారమనే వృక్షంమీద కూచునిఉన్న రెండు పక్షులలో ఒకటి జీవాత్మ. రెండవది పరమాత్మ. అందులో పరమాత్మ ఏమీ తినకుండా దిక్కులు చూస్తోంది. ఎందుకంటే పరమాత్మకు సంచితకర్మ జ్ఞానంతో నాశనమయి పోయింది. ఆగామి కర్మ చెయ్యదు. అందుకే పరమాత్మ నిష్క్రియుడు. ఆత్మస్వయంజ్యోతి. ఆత్మ ప్రకాశించటానికి దేని సాయము అక్కరలేదు. **బృహదారణ్యకోపనిషత్తు**లో ఒక కథ ఉన్నది.

ఆత్మ ఎలా ఉంటుంది? జాగ్రస్వప్న సుషుప్తులలో దాని ఉనికి ఏమిటి? అనే విషయాలను యాజ్ఞవల్క్యుడి ద్వారా తెలుసుకున్నాడు జనక మహారాజు. ఆ విషయాన్ని నాల్గవ అధ్యాయంలో మూడవ బ్రాహ్మణంలో వివరించారు.

ఒకసారి యాజ్ఞవల్క్యుడు విదేహాధిపతి అయిన జనకుని ఆస్థానానికి వెళ్ళాడు. గురువుగారిని చూడగానే ఎదురేగి స్వాగత సత్కారాలు అందించి కుశల ప్రశ్నలు అయిన తరువాత జనక మహారాజు అంటున్నాడు.

“గురుదేవా! నాకు చిన్న అనుమానం వచ్చింది. అది తీర్చి పుణ్యం కట్టుకోండి” అన్నాడు. ఆ మాట వినగానే అదేమిటో చెప్పమన్నాడు యాజ్ఞవల్క్యుడు.

జనకుడు : మహర్షీ ! మానవుడు ఏ వెలుగువల్ల తన నిత్యకృత్యం సాగిస్తున్నాడు.

యాజ్ఞవల్క్యుడు : సూర్యుని వెలుతురు వల్ల. ఆ వెలుతురు వల్లనే మానవుడు పనిపాటలు నిర్వహించుకుంటాడు. దూరతీరాలకు వెడతాడు. పనులు పూర్తి చేసుకొని తిరిగి వస్తాడు. ఆ వెలుగులో వెళ్ళానుకున్నచోటికి వెడతాడు. చేయదలచుకున్న పని చేసుకుంటాడు.

జనకుడు : మహర్షీ ! మరి సూర్యాస్తమయమైతే పనులు ఏ విధంగా జరుగుతాయి.

యాజ్ఞవల్క్యుడు : సూర్యుడు అస్తమించిన తరువాత చంద్రునియొక్క కాంతులలో ఈ పనులన్నీ జరుగుతాయి.

జనకుడు : సూర్యచంద్రు లిద్దరూ అస్తమించినప్పుడు ఏం జరుగుతుంది మహాత్మా!

యాజ్ఞవల్క్యుడు : రాజా! సూర్యచంద్రులు ఇద్దరూ లేనప్పుడు అన్ని వ్యవహారాలు దీపం లేదా అగ్ని వెలుగులో జరుగుతాయి.

జనకుడు : మహానుభావా! మరి ఆ అగ్నికూడా లేకపోతే ? సూర్యుడస్తమిస్తాడు. చంద్రకాంతి ఉండదు. అగ్ని ఆరిపోతుంది. అప్పుడు మానవుడు ఏ రకంగా పనులు చేస్తాడు?

యాజ్ఞవల్క్యుడు : రాజా! ఆ వెలుగుల స్థానంలో వాక్కు వ్యవహారానికి సహకరిస్తుంది. చీకటిలో ఏమీ కనిపించదు. కాని ఏదో ధ్వని వినిపిస్తే మానవుడు ధ్వని వినిపించిన వైపుకు సాగిపోతాడు.

జనకుడు : మరి ఆ వాక్కు కూడా ఆగిపోతే? అంటే ధ్వనికూడా ఏ మాత్రం వినిపించదు. అప్పుడు ఏం జరుగుతుంది?

యాజ్ఞవల్క్యుడు : జనక మహారాజా! శబ్దాలన్నీ సర్దుమణిగిన తరువాత ఏం జరుగుతుంది? అని కదా అడుగుతున్నావు. జాగ్రత్తగా విను. ఈ వెలుగులకన్నిటికీ అవతల ఆత్మజ్యోతి ఉన్నది. ఆ ఆత్మ ప్రకాశములకు ప్రకాశం. కాంతులకు కాంతి. అటువంటి ఆత్మవల్లనే మానవుడు మనుగడ సాగిస్తాడు.

కాబట్టి ఆత్మ స్వయంజ్యోతి. దానంతట అదే ప్రకాశిస్తుంది. ఆత్మ ప్రకాశించటానికి ఎవరి సాయము అవసరం లేదు. ఆత్మ పురుషుడి సాయంతోనే సూర్యుడు అగ్ని చంద్రుడు ప్రకాశిస్తున్నారు.

**అష్టోత్తరశతం వహ్నా షోడశోత్తర శతం రవేః ।**
**షట్త్రింశతద్ధురాశతం చంద్రస్య కిరణాశ్మివేః ॥**

ఆత్మపురుషుడి నుంచి అగ్ని 108 కిరణులు, సూర్యుడు 116 కిరణములు, చంద్రుడు 136 కిరణములు తీసుకుని లోకాలకు వెలుగులు ఇస్తున్నారు.

ఆత్మకు ఏ మాలిన్యము లేదు. మలములు ఐదు రకాలు.

1. అణవమలము
2. కార్మికమలము
3. మాయికమలము
4. మాయేకమలము
5. తిరోధానమలము

**1. అణవమలము :** పరబ్రహ్మను తెలుసుకోవాలనే జ్ఞానము అప్పుడప్పుడు కలగగా, దాన్ని మరుగు పరచేది అణవమలము.

**2. కార్మికమలము :** పెద్దల వలన వేదాంత శాస్త్రవిషయాలను రహస్యాలను తెలుసుకొనేటప్పుడు, వాటి యందు బుద్ధి చొరనీయకుండా చేసేది.

**3. మాయికమలము :** ఇది దట్టమైన అజ్ఞానము. పరబ్రహ్మను తెలుసుకోవాలనే జ్ఞానము ఎప్పుడూ కలుగనీయనిది.

**4. మాయేకమలము :** మాయా సంబంధమైన పాపకార్యములందు మనసును ప్రవేశపెట్టి చేయించేది.

**5. తిరోధానమలము :** పరబ్రహ్మ కన్న వేరుగా దేవతలున్నారని, వారిని అర్చిస్తే కోరికలు తీరతాయని చెప్పి నమ్మించేది.

ఈ రకమైన పంచమలములు అజ్ఞానులకుంటాయి. పురుషుడు ఆత్మజ్ఞాని కాబట్టి ఈ మలములు ఆత్మకుండవు.

ఈ విధంగా అంటే 'నేను నిస్సంగుడను, నిష్క్రియుడను, స్వయంజ్యోతిని, నిర్మలుడను' అని ధ్యానం చెయ్యి. బంధాలు తొలగించుకో అంటున్నాడు అష్టావక్రుడు.

**త్వయా వ్యాప్తమిదం విశ్వం త్వయిప్రోతం యథార్థతః ।**
**శుద్ధబుద్ధ స్వరూపస్త్వం మాగమః క్షుద్ర చిత్తతామ్ ॥ 16**

నువ్వు ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నావు. జగత్తునీ ఉన్నట్లుగా భావిస్తున్నది. క్షుద్రమైన భ్రమతో కూడిన భావాలకు అవకాశమిచ్చి విచారించవద్దు. పరిశుద్ధమైన ఆత్మ చైతన్యమే నీవు.

రాజా ! కార్యములైన ఆభరణాలన్నీ కారణమైన బంగారం చేత వ్యాపించ బడినట్లుగా, ఈ జగత్తంతా నీతో ఆవరించబడి ఉన్నది. మట్టితో రకరకాలయిన కుండలు మొ॥వి తయారుచేస్తారు. ఆ కుండలు మొ॥ అంతా మట్టే. మట్టి నుంచి ఈ కుండలు ఎలా పుడుతున్నాయో, అలాగే నీ నుంచి ఈ జగత్తు ఆవిర్భవించి నీలోనే లీనమై పోతున్నది. నువ్వు పరిశుద్ధుడివి. అవిద్యకి, అవిద్యవల్ల కల్పించబడిన ప్రపంచానికి కూడా నువ్వు అతీతుడవు అంటున్నాడు అష్టావక్రుడు.

ఇక్కడ ఒక విషయాన్ని చాలా జాగ్రత్తగా గమనించండి. బంగారంతో ఆభరణాలు తయారుచేస్తున్నారు కాబట్టి బంగారం ఆభరణాలంతా ఉన్నది. అలాగే ఆభరణాలంతా బంగారమే. అలాగే చరాచర జగత్తంతా పరబ్రహ్మ వ్యాపించి ఉన్నాడు. బ్రహ్మమే జగత్తు. జగత్తే బ్రహ్మ. ఈ జగత్తు బ్రహ్మము నుంచి పుట్టి, బ్రహ్మము చేత స్థితి పొంది, బ్రహ్మము నందే లయమవుతున్నది.

బ్రహ్మమే జగత్తును సృష్టిస్తున్నది. ఇది సామాన్యుడికి చెప్పే మాట. బ్రహ్మము ఏ కర్మలు చెయ్యదు కదా? మరి సృష్టి ఎలా చేస్తుంది? అలాగే స్థితిలయలు కూడా బ్రహ్మము చెయ్యదు.

రజ్జు సర్ప భ్రాంతిలాగా ఈ జగత్తంతా మనస్సుచేత కల్పించబడిన బ్రహ్మచేత ఆవిర్భవిస్తున్నది. నిజం చెప్పాలంటే ఇక్కడ సృష్టికర్త లేదు. సృష్టించబడిన జగత్తు అంతకన్నా లేదు. అలాగే ఈ ప్రళయ కాలంలో జగత్తంతా పరమేశ్వరునిలో లీనమవుతుంది అంటారు. ఎక్కడ జరిగింది? ఎప్పుడు జరుగుతుంది. ఈ లయం కూడా అంతా భ్రమ. సాధకుడు ఎప్పుడైతే జ్ఞానసముపార్జన చేశాడో అప్పుడు అతని దృష్టిలో ఈ జగత్తు లేదు. జ్ఞానం రాగానే భ్రమాజన్యమైన జగత్తు తన అధిష్ఠానమైన బ్రహ్మము నందు లీనమై పోతుంది. అంటే జ్ఞానిదృష్టిలో జగత్తు లేదు. అంతే కాని ఇతరుల దృష్టిలో జగత్తు యథాతథంగా ఉన్నది. నువ్వు రజ్జువులో సర్పంలాగా ఈ విశ్వమంతా ఆవరించి ఉన్నాను. భ్రమవల్ల రజ్జువులో సర్పం కనిపిస్తున్నది. భ్రమ తొలగిపోతే సర్పం లయమై పోతుంది. అయితే ఇక్కడ సర్పం ఉంటే రజ్జువు ఉండదు. అలాగే రజ్జువు ఉంటే సర్పము ఉండదు. ఈ రెండూ ఉండటము జరగదు. అలాగే భ్రమవల్ల ఆత్మలో జగదావిర్భావం జరిగినప్పుడు జగత్తు కనిపిస్తుంది. ఆత్మ కనిపించదు. లయమై పోయినప్పుడు ఆత్మదర్శనమిస్తుంది జగత్తు కనిపించదు.

ఈ విషయాలను గుర్తించు. పరిశుద్ధమైన ఆత్మవు నీవు. కాబట్టి భ్రమాజన్య భావాలకు చోటిచ్చి, విచారం పొందద్దు అంటున్నాడు అష్టావక్రుడు.

**నిరపేక్షో నిర్వికారో నిర్భరశ్శీతలాశయః ।**

**అగాధ బుద్ధి రక్షుబ్ధో భవచిన్మాత్రవాసనః ॥ 17**

నువ్వు కోరదగినది ఏదీ లేదు. నీలో మార్పు అనేది ఉండదు. అంతటా సమదృష్టిని కలిగిన సాక్షివి. జ్ఞానరూపమే నీవు. సర్వాన్నీ చైతన్యవంతం చేసే చిన్మాత్రరూపివి. నీకు కోరిక అనేది ఏదైనా ఉంటే చైతన్యాన్నే కోరుకో.

రాజా ! ఆకలి దప్పికలు ప్రాణధర్మాలు. శోకము మొహము మనోధర్మాలు. ఆ జరామరణాలు దేహధర్మాలు. దేహధర్మాలయిన జరామరణాలనే షడూర్ములు అంటారు.

| | | | |
|---|---|---|---|
| 1. జాయతే | – పుట్టుట | 4. విపరిణమతే | – పండుట |
| 2. అస్థి | – ఉండటం | 5. అపక్షియతే | – తరగుట |
| 3. వర్థతే | – పెరుగుట | 6. వినశ్యతి | – నశించటము |

ఇవేవీ నీకు లేవు. కాబట్టి నువ్వు నిరపేక్షుడవు. ఏ రకమైన ఇతర కోరికలు లేనివాడవు. నిర్వికారుడవు. చిద్ఘన స్వరూపుడవు. శీతలాశయుడవు. అంటే ముక్తి పర్యంతము సుఖస్వరూపుడవు. అక్షుబుద్ధుడవు అంటే – అవిద్య వల్ల కలిగే ఉపద్రవాలు లేనివాడవు. కాబట్టి ఈ దేహము, దేహానికి సంబంధించిన అన్ని పనులు అవిద్యా కల్పితాలు అని రూఢిగా నమ్మి వాటిని వదిలిపెట్టి నిరంతరము చిన్మాత్రుడనై ఆత్మానందం పొందవలసింది.

పరమేశ్వర స్వరూపానికి ఏ రకమైన ధర్మాలు, గుణాలు ఉండవు. దేహంలో ఉంటే ప్రాణాలకు, మనస్సుకు, దేహానికి ధర్మాలుంటాయి కాని ఆత్మకి ఏ ధర్మాలు ఉండవు. పైన చెప్పినట్లుగా

1. ఆకలి దప్పికలు – ప్రాణధర్మాలు
2. శోకమోహాలు – మనోధర్మాలు
3. జరామరణాలు – దేహధర్మాలు

ఈ జరామరణాలనే మనం షడూర్ములు అంటాము. ఈ రకమైన ధర్మాలు ఏవీ లేనివాడు. అందుకే ఏ కోరిక ఉండదు. నిరపేక్షకుడు. లౌకికమైన కోరికలే కాదు. ఆత్మేతరమైన కోరికలు కూడా లేనివాడు. ఏ రకమైన వికారాలు మార్పులు లేనివాడు. నిర్వికారుడు. చిద్ఘన స్వరూపుడు. అజ్ఞానం వల్ల ఏ రకమైన అవస్థలు ఉండవు. నీకు అన్నీ తెలుసు. ఈ దేహం అశాశ్వతము అని, ఇదంతా కల్పన అని తెలుసు. దేహంలాగానే దేహంతో చేసే పనులు కూడా కల్పితాలే. ఈ విషయం

అంతా గట్టిగా నమ్ము. వాటిని గురించిన ఆలోచన వద్దు. నిరంతరము చిన్మాత్ర రూపము పవిత్రము అని నమ్మి చిన్మాత్రుడవై ఆనందంగా ఉండవలసింది.

**సాకారమనృతం విద్ధి నిరాకారం తు నిశ్చలమ్ ।**
**ఏతత్తత్త్వోపదేశేన న పునర్భవ సంభవః ॥** **18**

రూపమున్నది నశిస్తుంది. రూపం లేనిది శాశ్వతంగా ఉంటుంది. ఈ జ్ఞానం వల్ల పునర్జన్మల నుండి విముక్తి పొందుతావు.

కంటికి కనిపించే ఈ దేహము, ఇంద్రియాలు, ఈ జగత్తు అంతా మిథ్య అని గ్రహించు. అది అశాశ్వతమైనది. దానిమీద అభిమానం వద్దు. ఎటువంటి ఆకారము రూపము లేని ఆత్మ మూడు కాలాలలోను సర్వానికి సాక్షిగా ఉంటుంది. ఇది నిత్యం విజ్ఞానమానందం అటువంటి అనుభవం కలిగే ఆనందమే బ్రహ్మము. అదే చిన్మాత్ర రూపము. ఆ చిన్మాత్రలో విశ్రమించటమే ముక్తి.

**యథైవాదర్శమధ్యస్థే రూపేంతః పరితస్తుసః ।**
**తథైవాస్మిన్శరీరేఽంతః పరితః పరమేశ్వరః ॥** **19**

రాజా ! అద్దంలో ప్రతిబింబం కనిపిస్తోంది. దాని లోపల, బయట, చుట్టుపక్కల అంతా అద్దమే వ్యాపించి ఉంటుంది. అలాగే దేహానికి కూడా పైన, క్రింద, లోపల ప్రక్కల అంతా పరబ్రహ్మమే ఆక్రమించి ఉంది.

**యతో విశ్వమిదంభాతి కల్పితం రజ్జు సర్పవత్**

రజ్జువులో కల్పించబడిన సర్పంలాగా జగత్తంతా ప్రకాశిస్తున్నది. అంటే జగత్తు, భ్రాంతిచేత ఆవిర్భవించింది. అసలిక్కడ జగత్తే లేదు. ఉన్నట్లుగా అనిపిస్తున్నది అంతే. శంకర భగవత్పాదుల వారు దక్షిణామూర్తిస్తోత్రంలో చెప్పినట్లుగా

**విశ్వం దర్పణ దృశ్యమాన నగరీతుల్యం నిజాం తర్గతం ।**
**పశ్యన్నాత్మని మాయయా బహురివోరదుద్భూతం యథానిద్రయా**
**యస్సాక్షాత్కురుతే ప్రబోధ సమయే స్వాత్మాన మేవాద్వయం**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥**

కలలో మనముందే జరుగుతున్నట్లనిపించేదంతా అందంతా ఒక కల. నిద్ర చెదరిపోయి మెలకువ వస్తే అది అని తెలుస్తుంది. అలాగే మాయవల్ల ఈ జగత్తంతా

అద్దంలో కనిపించే ప్రతిబింబం లాగా కనిపిస్తున్నది. జగత్తంతా పరమాత్మ స్వరూపం. భ్రమాజన్యం నేను పరమాత్మను అనే భావంతో జీవించు సుఖం పొందు.

ఓ రాజా ! జగత్తులో నామరూపాత్మకమైనదంతా నశించిపోయేదే. ఏది దేని నుంచి ఆవిర్భవించిందో, దానిలోనే లీనమై పోతుంది. జగత్తులో శాశ్వతమైనది, సచ్చిదానంద రూపమైనది నువ్వే.

అద్దంలో ప్రతిబింబానికి బయటా లోపలా కూడా అద్దమే ఉంది. కాని ప్రతిబింబం అద్దంలో మాత్రమే కనుపిస్తుంది ఒకవేళ ప్రతిబింబం పోయినా అద్దం మిగిలి ఉంటుంది. ప్రతిబింబం ఉన్నా దానికి అద్దంతో ఏ సంబంధం ఉండదు. అలాగే జగత్తు కూడా. పరబ్రహ్మలో జగత్తు కనిపిస్తోంది. ఒకవేళ జగత్తు లేకపోయినా పరబ్రహ్మం అలాగే ఉంటుంది. ఒకవేళ జగత్తు ఉన్నా, దీంతో పరబ్రహ్మకు సంబంధం లేదు.

**ఏకం సర్వగతం వ్యోమ బహిరంతర్యథా ఘటే ।**
**నిత్యం నిరంతరం బ్రహ్మ సర్వ భూతగణే తథా ॥ 20**

సర్వము వ్యాపించి ఆకాశము ఎలా అయితే కుండపైనా, లోపలా ఉంటుందో, అదే విధంగా సర్వవ్యాప్తము అచలము అయిన పరబ్రహ్మ చరాచర జగత్తంతా నిండి ఉంది. ఆత్మ జగత్తంతా వ్యాపించి ఉంటుంది. అన్ని జీవరాసుల యందు వస్తువుల యందు అంతర్లీనంగా ఉంటుంది. అన్నింటిలోను అంతర్లీనంగా ఉండేది అంతరాత్మే. అదే అంతర్యామి. అసలు అంతర్యామి అంటే ఏమిటో చూద్దాం. ఒకసారి జనక మహారాజా యజ్ఞం చేస్తున్నాడు దేశం నలుమూలల నుంచి ఆధ్యాత్మికవేత్తలు వచ్చారు. యజ్ఞంలో భాగంగా సాయంసమయంలో ఆధ్యాత్మిక సభలు ఏర్పాటు చేశాడు. ఇప్పుడు జనక మహారాజుగారు లేచి సభాసదులతో ఆధ్యాత్మిక లోకంలోని అధిపతి ఎవరో తెలుసుకోవాలనుకున్నాడు. వెంటనే వెయ్యి గోవుల మీద బంగారు ఆభరణాలు అలంకరించి, శరీరం మీద పట్టువస్త్రాలు కప్పి తెచ్చారు. ఇప్పుడు జనకుడు **"ఆధ్యాత్మిక రంగంలో రారాజు ఎవరో వారు ఈ గోవులను తీసుకు వెళ్ళండి"** అన్నాడు. సభలో ఎవరూ లేవలా. అప్పుడు యాజ్ఞవల్క్యుడు తన శిష్యుణ్ణి పిలిచి ఆవులు ఆశ్రమానికి తీసుకుపో అన్నాడు. ఇంతలో సభలోని పండితులు లేచి యాజ్ఞవల్క్యా ! మమ్మల్ని ఓడించి వీటిని తీసుకుపో అన్నాడు. వారందరూ యాజ్ఞ్యవల్క్యుడితో వాదనకు దిగారు. అప్పుడు ఉద్ధాలకుడు లేచి అంతర్యామిగా ఉండే వాడిని వివరించవలసింది అన్నాడు. అప్పుడు యాజ్ఞవల్క్యుడు వివరించాడు.

**సుబాలోపనిషత్తు, బృహదారణ్యకోపనిషత్తు, ఇతరేయోపనిషత్తు**లలో అంతర్యామి గురించి చెప్పటం జరిగింది.

పరమేశ్వరుడు ఈ జగత్తునంతా సృష్టించాడు. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు మొదలైన వాటితో మానవుని కూడా సృష్టించాడు. ఈరకంగా సృష్టించిన దేహంలో తాను ప్రవేశించాలి అనుకున్నాడు. అలా ప్రవేశించటానికి రెండు ద్వారాలున్నాయి. ఒకటి పైనుండి అంటే బ్రహ్మరంధ్రంద్వారా, రెండవది క్రింద నుంచి. క్రింద నుంచి ప్రవేశించటం సేవకాలక్షణం కాబట్టి బ్రహ్మరంధ్రం ద్వారా మానవశరీరంలో ప్రవేశించాడు. ఈ రకంగా ప్రవేశించిన తరువాత దశేంద్రియాలు, నవరంధ్రాలతో కూడిన ఈ దేహంతో భోగాలు అనుభవిస్తూ నేను, నాది అనే అహంకార మమకారాలకు లోనయినాడు. అంటే అవిద్యాపూరితుడైనాడు. దేహమే తాను అనే భ్రాంతికి లోనయినాడు. ఈ భేదం గనక తొలగిపోతే జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అవుతాయి.

ఈ రకంగా జగత్తులోని ప్రతిశరీరంలోనూ ప్రవేశించినవాడై ఆ చైతన్యమూర్తి సర్వాంతర్యామి అయినాడు. ప్రతిజీవియందు ఆ చైతన్యము ఉండటంవల్లనే, ఆ జీవి చలించగలుగుతున్నది. ఉదాహరణకు కంటికి చూసే శక్తిలేదు. అలా ఉంటే కనులున్న వాళ్ళంతా చూడగలగాలి. కాని గ్రుడ్డివాడు చూడలేడు. గ్రుడ్డివాడికి కూడా కళ్ళుంటాయి. కాని ఆ కళ్ళకు చూసేశక్తి ఉండదు. ఈ రకంగా కంటికి చూసేశక్తి నిచ్చేది చైతన్యము అదే ఆత్మ. చెవికి వినేశక్తినిచ్చేది ఆత్మ.

పరమేశ్వరుడు సర్వాంతర్యామి. జగత్తంతా నిండి ఉన్నాడు. అన్నింటికీ తన చైతన్యశక్తిని ప్రసాదిస్తున్నాడు. అంతదాకా ఎందుకు ? గర్భంలోని శిశువుకు ఏడవ నెలలో ప్రాణం వస్తుంది అన్నాము. మరి అంతకుముందు ప్రాణం లేదా ? ఉన్నది. ప్రాణం లేకపోతే శిశువు ఎలా ఎదగగలుగుతుంది ? మరి ఏడవనెలలో వచ్చేది ఏమిటి ? అదే చైతన్యము. ఆ శిశువుకు చలనాన్ని ఇచ్చేది అదే అంతర్యామి. ఆత్మ. ఇక పరమేశ్వరుడు తమలో ఉన్నప్పటికీ జీవులకు అతన్ని గురించి తెలియదు. కాని అతనివల్లనే ఆ జీవులు నియంత్రించబడుతూ ఉంటాయి.

పరమేశ్వరుడు భూమిలోపల ఉంటాడు. భూమే అతని శరీరము కాని భూమి అతన్నెరగదు. భూమి లోపల ఉంటూనే భూమిని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

జలంలోపల ఉంటాడు. జలమే అతని శరీరం. కాని జలం అతన్నెరగదు. జలంలోపల ఉంటూనే జలాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

అగ్నిలోపల ఉంటాడు. అగ్నే అతని శరీరం. కాని అగ్ని అతన్నెరగదు. అగ్ని లోపల ఉంటూనే అగ్నిని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

వాయువులోపల ఉంటాడు. వాయువే అతని శరీరం. కాని వాయువు అతన్నెరగదు. వాయువు లోపల ఉంటూనే వాయువును నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

ఆకాశంలో ఉంటాడు. ఆకాశమే అతడి శరీరం. కాని ఆకాశం అతన్నెరగదు. ఆకాశం లోపల ఉంటూనే ఆకాశాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ. ద్యులోకంలో ఉంటాడు.ద్యులోకమే అతని శరీరము. కాని ద్యులోకమతన్నెరగదు. ద్యులోకంలో ఉంటూనే ద్యులోకాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

ఆదిత్యలోకంలో ఉంటాడు. ఆదిత్యలోకమే అతని శరీరము. కాని ఆదిత్య లోకం అతన్నెరగదు. ఆదిత్య లోకంలో ఉంటూనే ఆదిత్యలోకాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

దిగంతరాళాల్లో ఉంటాడు. దిక్కులే అతని శరీరము కాని దిక్కులు అతన్నెరగవు. దిక్కులయందుంటూనే దిక్కులను నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

సూర్యునిలో ఉంటాడు. సూర్యుడే అతని శరీరము. కాని సూర్యుడు అతన్నెరగడు. సూర్యునిలో ఉంటూనే సూర్యుణ్ణి నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

చంద్రునిలో ఉంటాడు. చంద్రుడే అతని శరీరము. కాని చంద్రుడు అతన్నెరగడు. చంద్రునిలో ఉంటూనే చంద్రుణ్ణి నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

నక్షత్ర మండలంలో ఉంటాడు. నక్షత్రమండలమే అతని శరీరం. కాని నక్షత్ర మండలం అతన్నెరగదు. నక్షత్ర మండలంలో ఉంటూనే నక్షత్ర మండలాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

అంధకారంలో ఉంటాడు. అంధకారమే అతని శరీరము. కాని అంధకారం అతన్నెరగదు. అంధకారంలో ఉంటూనే అంధకారాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

తేజస్సులో ఉంటాడు. తేజస్సే అతని శరీరం. కాని తేజస్సు అతన్నెరగదు. తేజస్సులో ఉంటూనే తేజస్సును నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి అతడే ఆత్మ. మనస్సులోనే ఉంటాడు. మనస్సే అతని శరీరము. కాని మనస్సు అతన్నెరగదు. మనస్సులోనే ఉంటూనే మనస్సును నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

బుద్ధిలోనే ఉంటాడు. బుద్ధే అతడి శరీరము. కాని బుద్ధి అతన్నెరగదు. బుద్ధిలో ఉంటూనే బుద్ధిని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ. అహంకారంలోనే ఉంటాడు. అహంకారమే అతని శరీరం. కాని అహంకారం అతన్నెరగదు. తెలుసుకోలేదు. అహంకారంలో ఉంటూనే అహంకారాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

చిత్తమునందే ఉంటాడు. చిత్తమే అతని శరీరము. కాని చిత్తము అతన్నెరగదు. చిత్తంలో ఉంటూనే చిత్తాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

అవ్యక్తమందు ఉంటాడు. అవ్యక్తమే అతని శరీరము.కాని అవ్యక్తము అతన్ని ఎరగదు. అవ్యక్తంలో ఉంటూనే అవ్యక్తాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

అక్షరములోనే ఉంటాడు. అక్షరమే అతని శరీరము కాని అక్షరము అతన్నెరగదు. అక్షరమందు ఉంటూనే అక్షరాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

మృత్యువునందే ఉంటాడు. మృత్యువే అతని శరీరము. కాని మృత్యువు అతన్నెరగదు. మృత్యువులో ఉంటూనే మృత్యువుని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ. అతడు సర్వభూతాంతరాత్ముడు. పాపరహితుడు. దివ్యుడు. అతడు కనుపించడు కాని చూస్తాడు. వినిపించడు కాని వింటాడు. అతడు తెలియబడడు. అర్థం కాడు. కాని అతనికి అన్నీ తెలుసు. అతడే అంతర్యామి. ఆత్మ. శాశ్వతుడు. అతడు తప్ప అన్నీ నాశనమై పోయేవే"

కాబట్టి జనక మహారాజా! సర్వవ్యాపి అయిన ఆకాశం కుండకు పైన లోపల ఏ విధంగా వ్యాపించి ఉంటుందో, అదే విధంగా పరబ్రహ్మము కూడా జగత్తంతా వ్యాపించి ఉంటుంది అన్నాడు అష్టావక్రుడు.

ఈ రకంగా మొదటి అధ్యాయంలో సర్వసాక్షి అయిన పరబ్రహ్మను వివరించటం జరిగింది.

# అధ్యాయం-2

# ఆత్మానుభవం-1

ఆత్మసాక్షాత్కారము పొందినవాడు ఎలా ఆలోచిస్తాడు? అనే విషయాన్ని తేజోబిందు ఉపనిషత్తు చెబుతోంది. అతడికి ఆత్మసాక్షాత్కారమైంది. తానే పరబ్రహ్మ స్వరూపము అని తెలిసింది. తానుతప్ప ఈజగత్తులో వేరెవరూలేరు. ఉన్నది ఒక్కటే అదేపరబ్రహ్మ. అదే తను. కాబట్టి, "నేను పరబ్రహ్మస్వరూపుణ్ణి, జ్ఞానరూపుడను, పరముడను, కేవలముశాంతరూపుడను, చిన్మయుడను, నిత్యరూపుడను, శాశ్వతుడను, సత్యరూపుడను, నేను కలిసి ఉన్నాను, నేను విడిచి ఉన్నాను. సర్వజీవస్వరూపుడను. చిదాకాశమయుడను.

నేను సత్పరానందరూపుడను. చిత్పరానంద రూపుడను. అవాఙ్మానస గోచరుణ్ణి. 'వాక్కుకు మనస్సుకు అందని వాణ్ణి). ఆత్మానందరూపుడను. సత్యానందరూపుడను. ఆత్మారాముడను. నేనేఆత్మను, నేనేసదాశివుడను. ఆత్మప్రకాశరూపుడను. ఆత్మజ్యోతిని ఆదిమధ్యాంతరహితుడను, ఆకాశసదృశుడను. నిత్యశుద్ధుడను, చిదానందుడను, సత్తామాత్రుడను. నిత్యబుద్ధుడను. ఏకసచ్చిదానందమును. సర్వాతీతుడను. రూపాతీతుడను. పరమైన ఆకాశవిగ్రహుడను. భూమానంద స్వరూపుడను. భాషా హీనుడను, సర్వాధిష్ఠానరూపుడను. దేహభావం లేనివాడను. చింతలులేనివాడను. చిత్తవృత్తులు లేనివాడను. చిదాత్మైకరసుడను. ద్రుగ్రూపుడను. పూర్ణరూపుడను. నిత్యతృప్తుడను. నేనే బ్రహ్మను. సర్వము నేనే. చైతన్యము నేనే, జడము నేనే. ఆకాశ స్వరూపుడను నేనే. ఆత్మను నేనే. నేను ఎవరిలాగానో ప్రకాశిస్తుంటాను. నేను శరీరంలాగాభాసిస్తాను.

నేను శిష్యునిలాగా భాసిస్తాను. లోకత్రయాశ్రయుడను. త్రికాలాతీతుడను. వేదాలచే ఉపాసింపదగినవాడనునేనే. శాస్త్రాలతో నిర్ణయింపబడేవాడను, చిత్తంలో ఉన్నవాడను. నేనులేనిది ఎక్కడాలేదు. నేను బ్రహ్మను. సిద్ధుడను, నిత్యశుద్ధడను. నిర్గుణుడను. కేవలము ఆత్మరూపిని. నిరాకారుడను. కేవలము బ్రహ్మమాత్రుడను. అజరుడను, అమరుడను. నాకునేనే ప్రకాశిస్తాను. నాకునేనే సదాత్మకుడను. స్వయంగా ఆత్మయందున్నాను. నాకుపరాగతినేనే. స్వయంగా భుజిస్తాను. స్వయంగా క్రీడిస్తాను.

స్వయంగా జ్యోతిస్వరూపాన్ని. స్వయంగా మహారూపాన్ని. నా ఆత్మలో నేనే క్రీడిస్తాను. నా ఆత్మయందే అన్నీ చూస్తాను. స్వాత్మయందు సుఖాసీనుడనై స్వాత్మమాత్రావశిష్ఠుడనై ఉంటాను. స్వచైతన్యంలో స్వయంగాఉంటాను. స్వాత్మ రాజ్యంలో సుఖమందు రమిస్తాను. స్వాత్మసింహాసనము నుండి స్వాత్మకన్న ఇతరమైన దాన్ని చింతించను.

చిద్రూపమైన బ్రహ్మను. చిదానంద స్వరూపుడను. అద్వయుడను. నేను ఆనంద ఘనుడను. నేను కేవలము బ్రహ్మను. నేను ఎప్పుడూ సర్వశూన్యుడను. ఆనందవంతు డను. నిత్యానంద స్వరూపుడను. ఆత్మాకాశుడను. హృదయాకాశంలో చిదాదిత్య స్వరూపుడను నేనే. ఆత్మచే, ఆత్మయందు తృప్తుడను. అరూపుడను. అవ్యయుడను. నిత్యము ముక్తస్వరూపుడను. ఆకాశముకన్న మహాస్వరూపుడను. ఆద్యంతములు లేనివాడిని. సర్వప్రకాశరూపుడను. సత్తామాత్ర స్వరూపుడను. శుద్ధమోక్ష స్వరూపుడను. సత్యానంద స్వరూపుడను. జ్ఞానానంద ఘనుడను. విజ్ఞానమాత్ర రూపుడను. సచ్చిదానందలక్షణుడను. ఈసర్వజగత్తు బ్రహ్మముమాత్రమే. బ్రహ్మకన్న వేరైనది ఏదీలేదు. అదే నేను. సచ్చిదానందస్వరూపుడను. సనాతనమైన బ్రహ్మను నేనే. నీవు, అతడు అనేవి నాకన్న వేరుగా లేవు. నేనే పరమశివుడను.

నేను అతిభావస్వరూపుడను. నాకు సాక్షిత్వంలేదు. నేనే సనాతనమైన ఆత్మను. ఆదిశేషుడునేనే. నామరూపాలులేనివాడను. ఆనందవిగ్రహుడను. ఇంద్రియాభావ రూపుడను. సర్వాభావరూపుడను. బంధమోక్షాలు లేనివాడను. శాశ్వతఆనంద విగ్రహుడను.

చైతన్యమాత్రుడను. అఖండైకరసుడను. అవాఙ్మానసగోచరుడను. సుఖవంతుడను. అన్నిప్రదేశాలయందు పూర్ణుడను. భూమానందమయుడను, తృప్తిరూపుడను. ఉత్కృష్టమైన అమృతరసుడను. అద్వితీయుడను, సత్తును, అసత్తును. నేనేబ్రహ్మను. సంశయము లేదు. సర్వశూన్యస్వరూపుడను. సకలాగమములందు గోచరుడను. ముక్తుడను. మోక్షరూపుడను. నిర్వాణసుఖస్వరూపుడను.

సత్యవిజ్ఞానమాత్రుడను. సన్మాత్రుడను. సదానందుడను. తురీయాతీతరూపు డను. నిర్వికల్పుడను. అజుడను. రాగము లేనివాడను. నిరంజనుడను. శుద్ధుడను. బుద్ధుడను, నిత్యుడను, విభుడను. ఓంకారానికి అర్థరూపాన్ని. నిష్కళంకమైన చిదాకార స్వరూపాన్ని. నేను అనేది లేదు. అతడు నేను కాదు. నేను ఏ స్వరూపము కాదు. నిర్వ్యాపార స్వరూపుడను. నిరంజనుడను. నిరాభాసుడను. నేనుఅంటే మనస్సును

కాదు. ఇంద్రియాలుకాదు. బుద్ధికాదు, వికల్పముకాదు, దేహత్రయముకాదు, అవస్థాత్రయముకాదు, తాపత్రయముకాదు, ఈషణత్రయముకాదు. నాకు శ్రవణం లేదు. మననంలేదు. సజాతీయములేదు విజాతీయములేదు.

మనోరూపముఅసత్యము. బుద్ధిఅసత్యము. అహంకారముఅసత్యము. నేను నిత్యుడను. శాశ్వతుడను. దేహత్రయము, కాలత్రయము, గుణత్రయము అంతా అసత్తే. నేను సత్యాత్మకుడను. శుచియైనవాడను. శ్రుతము, వేదము, శాస్త్రము, అంతా అసత్తే. నేనొక్కడనే చిదాత్మకుడను. సత్యము, మూర్తిత్రయము అంతా అసత్తే. సర్వభూతాలుఅసత్తు. సర్వతత్త్వాలుఅసత్తు. నేను సర్వమూవ్యాపించిఉన్నాను. నేనేశివుడను.

గురువులేడు శిష్యుడులేడు. మంత్రంలేదు తంత్రంలేదు. దృశ్యములేదు దృక్కులేదు. నేనుమాత్రమేఉన్నాను. చింత్యమైనది, న్యాయమైనది, హితమైనది ఏదీలేదు. ప్రాణాలన్నీఅసత్తే. భోగాలుఅసత్తే. చూడబడేది, వినబడేది, అంతా అసత్తే. కార్యము అకార్యము అసత్తే. నష్టమైనది ప్రాప్తమైనది కూడా అసత్తే.

సుఖంలేదు దుఃఖంలేదు. పూర్ణంలేదు అపూర్ణంలేదు. ధర్మంలేదు అధర్మం లేదు. స్వరూపములేదు. అంతాఅసత్తే నేనుసన్మాత్రుడను "ఆత్మసాక్షాత్కారం" పొందిన వాడు ఈ విధంగా ఆత్మానుభవం పొందుతాడు అని చెబుతోంది **తేజోబిందు ఉపనిషత్తు**

ఈ అధ్యాయంలో 25 శ్లోకాలున్నాయి. ఇందులో తన ఆత్మానుభవాన్ని చెబుతున్నాడు జనక మహారాజు.

నిష్కళంకము నిత్యశుద్ధము అయిన ఆత్మను నేనే. నేను ఈ శరీరాన్ని చైతన్యవంతం చేస్తూ జగత్తును చూపిస్తున్నాను. ఈ ప్రపంచమంతా నాదే. నిజానికి నాలో ఏమీ లేదు. నా శరీరాన్ని, శరీరం చూసే దృశ్యాలను కూడా వదిలి, గురుకృపచే పరమాత్మను తెలుసుకుంటున్నాను. తరంగాలు కెరటాలు బిందువులు ఏ రకంగా సముద్రం నుంచి వేరు కావో అలాగే ఆత్మలో కనిపించే జగత్తంతా ఆత్మకన్న వేరు కాదు. వస్త్రము అన్నప్పుడు అది దారపు పోగుల సమూహం కన్న వేరు కాదు. అలాగే దృశ్యమానమైన జగత్తు ఆత్మకన్న వేరు కాదు. చెరకు రసంతో తయారైన పంచదార నిండా ఉండేది చెరకు రసమే. అదే విధంగా నాలో ఉన్న జగత్తును నేనే

ఆక్రమించి ఉన్నాను. అజ్ఞానం వల్ల జగత్తు ఉన్నట్లుగా అనిపిస్తోంది. ఇది రజ్జు సర్పభ్రాంతి. నేను స్వయంజ్యోతిని. నా ప్రకాశం వల్లనే జగత్తు ప్రవర్తిల్లుతున్నది. కుండ మట్టిలో కలిసిపోయినట్లుగానే జగత్తు నాలో లయమై పోతుంది. పిపీలికాది బ్రహ్మపర్యంతము జగత్తంతా నశించినా నేను మాత్రం ఉన్నాను. నేను ఎక్కడి నుంచీ రాను. ఎక్కడికీ పోను. జగత్తంతా ఆక్రమించి ఉన్నాను. ఈ జగత్తు సృష్టించక ముందు నుంచీ, దాన్ని నేను ధరిస్తున్నాను. వాక్కుకు మనస్సుకు గోచరించేవన్నీ నాలోనే ఉన్నాయి. అజ్ఞానం వల్ల నాలో త్రిపుటి ఉన్నట్లుగా కనిపిస్తోంది. అన్ని దుఃఖాలకు ద్వైతమే మూలము. జగత్తంతా నాలో ఉన్నట్లుగా అనిపిస్తున్నా నిజానికి నాలో ఏమీ లేదు. ఈ జగత్తు మిథ్య. శరీరం మిథ్య. ఆత్మచైతన్య స్వభావం కలది. శరీరము, స్వర్గం నరకం, బంధం, మోక్షం ఇవన్నీ కేవలము కల్పనలు. వీటన్నింటికీ ఆధారమైన చైతన్యాన్ని నేను, నేను జనం మధ్యన ఉన్నా అరణ్యం మధ్యన ఉన్నా ఒకటిగానే ఉంది. రెండవదేదీ కనపడటం లేదు. నేను శరీరం కాదు. నాకు శరీరం లేదు. నేను జీవుణ్ణి కాదు. చైతన్యాన్ని. అనంత చైతన్య సాగరాన్ని నేను. నాలో మానసిక  కల్లోలం వల్ల అనేకానేక తరంగాలు జగత్తు రూపంలో ఒక్క క్షణంలో ఆవిర్భవించాయి. అనంత చైతన్య సాగరమైన నాలో మానసిక కల్లోలం తీరిపోయి నప్పుడు జీవన వ్యాపారం ఆగిపోతుంది. నాలోని అనంత చైతన్యసాగరంలోని జీవులంతా కెరటాలలాగా పుడుతూ కదులుతూ చివరకు లయమై పోతున్నాయి. ఈ జగత్తంతా మనోకల్పితము. అజ్ఞానం పోయి జ్ఞానసముపార్జన చేయగానే జగత్తు అధిష్ఠానంలో లీనమై పోతుంది. ఇదే విషయాన్ని చెబుతున్నాడు జనక మహారాజు ఈ అధ్యాయంలో.

**అహో ! నిరంజనశ్శాంతః బోధోఽహం ప్రకృతేః పరః ।**
**ఏతావంతమహం కాలం మోహేనైవ విడంబితః ॥ 1**

నిష్కళంకము, నిత్యశుద్ధము అయిన ఆత్మని, నేనే. నేను సర్వ ప్రకృతికి అతీతంగా ఉన్నాను. ఇంత కాలము అజ్ఞానంతో, భ్రమతో జీవించాను.

మొదటి అధ్యాయంలో గురువు గారు చెప్పినదంతా విని ఇప్పుడు అంటున్నాడు జనక మహారాజు. ఆహా! ఏ మాశ్చర్యము? ఇదంతా నాకు కలిగిన అదృష్టము, గురూపదేశముల వలన, అద్భుతమైన అనుభవాలు.

నేను ఆత్మస్వరూపాన్ని. నాకు ఏ కళంకము లేదు. నాలో ఏ రకమైన మాలిన్యము లేదు. నిత్యశుద్ధ బుద్ధమైన ఆత్మచైతన్యాన్ని. ఇంతవరకు అనేక జన్మ లెత్తాను. ఈ దేహమే నేను అనే భ్రమలో ఉన్నాను. కర్మలు చేస్తున్నాను. కర్మఫలాలు అనుభవిస్తున్నాను. కర్మల ఫలితంగా పశువుగా, పక్షిగా, క్రిమికీటకాలుగా జన్మించాను. జన్మలన్నింటిలోకీ మానవజన్మ దుర్లభమైనది. **జంతూనాం నరజన్మ దుర్లభం.** ఎందుకంటే మానవుడు తప్ప ఇతరమైన ఏ జీవీ కర్మ చెయ్యలేదు. పశువులు పక్షులు కర్మ ఫలితాన్ని అనుభవిస్తాయే కాని కర్మ చెయ్యలేవు. క్రిమికీటకాలు పుడుతూ చస్తూ ఉంటాయి. ఎక్కువ కాలం జీవించవు. కొన్ని కీటకాలు జన్మించిన ఒకటి రెండు రోజులకే మరణిస్తాయి. అందుకే **మఖలో పుట్టింది పుబ్బలోనూ మాడింది** అంటారు. మఖ, పుబ్బ ఒక దాని తరువాత ఒకటి ఉండే నక్షత్రాలు. కాలాన్ని లెక్కించేటప్పుడు ఒక నక్షత్రం సుమారుగా ఒకరోజు ఉంటుంది. ఇవాళ ఒక నక్షత్రముంటే రేపు ఇంకొక నక్షత్రం ఉంటుంది. మఖలో పుట్టింది అంటే ఈ రోజు జన్మించి, పుబ్బలో మాడింది. రేపు నశించింది. అంటే ఆ కీటకం జీవితం 24 గంటలన్న మాట. ఇలాంటి జీవులన్నీ కర్మ ఫలాన్ని అనుభవిస్తాయి అంతేకాని కర్మలు చెయ్యలేవు. వీరే కాదు సాక్షాత్తు దేవతలు కూడా కర్మ చెయ్యలేరు. దేవతలకు శరీరం లేదు. కర్మ చెయ్యాలంటే దేవతలైనా సరే భూలోకంలో మనిషిగా పుట్టాల్సిందే. ఎన్నో జన్మలలో పుణ్యకార్యాలు చేస్తేనే గాని మానవజన్మ రాదు. అందులో ప్రాణాలన్నిటి లోకీ మానవజన్మ దుర్లభము అన్నారు. మనిషికి ఆలోచనాశక్తి ఉంది. మంచి చెడు నిర్ణయించుకునే వివేకమున్నది. అందుకే మానవజన్మ ఉత్తమము. కర్మ చెయ్యాలంటే, అది మానవుడికి మాత్రమే సాధ్యం.

మానవుడిగా పుట్టినంత మాత్రం చేత అతడు ఉత్తముడు కాడు. బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్ర అని నాలుగు వర్ణాలున్నాయి. ఇవి కాక నిషాదులు అని ప్రత్యేకంగా ఉన్నారు. అడవులలో నివసించే బోయవారు. వీరినే 'పంచములు' అన్నాడు. సాయణాచార్యుడు. వీరందరూ మానవులే, కాని వీరి సంస్కారం వేరే ఉంటుంది. పుణ్యకర్మలు చేసినవారు ఉత్తమ వంశంలోను, పాపకర్మలు చేసిన వారు నీచులుగా జన్మిస్తారు. అలాగే వాల్మీకి శాపవశాన బోయవాడుగా జన్మించాడు. ఒకేచోట, ఒకేసారి, ఒకే గర్భాన జన్మించినంత మాత్రంచేత వారంతా ఒకేలా ఉండటం జరగదు.

అష్టవసువులు శాపవశాన గంగ గర్భాన జన్మించారు. వారిలో ఆఖరువాడైన ప్రభాసుడు మాత్రం భీష్ముడుగా ఈ లోకంలో జీవించాడు. మిగిలిన వారందరూ పుట్టగానే నదిలోకి విసరివేయబడ్డారు. అలాగే దేవకీ వసుదేవులకు అష్టమ గర్భాన జన్మించాడు కృష్ణుడు. మిగిలిన వారిలో ఏడవ గర్భం సంకర్షణమైంది. మిగిలిన వారందరూ చిన్నతనంలోనే మరణించారు. కాని అష్టమ గర్భ సంజాతుడైన కృష్ణుడు మాత్రం పెరిగి పెద్ద అయి కురుక్షేత్ర మహాసంగ్రామం జరిపించాడు. నాకు బాగా తెలిసిన విషయం. ఒక బ్రాహ్మణుడు. పెద్దగా చదువూ లేదు. సంపాదన అంతంత మాత్రం. రోజు గడవటమే కష్టం. నలుగురు సంతానం. చివరి ఇద్దరూ కవలపిల్లలు ఒక ఆడ ఒక మగ. వారి వయస్సు మూడు సంవత్సరాలు.

మాతో పాటు పనిచేసే ఒక లెక్చరరు గారికి పిల్లలు లేరు. ఎవరినైనా పెంచుకుందాం అనుకుంటున్నాడు. పైన చెప్పిన పేద బ్రాహ్మణుడి విషయం తెలిసి వెళ్ళాడు. ఎవరైనా చిన్నపిల్లల్ని తెచ్చి పెంచుకోవాలనేది ఆయన కోరిక. ఈయన వెళ్ళేసరికి చిన్నపిల్లలు ఇద్దరూ మంచంమీద నిద్ర పోతున్నారు. విషయం అంతా విన్నారు. బ్రాహ్మణ దంపతులు. వారి సంతానాన్ని లెక్చరరు గారికి దత్తు ఇవ్వటానికి అంగీకరించారు. మంచం మీద నిద్ర పోతున్న వారిలో ఆడపిల్లను ఈయన తెచ్చుకున్నారు.

విధి ఎలా ఉంటుందో చూడండి. ఇద్దరూ ఒకే తల్లికి ఒకేసారి జన్మించారు. కాలక్రమంలో ఆడపిల్ల సంపన్నుల ఇంటి పిల్ల అయింది. మగపిల్లవాడు తండ్రి దగ్గరే, ఆ దరిద్రంలోనే మ్రగ్గుతున్నాడు. ఇదంతా వారి వారి కర్మానుసారమే జరుగుతుంది. ఇక బ్రాహ్మణ స్త్రీకి, బ్రాహ్మణ పురుషుని వల్ల కలిగిన సంతానమే బ్రాహ్మణుడు.

**జన్మవాజాయతే శూద్రః కర్మణాజాయతేద్విజః**

పుట్టుకతో ఎవరైనా శూద్రుడే, కర్మ చెయ్యటం వల్లనే ద్విజులౌతారు. ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఒకటుంది.

బ్రాహ్మణత్వం అంటే – సత్యం

బ్రాహ్మణత్వం అంటే – నియమం

బ్రాహ్మణత్వం అంటే – నీతి

బ్రాహ్మణత్వం అంటే - ధర్మం

బ్రాహ్మణత్వం అంటే - విజ్ఞానం

బ్రాహ్మణత్వం అంటే - జ్ఞానం

బ్రాహ్మణత్వం అంటే - నిష్ఠ

బ్రాహ్మణునిగా పుట్టటం గొప్పకాదు. బ్రాహ్మణుడుగా జీవించటం గొప్ప. ధార్మిక లక్షణాలున్నా వారెవరైనా బ్రాహ్మణులే. బ్రాహ్మణ్యమనేది కులసంకేతపదం కాదు. గుణసంకేత పదం. కేవలం విషయం కోసం ఇక్కడ ఇస్తున్నాను చూడండి. బ్రాహ్మణులలో

ఉపనయనాది సంస్కారాలు లేనివారు - మాత్రులు

వైదికాచారాలు పాటించేవారు - బ్రాహ్మణులు

బ్రాహ్మణోచితమైన కర్మలు చేసేవారు - శ్రోత్రియులు

నాలుగు వేదాలు చదివిన వారు - అనూచానులు

ఇంద్రియాలను వశంలో ఉంచుకున్న వారు - భ్రూణులు

ఎప్పుడూ ఆశ్రమంలోనో అరణ్యంలోనే ఉండేవారు- ఋషికల్పులు

రేస్కలనము లేక సత్యప్రజ్ఞులైన వారు - ఋషులు

సంపూర్ణ తత్త్వజ్ఞాన గలవారు - మునులు అనబడతారు

వ్యావహారికంలోకి వస్తే వేదం చదివిన వాడు వైదికి. నియోగించబడినవాడు నియోగి. వీరు నివశించే ప్రాంతాన్ని బట్టి అనేక శాఖలు వచ్చాయి.

ఒకసారి ధర్మరాజు శ్రీకృష్ణ పరమాత్ముడి నమస్కరించి, 'పరమాత్మా ! నాకు బ్రాహ్మణత్వాన్ని గురించి తెలుసుకోవాలని ఉన్నది. దయచేసి వివరించవలసింది' అన్నాడు అప్పుడు కృష్ణుడు ధర్మనందనా ! శ్రద్ధగా విను.

"మానవులకు ధర్మార్థ కామ మోక్షసాధనకు, దేవతార్చనకు, పిత్రుదేవతలను అర్చించటానికి, ఇహలోక సుఖాలు పొందటానికి కారణం, అందుకు సహకరించే బ్రాహ్మణులే. దేవతలకు కూడా ఆయుష్షు, సంపద, కీర్తి కలగటానికి కారణం బ్రాహ్మణులే. బ్రాహ్మణులు ఆగ్రహిస్తే ఎటువంటి వారైనా భస్మమై పోతారు. ఈ

లోకంలోనే కాక పరలోకంలో కూడా సుఖాలు పొందటానికి కారణం బ్రాహ్మణులే.” అంటాడు.

అంటే బ్రాహ్మణుడిగా పుట్టినవాడు సమాజ శ్రేయస్సునే కోరుకుంటాడు. అతడికి స్వార్థం ఉండదు. ఇది బ్రాహ్మణ్యం అంటే. ఇలా జీవించే వారందరూ బ్రాహ్మణులే అంటారు **స్వామి పరమానంద నాథులు**. బ్రాహ్మణత్వం అనేది గుణసంకేతం. వేదం చదువుకున్న వాడు అవధాని. అవధానం చేసేవాడు అవధాని. అంతేగాని కేవలము పేరు పెట్టుకున్నంత మాత్రంచేత కాదు. ఆ రోజుల్లో కూడా ఇతర వర్ణాలలో పుట్టి బ్రాహ్మణత్వాన్ని సంతరించుకున్న వారు అనేకమంది ఉన్నారు. జనక మహారాజు, అశ్వపతి, ప్రవాహణుడు వీరు క్షత్రియులై కూడా బ్రాహ్మణత్వాన్ని సంతరించుకున్నారు.

ఇప్పుడు జనకుడు అంటున్నాడు. ఇప్పటికి ఎన్నో లక్షల కోట్ల జన్మలు ఎత్తి ఇప్పుడు ఈ స్థితికి వచ్చాను. ఇంత వరకు దేహమే నేను, ఇంద్రియాలే నేను అని భావన చేసినందుకు సిగ్గు పడుతున్నాను. చిదానందమైన చైతన్యాన్ని నేనే. ప్రకృతి మొత్తానికి అతీతమైన వాడను. ఇంతకాలము అజ్ఞానంతో, ఉన్మాదిలాగా జీవించాను. అంటూ జనకుడు విచారిస్తున్నాడు.

**యథా ప్రకాశయామ్యేకః దేహమేనం తథా జగత్ ।**
**అతో మమ జగత్సర్వమథవా న చ కించన ॥ 2**

నేనే ఈ శరీరాన్ని చైతన్యవంతం చేస్తూ జగత్తును చూపిస్తున్నాను. కాబట్టి ఈ ప్రపంచమంతా నాదే. కాని నిజానికి నాలో ఏమీ లేదు.

నేను పరబ్రహ్మ స్వరూపాన్ని. స్థూలదేహము, జగత్తు రెండూ ఒకటే. ఈ రెండూ జడమైనవే. దేహాన్ని నేనే ప్రకాశింప చేస్తున్నాను అలాగే జగత్తును కూడా.

దృశ్యమానమైన ఈ జగత్తంతా నాలో ఆరోపించబడుతోంది. ఈ జగత్తంతా స్వప్న జగత్తులాగా మిధ్య అవుతున్నది. ఇక్కడ ఒక్కసారి చూడండి. జగత్తంతా నాలో ఆరోపించబడుతున్నది అంటున్నారు. దక్షిణామూర్తి స్తోత్రంలో మొదటి శ్లోకం చూడండి.

**విశ్వం దర్పణ దృశ్యమాన నగరీ తుల్యం నిజాంతర్గతం**
**పశ్యన్నాత్మని మాయయా బహురివోద్భూతం యథానిద్రయా**

**యస్సాక్షాత్కరుతే ప్రబోధ సమయే స్వాత్మాన మేవా ద్వయం**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥**

స్వప్నంలో మనయందే కనిపించేదంతా కూడా ఎక్కడో బయట జరుగుతున్నది అనుకుంటున్నాము. అలాగే అద్దంలో కనిపిస్తున్న ప్రతిబింబంలాగా మన ఆత్మయందే గోచరిస్తున్న ప్రపంచాన్ని మాయవల్ల బయట ఉన్నట్లుగా చూస్తున్నాము. ఆ మాయ నుంచి బయట పడితే ఆ ప్రపంచమంతా మనయందే గోచరిస్తున్నదని తెలుస్తుంది.

నిద్ర పోతున్నాం. కల వస్తుంది. ఆ కలలో అనేక విషయాలు గోచరిస్తాయి. రాజులు, రాజ్యాలు, శత్రువులు, మిత్రులు, రథాలు, గుర్రాలు, ఏనుగులు అనేక దృశ్యాలు కనిపిస్తాయి. మనం ఎక్కడికో వెడతాం. అక్కడ అనేక విషయాలు జరుగుతాయి. మనం పాలకులం కావచ్చు. పాలితులం కావచ్చు. ఏదైనా జరుగుతుంది. ఈ దృశ్యమంతా మనకు చాలా దూరంలో ఎక్కడో ఒక్కొక్కసారి మనకు తెలియని ప్రదేశంలో జరుగుతుంది. మెలకువ వచ్చింది. కల కరిగిపోయింది. మనం ఇక్కడే ఉన్నచోటే ఉన్నాం. ఎక్కడికీ పోలేదు. కాని కల జరిగిన ప్రదేశం మాత్రం ఇదికాదు. ఇక్కడికి చాలా దూరంలో ఉంది. అసలు అది ఏ ప్రదేశమో కూడా తెలియదు. ఈ కల అంతా కల్పన. మనస్సుచేతకల్పించబడిన కల్పన. ఇది మన మనసునందే కల్పించబడింది. కాని ఎక్కడో జరిగింది అనుకుంటున్నాము. అలాగే ఈ జగత్తంతా మన ఆత్మయందే గోచరిస్తున్నది. ఎందుకని? జగత్తు కూడా భ్రమే కాబట్టి. అసలు జగత్తే లేదు. ఇదంతా భ్రమ. రజ్జు సర్పభ్రాంతిలాగా జగత్తంతా అజ్ఞానంతో మనసుచేత ఆత్మలో కల్పించబడింది. అంతేగాని నిజంగా జగత్తే లేదు. ఈ విషయాలన్ని తరచి చూస్తే నేను శుద్ధ స్వరూపుడైన ఆత్మను. ఈ జగత్తంతా నేను ఆక్రమించి ఉన్నాను. కాని నాలో ఏదీ లేదు అంటున్నాడు జనక మహారాజు.

**సశరీర మహో! విశ్వం పరిత్యజ్య మయాంధునా ।**
**కుతశ్చిత్కౌశలాదేవ పరమాత్మా విలోక్యతే ॥ 3**

అహో! నా శరీరాన్ని, శరీరం చూసే దృశ్యాన్ని కూడా వదలిపెట్టి, నా గురు కృపచే పరమాత్మను తెలుసుకుంటున్నాను.

జనకమహారాజు ఆశ్చర్యపోతున్నాడు. ఆహా ! ఏమీ ఆశ్చర్యము. సూక్ష్మశరీరము, కారణ శరీరము, స్థూలశరీరంతో సహా వదిలి పెట్టి, చాలా జాగ్రత్తగా పరిశీలిస్తే

నాకు తెలిసింది ఏమంటే, గురూపదేశము వల్ల, శాస్త్రాభ్యాసము వల్ల నేను పరమోత్కృష్టమైన ఆత్మానందాన్ని అనుభవిస్తున్నాను. మిథ్య అయిన ఈ శరీర త్రయాన్ని గనక పరిశీలిస్తే, శరీరమిథ్య కాబట్టి మిగిలేది ఆత్మ. అదే సత్యము నిత్యము శాశ్వతము. పరమాత్మ అనుభవం కావాలంటే గురూపదేశం, గురుబోధ ఈ రెండూ కావాలి. ఇవే మార్గాలు అంటున్నాడు జనక మహారాజు.

పరమాత్మ గురించి తెలుసుకోవాలంటే సద్గురువు కృప కావాలి.

**గురుర్ బ్రహ్మ గురుర్ విష్ణుః గురుర్దేవో మహేశ్వరః**

**గురుర్ సాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః**

ఆ పరబ్రహ్మ గురువు రూపంలో త్రిమూర్తులుగా ఉన్నాడు.

**1. గురుర్ బ్రహ్మ :** ఆ గురువు బ్రహ్మస్వరూపుడు. బ్రహ్మ అంటే సృష్టి కర్త. ఇక్కడ గురువు శిష్యుడి యొక్క మనస్సులో జ్ఞానము అనే బీజాన్ని నాటతాడు. అందుకని ఆయన బ్రహ్మస్వరూపుడు.

**2. గురుర్ విష్ణుః :** ఆ గురువు శిష్యుని హృదయంలో ఉన్న జ్ఞానబీజాన్ని జాగ్రత్తగా పెంచి పోషిస్తాడు. పోషణ అనేది స్థితికారకుడైన విష్ణువు పని. అందుకని ఆయన విష్ణు స్వరూపుడు.

**3. గురుర్దేవో మహేశ్వరః :** శివుడు అంటే రుద్రుడు. ఇతడు లయకారకుడు. సంహారకర్త. గురువు గారు శిష్యుని హృదయంలో ఉన్న చెడు ఆలోచనలను నాశనం చేస్తాడు. అదే సంహారము. అందుకే ఆయన ఈశ్వరుడు.

**4. సాక్షాత్ పరబ్రహ్మ :** దేవతలు అంటే మానవులకన్న ఎక్కువ శక్తి గలవారు. మానవుల కోరికలు తీర్చగలరు. ధనధాన్యాలు, పుత్రపౌత్రులు, సిరిసంపదలు, అధికారము, పదవులు, కీర్తి ఇలాంటివన్నీ ఇవ్వగలరు. కాని మోక్షం మాత్రం ఇవ్వలేరు. మోక్షం ఇచ్చే శక్తివారి దగ్గర లేదు. మోక్షం ఇవ్వగలవాడు పరమేశ్వరు డొక్కడే. గురువు మోక్షమార్గం చూపుతాడు. అందుకే ఆయన సాక్షాత్తు పరమేశ్వర స్వరూపము అటువంటి గురువుకు నమస్కారము.

**అజ్ఞానతిమిరాంధస్య । జ్ఞానాంజనశలాకయా ।**

**చక్షురున్మీలితం యేన । తస్మైశ్రీ గురవే నమః ॥**

అజ్ఞానాంధకారంతో దృష్టి దోషము వచ్చిన వారికి జ్ఞానాంజనముతో దృష్టి ప్రసాదించే గురువుకు నమస్కారము.

**అఖండమండలాకారం । వ్యాప్తంయేన చరాచరం ।**
**తత్పదం దర్శితం యేన । తస్మైశ్రీ గురవే నమః ॥**

చరాచర జగత్తునందంతటా వ్యాపించి ఉన్న 'తత్' పదవాచ్యుడగు పరమాత్మను దర్శింపజేయు సద్గురువుకు నమస్కారము.

**స్థావరం జగమం వ్యాప్తం । యత్కించిత్సచరాచరం ।**
**త్వం పదం దర్శితం యేన తస్మైశ్రీ గురవే నమః ॥**

స్థావర జంగమాత్మకమైన జగత్తంతా వ్యాపించి ఉన్న 'త్వం' పదవాచ్యుడగు పరమాత్మను దర్శింపచేయు సద్గురువుకు నమస్కారము.

**చిన్మయం వ్యాపితం సర్వం । త్రైలోక్యం సచరాచరం ।**
**అసిత్వం దర్శితం యేన । తస్మైశ్రీ గురవే నమః ॥**

ముల్లోకాలలోను చిద్రూపంగా వ్యాపించి ఉన్న చైతన్యాన్ని 'అసి' పదం ద్వారా దర్శింప చేయు సద్గురువుకు నమస్కారము.

అటువంటి పరమేశ్వర సాక్షాత్కారం చేయించగలిగే గురువు నాకు దొరికాడు. ఆయన కృపతోనే పరమాత్మను తెలుసుకొంటున్నాను. అంటున్నాడు జనక మహారాజు.

**యధా న తో యతోభిన్నా స్తరంగాః ఫేనబుద్బుదాః ।**
**ఆత్మనో న తథా భిన్నం విశ్వమాత్మ వినిర్గతమ్ ॥** **4**

తరంగాలు, కెరటాలు, నురుగు, బిందువులు ఏ రకంగా నీటినుంచి వేరు కావో, ఆత్మలో కనిపించే జగత్తంతా ఆత్మకన్న వేరు కాదు.

సముద్రము అపారమైన జలరాశి. అందులో చిన్న చిన్నగా అలలు, కెరటారులు వస్తుంటాయి. అలలు చిన్నగా ఉంటే కెరటాలు ఉవ్వెత్తున ఎగిసి పడతాయి. కెరటాలు వచ్చినప్పుడు సముద్రపు నురగ వస్తుంది. నీటిబిందువులు ఎగిరి పడుతుంటాయి. చూడటానికి ఇవన్నీ వేరు వేరుగా కనిపిస్తాయి. కాని అవన్నీ సముద్రంలో భాగాలే. అంతా సముద్రపు నీరే. అలాగే ఈ చరాచర జగత్తంతా అజ్ఞానం వల్ల ఆత్మలో

మనసుచే కల్పించబడింది. అది మనోభ్రాంతి. అందుకనే ఈ జగత్తంతా తన అధిష్ఠానమైన ఆత్మకన్న వేరుకాదు. భ్రాంతిచేత కల్పించబడిన వస్తువులు, జ్ఞానం రాగానే తమ అధిష్ఠానంలో లీనమై పోతాయి. అలాగే ఈ జగత్తు కూడా జ్ఞానసముపార్జన కలగగానే తన అధిష్ఠానమయిన పరమాత్మలో లీనమై పోతుంది. అందుచేతనే జగత్తు ఆత్మకన్న వేరు కాదు.

**తంతుమాత్రో భవేదేవ పటో యద్వద్విచారతః ।**

**ఆత్మతన్మాత్రమేవేదం తద్వద్విశ్వం విచారితమ్ ॥ 5**

దారపు పోగులన్నీ ఒక క్రమంలో కలిసి వస్త్రంగా ఏర్పడతాయి. జాగ్రత్తగా పరిశీలిస్తే వస్త్రము అన్నప్పుడు అది దారముల సమూహమే తప్ప వేరుకాదు. అదే విధంగా దృశ్యమానమైన జగత్తంతా ఆత్మచైతన్యమే.

వస్త్రము నూలుపోగులతో చేయబడింది. కాని నూలు పోగులకన్న వేరుగా ఉంటుంది. అయినప్పటికి అది నూలు పోగే. మట్టితో కుండలు తయారుచేస్తాం. వివిధ రకాల పాత్రలు తయారుచేస్తాం. పాత్రల రూపాలు పేర్లు విడిగా ఉంటాయి. కాని అందులో ఉండే మట్టి ఒకటే. అంతా మట్టే. వీటిలో మట్టికన్న వేరైనది ఏదీ లేదు. అలాగే చరాచర జగత్తంతా నేనే వ్యాపించి ఉన్నాను. ఈ జగత్తులో దశదిశలు నేనే. నదులు, సముద్రాలు, పర్వతాలు, లోయలు అంతా నేనే. పంచభూతాలు నేనే. సూర్యచంద్రాదులు నేనే. నాకన్న వేరైనది ఏదీలేదు. జగత్తంతా నేనే వ్యాపించి ఉన్నాను. నేనే ఆత్మను.

**యథైవేక్షురసేక్లుప్తా తేనవ్యాప్తైవ శర్కరా ।**

**తథా విశ్వం మయిక్లుప్తం మయా వ్యాప్తం నిరంతరం ॥ 6**

చెరుకు రసంతో తయారైన పంచదార నిండా ఉండేది చెరుకు రసమే. అదే విధంగా నాలో ఉండే ఈ జగత్తంతా నాచేతనే ఆవరించబడి ఉన్నది.

పంచదార తియ్యగా ఉంటుంది. దానికి ఆ తీపిదనం ఎక్కడ నుంచి వచ్చింది అంటే పంచదార చెరుకురసం నుంచే తయారవుతుంది. అందుకే చెరుకు లక్షణమైన తీపిదనం పంచదారకు వస్తుంది. అలాగే నా యందు కల్పించబడిన జగత్తు అంతా నిత్యానందరూపుడునైన నా చేతనే ఆవరించబడి ఉన్నది. ఈ జగత్తంతా ఆవరించి

ఉన్నది నేనే. నూలు నుంచి తయారైన వస్త్రము నూలు కన్న భిన్నమైనది కాదు. మట్టి నుంచి తయారైన కుండ మట్టికన్న భిన్నమైనది కాదు. చెరుకు నుంచి తయారైన పంచదార చెరుకు కన్న భిన్నమైనది కాదు. అలాగే ఆత్మనుంచి కల్పించబడిన జగత్తు ఆత్మకన్న వేరైనది కాదు.

**ఆత్మజ్ఞానాజ్జగద్భాతి ఆత్మజ్ఞానాన్నభాసతే ।**
**రజ్జ్వజ్ఞానా దహిర్భాతి తద్జ్ఞానాద్భాసతే న హి ॥** **7**

ఆత్మని గురించి తెలియకపోవటం వల్ల, అజ్ఞానం వల్ల ఈ జగత్తు ఉన్నట్లుగా అనిపిస్తున్నది. ఇదంతా రజ్జు సర్పభ్రాంతి.

మసక చీకటిలో త్రోవకు అడ్డుగా పడిఉన్న త్రాడును చూసి పాము అనుకున్నాడు. భయంతో గడగడా వణికి పోయాడు. పెద్దగా అరిచాడు. కేకలు వేశాడు. వెనక ఉన్నవారు పరుగు పెట్టి వచ్చారు. దీపపు వెలుగులో పరీక్షించారు. అది పాముకాదు త్రాడు అని తేల్చారు. ఇప్పుడు అక్కడ పాములేదు. త్రాడే ఉంది. మరి ఇందాకటి దాకా కనిపించిన పాము ఏమై పోయింది? పారిపోయిందా? చచ్చిపోయిందా? మాయమై పోయిందా? అంటే ఏమీ కాలేదు. అసలు అక్కడ పామే లేదు. ఉన్నది అని నువ్వు భ్రమ పడ్డావు. దీపపు వెలుగులో చూస్తే పాముకాదు త్రాడు అని తెలిసింది. దీపపు వెలుగు రాగానే, నీకు జ్ఞానంకలగగానే అప్పటి వరకు భ్రాంతిచేత కనిపించిన పాము తన అధిష్ఠానంలో లీనమయిపోయింది. ఇది లక్షణము. భ్రాంతిచేత కల్పించబడిన వస్తువుల భ్రాంతి పోగానే తను అధిష్ఠానంలో లీనమైపోతాయి. అలాగే భ్రాంతిచేత పరమాత్మ యందు కల్పించబడిన జగత్తు జ్ఞానం కలగగానే భ్రాంతి పోయి పరమాత్మ యందు లీనమై పోతుంది. అప్పుడు జ్ఞానికి మాత్రమేజగత్తు కనిపించదు. అతని దృష్టిలోనే జగత్తు లయమై పోయింది. మిగిలిన వారికి జగత్తు మామూలుగానే ఉంటుంది.

**ప్రకాశో మే నిజం రూపం నాతిరిక్తోస్మ్యహం తతః ।**
**యదా ప్రకాశతే విశ్వం తదాఽహం భాస ఏవ హి ॥** **8**

నేను స్వయంజ్యోతిని. నా ప్రకాశం వల్లనే జగత్తంతా ప్రవర్తిల్లుతున్నది. **బృహదారణ్యకోపనిషత్తు**లో ఒక చిన్న కథ ఉన్నది.

ఒకసారి యాజ్ఞవల్క్యుడు విదేహాధిపతి అయిన జనకుని ఆస్థానానికి వెళ్ళాడు. గురువుగారిని చూడగానే ఎదురేగి స్వాగత సత్కారాలు అందించి కుశల ప్రశ్నలు అయిన తరువాత జనక మహారాజు అంటున్నాడు.

"గురుదేవా! నాకు చిన్న అనుమానం వచ్చింది. అది తీర్చి పుణ్యం కట్టుకోండి" అన్నాడు. ఆ మాట వినగానే అదేమిటో చెప్పమన్నాడు యాజ్ఞవల్క్యుడు.

జనకుడు : మహర్షీ ! మానవుడు ఏ వెలుగువల్ల తన నిత్యకృత్యం సాగిస్తున్నాడు.

యాజ్ఞవల్క్యుడు : సూర్యుని వెలుతురు వల్ల. ఆ వెలుతురు వల్లనే మానవుడు పనిపాటలు నిర్వహించుకుంటాడు. దూరతీరాలకు వెడతాడు. పనులు పూర్తి చేసుకొని తిరిగి వస్తాడు. ఆ వెలుగులో వెళ్ళానుకున్నచోటికి వెడతాడు. చేయదలచుకున్న పని చేసుకుంటాడు.

జనకుడు : మహర్షీ ! మరి సూర్యాస్తమయమైతే పనులు ఏ విధంగా జరుగుతాయి.

యాజ్ఞవల్క్యుడు : సూర్యుడు అస్తమించిన తరువాత చంద్రునియొక్క కాంతులలో ఈ పనులన్నీ జరుగుతాయి.

జనకుడు : సూర్యచంద్రు లిద్దరూ అస్తమించినప్పుడు ఏం జరుగుతుంది మహాత్మా!

యాజ్ఞవల్క్యుడు : రాజా! సూర్యచంద్రులు ఇద్దరూ లేనప్పుడు అన్ని వ్యవహారాలు దీపం లేదా అగ్ని వెలుగులో జరుగుతాయి.

జనకుడు : మహానుభావా! మరి ఆ అగ్నికుడా లేకపోతే ? సూర్యుడస్త మిస్తాడు. చంద్రకాంతి ఉండదు. అగ్ని ఆరిపోతుంది. అప్పుడు మానవుడు ఏ రకంగా పనులు చేస్తాడు?

యాజ్ఞవల్క్యుడు : రాజా! ఆ వెలుగుల స్థానంలో వాక్కు వ్యవహారానికి సహకరిస్తుంది. చీకటిలో ఏమీ కనిపించదు. కాని ఏదో ధ్వని వినిపిస్తే మానవుడు ధ్వని వినిపించిన వైపుకు సాగిపోతాడు.

జనకుడు : మరి ఆ వాక్కు కూడా ఆగిపోతే? అంటే ధ్వనికూడా ఏ మాత్రం వినిపించదు. అప్పుడు ఏం జరుగుతుంది?

యాజ్ఞవల్క్యుడు : జనక మహారాజా! శబ్దాలన్నీ సర్దుమణిగిన తరువాత ఏం జరుగుతుంది? అని కదా అడుగుతున్నావు. జాగ్రత్తగా విను. ఈ వెలుగులకన్నిటికీ అవతల ఆత్మజ్యోతి ఉన్నది. ఆ ఆత్మ ప్రకాశములకు ప్రకాశం. కాంతులకు కాంతి. అటువంటి ఆత్మవల్లనే మానవుడు మనుగడ సాగిస్తాడు.

ఆత్మ కొన్ని కోట్ల సూర్యకాంతులతో ప్రకాశిస్తుంటుంది. అందులోంచి

**అష్టోత్తరశతం వహ్నే। షోడశోత్తరశతం రవేః ।**

**షట్త్రింశ తదుత్తరశతం చంద్రస్య కిరణాశ్మినేః ॥**

108 కిరణాలు అగ్ని, 116 కిరణాలు సూర్యుడు, 132 కిరణాలు చంద్రుడు గ్రహించారు. ఆ వెలుగుల వల్లనే జగత్తు ప్రవర్తిల్లుతున్నది. ఇవన్నీ కూడా ఆత్మ నుంచి వచ్చిన కాంతులే. అందుకే ప్రపంచం కనిపిస్తోంది అంటే కారణం నేనే. నా వల్లనే ప్రపంచం తెలియబడుతోంది.

**అహో ! వికల్పితం విశ్వమజ్ఞానాన్మయి భాసతే ।**

**రూప్యం శుక్తౌ ఫణీ రజ్జౌ వారి సూర్యకరే యథా ॥ 9**

మహాద్భుతమైన విషయం. అజ్ఞానం చేత జనించిన భ్రమ కారణంగా జగత్తంతా నాలోనే ప్రకాశిస్తున్నది. ముత్యపుచిప్పలో వెండి లాగా, త్రాడులో పాములాగా, ఎండమావులలో నీరులాగా, జగత్తంతా నాలో ఉన్నట్లుగా అనిపిస్తున్నది.

ఈ జగత్తు ఎలా కనిపిస్తున్నది అనే విషయాన్ని ఇక్కడ చెబుతున్నారు. జగత్తంతా భ్రమచేత నాలో కల్పించబడింది. అది ఎలా అనే దానికి ఉదాహరణలు ఇస్తున్నారు. ఇక్కడ ఇచ్చిన మూడు ఉదాహరణలు గతంలో మనం చెప్పుకున్నవే. ఒకసారి చెప్పిన విషయాన్ని మళ్ళీ చెప్పటం పునరుక్తి దోషం కాదా? ఇది అనుమానం. సాహిత్యంలో అయితే ఇది దోషమే. కాని ఆధ్యాత్మిక విషయాలు ఒక పట్టాన వంట పట్టవు. అందుకని వాటిని పదే పదే గుర్తు చేసుకోవాలి. అందుకోసమే ఆ విషయాలు గతంలో చెప్పినవైనా మళ్ళీ మళ్ళీ చెప్పటం జరుగుతుంది.

**1. ముత్యపుచిప్ప-వెండి :** సముద్రం మీద తేలియాడుతున్న ముత్యపుచిప్ప తెల్లగా ఎండలో మెరుస్తూ వెండిగిన్నెలాగా భ్రమింపచేస్తుంది. తెలియని వారికి అది వెండిగిన్నె అనిపిస్తుంది. కాని తెలిసిన వారికి నత్తగుల్ల అంతే.

**2. రజ్జువు-సర్పము :** మసకచీకటిలో త్రాడును చూసి పాము అనుకొని గోల చేశాడు. దీపపు వెలుగులో చూస్తే అది పాము కాదు త్రాడు అని తెలిసింది.

**3. మరుమరీచకలు :** ఎడారిలో కనిపించే ఎండమావులు. క్రొత్తగా చూచే వారికి అక్కడ నీరున్నట్లుగా కనిపిస్తుంది. కాని నిజానికి ఏమీ ఉండదు.

ఇవన్నీ భ్రాంతివల్ల కనిపించేవి. ఇదంతా మనసు వల్ల కల్పించబడిన భ్రాంతి. జ్ఞానం కలగగానే భ్రాంతి వదిలిపోతుంది. అప్పుడు ముత్యపుచిప్పలో వెండిపాత్ర ఉండదు. రజ్జువులో సర్పముండదు. ఎడారిలో ఎండమావులు ఉండవు. ఇటువంటి మనోకల్పిత భ్రాంతివల్లనే ఈ జగత్తు కనిపిస్తున్నది. ఆత్మజ్ఞానం కలగగానే ఈ జగత్తంతా లయమై పోతుంది. తన అధిష్ఠానమైన ఆత్మలో కలిసిపోతుంది. అప్పుడు మిగిలేది బ్రహ్మము ఒక్కటే.

**మత్తో వినిర్గతం విశ్వం మయ్యేవ లయమేష్యతి ।**
**మృది కుంభో జలేవీచిః కనకే కటుకం యథా ॥ 10**

ఏ విధంగా కుండ మట్టిలో కలిసిపోతుందో, కెరటం నీటిలో కలిసిపోతుందో, ఆభరణం బంగారంలో కలిసిపోతుందో అదే విధంగా నాలో భాసించే జగత్తు నాలోనే లయమయిపోతుంది.

ఇందాక చెప్పిన విషయాన్నే మరి కొన్ని ఉదాహరణలతో మళ్ళీ చెబుతున్నారు.

1. మట్టితో కుండలు, ఇతర పాత్రలు తయారుచేస్తారు. పాత్రల ఆకారము, పేరు వేరయినా అందులో ఉన్న మట్టి ఒకటే. అంతా మట్టే. కుండలు, పాత్రలు మట్టి కన్న వేరు కావు.

2. బంగారం కరిగించి రకరకాల ఆభరణాలు తయారుచేస్తారు. ఆభరణాల పేర్లు వేరైనా, ఆకారము రూపము వేరైనా అందులో ఉండే బంగారం ఒకటే. ఆభరణాలు బంగారం కన్న వేరు కావు.

3. సముద్రంలో అనేక కెరటాలు, నురుగు వస్తుంటాయి. ఇవేవి సముద్రం కన్న వేరు కావు.

అలాగే నా నుంచి కల్పించబడిన జగత్తు నాకన్న వేరు కాదు. ఆత్మజ్ఞానం కలగగానే జగత్తంతా నాలోనే లయమై పోతుంది.

**అహో ! అహం నమోమ్యహం వినాశో యస్య నాస్తిమే ।**

**బ్రహ్మాది స్తంబ పర్యంతం జగన్నాశేఽపి తిష్ఠతి ॥ 11**

ఓహో ! నేను అద్భుతంగా ఆశ్చర్యంగా అమితానందంగా ఉన్నాను. నన్ను నేనే అభినందించుకుంటున్నాను. బ్రహ్మాది స్తంబపర్యంతం జగత్తంతా నశించినా నేను మాత్రం శాశ్వతంగా ఉన్నాను.

నేను పరబ్రహ్మ స్వరూపాన్ని నాకు జన్మమృత్యుజరాదులు లేవు. నేను దేనికీ ఉపాదాన కారణంగాను. నిమిత్త కారణం కాను. నేను జగత్తుకు వివర్తము అవుతున్నాను.

పరబ్రహ్మకు జన్మమృత్యు జరాదులు లేవు. పరమేశ్వర స్వరూపాన్ని చెబుతూ **దేవీ భాగవతంలో**

**కోటిసూర్య ప్రతీకాశం చంద్రకోటి సుశీతలం**

**విద్యుత్కోటి సమానాభమరుణం తత్పరం మహః ।**

**నైవ చోర్ధ్వం నతిర్యక్చ నమధ్యే పరిజగ్రభత్**

**ఆద్యంత రహితం తత్తు నహస్తా ద్వంగసంయుతం**

**నస్త్రీరూపం అథవాన పుంరూపం అథోభయమ్**

తారకాసుర సంహారం కోసం దేవతలు మునులు, ఋషులు అందరూ అనేక రకాలుగా పరమేశ్వరిని ప్రార్థించారు. ఆ సమయంలో

చైత్ర శుద్ధ నవమి శుక్రవారంనాడు ఆ పరంజ్యోతి పరాత్పరి వారికి ప్రత్యక్షమైంది. ఆవిడ కొన్ని కోట్ల సూర్యులకాంతితో, కొన్ని కోట్ల చంద్రుల చల్లదనంతో, కొన్ని కోట్ల విద్యుల్లతలు ఒక్కసారి మెరిసినట్లుగా అమితమైన చెప్పలేని కాంతితో ప్రకాశిస్తున్నది. ఆ స్వరూపానికి పైన లేదు, క్రింద లేదు, మధ్య లేదు. ఆది లేదు.

అంతం లేదు. ఆ రూపానికి కాళ్ళు చేతులు మొదలైన అంగాలు లేవు. అది స్త్రీ కాదు. పురుషుడు కాదు నపుంసకుడు అంతకన్నా కాదు. అది పరమేశ్వర స్వరూపము. నిరాకారము. ఆ పరమాత్మ ఈ జగత్తుకు కేవలము ఉపాదాన కారణం కాదు. నిమిత్త కారణం అంతకన్న కాదు. మట్టితో కుమ్మరివాడు కుండలు తయారుచేస్తున్నాడు. కుండకు మట్టిఉపాదాన కారణం. కుమ్మరివాడు నిమిత్త కారణం. జగత్తుకు ఉపాదాన నిమిత్త కారణాలు రెండూ బ్రహ్మమే. జగదుత్పత్తికి కారణాలు రెండు. 1. ఆరంభ పరిణామము దారపు పోగులు కలిసి వస్త్రంగా ఏర్పడతాయి. మొదట ఉన్న లక్షణాలు పోకుండానే క్రొత్త వస్తువు ఆవిర్భవిస్తుంది. క్రొత్తగా వచ్చిన వస్త్రంలో నూలు పోగు లక్షణాలుంటాయి. 2. వివర్త పరిణామము. ఇందులో ప్రారంభంలో ఉన్న లక్షణాలు పోయి క్రొత్త లక్షణాలు వస్తాయి. పాలుతోడు వేస్తే పెరుగుతుంది. కాని పెరుగులో పాల లక్షణాలు గాని, రూపంగాని, ఉండవు. ఈ రకంగా జగత్తు ఆవిర్భవిస్తున్నది. ఇందులో **బ్రహ్మాదిస్తంబపర్యంతము** అంటే పిపీలికాది బ్రహ్మపర్యంతము చీమ మొదలు బ్రహ్మ వరకు, గడ్డిపోచ మొదలు బ్రహ్మ వరకు ఉన్న జగత్తంతా నాశనమైనా నేను మాత్రం నాశనం కాను అంటున్నాడు జనకమహారాజు. ఇక్కడ సృష్టి, ప్రళయము రెండూ చూద్దాం. పరబ్రహ్మము నుంచి ముందుగా అవ్యక్తము వచ్చింది. అదే సత్త్వగుణము మాయ.

| | | |
|---|---|---|
| అవ్యక్తము నుంచి | – | మహత్తత్త్వము వచ్చింది. ఇది రజోగుణము, హిరణ్యగర్భుడు. |
| మహత్తత్త్వము నుంచి | – | అహంకారము వచ్చింది. ఇది తమోగుణము. విరాడ్రూపము. |
| అహంకారం నుంచి | – | తన్మాత్రలు |
| తన్మాత్రల నుంచి | – | పంచభూతాలు. వీటిలో ముందుగా ఆకాశం వచ్చింది. |
| ఆకాశము నుంచి | – | వాయువు ఆవిర్భవించింది |
| వాయువు నుంచి | – | అగ్ని ఉద్భవించింది |
| అగ్ని నుంచి | – | జలము ఉద్భవించింది |
| జలము నుంచి | – | భూమి ఆవిర్భవించింది. |

ఈ రకంగా చరాచర జగత్తు ఆవిర్భవించింది. ప్రళయం సమయంలో క్రింది నుంచి పైకి పోతుంది. ముందుగా

| | | |
|---|---|---|
| భూమి | – | జలంలో కలిసిపోతుంది |
| జలం | – | అగ్నిలో కలిసిపోతుంది |
| అగ్ని | – | వాయువులో కలిసిపోతుంది |
| వాయువు | – | ఆకాశంలో కలిసిపోతుంది |
| ఆకాశం | – | అహంకారంలో కలిసిపోతుంది |
| అహంకారం | – | మహత్తత్త్వంలో లీనమవుతుంది |
| మహత్తత్త్వం | – | అవ్యక్తంలో లీనమవుతుంది |
| అవ్యక్తం | – | పరబ్రహ్మలో లీనమవుతుంది |

ఆ తరువాత బ్రహ్మము మొక్కటే మిగులుతుంది. అందుకే జనకుడు అంటున్నాడు. **జగత్తంతా నశించినా నేను శాశ్వతంగా ఉంటాను.**

**వరాహోపనిషత్తు**లో చెప్పినట్లుగా

**సర్వభూతాంతరాస్థాయినిత్యముక్త చిదాత్మనే**
**ప్రత్యక్చైతన్యరూపాయ మహ్యామేవ నమోనమః ॥**

అన్ని ప్రాణుల యందు చిద్రూపంగా నివసిస్తూ నిత్యముక్తుడనై చైతన్య రూపంగా ఉన్న నాకు నేను నమస్కరించుకుంటున్నాను.

**అహో ! అహం నమో మహ్యామేకోహం దేహవానపి ।**
**క్వచిన్నగంతా నాగంతా వ్యాప్యవిశ్వమవస్థితః ॥ 12**

అద్భుతమైన నాకు నమస్కారము. శరీరంతో ఉన్నప్పటికీ నేను ఎక్కడి నుండి రాలేదు. ఎక్కడికీ పోవటము లేదు. జగత్తంతా ఆక్రమించి ఏకంగా ఉన్నాను.

సుఖదుఃఖాలతో కూడిన వివిధ శరీరాలున్నప్పటికీ సర్వాత్మను నేనొక్కడినే. వేరు వేరు కుండలలో ఉన్న నీటిలో సూర్యుడు వేరుగా కనిపించినప్పటికీ, ఆకాశంలో ఉన్నది ఒకడే సూర్యుడు, అలాగే నేను జగత్తంతా ఆవరించి అంతటా ఉన్నాను. అంతేకాని ఎక్కడ నుంచీ రాను. ఎక్కడికీ పోను. నాకు గమ్యస్థానము వేరుగా లేదు. నాలోనే జగన్నాటకమంతా కనిపిస్తున్నది.

**అహో ! అహం నమోమహ్యం దక్షో నాస్తీహ మత్సమః ।**

**అసంస్పృశ్య శరీరేణ యేన విశ్వం చిరంధృతమ్ ॥** **13**

అద్భుతమైన నన్ను నేను అభినందించుకుంటున్నాను. ఈ జగత్తును సృష్టించకుండానే అనాదిగా ధరిస్తున్నాను. ఇది నాకు మాత్రమే తెలుసు. నాకన్న సమర్థులు ఎవరూ లేరు. ఇంధనం (చమురు) లేకుండా కాగడా ఎక్కువ కాలం వెలగదు. అలాగే ఆత్మజ్యోతి లేకుండా జీవులు మనుగడ సాగించవు. జగత్తును సృష్టించక ముందు నుంచీ ఈ జగత్తును ధరిస్తున్నాను. నేను చాలా గొప్పవాడిని. నాకన్న సమర్థుడు ఇంకొకడు లేడు.

ప్రళయం సంభవించినప్పుడు భూమి – నీటిలో, నీరు – నిప్పులో, నిప్పు – వాయువులో, వాయువు – ఆకాశంలో, ఆకాశం – అహంకారంలో, అహంకారం – మహత్తత్త్వంలో, మహత్తత్త్వం – అవ్యక్తంలో, అవ్యక్తం – పరమేశ్వరుడిలో లీనమై పోయినాయి. ఇప్పుడు మిగిలింది పరమేశ్వరు డొక్కడే.

సృష్టి ప్రారంభానికి ముందు చరాచర జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని పరమేశ్వర స్వరూపం ఆక్రమించింది. అంటే జగత్తంతా పరమేశ్వర మయంగా ఉండేది. అందుకే ఈ జగత్తును సృష్టించక ముందు నుంచీ నేను దీనిని ధరిస్తూనే ఉన్నాను. అంటున్నాడు. ఆ తరువాత కొంత కాలానికి సృష్టి ప్రారంభమైంది. ఇప్పుడు పరమేశ్వరుడి నుంచి మొదటగా అవ్యక్తం వచ్చింది.

అవ్యక్తము నుంచి – మహత్తత్త్వము

మహత్తత్త్వము నుంచి – అహంకారము

అహంకారం నుంచి – తన్మాత్రలు

తన్మాత్రల నుంచి – వాటి స్థూలరూపాలైన పంచభూతాలు వచ్చాయి. పంచభూతాలలో మొదటగా వచ్చింది ఆకాశము.

ఆకాశము నుంచి – వాయువు

వాయువు నుంచి – అగ్ని

అగ్ని నుంచి – జలము

జలము నుంచి – భూమి

భూమి నుంచి - ఓషధులు

ఓషధుల నుంచి - అన్నము వచ్చాయి

ఆ తరువాత జీవరాసి ఏర్పడింది. జీవరాశిని సృష్టించిన తరువాత ఈ దేహంలో నేను ఉండకపోతే ఎలా అని బ్రహ్మరంధ్రం గుండా మానవదేహంలోను, కాలిగిట్టల గుండా పశువులలోను, అలాగే 84 లక్షల రకాలైన జీవరాసిలోను ప్రవేశించాడు పరబ్రహ్మ. ఈ రకంగా చూస్తే సృష్టి ప్రారంభానికి ముందు ఈ జగత్తంతా పరమేశ్వరుడే ఆక్రమించి ఉన్నాడు. అలాగే సృష్టి తరువాత కూడా జగత్తంతా పరమేశ్వరుడే ఆక్రమించి ఉన్నాడు. అదే విషయాన్ని ఇక్కడ చెబుతున్నాడు. సృష్టి ప్రారంభం కాక ముందు నుంచీ పరమేశ్వరుడు జగత్తును ధరిస్తున్నాడు.

జగత్తంతా నా ప్రకాశము వల్లనే ప్రవర్తిల్లుతున్నది. దీనికి నిదర్శనంగా **బృహదారణ్యకోపనిషత్తు**లో ఒక కథ ఉంది. దాన్ని ఈ అధ్యాయంలోనే ఏడవ శ్లోకంలో చెప్పాం.

పరమేశ్వర స్వరూపం దివ్యమైన కాంతులు వెదజల్లుతుంది. కొన్నికోట్ల సూర్యులకాంతి, కొన్ని కోట్ల మెరుపుతీగల కాంతి. ఇవేవీ దానికి సరికావు. ఆ కాంతిలోంచి అగ్ని – 108 కిరణాలు, సూర్యుడు – 116 కిరణాలు, చంద్రుడు – 136 కిరణాలు తీసుకున్నారు. ఈ కిరణముల వల్లనే జగత్తంతా ప్రవర్తిల్లుతున్నదని యామళగ్రంథాలు చెబుతున్నాయి. ఈ మొత్తం కలిపితే 108+116+132 = 360 ఇవి డిగ్రీలు. పరమేశ్వరుడు బిందురూపంలో ఉన్నాడు అనటానికి ఇది నిదర్శనము. సంవత్సరానికి 360 రోజులు. **హయనాత్మా మహాదేవః ప్రజాపతి రితిస్మృతిః** అందుకే పరమేశ్వరుడు కాలపురుషుడు. ఈ విషయాలే చెప్పి నాకన్న గొప్పవాడు ఇంకెవరూ లేరు అంటున్నాడు జనక మహారాజు.

**అహో ! అహం నమోమహ్యం యస్య మే నాస్తికించన ।**
**అథవా యస్యమే సర్వం యద్వాఙ్మానసగోచరం ॥ 14**

ఆత్మనైన నాకు నమస్కారము. నాలో ఏదీలేదు. వాక్కుకు మనసుకూ గోచరించేవన్నీ నాలోనే ఉన్నాయి.

పరమేశ్వర స్వరూపం నిరాకారము నిర్గుణము. ఆ స్వరూపంలో ఏదీలేదు. అది అవాఙ్మానస గోచరము. చరాచర జగత్తంతా పరమేశ్వరునిలోనే కల్పించబడింది. అందుచేత వాక్కుకు మనస్సుకు గోచరించేవన్నీ నాలోనే ఉన్నాయి. అంటున్నాడు. ఈ లోకంలో ఎప్పుడు ఎక్కడ ఏం జరిగినా పరమేశ్వరుడికి వెంటనే తెలుస్తుంది. పంచభూతాలు, సూర్యుడు, చంద్రుడు, యముడు ఆయనకు వేగులు.

సత్యము మూడు విధాలుగా ఉంటుంది.

**1. ప్రాతిభాసికము :** కలలో మాత్రమే కనిపించి మెలకువ రాగానే కరిగిపోయేది.

**2. వ్యావహారికము :** జగద్వ్యాపార సమర్థమైనది

**3. పారమార్థికము :** త్రికాలములందు స్థిరంగా ఉండేది.

ఆత్మ పారమార్థిక సత్యము. నిన్న ఉంది. ఇవాళ్ళ ఉన్నది. రేపు ఉంటుంది. ఆత్మకు శరీరంతో గల సంబంధము అంతా మిథ్య. బంగారంతో ఆభరణాలు తయారు చేసినప్పటికీ అందులో ఉండేది బంగారమే. అలాగే చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్న నాకు నమస్కారము.

**జ్ఞానం జ్ఞేయం తథాజ్ఞాతా త్రితయం నాస్తివాస్తవమ్ ।**
**అజ్ఞానాద్భాతి యత్రేదం సోఽహమస్మి నిరంజనః ॥ 15**

జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము అనేవి నాలో లేవు. నేను పరిశుద్ధమైన ఆత్మ చైతన్యాన్ని అజ్ఞానం వల్ల నాలో త్రిపుటి ఉన్నట్లుగా అనిపిస్తోంది.

జ్ఞాత – తెలుసుకొనే వాడు, జ్ఞానము – తెలియబడేది. జ్ఞేయము – తెలియబడటము. ఈ మూడింటినీ కలిపి త్రిపుటి అంటారు. ఇదంతా అంటే త్రిపుటి అనేది మాయాకల్పితము. అంతే కాని పారమార్థికంగా లేదు. అజ్ఞానంతో ఈ జగత్తంతా నాలో ఉన్నట్లుగా అనిపిస్తోంది. ఈ జగత్తుతో నాకు ఏ సంబంధము లేదు. నేను నిరంజనుడను. అవధూత గీతలో

**ధ్యాతా న తే హి హృదయే న చ తే సమాధిః**
**ధ్యానం న తే హి హృదయే న బహిః ప్రదేశః ।**
**ధ్యేయం న చేతి హృదయే న హి వస్తుకాలో**
**జ్ఞానామృతం సమరసం గగనోపమోహమ్ ॥**

ధ్యానం లేదు, ధ్యానించేవాడు లేడు. సమాధి లేదు. హృదయానికి బాహ్యంగా ఏదీలేదు. హృదయంలో వస్తువులు, కాలము లేవు. జ్ఞానామృతంతో సమచిత్తంతో నేనే ఉన్నాను.

**ద్వైతమూల మహోదుఃఖం నాన్యత్తస్యాస్తి భేషజమ్ ।**
**దృశ్యమేతన్మృషా సర్వం ఏకోఽహం చిద్రసోఽమలః ॥ 16**

అన్ని దుఃఖాలకు ద్వైతమే మూలము. ఈ దుఃఖం పోవాలంటే దృశ్యమానమైన వన్నీ మిథ్య. నేను అంటే ఆత్మ జగత్తులో ఉన్నది ఆత్మ ఒక్కటే రెండవది లేదు అని తెలుసుకోవాలి.

అసలు దుఃఖము అనేది ఎందుకు వస్తుంది. మనం కోరుకున్నవి పొందక పోవటం చేత. కోరుకున్నవి పొందితే దుఃఖం ఉండదా? ఉంటుంది. విపరీతమైన ధనం కావాలి అనుకున్నాము. ధనం లభించింది. దాన్ని జాగ్రత్త చేసుకోవాలి. దొంగలబారి నుండి రక్షించుకోవాలి. ఎవరైనా పట్టుకుపోతే దుఃఖం తప్పదు. వీటన్నింటికీ మూలకారణం కోరిక. అసలు కోరిక ఎందుకు వస్తుంది. మనకన్న ఇతరమైనది ఏదైనా ఉంటే, దాన్ని పొందాలని కోరిక. మనకన్న ఇతరమైనది ఉన్నది అంటే అది ద్వైతమే. ఆ ద్వైతం నాశనమయితే కాని దుఃఖం పోదు. సామాన్యంగా ఒకటే.

**అద్వైతము** అంటే – రెండు కానిది. ఒకటిగానే ఉన్నది.

**ద్వైతము** అంటే – రెండవది ఉన్నది అని అర్థం.

అయితే వైష్ణవులు చెప్పేది ద్వైతమని, స్మార్తులు చెప్పేది అద్వైతమని అనుకుంటారు. ఇది నిజమే. శంకరులవారు రెండవది లేదు అన్నారు. రామానుజులు, మధ్వాచార్యుల వారు రెండవది ఉన్నది. జీవాత్మ వేరు, పరమాత్మ వేరు అన్నారు. ఇవి మతాలు. వారు నమ్మిన సూత్రాలు. ఇప్పుడు మనం చూస్తున్న అష్టావక్రగీత అద్వైత సిద్ధాంతాన్ని అనుసరించి చెప్పబడింది. అందుకే ద్వైతాన్ని నశింప చేయాలి అంటున్నారు. ఇక్కడ ద్వైతము అంటే ద్వైతభావన. నాకన్న వేరుగా ఇంకొకరున్నారు అనే భావనను నశింపచెయ్యాలి. **ఇక్కడ మనం వద్దనేది ద్వైతభావాన్ని అంతేకాని ద్వైతమతాన్ని కాదు.** నేను తప్ప జగత్తులో ఇంకొకటి లేదు అని తెలిసినప్పుడు

ఇంకా కోరిక ఎందుకుంటుంది? ఏమీ లేదు కదా? మరి ఏది కావాలని ఉంటుంది? అందుకే ద్వైతాన్ని నాశనం చేస్తేనే మోక్షం సిద్ధిస్తుంది అంటారు అద్వైతులు.

**బోధమాత్రోఽహ మజ్ఞానాదుపాధిః కల్పితోమయా ।**

**ఏవం విమృశ్యతో నిత్యం నిర్వికల్పే స్థితిర్మమ ॥ 17**

నేను శుద్ధ చైతన్యాన్ని. అజ్ఞానం వల్ల నన్ను దేహిగా నేను భావిస్తున్నాను. జ్ఞానంతో అన్ని వృత్తులూ వదిలి స్వరూప ధ్యానంతో నా స్థితిలో నేను ఉండిపోతాను.

పారమార్థికంగా గనక ఆలోచిస్తే నేను చిన్మాత్రుడను. చిదేక రసరూపుడను. మాయవల్ల, భ్రమవల్ల, అజ్ఞానం వల్ల నా యందు ద్వైత ప్రపంచము కల్పించబడింది. అలా కల్పించబడటం కూడా నా మాయవల్లనే జరుగుతున్నది. ఇలా ప్రతిక్షణము ఆలోచిస్తూ ఉంటే మనలో ఉన్న ద్వైతభావన నశించి, అద్వైతానుభూతి కలుగుతుంది.

**అహోమయిస్థితం విశ్వం వస్తుతో న మయిస్థితం ।**

**నమేబంధోస్తిమోక్షోవా భ్రాంతిశ్శాంతా నిరాశ్రయా ॥ 18**

ఈ జగత్తంతా నాలోనే ఉన్నట్లుగా కనిపిస్తున్నా, నిజానికి నాలో ఏమీ లేదు. నాకు బంధము లేదు మోక్షము లేదు. అజ్ఞానం నశించటంతో భ్రాంతి కూడా నశించింది.

నేను ఎప్పుడూ చిద్రూపుణ్ణే. నాకు నిజంగా బంధమోక్షాలు లేవు అంటున్నాడు. పరమేశ్వరుడు చిదానందరూపుడు. ఎల్లప్పుడూ ఆనంద డోలికలలో తేలియాడుతుంటాడు. అందుకే భగవత్పాదుల వారు అంటారు. **చిదానందరూప శ్శివోహమ్ శ్శివోహమ్.**

**తైత్తిరీయోపనిషత్తు**లో చెప్పినట్లుగా మానుషానందానికి కొన్ని కోట్ల రెట్లు ఉంటుంది బ్రహ్మానందం. అటువంటి బ్రహ్మానందంలో ఓలలాడుతుంటాడు పరమేశ్వరుడు. అన్ని వేళలయందు కూడా అలాగే ఉంటాడు. చిత్ అనే జ్ఞానము నందు ఉండేవాడు. జ్ఞానము చేత వచ్చిన ఆనందము నందుండే వాడు. అంతకు మించిన ఆనందం ఇంకొకటి లేదు. జనకుడు మహాజ్ఞాని. తాను పరమేశ్వర తత్త్వాన్ని తెలుసుకున్నాడు. స్వయంగా పరమేశ్వరుడైనాడు. అందుకే నేను చిదానందుడను అంటున్నాడు.

పరతత్త్వానికి నేను నాది అనే అహంకార మమకారాలు లేవు. అహంకారం ఉంటేనే బంధము అనేది ఏర్పడుతుంది. ఇప్పుడు తనకు అవి ఏవీ లేవు కాబట్టి బంధము లేదు అంటున్నాడు. లౌకికమైన బంధాలు లేకపోవటమే ముక్తి. అదే మోక్షము అని కూడా అంటున్నారు. బంధాల నుండి విడివడటమే ముక్తి. అసలు బంధాలే లేవు అన్నప్పుడు, లేని బంధాల నుండి ఏ రకంగా విడివడతాడు. అతడు సదాముక్తుడు. పరమేశ్వరుడికి ఎవరూ లేరు ఏ రకమైన బంధము లేదు. అందరికీ తానున్నాడు. తనకూ ఎవరూ లేరు. ఇదే మాట వామనావతార ఘట్టంలో చెప్తాడు.

**ఒరులుగారునాకు ఒరులకు నేనౌదు**

**ఒంటివాడను చుట్టమొకడు లేడు**

అందుకే నాకు బంధ మోక్షాలు లేవు. ఇంతవరకు ఉన్నదంతా అజ్ఞానంతో కూడిన భ్రాంతి. ఇప్పుడు శాస్త్రవిచారము చేశాను. గురూపదేశాలు విన్నాను. నాకు జ్ఞానోదయమయింది. నాకు ఎవరూ లేరు. ఉన్నారనేదంతా భ్రాంతి. ఆ భ్రాంతి కాస్తా ఇప్పుడు నశించిపోయింది. అజ్ఞానం వల్ల నాలో ఆరోపించబడిన విశ్వం అనే భ్రమ కాస్తా తొలగిపోయింది. శాస్త్ర విమర్శచేత భ్రాంతి పోయింది. అజ్ఞానం నశించింది. ఇలా చెయ్యని వారికి అజ్ఞానం తొలగిపోదు. ముక్తి రాదు.

ఇదంతా భ్రమర కీటక న్యాయము. తుమ్మెద పేడపురుగును తెచ్చి, పేడకు అంటించి, ప్రతిరోజు 'ఝుం' అంటూ దానిచుట్టూ తిరుగుతుందట. అలా కొంత కాలం జరిగే సరికి పేడపురుగు తన అస్థిత్వాన్ని కోల్పోయి తానుకూడా ఝుంకారం చేస్తూ బయటకు వస్తుంది. అలాగే ఎవరైనా సరే ప్రతిదినము **'నేను పరమాత్మ స్వరూపాన్ని, నాకు బంధమోక్షాలు లేవు.'** అని త్రికరణ శుద్ధిగా సర్వకాల సర్వావస్థల యందు భావన చేస్తుంటే, కొంత కాలానికి బంధాలు విడివడి అతడే ముక్తపురుషుడౌతాడు. ఇందులో సందేహం ఏ మాత్రము లేదు అంటున్నారు **స్వామి పరమానంద నాథులు.**

**న శరీరమిదం విశ్వం న కించిదపి నిశ్చితమ్ ।**

**శుద్ధచిన్మాత్ర ఆత్మా చ తత్కస్మిన్కల్పనాఽధునా ॥ 19**

ఈ శరీరం మిథ్య. జగత్తు మిథ్య. ఈ విషయం నాకు తెలుసు. ఆత్మ ఎప్పుడూ పరిశుద్ధమైనది. చైతన్య స్వభావం గలది. నేనే ఆత్మని. ఇంక నాకేం కావాలి?

శరీరోపాధులతో కూడిన జగత్తంతా సత్యమా, అసత్యమా అంటే ఒక్క విషయం చూడండి. ఆత్మ ఎప్పుడూ చిన్మాత్ర స్వరూపము. శుద్ధము, బుద్ధము. మాయా శూన్యము. మలశూన్యము. ఇక జగత్తు అనేది అజ్ఞానంతో శుద్ధమైన ఆత్మయందు కల్పించబడుతున్నది. గురూపదేశము శాస్త్రవిచారముల వల్ల అజ్ఞానం నశించింది. జగత్తు అజ్ఞానం వల్ల కల్పించబడింది కదా? మరి ఆ అజ్ఞానమే నశిస్తే ఇంక జగత్తు ఎక్కడుంది? లేనటువంటి జగత్తుకు సత్యాసత్యాల ప్రశ్న ఎలా వస్తుంది? కల్పించబడిన జగత్తంతా మిథ్య.

**శరీరం స్వర్గనరకౌ బంధమోక్షౌ భయం తథా ।**
**కల్పనా మాత్రమే వై తత్కింమే కార్యం చిదాత్మనః ॥ 20**

ఈ శరీరము, స్వర్గం, నరకం, బంధం, మోక్షం, భయము ఇవన్నీ కేవలము కల్పనలు. వీటివల్ల ప్రయోజనం లేదు. వీటన్నింటికీ ఆధారమైన చైతన్యమే నేను.

ఉపాధికి సంబంధించినవే స్వర్గనరకాలు. ఇవన్నీ కల్పనామాత్రము. అంతేకాని నిజంకాదు. ఆకాశంలో ప్రకాశిస్తూ వెలుగులు ఇచ్చే సూర్యుడికి మబ్బులు అడ్డు వచ్చినా, అడ్డు రాకపోయినా సూర్యుడికి వచ్చే లాభనష్టాలు ఏవీలేవు. అలాగే చిదాత్మనైన నాకు ఈ ఉపాధులతో పని ఏమిటి? బంధమోక్షాల గురించి అజ్ఞానులకు చెప్పాలి. ఆత్మస్వరూపినైన నాకు బంధం ఏమిటి? మోక్షం ఏమిటి? వాటిని గురించి చెప్పే శాస్త్రాలవల్ల నాకు ఏ రకమైన ప్రయోజనం ఉంది?

గతజన్మలలో చేసిన కర్మల ఫలితంగా వచ్చింది ఈ దేహము. దేహానికి సంబంధించినవి స్వర్గనరకాలు. అసలు నేను కర్మ చేయను. ఇంతవరకు సముపార్జించిన జ్ఞానంతో నా కర్మ అంతా క్షయమయిపోయింది. కాబట్టి దేహం లేదు. ఒకవేళ ఉన్నది అనుకున్నా దేహానికీ నాకు ఏ సంబంధము లేదు. స్వర్గనరకాలు, బంధమోక్షాలు ఆ దేహానివి. నాకు వాటితో సంబంధం లేదు. నేను చిదాత్మను. చాలా అద్భుతంగా ఉంది. ఇప్పుడు నేను జనం మధ్య ఉన్నాను. కాని నాకు రెండవదేదీ కనపడడం లేదు. భయంకరమైన అరణ్యంలో ఉన్నట్లుగా ఉన్నది. ఇంక నాకు దేనిమీదయినా కోరిక ఎలా కలుగుతుంది?

**అహో ! జన సమూహేఽపి న ద్వైతం పశ్యతో మమ ।**
**అరణ్యమివ సంవృత్తం క్వ రతిం కరవాణ్యహమ్ ॥ 21**

ద్వైతమనేది పూర్తిగా నశించిపోయింది. నాలో ఇక ద్వైతభావన లేదు. నేను తప్ప నాకు ఈ జగత్తులో ఎవరూ కనపడటం లేదు. రెండవది ఏదీలేదు. జనం మధ్యలో ఉన్నా అరణ్యం మధ్యలో ఉన్నా తేడా ఏమీ లేదు. అంతా ఒకటిగానే ఉంది. ఈ జగత్తంతా మిథ్యాకల్పితము. ఇందులో ఏదీ సత్యంకాదు. అంతా భ్రమ. అంతా మిథ్య. అటువంటప్పుడు నేను ఏమి కోరగలను? ఏ వస్తువును ప్రేమించ గలను? అంటున్నాడు. ఇక్కడ ఒక చిన్న ఉదాహరణ చూడండి.

ఉనికి లేని రాజ్యాన్ని రూపం లేని రాజు పాలిస్తుండే వాడు. అతనికి ఇంకా జన్మించని కుమారులు ముగ్గురున్నారు. వారు వంధ్యా పుత్రులు. వారంతా ఒకరోజున ఎగిరే గుర్రాలమీద బయలుదేరి ఆకాశరాజుతో యుద్ధం చేసి ఆకాశాన్ని ఆక్రమించి, అందులో అందమైన పెద్ద భవనం కట్టారు. మెరుపు తీగలతో దీపాలు ఏర్పాటు చేశారు. వారు నీరు లేని కొలనులలో చేసి, ధరించటానికి వీలులేని దుస్తులు ధరించి, ఆకాశంలో విహరిస్తూ హాయిగా ఉన్నారు.

ఈ కథలాంటిదే ఈ జగత్తు కూడా. ఉనికి లేని రాజ్యం, రూపం లేని రాజు, ఇంకా జన్మించని కుమారులు, వంధ్యాపుత్రులు అంటే గొడ్రాలి కుమారులు. ఇవేవీ నిజం కాదు. జ్ఞాని దృష్టిలో అలాంటిదే ఈ జగత్తు. అజ్ఞానం వల్ల ఉన్నట్లుగా కనుపించే వస్తువుల యందు నాకు ప్రేమ లేదు అంటున్నాడు జనక మహారాజు.

**నాహం దేహో న మే దేహః జీవో నాహమహం హి చిత్ ।**
**అయమేవ హి మే బంధ ఆసీద్యా జీవితే స్పృహా ॥ 22**

నేను శరీరం కాదు. నాకు శరీరం లేదు. నేను జీవుణ్ణి కాదు చైతన్యాన్ని. దేహము జడము. నేను చైతన్యాన్ని. కాబట్టి దేహము నాది కాదు. నాకు ఏ రకమైన సంబంధాలు లేవు. మిత్రులు, శత్రువులు, భార్య, పిల్లలు ఎవరూ లేరు. నేను దేనికీ కర్తనికాదు. భోక్తని అంతకన్నా కాదు. కేవలము చిదానందరూపుడను. గతంలో ఉపాధి యందు ఉన్న స్పృహయే ఇప్పుడు నాకు బంధం అయింది. లోకంలో బ్రతకటం కోసం ధనార్జన చేస్తాము. ఆ ధనాన్ని ఎలా ఖర్చు పెట్టాలి? ఎలా దాచుకోవాలి? రేపటి అవసరాలు ఎలా తీర్చుకోవాలి? వీటిని గురించి ఆలోచన ఇవే బంధాలవుతాయి. దీన్ని జీవితేచ్ఛా బంధము అంటారు. ఇదంతా జ్ఞాన సముపార్జనకు ప్రతిబంధక మవుతుంది. అందుచేత అసలు ఉపాధి ఉండకూడదు.

లేదా ఉపాధి యందు స్పృహ ఉండకూడదు. సద్గురువు ఆశ్రయించి అతని బోధనలు వింటూ, ఏ రకమైన బంధాలు లేక చిద్రూపంగా ఉన్న నాకు జీవితం అంటే ఇంకా కోరిక ఎందుకుంటుంది?

**అహో ! భువన కల్లోలైర్విచిత్రైర్ద్రాక్సముత్థితమ్ ।**
**మయ్యనంత మహాంభోధౌ చిత్తవాతే సముద్యతే ॥ 23**

చాలా గొప్పదైన విషయం. అనంత చైతన్య సాగరాన్ని నేను. నాలో మానసిక కల్లోలం నుండి అనేకానేక తరంగాలు ప్రపంచం రూపంలో ఒక్క క్షణంలో ఆవిర్భవిస్తాయి.

ఇది చాలా గొప్పగాను వింతగాను కూడా ఉంది. నా యందు చిత్తము వాయువు బయలుదేరి అనేక రకాలయిన అందమైన తరంగాలు ఉత్పన్నం అవుతున్నాయి. ప్రశాంతమైన మహాసముద్రంలో అనేక తరంగాలు ఉద్భవించినప్పటికీ, అవి సముద్రంకన్న వేరు కావు. అలాగే సచ్చిదానంద స్వరూపంలో చిత్తం గనక విజృంభించింది అంటే అనేక రకాల వస్తువులు, జీవులు అన్నీ ఆవిర్భవిస్తాయి. అయితే ఇలా వచ్చిన వస్తువులు ఏవీ చిదాత్మకన్న వేరు కావు. అంటే ఆత్మతో కూడిన చిత్తవైకల్యము మాత్రమే ఈ ప్రపంచాన్ని సృష్టిస్తున్నది. మిథ్య అయిన చిత్తచాంచల్యము ఆత్మస్వరూపము కాదు. కాబట్టి ఆ చిత్తంలో రూపుదాల్చే సంకల్ప వికల్ప రూపమయిన ఈ జగత్తంతా మిథ్యయే.

ఇంకా చెప్పాలంటే మనస్సు శాంత స్థితిలో ఉంటే, జగత్తు ఉండదు. పరమార్థ దృష్ట్యా తెలుసుకునే చైతన్యం తప్ప వేరుగా ప్రపంచం అనేది లేదు. జీవవస్తుమయ మయిన ఈ జగత్తంతా మానసిక కల్లోలం వల్ల జనించిన కల్పనలే. మనసులోని భావాలనే మహాద్భుత సృష్టిగా చూస్తున్నాం అనుకుంటూనే నిజము అని భ్రమ పడుతున్నాం. మనస్సు శాంతించగానే భావాలు ఆగిపోయి ఆత్మ సచ్చిదానంద స్వరూపంగా నిలచిపోతుంది.

**మయ్యనంత మహాంభోధౌ చిత్తవాతే ప్రశామ్యతి ।**
**అభాగ్యాజ్జీవ వణిజో జగత్పోతో వినశ్వరః ॥ 24**

అనంత చైతన్యసాగరమైన నాలో మానసిక కల్లోలం తీరిపోయినప్పుడు జీవ వ్యాపారము ఛిన్నాభిన్నమై పోతుంది.

సచ్చిదానంద స్వరూపమైన నా యందు జగత్తును సృష్టించే మనస్సు సంకల్ప వికల్పాలు లేకుండా శాంతించినట్లైతే మనస్సుకు స్థిరత్వం ఏర్పడుతుంది. మనస్సు బుద్ధి అహంకారముల కారణంగా నిర్మలమైన ఆత్మకు జీవన్ముక్తి కలుగుతుంది. అప్పుడు కలలో కనిపించినట్లు గానే ఈ జగత్తంతా కనిపిస్తుంది. అయితే మనసు బుద్ధి అహంకారములు గనక ఆత్మయందు లయమైతే జ్ఞానము పరిపూర్ణమై, ఆత్మ నిర్మలమవుతుంది. తరువాత అన్ని రకాల ప్రారబ్ధము క్షయమై మోక్షం కలుగుతుంది. మొత్తంమీద జరిగేది ఏమంటే **మానసిక కల్లోలాలు అణిగిపోతే జగత్తు అదృశ్యమయి పోయి కేవలము ఆత్మమాత్రమే మిగులుతుంది.**

**మయ్యనంత మహాంభోధా వాశ్చర్యం జీవ వీచయః ।**
**ఉద్యంతిఘ్నంతి ఖేలంతి ప్రవిశంతి స్వభావతః ॥ 25**

మహాశ్చర్యము. అద్భుతమైన విషయం. నాలోని అనంత చైతన్య సాగరంలో జీవులంతా తరంగాల లాగా ఉద్భవిస్తూ, కదులుతూ, నాట్యం చేస్తూ కొంత కాలానికి కాలగర్భంలో కలిసిపోతున్నారు. నేను నిష్క్రియుడను. నిర్వికారుడను, నిరంజనుడను. అనంతమైన సుఖాన్ని అనుభవిస్తున్నాను. అటువంటి నా యందు కొన్నివేల కోట్ల జీవరాశి ఆవిర్భవిస్తున్నట్లుగా కనిపిస్తోంది. అవి తిరుగుతున్నాయి. పరుగులు పెడుతున్నాయి. వృద్ధి పొందుతున్నాయి. కొంత కాలానికి మరణిస్తున్నాయి. ఈ జీవరాసిలో కొన్ని శత్రుభావంతో కొట్లాడుకుంటున్నాయి. కొన్ని మిత్రభావంతో ఉన్నాయి. ఒకరిని ఒకరు ప్రేమిస్తున్నారు. చంపుకుంటున్నారు. కొన్ని ప్రాణులు మరికొన్నింటిని ఆహారంగా తీసుకుంటున్నాయి. చాలా విచిత్రంగా ఉన్నది. అజ్ఞానం పోగానే అవి నాలో లయమవుతున్నాయి. అజ్ఞానం వల్లనే ఈ జగదావిర్భావం జరుగుతోంది. అజ్ఞానం వల్లనే ప్రవర్తిల్లుతున్నది. అజ్ఞానం వల్లనే లయమవుతుననది. చూడటానికి ఘటాకాశము, మహదాకాశము రెండు వేరు వేరుగా కనిపిస్తాయి. ఘటం గనక పగిలిపోతే ఘటాకాశం మహదాకాశంలో లీనమవుతుంది. అలాగే అజ్ఞానం తొలగిపోగానే అవిద్యతో ఏర్పడిన జగత్తంతా నాలోనే లీనమవుతుంది.

ఇదంతా ఒక కలలాగా జరుగుతోంది. కలలో అనేక ప్రదేశాలు, మనుషులు, సంఘటనలు జరుగుతాయి. రాజ్యాలు, యుద్ధాలు, రాజులు అందరూ ఉంటారు. కలగనే వాడు కూడా ఆ కలలో పాత్రధారే. మెలకువ రాగానే అంటే జాగ్రదావస్థలో కలలోని విషయాలు ఏవీ ఉండవు. కల మనోకల్పితము. మెలకువ రాగానే కల తన అధిష్టానంలో కలిసిపోతుంది. అలాగే ఈ జగత్తు కూడా మనోకల్పితమే. అజ్ఞానం వదలిపోయి జ్ఞానం రాగానే జగత్తంతా అధిష్ఠానమైన నాలో లీనమై పోతుంది. మనస్సు గనక శాంతస్థితిలో ఉంటే, మనస్సుచే గుర్తించబడే నామరూపాలన్నీ, తను నామరూపాలను వదిలి చైతన్యంగా ఉండిపోతాయి. సముద్రంలో నీరు కదులుతున్నప్పుడు 'కెరటం' అని పిలువబడుతుంది. కదలిక ఆగిపోతే అది నిశ్చలంగా నీరుగా ఉంటుంది అంటున్నాడు జనక మహారాజు ఈ అధ్యాయంలో.

# అధ్యాయం-3

# ఆత్మానుభవము-2

ఇది కావాలి అనుకోవటం, ఇది వద్దు అని ద్వేషించటం ఇదే మనసుయొక్క స్వరూపము. ఆత్మ అటువంటి మనసుకన్న వేరుగా ఉన్నది. సద్గురువులు, శాస్త్రాలు చూపిన మార్గాన్ని అనుసరిస్తూ, స్వానుభవంలో "నేను చిద్ఘనుడైన బ్రహ్మనే అయి ఉన్నాను" అని తెలుసుకుని, శోకము లేనివాడు కావాలి. జీవన్ముక్తుని దుఃఖాతీత శక్తి అద్భుతమైనది. పదునైన కత్తితో నరుకుతున్నప్పటికీ కలువపూలు పైన చల్లిన రీతిగా భావిస్తాడు. అగ్నితో కాల్చేటప్పుడు మంచు బిందువులు మీద చల్లుతున్నట్లుగా భావిస్తాడు. నిప్పులలో త్రిప్పుతున్నప్పుడు మంచి గంధపు చల్లదనాన్ని అనుభవిస్తాడు. బాణవర్షము కురిపించినప్పుడు ఎండలో నిర్మించిన జలయంత్రం నీళ్ళు జల్లుతున్నది అనుకుంటాడు. శిరచ్ఛేదన చేసినప్పుడు సుఖముగా నిద్రిస్తాడు. వాగ్బంధనము చేస్తే మౌనముద్రగా భావిస్తాడు. శ్రోత్రాన్ని బంధిస్తే నిశ్శబ్దస్థితి అనుభవిస్తాడు. అటువంటి మహోన్నతమైన స్థితి ఉపేక్షతో ప్రాప్తించదు. దృఢవైరాగ్య సాధనతో అట్టి స్థితి సిద్ధిస్తుంది. గురువాక్యంచేత, వచ్చిన స్వానుభవముతో, పరిశుద్ధ బుద్ధితో నిరంతరము అభ్యాసం చెయ్యటంచేత ఆత్మను చక్కగా దర్శించవచ్చు. ఆత్మసాక్షాత్కారం పొందవచ్చు.

దిగ్భ్రమ పూర్తిగా పోయినప్పటికీ, గతంలో లాగానే దిక్కులయొక్క జ్ఞానము ఉంటుంది. అలాగే బ్రహ్మజ్ఞానంవల్ల ఈ జగత్తులేదు అని తెలిసినా కూడా, జగత్తు కనిపిస్తూనే ఉంటుంది. అలా కనిపించినప్పటికీ జగత్తులేదనే భావించాలి. ఆత్మసాక్షాత్కారానికి సిరిసంపదలు సాయం చెయ్యలేవు. స్నేహితులు, బంధువులు, శరీర కష్టము, తీర్థాలు సేవించటము, సాయపడవు. కేవలము పరమాత్మలో తన్మయత్వం పొందే మనస్సు కలవాడే ఆత్మసాక్షాత్కారం పొందగలడు. దుఃఖాలు, తృష్ణ, భరించలేని చింతలు, అన్నీ మహాత్ములకు సూర్యకిరణములవల్ల అంధకారం నశించినట్లుగా నశిస్తాయి. క్రూరజంతువులు, సౌమ్యజంతువులు అన్నీ శమముగల మహాత్ముని కన్నతల్లిని చేరునట్లుగా, విశ్వాసముతో సమీపిస్తాయి. మానవుడు శమమువల్ల పరమసుఖము అనుభవిస్తాడు. అటువంటి పరమసుఖము అమృతపానం

వల్ల కూడా సిద్ధించదు. లక్ష్మీదేవి అనుగ్రహంతో లభించదు. శుభాశుభాలను విని, అనుభవించి, దర్శించి, తెలుసుకొని, సంతోషము, దుఃఖము పొందనివాడు శాంతస్వరూపుడు.

'మమ', 'నమమ', ఈ రెండు పదాలే బంధమోక్షాలకు హేతువులు. మమ అనుకొన్న జీవుడు బద్ధుడవుతాడు. నమమ అనుకున్నవాడు ముక్తుడవుతాడు. చేతనాచేతనాత్మకమగు ఈ జగత్తు జీవేశ్వరాది రూపంలో ప్రకాశిస్తున్నది. ఈ సృష్టి అంతా పరమేశ్వర సంకల్పమైనది. జాగ్రదవస్థ నుండి మోక్షము వచ్చేదాకా, సంసారము జీవకల్పితమై ఉన్నది. నాచికేతాగ్ని మొదలు యోగమువరకు ఉన్న మతాలన్నీ ఈశ్వరుని విషయంలో భ్రాంతిని ఆశ్రయించి ఉన్నాయి. పొరపాటు పడుతున్నాయి. చార్వాకుల నుండి, సాంఖ్యులదాకా జీవభ్రాంతిని ఆశ్రయించి ఉన్నాయి. అందువల్ల ముముక్షువులు జీవేశ్వర సిద్ధాంతంలో బుద్ధిని ప్రవేశింపనీయరాదు. నిశ్చలబుద్ధితో బ్రహ్మతత్త్వ విచారణ చెయ్యాలి. అన్వయ వ్యతిరేక సిద్ధాంతాలద్వారా ఈతడు సాక్షాత్తు జ్ఞాని. అతడే శివుడు. అతడే హరి, అతడే బ్రహ్మ. సద్గురువు యొక్క కరుణ లేకపోతే విషయత్యాగం చాలాకష్టం. తత్త్వదర్శనము దుర్లభము. సహజావస్థ మరీ దుర్లభము.

ఈశ్వరుడే ఈ జగత్తును సృష్టించాడు అనే జ్ఞానంగలవాడు, సర్వకర్మలను త్యాగం చేసినవాడు, అయిన యోగికి ఆత్మస్థితి సహజంగానే కలుగుతుంది. మానవుడు ఈ జగత్తులో భేదభావం గనక దర్శించినట్లైతే, అతడికి భయం కలుగుతుంది. సచ్చిదానందమనే జ్ఞాననేత్రము సర్వవ్యాపకమైనది. ప్రకాశించే సూర్యుణ్ణి గ్రుడ్డివాడు చూడలేడు. అలాగే అజ్ఞాని సచ్చిదానందాన్ని దర్శించలేడు. ప్రజ్ఞానమే బ్రహ్మ. ఆ బ్రహ్మము సత్యజ్ఞానాది లక్షణాలు గలది. అటువంటి బ్రహ్మను గూర్చిన జ్ఞానంవల్లనే మానవుడు అమృతుడవుతున్నాడు. పరాపర రూపమైన పరబ్రహ్మసాక్షాత్కారమైన తరువాత, మానవుని యొక్క హృదయగ్రంథులు విడిపోతాయి. సర్వసంశయాలు నశించిపోతాయి. అన్ని కర్మలు క్షీణిస్తాయి. కాబట్టి అనాత్మ అనే సంకల్పాన్ని పరిత్యజించాలి. జగత్తు విషయంలో నిర్వికారుడై ఉండాలి. అంతర్ముఖుడై కేవలము సంవిన్మాత్రపరుడై (అన్నీ తెలిసినవాడవై) ఉండాలి. భ్రమవల్ల ఎడారులలో నీటిగుంటలు కనిపిస్తాయి. కాని అవి మృగతృష్ణలు. అలాగే జాగ్రస్వప్నసుషుప్తులకు సంబంధించిన జగత్తంతా ఆత్మస్వరూపం దక్క వేరుకాదు.

లక్ష్యా లక్ష్యబుద్ధులను త్యజించి కేవలము ఆత్మమాత్రుడుగా ఎవడు ఉంటాడో, అతడు సాక్షాత్తూ ఈశ్వరుడే అయి ఉన్నాడు. అతడే ఉత్తముడైన బ్రహ్మజ్ఞాని. సర్వానికీ అధిష్ఠానము పరబ్రహ్మయే. ఉపమానము లేనిది అవాఙ్మానస గోచరము, నిత్యము, సర్వగతము, సూక్ష్మాతిసూక్ష్మము, అవ్యయము అయి ఉన్నది. ఈ జగత్తు సర్వశక్తి మయుడగు పరమేశ్వరుని విలాసముగా ఉన్నది. సంశయము, అసంశయాలతో, ఈ సంసారము శాంతి పొందుతున్నది. మనోవ్యాధికి చికిత్స కోసం ఒక్కటే ఉపాయం ఉన్నది. ఏ వస్తువుమీద ప్రీతి ఎక్కువ ఉంటుందో, దాన్ని త్యజిస్తూ వెళ్ళాలి. అప్పుడే మోక్షం సిద్ధిస్తుంది. స్వాధీనములో ఉన్నది. ఏకాంతహితమైనది, అయిన ఇష్టమైన వస్తువును పరిత్యజించటానికి ఇష్టపడనివాడు కీటకంతో సమానము.

ఈ అధ్యాయంలో 14 శ్లోకాలున్నాయి. అందులో అష్టావక్రుడు అంటున్నాడు. జనక మహారాజా! ఆత్మజ్ఞానివైన నీవు ఇంకా సంపాదించాలని ఎందుకు అనుకుంటున్నావు? అజ్ఞానం వల్ల ముత్యపుచిప్ప వెండిగిన్నెలాగా కనుపిస్తుంది. అలాగే ఆత్మ తెలియని కారణంగా ఇంద్రియాలకు కనిపించే జగత్తు మీద రాగము ఏర్పడుతుంది. సముద్రంనుంచి కెరటాలు వచ్చినట్లుగా నీనుండే ఈ జగత్తు ఆవిర్భవిస్తుంది. ఆత్మ శుద్ధమైనది అని తెలిసి కూడా, విషయ భోగాలనాసిస్తూ మలినమయజీవితం ఎందుకు గడుపుతున్నావు. అన్ని భూతాలలోను ఆత్మ అంతర్యామిగా ఉన్నది. అలాగే అన్ని భూతాలు ఆత్మలోనే ఉన్నాయి. అద్వైత నిష్ఠుడైన జ్ఞాని కామవశుడై కర్మలు ఎందుకు చేస్తున్నాడు? జ్ఞానానికి కామం శత్రువు. ఈ విషయం తెలిసి కూడా కామాన్ని సామాన్యులు ఎందుకు విడువలేరు? మోక్షగామి అయినవాడు ఇంకా శరీర నాశనం గురించి ఎందుకు భయపడతాడు? జ్ఞాని లోకంలో నేను తప్ప రెండవది ఏదీ లేదు అనుకుంటాడు. తన శరీరాన్ని శవంలాగా చూస్తాడు. అటు జగత్తును మిథ్యగా భావించిన వాడికి మృత్యువంటే భయమెందుకు? కోరికలు లేనివాడు సుఖంగా ఉండగలుగుతాడు. ఈ జగత్తుకు అస్థిత్వం లేదని తెలిసిన జ్ఞానికి కొన్ని విషయాలమీద ఇష్టత, కొన్నింటి మీద అయిష్టత ఎలా ఉంటుంది? కోరికలు లేనివాడికి దైవవశాన ప్రాప్తించిన వాటిపట్ల సంతోషము, దుఃఖము ఉండవు. అంటూ అష్టావక్రుడు జనక మహారాజుకు జ్ఞానోపదేశం చేస్తున్నాడు ఈ అధ్యాయంలో.

**అవినాశిన మాత్మానమేకం విజ్ఞాయ తత్త్వతః ।**
**తవాత్మజ్ఞస్య ధీరస్య కథమర్థార్జనే రతిః ॥ 1**

అక్షరము ఏకము అయిన ఆత్మను తెలుసుకున్న జ్ఞానివి నువ్వు. ఈ సంపదల కోసం ఎందుకు ఆరాటపడుతున్నావు?

జనక మహారాజు మహాజ్ఞాని. అతడికి ఆత్మానుభవం అయింది. కానీ యథావిధిగా ఇంకా రాజ్యం చేస్తున్నాడు. ప్రజల దగ్గర పన్నులు వసూలు చేస్తున్నాడు. సైన్యాన్ని పోషిస్తున్నాడు. ఒక ప్రక్కన జ్ఞాని అయి ఉండి యజ్ఞయాగాది క్రతువులు చేస్తున్నాడు. భూరి దక్షిణలు ఇస్తున్నాడు. అంటే చూసే వారి దృష్టిలో లౌకిక వ్యవహారాల యందు నిమగ్నమై ఉన్నాడు. దీనిలో అంతరార్థం ప్రజలకు తెలియాలి. ఎందుకంటే జ్ఞానులకు లౌకిక విషయాలు పట్టి కూడదు. అందుకే, ఆ సమాధానం జనకుని నోటిద్వారా రావాలనే అష్టావక్రుడు అడుగుతున్నాడు.

**ఆత్మజ్ఞానాదహో ప్రీతిర్విషయభ్రమ గోచరే ।**
**శుక్తే రజ్ఞానతో లోభః యథా రజత విభ్రమే ॥ 2**

అజ్ఞానం వల్ల ముత్యపుచిప్పను చూసి వెండి అని భ్రమిస్తారు. ఆ వెండిని సంపాదించటానికి పరుగులు తీస్తారు. ఈ రకంగానే ఆత్మ అంటే ఏమిటో తెలియని కారణంగా ఇంద్రియాలకు కనిపించే ప్రపంచంమీద కోరికలు పెరుగుతాయి. రాజా! ఇక్కడ రెండు విషయాలున్నాయి. 1. లౌకికము 2. పారలౌకికము. ఈ రెండింటిలోను ఒకటి ఉంటే ఇంకొకటి ఉండదు. చీకటి ఉంటే వెలుతురు ఉండదు. వెలుతురు ఉంటే చీకటి ఉండదు. రెండూ ఒకేసారి ఉండటం కుదరదు. అలాగే లౌకిక, పారలౌకిక విషయాలు కూడా, జ్ఞానం కలిగితే భ్రమ ఉండదు. ఒకవేళ భ్రమ ఉన్నది అంటే జ్ఞానం కలగనట్లే. సముద్రం మీద ముత్యపు చిప్ప తేలియాడు తుంటుంది. దానిలోపల భాగం అంతా తెల్లగా వెండిలా ఉంటుంది. సూర్యకాంతి దానిమీద పడినప్పుడు అది క్రొత్త వెండిగిన్నెలాగా తళతళా మెరుస్తూ ఉంటుంది. దూరం నుంచి చూసే క్రొత్తవాడికి అది వెండిగిన్నె అనే భ్రాంతి కలుగుతుంది. ప్రతిరోజు చూసేవారికి దాన్ని గురించి తెలుసు, వారికి జ్ఞానం ఉంటుంది. కేవలము క్రొత్త వారు మాత్రమే అది వెండి అని భ్రమ పడతారు. ఎప్పుడైతే మనకి జ్ఞానం

కలుగుతుందో, అప్పుడు అది వెండి కాదు ముత్యపుచిప్ప అని తెలుస్తుంది. అంటే దాన్ని గురించి తెలియని అజ్ఞాని మాత్రమే అది వెండిగిన్నె అనుకుంటాడు. అలాగే అజ్ఞానికి మాత్రమే ఈ జగత్తు కనిపిస్తుంది. జ్ఞానదృష్టిలో జగత్తు లేదు.

**విశ్వం స్ఫురతి యత్రేదం తరంగా యివ సాగరే ।**
**సోఽహమస్మీతి విజ్ఞాయ కిం దీన ఇవ ధావసి ॥ 3**

సముద్రం నుంచి కెరటాలు వచ్చినట్లుగా, నానుండే విశ్వము ఆవిర్భవించింది అని తెలిసిన నీవు ఎండమావుల వెంట ఎందుకు పరుగెడుతున్నావు?

జనకా ! సముద్రంలో వచ్చే అలలు, కెరటాలు, తరంగాలు, సముద్రపు నురగ అన్నీ కూడా సముద్రం కన్న వేరైనవి కావు. గాలికి సముద్రపు నీరు మెల్లగా కదిలి వడ్డుకు చేరుతుంది.గాలి వేగాన్ని బట్టి నీటి కదలిక ఉంటుంది. సముద్రము అంటే అపారమైన పారావారము. గాలికి నీరు చిన్నగా కదిలితే అల అని, కొంచెం పెద్దగా కదిలితే తరంగము అని, ఇంకా వేగంగాకదిలితే కెరటము అంటారు. గాలి వేగాన్ని బట్టి నీటి కదలిక ఉంటుంది. వేగంగా గాలివీస్తే కెరటాలు ఉవ్వెత్తున లేచి పడతాయి. కెరటం ఎంత పెద్దగా ఉన్నా అదంతా సముద్రపు నీరే. దానికి ప్రత్యేకమైన గుర్తింపు లేదు. నువ్వు ఆత్మ స్వరూపుడివి. ఈ జగత్తంతా నీ నుంచే ఆవిర్భవించింది అనే విషయం కూడా నీకు తెలుసు. నువ్వే జగత్తు జగత్తే నువ్వు అనే విషయం తెలిసి కూడా 'మరుమరీచికలు' అంటే ఎండమావులు. ఎడారిలో బాగా ఎండగా ఉన్న సమయంలో ఇసుకలో నీరు ఉన్నట్లుగా కనుపిస్తుంది. ఇది భ్రాంతి. అక్కడ నీరుండదు. సూర్యకిరణాలు ఇసకమీద పడి పరావర్తనం చెంది అలా కనిపిస్తుంది. అవి ఎండమావులు. వాటిలో నీరుండదు అని అక్కడి వారికి అనుభవజ్ఞులకు తెలుసు. కాబట్టి వారు భ్రమ పడరు. మనబోటి క్రొత్తవారు, ఎడారుల గురించి తెలియని అజ్ఞానులు పొరబడతారు. కాబట్టి రాజా ! నీకు అన్ని విషయాలు తెలిసికూడా ఎందుకు లౌకిక విషయాల జోలికి పోతున్నావు? అంటున్నాడు అష్టావక్రుడు.

**శ్రుత్వాఽపి శుద్ధ చైతన్య మాత్మాన మతి సుందరమ్ ।**
**ఉపస్థేఽత్యంత సంసక్తః మాలిన్య మధిగచ్ఛతి ॥ 4**

ఆత్మశుద్ధమైనది. అని తెలిసి కూడా ఏ రకంగా విషయభోగాలు ఆశిస్తూ మలినమైన జీవితం గడపగలవు?

రాజా ! నువ్వు గురువుగారి దగ్గర ఉపదేశం పొందావు. ఆయన ప్రవచనాలు, ఉపదేశాలు విన్నావు. శాస్త్రాలు చదివావు. అనేకమందితో వీటిని చర్చించావు. వచ్చిన జ్ఞానాన్ని దృఢపరచుకున్నావు. బ్రహ్మసత్యం జగన్మిధ్య అని తెలుసుకున్నావు. ధ్యానం చేశావు. ఆత్మను తెలుసుకున్నావు. ఆత్మస్వరూపుడైనావు. ఆత్మనిష్ఠుడైన వాడు లౌకిక విషయాల్లో ప్రవేశించడు. విషయాల యందు ఆసక్తి చూసేవాడు మూఢుడు. విషయాల యందు ఆసక్తి చూసే మహాజ్ఞాని లౌకిక వ్యవహారాల జోలికి పోడు. కాని ఇప్పుడు ఈ జనకుడు ఆత్మానుభవం పొంది కూడా, లౌకిక వ్యవహారాల యందు ఆసక్తి చూపకూడదు.

**సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**మునే ర్జానత ఆశ్చర్యం మమత్వమనువర్తతే ॥ 5**

అన్ని భూతాలలోను తనను చైతన్యం గాను, చైతన్య స్వరూపమైన తనలో అన్ని ప్రాణులను చూడగలిగిన జ్ఞాని నేను నాది అనే అహంకార మమకారాలతో వ్యవహరించలేడు.

పిపీలికాది బ్రహ్మపర్యంతము ఆత్మధిష్ఠానమై ఉన్నది. అన్ని భూతాలలోను అంతర్యామిగా ఆత్మ ఉన్నది అనే మాట **సుబాలోపనిషత్తు, బృహదారణ్యకోపనిషత్తు** లలో చెప్పబడింది అని ఒకటవ అధ్యాయంలోని 20వ శ్లోకంలో చెప్పుకున్నాం. ఈ జగత్తు, ప్రాణికోటి అంతా కూడా రజ్జుసర్పభ్రాంతి లాగా ఆత్మ యందే ఆరోపించబడింది. జగత్తంతా పరమేశ్వరునిలోనే ఉన్నది అని తెలిసిన మహాజ్ఞానులు కూడా విషయవాంఛలకు లోనయితే ఇంతకన్న ఆశ్చర్యము ఏదీ ఉండదు. ముత్యపుచిప్పలో వెండి ఉన్నది అనుకున్న వాడు, దాని విషయ పరిజ్ఞానాన్ని పొందినట్లైతే, ఇంక ఆ ముత్యచిప్పకు ఆశపడడు. నిద్ర పోతున్నప్పుడు కలలో కనిపించిన వస్తువుల కోసం, కల కరిగిపోయిన తరువాత జాగ్రదావస్థలో ఎవడూ పరితపించడు, పాకులాడడు, అలాగే రాజా! ఆత్మజ్ఞానివైన నువ్వు ఐహిక సుఖాల కోసం ఆశపడటం బాగా లేదు.

**ఆస్థితః పరమాద్వైతం మోక్షార్థేఽపి వ్యవస్థితః ।**
**ఆశ్చర్యం కామవశగః వికలః కేళి శిక్షయా ॥ 6**

అద్వైతానుభవం కలిగిన జ్ఞాని, కోరికల వలయంలో చిక్కి కర్మలు చెయ్యడు.

సజాతీయ విజాతీయ, స్వగత భేదాలు లేనివాడు, అద్వితీయ సాక్షాత్కారము గలవాడు, మోక్షస్వరూపమయిన సచ్చిదానంద విగ్రహము పరమాత్మయందు తాదాత్మ్యత గలవాడు అయి ఉండి కూడా గతజన్మల వాసనలు కారణంగా కోరికలకు వశుడై కైవల్యము చెందినట్లు కనిపిస్తాడు. ఇది చాలా వింతగా ఉన్నది.

**1. స్వగతభేదము :** ఒకే దానిలో ఉండే తేడాలు. ఉదా : ఒక చెట్టు ఉంది. దానికి ఆకులు, పూలు, కొమ్మలు, రెమ్మలు, కాయలు, పండ్లు. ఇవన్నీ ఆ చెట్టు యొక్క అంగాలే. కాని ఒక దానికి ఇంకొక దానికి అంటే ఆకుకు - కాయకు, ఆకుకు - పూవుకు పోలిక ఉండదు. ఇలా భిన్న అంగాల మధ్య ఉండే భేదాన్నే స్వగతభేదము అంటారు.

**2. సజాతీయ భేదము :** ఒకే జాతికి చెందిన రెండు వస్తువుల మధ్య ఉండే తేడా. మర్రిచెట్టు, రావిచెట్టు. ఈ రెండూ వృక్షజాతివి. కాని రెండింటి మధ్యనా తేడా ఉంది. అదే సజాతీయము.

**3. విజాతీయ భేదము :** రెండు భిన్న జాతి వస్తువుల మధ్యన ఉండే భేదము. వృక్షము, బండరాయి. ఈ రెండూ విజాతీయాలు. ఈ రెండింటి మధ్యన ఉండే తేడాను విజాతీయ భేదము అంటారు. పరబ్రహ్మలో ఈ మూడు రకాల భేదాలు లేవు. ఈ భేదాలు అనాత్మ వస్తువులందు మాత్రమే ఉంటాయి. సద్వస్తువుకు ఈ రకమైన తేడాలుండవు. ఎందుకంటే -

**1. స్వగతభేదము :** సద్వస్తువుకు అవయవాలుండవు. సద్వస్తువు యొక్క అంశ, భాగాన్ని మనం నిరూపించలేము. స్వగతభేదమనేది అవయవాల వల్లనే కలుగుతుంది. సృష్టికి పూర్వం ఉన్న సద్వస్తువుకు అంశ అనేది లేదు. పుట్టుక లేదు. నామరూపాలు లేవు. అవయవాలు అంతకన్నా లేవు. కాబట్టి అందులో స్వగతభేదముండదు. అయితే ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. సృష్టికి పూర్వం నామరూపాలు లేవా ? లేవు అని ఖచ్చితంగా చెప్పాలి. ఎందుకంటే నామరూపాలు ఉంటే సృష్టి జరిగినట్లే.

**2. సజాతీయ భేదము :** ఒకే జాతికి చెందిన రెండు వస్తువుల మధ్య ఉండే భేదాన్ని సజాతీయ భేదము అంటారు. సృష్టికి ఇన్ని జాతులు, వస్తువులు ఎక్కడున్నాయి. ఉన్నది ఒక్కటే. అద్వితీయమైన పరబ్రహ్మ. కాబట్టి సజాతీయ భేదం లేదు.

**3. విజాతీయ భేదము :** బ్రహ్మమనేది సద్వస్తువు. దానికి విజాతీయమున్నది అంటే అది అసద్వస్తువు అవుతుంది. అందుకే ఇంకొక జాతి గాని, వస్తువు కాని, లేదు. కాబట్టి పరబ్రహ్మకు విజాతీయ భేదం కూడా లేదు.

ఈ రకమైన భేదాలు ఏవీ ఆత్మకు లేవు. జ్ఞాని మోక్షస్వరూపుడు. ఆత్మసాక్షాత్కారము పొందినవాడు. మోక్షస్వరూపుడు పరమానందమైన వాడు. అటువంటి జ్ఞాని గతజన్మల వాసనల కారణంగా కోరికలకు వశుడైనట్లు నటిస్తాడు. ఇది చాలా వింతగా ఉన్నది.

**ఉద్భూతం జ్ఞానదుర్మిత్ర మవధార్యాతి దుర్బలః ।**
**ఆశ్చర్యం కామమాకాంక్షేత్కాల మంత మనుశ్రితః ॥ 7**

కామము శత్రువు వంటిది అని తెలిసినా జ్ఞాని కామాన్ని విడవలేక పోతున్నాడు. జవసత్వాలు ఉడిగిన వాడు, వయోవృద్ధుడు కూడా కామాన్ని జయించ లేకపోతున్నారు. ఇది చాలా ఆశ్చర్యకరము.

కామక్రోధ లోభ మోహమద మాత్సర్యాలను అరిషడ్వర్గాలు అంటారు. వీటిలో ప్రధానమైనది కామము. కామం గనక తీరకపోతే అని క్రోధమవుతుంది. అప్పుడు మిగిలినవన్నీ వరుసగా వచ్చి మానవుడిలో చేరతాయి.

కామము అంటే కోరిక. అనుభవించాలనే ఆశ. కాని ఇక్కడ కామము అంటే స్త్రీ సుఖము అనే అర్థంలో చెప్పబడింది. ఇది చాలా ఘోరమైనది. ఇందులో పడినవాడు సంవత్సరాల తరబడి అనుభవించినా కామం చల్లారదు. కాళహస్తీశ్వర శతకంలో ధూర్జటి అంటాడు.

**కాయల్గాచె వధూనఖాగ్రములచే గాయంబు, వక్షోజంబుల్**
**రాయన్ రాపడెరొమ్ము, మన్మథవిహారక్లేశ విభ్రాంతిచే**
**బ్రాయం బాయెను, బట్టగట్టెదల, చెప్పన్‌రోత సంసారమే**
**జేయంజాల విరక్తు చేయగదవే శ్రీకాళహస్తీశ్వరా ॥**

స్త్రీల గోటిరక్కులతో శరీరం కాయలు కాచిపోయింది. వారి స్థనములు రాయటం వల్ల నా వక్షసలము రాయిలా అయింది. మన్మథ క్రీడా వ్యామోహంలో పడి వయసు తగ్గిపోతున్నది. బట్ట తల వచ్చేసింది. సంసారమంటేనే రోత పుడుతున్నది. కాబట్టి భవబంధాల నుండి దూరం చేసి నన్ను సంపూర్ణ వైరాగ్యునిగా చేయవలసింది అని కాళహస్తీశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాడు ధూర్జటి.

దీనికి వయసుతో నిమిత్తం లేదు. విశ్వామిత్రుడు గొప్ప తపస్సంపన్నుడు. బ్రహ్మర్షి కావాలనే కోరికతో హిమాలయాలకు వెళ్ళి పదివేల సంవత్సరాలు తపస్సు చేశాడు. ఒకరోజు తెల్లవారేసరికి ఆశ్రమం ఎదురుగా సెలయేటిలో అప్సరాంగన మేనక అర్ధనగ్నంగా స్నానం చేస్తోంది. చూశాడు మహర్షి. ఆమె సౌందర్యానికి ఆకర్షితుడై ఆమెను గాంధర్వవిధిన వివాహమాడాడు. పదివేల సం॥ తపఃఫలము నాశనమయి పోయింది. కాబట్టి కామాన్ని జయించటం తేలిక కాదు.

కాలుడు, కాముడు వీరిద్దరిలో ఎవరు మంచివారు అని చూస్తే శంకర భగవత్పాదుల వారు తమ సర్వవేదాంత సిద్ధాంతసారసంగ్రహములో చెప్పినట్లుగా

**యమస్య కామస్య చ తారతమ్యమ్**
**విచార్యమాణే మహదస్తిలోకే**
**హితం కరోత్యస్య యమో ప్రియస్సన్**
**కామస్త్వనర్థం కురుతే ప్రియస్సన్**

మన్మథుడు మంచివాడని, యముడు చెడ్డవాడని లోకుల అభిప్రాయం. కాని బాగా ఆలోచిస్తే మన్మథుడి కన్న యముడే మంచివాడు అని చెప్పక తప్పదు. ఎందుకంటే యముడు నరక లోక బాధలు పెట్టటం ద్వారా, వారి పాపాలు నాశనం చేస్తున్నాడు. మన్మథుడు మాత్రం విషయభోగాల యందు ఆశ కల్పించి, స్నేహితుడులా కనిపిస్తూ, వారితో అనేక రకాల పాపాలు చేయిస్తూ చాలా దుఃఖాన్ని కలిగిస్తున్నాడు.

కాముడు చాలా బలవంతుడు. అందరి హృదయాలలోను ప్రవేశించి, వారిని మోహపెడుతున్నాడు. వారికి బ్రహ్మజ్ఞానము కలగకుండ చేయుచున్నాడు. స్త్రీ పురుషులకు పరస్పరానురాగము కలిగించి, విషయ వాంఛలు వృద్ధి చేసి, వారి వలన ప్రపంచాన్ని వృద్ధి చేస్తున్నాడు.

ప్రపంచంలో మానవులు బహిర్ముఖులై విషయవాంఛలనే కోరతారు కాని, అంతర్ముఖులై ఆత్మజ్ఞానం కోసం ప్రయత్నించరు. వయోవృద్ధుడు, శరీరం స్వాధీనంలో లేనివాడు కూడా స్త్రీ వ్యామోహం నుంచి బయట పడలేడు. అంతెందుకు తొంభై సంవత్సరాల వృద్ధుణ్ణి 'తాతా! పెళ్ళి చేసుకుంటావా?' అంటే "నాకెవరు పిల్లనిస్తార్రా" అంటాడు అంతేగాని 'నాకెందుకురా పెళ్ళి?' అని మాత్రం అనడు. అందుకే సామాన్యులు కామాన్ని విడువలేరు. అంటున్నాడు అష్టావక్రుడు.

**ఇహాముత్ర విరక్తస్య నిత్యానిత్య వివేకినః ।**
**ఆశ్చర్యం మోక్షకామస్య మోక్షాదేవ విభీషికా ॥ 8**

ఈ లోకము, పరలోకము అంటే స్వర్గలోకము. ఈ రెండు లోకాల్లోని సుఖాల యందు ఆసక్తి లేకుండా, నిత్యానిత్య వివేకం కలిగి, మోక్షగామియైన వాడు, తన శరీర నాశనం గురించి ఇంకా భయపడటమెందుకు? కర్మలు రెండు రకాలు 1. ఇహము 2. పరము

1. ఇహము అంటే లౌకికమైన అని అర్థం. జగత్తులో ఎక్కువ మంది లౌకిక దృష్టిలోనే ఉంటారు.

ఆత్మ శాశ్వతము. సచ్చిదానంద స్వరూపము. పరలోకానికి సంబంధించిన కర్మలు మళ్ళీ రెండు రకాలు. 1. స్వర్గము 2. బ్రహ్మలోకము

లోకంలో మంచి కర్మలు చేసిన వారు స్వర్గలోకంలో సర్వసుఖాలు అనుభవిస్తారు. ఇక రెండవది. దీన్నే అపవర్గము బ్రహ్మలోకాన్ని పొందటము. ఇది కేవలము జ్ఞాని మాత్రమే పొందుతాడు. స్వర్గముగాని, బ్రహ్మలోకప్రాప్తిగాని రెండూ కూడా మరణానంతరమే కలుగుతాయి.

సాధకుడు ఈ లోకంలో ఏది సత్యము? ఏది అసత్యమో ముందుగా తెలుసు కొనాలి. దానికే సాధన అవసరం. కేవలము జ్ఞాని మాత్రమే బ్రహ్మలోకం చేరతాడు. బ్రహ్మలోకం చేరటానికి కర్మతో అవసరం లేదు. ఈ విషయాలన్నీ తెలుసుకొని శరీరం నాశనమవుతుంది అని భయపడకూడదు. ఇలా భయపడటం చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది.

**ధీరస్తు భోజ్యమానోఽపి పీడ్యమానోఽపి సర్వదా ।**
**ఆత్మానం కేవలం పశ్యన్న తుష్యతి న కుప్యతి ॥ 9**

జ్ఞాని ఎల్లప్పుడూ తన స్వరూపంలోనే ఉంటూ తాను తప్ప రెంబది ఏదీ లేదనే దృఢమైన జ్ఞానంతో, మానావమానాలలో సమబుద్ధిని ప్రదర్శిస్తాడు.

జ్ఞాని స్థితప్రజ్ఞుడు. మానావమానాలు సమానంగా చూస్తాడు. ఇతరులు తనను నిందించినా, దూషించినా పట్టించుకోడు. నిందాస్తుతులకు చలించడు. పొగిడితే ఆనందించడు. తెగడితే దుఃఖించడు. సుఖదుఃఖాలకు దూరంగా ఉంటాడు.

ఆత్మజ్ఞాని దృష్టిలో జగత్తు ఉన్న లేనిదాని క్రిందే లెక్క. శరీరాన్ని శవంలాగా చూస్తాడు. తన ప్రక్కన ఏం జరిగినా పట్టించుకోడు. అతని యొక్క దుఃఖాతీతమైన స్థితి అద్భుతమైనది. పదునైన కత్తితో నరుకుతున్నప్పటికీ, కలువపూలు పైన చల్లినట్లుగా భావిస్తాడు. అగ్నితో కాల్చుకుంటే, మంచు బిందువులు మీద చల్లినట్లుగా భావిస్తాడు. నిప్పులలో పడేసి త్రిప్పుతున్నప్పుడు మంచి గంధపు చల్లదనాన్ని అనుభవిస్తాడు. అతని మీద బాణవర్షం కురిపించినప్పుడు ఎండలు నిర్మించిన కాలయంత్రం నీళ్ళు చల్లుతున్నది అనుకుంటాడు. శిరచ్ఛేదన చేస్తే సుఖంగా నిద్రిస్తాడు. వాగ్బంధనము చేస్తే మౌనముద్రగా భావిస్తాడు. దృఢమైనది వైరాగ్య సాధనతోనే అటువంటి స్థితి ప్రాప్తిస్తుంది. అన్నింటి యందు సమచిత్తంతో ఉండటమనేది జ్ఞానికి మాత్రమే సాధ్యము.

**చేష్టమానం శరీరం స్వం పశ్యత్యన్య శరీరవత్ ।**
**సంస్తవే చాపి నిందాయాం కథం క్షుభ్యేన్మహాశయః ॥ 10**

మహాత్ములు నిర్మమత్త్వంతో తమ శరీరాన్ని ఇతరుల శరీరం లాగా చూస్తారు. అటువంటి వారిని దూషణ భూషణ తిరస్కారాలు ఏమీ చెయ్యలేవు.

ఆత్మ ఏ రకమైన పనులు చెయ్యదు. మాయవల్ల జరిగే కర్మలన్నీ శరీరానికే గాని ఆత్మకు లేవు. నేను శరీరాన్ని కాను. సచ్చిదానంద స్వరూపాన్ని అనే దృఢ నిశ్చయంతో శరీరానికి ఏ రకమైన ప్రాధాన్యతా ఇవ్వకుండా ఉపేక్షించేవాడు ఇతరుల నిందాస్తుతులకు చలించడు. అనేక కర్మలు చేస్తాం. ఈ కర్మలు చేసేది దేహం అంతేకాని ఆత్మకాదు. కర్మ ఫలితం కూడా దేహానికే అంతేకాని ఆత్మకు కాదు. నేను అంటే దేహాన్ని కాదు. సచ్చిదానంద రూపాన్ని అనే దృఢనిశ్చయంతో శరీరానికి ఏ రకమైన ప్రాధాన్యతా ఇవ్వడు. అతడు దృష్టిలో శరీరము ఒక శవము. దానికి తనకి ఏ సంబంధము లేదు. ఇలా శరీరాన్ని ఉపేక్షిస్తాడు. ఇతరులచే కలిగే మానావమానాలు, నిందాస్తుతులు అతణ్ణి ఏ మాత్రము చలింపచేయలేవు.

**మాయా మాత్రమిదం విశ్వం పశ్యన్విగతకౌతుకః ।**
**అపి సన్నిహితే మృత్యౌ కథం త్రస్యతి ధీరధీః ॥ 11**

చరాచర జగత్తంతా మిథ్యగా గుర్తించి, నిరాసక్తుడు, శాంతుడు అయిన జ్ఞానికి మరణమాసన్నమయినా భయమెందుకు?

మృత్యువే మాయ. మృత్యువుచే చంపబడే శరీరం ఇంకా మాయ. జ్ఞాని దృష్టిలో అసలు జనన మరణాలే లేవు. ఇక్కడ చిత్రం ఏమంటే ఈ దేహం మాయ. మృత్యువు అంతకన్న మాయ. అసలు శరీరమే లేదు అంటుంటే మళ్ళీ దానికి మృత్యువెక్కడ నుంచి వచ్చింది? ఆకాశహర్మ్యం కూలిపోయింది అన్నట్లుగా ఉంది. గాలి మేడలు ఎక్కడున్నాయి? లేని మేడలు కూలిపోవటం ఏమిటి? ఇలాంటి ప్రశ్నలకు తావివ్వని వాడే జ్ఞాని. ఎట్టి పరిస్థితిలోను చలించడు. అటువంటి వాడికి మరణము అంటే భయమెందుకు? మరణమెక్కడుంది. ఉన్నది ఒక్కటే ఆత్మ. అదే తను. కాబట్టి అతడికి మరణభయం ఉండదు.

**నిస్స్పృహం మానసంయస్య నైరాశ్యేఽపి మహాత్మనః ।**
**తస్యాత్మ జ్ఞానతృప్తస్య తులనా కేన జాయతే ॥ 12**

కోరదగినది ఏదీ లేదని తెలిసి నిత్యతృప్తుడై ఉన్న జ్ఞానికి సాటి ఎవరూ లేరు. ఎటువంటి దుర్భరమైన సంఘటనటలైనా సరే మిథ్యగా భావించి సాక్షిగా చూస్తుంటాడు. తన స్వరూప స్థితిలో ఆనందంగా ఉంటాడు. నేనే పరబ్రహమ స్వరూపాన్ని అని భావన చేసినవాడు లౌకిక సంబంధాలు పెట్టుకోడు. అతడికి ఏ కోరికలు ఉండవు. మోక్షం కూడా కావాలి అనుకోడు. అటువంటి వారితో సమానమైన వారు ఎవరూ ఉండరు. జ్ఞానికి లౌకిక సంబంధాలు, విషయ వాసనలు ఉండవు. అతనికి మనస్సు ఉండదు. నాశనమై పోతుంది. కాబట్టి కోరికలు ఉండవు. మోక్షం పొందాలనేది కూడా కోరికే. అది కూడా ఉండదు. తానే పరబ్రహ్మ అయినప్పుడు ఇంకా పరబ్రహ్మను చేరటం ఎలా ఉంటుంది? మోక్షం అంటే పరమాత్మ జీవాత్మ ఒకటి కావటం. అసలిక్కడ రెండు ఎక్కడున్నాయి. ఉన్నది ఒకటే పరమాత్మ. అదే నేను. ఇలా భావన చేసేవాడికి ఇంకా కోరికలు ఏముంటాయి? అతడు అన్నింటినీ సాక్షిగా చూస్తూ ఆనందంగా ఉంటాడు.

**స్వభావాదేవ జానానో దృశ్యమేతన్న కించన ।**
**ఇదంగ్రాహ్యమిదం త్యాజ్యం స కిం పశ్యతి ధీరధీః ॥ 13**

ఈ జగత్తంతా మిథ్య అని తెలుసుకున్న జ్ఞానికి కొన్ని విషయాల మీద ఇష్టము, కొన్నింటి మీద అయిష్టము ఎందుకుంటుంది?

త్రాడును చూశాడు పాము అనుకున్నాడు. దీపపు వెలుగులో పరిక్షించాడు. అది పాము కాదు త్రాడు అని తెలిసింది. అలాగే ఈ జగత్తు కూడా సత్యము అనుకున్నాడు. గురువు గారి దగ్గర సేవ చేశాడు. జ్ఞానోపదేశం జరిగింది. జగత్తు అసత్యము అని తెలిసింది. జగత్తు లేదని తెలిసింది. అంతా మిథ్య. ఇదంతా మనసుచేత కల్పించబడిన భ్రాంతి. ఈ భ్రాంతి జ్ఞానం కలిగితే ఉండదు. భ్రాంతి ఎప్పుడైతే పోయిందో, అప్పుడు ఇక జగత్తు లేదు. అప్పటిదాకా కనిపించిన జగత్తు తన అధిష్ఠానంలో లయమై పోయింది. ఈ రకంగా జగత్తంతా మిథ్య అని తెలుసుకున్న జ్ఞానికి కొన్ని విషయాల మీద ఇష్టత, కొన్నింటి మీద అయిష్టత ఎలా ఉంటుంది? అసలు విషయాలే లేవు కదా? లేని విషయాలమీద ఇష్టత అయిష్టత ఏమిటి?

**అంతస్త్యక్తకషాయస్య నిర్ద్వంద్వస్య నిరాశిషః ।**
**యదృచ్ఛయాఽఽగతోభోగః న దుఃఖాయ న తుష్టయే ॥ 14**

కోరికల నుండి విడివడిన జ్ఞానికి, ద్వంద్వాలకు అతీతుడుగా ఉన్న జ్ఞానికి అనుకోకుండా లభించే వాటివల్ల సంతోషము, విచారము ఏవీ ఉండవు. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములతో కూడిన అంతఃకరణ దోషకారణమున జనించిన విషయ వాసనలు ఉష్ణము, శీతలము, సుఖము, దుఃఖము ఇటువంటి వాటికి అతీతుడైన జ్ఞానికి దైవవశాత్తు సంప్రాప్తమైన విషయ భోగాలు ఏవీ సుఖదుఃఖాలను కలిగించవు.

ఇతడు మహాజ్ఞాని నేనే పరబ్రహ్మను అని నమ్మినవాడు. ఇతడికి కోరికలు లేవు. మనస్సు లేదు. విషయ వాసనలు లేదు. అన్ని ద్వంద్వాలకు అతీతుడు. ఇటువంటి వాడికి ఏం జరిగితే ఏమిటి? దైవవశాత్తు సంప్రాప్తమైన విషయ భోగాలు ఇతణ్ణి ఏం చేస్తాయి? ఏమీ చెయ్యలేవు. అంటున్నాడు అష్టావక్రుడు.

# అధ్యాయం-4

## ఆత్మసాక్షాత్కారము

సాధకుడు మనసా, వాచా, కర్మణా "నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని" అని తెలుసుకోవటమే ఆత్మసాక్షాత్కారము, సాధకుడు తనను గురించి తాను తెలుసుకోవటమే స్వరూప జ్ఞానము. జగత్తంతా నాలోనే ఉన్నది. నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని. సృష్టి స్థితి లయాలన్నీ నా నుంచే జరుగుతున్నాయి, ఈ జగత్తులో ఉన్నది నేనొక్కడినే. నేను తప్ప వేరెవరూ లేరు. నేను తప్ప వేరుగా ఏదీలేదు. జగత్తులో ఉన్నది ఒక్కటే, అదే పరబ్రహ్మ. అదే నేను. ఈ జగత్తంతా నా నుంచే సృష్టించబడి, మళ్ళీ నాలోనే లయమవుతున్నది. ఈ విషయాన్ని అనుభవ పూర్వకంగా తెలుసుకోవటమే ఆత్మసాక్షాత్కారము.

ఆత్మసాక్షాత్కారము ఎలా జరుగుతుంది? ఈ విషయం **మహోపనిషత్తు**లో వివరించబడింది. మన ముఖం ఎలా ఉందో చూడటానికి అద్దం ముందు నుంచున్నాం. అద్దం అంతా దుమ్ము కొట్టుకుపోయి ఉంది. మన ప్రతిబింబం సరిగా కనుపించటం లేదు. ఒక పాత గుడ్డ తీసుకుని అద్దం మీద దుమ్ము దులిపేశాం. అద్దం పరిశుభ్రంగా, నిర్మలంగా తయారవుతుంది. నిర్మలమైన అద్దంలో ప్రతిబింబం స్పష్టంగా కనుపిస్తుంది. అలాగే నిర్మలమైన లేదా పవిత్రమైన ఆత్మలో పరమాత్మ స్వరూపం సాక్షాత్కరిస్తుంది. కాబట్టి ఆత్మసాక్షాత్కారం కావాలంటే మనోమాలిన్యం తొలగిపోవాలి. భ్రమలన్నీ నశించి పోవాలి. గతంలో చెప్పినట్లుగా మోక్షద్వారానికి ద్వారపాలకులు నలుగురు.

1. ఇంద్రియ నిగ్రహము 2. విచారణ 3. సంతుష్టి 4. సజ్జన సాంగత్యము

ఇందులో ఇంద్రియ నిగ్రహము అంటే శమదమాలు.

1. శమము అంటే – అంతరింద్రియ నిగ్రహము

2. దమము అంటే – బాహ్యేంద్రియ నిగ్రహము

పైన చెప్పిన ద్వారపాలకులు నలుగురిలో ఏ ఒక్కరినైనా సరే గట్టిగా పట్టుకున్నట్లైతే, మిగిలిన ముగ్గురు వశులౌతారు. అంటే వీటిలో ఏ ఒక్కటి మనం

పూర్తిగా ఆచరించినా మోక్షం సిద్ధిస్తుంది. కాబట్టి సర్వప్రయత్నాలచేత, సమస్తాన్ని త్యజించి అయినా సరే ఎవరో ఒకరిని గట్టిగా పట్టుకోవాలి. ముందుగా శాస్త్రాభ్యాసము, సజ్జనసాంగత్యము వీటిని బాగా అలవరచుకోవాలి. వీటివల్ల వివేకం పెరుగుతుంది. శాస్త్రవాక్యము, సద్గురువాక్యము (ఉపదేశము) అనుభవము. ఈ మూడు ఒక్కసారిగా, ఎవరి ఆత్మలో దర్శనమిస్తాయో అతడికి పరమాత్మ దర్శనం కలుగుతుంది. ఆత్మసాక్షాత్కారం అవుతుంది.

'నేను పరబ్రహ్మను కాను అనే ఆలోచనతో మనసు బంధింపబడుతోంది. సర్వము బ్రహ్మమయము అనే దృఢసంకల్పంతో మనస్సు విముక్తమవుతుంది. నేను కృశించిన వాడను. నేను దుఃఖించినవాడను. కోరికలతో బంధించబడిన వాడను. కాళ్ళు చేతులు గలవాడను. అనే భావనతో జీవుడు బద్ధుడౌతున్నాడు. నేను బద్ధుడను కాను. నాకు దేహంలేదు. ఏ రకమైన బంధాలు లేవు అనే భావాలతో జీవి విముక్తుడౌతున్నాడు. నేను మాంసాన్ని కాను ఎముకలు కాను. దేహం కన్నా వేరైన వాడను.

**నచ ప్రాణసంజ్ఞో నవై పంచవాయుః**
**నవా సప్తధాతుః నవాపంచకోశాః**
**నవాక్పాణి పాదౌ నచోపస్థపాయుః**
**చిదానంద రూపం శ్శివోహం శ్శివోహం ॥**

ప్రాణము అనే పేరుతో పిలువబడే 1.ప్రాణ 2.అపాన 3.వ్యాన 4.ఉదాన 5. సమానములనే పంచవాయువులు నేను కాదు. 1.శుక్లము 2.శోణితము 3.మాంసము 4.ఎముకలు 5.మజ్జ 6.చర్మము 7.మెదడు ఇవి సప్తధాతువులు. మానవ వరీరంలో ఉండేవి. 1.బంగారము 2.వెండి 3.రాగి 4.ఇనుము 5.తగరము 6.సీసము 7.సత్తు ఇవి సప్తధాతువులు లోహములు. ఇప్పుడు శంకరుడు అంటున్నాడు నేను అంటే సప్తధాతువులు కాను. 1.అన్నమయ 2.ప్రాణమయ 3.మనోమ 4.విజ్ఞానమయ 5.ఆనందమయ కోశములు. వీటిని పంచకోశాలు అంటారు. అవి నేను కాను. కాళ్ళు, చేతులు, వాక్కు, పాదాలు నేను కాదు. విసర్జకావయవములు అంతకన్నా కాదు. నేను చిదానందరూపుడైన పరబ్రహ్మను.

**అహం నిర్వికల్పో నిరాకారరూపో**

**విభుత్వాచ్చ సర్వత్ర సర్వేంద్రియాణామ్ ।**

**నచాసంగతం నైవముక్తిః నబంధః**

**చిదానందరూప శ్శివోహం శ్శివోహం ॥**

నేను నిరాకారుడను. నిర్వికల్పుడను. సర్వవ్యాపకుడను. సర్వదేశముల యందు, సర్వకాలములయందు అన్ని వస్తువుల యందు ఉంటాను. నా స్వరూపము అన్ని ఇంద్రియాలతోను గ్రహించబడుతూనే ఉంటుంది. నేను నిత్యముక్తుడను. కాబట్టి నాకు బంధం లేదు ముక్తి అంతకన్నా లేదు. నేను చిదానందరూపుడయిన పరబ్రహ్మను.

నేను పరతత్త్వాన్ని అని అంతరంగంలో నిశ్చయించుకున్న వాడు అజ్ఞానము పోయి ఆత్మసాక్షాత్కారము పొందుతాడు. అనుభవజ్ఞుడైన జ్ఞానికే ఆత్మసాక్షాత్కారము కలుగుతుంది. ఆత్మసాక్షాత్కారమైన వాడు "ఈ జగత్తులో నేను తప్ప ఇంకెవరూ లేరు. ఉన్నది ఒక్కటే పరబ్రహ్మ. అదే నేను, నేనే పరబ్రహ్మను. జ్ఞానరూపుడను. పరముడను. కేవలము శాంతరూపుడను. చిన్మయుడను. నిత్యరూపుడను. శాశ్వతుడను. సత్యరూపుడను. నేను కలిసి ఉన్నాను. విడిచి ఉన్నాను. సర్వజీవ స్వరూపుడను. చిదాకాశరూపుడను" అని భావన చేస్తాడు.

ఈ అధ్యాయంలో ఆరు శ్లోకాలున్నాయి.

**హంతాత్మజ్ఞస్య ధీరస్య ఖేలతో భోగలీలయా ।**

**న హి సంసారవాహీకైర్మూఢై స్సహసమానతా ॥** 1

నేనే ఆత్మ స్వరూపాన్ని అని తెలుసుకున్న వ్యక్తి తన జీవితాన్ని ఒక ఆటలాగా భావించగలడు. మాయలో పడి, జీవితాన్ని నరకంగా భావించేవారికి ఇది సాధ్యం కాదు. సామాన్యులకు, జ్ఞానికీ పోలిక లేదు.

ఈ శ్లోకంలో జనక మహారాజు అజ్ఞానులకు జ్ఞానులకు పోలిక లేదు అని చెబుతున్నాడు. అసలు అజ్ఞాని అంటే ఎవరు? ఎన్నో జన్మల నుంచి ప్రారబ్ధాన్ని అనుభవిస్తూ, కోరికలు కోరుకుంటూ వాటిని తీర్చుకుంటూ, అవి తీరటానికి శ్రమ పడుతూ, దానివల్ల ఇష్టాఇష్టాలు, రాగద్వేషాలు పెంచుకుంటాడు. కర్మ మూడు

రకాలు అని గతంలో చెప్పుకున్నాం. వాటిలో ప్రారబ్ధము ఒకటి. తాను చేసిన కర్మలో, ఈ జన్మలో అనుభవించవలసినదే ప్రారబ్దము. ప్రతి మానవుడు దీన్ని తప్పనిసరిగా అనుభవించి తీరాలి. జ్ఞానం వల్ల సంచితకర్మ నశిస్తుంది. సాధకుడు ఈ జన్మలో కర్మ చెయ్యడు కాబట్టి ఆగామికర్మ ఉండదు. ఇక మిగిలేది సంచితము. గతంలో ఈ జీవి చేసినదే సంచితము. ప్రారబ్ధము ఎక్కుపెట్టి వదలిన బాణం లాంటిది. ప్రతివాడూ దీన్ని అనుభవించి తీరాలి. ఇది మళ్ళీ మూడు రకాలుగా ఉంటుంది. 1. ఇచ్ఛాప్రారబ్ధము 2. అనిచ్ఛా ప్రారబ్ధము 3. పరేచ్ఛా ప్రారబ్ధము

**1. ఇచ్ఛా ప్రారబ్ధము :** ఇష్టపూర్వకంగా అనుభవించే కర్మ. ఈ కర్మను సాధకుడు ఆనందంగా అనుభవిస్తాడు. తన కోసం తన సంతోషంతో ఈ ప్రారబ్ధాన్ని సాధకుడు అనుభవిస్తాడు. భార్య, పిల్లలు, మనవలు, మనవరాండ్రు, తాను సంపాదించిన ఆస్తులు, వీటిపై గల మమకారం. తన పిల్లల కోసం, మనవల కోసం తాను ఏమైనా చేస్తాడు. దశరథ మహారాజు కైక మీద ప్రేమతో, ఆవిడ అడిగిన వరాలిచ్చాడు. పుత్రుడి మీద ప్రేమతో అశువులు బాశాడు. ఇది ఇచ్ఛాప్రారబ్ధం. దీనికి ఇంకొకరిని నిందించవలసిన అవసరం లేదు.

**2. అనిచ్ఛా ప్రారబ్ధం :** ఇష్టం లేకపోయినా బలవంతంగా నైనా సరే అనుభవించే కర్మ. ఈ కర్మ అనుభవించక తప్పదు. ఎద్దు సంతోషంగా బండిలాగదు. బండి లాగకపోతే రైతు కొడతాడు. గడ్డి వెయ్యడు, నీరు పెట్టడు. అందుకని తప్పనిసరి పరిస్థితిలోనే బండి లాగుతుంది. అలాగే కూలివాడికి పని చెయ్యాలని ఉండదు. పని చెయ్యకపోతే రోజు గడవదు కాబట్టి పని చేస్తాడు.

**3. పరేచ్ఛా ప్రారబ్ధము :** ఇతరుల ఆనందం కోసం ఈ కర్మని అనుభవించటం. సామాన్యంగా భార్య, పిల్లలు, మిత్రులు వీరి ఆనందం కోసం ఈ పని చేస్తారు. వాల్మీకి బోయవాడుగా ఉన్నప్పుడు భార్య ఆనందం కోసం దారులు కొట్టి దొంగతనాలు చేశాడు.

మానవుడు పూర్వజన్మలలో తాను చేసిన కర్మను ఈ రకంగా అనుభవించటం జరుగుతుంది. ఈ జన్మలో చేసిన కర్మ 'ఆగామి' అనబడుతుంది. ఈ కర్మ వెళ్ళి మళ్ళీ సంచితకర్మలో కలుస్తూ ఉంటుంది. ఈ కారణంచేతనే అనుభవించటం వల్ల కర్మ తరగదు. ఈ రకంగా కర్మలుచేస్తూ ఆ కర్మ ఫలితం అనుభవిస్తూ, మళ్ళీ కర్మ చేస్తూ గానుగకు కట్టిన ఎద్దులాగా సంసారచక్రంలో పడి గిరగిరా తిరుగుతుంటాడు.

దీనికి ఒక దరి, అంతు అనేవి ఉండవు. జీవితకాలం ఎద్దు గానుగను అంటిపెట్టుకుని అలాగే తిరుగుతుంటుంది. జన్మలలో కెల్లా ఉత్తమమైనది మానవజన్మ. మనిషిగా పుట్టిన తరువాత ఏదో కొన్ని కోరికలు ఉండి తీరతాయి. ఆ కోరికలు తీర్చుకోవటానికి కర్మలు చేస్తాడు. తాను అనుభవిస్తున్న కష్టాలు తొలగించుకోవటానికి కొన్ని కర్మలు చేస్తాడు. ఇలా క్రొత్త కర్మలు చేస్తూ బంధాలు ఇంకా ఇంకా పెంచుకుంటాడు. ఇదంతా అజ్ఞానము వల్లనే జరుగుతోంది. కోరికలు తీరక దుర్భరమైన జీవితాన్ని భరిస్తూ, అశాంతితో జీవించే అజ్ఞానికి, ఏ రకమైన కోరికలు లేకుండా, ప్రశాంతంగా జీవించే జ్ఞానికి పోలిక ఎక్కడ?

ఒక బిచ్చగాడు. పగలంతా అడుక్కున్నాడు. నాలుగు ఇళ్ళలో పెట్టిన పదార్థాలు తెచ్చుకుని ఊరిబయట చెరువు ఒడ్డున చెట్టుక్రింద కూర్చుని, తెచ్చుకున్న ఆహారం తిని, కాసిన నీళ్ళు త్రాగి ఆ చెట్టు క్రింద నీడలో చల్లటి గాలిలో హాయిగా నిద్రపోతున్నాడు. ఇతడికి ఏ రకమైన చీకుచింతా ఉండదు. అతడి దగ్గర ఉన్నదీ లేదు. పోయేదీ లేదు. నిశ్చింతంగా ఉన్నాడు. అదే త్రిలోకాధిపతి అయిన దేవేంద్రుడు చూడండి. అతనికి అన్ని రకాల భోగాలు ఉన్నాయి. కాని ఎవరు తపస్సు చేస్తున్నా భయమే. ఎవరు యజ్ఞయాగాలు చేస్తున్నా భయమే. వారెక్కడ తన పదవికోసం ప్రయత్నిస్తున్నారో అని. అందుకే ఎంతసేపూ ఎవరు తపస్సు చేస్తున్నా. అప్సరాంగనలను పంపి వారి తపస్సు భగ్నం చెయ్యటానికి ప్రయత్నిస్తుంటాడు. ఈ బిచ్చగాడికి ఉన్న శాంతి అతడికి ఉండదు. "నేను" అంటే మనస్సును కాదు. ఇంద్రియాలు కాదు. పంచభూతాలు అంతకన్నా కాదు. నేను ఆత్మని. నేను పరబ్రహ్మ స్వరూపాన్ని నాకు కోరికలు లేవు. రాగద్వేషాలు, మానావమానాలు, అహంకార మమకారాలు లేవు. నాకు బంధువులు, మిత్రులు, శత్రువులు ఎవరూలేరు. నేను ఒంటరివాడిని అందరికీ నేనున్నాను. నాకు మాత్రం ఎవరూ లేరు.

**ఒరులు గారు నాకు ఒరులకు నేనౌదు**

**ఒంటివాడను చుట్టమొకడు లేడు**

నేనే పరబ్రహ్మను అని భావన చేస్తాడు. అతడు కర్మలు చెయ్యడు. ఒకవేళ చేసినా కర్మఫలితాన్ని ఆశించడు. సుఖదుఃఖాలు, మానావమానాలు అన్నింటినీ సమానంగా చూసే స్థితప్రజ్ఞుడు. కర్మ చేసేటప్పుడు జ్ఞానికూడా అజ్ఞానిలాగానే చేస్తాడు. కాని దృక్పథంలో తేడా ఉంటుంది. అభిప్రాయంలో తేడా ఉంటుంది. దూరం

నుండి చూసేవారికి రెండూ ఒకేలాగా కనిపిస్తాయి. అజ్ఞాని స్వార్థంతో కర్మచేస్తే, జ్ఞాని నిస్వార్థంగా కర్మ చేస్తాడు. ఈ కారణం చేతనే అజ్ఞానం నుంచి బయట పడిన మహానుభావులకు, అజ్ఞానంలో మునిగిపోయిన సామాన్యులకు పోలిక ఎక్కడ? అంటున్నాడు జనక మహారాజు.

**యత్పదం ప్రేప్సవోనాః శక్రద్యా స్సర్వదేవతా ।**
**అహో ! తత్రస్థితో యోగీ న హర్షముపగచ్ఛతి ॥ 2**

ఇంద్రాది దేవతలకు కూడా దుర్లభమైన స్థితిలో ఉన్న యోగి ఎప్పుడూ గర్వించడు.

ఇంద్రాది దేవతలు ఏ పరమపదము పొందాలని ప్రయత్నించి, అది పొందలేక దుఃఖిస్తుంటారో, అటువంటి పరమపదాన్ని చేరిన యోగి సర్వదా ఆనందమయుడై ఉంటాడు.

'నేనే పరబ్రహ్మను' అనే విషయం అనుభవపూర్వకంగా తెలుసుకున్నవాడు బ్రహ్మానందాన్ని పొందుతాడు. బ్రహ్మానందము అంటే పరబ్రహ్మ, అతణ్ణే బ్రహ్మము అంటారు. ఆ బ్రహ్మము పొందే ఆనందాన్నే బ్రహ్మానందము అంటారు. మంచి వయసులో ఉన్నవాడు, అనుభవించాలనే కోరిక ఉన్నవాడు. ధనవంతుడు, విద్యావంతుడు, ఆచారవంతుడు ఈ లోకంలో పొందే ఆనందాన్ని మానుషానందము అంటారు.

| | |
|---|---|
| మానుషానందానికి నూరురెట్లు | – మనుష్య గంధర్వానందము |
| మనుష్య గంధర్వానందానికి నూరు రెట్లు | – నిజగంధర్వానందము |
| నిజగంధర్వానందానికి నూరు రెట్లు | – చిరలోక పితరానందము |
| చిరలోక పితరానందానికి నూరు రెట్లు | – అజానజదేవానందము |
| అజానజదేవానందానికి నూరు రెట్లు | – కర్మదేవానందము |
| కర్మదేవానందానికి నూరు రెట్లు | – నిజదేవానందము |
| నిజదేవానందానికి నూరు రెట్లు | – ఇంద్రానందం |
| ఇంద్రానందానికి నూరు రెట్లు | – బృహస్పతి ఆనందం |
| బృహస్పతి ఆనందానికి నూరు రెట్లు | – ప్రజాపతి ఆనందం |
| ప్రజాపతి ఆనందానికి నూరు రెట్లు | – బ్రహ్మానందం |

పరబ్రహ్మ పొందే ఆనందాన్ని భూలోకంలో సర్వసంఘపరిత్యాగి, అరిషడ్వర్గాలు, కామక్రోధాలు, రాగద్వేషాలు మొదలైన ద్వంద్వములను విడిచిన వాడు, మనసును జయించిన వాడు, వాసనాక్షయము గావించిన వాడు నేనే పరబ్రహ్మను. నేను తప్ప జగత్తులో ఇంకేదీ లేదు అని అనుభవపూర్వకంగా తెలుసుకున్న యోగిపుంగవుడు కూడా పొందుతాడు.

పరబ్రహ్మను తెలుసుకుని, ఆత్మసాక్షాత్కారం చేసుకుని, తురీయాతీత స్థితికి చేరి సదా ఆనంద డోలికలలో తేలియాడాలని కోరుతుంటారు ఇంద్రాదిదేవతలు. కాని వారు ఆ స్థితికి చేరలేదు. ఇంద్రాదిదేవతలు పొందే ఆనందంకన్న కొన్ని రెట్లుంటుంది ఆత్మసాక్షాత్కారం పొందినయోగి పొందే ఆనందం. అటువంటి ఆనందాన్ని పొందుతూ కూడా ఈ యోగిపుంగవుడు ఎప్పుడూ గర్వించడు. విషయ వాసనలలో చిక్కడు.

**తజ్ఞస్య పుణ్యపాపాభ్యాం స్పర్శోహ్యంతర్నజాయతే ।**
**న హ్యాకాశస్య ధూమేన దృశ్యమానోపి సంగతిః ॥ 3**

పొగ ఆకాశం అంతా నిండి ఉన్నా ఆకాశానికి పొగకి ఏ రకమైన సంబంధము లేదు. అలాగే జ్ఞానికి పాపపుణ్యాలతో సంబంధం లేదు.

మాట్లాడుకునేటప్పుడు మామూలుగా అంటాం. ఆకాశం అంతా దుమ్ము ధూళితో నిండిపోయింది. ఆకాశం అంతా పొగ కమ్మేసింది అని. తల ఎత్తి చూస్తే అంతా పొగతోను, దుమ్ముధూళితోను నిండిపోయి ఉంటుంది. అంత మాత్రం చేత ఆకాశం కలుషితం అయింది అనకూడదు. ఆకాశం ఎప్పుడూ పరిశుద్ధంగానే ఉంటుంది. అలాగే నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని జగత్తంతా నాలోనే ఉన్నది. నేనే జగత్తు జగత్తే నేను. అని భావన చేసే జ్ఞానికి పాపపుణ్యాలు అంటవు. మనం చేసేకర్మలలో మంచి కర్మలు పుణ్యంగాను, చెడు కర్మలు పాపంగాను మారతాయి. ప్రజోపయోగమైన పనులు, సమాజానికి ఉపయోగపడే పనులు మంచి పనులుగా చెబుతారు. సత్రాలు కట్టించటం, అన్నదానం చెయ్యటం, పాఠశాలలు కట్టించటం ఇవన్నీ మంచి పనులు. వీటిని చేస్తే పుణ్యం వస్తుంది. వీటిని చేసినవారు పుణ్యలోకాలకు పోతారు. ఇతరులకు హాని చేసేవి పాపపు పనులు. ఇతరులను హింసించటం, పీడించటం, దొంగతనాలు, దోపిడీలు, హత్యలు. ఈ పనులు చేసే

వారికి పాపం వస్తుంది. వీరు పాపలోకాలకు నరకానికి పోతారు. ఇతడు చేసిన పనిని ఎంత వరకు ప్రజలు గుర్తు పెట్టుకుంటారో, అంతవరకు అతడు ఆ లోకాలలోనే ఉంటాడు. ఇది సామాన్యులకు జరిగే న్యాయం. కాని జ్ఞాని అయిన వాడికి అలా జరగదు. ఎందుచేత అంటే జ్ఞాని ఏ కర్మని కూడా తనకోసం చెయ్యడు. కర్మలకు అతడికి సంబంధం లేదు. జ్ఞాని అసలు కర్మలే చెయ్యడు. కర్మలు చేసినా చెయ్యకపోయినా ఒకటే అనే విషయం అతడికి తెలుసు. ఒకవేళ జ్ఞానికర్మలు చేయవలసి వస్తే, అవి దేశం కోసం, ప్రజల కోసం చేస్తాడు. లేకపోతే నిష్కామంగా చేస్తాడు. అందుచేత అతనికి కర్మఫలం అంటదు. భాగవతంలో అంగరాజు చాలా గొప్పవాడు. వేదవేదాంగవిదుడు. సంతానం లేదు. పుత్రకామేష్టి చేసి ఒక కుమారుణ్ణి కన్నాడు. అతడి పేరు వేనుడు. వేనరాజు చిన్నప్పటి నుంచీ కడుదుర్మార్గుడు. తనతోపాటు ఆడుకునే పిల్లల్ని నీటిలో ముంచి చంపేసే వాడు. కాలం గడిచిన కొద్దీ మనిషితోపాటు దురాగతాలు కూడా పెరిగినాయి. వాటిని భరించలేక ఒకరోజు రాత్రి ఇల్లు వదలి వెళ్ళిపోయాడు తండ్రి అయిన అంగరాజు. ఇప్పుడు వేనుడే రాజయినాడు. అతని దురాగతాలకు అడ్డు లేకుండా పోయింది. ఈ విషయం అరణ్యంలో తపస్సు చేసుకునే మునీశ్వరులదాకా వెళ్ళింది. వారంతా వచ్చి రాజుకు హితవు చెప్పారు. నడవడి మార్చుకోమన్నారు. వినలేదు వేనరాజు. దాంతో మునీశ్వరులంతా కలిసి దేశక్షేమం కోసం వేనరాజును సంహరించి, అతని కుమారుడికి పట్టం కట్టారు. ఈ పనివల్ల మునీశ్వరులకు ఏమీ పాపం రాలేదు. కాబట్టి మహాజ్ఞానులు దేశంకోసం కర్మలు చేస్తారు. వారికి పాపపుణ్యాలు అంటవు.

అలాగే జనక మహారాజు. వస్తుతః ఈయన రాజు. సకల భోగభాగ్యాలు ఉన్నవాడు. కాని అవి జనకుణ్ణి ఏవిధంగాను కలుషితం చెయ్యలేదు.

**ఆత్మైవేదం జగత్సర్వం జ్ఞాతం యేన మహాత్మనా ।**
**యదృచ్ఛయా వర్తమానం తం నిషేద్ధుం క్షమేత కః ॥ 4**

ఈ జగత్తంతా లీలామాత్రంగా తనలో భాసిస్తున్నది అని తెలిసిన జ్ఞాని ఇచ్ఛాపూర్వకంగా, ఆనందంగా ఆ లీలలో పాల్గొనగలడు.

చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే అనే స్థిరమైన జ్ఞానం కలిగిన మహానుభావులకు విధినిషేధాలు నిర్ణయించే వారు ఎవరూ లేరు. దేహము,

ఇంద్రియాలు చేసే పనులయందు ఏ మాత్రము దృష్టి లేకుండా వ్యవహరించే పరమజ్ఞానికి విధి నిషేధాలు ఎలా ఉంటాయి? అతనికి పుణ్యపాపాలు అంటవు. అతడికి సర్వకాల సర్వావస్థల యందు బ్రహ్మానందం తప్ప ఇంకొకటి తెలియదు. ఇదే జ్ఞానికి జాగ్రదావస్థ. ఎవరైనా ఈ ప్రాపంచిక విషయాలు చెబితే స్వప్నంలో లాగా వాటిని చూస్తాడు. అటువంటి జ్ఞానికి వేదాలు కూడా విధినిషేధాలు విధించవు. నిజంగా చూసినట్లైతే ధర్మాలు, ధర్మశాస్త్రాలు అన్నీ ఇలాంటి వారి ప్రవర్తనను చూసి వ్రాసినవే. జ్ఞానికి అహంకారము ఏ మాత్రము ఉండదు. జగత్తంతా తన రూపమే అనే భావన అతడిలో ఉంటుంది. అందుచేత అధర్మం చెయ్యలేడు. ఎవరిమీద ద్వేషము, తిరస్కారము ఉండదు. ఎవరి పట్లా అన్యాయంగా ప్రవర్తించడు. పరుషంగా మాట్లాడడు. అందుకే జ్ఞానులు ఇలా ఉండాలి. ఈ పనులు చెయ్యాలి అని ఏ శాస్త్రాలు చెప్పలేదు. జ్ఞాని చెప్పిందే శాస్త్రము. చేసిందే శాస్త్రము. ప్రఖ్యాత గాయకుడు గాని, నాట్యాచార్యుడు గాని, కళాకారుడు గాని నిద్రలో ఉన్నా, మేల్కొని ఉన్నా, ఏ స్థితిలో ఉన్నప్పటికీ లయ, తాళం మాత్రం తప్పవు. అలాగే జ్ఞాని ధర్మాన్ని తప్పడు. అధర్మంగా ప్రవర్తించడు.

అందుకే ఈ జగత్తంతా లీలామాత్రంగా తనలోనే భాసిస్తున్నది అన్న భావన ఉన్న జ్ఞాని ఇచ్ఛాపూర్వకంగా ఆ లీలలో పాల్గొంటాడు. అతణ్ణి ఆపే వారెవరూ లేరు.

**అబ్రహ్మస్తంబ పర్యంతే భూతగ్రామే చతుర్విధే ।**
**విజ్ఞస్యైవ హి సామర్థ్య మిచ్ఛానిచ్ఛా వివర్జనే ॥ 5**

నాలుగు రకాలయిన సృష్టిలో పిపీలికాది బ్రహ్మపర్యంతము ఒక జ్ఞాని మాత్రమే కోరికలు ఇష్టాఇష్టాలు జయించి సంతోషంగా ఉండగలడు.

జగత్తు ఎలా సృష్టించబడింది అనే విషయంమీద అనేక రకాలుగా చెప్పబడింది.

1. పంచభూతాలు పంచీకరణ చెందటం వల్ల జగత్తు ఆవిర్భవించింది.
2. గుణత్రయ విభాగం వల్ల సృష్టి జరిగింది. ఇందులో సృష్టి మూడు రకాలు.

1.ఏకగుణసృష్టి 2.ద్విగుణసృష్టి 3.త్రిగుణసృష్టి

3. చరాచర జగత్తంతా శ్రీమన్నారాయణుడి నుంచే ఆవిర్భవించింది. అని వైష్ణవోపనిషత్తులు చెబుతున్నాయి.

4. సృష్టి స్థితి లయాలకు కారణం ఈశ్వరుడు అని శైవోపనిషత్తులు చెబుతున్నాయి.

5. జగత్తుకు కారణం పరాశక్తి అని శాక్తేయోపనిషత్తులు చెబుతున్నాయి.

6. కశ్యప ప్రజాపతి, ఆయన భార్యలైన వినత, కద్రువ మొదలైన వారివల్ల సృష్టి జరిగిందని పురాణాలు చెబుతున్నాయి.

7. బృహదారణ్యకోపనిషత్తులో స్వాయంభువ మనువు, శతరూపల వల్లనే జగత్తు సృష్టించబడింది అన్నారు.

8. **ఛాందోగ్యోపనిషత్తు**లో స్థావర జంగమాత్మకమైన జీవులన్నీ పుట్టుకరీత్యా అనేక విధాలుగా ఉన్నాయి.

1. అండజములు – గ్రుడ్డు నుంచి పుట్టినవి పక్షులు, పాములు
2. స్వేదజములు – చెమట, మలిన పదార్థాల నుంచి పుట్టినవి. క్రిమికీటకాలు
3. ఊష్మజాలు – వెచ్చదనం వల్ల పుట్టినవి క్రిమికీటకాలు
4. ఉద్భిజాలు – విత్తనాల వల్ల భూమి నుంచి పుట్టినవి. చెట్లు, చేమలు
5. జారజాలు – స్త్రీ జననాంగము నుండి జన్మించినవి. మనుష్యులు, పశువులు.

9. **ఐతరేయోపనిషత్తు**లో జగత్తులో జీవులు నాలుగు రకాలుగా ఉద్భవించినాయి అన్నారు.

1.అండజాలు 2.స్వేదజాలు 3.ఉద్భిజాలు 4.జారజాలు. ఇక్కడ ఊష్మజాలను విడిగా చెప్పలేదు. స్వేదజాలు, ఉద్భిజులను ఒకటిగానే లెక్క వేశారు. మొత్తంమీద జగత్తంతా పరమేశ్వరుని నుంచే ఆవిర్భవించింది అన్నారు.

సృష్టిలోని అన్ని ప్రాణులకు ఏదో ఒక కోరిక ఉంటుంది. దాన్ని అవి బయటకు వ్యక్తం చెయ్యలేకపోవచ్చు. ఏ కోరిక లేనివాడు. ఒక్క జ్ఞాని మాత్రమే. ఇతడు కోరికలకు లోనుగాకుండా ఆనందంగా జీవిస్తాడు. కోరికలు లేనివాడు మాత్రమే ఆనందంగా జీవించగలుగుతాడు.

**ఆత్మానమద్వయం కశ్చిత్ జ్ఞానాతి జగదీశ్వరమ్ ।**
**యద్వేత్తి తత్స కురుతే న భయం తస్య కుత్రచిత్ ॥ 6**

ఆత్మ ఒకటిగానే ఉన్నది. అద్వితీయంగా ఉన్నది. ఆత్మే జగత్తు, జగత్తే ఆత్మ. ఈ విషయం అనుభవపూర్వకంగా తెలుసుకొన్నవారు ఎక్కడో నూటికి ఒక్కరు ఉంటారు.

అసలు ఆత్మ అంటే ఏమిటో చూద్దాం. చరాచర జగత్తు యొక్క సృష్టి స్థితి లయాలకు కారణమైనది ఆత్మ. జగత్తుకంతటికీ ఆధారమైనది ఆత్మ. సత్యము నిత్యము శాశ్వతమైనది ఆత్మ. జ్ఞానజ్యోతి, జ్ఞానరాశియే ఆత్మ. ఆదిమధ్యాంతములు లేనటువంటిది, ప్రియాప్రియములు, సుఖదుఃఖాలు, మానావమానాలు, రాగద్వేషాలు, అహంకార మమకారాలు ఏవీ లేనిది ఆత్మ. ఆత్మస్వరూపానికి 'నా' అనే వారెవరూ ఉండరు. అన్నింటికీ అతీతమైనది. చరాచర జగత్తంతా వ్యాపించినది. జగత్తు అంటే కేవలము ఈ భూగోళమే కాదు. సూర్యుడు, చంద్రుడు, గ్రహాలు, నక్షత్రాలు, నదులు, సముద్రాలు, ఎడారులు, అరణ్యాలు, కొండలు, బండలు అన్నింటితోను కూడినది ఆత్మ. జగత్తంతా ఆత్మస్వరూపమే. అటువంటి ఆత్మ అద్వయము, అఖండము.

ఆత్మపురుషుడు నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు. అయితే ధ్యానం కోసం, ఉపాసన కోసం ఆయనకు విష్ణువని, కృష్ణుడని, పరాశక్తి అని, శివుడని రూపం కల్పించటం జరిగింది. ఆత్మ సర్వాంతర్యామి. సర్వవ్యాపి. ఆయన అణువు కన్న చిన్నవాడు. మహత్తు కన్న పెద్దవాడు. అతడు జన్మించడు. మరణించడు. తడుపబడడు. దహింపబడడు. కదలింపబడడు. ఛేదింపబడడు. జగత్తులో జరిగే విషయాలన్నింటికీ అతడే సాక్షీభూతుడు. అన్నింటినీ సమానమైన దృష్టితో చూస్తాడు. అతడికి అవయవాలు లేవు. శబ్దస్పర్శ రూప రసగంధాదులు లేవు. కోరికలు లేనివాడు. నిష్కాముడు పూర్ణకాముడు. ఆప్తకాముడు. అశుద్ధాన్ని శుద్ధంగా, అపవిత్రాన్ని పవిత్రంగా చేయగలవాడు. ఏ రకమైన కర్మలు చేయడు. ప్రాణులందరికీ మోక్షప్రదాత.

ఆత్మ ఒక్కటిగానే ఉందనీ, జగత్తులో ఆత్మకన్న వేరైనది ఏదీ లేదని, తానే పరబ్రహ్మ స్వరూపమని తెలిసిన జ్ఞానులు చాలా తక్కువగా ఉంటారు. అతడే బ్రహ్మవేత్త, మహాజ్ఞాని. లోకంలో ఇలాంటి మహాజ్ఞానులు చాలా అరుదుగా ఉంటారు. అని చెబుతున్నాడు జనక మహారాజు ఈ శ్లోకంలో.

# అధ్యాయం-5

# లయ చతుష్టయము

లయము అంటే – కరగించుట, ద్రవరూపముగా చేయుట, అగోచరమగుట, కనపడకుండా పోవుట, నశించుట, స్వరూపము లేకుండుట, మనసు ఐక్యమొందుట, తదేక ధ్యానము, ఏకాగ్రత అని అర్థం. ఇక్కడ ఈ అధ్యాయంలో **మనోలయాన్ని** గురించి చెబుతున్నారు. దీన్నే లయయోగము అంటారు. ముందుగా మనసు అంటే ఏమిటో చూద్దాం. మనసు, బుద్ధి, చిత్తము, అహంకారము ఈ నాలుగింటినీ కలిపి అంతఃకరణ చతుష్టయము అంటారు. దీనిలో మొదటిది మనసు. 'మననం చేసేది' కాబట్టే ఇది మనస్సు అనబడుతుంది. జరిగిపోయిన విషయాలను మళ్ళీ మళ్ళీ నెమరు వేస్తుంటుంది. వాటిని గుర్తుకు తెచ్చుకుని అని ఏ రకంగా జరిగాయి వాటివల్ల మనం పొందిన బాధ, సంతోషము మొదలైన విషయానుభూతులను నెమరు వేస్తుంటుంది. ఇలా మననం చేస్తుంటుంది కాబట్టే దీన్ని మనస్సు అంటారు. శరీరంలో జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలతో బాటుగా మనస్సుకూడా ఒక అవయవం. పదకొండవ అవయవం. ఇంద్రియాలన్నీ వాటికి కేటాయించబడిన స్థానాల్లోనే ఉంటాయి. అయితే మనసుకు మాత్రం ప్రత్యేకమైన స్థానం అంటూ లేదు. ఏ ఇంద్రియంతో మనం పని చేస్తుంటే, ఆ ఇంద్రియములోనే ఉంటుంది. ఉదాహరణకు కంటితో చూస్తున్నాము అనుకోండి. అప్పుడు మనస్సు ఆ చూపులో లీనమై ఉంటుంది. మనం దాన్ని తీక్షణమైన దృష్టి. ఏకాగ్రత అంటాము. ఈ స్థితిలో మానవుడికి పరిసరాలు ఏమీ తెలియవు. తనచుట్టు ప్రక్కల ఏం జరుగుతుందో ఏమీ గమనించే స్థితిలో ఉండడు. అదే ఏకాగ్రత అంటారు. ద్రోణాచార్యుల వారు కౌరవ, పాండవులకు విలువిద్య నేర్పుతున్నాడు. లక్ష్యం ఛేదించాలంటే లక్ష్యంమీదనే దృష్టి సారించాలి. ఆచార్యుల వారు శిష్యులు ఒక్కొక్కరినే పిలిచి ఎదురుగా చెట్టుపైన చిటారుకొమ్మ మీద ఉన్న చిలుక కుడికన్నుమీద దృష్టి ఉంచండి అన్నాడు. అలాగే చేశారు శిష్యులు. ఇప్పుడు గురువుగారు శిష్యుణ్ణి అడిగాడు 'నీకు ఏం కనిపిస్తోంది?' అని దానికి శిష్యులు సమాధానం చెప్పారు. 'చెట్టు, చెట్టు కొమ్మల మీద ఉన్న ఆకులు. పక్షులు, చిటారు కొమ్మన ఉన్న చిలుక, దాని కాళ్ళు, రెక్కలు అన్నీ

కనుపిస్తున్నాయి. అర్జునుడు మాత్రం "చిటారుకొమ్మన ఉన్న చిలుక యొక్క కుడికన్ను మాత్రమే కనుపిస్తున్నది" అన్నాడు. అంటే అతడి దృష్టి ఏకాగ్రత పొందిందన్న మాట. ఇంకా చెప్పాలంటే అతని మనస్సు ఆ దృష్టిలో లయమయింది. ఇలా జరిగినప్పుడు మాత్రమే లక్ష్యసాధన జరుగుతుంది. కాబట్టి మనసుకు ప్రత్యేకమైన స్థానం అంటూ ఎక్కడా లేదు. మనం ఏ అవయవంతో పని చేస్తుంటే, ఆ అవయవంలోనే లీనమయి ఉంటుంది.

మనసును గురించి అనేకచోట్ల వివరించటం జరిగింది. చివరకు ఉపనిషత్తులలో కూడా మనసును వివరించారు. 'అమృతబిందు' ఉపనిషత్తు. ఇది కృష్ణ యజుర్వేదానికి సంబంధించినది. ఇందులో మనసును గురించి చెబుతూ

**మనోహి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చా అశుద్ధమేవచ ।**

**అశుద్ధం కామసంకల్పం, శుద్ధం కామ వివర్జితమ్ ॥**

మనస్సు శుద్ధము, అశుద్ధము అని రెండు రకాలు. కామసంకల్పాలు గలది అశుద్ధము. కామసంకల్పాలు లేనిది శుద్ధము.

కామసంకల్పాలు గల అశుద్ధమైన మనస్సు మానవుణ్ణి సంసార సాగరంలో ముంచి వేస్తుంది. కోరికలు అనంతమైనవి. ఒకటి తరువాత ఒకటిగా వస్తూనే ఉంటాయి. వీటికి అంతం ఉండదు. దరిద్రంతో బాధపడేవాడు వంద రూపాయలు ఉంటే చాలు అనుకుంటాడు. వందరూపాయలున్న వాడు వెయ్యి రూపాయలు కావాలనుకుంటాడు. వెయ్యి రూపాయలు వస్తే లక్షరూపాయలు కావాలనుకుంటాడు. ఈ రకంగా ఇంకా, ఇంకా, ఇంకా కావాలి అనే ఆలోచిస్తాడు. భాగవతంలో చెప్పినట్లుగా **ఆశాపాశము తాకడున్ నిడువు. లేదంతంబు** ఆశకు అంతం లేదు. అనుకున్నవన్నీ సాధించినా తృప్తి చెందడు. ఈ ధరామండలాన్నే ఏలాలి అనుకుంటాడు. ఈ రకమైన కోరికలు కలిగించేది అశుద్ధమైన మనస్సు. ఇది మానవుణ్ణి పూర్తిగా సంసార సాగరంలో ముంచేస్తుంది. ఈ వలయంలో చిక్కుకున్నవాడు కుడితి తొట్టిలో పడ్డ ఎలుకలాగా, శ్లేష్మంలో పడ్డ ఈగలాగా అందులోంచి బయటకు రాలేడు. ఎన్ని జన్మలెత్తినా అతడికి నిష్కృతి అనేది ఉండదు. కామసంకల్పాలు లేని మనసు శుద్ధమైనది. దీని ద్వారా మానవుడు తన లక్ష్యాన్ని సాధించగలుగుతాడు. మానవుని జీవిత లక్ష్యం ఏమంటే మోక్షము. చతుర్విధ

పురుషార్థాలలోను నాల్గవదైన మోక్షము. ఇదే మనకు కావలసింది. శుద్ధమైన మనసు గలవారికి మాత్రమే ఇది సాధ్యమవుతుంది.

మానవుడు ఏ పని చెయ్యాలన్నా, కావలసింది మనస్సే. మనసు లేని పసిపిల్ల వాడికి, పిచ్చివాడికి లక్ష్యము ఏదీ ఉండదు. మానవుడి బంధ మోక్షాలకు కారణము మనస్సే.

**మనయేవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః ।**

**బంధయా విషయాసక్తం ముక్తైనిర్విషయగ్ం స్మృతమ్ ॥**

మానవుల బంధ మోక్షాలకు కారణం మనస్సు. విషయాల యందు ఆసక్తి గల మనస్సు బంధాల వైపుకు, విషయాల యందు ఆసక్తి లేని మనసు మోక్షం వైపుకు నడిపిస్తుంది.

విషయాల యందు ఆసక్తి గల మనస్సు అంటే అశుద్ధమైన, కామసంకల్పాలు గల మనసు బంధాల వైపుకు నడిపిస్తుంది. బంధాలు ముఖ్యంగా మూడు రకాలుగా ఉంటాయి.

**1. అత్యంత ప్రీతిపాత్రమైనవి :** ఈ రకమైన బంధాలను మానవుడు కోరి మరీ తగిలించుకుంటాడు. వాటిని చూసి ఆనందం పొందుతాడు. భార్య, పిల్లలు, మనవలు, వీరిమీద చూపే ప్రేమానురాగాలు ఈ రకమైనవే. మనవడిని ఎత్తుకుని ముద్దులాడతాడు. బుజ్జగిస్తాడు. గారాబం చేస్తాడు. వాడికి ఏ మాత్రం కష్టం కలిగినా సహించలేడు. తను లేకపోతే వాడు పాలుకూడా త్రాగడు అని చెప్పుకుంటాడు. ఈ మాటలు చెబుతున్నప్పుడు అతని ముఖంలో ఆనందం కనుపిస్తుంది. ఇవి **బంగారు సంకెళ్ళు.** ఇవి అతని ప్రాణంకన్న ఎక్కువ.

**2. ప్రీతిపాత్రమైనవి :** ఈ రకమైన బంధాల యందు మానవుడికి చాలా యిష్టముంటుంది. తాను సంపాదించిన ధనము, ఇల్లు, వాకిలి, ఆస్థిపాస్థులు మొదలైనవి. ప్లిలవాడి ప్రాణం కన్నా ఇవేవి ముఖ్యమైనవి కావు. వీటిని ప్రాణంతో సమానంగా చూసుకుంటాడు. ఇవి **వెండి సంకెళ్ళు.**

**3. ఇష్టము లేనివి :** ఈ రకమైన బంధాలు ఉండటానికి మానవుడు ఏ మాత్రము ఇష్టపడడు. కాని తప్పనిసరి పరిస్థితులలో ఈ బంధాలను అనుభవిస్తాడు. అంటే

ఈ బంధాలు అనుభవించి తీరాలి. ఇష్టం లేకపోయినా తప్పదు. ఇవే బానిస బ్రతుకులు. ఎద్దుకు పని చెయ్యటం ఇష్టం ఉండదు. కాని పని చెయ్యకపోతే రైతు ఊరుకోడు. కొడతాడు. గడ్డి వెయ్యడు. కాబట్టి తప్పనిసరి పరిస్థితిలో ఈ పనులు చేసి తీరాలి. ఇవే **ఇనుప సంకెళ్ళు.**

ఇక్కడ గుర్తించాల్సింది ఏమంటే అది బంగారమైనా, వెండైనా, ఇనుమైనా సంకెళ్ళు సంకెళ్ళే. బంధనాలు బంధనాలే. ఈ బంధాలకు, బంధాలకు కారణం విషయాసక్తమైన మనస్సు. అదే విషయముల యందు ఆసక్తి లేని మనసు మోక్షం వైపుకు దారి తీస్తుంది. **మమ** అనుకుంటే బంధం. **నమమ** అనుకుంటే మోక్షం. ఏ వస్తువు పైన మమకారం పెంచుకుంటే అది బంధమవుతుంది. పూర్వకాలంలో **జడభరతుడి** కథ మనకు తెలుసు. రాజ్యాన్ని కుమారుడికి ఒప్పగించి, వానప్రస్థం స్వీకరించి, తపస్సు చేసుకుంటున్నాడు మహారాజు. అనుకోకుండా నదీతీరాన లేడి ప్రసవించి చనిపోయింది. ఆ లేడి పిల్లను తెచ్చి జాగ్రత్తగా పెంచాడు. అసలే తల్లి లేని పిల్ల. దాంతో ఇంకా శ్రద్ధ తీసుకున్నాడు. ఆ లేడి పిల్ల కూడా మహారాజు దగ్గర బాగా మాలిమి అయింది. ఎప్పుడూ ఆయనతోనే ఉండేది. అవసాన దశలో కూడా లేడిపిల్ల మహారాజు దగ్గరే ఉన్నది. రాజుకూడా ఆ లేడిపిల్లనే చూస్తూ, దానికేమయినా ప్రమాదం వాటిల్లుతుందేమో అని భయపడుతూ, దాన్ని గురించే చింతిస్తూ ప్రాణాలు వదిలాడు. మానవుడి ప్రాణాలు పోయే ఆఖరు క్షణంలో దేన్ని గురించి ఆలోచిస్తాడో, అదే రూపం మరుజన్మలో ధరిస్తాడు. భాగవతంలో పురంజనుడనే రాజు భార్యనే తలచుకుంటూ ప్రాణాలు వదులుతాడు. ఆ కారణంచేత తరువాత జన్మలో విదర్భ రాజకుమార్తెగా జన్మించాడు. స్త్రీమూర్తిని తలచుకుంటూ ప్రాణాలు వదిలాడు కాబట్టి మరుజన్మలో స్త్రీగా జన్మించాడు. అలాగే మహారాజైన భరతుడు కూడా లేడి పిల్లని గురించి ఆలోచిస్తూ ప్రాణాలు వదలాడు కాబట్టి మరుజన్మలో లేడిగా జన్మించాడు. దీనికి కారణం అవసాన దశలో మనసులో లేడిని గురించి ఆలోచించటం. అదే బంధం అయింది. ఒకవేళ అవసాన దశలో మానవుడు పరమేశ్వర స్వరూపాన్ని గురించి ఆలోచిస్తే పరమేశ్వరుడౌతాడు. అజామిళుడు చూడండి. చాలా దుర్మార్గుడు. అవసాన దశలో తన కుమారుణ్ణి నారాయణా నారాయణా అని పిలిచాడు. దీనివల్ల మరణానంతరము విష్ణులోకం చేరాడు. అందుకే బంధ మోక్షాలకు కారణం కేవలము మనస్సే.

సంసారానికి కారణం మనస్సు. మనసులేని పసిపిల్లవాడికి, పిచ్చివాడికి సంసారము ఉండదు. నా భార్య, నా పిల్లలు, నా శత్రువులు, నా మిత్రులు, నా వారు, పరాయివారు. ఇలా భావించటం వల్లనే బంధాలు ఏర్పడుతున్నాయి. అదే సంసారం. పసిపిల్లవాడికి పిచ్చివాడికి సంసారం ఉండదు, అని గతంలో చెప్పుకున్నాం. ముముక్షువుకు కూడా బంధాలుండవు. సన్యాసం స్వీకరించిన వాడు అన్ని రకాల బంధాలను వదిలేస్తాడు. అతడు మోక్షగామి. సత్యాన్వేషణలో దేశం అంతా తిరుగుతుంటాడు. కాబట్టి విషయ వాంఛలు లేని మనసు శుద్ధమవుతుంది. మోక్షం కావాలంటే విషయవాంఛలను పరిత్యజించాలి.

సంసారమనేది శూన్యమైనది. కేవలము మనోవిచారరూపమైనది. లోకంలో బంధాలు ఉన్నాయని భావిస్తున్నాం. కాబట్టి అవి ఉన్నాయి. ఈవిడ నా భార్య వీరు నా పిల్లలు. వీరంతా నా వాళ్ళు అని భావిస్తున్నాం కాబట్టే బంధాలు ఏర్పాడుతున్నాయి. వారి యందు ప్రేమానురాగాలు ప్రదర్శిస్తున్నాము, పెంచుకుంటున్నాం. వీరు నా వారు కాదు. వీరికి నాకు ఏ సంబంధము లేదు అనుకుంటే వారిపట్ల బంధాలు, బాధ్యతలు ఉండవు. ఇదంతా మనసుకు సంబంధించిన విషయం. ఇందులో సత్యము అనేది ఏదీలేదు. ఉన్నది అనుకుంటే ఉన్నది లేదు అనుకుంటే లేదు. లోకంలోని బంధాలన్నీ అంతే. ఇవన్నీ మనసుకు సంబంధించినవి. కేవలము కల్పితాలు. ఈ సంసారమంతా మనసుచేతనే కల్పించబడుతోంది. యధార్థంగా చూస్తే అసలు సంసారమే లేదు. మనసులేని సుషుప్తి, మూర్ఛ వంటి అవస్థలలో సంసారము అనేది ఎక్కడా కనుపించదు. మనసు లేకపోతే సంసారం లేదు. ఈ ప్రపంచం కూడా లేదు. ఈ విషయం తెలిసిన వాడికి ఎప్పటికీ అసలు దుఃఖమే ఉండదు.

మోక్షం పొందాలి అంటే మనసు లేకుండా ఉండాలి. మనసు లేకపోవటమనేది ఇందాక చెప్పినట్లుగా పిచ్చివాడి విషయంలోనే సాధ్యమవుతుంది. కాని పిచ్చివాడికి బంధము లేదు మోక్షమూ లేదు. ఇక్కడ మనకు కావలసినది మనసు ఉండి కూడా పనిచేయని స్థితి. మనసును అదుపులో ఉంచే స్థితి. దీన్నే మనోజయము, మనోనాశనము. మనోలయము అంటారు. మోక్షం కావాలంటే మనసును అదుపులో పెట్టుకోవాలి. అయితే మనసు ఎప్పుడూ అదుపులో ఉండదు. నిరంతరము ఒక విషయం మీద నుంచి ఇంకొక విషయం మీదకు దూకుతూ ఉంటుంది. దాని

ఇష్టం వచ్చినట్లు పరుగులు పెడుతుంది. ఇంద్రియాలకు రాజు లేదా నాయకుడు మనస్సు. కాబట్టి ఇంద్రియాలన్నీ మనసు అధీనంలో ఉంటాయి. మనసు సక్రమంగా పనిచేస్తే ఇంద్రియాలు కూడా సక్రమంగా ఉంటాయి. మనసు సక్రమంగా పని చెయ్యటము అంటే అదుపులో ఉండటం. విషయవాసనలకు చిక్కకుండా ఉండటము. ఎవరి మనసు విషయ వాసనలందు చిక్కకుండా ఉంటుందో, అతడు మనసును జయించినట్లే. అజ్ఞానాన్ని పూర్తిగా వదిలిపెట్టి, జగత్తంతా పరబ్రహ్మమయము అని భావన చెయ్యగలిగిన వాడే మనసును జయించగలుగుతాడు. మనసును జయించటము అనేది అంత తేలిక అయిన పనికాదు. ఇది అజ్ఞానుల భావన. ఆత్మజ్ఞానం కలవాడికి మనసును జయించటమనేది కళ్ళు మూసి తెరిచినంత తేలిక. సర్వవ్యాపకుడైన పరబ్రహ్మమును నేనే అని భావన చేసిన వాడి మనసు అతని అధీనంలోనే ఉంటుంది. చరాచర జగత్తంతా పరబ్రహ్మలో కల్పించబడిందే. శబ్దాది విషయాలకు ప్రత్యేకమైన ఉనికి లేదు. అని తెలుసుకోవటమే మనోజయము. రజ్జువు నందు సర్పము దర్శనమిచ్చినట్లుగా, చరాచర జగత్తులో వినబడేవి, చూడబడేవి, మనసుతో భావన చేయబడేవి అన్నీ పరబ్రహ్మ స్వరూపమే అని తెలిసిన జ్ఞాని మనసు అతని అధీనంలోనే ఉంటుంది. జీవబ్రహ్మలకు భేదము లేదని తెలిసిన జ్ఞాని మనసు అతని అధీనంలోనే ఉంటుంది. ఈ రకంగా మనసును లౌకిక విషయాల యందు లగ్నం కానీయకుండా కట్టడి చేసి, జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే అని భావన చేయగలిగిన వాడే మనసును జయించిన వాడు. ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఏమంటే **"మోక్షము కావాలంటే, మనోనాశనము"** జరిగి తీరాలి.

చరాచర జగత్తంతా భ్రాంతివల్ల జనించినదే. మసక చీకటిలో త్రాడును చూసి పాము అని భయపడ్డాడు. అరిచి, కంగారు పడి గోల చేశాడు. తీరా దీపపు కాంతిలో చూసే సరికి అది పాముకాదు త్రాడు అని తెలిసింది. ఇప్పటిదాకా ఇక్కడ కనుపించిన పాము ఏమై పోయింది. ఎక్కడికైనా పారిపోయిందా? చచ్చిపోయిందా? మాయమై పోయిందా? అంటే పాము ఎక్కడికీ పోలేదు. అసలు పాము అనేది ఉంటే కదా పోవటానికి? అసలు పామే లేదు. అదంతా నీ భ్రమ. నీ మనసుతో కల్పించబడిన భ్రమ. నీ అజ్ఞానం వల్ల త్రాడును చూసి పాము అనుకున్నావు. అజ్ఞానం వదలిపోగానే అది పాముకాదు త్రాడు అని తెలిసింది. పోయింది నీ అజ్ఞానం. నీ మానసిక భ్రాంతి. **దక్షిణామూర్తి స్తోత్రము**లో భగవత్పాదుల వారు చెబుతున్నారు చూడండి.

**విశ్వం దర్పణ దృశ్యమాన నగరీతుల్యం నిజాంతర్గతమ్**
**పశ్యన్నాత్మని మాయయా బహురివోద్భూతం యథా నిద్రయా**
**యస్సాక్షాత్కురుతే ప్రబోధ సమయే స్వాత్మాన మేవాద్వయం**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥**

మానవుడు తనలో ఉన్న జగత్తును, కలలో జరిగిన విషయంలాగా చూస్తున్నాడు. ఈ ప్రపంచం అంతా అద్దంలో కనుపించే నగరం వంటిది. ఇది నిజమైనది కాదు. మాయ, భ్రాంతి వల్ల ఏర్పడినది. జ్ఞానోదయమైనప్పుడు సాధకుడికి ఈ విషయం తెలిసి ఆత్మసాక్షాత్కారమవుతుంది. ఈ రకంగా ఆత్మసాక్షాత్కారము పొందింప చేసే గురుదక్షిణామూర్తికి నమస్కారము.

ఈ విషయాలన్నీ తెలియాలి అంటే, ఆత్మసాక్షాత్కారము కావాలి అంటే మనసు సాధకుని అదుపులో ఉండాలి. మనోలయం కావాలి. ఇది నాలుగు విధాలుగా జరుగుతుంది.

1. దేహాత్మభావన పోగానే మనసు తన మూలంలో లయమవుతుంది.
2. అద్వైత జ్ఞానంతో తానే పరబ్రహ్మ స్వరూపంగా నిలచి పోవటము.
3. **నిర్వాణషట్కమ్**లో చెప్పినట్లుగా

**మనో బుద్ధ్యహంకార చిత్తాని నాహం**
**న శ్రోత్రం నజిహ్వేన చ ఘ్రాణ నేత్రే**
**నచ వ్యోమభూమి ర్నతేజోన వాయుః**
**చిదానంద రూపశ్శివోహం శ్శివోహం ॥**

మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే అంతఃకరణ చతుష్టయము నేను కాను. జ్ఞానేంద్రియాలు కాను. కర్మేంద్రియాలు కాను. పంచభూతాలు అంతకన్నా కాను. నేను సాక్షాత్తు చిదానందరూపుడైన పరమేశ్వరుడను. నేనే శుద్ధ చైతన్యాన్ని అనే భావన గనక నిలచిపోతే మనసు లయమై పోతుంది.

4. సుఖదుఃఖాలు మొదలైన ద్వంద్వములన్నింటి యందు ఉన్నది నేనే అనే భావన బలపడితే మనోలయమవుతుంది.

ఈ నాలుగు పద్ధతుల ద్వారా మనోలయం సాధించవచ్చు. భక్తిమార్గము వీటన్నింటి కన్నా గొప్పది. అధ్యాత్మ రామాయణంలో రాముడు శబరి దగ్గరకు వెళ్ళి ఆమె ఆతిథ్యం స్వీకరిస్తాడు. అప్పుడు శబరి "ఓ రామా! ఇంత కాలంగా నేను నీ కోసం ఎదురు చూస్తున్నాను. ఇప్పటికి నా గురువాక్యాలు సఫలమైనాయి. నీ దర్శనం నా గురువులకు కూడా కలగలేదు. నేను స్త్రీని అజ్ఞానిని. అందులోను హీనజాతిలో పుట్టినదాన్ని నీ దాసుల, దాసుల పరంపరలోనూ నూరవతరాన్ని పొందటానికి కూడా అర్హత లేనిదాన్ని. అటువంటి నేను నీ దర్శనం చెయ్యగలిగాను. రామా! వాక్కులకు అందని నిన్ను ఏ రకంగా దర్శించగలిగానో? ఓ దేవదేవా ! నిన్ను స్తోత్రం చెయ్యటం కూడా తెలియని దాన్ని. నన్ను అనుగ్రహించవలసింది" అంటుంది. ఆ మాటలు విన్న రాముడు.

**పుంస్త్వే స్త్రీస్త్వేవా జాతి నామ ఆశ్రమాదయః**

**న కారణం మద్భజనే భక్తిరేవహి కారణం ॥**

ఓ శబరీ ! నన్ను భజించటానికి స్త్రీ, పురుష, జాతి, లింగ పుట్టుక, ఆశ్రమ భేదాలు లేవు. కావలసింది కేవలము భక్తి మాత్రమే.

**యజ్ఞ దానతపోభిర్వా వేదాధ్యయన కర్మభిః**

**నైవ ద్రష్ట్యు మహం శక్యో మద్భక్తి విముఖైః సదా ॥**

నా యందు భక్తి లేకుండా యజ్ఞాలు, యాగాలు, దానధర్మాలు, పూజలు, పునస్కారాల వల్ల నన్ను దర్శించలేరు." అంటాడు. ఈ భక్తి తొమ్మిది రకాలు

**శ్రవణం కీర్తనం విష్ణోస్మరణం పాదసేవనమ్**

**అర్చనం వందనం దాస్యం సఖ్యం ఆత్మనివేదనమ్ ॥**

అవి 1. శ్రవణం – పరమేశ్వరుని మాహాత్యాన్ని వర్ణించే గాథలు వినటం.

2. కీర్తనం – పరమేశ్వరుణ్ణి కీర్తించటం

3. స్మరణం – సర్వకాల సర్వావస్థల యందు ఆయన రూపాన్నే స్మరించటము

4. పాదసేవ – శ్రీవారి పాదపద్మములు వత్తటం

5. అర్చనం – షోడశోపచారాలతో ఆయనను పూజించటం.

6. వందనం – హృదయపూర్వక నమస్కారము

7. దాస్యం – స్వామిని సేవించటం

8. ఆత్మనివేదన – సర్వస్వాన్ని అర్పించటం

చరాచర జగత్తంతా పరమేశ్వరుడు ఆక్రమించి ఉన్నాడు. జగత్తులో అతడు తప్ప ఇంకెవరూ లేరు అని భావన చేసి, సర్వస్వాన్ని అతడికి సమర్పించుకోవటం దీన్నే తాదాత్మ్యత, తత్పరత అంటారు. ఈ రకంగా పరమేశ్వరుణ్ణి అర్చిస్తే మనోనాశనం జరిగి, మోక్షం ప్రాప్తిస్తుంది. వీటిలో అన్నింటికన్నా భక్తిమార్గము చాలా తేలిక అయినది. ఈ విషయాన్నే ఈ అధ్యాయంలోని నాలుగు శ్లోకాలలోను వివరించారు.

**న తే సంగోஉస్తి కేనాపి కిం శుద్ధస్త్యక్తుమిచ్ఛసి ।**

**సంఘాతవిలయం కుర్వన్నేవమేవ లయం వ్రజ ॥** 1

నువ్వు దేనికీ సంబంధించి లేవు. శుద్ధమైన ఆత్మచైతన్యానివి. నేను శరీరాన్ని అనే భావన వదలిపెట్టగానే మనస్సు తన మూలంలో లయమవుతుంది.

దృశ్యమానమైన మిథ్యాజగత్తంతా శుద్ధచైతన్యమైన నీలో ఉన్నట్లుగా అనిపిస్తోంది. చరాచర జగత్తుకు, భూత భవిష్యద్వర్తమానాలకు అన్నింటికీ నీవే అధిష్టానానివి. నీ దగ్గర ఉన్నదీ లేదు. నువ్వు త్యజించవలసింది అంతకన్నా లేదు. నీకు దేనితోనూ సంబంధం లేదు. నీవు అసంగుడవు. కేవలుడవు. ప్రకృతి బంధనాల నుంచి విడివడి స్వస్వరూపంతో ఉన్నావు. నీకు రాగద్వేషాలు లేవు. అహంకార మమకారాలు లేవు. ఈర్ష్య, అసూయ, ద్వేషము లేవు. ఏవీ లేవు. అటువంటప్పుడు నువు ఇంకా త్యజించవలసినది ఏముంది?

**న మేద్వేషరాగౌ నమే లోభమోహౌ**

**మదోనైవ మేనైవ మాత్సర్య భావః ।**

**న ధర్మో నచార్థో న కామో న మోక్షః**

**చిదానంద రూపశ్శివోహం శ్శివోஉహం ॥**

నాకు రాగద్వేషాలు లేవు. లోభము, మోహము, మదము, మాత్సర్యము లేవు. ధర్మార్థ కామ మోక్షాలు అంతకాన్న లేవు. నేను చిదానంద రూపుడైన పరబ్రహ్మను.

**న పుణ్యం న పాపం న సౌఖ్యం న దుఃఖం**
**న మంత్రో న తీర్థం నవేదా నయజ్ఞాః ।**
**అహం భోజనైన భోజ్యం న భోక్తా**
**చిదానంద రూపశ్శివోహం శ్శివోహం ॥**

నాకు పాపపుణ్యాలు లేవు. సుఖదుఃఖాలు లేవు. మంత్ర తంత్రాలు లేవు. క్షేత్రాలు, తీర్థాలు లేవు. వేదాలు, వేదంలో చెప్పబడ్డ యజ్ఞయాగాలు నాకు లేవు. నేను భోజనం కాను. భోజ్యము కాను, భోక్తను అంతకన్నా కాను. నేను చిదానంద రూపమైన పరబ్రహ్మను అంటారు శంకర భగవత్పాదుల వారు తమ **నిర్వాణషట్కం**లో. కాబట్టి నీకు రాగద్వేషాలు, అహంకార మమకారాలు, పాపపుణ్యాలు, సుఖదుః ఖాలు మొదలైన ద్వంద్వాలు ఏవీ లేవు. నువ్వే సాక్షాత్తు పరబ్రహ్మవు. నువు ఇంకా దేన్ని త్యజించాలి? నీ దగ్గర త్యజించటానికి ఏముంది? చరాచర జగత్తులో పరబ్రహ్మ స్వరూపమైన నువ్వు తప్ప ఇంకెవరూ లేరు. కాని అజ్ఞానంతో రెండవది ఏదో ఉన్నది అని భావన చేస్తున్నావు. బ్రహ్మరంధ్రం ద్వారా మానవ శరీరంలోకి ప్రవేశించిన పరమేశ్వరుడు, ఈ దేహంతో తాదాత్మ్యత చెందుతున్నాడు. ఇదంతా అజ్ఞానం వల్ల జరుగుతోంది. దీనివల్లనే ఒక దాని లక్షణాలు ఇంకొక దానిలో ఆపాదించబడుతున్నాయి. యథార్థాన్ని గుర్తించకపోగా దాన్ని ఇంకొకటిగా భావన చేస్తున్నావు. మసక చీకటిలో త్రాడును చూసి పాము అనుకుంటున్నావు. స్తంభాన్ని చూసి దొంగవాడు అనుకుంటున్నావు. ఇదంతా భ్రాంతి. భ్రమ, నిజం చెప్పాలంటే అన్నింటినీ చూసే ఆత్మ చైతన్యానికి నువ్వు. ఈ విషయం తెలుసుకుంటే నీ భ్రమ పూర్తిగా నశించి పోతుంది. అహంకారం ఆవిరి అయిపోతుంది. ఈ విధంగా మనోలయం సాధించి శాంతంగా జీవించమంటున్నాడు అష్టావక్రుడు.

**ఉదేతి భవతో విశ్వం వారిధేరివ బుద్బుదః ।**
**ఇతి జ్ఞాత్వైకమాత్మానమేవ మేవలయం వ్రజః ॥** **2**

సముద్రంలోంచి ఒక నీటి బుడగ పుట్టినట్లుగా ఈ జగత్తంతా నీలో నుండే ఆవిర్భవిస్తున్నది. ఈ విషయం తెలుసుకుని అద్వైత జ్ఞానంతో ఆత్మగా నిలచిపో. ఈ విధంగా మనోలయాన్ని సాధించు.

సముద్రం దగ్గర ఒక విచిత్రమైన సన్నివేశం కనుపిస్తుంది. గాలి వేగానికి సముద్రంలోని నీరు అలలుగా వస్తుంది. గాలి వేగాన్ని బట్టి అలలు పెద్దవి, చిన్నవి అవుతుంటాయి. అలల వేగానికి నీటిలో బుడగలు ఏర్పడతాయి. ఆ బుడగలన్నీ కలిసి నీటి నురగ అవుతుంది. ఈ నురగ అలలతో పాటే వస్తుంది. కొంత సేపటి తరువాత ఆ బుడగలన్నీ పగిలిపోయి మళ్ళీ నీటిలో కలిసిపోతాయి. ఈ రకంగా సముద్రపు నీటి నుంచి బుడగలు ఏర్పడి, ఆ బుడగలు మళ్ళీ నీటిలో కలిసి పోవటాన్ని **ఫేనబుద్బుదన్యాయము** అంటారు. ఇక్కడ మనకు తెలిసేదేమంటే సముద్రంలోని బుడగలు సముద్రపు నీటికన్న వేరుకావు. నీరే బుడగలుగా ఏర్పడి కొంతసేపటి తరువాత, ఆ బుడగలు మళ్ళీ నీటిలో కలసిపోతాయి. అదే విధంగా నీలో ఉన్న చైతన్యం నుంచే జగదావిర్భావం జరిగి, మళ్ళీ జగత్తు ఆ చైతన్యంలోనే లయమవుతున్నది. జలరూపంలో ఉన్నా సముద్రపు నీరే. బుడగలుగా, నురగగా నామరూపాలు ఏర్పడినా అది సముద్రపు నీరే. అలాగే, ఈ జగత్తు అధిష్ఠానమయిన ఆత్మచైతన్యము కన్న వేరు కాదు. అధిష్ఠానమైన త్రాడు నుంచి అజ్ఞానము వలన జనించిన సర్పము, అజ్ఞానము అంతరించి పోగానే ఆ త్రాడు యందు లయమవుతున్నది. కాబట్టి చరాచర జగత్తంతా అధిష్ఠానమయిన ఆత్మనుంచే ఆవిర్భవించి మళ్ళీ అందులోనే లయమవుతున్నది. ఈ విషయాన్ని గట్టిగా అంటే జగత్తుకు బ్రహ్మమే కారణమని తెలుసుకున్నట్లైతే మనోలయాన్ని సాధించవచ్చును. ధ్యానంలో కూర్చున్నప్పుడు సాధకుడు తన మనస్సునే కాకుండా మనస్సులో ఆవిర్భవించిన కల్లోలాలు అనే సంకల్ప వికల్పాలను కూడా లయం చెయ్యాలి. **'అహం బ్రహ్మాస్మి'**. నేనే ఆత్మ స్వరూపాన్ని. నన్ను మించినది, నాకన్న వేరైనది ఈ జగత్తులో ఏదీలేదు. ఈ మాట చెప్పటం వరకు బాగానే ఉంటుంది. కాని ఆచరణలో ఇలా భావించటం చాలా కష్టం. దీనికి శుద్ధమైన, తేజోవంతమైన బుద్ధి కావాలి. అది లేకపోతే వేదాంత వాక్యాలు ధ్యానం చెయ్యటం, వాటిని అభ్యాసం చెయ్యటం సాధ్యం కాదు. "త్రిమూర్తులు, దిక్పాలకులు మొదలైన దేవతలు చేసే పని ఏదైనా నేను చేయగలను. వారు సాధించే దేదైనా సరే నేను సాధించగలను" అని సాధకుడు భావించాలి. అంటే అతడికి సంపూర్ణమైన ఆత్మబలం కావాలి. ఇంత శక్తి ఒక్కసారిగా ఎక్కడి నుంచీ రాదు. దాన్ని క్రమేణా సాధించాలి. అచంచలమైన దీక్షతో, ఓర్పుతో, పట్టుదలతో సాధించాలి. క్రమంగా మనస్సును ఆత్మలో లీనం చెయ్యాలి.

ప్రత్యక్షమప్య వస్తుత్వాద్విశ్వం నాస్త్యమలేత్వయి ।
రజ్జు సర్ప ఇవ వ్యక్తమేవ మేవ లయం వ్రజ ॥ 3

త్రాడులో నీ అజ్ఞానం చేత, భ్రాంతిచేత పాము కనుపించినట్లుగా, నీలో ఈ జగత్తు ఉన్నట్లుగా కనుపిస్తున్నది. నిజంగా జగత్తు లేదు. నువ్వు శుద్ధ చైతన్యానివి. ఈ మాట తెలుసుకుంటే నీ మనస్సు నశిస్తుంది.

దారి వెంబడి వెడుతున్నాడు. త్రోవ అంతా గడ్డి, గాదం, పిచ్చి మొక్కలు ఉన్నాయి. చూడటానికి జనావాసం లాగా లేదు. చిన్నపాటి అరణ్యంలా ఉంది. చీకటి పడిన తరువాత ఆ త్రోవన ఎవరూ పోరు. అక్కడ భయంకరమైన విషసర్పాలు తిరుగుతుంటాయని ప్రతీతి. తాను వెలుతురు ఉండగానే బయలుదేరాడు. త్రోవలో చీకటి పడింది. అయినా ఇంకా మసక మసకగా కనుపిస్తూనే ఉంది. త్రోవలో ఏ పురుగు పుట్రా ఉంటాయేమో అని భయపడుతూ త్వరత్వరగా నడుస్తున్నాడు" ఇంతలో హఠాత్తుగా త్రోవకు అడ్డంగా కనుపించింది. నాలుగు అడుగులు ఉంది. చీకట్లో నిగనిగా మెరిసిపోతోంది. నల్లత్రాచు. అదిగో దాని పడగ పెద్దగా ఉంది. కాటు వేసిందంటే కొద్ది క్షణాల్లోనే జీవితం ముగిసిపోతుంది. పది నిమిషాలాగితే ఇల్లు చేరతాడు. కాని ఇంతలోనే ఇలా అయింది. ఈ కాలసర్పం బారిన పడ్డాడు. కంటికి కనుపించిన పాము కాటు వేయక మానదంటారు. తన జీవితం ఇక్కడే ఈ త్రోవలోనే అర్థంతరంగా ముగిసిపోతుంది కాబోలు. ఇంటి దగ్గర బార్య, పిల్లలు అందరూ దిక్కులేని వారై పోతారు. ఇప్పుడు తానేం చెయ్యగలడు. పారిపోదాం అంటే పాము వెంటపడి మరీ కరుస్తుంది. "ఇప్పుడు తనకు దిక్కెవరు?" ఆలోచిస్తున్నాడు. భయంతో వణికి పోతున్నాడు. భార్యా పిల్లలు కంటి ముందుకు కనుపిస్తున్నారు. దిక్కుతోచని స్థితిలో పెద్ద పెద్దగా అరుస్తున్నాడు. ఇంతలో ఎవరో బాటసారి లాంతరు చేత్తో పట్టుకుని వెనకగా వస్తున్నాడు. ఇతని అరుపులు విని పరుగున వచ్చాడు. విషయం తెలుసుకున్నాడు. దీపపు కాంతిలో కొద్ది దూరంలో లోనే త్రోవకు అడ్డంగా ఉంది. నాలుగు అడుగుల పొడవు ఉంది. కాని ఏ మాత్రం కదలిక లేదు. అది జీవించే ఉందా? ఒకవేళ జీవించి ఉంటే ఇతని అరుపులకు బెదిరిపోయి పరుగులు తీసేది లేదా మీదపడి కాటువేసేది. చలనం లేకుండా అలాగే ఉన్నది. ప్రక్కనే ఉన్న పొదవాటి కర్ర తీసుకుని దీపపు కాంతిలో జాగ్రత్తగా దాన్ని కదిపాడు. అయినా చలనం లేదు.

బహుశః ఇది మరణించి ఉంటుంది. అనుకుని కర్రతో గట్టిగా కదిపి లాగాడు. ఇవతలకు వచ్చింది. అది పాము కాదు త్రాడు. ఎవరో త్రోవన పోతూ ఆ త్రాడును అక్కడ పడేశారు. బాటసారి అదే విషయాన్ని ఇతనికి చెప్పి దీపపు కాంతో త్రాడును చూపించాడు. భయపడవలసిన అవసరం లేదని ధైర్యం చెప్పాడు. ఇక ప్రయాణం సజావుగా సాగింది.

ఇప్పుడు జాగ్రత్తగా ఆలోచించండి. కొద్ది క్షణాల ముందు వరకు అక్కడ సర్పం కనుపించింది. ఇప్పుడు లేదు. ఏమై పోయింది? ఇతని అరుపులకు పారిపోయిందా? మాయమై పోయిందా? దేనిలో అయినా లయమై పోయిందా? ఏమీ కాలేదు. మరి ఆ పాము. ఇంతవరకు ఇంతగా భయపెట్టిన భయంకరమైన కాలసర్పం అసలు అక్కడ లేదు. పాము అంటూ అక్కడ ఉంటే కదా పారిపోవటం, మాయమై పోవటం, లయమై పోవటం మొదలైనవి జరగటానికి. అసలిక్కడ పామే లేదు. మరి ఈ బాటసారికి కనుపించింది కదా? అది భ్రాంతి. మనసులో తనకున్న భావాలు బయటకు వచ్చి కళ్ళముందు సాక్షాత్కరించినాయి. నిజంగానే అక్కడ పాము ఉన్నది అనుకున్నాడు. ఇదంతా అజ్ఞానం వల్ల కలిగిన భ్రాంతి. అజ్ఞానము రెండు రకాలుగా ఉంటుంది.

1. అగ్రాహ్యము – ఉన్న దాని యథార్థ స్వరూపము గ్రహించలేకపోవటము. త్రాడును చూసి అది త్రాడు అని గ్రహించలేకపోయాడు. 2. అన్యథా గ్రాహ్యము – వేరొకటిగా భావించటము. ఇప్పుడు త్రాడును చూసి పాము అనుకున్నాడు. ఇదంతా మనసు చేత కల్పించబడింది. స్తంభాన్ని చూసి దొంగవాడు అనుకోవటం, ముత్యపు చిప్పను చూసి వెండిపాత్ర అనుకోవటం, ఎండమావులలో నీరున్నది అనుకోవటం అన్నీ ఇలాంటివే మనోకల్పితాలే. అలాగే జగత్తు కూడా అంతే. చరాచర జగత్తులో సత్యము, నిత్యము, శాశ్వతమైనది బ్రహ్మము ఒకటే. అసలు ఈ జగత్తే లేదు. ఉన్నది నువ్వే. శుద్ధ చైతన్యానివి. జగత్తు మనోకల్పితమైనది. అదంతా మిథ్య. అందుకే **బ్రహ్మసత్యం జగన్మిథ్య**. కలలోని విషయాలు ఎంత నిజమో, ఈ జగత్తు కూడా అంతే నిజం. స్వప్నంలో అనేక దృశ్యాలు కనుపిస్తాయి. విషయాలు జరుగుతాయి. “తాను సామాన్య మానవుడు. రాజుగారు చనిపోయారు. వారసులు లేరు. పట్టపు ఏనుగుకు పూలమాల ఇచ్చి పంపారు. ఆ ఏనుగు పూలమాలను తన మెడలో

వేసింది. ప్రజలంతా జయ జయధ్వానాలు పలికారు. మంత్రులు, పురోహితులు తనను రాజును చేశారు. పొరుగు దేశపు మహారాజు తన ఏకైక కుమార్తె నిచ్చి వివాహం చేశాడు. రెండు రాజ్యాలకు తానే రాజు. స్వర్గ సుఖాలనుభవిస్తున్నాడు." ఇలా సాగుతోంది కల. ఇంతలో మెలకువ వచ్చింది. ఇదంతా కల అనుకున్నాడు. అంటే కేవలము ఊహ. భ్రాంతి. కలలోని విషయాలు, వస్తువులు ఇప్పుడు ఏవీ లేవు. అలాగే ఈ జగత్తు కూడా. అయితే ఇక్కడ చిన్న తేడా ఉన్నది. కలలోని విషయాలు, వస్తువులు అన్నీ తనకు మాత్రమే కనుపిస్తాయి. మెలకువ రాగానే ఏవీ ఉండవు. కల కరిగిపోతుంది. కాని జాగ్రదావస్థలో ఈ జగత్తు అంతా కంటికి కనుపిస్తోంది. కంటితో చూస్తున్నాడు. చేత్తో తాకుతున్నాడు. నోటితో తింటున్నాడు. అనుభవిస్తున్నాడు. ఆనందిస్తున్నాడు. వస్తువులు గాని విషయాలు గాని ఎక్కడికీ పోలేదు. ఇక్కడే ఉన్నాయి. పై పెచ్చు తనతో పాటుగా అందరికీ కనుపిస్తున్నాయి. తాను ఇల్లు కట్టుకున్నాడు. గృహప్రవేశం చేశాడు. మిత్రులు, చుట్టాలు అందరినీ పిలిచి భోజనం పెట్టాడు. వారంతా వచ్చి ఆశీర్వదించి వెళ్ళారు. ఇప్పుడు తాను ఆ ఇంట్లోనే ఉన్నాడు.

ఇక్కడ విషయం ఏమంటే మనస్సు రెండు రకాలుగా ఉంటుంది. 1. వ్యష్టి 2. సమిష్టి. వ్యష్టి అంటే ఒక వ్యక్తి యొక్క మనస్సు. సమిష్టి అంటే లోకంలోని జనులందరి యొక్క మనస్సు. ఇదే సృష్టికర్త అయిన చతుర్ముఖబ్రహ్మ. ఈ కారణం చేతనే సృష్టి కూడా రెండు రకాలుగా జరుగుతుంది.

**1. వ్యష్టి సృష్టి :** ఇందులో తాను సృష్టించిన వస్తువు తనకు మాత్రమే కనుపిస్తుంది. మహా అయితే ఇంకొకరికి ఇద్దరికి కనుపిస్తుంది. తన మనసు సృష్టించిన కల తనకు మాత్రమే కనుపిస్తుంది. గారడీవాడు సృష్టించిన వస్తువులు కొద్దిమందికి మాత్రమే కనుపిస్తాయి.

**2. సమిష్టి సృష్టి :** ఇది బ్రహ్మదేవుడు చేసిన సృష్టి. బ్రహ్మదేవుడు లోకంలోని మానవులందరి మనసులకు ప్రతీక. ఈ కారణం చేతనే ఆయన సృష్టించిన వస్తువు లేదా ప్రాణి అందరికీ ఒక లాగానే కనుపిస్తుంది. పులి, సింహము అందరికీ ఒకలాగానే కనుపిస్తాయి. అందుకే జాగ్రదావస్థలో కనుపించిన విషయాలన్నీ సత్యము అనుకుంటాడు. కాని మంచి గురువును ఆశ్రయించి శుశ్రూష చేసి జ్ఞానసముపార్జన

చేసిన తరువాత జాగ్రదావస్థలోని విషయాలు కూడా స్వప్నంలోని విషయాలలాగానే అసత్యము. ఇదంతా భ్రాంతి అని తెలుస్తుంది. అప్పుడు దృశ్యమానమైన జగత్తంతా అదృశ్యమై పోతుంది. ఆ సమయంలో మిగిలేది అధిష్ఠానమైన బ్రహ్మము ఒక్కటే. అందుకే **బ్రహ్మసత్యం జగన్మిథ్య.**

ఈ విషయాలన్నీ వంటబడితే లయయోగం సిద్ధిస్తుంది.

**సమ దుఃఖ సుఖః పూర్ణ ఆశా నైరాశ్యయోః సమః ।**
**సమజీవిత మృత్యుః సన్నేవమేవ లయం వ్రజ ॥** **4**

నువ్వు చిద్రూపుడవు. పరబ్రహ్మవు. పాపపుణ్యాలు సుఖదుఃఖాలు, నిందాస్తుతులు. జననమరణాలు అన్నింటిలోను నీవే ఉంటావు. అవన్నీ శరీర ధర్మాలు. ఆత్మధర్మాలు కావు. వాటితో నీకు ఏ రకమైన సంబంధము లేదు. కష్టాలు వచ్చినప్పుడు విచారించటం, సుఖాలు కలిగినప్పుడు ఎగిరి గంతులు వెయ్యటం వంటివి నీకుండవు. అన్నింటి యందు సమభావం కలిగి ఉంటావు. అసలు నీ దృష్టిలో పాపపుణ్యాలు, కష్టసుఖాలు, నిందాస్తుతులనేవి లేనేలేవు. వీటివల్ల నీలో ఏరకమైన మార్పు రాదు. ఇలా భావన చేసి లయయోగాన్ని సాధించు. జనన మరణాలు, సంతోషము, విచారము, ఆశ, నిరాశ, ఇవన్నీ బుద్ధిలో ఉండే జ్ఞానానికి సంబంధించినవి. ఇప్పుడు ఆ బుద్ధిని లయం చెయ్యాలి. బుద్ధి పని చెయ్యకుండా పోవాలి. నువ్వు బుద్ధికి అతీతమైన వాడివి. కాబట్టి ఈ రకమైన భావాలు, ఊహలు ఏ మాత్రము నిన్ను అంటవు. ఈ విషయాన్ని దృఢంగా నిశ్చయించుకుంటే లయయోగం సిద్ధిస్తుంది అంటున్నాడు అష్టావక్రుడు.

లయయోగం సిద్ధించే తేలిక అయిన మార్గం భక్తిమార్గం. భక్తి అంటే తాదాత్మ్యత. తత్పరత. మనకు నచ్చిన దేవతయే పరబ్రహ్మ స్వరూపము అని మనసా వాచా, కర్మణా భావన చెయ్యటం. ఈ పద్ధతిలో మనోలయం త్వరగా జరుగుతుంది. ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఏమంటే **అహం బ్రహ్మోస్మి. నేనే పరబ్రహ్మను నాకన్న వేరైనది ఈ జగత్తులో ఏదీలేదు. అని భావన చెయ్యటం అద్వైతం. ఏదో ఒక దేవత యందు మనసు లయం చెయ్యటం ద్వైతం అవుతుంది.**

# అధ్యాయం-6

# పరమాత్మ

చరాచర జగత్తంతా పరమాత్మ స్వరూపమే. ఈ జగత్తులో పరమాత్మ తప్ప ఇంకేదీ లేదు. నువ్వు, నేను, వాడు, వీడు, అది, ఇది అందరూ, అన్నీ పరమాత్మ స్వరూపమే.

**ఛాందోగ్యోపనిషత్తు**లో జాబాలి కుమారుడు సత్యకాముడు. అందరూ అతణ్ణి సత్యకామ జాబాలి అంటారు. వేదవేదాంగాలు చదివాడు. అని శాస్త్రాలు చదివాడు. ఇప్పుడు బ్రహ్మవిద్య తెలుసుకోవాలి అనిపించింది. ఆ రోజుల్లో గౌతముడు, బ్రహ్మ జ్ఞానులలో శ్రేష్ఠుడు. సత్యకామజాబాలి గౌతముడి దగ్గరకు వెళ్ళి బ్రహ్మవిద్యను ఉపదేశించమని అడిగాడు. సరేనన్నాడు గౌతముడు. ఆ రోజుల్లో విద్యాభ్యాసానికి కొన్ని పద్ధతులుండేవి.

**గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేనవా**
**అథవా విద్యయా విద్యా చతుర్థోనోప లభ్యతే ॥**

1. గురువును ఆశ్రయించి, ఆయనకు సేవ చేస్తూ ఆయన దగ్గర విద్యను అభ్యసించటము.

2. గురువు గారికి కావలసిన ధనాన్ని ఇచ్చి, ఆయన దగ్గర విద్యాభ్యాసం చెయ్యటము.

3. తనకు వచ్చిన దానిని గురువు గారికి చెప్పి, ఆయన దగ్గర తనకు కావలసినది నేర్చుకోవటం.

ఈ మూడే పద్ధతులు. నాల్గవది లేనే లేదు. అయితే ఎక్కువమంది మొదటి పద్ధతినే అనుసరించే వారు. గురువు గారికి సేవ చెయ్యటము అంటే గురువు గారి ఆవులను మేపటము, పాలు పితకటము, గోశాల శుభ్రం చెయ్యటము. ప్రతిరోజు హోమానికి అడవిలో నుంచి సమిధలు ఏరి తేవటము, కందమూలాలు తీసుకు రావటము. ఇలా ఒకటేమిటి ఆశ్రమంలో పనులన్నీ శిష్యులే చేసేవారు. గురువు గారు శిష్యులకు కావలసిన విద్యను బోధించేవాడు. వేదవేదాంగాలు, పురాణాలు,

ఇతిహాసాలు, శాస్త్రాలు, జ్యోతిష్యము, స్మార్తము. శిష్యునికి కావలసిన విద్యను బోధించేవాడు. ఇప్పుడు సత్యకామజాబాలి బ్రహ్మవిద్యను తెలుసుకోవటానికి గౌతముడి దగ్గరకు వచ్చి శుశ్రూష చేస్తున్నాడు. కాలం గడుస్తోంది. గురువు గారు తనకు ఇంతవరకు ఏమీ చెప్పలా. తనతో పాటుగా వచ్చిన ఇతరులు అందరికీ విద్యని బోధిస్తున్నాడు.

ఒకరోజున సత్యకాముడు ఒంటరిగా కూర్చుని దుఃఖిస్తున్నాడు. “నేను ఏం పాపం చేశాను? ఏ తప్పు చేశాను? నాలో శ్రద్ధ, భక్తి లేవా? గురువు గారికి సరిగా సేవ చెయ్యటం లేదా? నాకు ఎందుకు గాను ఇంతవరకు బ్రహ్మవిద్య బోధన ప్రారంభించలేదు?” ఇలా తనలో తానే తర్కించుకుని బాధ పడుతున్నాడు. ఇక్కడ మనం గ్రహించాల్సిన విషయం ఏమంటే, గురువు గారు చెబితే వినాలి. అంతేకాని నాకు ఇది కావాలి. ఇది చెప్పండి అని అడుగకూడదు. కాబట్టి సత్యకాముడు గురువు గార్ని ఏమీ అడగలేదు. తనలో తనే బాధపడుతున్నాడు. అలాగే నిద్ర పోయాడు. మరునాడు ఉదయాన్నే గురువుగారైన గౌతముడు సత్యకాముణ్ణి పిలిచి “సత్యకామా! మన గోశాలలో వట్టిపోయిన ఆవులు, దూడలు 400 దాకా ఉన్నాయి. వాటిని అడవిలోకి తోలుకుపోయి వాటి సంఖ్య రెట్టింపు అయ్యే దాకా మేపుకు రావలసింది” అన్నాడు. సరేనన్నాడు సత్యకాముడు. వట్టిపోయిన ఆవులు, ఆబోతులు, దూడలు అన్నింటినీ తోలుకుని అడవికి బయలుదేరాడు. అరణ్యంలో పశువులను మేపుకుంటూ తిరుగుతున్నాడు. పశువులన్నీ బాగా బక్కచిక్కి ఉన్నాయి. ఇవన్నీ అరణ్యంలో గడ్డి బాగా తిని బలవాలి. ఆ తరువాత చూడివి కావాలి. పిల్లలను పెట్టాలి. వాటిపిల్లలు ఎదగాలి. అవి కూడా పిల్లల్ని పెట్టాలి. ఈ రకంగా గోవుల సంఖ్య రెట్టింపు కావాలి. ఎంత కాలం పడుతుందో విచారిస్తూనే పశువులను మేపుతున్నాడు సత్యకాముడు. చాలాకాలం గడిచింది. ఒకరోజున పశువులు గడ్డి మేస్తున్న సమయంలో, సత్యకాముడు ఒక చెట్టు క్రింద కూర్చుని ఆలోచిస్తున్నాడు.

తనకు ఈ జన్మలో బ్రహ్మవిద్యను తెలుసుకునే అదృష్టం ఉన్నదో లేదో? ఇంకా ఎంతకాలం పశుకాపరిగా జీవితం గడపాలో తనతో పాటుగా గురుకులానికి వచ్చిన వారిలో చాలామంది విద్యాభ్యాసం పూర్తి చేసుకుని వెళ్ళిపోయారు. తను మాత్రం ఇదిగో ఇలా పశువులు కాచుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడు. తన దురదృష్టానికి

ఎవరిని ఏమనగలడు? ఇలా ఆలోచిస్తున్న సమయంలో అతనికి ఏవో మాటలు వినిపించాయి. ఆ ప్రాంతంలో తాను ఒక్కడే ఉన్నాడు. చుట్టుప్రక్కల కూతవేటు దూరంలో రెండవ మనిషి ఎవరూ లేరు. మరి ఈ మాట్లాడుతున్నది ఎవరు? ఆశ్చర్యంగా చుట్టూ చూశాడు. ఎవరూ లేరు. మళ్ళీ మాటలు మాత్రం వినిపించాయి. ఎదురుగా ఒక ముసలి ఆబోతు నుంచుని ఉంది. అది మానవ భాషలో మాట్లాడుతున్నది.

"సత్యకామా, ఈ ఆవుల సంఖ్య రెట్టింపు అయింది. ఇక నువు ఆశ్రమానికి బయలుదేరు. నీకు బ్రహ్మవిద్య కావాలి కదా. దాన్ని నేను చెబుతాను విను. బ్రహ్మము నాలుగు పాదాలుగా ఉంటుంది. అందులో మొదటి పాదాన్ని నేను చెబుతాను. చరాచర జగత్తులో తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం నాలుగు దిక్కులు పరబ్రహ్మ స్వరూపమే. రెండవ పాదాన్ని అగ్నిదేవుడు చెబుతాడు. లేచి బయల్దేరు" అంది.

చాలా ఆశ్చర్యపోయాడు సత్యకాముడు. ఏ మాత్రం నమ్మలేక పోతున్నాడు. అయినా నమ్మక తప్పదు. అప్పటికే సూర్యుడు పడమటి దిక్కుకు జారుకుంటున్నాడు. ఈ రోజుకు చెయ్యగలిగింది లేదు. రేపు చూద్దాం. అనుకుంటూ ఆ రాత్రికి అక్కడే విశ్రమించాడు. రాత్రంతా నిద్ర పోలేదు. జరిగిన విషయాలన్ని గురించే ఆలోచిస్తున్నాడు. పరబ్రహ్మతత్త్వము నాలుగు భాగాలుగా ఉంటుంది. తూర్పు పడమర ఉత్తరం దక్షిణం. నాలుగు దిక్కులు పరబ్రహ్మ స్వరూపమే. ఇది మొదటి పాదం. నాలుగు దిక్కులు అంటే కేవలము నాలుగు దిక్కులనే కాదు. దశ దిశలు పరబ్రహ్మ స్వరూపమే. మరి రెండవ పాదం ఏమై ఉంటుంది? ఆలోచిస్తున్నాడు. ఇంతలో తెల్లవారింది ముందుగానే లేచాడు. ఆవులన్నింటినీ తోలుకుని ఆశ్రమానికి బయలుదేరాడు. సాయంత్రం దాకా ప్రయాణం చేసి, సాయం సమయానికి ఒక గడ్డిబాగా పెరిగిన ప్రదేశం చూసుకుని అక్కడ మజిలీ చేశాడు. ఆ దగ్గరలోనే ఉన్న తటాకం దగ్గర స్నానము చేసి సంధ్యావందనము పూర్తి చేసి, అక్కడ ఉన్న చితుకులు ఏరి అగ్నిని రగిల్చాడు. అగ్నిహోత్రానికి ఎదురుగా కూర్చున్నాడు. అప్పుడు అగ్ని నుంచి ఒక సందేశం వచ్చింది. "సత్యకామా ! పరబ్రహ్మ తత్త్వంలో రెండవ పాదాన్ని వివరిస్తాను వినవలసినది. భూమి, ఆకాశము, నదీనదాలు, అడవులు, కొండలు, ఎడారులు, సముద్రాలు అన్నీ పరబ్రహ్మ స్వరూపమే. మూడవ పాదాన్ని ఒక హంస

చెబుతుంది" ఇది ఆ సందేశం సారాంశం. చాలా ఆనందించాడు సత్యకాముడు. ఆ రాత్రికి అక్కడే కాలక్షేపం చేసి మరునాడు ఉదయమే బయలుదేరాడు. పగలంతా ప్రయాణం చేసి, చీకటి పడేసరికి అనువైన ప్రదేశం చూసుకుని విడిది చేశాడు. సంధ్యావందనం పూర్తి చేసి, అగ్నిహోత్రం దగ్గర కూర్చుని ఉన్నాడు. ఇంతలో ఎక్కడి నుంచో ఒక హంస ఎగిరి వచ్చి సత్యకాముడి దగ్గర వాలి, అతనితో అంటోంది. "సత్యకామా ! పరబ్రహ్మతత్త్వంలో మూడవ పాదాన్ని నేను చెబుతాను." అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుల్లతలు అన్నీ పరబ్రహ్మ స్వరూపమే. నాల్గవ పాదాన్ని ఒక నీటి పక్షి చెబుతుంది" అంటూ ఎగిరిపోయింది హంస. ఆ రాత్రికి అక్కడే ఉండి మరునాడు ఉదయం మళ్ళీ ప్రయాణమయ్యాడు సత్యకాముడు. సాయం సమయానికి ఒక గడ్డి ప్రదేశం చేరి అక్కడ చెరువు దగ్గర స్నానము, సంధ్య పూర్తి చేసి, అగ్ని హోత్రాన్ని వెలిగించి దాని దగ్గర కూర్చున్నాడు. ఇంతలో ఎక్కడి నుంచో ఒక నీటి పక్షి ఎగురుతూ వచ్చి సత్యకాముడి దగ్గర వాలి "సత్యకామా! పరబ్రహ్మ తత్త్వంలో నాల్గవ పాదాన్ని నేను చెబుతాను. ప్రాణం బ్రహ్మ. దృష్టి బ్రహ్మ. శ్రోత్రం బ్రహ్మ. మనసు బ్రహ్మ" అంటూ ఎగిరి పోయింది. సత్యకాముడి ఆనందానికి అవధుల్లేవు. అనుకోకుండా ఒక ఆబోతు, అగ్నిదేవుడు, హంస, నీటి పక్షి. ఈ నాలుగు పరబ్రహ్మ తత్త్వాన్ని తనకు వివరించాయి. ఇప్పుడు తనకు మహదానందంగా ఉంది. ముందుగా ఈ విషయం గురువు గారికి చెప్పాలి. ఆనందంతో రాత్రంతా మేలుకునే ఉన్నాడు. తెల్లవారగానే గోవులను తోలుకుని ఆశ్రమానికి బయలుదేరాడు. ఆశ్రమం దగ్గర సాక్షాత్తు గురువుగారే ఎదురు వచ్చి ఆశ్రమంలోకి తీసుకు వెళ్ళారు. జరిగిన విషయమంతా వివరించాడు సత్యకాముడు. అతని ముఖం బ్రహ్మతేజస్సుతో వెలిగి పోతోంది. చాలా ఆనందించాడు గురువు గారు. సత్యకామా ! బ్రహ్మవిద్యను తెలుసుకునే అర్హత నీకు పూర్తిగా వచ్చింది. ఇప్పుడు నేను చెబుతాను విను అంటూ బ్రహ్మవిద్యను పూర్తిగా ఉపదేశం చేశాడు గురువైన గౌతముడు.

దీన్ని బట్టి తెలిసింది ఏమంటే, చరాచర జగత్తులో దశదిశలు, భూమి ఆకాశం, నదీనదాలు, అడవులు, కొండలు, ఎడారులు, సముద్రాలు, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, విద్యుల్లతలు, ప్రాణం, దృష్టి, శ్రోత్రం, మనస్సు అన్నీ పరబ్రహ్మ స్వరూపమే. చరాచర జగత్తంతా పరబ్రహ్మమే, చలనమున్నవి. చలనం లేనివి. ప్రాణమున్నవి, ప్రాణం లేనివి. అన్నీ పరబ్రహ్మమే. లోకంలో బ్రహ్మము తప్ప ఇంకేదీ లేదు.

"ఎన్నో కష్టాలుపడి బ్రహ్మజ్ఞానము సంపాదించిన సత్యకామజాబాలి కూడా శిష్యులను పూర్తిగా పరీక్షించిన తరువాతనే బ్రహ్మవిద్యను ఉపదేశించాడు. అంతేకాని అర్హత లేనివారికి మాత్రం చెప్పలేదు. దీనికి నిదర్శనంగా **ఉపకోశలుడి** కథ చెబుతున్నారు.

సత్యకామజాబాలి విద్యాభ్యాసం పూర్తి చేసుకుని గృహస్త్రాశ్రమం స్వీకరించి గురుకులాన్ని స్థాపించాడు. అతడి దగ్గర ఉపకోశలుడు శిష్యరికం చేస్తున్నాడు. ఈ రకంగా పన్నెండు సంవత్సరాలు గడిచినాయి. దీక్షతో గురువుగారికి సపర్యలు చేస్తున్నాడు. అయినా గురువు గారి కటాక్ష వీక్షణాలు అతడిమీద ప్రసరించలేదు. ఉపకోశలుడితో పాటు అనేకమంది శిష్యులు సత్యకాముడి దగ్గరకు వచ్చారు. వారి అర్హతలను బట్టి వారందరికీ ఉపదేశం చేసి పంపించేశాడు సత్యకాముడు. కాని ఉపకోశలుణ్ణి మాత్రం పట్టించుకోలేదు. అతడు ఆశ్రమం వదలి వెళ్ళటానికి గురువుగారి దగ్గర నుంచి అంగీకారం ఇంకారాలేదు. గురుపత్ని కూడా ఉపకోశలుణ్ణి కనికరించమని గురువుగారిని వేడుకుంది. మౌనం వహించాడుకాని మాట్లాడలేదు గురువుగారు.

ఒకరోజు ఏదోపనిమీద గ్రామాంతరం వెడుతూ ఉపకోశలుణ్ణి పిలిచి ఆశ్రమ ప్రాంగణంలోని అగ్నులను జాగ్రత్తగా చూస్తుండమని చెప్పాడు. ఉపకోశలుడు విచారంలో మునిగిపోయాడు. అన్న పానీయాలు కూడా విసర్జించాడు. చివరకు రోగగ్రస్తుడు కూడా అయినాడు. అది చూసి గురుపత్ని చాలా బాధపడింది. పుత్ర వాత్సల్యంతో ఆహారం తీసుకోమని బ్రతిమాలింది. దానికి ఉపకోశలుడు "తల్లీ! నా హృదయం ఇంకా పవిత్రం కాలేదు. అందుకే గురువుగారు నన్ను ఇంకా పరీక్షిస్తున్నారు. నా హృదయంలో ఇంకా అనేకమైన దుఃసంకల్పాలుండి ఉంటాయి. నేను అన్నం ముట్టను" అన్నాడు. అతని బాధకు ఆశ్రమంలోని అగ్నులు కూడా చలించిపోయాయి. ఆ తరువాత తమలో తాము "ఈ బ్రహ్మచారి అనేక సంవత్సరాలుగా దీక్ష నవలంభిస్తున్నాడు. తపస్సు ఆచరిస్తున్నాడు. మనలను ఆరాధిస్తున్నాడు. శాస్త్రోక్తంగా తృప్తి పరుస్తున్నాడు. గురువుగారు అతడికి ఉపదేశం చెయ్యటం లేదు. పదండి మనమే ఉపదేశం చేద్దాం" ఇలా అనుకుని ఉపకోశలుని దగ్గరకు బయలుదేరాయి. ఉపకోశలుడి ఒక సందేశమిచ్చాయి. "ఉపకోశలా! ప్రాణమే బ్రహ్మ. ఆకాశమే బ్రహ్మ. ఆనందమే బ్రహ్మ అది విన్న ఉపకోశలుడు "నాకు గతంలో

ప్రాణము బ్రహ్మ అని తెలుసు కాని ఆనందము, ఆకాశము బ్రహ్మ మయమని తెలియదు" అన్నాడు. అప్పుడు అగ్నులు హృదయాకాశాన్ని గురించి వివరిస్తూ హృదయమందే బ్రహ్మతత్త్వముంటుంది. ఆనందం ఆ తత్త్వముయొక్క నిజస్వరూపము" అన్నాయి. అప్పుడు వాటిలో ఒక అగ్ని "భూమి సూర్యుడు, చంద్రుడు ఆ పరబ్రహ్మ యొక్క రూపాంతరాలే. సూర్యునిలో ఉన్న పరబ్రహ్మతత్త్వం, నాలో ఉన్న తత్త్వం ఒక్కటే. తూర్పు, పడమర, ఉత్తర దక్షిణాలు, నక్షత్రాలు, నీరు, నింగిలలో ఉన్న తత్త్వము, నాలో ఉన్న తత్త్వము ఒక్కటే. ఆకాశంలోని మెరుపులో ఏ తత్త్వమైతే ఉన్నదో అదే నాలోనూ ఉన్నది. చరాచర జగత్తు అంతా వ్యాపించింది. ఆ తత్త్వమే పరబ్రహ్మతత్త్వము. ఈ తత్త్వాన్ని అర్థం చేసుకుని బాధలను దూరం చేసుకో" అన్నది.

ఆ తరువాత గృహస్థులు ఆరాధించే గార్హపత్యాగ్ని ఒక రూపాన్ని పొంది అంతటా వ్యాపించి పరబ్రహ్మతత్త్వాన్ని పొంది అతనికి కనిపించింది. ఆ సమయంలో సూర్యుడు, చంద్రుడు, ఆకాశము, నక్షత్రాలు, విద్యుల్లతలు ఒకటేమిటి? జగత్తు అంతా అతడికి అగ్నిరూపమై, పరబ్రహ్మరూపమై సాక్షాత్కరించింది.

గ్రామాంతరం వెళ్ళిన సత్యకాముడు తిరిగి ఆశ్రమానికి వచ్చి అలవాటు ప్రకారం ఉపకోశలుణ్ణి పిలిచాడు. చెంతకు చేరిన శిష్యుని ముఖం చూడగానే ఆశ్చర్యపోయాడు. అతడి ముఖం బ్రహ్మతేజస్సును వెదజల్లుతున్నది. అప్పుడు "ఉపకోశలా! నీ ముఖం బ్రహ్మానుభూతిని పొందిన వాడిలాగా ప్రకాశవంతంగా ఉన్నది. పరబ్రహ్మతత్త్వాన్ని గురించి నీకెవరు చెప్పారు?" అన్నాడు. జరిగిన విషయమంతా వివరించాడు ఉపకోశలుడు. పరమానందభరితుడైన సత్యకాముడు తనకు తెలిసిన బ్రహ్మజ్ఞానం అంతా ఉపకోశలుడికి వివరించాడు. అతడికి అగ్ని పరబ్రహ్మరూపమై సాక్షాత్కరించింది.

ఈ రకంగా చూస్తే జగత్తంతా బ్రహ్మమయం. బ్రహ్మమే జగత్తు, జగత్తే బ్రహ్మ. ఈ విషయాన్ని బాగా ఆకళింపు చేసుకున్నాడు జనక మహారాజు. అందుకే అంటున్నాడు. "నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని నాకన్న వేరైనది జగత్తులో ఏదీలేదు. నాకు దేనితోను సంబంధం అంతకన్నా లేదు. అటువంటప్పుడు నేను త్యజించవలసినది ఏముంది. పరిగ్రహించవలసినది ఏముంది? ఏమీ లేదు. నేను దేనినీ లయం చెయ్యవలసిన అవసరం లేదు." అనే జనక మహారాజు భావాలే ఆరవ అధ్యాయంలోని నాలుగు శ్లోకాలలోను వివరించబడ్డాయి.

**ఆకాశవదనంతోహం ఘటవత్ప్రాకృతం జగత్ ।**
**ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహోలయః ॥** **1**

అనంతమైన ఆకాశంలాగా నేను ఉన్నాను. దృశ్యమానమైన జగత్తంతా నాలో కుండలాగా ఉన్నది.

ఆత్మస్వరూపమయిన నేను ఆకాశంలాగా అంతం లేనివాడను. అనంతమైన ఆత్మకు దేహము ఆవాసము ఎలా అవుతుంది అంటే, అనంతమైన ఆకాశం కుండలో ఉంటోంది. కుండ గనక పగిలితే ఘటాకాశం మహదాకాశంలో లీనమవుతుంది. ఉపనిషత్తులలో ఆత్మని ఆకాశంతో పోల్చి చెప్పటం జరుగుతుంది. **ఆకాశం గగనం శూనం** శూన్యమైన ప్రదేశమంతా ఆకాశమే. ఇక్కడ శూన్యప్రదేశము అంటే ఏ వస్తువులు లేని ప్రదేశము. ఖాళీ ప్రదేశము అని అర్థం. అవకాశం ఇస్తుంది కాబట్టే అది ఆకాశము అనబడుతుంది. కూర్చున్న మనిషి పైకి లేవాలన్నా, పైకి ఎగరాలన్నా, క్రిందకు దిగాలి అన్నా ఆ ప్రదేశం ఖాళీగా ఉండాలి. ఆ ఖాళీ ప్రదేశాన్నే ఆకాశము అంటారు. కూర్చోవటం, లేవటం, పడుకోవటం, ఎగరటం వంటి పనులకు అవకాశం కల్పిస్తుంది. అందుకే దాన్ని ఆకాశం అంటారు. సామాన్యంగా మనం పైన కనుపించేది ఆకాశము అనుకుంటాం. కాని మన చుట్టుప్రక్కల ప్రదేశమంతా ఆకాశమే. ఆకాశం అనంతమైనది. జగత్తులో ఆకాశం ఎక్కడ ఉన్నది? అని అడిగితే, దానికి సమాధానం 'జగత్తులో ఆకాశం ఎక్కడ లేదు' సర్వత్రా వ్యాపించి ఉన్నది ఆకాశము. విశాల విశ్వం అంతా నిండి ఉంది. అందుకే సర్వవ్యాపి అయిన ఆత్మను ఆకాశంతో పోల్చి చెబుతారు.

బృహదారణ్యకోపనిషత్తు – ఆకాశం ఆత్మ అంటోంది

తైత్తిరీయోపనిషత్తు – ఆకాశాత్మా అంటోంది

ఛాందోగ్యోపనిషత్తు – ఆకాశం బ్రహ్మ అంటోంది

జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటిగా అయ్యే స్థితిని వర్ణిస్తూ "ఘటం విచ్ఛిన్నమైన తరువాత ఘటాకాశం మహదాకాశంలో ఎలా కలిసిపోతుందో అలాగే దేహము నుండి బయటకు వచ్చిన తరువాత జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది" అంటారు. ఇక్కడ ఒక్క క్షణం ఆగుదాం. సర్వత్రా వ్యాపించిన ఆకాశాన్ని మహదాకాశము అంటారు. అయితే ఆకాశం అనేక రకాలుగా ఉంటుంది. ఒక గదిలో ఉండే ఖాళీ

ప్రదేశము ఆకాశమే. కుండలో ఉండే ఖాళీ ప్రదేశము ఆకాశము. గదిలో ఉండే ఆకాశాన్ని గది ఆకాశము అని ఘటంలో ఉండే ఆకాశాన్ని ఘటాకాశమని అంటారు. ఇక్కడ మనం గుర్తించాల్సిన విషయం ఏమంటే, ఘటాకాశం మహదాకాశం కన్న వేరైనది కాదు. అది కుండలో ఉన్నది కాబట్టి దాన్ని ఘటాకాశం అన్నారు. కుండ గనక పగిలిపోతే ఘటాకాశం మహదాకాశంలో లీనమై పోతుంది. అప్పుడు ఉండేది మహదాకాశం ఒక్కటే. అలాగే ఆత్మ సర్వత్రా వ్యాపించి ఉన్నది. అన్ని ప్రాణులయందు, అన్ని వస్తువుల యందు కనుపించే జడపదార్థము, చైతన్య పదార్థము ఆత్మే. సృష్టి ప్రారంభంలో మానవుడిని సృష్టించిన తరువాత, ఈ దేహంలో నేను లేకపోతే ఎలా? అనుకుని బ్రహ్మరంధ్రం ద్వారా మానవ శరీరంలో ప్రవేశించి, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు మనస్సులతో కలసి లౌకిక సుఖాలన్నీ అనుభవిస్తూ వచ్చిన మార్గం కూడా మరిచిపోయి, పంజరంలో బంధించబడిన పక్షిలాగా ఈ దేహంలో బందీ అయిపోయింది. అజ్ఞానంతో కలిసిన ఈ ఆత్మ దేహంలో ఉన్నది కాబట్టి దేహాత్మ లేదా జీవాత్మ అనబడుతోంది. అలా ఈ దేహంలో ఉంటూ, శరీరం చేసే కర్మలన్నింటికీ తానే కర్తను, భోక్తను అని భావిస్తోంది. నిజానికి ఈ కర్మలకు ఆత్మకు ఏ రకమైన సంబంధము లేదు. కాని అజ్ఞానంతో కర్మ ఫలితాన్ని తానే అనుభవించాలి అనుకుంటోంది జీవాత్మ. ఇలా జన్మల పరంపర కొనసాగుతోంది. ఈ అజ్ఞానం గనక వదలిపోతే దేహంలోకి తాను ప్రవేశించిన మార్గం గుర్తు వస్తుంది. అప్పుడు బ్రహ్మరంధ్రం గుండా బయటకు పోయి పరమాత్మలో లీనమవుతుంది. పరమాత్మలో లీనమవటము అంటే అక్కడ పరమాత్మ అనే వస్తువు ప్రత్యేకంగా ఉన్నది అని కాదు. పాలలో పాలు కలిసినట్లుగా ఘటాకాశం మహదాకాశంలో కలిసినట్లుగా జీవాత్మ పరమాత్మ ఒకటౌతాయి. దాన్నే వేదాంత పరిభాషలో సాయుజ్యము, మోక్షము అంటారు. జీవాత్మ పరమాత్మలు రెండూ ఒకటే. వేరు కాదు. అందుకే ఇక్కడ జనక మహారాజు అంటున్నాడు. "నేను ఆద్యంతములు లేనివాణ్ణి. సర్వవ్యాపిని. జీవిలో (దేహంలో) ఉన్నాను కాబట్టి నన్ను జీవాత్మ అన్నారు. ఆ దేహాన్ని వదిలి బయటకు వస్తే ఘటాకాశం మహదాకాశంలో లీనమైనట్లుగా, జీవాత్మ పరమాత్మలు ఒకటై పోతాయి. నేను ఆత్మ స్వరూపాన్ని ఆత్మకు ఏ రకమైన బంధాలు, అనుబంధాలు ఉండవు. దేనితోను సంబంధ బాంధవ్యాలుండవు. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము ఉండవు. అటువంటప్పుడు నేను స్వీకరించవలసినది. పరిత్యజించ

వలసినది ఏదీ లేదు. నేను లయం చెయ్యవలసినది కూడా ఏదీలేదు. నేను పరమాత్మను.

**మహోదధిరివాహం స ప్రపంచో వీచి సన్నిభః ।**
**ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహోలయః ॥ 2**

నేను మహా సముద్రము వంటివాడను. సముద్రం నుంచి అలలు తరంగాలు వచ్చినట్లే నా నుంచి నామరూపాత్మకమైన జగత్తు ఆవిర్భవిస్తున్నది. ఇదే నిజమైన జ్ఞానము. ఈ విషయం తెలిసిన వాడికి పరిగ్రహించేది. పరిత్యజించేది ఏదీ ఉండదు. ఇంకా లయం చెయ్యవలసినది ఏదీలేదు.

జనక మహారాజు తనను తాను సముద్రంతో పోల్చి చెబుతున్నాడు. సముద్రము అపారపారావారము. అఖండమైన జలరాసి. అందులో ఎటువైపు నుంచి చూసినా అంతా నీరే. సముద్రానికి దరి అంతు అనేవి లేవు. ఈ జలరాసి ఒక్కో ప్రాంతంలో ఒక్కో పేరుతో పిలువబడుతుంటుంది. నిజానికి ఇన్ని సముద్రాలు లేవు. పేరుకు మాత్రం సప్తసముద్రాలు అని చెబుతాం. అంతా ఒకటే సముద్రము. నదులకు మల్లే సముద్రం విడివిడిగా ఉండదు. పేర్లు మాత్రమే విడిగా ఉంటాయి. మళ్ళీ భూమి అలా కాదు. భూగోళమంతా ద్వీపాలుగా, ద్వీపకల్పాలుగా ఉంటుంది.

సముద్రంలో ఉండేదంతా నీరే. సముద్రం లోపలికి వెళ్ళిన కొద్దీ లోతు ఎక్కువగా ఉంటుంది. సముద్రం మధ్యలో కొన్ని మైళ్ళ లోతు ఉంటుంది. అక్కడ అలలు కూడా తక్కువగానే ఉంటాయి. సముద్రం మీద నుంచి గాలి విపరీతంగా వీస్తుంటుంది. గాలి వేగానికి సముద్రంలోని నీరు వేగంగా వడ్డు వైపుకు వస్తుంటుంది. ఆ నీటినే అలలు, తరంగాలు అంటారు. ఇప్పుడు ఈ అలలతో పాటుగా గాలి బుడగలు కూడా వస్తాయి. కొద్దిసేపు ఉండి అవి మళ్ళీ పగిలిపోతాయి. ఈ అలలు లేదా తరంగాలు వడ్డుదాకా వచ్చి మళ్ళీ సముద్రంలో కలిసిపోతుంటాయి. జాగ్రత్తగా పరిశీలిస్తే సముద్రంలో ఉన్నది నీరు ఒకటే. అలలు, నురగ, తరంగాలు ఇవి ఏవీ సముద్రపు నీటి కన్నవేరు కావు. గాలికి సముద్రపు నీరే అలలుగా నురగగా మారుతుంటుంది. కొద్దిసేపటికి మళ్లీ నీరుగా మారిపోతుంది. అలాగే ఈ జగత్తు కూడా. సముద్రంలో నుంచి అలలు పుట్టినట్లుగా దృశ్యమానమైన జగత్తంతా నా

నుంచే ఆవిర్భవించి మళ్ళీ నాలోనే లీనమై పోతోంది. ఇదంతా మిథ్య. అసలు జగత్తే లేదు. ఉన్నట్లుగా అనిపిస్తున్నది. ఈ జగత్తంతా వంధ్యాపుత్రుడి వంటిది. ఇక్కడ ఉన్నది ఒక్కటే. అదే ఆత్మచైతన్యము. అదే నేను. నేను తప్ప ఇంకేదీ లేదు. అని దృఢమైన భావన గలవాడికి పరిత్యజించ వలసింది, లయం చెయ్యవలసింది అంటూ ఏమీ లేదు.

**అహం స శుక్తిసంకాశః రూప్యవద్విశ్వ కల్పనాః ।**
**ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహోలయః ॥ 3**

ఈ జగత్తంతా శుక్తరజత భ్రాంతి వంటిది. నన్ను నేను తెలుసుకోవటానికి త్యజించవలసింది, నశింప చేయవలసింది ఏదీలేదు. అంటున్నాడు జనక మహారాజు.

సముద్రంలో ముత్యపు చిప్ప తేలియాడుతోంది. చిప్పపైన నల్లగాను లోపలి భాగమంతా తెల్లగా వెండి గిన్నెలాగా సూర్యకాంతిలో మిలమిలా మెరుస్తూ ఉంటుంది. తెలియనివాడు అది నిజంగానే వెండిపాత్ర అనుకుని, దాని కోసం పరుగులు పెడతాడు. దగ్గరకు వెళ్ళి పరికించి చూశాక అది వెండిగిన్నె కాదు ముత్యపుచిప్ప అని తెలుస్తుంది. అది ముత్యపుచిప్ప అని తెలియగానే ఇంక వెండిపాత్ర కనుపించదు. అలాగే రజ్జుసర్పభ్రాంతి మసక చీకటిలో త్రాడును చూసి పాము అనుకున్నాం. అది పాము కాదు త్రాడు అని తెలియగానే పాము కనుపించదు. తన అధిష్ఠానంలో లీనమై పోతుంది. అలాగే జగత్తుకంతటికీ అధిష్టానమైన పరబ్రహ్మను గురించి తెలియనంత వరకే ఈ జగత్తు కనుపిస్తుంది. బ్రహ్మజ్ఞానం కలిగిన తరువాత, ఇంక జగత్తు ఉండదు. తన అధిష్టానమైన పరమేశ్వర స్వరూపంలో లీనమై పోతుంది. మామూలు మాటలో చెప్పాలంటే జ్ఞానం కలుగగానే జగత్తు అంతర్ధానమై పోతుంది. అంతర్ధానం అవటము అంటే నాశనమై పోతుంది అని గాని, లయమై పోతుందని గాని కాదు. అజ్ఞానం వల్ల ఇంకొక రకంగా ఆరోపించిన వస్తువులను జ్ఞానంతో యధార్థంగా తెలుసుకోవటం, అప్పుడు జగత్తు నశిస్తుంది. అంటే పూర్వస్థితికి చేరుతుంది. తన యథార్థ రూపాన్ని తాను సంతరించుకుంటుంది. అది తన అసలు రూపము. కాబట్టి జ్ఞానికి జగత్తంతా బ్రహ్మముగానే కనుపిస్తుంది. బ్రహ్మకన్న వేరే పదార్థం ఏదీలేదు అని తెలుస్తుంది. అందుకే జనక మహారాజు చెబుతున్నాడు.

ముత్యపు చిప్పను చూసి వెండిపాత్ర అనుకోవటం భ్రాంతి. త్రాడును చూసి పాము అనుకోవటం భ్రాంతి. ఇవన్నీ అజ్ఞానం వల్ల కలుగుతాయి. నాకు అజ్ఞానం లేదు. నేనే పరమేశ్వర స్వరూపాన్ని కాబట్టి నేను పరిత్యజించవలసింది, లయం చేయవలసింది ఏదీలేదు.

**అహం వా సర్వభూతేషు సర్వభూతాన్యథోమయి ।**
**ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహోలయః ॥ 4**

అన్ని ప్రాణులయందు నేనున్నాను. ఈ జగత్తంతా నాలోనే ఉన్నది. ఇదే అసలైన విజ్ఞానం. కాబట్టి నేను ఆమోదించవలసినది, పరిత్యజించవలసినది, లయం చెయ్యవలసినది ఏదీలేదు.

చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. జగత్తులో పరబ్రహ్మ కానిది ఏదీలేదు. పరమేశ్వరుడే జగత్తు. జగత్తే పరమేశ్వరుడు. అహం బ్రహ్మోస్మి నేను పరబ్రహ్మ స్వరూపాన్ని నాకన్న వేరైనది ఏదీలేదు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో సత్యకామ జాబాలి బ్రహ్మవిద్యను తెలుసుకోవటం కోసం గౌతముడి దగ్గరకు వెడతాడు. గౌతముడు గోశాలలో ఉన్న బట్టి పోయిన ఆవులను వాటి సంఖ్య రెట్టింపు అయ్యేదాకా అడవిలో మేపి తీసుకురమ్మనానడు. అడవిలో ఆవులను మేపుతున్న సత్యకాముడికి ఒకరోజున ఒక ఆబోతు ఎదురుగా నిలుచుని మానవ భాషలో "సత్యకామా ! నీకు బ్రహ్మవిద్య కావాలి. అంతేకదా. పరబ్రహ్మ తత్త్వము నాలుగు పాదాలుగా ఉంటుంది. అందులో మొదటి పాదాన్ని నేను చెబుతాను విను. ఈ జగత్తులో తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం నాలుగు దిక్కులు పరబ్రహ్మ స్వరూపమే. "రెండవ పాదాన్ని అగ్ని దేవుడు చెబుతాడు అంది. మరునాడు అగ్నిదేవుడు 'సత్యకామా పరబ్రహ్మ తత్త్వంలో రెండవ పాదాన్ని చెబుతాను విను. భూమి, ఆకాశము, నదులు, సముద్రాలు, అడవులు, కొండలు, ఎడారులు అన్నీ పరబ్రహ్మలో రెండవ పాదము" అన్నాడు. ఆ మరునాడు ఒక హంస వచ్చి "సత్యకామా! సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, నేల, నింగి అన్నీ పరబ్రహ్మలో మూడవ పాదము" అని చెప్పింది. ఆ తరువాత రోజున ఒక నీటి పక్షి వచ్చి "సత్యకామా! శ్రవణం బ్రహ్మ, దృష్టి బ్రహ్మ, ప్రాణం బ్రహ్మ, మనస్సు బ్రహ్మ" అన్నది.

అలాగే ఉపకోశలుడికి ఆశ్రమంలోని అగ్నులు బ్రహ్మవిద్యను చెబుతూ "ఉపకోశలా ! ప్రాణము బ్రహ్మ, ఆకాశము బ్రహ్మ. భూమి సూర్యుడు చంద్రుడు అన్నీ ఆ పరబ్రహ్మ యొక్క రూపాంతరాలే. సూర్యునిలో ఉన్న పరబ్రహ్మతత్త్వము నీలో ఉన్న తత్త్వము ఒకటే. తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం, నక్షత్రాలు, నేల, నింగిలలో ఉన్న తత్త్వము, నీలో ఉన్న తత్త్వము ఒకటే. మెరుపులో ఏ తత్త్వమైతే ఉన్నదో ఆ తత్త్వమే నీలోను ఉన్నది. చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నది. అదే పరబ్రహ్మతత్త్వము" అన్నాయి.

ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు బ్రహ్మవిద్యను బోధిస్తూ "ఆకాశంలో ఉండి విపరీతమైన కాంతితో లోకాలను ప్రకాశింపచేసే సూర్యునిలో ఏ తత్త్వమైతే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. చంద్రుడు లోకాలకు చల్లదనాన్ని ఇస్తూ ఉంటాడు. ఆ చంద్రునిలో ఏ తత్త్వమైతే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. జగత్తులోని ప్రతివస్తువునందు, ప్రతిప్రాణి యందు ఉన్న తత్త్వమే నీలోనూ ఉన్నది" అంటాడు.

**సుబాలోపనిషత్తు**లో "పరమేశ్వరుడు ఈ జగత్తును సృష్టించిన తరువాత మానవుణ్ణి సృష్టించాడు. ఇప్పుడు ఈ దేహంలో తాను ప్రవేశించాలి అనుకున్నాడు. బ్రహ్మరంధ్రం ద్వారా ప్రవేశించి, జ్ఞానేంద్రియాలు కర్మేంద్రియాలతో సకల భోగాలు అనుభవిస్తూ, నేను నాది అనే అహంకార మమకారాలకు లోనయినాడు. అంటే అవిద్యాపూరితుడైనాడు. దేహమే తాను అనే భ్రాంతికి లోనయి జీవాత్మ వేరు, పరమాత్మ వేరు అని భావన చేస్తున్నాడు. ఈ భ్రాంతి గనక తొలగిపోతే జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అవుతాయి.'' అని చెప్పారు. ఈ విషయం **ఐతరేయోపనిషత్తు**లో కూడా చెప్పబడింది.

ఈ రకంగా జగత్తులోని ప్రతి శరీరంలోను ప్రవేశించినవాడై సర్వాంతర్యామి అయినాడు. పరమేశ్వరుడు సర్వాంతర్యామి. జగత్తంతా నిండి ఉన్నాడు. అన్నింటికీ చైతన్యాన్ని ప్రసాదిస్తున్నాడు.

పరమేశ్వరుడు భూమిలోపల ఉంటాడు భూమి అతణ్ణి ఎరుగదు. భూమే అతడి శరీరం. భూమి లోపల ఉంటూనే భూమిని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

జలంలో ఉంటాడు. జలము అతణ్ణెరుగదు. జలమే అతడి శరీరం. జలంతో ఉంటూనే జలాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ. ఈ రకంగా పంచభూతాలు, తన్మాత్రలు, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు అన్నింటి యందు ఉంటూ వాటిని నియంత్రిస్తుంటాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ అన్నారు. ఈ విషయం **బృహదారణ్యకోపనిషత్తు**లో యాజ్ఞవల్క్యుడు కూడా చెబుతాడు.

వీటన్నింటిని బట్టి చూస్తే పరమేశ్వరుడు సర్వాంతర్యామి. అన్నింటి యందు అంటే ప్రాణమున్నవి ప్రాణం లేనివి, చలనమున్నవి చలనం లేనివి అన్నింటి యందు అంతర్యామిగాఉన్నాడు. **ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పినట్లుగా దశదిశలు, అడవులు, కొండలు,ఎడారులు, సముద్రాలు, ఆకాశం, నక్షత్రాలు, సూర్యచంద్రులు, ప్రాణం, దృష్టి, శ్రోత్రం, మనస్సు ఇవన్నీ పరబ్రహ్మలోని భాగాలే. కాబట్టి పరమేశ్వరుడు ఈ జగత్తంతా నిండి ఉన్నాడు. ఈ జగత్తంతా పరమేశ్వరునిలో ఉన్నది. ఇదే నిజమైన జ్ఞానం. ఈ మాటే చెబుతున్నాడు జనక మహారాజు. అలా చెప్పి “నేను త్యజించ వలసినది. ఆమోదించవలసినది. లయం చేయవలసినది ఏదీలేదు” అంటున్నాడు.

# అధ్యాయం-7

# అనుభవపంచకము

సమాధి రెండు రకాలుగా ఉంటుంది. 1. సవికల్ప సమాధి. 2. నిర్వికల్ప సమాధి. నిర్వికల్ప సమాధి స్థితిలో ఏమీ తెలియదు. అటువంటి నిర్వికల్ప సమాధి స్థితిలో ఉండి 'అహం బ్రహ్మాస్మి' నేనే పరమేశ్వరుడను అని భావన చేసినవాడు మోక్షం పొందుతాడు. అతడికి పునర్జన్మ ఉండదు.

## ఆత్మోపనిషత్తు

### బాహ్యాత్మ, అంతరాత్మ, పరమాత్మ

బాహ్యాత్మ, అంతరాత్మ, పరమాత్మ. ఈ పదాలను తరచు వింటూ ఉంటాము. ఆ మూడింటికీ మధ్య తేడా ఏమిటో చూద్దాం.

చరాచర జగత్తుకంతటికీ ఆధారమైన వాడు పరమేశ్వరుడు. ఆ పరమపురుషుడే మూడు రూపాలు ధరించాడు. అవి 1. బాహ్యాత్మ 2. అంతరాత్మ 3. పరమాత్మ

**1. బాహ్యాత్మ :** జన్మించటము, నశించటము, అనే ధర్మాలుగల చర్మము, మాంసము, రోమాలు, కాళ్ళు, చేతులు, గోళ్ళు, పొట్ట, నాభి, కనులు, ముక్కు చెవులు, ముఖము, ఎముకలు, మజ్జ, శుక్రము, శోణితము, శిరస్సు మొదలైన వివిధాంగాలు కలసిన స్థూలశరీరమే బాహ్యాత్మ అనబడుతుంది.

**2. అంతరాత్మ :** ఆ పరమపురుషుడే పృథివి, ఆపః, తేజో, వాయు, ఆకాశమయుడై అంటే పంచీకృతమైన భూతములనుండి జన్మించినవాడై, రాగద్వేషాలతో, సుఖదుఃఖాలతో, కామక్రోధాదులతో, సంకల్ప వికల్పాలతో, ఇంకా జ్ఞాపకశక్తి, ఉదాత్త, అనుదాత్త, హ్రస్వ, దీర్ఘ, ప్లుత, స్కలిత, గర్జిత, స్ఫుటిత, ముదిత మొదలైన అనుభవాలతో, నృత్య, గీత, వాద్య, ప్రళయ విజృంభితాదులతో, శ్రవణము చేసేవాడై, ఘ్రాణముచేసేవాడై, ఆనందించేవాడై, నియంతమై, బోధించువాడై, కర్తృత్వముగలవాడై, విజ్ఞానాత్మయై ఉండే పురుషుడే అంతరాత్మ. ఈ అంతరాత్మయే పురాణాలను, న్యాయ, మీమాంస, తర్క, ధర్మ శాస్త్రాలను వివరిస్తున్నాడు. వాసన చూడటము, ఆకర్షించటము మొదలైన కర్మ విశేషాలను చేస్తున్నాడు.

**3. పరమాత్మ :** పరమాత్మ అక్షర రూపంలో ఉపాసింపదగినవాడు. అతడే సృష్టి స్థితి లయాలకు కారణమైనవాడు. ఆద్యంతములు లేనివాడు. నిరాకారుడు, నిరంజనుడు, నిర్గుణుడు. సత్యము, నిత్యము అయినవాడు. సర్వాంతర్యామి. సర్వవ్యాపి. ఆ పరమేశ్వరుణ్ణి యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యానము, సమాధి మొదలైన యోగ ప్రక్రియలతో ఉపాసించటం జరుగుతుంది. అతడు తలవెంట్రుకలో వెయ్యోవంతు (అణుమాత్రుడై) ఉన్నాడు. ఆ పరమాత్మ పొందబడడు, జన్మించడు, మరణించడు, శుష్కింపడు, తడుపబడడు, దహించబడడు, కదలింపబడడు, ఛేదింపబడడు. అతడు నిర్గుణుడు. జగత్తులో జరిగే విషయాలన్నింటికీ అతడే సాక్షి. భూతభావనుడు. అనగా భూతములను అభివృద్ధి చేసేవాడు. ఆ పరమాత్మ పరిశుద్ధమైనవాడు. అతడికి కాళ్ళు, చేతులు, తల మొదలైన అవయవాలు లేవు. సూక్ష్ముడు, మమకారము లేనివాడు, శబ్దస్పర్శ రూపరస గంధాలు లేనివాడు. నిర్వికల్పుడు కోరికలు లేనివాడు. చింతించటానికి వీలుకానివాడు. రంగులేనివాడు. అశుద్ధాన్ని శుద్ధంగా, అపవిత్రాన్ని పవిత్రంగా చేసేవాడు. క్రియాశూన్యుడు. అటువంటి పరమాత్మకు సంసారములేదు.

అతడే ఆత్మసంజ్ఞగలవాడు. శుద్ధుడు. అతడు ఒక్కడుగానే ఉన్నాడు. అతనితో సమానమైనవారు కాని, అతనికన్న అధికులుగాని ఎవరూ లేరు. బ్రహ్మరూపంలో కేవలము పరబ్రహ్మమే ప్రకాశిస్తాడు. కాని సమస్త జగత్తులోనూ ఆ పరమేశ్వరుడే ప్రకాశిస్తున్నాడు. విద్య అవిద్య, భావము అభావము, గురువు శిష్యుడు అనే భేదాలతో ఆ పరబ్రహ్మ ప్రకాశిస్తున్నది. తత్త్వదర్శనములో ఆ పరబ్రహ్మమే కేవలము శుద్ధముగా గోచరిస్తున్నది. విద్యలేదు అవిద్యలేదు. జగత్తు అంతకన్నా లేదు. పరాపరములు లేవు. ఈ జగత్తు సత్యముగా కనిపిస్తే సంసారం కలుగుతుంది. అయితే వ్యవహారంలో మాత్రమే సంసారం సత్యంగా కనిపిస్తుంది. కాని పదార్థంలో సమస్త సంసారము అసత్యము అవుతుంది. అందులో ఉన్నదంతా మట్టే అయినప్పటికీ, ఆకారాన్ని బట్టి 'కుండ' అని పిలువబడుతోంది. ఇది కుండ అని తెలుసుకోవటానికి ఎలాటి నియమము అవసరం లేదు. అలాగే ఆత్మను పోల్చి చెప్పటానికి ఇంకొక ప్రమాణం ఏదీలేదు. ప్రమాణంలో ఆత్మయే నిత్యసిద్ధముగా ప్రకాశిస్తున్నది. ఆత్మను తెలుసుకోవటానికి దేశము, కాలము, శుద్ధి, ఇవి ఏవీ అవసరం లేదు. 'నేనే

పరమేశ్వరుడను' అని చెప్పగలిగే విజ్ఞానం కావాలి. ఈ రకంగా బ్రహ్మవేత్త అనుభవంతో నేనే పరబ్రహ్మను అని తెలుసుకుంటాడు.

సూర్యుని కాంతితో జగత్తంతా ప్రకాశిస్తున్నది. అలాగే, పరబ్రహ్మయొక్క తేజస్సుచేత అనాత్మ, అసత్తు నాశనం అయిపోయి ఈ జగత్తంతా ప్రకాశిస్తున్నది. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, సకలభూతాలు ఏ ప్రకాశంచేత అర్థవంతము, విజ్ఞానవంతము అవుతున్నాయో, అదే ఆత్మప్రకాశము. చిన్నపిల్లవాడు ఆకలి మరచిపోయి ఆటవస్తువులతో ఆడుకున్నట్లుగా, విద్వాంసుడు అహంకార మమకారాలను వదలి ఆత్మయందు రమిస్తూ ఉంటాడు. ముని తను కోరుకున్నట్లు ఒంటరిగా తిరుగుతుంటాడు. నిష్కాముడై తనయొక్క ఆత్మతోనే సర్వదా సంతుష్టుడై, స్వయంగా సర్వాత్మభావనతో సంచరిస్తూ ఉంటాడు. ఆత్మజ్ఞాని సిద్ధుడైననూ, సదాసంతుష్టుడైనప్పటికీ, సహాయము లేనివాడయినప్పటికీ, మహాబలవంతుడు. భోజనం చెయ్యకపోయినప్పటికీ నిత్యతృప్తుడు. సమానంగా కనిపించనప్పటికీ సమదర్శనుడు. అన్ని పనులు చేస్తున్నప్పటికీ ఏ పనులు చేయనివాడు. భోగాలను అనుభవిస్తున్నట్లు కనిపిస్తాడు కాని నిజానికి అభోక్త.

బ్రహ్మవేత్త శరీరము ఉండి కూడా శరీరం లేనివాడు. విభజించటానికి వీలు లేనివాడు. కాని అన్నిచోట్ల ఉంటాడు. అతడు సదా అనంతుడు. ప్రియాప్రియముల యందు, శుభాశుభముల యందు నిర్లిప్తంగా ఉంటాడు. సూర్యకాంతి ఉన్నప్పటికీ, చీకటిని కల్పించుకుని బాధపడుతున్నట్లుగా, వస్తు లక్షణాలు తెలియకుండా భ్రాంతితో నిండి జనులు బాధపడుతున్నారు. బ్రహ్మవేత్త అయినవాడు శరీరబంధనాల నుండి విముక్తి పొందుతున్నాడు. మూఢులైనవారు శరీర భ్రాంతినే చూస్తున్నారు. పాము కుబుసాన్ని విడిచినట్లుగా, జ్ఞాని దేహంమీద భ్రాంతిని వదలిపెడతాడు. గంగా ప్రవాహం ఎత్తు పల్లాలను సరిచేసేటట్లుగా ప్రాణవాయువు శరీరమంతా సంచరిస్తున్నది. ఈ శరీరము ప్రారబ్ధంవల్ల కర్మఫలమనుభవించటానికి వచ్చింది. లక్ష్యాలక్ష్యాలను వదలి కేవలము ఆత్మరూపుడైన బ్రహ్మవిదుడు స్వయంగా పరబ్రహ్మమే అవుతాడు.

బ్రహ్మవిదుడు జీవించి ఉన్నప్పుడే సర్వదా విముక్తుడవుతాడు. కృతార్థుడవుతాడు. ఉపాధి నశించటంవల్ల సద్రూప అధ్యయమగు పరబ్రహ్మ అవుతున్నాడు. నటుడు

ఆడవేషం వేసుకున్నా, వేసుకోకపోయినా పురుషుడే అయినట్లుగా, బ్రహ్మవేత్త ఎల్లప్పుడూ బ్రహ్మమే అవుతాడు. కుండ పగిలిపోయినప్పుడు, ఘటాకాశం కూడా మహదాకాశమే అవుతుంది. అలాగే ఉపాధి నశించినప్పుడు బ్రహ్మవేత్త స్వయంగా బ్రహ్మమే అవుతున్నాడు. ఆత్మవేత్త అయినవాడు. పాలలో పాలుకలసినట్లుగా, నూనెలో నూనెపోసినట్లుగా, నీటిలో నీటిని పోసినట్లుగా, తన ఆత్మను పరమాత్మలో ఏకం చేసి సుఖిస్తున్నాడు. ఈ రకంగా అఖండాత్మానందం అనుభవిస్తూ విదేహముక్తి పొందిన యతి మళ్ళీ జన్మించడు. అతడు కేవలము బ్రహ్మభావన పొందుతాడు.

విద్యావిషయమైన భ్రాంతులన్నీ బ్రహ్మవిజ్ఞానంలో దగ్ధమైపోయిన తరువాత, అతడికి పునర్జన్మ ఉండదు. తాడు పాములాగా ఉంటుంది. అలాగే మాయచేత కల్పించబడిన బంధమోక్షాలు యదార్ధంగా బ్రహ్మకు లేవు. సత్తు, అసత్తు, బంధము, మోక్షము ఇవేవీ బ్రహ్మలో ఉండవు. ఈ పదార్ధం ఉన్నది. ఈ పదార్ధం లేదు అని చెప్పే భావము బుద్ధియొక్క గుణము. నిత్యమైన ఆత్మలో అస్తి, నాస్తి లేవు. బంధమోక్షాలన్నీ మాయాకల్పితాలు. నిష్కళము, నిష్క్రియము, శాంతము, నిరవద్యము, నిరంజనము, అద్వితీయము అయిన తత్త్వములో కల్పన ఉండదు. నిరోధము లేదు. బద్ధుడు లేడు ముక్తుడు లేడు. సాధకుడు లేడు మోక్షం లేదు. ఇదే పదార్ధము. అదే పరమాత్మ.

ఆత్మకు శాంతి అశాంతి, సుఖదుఃఖాలు, వృద్ధి క్షయాలు, సంతోషం, విచారాలు, అజ్ఞానము, సాకారము లాంటివి ఏవీ ఉండవు. ఆత్మ సర్వదా ఆనందమయము అని చెబుతున్నాడు జనకమహారాజు ఈ అధ్యాయంలోని ఐదు శ్లోకాలలో

**మయ్యనంత మహాంభోధౌ విశ్వపోత ఇతస్తతః ।**
**భ్రమతిస్వాంతవాతేన న మమాస్త్య సహిష్ణుతా ॥** **1**

అపార పారావారం లాగా ఉన్న నాలో జగత్తు అనే నావ మనస్సు అనే వాయువుతో కదలింపబడుతున్నదై కదలాడుతున్నది. దానివల్ల నాకు నచ్చే ఇబ్బంది ఏదీ లేదు. ఏ విధమైన అశాంతి లేదు.

జ్ఞాని అన్నింటికీ అతీతంగా ఉంటాడు. అతనికి అహంకార మమకారాలు, రాగద్వేషాలు, సంతోషము దుఃఖము వంటివి ఏవీ ఉండవు. లౌకికమైన జగత్తుతో

అతనికి ఏ విధమైన సంబంధము ఉండదు. సంతోషం కలిగితే పొంగిపోడు. దుఃఖము వస్తే క్రుంగిపోడు. లోకంలో నేను తప్ప రెండవది ఏదీలేదనే నిశ్చయ భావంతో ఉంటాడు. స్థితప్రజ్ఞుడుగా ఉంటాడు. శ్రీకృష్ణ పరమాత్ముడు దీనికి మంచి ఉదాహరణ. కృష్ణుడు పాండవ పక్షపాతి అన్నారు. అతడు పాండవ పక్షాన నిలచి వారికి చేసింది ఏమీ లేదు. పరమేశ్వరుడు ధర్మాన్ని రక్షించటానికే ప్రయత్నిస్తాడు. అధర్మాన్ని నాశనం చెయ్యటానికే పాండవుల వైపు నుంచుని కురుక్షేత్ర మహాసంగ్రామం జరిపించాడు. 18 అక్షోహిణీల సైన్యాన్ని ఒంటిచేత్తో నాశనం చేశాడు. మరణించిన వారిలో కౌరవులే కాదు పాండవుల బంధువులు, ఆప్తులు కూడా ఉన్నారు. సాక్షాత్తు తన మేనల్లుడు అభిమన్యుడు పద్మవ్యూహంలో మరణిస్తాడని తెలిసి కూడా దూరంగా వెళ్ళిపోయాడు. తను కావాలనుకుంటే అభిమన్యుణ్ణి రక్షించగలడు. కాని అలా చెయ్యలేదు. పాండవుల వైపు కూడా అన్నదమ్ములు ఐదుగురు తప్ప ఎవరూ మిగల్లేదు. యుద్ధం అయిపోయిన తరువాత యాదవ వంశం పూర్తిగా నీ కళ్ళముందే నాశనమవుతుంది అని శాపం పెట్టింది గాంధారి. ఏ మాత్రం చలించలేదు కృష్ణుడు. పైగా అత్తా! యాదవ వీరులను సంహరించటానికి నేను మళ్ళీ రానవసరం లేకుండా చేశావు అన్నాడు. అదీ పరమేశ్వర తత్త్వము అంటే ఏం జరిగినా తొణుకు బెణుకు ఉండవు. నిశ్చలంగా ఉంటుంది.

ఆ విషయమే చెబుతున్నాడు జనక మహారాజు. నేను అపార జలనిధి అయిన సముద్రంలాగా ఉన్నాను. సముద్రంలో ఓడ ప్రయాణం చేస్తూ గాలికి అటు ఇటు ఊగుతుంటుంది. అయినప్పటికి దానివల్ల సముద్రానికి వచ్చే నష్టం ఏదీలేదు. అలాగే నాలో జగత్తు అనే నావ మనస్సు అనే వాయువుతో కదలించబడి అటు ఇటు ఊగిపోతోంది. దానివల్ల నాకు ఏ రకమైన ఇబ్బంది గాని, అశాంతి గాని లేవు అంటున్నాడు.

**మయ్యనంత మహాంభోధౌ జగద్వీచిః స్వభావతః ।**
**ఉదేతు వాఽస్తమాయతు న మే వృద్ధిర్న చ క్షతిః ॥** **2**

నేను మహాసముద్రంలాగా ఉన్నాను. నాలో తరంగాల లాగా జగదావిర్భావము, లయము జరుగుతున్నాయి. దానివల్ల నాలో వృద్ధి క్షయాలు కలగవు.

మహాసముద్రము. దాని లోతు ఎంత అనేది ఎవరికీ తెలియదు. అవతలి ఒడ్డు తెలియదు. అది ఎక్కడ ప్రారంభమవుతున్నదో, ఎక్కడ అంతమవుతున్నదో తెలియదు. మహోన్నతమైన జలరాసి. అపార పారావారము. జగత్తులో మూడు వంతులదాకా ఉన్నది సముద్రమే. అటువంటి సముద్రంలో నిరంతరము అలలు ఉవ్వెత్తున లేస్తూ ఉంటాయి. ఇలా కెరటాలు రావటం వల్ల సముద్రంలోకి క్రొత్తగా నీరు ఎక్కడ నుంచీ రాదు. నీరు పెరగదు. అలా లేచిన కెరటాలు పడిపోతుంటాయి. ఇలా కెరటాలు పడిపోవటం వల్ల సముద్రంలో నీరు తగ్గిపోదు. మొత్తం మీద చూస్తే కెరటాలు రావటం వల్ల సముద్రానికి ఏ రకమైన వృద్ధి క్షయాలు ఉండవు. ఇక్కడ గమనించవలసిన విషయం ఇంకోటుంది. వర్షాకాలంలో సగం వర్షం సముద్రంలోనే కురుస్తుంది. పర్వతాల మీద, భూమి మీద కురిసిన వర్షానికి వాగులు వంకలు ఏర్పడి, నదులు పొంగి సముద్రంలో కలుస్తాయి. అంటే దాదాపుగా సంవత్సర వర్షపాతంలో 60 శాతము పైగా నీరు సముద్రంలో కలుస్తుంది. దీనివల్ల సముద్రంలో ఏ రకమైన మార్పు ఉండదు. అలాగే వేసవి కాలంలో సముద్రంలోని చాలా నీరు ఆవిరి అయి మేఘాలుగా మారిపోతుంది. ఇలా నీరు ఆవిరి కావటం చేత సముద్రంలో నీటిమట్టం తగ్గదు. కాబట్టి తరంగాల వల్ల, వర్షాల వల్ల సముద్రానికి ఏ రకమైన వృద్ధిక్షయాలు ఉండవు. అలాగే నాకు కూడా నేను సత్యము, నిత్యము, శాశ్వతము అయిన ఆనంద స్వరూపాన్ని నేనే పరబ్రహ్మను. నా నుంచే ఈ జగత్తు ఆవిర్భవించి, తిరిగి నాలోనే లయమవుతున్నది. దీనివల్ల నాలో ఏ వికారాలు కలగవు. అజ్ఞానం వల్లనే జగత్తు ఆవిర్భవిస్తున్నది. అజ్ఞానం రెండు భాగాలుగా ఉంటుంది. 1.అగ్రాహ్యము 2.అన్యథాగ్రాహ్యము. అగ్రాహ్యము అంటే వస్తువు యొక్క అసలు రూపాన్ని తెలుసుకోలేకపోవటం. అన్యథా గ్రాహ్యము అంటే ఇంకొక వస్తువు యొక్క లక్షణాలు అందులో ఆరోపించటం. ఈ అగ్రాహ్యమే అన్యథా గ్రాహ్యానికి కారణమయి నానాత్వ ప్రపంచంగా గుర్తించబడుతున్నది. తత్త్వజ్ఞానం వలన అజ్ఞానము, భ్రమ అన్నీ నశించిపోతాయి. ఈ భ్రమవల్లనే ఈ జగత్తు సృష్టించబడుతున్నది.

అజ్ఞానం ఎలా వస్తోంది? అంటే మనస్సును మించిన అజ్ఞానం ఇంకొకటి లేదు. మనస్సే అజ్ఞానం. ఈ మనస్సు వలనే అన్ని రకాలయిన బాధలు, అనుభవాలు జరుగుతున్నాయి. మనసు నశిస్తే ఇవన్నీ వాటంతట అవే నశిస్తాయి. మనస్సు పని

చేస్తేనే జగత్తు పని చేస్తుంది. మనసు లేకపోతే జగత్తు లేదు. అందుకే అంటున్నాడు జనక మహారాజు. సముద్రంలో అలలు పుట్టి నశించినట్లుగా, నా నుంచే ఈ జగత్తు ఆవిర్భవించి లయం చెందుతున్నది. దానివల్ల నాకు వచ్చేది లేదు పోయేది అంతకన్నా లేదు.

**మయ్యనంత మహాంభోధౌ విశ్వం నామ వికల్పనా ।**
**అతిశాంతో నిరాకార ఏతదేవాహమాస్థితః ॥ 3**

అనంతమైన మహాసముద్రంలాగా ఉన్న నాలో జగత్తు అనే భ్రమ కల్పించబడుతున్నది. నేను నిత్యము నిరాకారుడను, కేవలుడను, శాంతుడను. ఈ అజ్ఞానంలో నేను ఆనందంగా ఉన్నాను.

ఆది అంతము లేని నేను అనే ఈ మహాసముద్రంలో కనుపించే జగద్వ్యవహార మంతా భ్రమ అంతే గాని నిజం కాదు. కాబట్టి వీటివల్ల నాకు ఏ ప్రమాదము లేదు. నేను జ్ఞానస్వరూపుడను. నిరంజనుడను నిరాకారుడను. అటువంటి నాకు లయయోగమే కాదు. ఏ యోగము అవసరం లేదు.

ఇక్కడ **బ్రహ్మసత్యం జగన్మిథ్య** అనే మాటను చెబుతున్నారు. చరాచర జగత్తులో నామరూపాత్మకమైనవన్నీ అశాశ్వతాలే. అసలు జగత్తే లేదు. బ్రహ్మము ఒక్కటే సత్యము నిత్యము శాశ్వతమైనది. జగత్తంతా మిథ్య. భ్రాంతిచేత, అజ్ఞానం చేత కల్పించబడింది.

జగత్తును సృష్టించటానికి ప్రత్యేకంగా బ్రహ్మదేవుడు లేడు. కలలను సృష్టించినట్లే ఈ జగత్తును మనస్సే సృష్టిస్తున్నది. బ్రహ్మదేవుడు చేసేది సమిష్టి సృష్టి. జగత్తులోని జీవరాసి యొక్క సమ్మేళనమే బ్రహ్మదేవుడు. ఈ కారణం చేతనే బ్రహ్మ చేసే సృష్టి అందరికీ కనుపిస్తుంది. మనసు లేని పసిపిల్లవాడికి, పిచ్చివాడికి ఈ జగత్తు గాని, సృష్టి గాని కనుపించవు. స్వప్నంలాగానే ఈ జగత్తంతా కల్పనా మాత్రము. మానవుడికి జ్ఞానం కలిగినట్లైతే ఈ జగత్తు నశిస్తుంది. ఒకవేళ ఈ జగత్తే గనక సత్యమైతే జ్ఞానం కలిగినా నశించదు. భ్రాంతి సిద్ధమైన వస్తువులు జ్ఞానంతో నశించిపోతాయి. జ్ఞాన సముపార్జనలో నశించే వస్తువులు అసత్యమైనవి. దీనికంతటికీ కారణం మనస్సు. తన రచనాశక్తితో 84 లక్షల రకాలైన జీవరాసితో ఈ జగత్తును సృష్టించి

బ్రహ్మవేత్తలను కూడా అందులో ముంచేస్తుంది. ఈ జగత్తంతా మనస్సు వల్లనే కల్పించబడుతుంది. యధార్థంగా చూస్తే సంసారం లేదు. మనసు కూడ పని చేయని సుషుప్తి, మూర్ఛ వంటి అవస్థలలో సంసారం కనుపించదు. మనస్సు ఉన్నచోటే లోకాలున్నాయి. మనసు లేకపోతే లోకాలు లేవు. సృష్టిలేదు. అసలు జగత్తే లేదు.

బ్రహ్మానికి జగత్తుకు ఏ రకమైన తేడా లేదు. జగత్తంతా బ్రహ్మము యొక్క మార్పు. భ్రాంతితో కూడిన రూపాంతరం. జగదుత్పతికి కారణాలు రెండు కొన్ని అణువులు కలిస్తే సృష్టి. విడిపోతే లయము.

**1. ఆరంభ వాదము :** దారపు పోగులు కలిసి వస్త్రంగా ఏర్పడతాయి. ఇందులో ఆరంభంలో ఉన్న లక్షణాల పోకుండానే ఇంకొక వస్తువు ఆవిర్భవిస్తోంది. నూలు పోగులు వస్త్రంగా ఏర్పడ్డప్పుడు నూలు పోగుల లక్షణాలు వస్త్రంలో ఉంటాయి. కాని నూలు వేరు వస్త్రం వేరు.

**2. పరిణామవాదము :** ఇందులో ప్రారంభంలో ఉన్న లక్షణాలు పోయి క్రొత్త లక్షణాలు వస్తాయి. పాలను తోడు వేస్తే పెరుగవుతుంది. కాని పెరుగులో పాల లక్షణాలు రూపము కూడా ఉండవు.

అయితే జగత్తు ఆరంభ పరిణామము వల్ల ఏర్పడలేదు. వివర్తము వల్ల ఏర్పడింది. భ్రాంతి వల్ల ఒక వస్తువు ఇంకొక రకంగా కనుపిస్తుంది. అదే **రజ్జు సర్పభ్రాంతి.** పరబ్రహ్మ ఈ జగత్తును సృష్టించలేదు. విత్తనం నుంచి చెట్టు వచ్చినట్లుగా, తండ్రి నుంచి తనయుడు పుట్టినట్లుగా, బ్రహ్మము నుంచి ఈ జగత్తు ఆవిర్భవించిలేదు. వివర్తము అంటే కంటికి కనుపించే రూపము. అవిద్య, అజ్ఞానం వల్ల కలిగిన అసత్యరూపము. అసలు ఇక్కడ జగత్తే లేదు. అంతా మాయ. అజ్ఞానంతో మనసు చేసిన కల్పన వల్ల జగత్తు ఉన్నట్లుగా కనుపిస్తున్నది. బ్రహ్మదేవుడు మనస్సంకల్పంతోనే ఈ సృష్టి చేశాడు. ఇది సమిష్టి సృష్టి. అందరికీ ఒకేలాగా కనుపిస్తుంది. మనసున్న వాడికే ఈ జగత్తు కనుపిస్తుంది. మనస్సు లేని వాడికి ఈ జగత్తు లేదు. అజ్ఞానం వల్ల ఆవరించబడిన మాయతో ఈ జగత్తు సత్యము అనుకుంటాము. అజ్ఞానం తొలగిపోతే జగత్తు ఉండదు. మిగిలేది ఒక్కటే. అదే బ్రహ్మము. అందుకే **బ్రహ్మసత్యం జగన్మిథ్య.** బ్రహ్మము జగత్తుల మధ్య తేడాలేదు. జగత్తు పరబ్రహ్మ యొక్క మార్పు భ్రాంతి సిద్ధమైన రూపము. అంతే

అందుకే జనక మహారాజు అంటున్నాడు. "నేను చిదానంద స్వరూపుణ్ణి. జగత్తంతా భ్రమచేత నాలో కల్పించబడుతున్నది. నేను నిత్యుడను. శాంతుడను. ఆనందమయుడను"

**నాత్మా భావేషు నో భావస్తత్రానంతే నిరంజనే ।**
**ఇత్యసక్తోఽ స్పృహశ్శాంతః ఏతదేవాహమాస్థితః ॥ 4**

ఆత్మ సర్వవ్యాపి. అనంతం, అమలం, అద్వయం, నిర్మలము. ఆత్మకు రాగద్వేషాలు ఉండవు. ఆత్మ నిత్య శాంత స్వరూపం. కాబట్టి నేను ఏ విధమైన ధర్మాలు లేక శాంతుడనై ఉన్నాను.

మనస్సుతో కల్పించబడిన వస్తువుల యందు ఆత్మ ఉండదు. జగత్తంతా మనస్సుచేత కల్పించబడ్డదే. కాబట్టి ఈ వస్తువుల యందు ఆత్మలేదు. నామరూపాత్మక మైన ప్రపంచానికి అధిష్ఠానంగా ఆత్మ ఉన్నది. ఆత్మ ఎప్పుడూ శాంతంగా, గంభీరంగా, అద్వయంగా ఉంటుంది. ఆత్మ ఎప్పుడూ ఒక్కటే. దానితో సమానమైనది కాని, దానికన్న ఎక్కువైనది కాని వేరొకటి లేదు. ఆత్మకు ఏ రకమైన లక్షణాలు ఉండవు. రాగద్వేషాలు, అహంకార మమకారాలు, సుఖదుఃఖాలు, పుణ్యపాపాలు, కోరికలు ఏవీ ఉండవు. ఆత్మ పూర్ణకాముడు, నిష్కాముడు, అంటే కోరికలు తీరినవాడు. కోరికలు లేనివాడు. కాబట్టి ఆత్మకి కావలసినది ఏదీలేదు. ఆత్మ దేనినీ కోరదు. ఆత్మ ఏకాకి వంటరి. పరబ్రహ్మ స్వరూపము. రెండవది లేనిది. దృశ్యమానమైన జగత్తంతా ఆత్మస్వరూపమే. ఆత్మ ఒక్కటే ఈ జగత్తంతా నిండి ఉన్నది. రాగద్వేషాలు, అహంకార మమకారాల వంటివన్నీ మనస్సు చేత కల్పించబడిన భ్రమలు. వీటిని దాటగలిగితే మనస్సును జయించినట్లే. కోరికలు తీరకపోతే అశాంతి ఏర్పడుతుంది. మనసులేనిచోట కోరికలుండవు. అశాంతి అంతకన్న ఉండదు. అందుకే మనసు లేని పసిపిల్లలు, పిచ్చివాళ్ళు నిష్కల్మషంగా ఉంటారు. వారికి ఏ రకమైన కోరికలు ఉండవు. ఎప్పుడూ నవ్వుతూ ఉంటారు. మనసు లేనిచోట శాంత గంభీరమైన ఆత్మానందమే ఉంటుంది. ఈ కారణం చేతనే "నేను శాంతంగా, నిశ్చలంగా ఉంటాను" అంటున్నాడు జనకమహారాజు.

**అహో ! చిన్మాత్ర మేవాహ మింద్రజాలోపమం జగత్ ।**
**అతో మమ కథం కుత్ర హేయోపాదేయ కల్పనా ॥** **5**

ఆహా ! ఏమి ఆశ్చర్యము? అత్యద్భుతం. ఇక్కడ శుద్ధ చైతన్యవంతుడను నేనే. చరాచర జగత్తంతా ఇంద్రజాలం లాగా నాలో కనుపిస్తున్నది. అలాంటప్పుడు నాలో సంతోషము, విచారము ఎందుకు ఉంటాయి? అంటున్నాడు జనక మహారాజు.

ఇంద్రజాలము అంటే గారడీ విద్య. లేనిదాన్ని ఉన్నట్లుగా భ్రమింప చేస్తుంది. ఒకసారి భోజరాజు కొలువు తీరి ఉన్నాడు. సభలోకి ఒక వ్యక్తి ప్రవేశించాడు. ఎవరు నువ్వు? నీకేం కావాలి? అని అడిగాడు భోజరాజు. దానికి ఆ వ్యక్తి "రాజా! నేను ఒక ఇంద్ర జాలికుణ్ణి. నా విద్యను వీక్షించవలసింది కోరుతున్నాను" అన్నాడు. ఒక్క క్షణం ఆలోచించి "ఓ ఇంద్రజాలికుడా, నాకు ఇప్పుడు తీరుబడి లేదు. తరువాత ఎప్పుడైనా నీ విద్యను వీక్షిస్తాను" అన్నాడు. ఇంద్రజాలికుడు సభ నుంచి వెళ్ళిపోయాడు. ఆ తరువాత ఒక బ్రాహ్మణుడు తన కుమార్తెతో సహా రాజాస్థానంలో ప్రవేశించి "రాజా! నేను తీర్థయాత్రలు చెయ్యటానికి సతీ సమేతంగా వెడుతున్నాను. ఇది నా ఒక్కగానొక్క కుమార్తె. నాకు ఎవరూ లేరు. అందుచేత నేను తిరిగి వచ్చేదాకా నీ అంతఃపురంలో ఉంటుంది. తిరిగి వచ్చిన తరువాత తగిన వరుణ్ణి చూసి ఈమెకు వివాహం చేస్తాను. ఈమెను నీకు ఒప్పగించి వెడదామని వచ్చాను" అన్నాడు. సరేనన్నాడు భోజరాజు. పరిచారికలను పిలిచి ఆ పిల్లని అంతఃపురానికి తీసుకు వెళ్ళండి అన్నాడు. బ్రాహ్మణ బాలిక రాజుగారి అంతఃపురం చేరింది. రోజులు గడుస్తున్నాయి. ఒకరోజున మహారాజు అంతఃపురంలో తిరుగుతూ ఒక కన్యను చూశాడు. ఆ అమ్మాయికి ఇరవై సంవత్సరాలుంటాయి. చూసిన వెంటనే రాజు మనసు వశం తప్పింది. ఆ పిల్ల వివరాలు సేకరించాడు మహారాజు. కొంత కాలం క్రితం సభలోకి వచ్చిన బ్రాహ్మణుడి కుమార్తె. ధైర్యం చేసి, దగ్గరకు వెళ్ళి తనను వివాహమాడవలసిందిగా కోరాడు. సిగ్గుపడుతూ ఆ పిల్ల సరే అన్నది. వెంటనే గాంధర్వవిధిని ఆ పిల్లని వివాహమాడాడు మహారాజు.

కాలం గడుస్తున్నది. బ్రాహ్మణ బాలిక గర్భవతి అయింది. పండంటి మగపిల్లవాణ్ణి ప్రసవించింది. చూస్తుండగానే సంవత్సరాలు గడిచి పోయినాయి.

బ్రాహ్మణ స్త్రీకి నలుగురు సంతానం కలిగారు. అందరూ మగపిల్లలే. వారికి విద్యాబుద్ధులు నేర్పిస్తున్నాడు రాజు. పిల్లలు పెరిగి పెద్దవారైనారు. యవ్వనవంతులైనారు. తన తరువాత రాజ్యానికి వారసులు వాళ్ళే. వారికి వివాహ ప్రయత్నాలు మొదలుపెట్టాడు.

ఒక రోజున సభ తీర్చిఉన్నాడు రాజు. ఆ సభలోకి దేవదూతలు వచ్చి "మహారాజా! దేవదానవ సంగ్రామం జరుగుతున్నది. దానవులను ఎదిరించటానికి దేవతల బలం చాలటం లేదు. భూలోకంలో నువ్వు చాలా గొప్ప వీరుడివి నిన్ను ఎదిరించి నిలవగలవారు లేరు. అందుచేత నీ సహాయమర్థించి, దేవరాజైన ఇంద్రుడు నన్ను పంపాడు. కాబట్టి మహారాజా! నువ్వు వెంటనే బయలుదేరివచ్చి దానవ సంహారంలో దేవతలకు సహాయకారివి కావలసింది" అన్నాడు. ఆ మాటలు విన్న మహారాజు "ఓ దేవదూతా ! నాకు ఇక్కడ చాలా పనులున్నాయి. నేను రాలేను. నా కుమారులు యుద్ధవిద్యలో నా అంతపరాక్రమవంతులు. ఒకరు కాదు నలుగురు. నా కుమారులను నీతో పంపుతాను" అన్నాడు. సరే నన్నాడు దేవదూత. రాకుమారులు నలుగురూ తమ తమ శస్త్రాస్త్రాలు తీసుకుని దేవతల రథమెక్కి ఆకాశ మార్గాన దేవలోకానికి వెళ్ళారు. దేవదానవ సంగ్రామం భీకరంగా సాగుతోంది. తెగిపోయిన శరీర భాగాలు ఆకాశం నుంచి నేలమీద పడుతున్నాయి. దానవుల తలలు బంతులు లాగా ఎగురుతూ పడుతున్నాయి. భయంకరమైన ధ్వనులు, అరుపులు, కేకలు వినబడుతున్నాయి. ఇంతలో ఒక చెయ్యి తెగి రాజాస్థానంలో రాజుగారి ఎదురుగా పడింది. ప్రక్కనే ఉన్న రాణి గుర్తు పట్టింది. అది తన కుమారుడి చెయ్యి. ఆమెకు దుఃఖం పెల్లుబుకుతోంది. ఇంతలో రాకుమారుల తలలు, శరీర భాగాలు క్రింద పడ్డాయి. నలుగురు కుమారులు మరణించారు. సభ అంతా విషాదచ్ఛాయలు అలముకున్నాయి. రాణి దుఃఖానికి అంతు లేదు. ఏడ్చి ఏడ్చి రాణి కూడా కన్ను మూసింది. దిక్కు తోచని స్థితిలో పడ్డాడు రాజు. మంత్రులు లేచి తరువాత జరగవలసిన అంత్యక్రియలకు సమాయత్తం అవుతున్నారు. రాజుగారి దుఃఖానికి అంతం లేకుండా ఉంది. ఆ స్థితిలో ఒక వృద్ధ బ్రాహ్మణుడు సభలోకి వచ్చి "రాజా! నేను తీర్థయాత్రలన్నీ పూర్తి చేసుకుని వచ్చాను. నా కుమార్తెను నాతో పంపవలసింది. మంచి వరుణ్ణి చూసి అమ్మాయికి వివాహం చేస్తాను" అన్నాడు. అసలే పుట్టెడు

దుఃఖంలో ఉన్నాడు రాజు. ఇప్పుడు ఈ బ్రాహ్మణుడికి ఏం సమాధానం చెప్పాలో తెలియటం లేదు. సభలోని వారంతా మౌనంగా, తలదించుకుని కూర్చున్నారు. చేసేది ఏమీ లేక మహారాజు వృద్ధబ్రాహ్మణుని పాదాలు పట్టుకుని "నన్ను క్షమించు బ్రాహ్మణోత్తమా" అంటూ విపరీతంగా విలపిస్తున్నాడు. 'మహారాజా! ఏమిటిది? లే' అన్న మాటలు వినిపించాయి. తల త్రిప్పి చూశాడు రాజు. తాను సభలోనే ఉన్నాడు. తలపైకి ఎత్తి చూశాడు. ఇంద్రజాలీకుడి పాదాలు పట్టుకుని విలపిస్తున్నాడు తను. ఇప్పుడు నెమ్మదిగా గుర్తు వస్తోంది. సభలోకి ఇంద్రజాలికుడు వచ్చాడు. ఇప్పటి వరకు తాను చూసింది అంతా అతడు ప్రదర్శించిన ఇంద్రజాలం. అతణ్ణి ఘనంగా సన్మానించి పంపాడు మహారాజు.

ఇక్కడ చూడండి మహారాజు చూసినదంతా ఇంద్రజాలం గారడీవిద్య. అసలు ఏమీ జరగలేదు. కాని అంతా జరిగినట్లుగా అనిపించింది. తన కుమారులు, భార్య అందరూ మరణించారు. ఇదంతా మాయ. భ్రమ. అలాగే జగత్తు కూడా భ్రమలో ఉన్నవాడికి రజ్జువులో సర్పంలాగా ఇదంతా నిజం అనిపిస్తుంది. కాని ఏదీ నిజంకాదు. ఈ జగత్తు అంతా మనోకల్పితము. భ్రమ.

ఈ భ్రమ అజ్ఞానికి మాత్రమే ఉంటుంది. జ్ఞానిని ఏమీ చెయ్యలేదు. ప్రలోభ పెట్టలేదు. కళ్ళ ఎదరుగా కనిపిస్తున్నా ఇందులో సత్యం లేదు. ఆకాశం నీలివర్ణంలో కనుపిస్తుంది. అది నిజం కాదు భ్రమ. అసలు ఆకాశానికి వర్ణమే లేదు. కాబట్టి ఇంద్రజాలంలాగా నాలో కనుపించే జగత్తును చూసి నాలో సంతోష విచారాలు ఎందుకు కలుగుతాయి? అంటున్నాడు జనక మహారాజు ఈ అధ్యాయంలో.

# అధ్యాయం-8

## బంధమోక్షాలు

**ద్వేపదే బంధమోక్షాయ నిర్మమేతి మమేతి చ**
**మమేతి బధ్యతే జంతుః నిర్మమేతి విముచ్యతే ॥**

**మమ** అనుకుంటే బంధము. **నమమ** అనుకుంటే మోక్షము అంటోంది **మహోపనిషత్తు.**

కోరికలే బంధాలు. అసలు ఈ బంధాలు ఎందుకు వస్తాయి అనే విషయం చూద్దాం. మానవుడు కర్మలు చేస్తాడు. ఈ కర్మల వల్ల ఫలితం వస్తుంది. ఆ ఫలితం మానవుడి హృదయ భాగంలో సూక్ష్మరూపంలో ఉండి, సమయం వచ్చినప్పుడు బయటకు అంటే అనుభవానికి వస్తుంది. దీన్నే అపూర్వము అని. అదృష్టము అని అంటారు. ఈ కర్మలు మూడు రకాలుగా ఉంటాయి 1. సంచితకర్మ 2.ఆగామి 3.ప్రారబ్దము.

**1. సంచిత కర్మ :** మానవుడు చేసిన కర్మల ఫలితమంతా ఒకచోట కుప్పగా పోసి ఉంటుంది. అందులో నుంచి కొంత భాగం ప్రతిజన్మలోను అనుభవానికి వస్తుంటుంది. అలాగా ప్రతిజన్మలోనూ చేసే కర్మ వెళ్ళి దీనికి కలుస్తుంటుంది. మనం సంపాదించుకున్న ధనాన్ని బ్యాంకులో డిపాజిట్ చేసినట్లన్న మాట. కల్పాంతము వరకు అనుభవించినా సంచితకర్మ తరిగిపోదు. కేవలము జ్ఞానం వల్లనే ఇది నాశనం కావాలి.

**2. ఆగామికర్మ :** ఈ జన్మలో చేసిన కర్మను 'ఆగామి' అంటారు. ఇది వెళ్ళి సంచిత కర్మలో కలుస్తుంటుంది. ఈ రకంగా సంచిత కర్మ పెద్దకొండలాగా పెరిగి పోతుంది.

**3. ప్రారబ్ధకర్మ:** మానవుడు ఈ జన్మలో అనుభవించ వలసిన కర్మనే 'ప్రారబ్ధము' అంటారు. ఇది మూడు రకాలు ఉంటుంది. 1.ఇచ్ఛా ప్రారబ్ధము 2.అనిచ్ఛాప్రారబ్ధము 3.పరేచ్ఛా ప్రారబ్దము. ఇవన్నీ బంధాలు.

**1. ఇచ్ఛా ప్రారబ్ధము :** కావాలి అని ఎంతో ఇష్టంగా అనుభవించే కర్మ. భార్య, పిల్లలు, మనవలు, మిత్రులు వీరి మీద అనురాగము, మమకారము కలిగి

ఉండటము. కొంతమంది చెబుతుంటారు. "నేను ఇంటికి వెళ్ళేదాకా ఎవరూ భోజనం చెయ్యరు. పసిపిల్లవాడు పాలుకూడా త్రాగడు. మా కుక్క పిల్లకూడా నా చేత్తో నేను పెడితేనే బిస్కట్లు తింటుంది. లేకపోతే నేను ఇంటికి వెళ్ళేదాకా అందరూ అలా ఎదురు చూస్తుంటారు" అని. ఇవి **బంగారుసంకెళ్ళు**. అందమైన మెత్తటి పట్టు త్రాడుతో కట్టేసిన కట్లు. ఇంకా చెప్పాలంటే ఖరీదైన వజ్రాలు పొదిగిన బంగారు సంకెళ్ళు. చూడటానికి చాలా అందంగా ఉంటాయి. ఈ రకమైన బంధాలను ఎంతో ఇష్టంగా తగిలించుకుంటాడు మానవుడు.

**2.అనిచ్ఛా ప్రారబ్ధము :** ఈ రకమైన కర్మను ఇష్టం లేకుండా అనుభవిస్తాడు. దీన్ని అనుభవించాలని మానవుడి ఏ మాత్రము ఉండదు. కాని అనుభవించక తప్పదు. ఎద్దుకు బండిలాగాలని, పొలం దున్నాలని పని చెయ్యాలని ఉండదు. ఇష్టం లేకపోయినా బండిలాగాలి. పొలం దున్నాలి. లేకపోతే రైతు కొడతాడు. తినటానికి గడ్డి వెయ్యడు. త్రాగటానికి నీరు ఇవ్వడు. అలాగే పనివాడికి పని చెయ్యాలని ఉండదు. కాని చెయ్యక తప్పదు. కుటుంబాన్ని పోషించుకోవాలి. గత్యంతరం లేదు. బానిస యజమాని చెయ్యమన్న పని చెయ్యాలి. లేకపోతే యజమానికి కోపం వస్తుంది. ఇవి **ఇనుపసంకెళ్ళు**. కంబారు త్రాడుతో వేసిన కట్లు చూడటానికి అసహ్యకరంగా, ఇబ్బందికరంగా ఉంటాయి.

**3. పరేచ్ఛా ప్రారబ్ధము :** ఇతరుల ఆనందం కోసం ఈ రకమైన పనులు చేస్తుంటాం. వెనకటికి ఒకతను 'సూరి బావ కళ్ళలో ఆనందం చూడటం కోసం ఈ హత్య చేశాను' అన్నాడు. భార్య ఆనందం కోసం అడ్డదారులలో ధనార్జన చెయ్యటం. ఇలా చెయ్యటం వల్ల ఆనందించేవారు ఒకరు. వాటి ఫలితాన్ని అనుభవించేది మాత్రం చేసినవాడు.

కర్మ చేసిన వెంటనే ఫలితం వస్తుందా? అనేది చాలా పెద్ద ప్రశ్న. ఇక్కడ కర్మ రెండు రకాలుగా ఉంటుంది. 1. వెంటనే ఫలితాన్నిచ్చేది 2.కొంత కాలం తరువాత ఫలితాన్నిచ్చేది.

**1. వెంటనే ఫలితానిచ్చే కర్మ :** నిప్పులో చెయ్యి పెడితే మరుక్షణంలో చెయ్యి కాలిపోతుంది. ఎత్తు నుంచి క్రిందకు ఏ రకమైన రక్షణా లేకుండా దూకితే కాళ్ళు చేతులు విరుగుతాయి. ఈ రకమైన కర్మలు ఫలితాన్నివ్వటానికి సమయం పట్టదు.

**2. కొంత కాలం తరువాత ఫలితాన్నిచ్చేవి :** ఈ రకమైన కర్మలు చేసినప్పుడు ఫలితం రావటానికి కొంత కాలం పడుతుంది. అరగని పదార్థాలు, కలుషితమైన పదార్థాలు తింటే కొంత సేపటి తరువాత కడుపునొప్పి, విరేచనాలు వస్తాయి. పుణ్యలోకాలు రావాలని యాగం చేస్తే, మరణించిన తరువాత గాని పుణ్యలోకాలు రావు.

కర్మలవల్లనే బంధాలు పెరుగుతాయి. పాపపుణ్యాలు వస్తాయి. బంధాలు అనేవి కేవలము మనసు వల్లనే వస్తాయి.

**మనయేవ మనుస్యాణాం కారణం బంధమోక్షయోః**

**బంధయా విషయాసక్తం ముక్తై నిర్విషయగ్ం స్మృతం ॥**

మానవుల బంధ మోక్షాలకు కారణం మనస్సు. విషయముల యందు ఆసక్తి గల మనస్సు బంధాల వైపుకు, విషయాసక్తి లేని మనస్సు మోక్షం వైపుకు నడిపిస్తుంది.

అసలు సంసారానికి కారణం మనస్సు. ఈ మనస్సు వల్లనే రాగద్వేషాలు, అహంకార మమకారాలు కలుగుతున్నాయి. మమ అనుకుంటే బంధం. నమమ అనుకుంటే మోక్షం. నా భార్య, నా పిల్లలు అనుకోవటం వల్లనే బంధాలు ఏర్పడుతున్నాయి. అదే సంసారము. మనస్సు లేనివారికి బంధాలుండవు. అందుకే పసిపిల్లవాడికి, పిచ్చివాడికి బంధాలు, సంసారము ఉండవు. మోక్షం కావాలంటే బంధాలను త్రెంచుకోవాలి. కామసంకల్పాలు లేని మనస్సు శుద్ధమవుతుంది. అందుచేత మోక్షగామి అయిన వాడి మనస్సు పరిశుద్ధంగా ఉండాలి.

మోక్షము అంటే ముక్తి. బంధాల నుంచి విముక్తి. ఐహిక బంధాల నుంచి విముక్తి పొందటమే ముక్తి. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపము. పరమేశ్వరుడే జగత్తు. జగత్తే పరమేశ్వరుడు. ఈ విషయం తెలిసినవాడు మహాజ్ఞాని. అతని జీవాత్మ పరమాత్మలో లీనమవుతుంది. అతడికి పునర్జన్మ ఉండదు. ఈ విషయం మనసా, వాచా, కర్మణా అనుభవ పూర్వకంగా తెలుసుకోవాలి. అలా తెలుసుకున్న వాడే మహాజ్ఞాని. అతడు ముక్తపురుషుడు. ఇతడికి పిపీలికాది బ్రహ్మ పర్యంతము తనలాగే కనుపిస్తుంది. ఇతడు ప్రతి వస్తువునందు ప్రతిజీవి యందు పరమాత్మని చూడగలుగుతాడు.

వేదాంత విషయాల గురించి అనేక సార్లు వినచ్చు. అలా వినటం చాలదు. విన్న విషయాన్ని మననం చెయ్యాలి. విచారణ చెయ్యాలి. ధ్యానం చెయ్యాలి. ఇలా ధ్యానం చెయ్యగా చెయ్యగా సంపాదించిన జ్ఞానం బలపడుతుంది. ఒక చెట్టుకు పూలు, పిందెలు, కాయలు, పండ్లు ఉన్నాయి. ఇప్పుడు మనకు కనుపిస్తున్న పండు కొన్ని రోజుల క్రితం కాయ. ఇంకొన్ని రోజుల క్రితం పింద. ఇంకొన్ని రోజుల క్రితం పూవు. అంత క్రితం మొగ్గ. ఆ మొగ్గే ఇప్పుడు పండు అయింది. ఇదే ముక్తావస్థ. పండుకు పులుపు, చేదు, వగరు ఉండవు. అందులోని దోషాలన్నీ నశించిపోయి, వేపకాయ అయినా సరే పండితే తియ్యగా ఉంటుంది. ఒకవేళ పండు పుల్లగా ఉన్నది అంటే అది ఇంకా బాగా పండలేదని అర్థం. అలాగే మానవుడిలో ఎన్ని దోషాలు ఉన్నా నిరంతర ధ్యానం వల్ల దోషాలన్నీ నశించి ముక్తుడవుతాడు. ఎంత కాలం ధ్యానం చేసినా ఇంకా గుణదోషాలున్నాయి అంటే అతడికి ఇంకా పరిపక్వత సిద్ధించలేదన్న మాట.

మోక్షాన్ని వెతుక్కుంటూ మనం పరుగులు పెట్టనవసరం లేదు. అర్హత సాధించిన వారిని మోక్షం వెతుక్కుంటూ వస్తుంది. కావలసిందల్లా అర్హత సాధించటమే. కలెక్టరు కావాలంటే ఐ.ఎ.ఎస్. ప్యాసు కావాలి. ఐ.ఎ.ఎస్. అయినవాడు ఖచ్చితంగా కలెక్టరు అయి తీరతాడు. కలెక్టరు కాకుండా ఎవరూ అతన్ని ఆపలేరు. అలాగే మోక్షానికి అర్హత సంపాదించిన వాడు తప్పకుండా మోక్షం పొందుతాడు. ఇక్కడ మోక్షానికి అర్హత అంటే బంధవిముక్తి. ఐహిక బంధాల నుంచి విముక్తి పొందటం. ఐహిక బంధాల నుంచి విముక్తి పొందినవాడు, చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమని తెలుసుకున్న వాడు మోక్షం పొందుతాడు. అతడికి మాత్రమే పునర్జన్మ ఉండదు.

సామాన్యంగా చాలామంది "నాకు ఇదే ఆఖరు జన్మ కావాలి. మోక్షం కావాలి" అంటారు. మోక్షం అనేది ఎక్కడి నుంచో రాదు. అది మనదగ్గరే ఉన్నది. దాన్ని గుర్తించటమే మోక్షము అంటున్నారు పరమానంద నాథులు. ఈ రకంగా బంధాల నుంచి విడివడిన వాడు మోక్షం పొందుతాడు. ఈ విషయాన్ని 8వ అధ్యాయంలోని నాలుగు శ్లోకాలలో వివరిస్తున్నారు.

**తదాబంధో యదా చిత్తం కించిద్వాంఛతి శోచతి ।**
**కించిన్ముంచతి గృహ్ణాతి కించిద్ధృష్యతి కుప్యతి ॥ 1**

మనసులో కోరికలు అనే సంకల్ప వికల్పాలు ఉంటాయి. కాబట్టి మనసు దేన్నైనా కోరినా, తిరస్కరించినా, సంతోషము, దుఃఖములాంటివి పొందినా అవన్నీ బంధాలే.

సామాన్యంగా మానవుడు జీవితంలో సుఖపడాలి అనుకుంటాడు. ఇతడు కావాలనుకునేదిలౌకిక సుఖం అందుకే. ఇష్టప్రాప్తిని, అనిష్ట పరిహారాన్ని పొందటానికి ప్రయత్నిస్తాడు. ఇష్టప్రాప్తి అంటే కావాలనుకున్నది పొందటం. అనిష్ట పరిహారము అంటే వద్దనుకున్న దాన్ని, ఇష్టం లేనిదాన్ని వదిలించుకోవటం. తనకు సంతానం లేదు. సంతానం కోసం పుత్రకామేష్టి చేస్తాడు. సంతానం పొందుతాడు. అతడికి ధనం లేదు. నిర్ధనుడు. తన దరిద్రాన్ని పోగొట్టమని భగవంతుణ్ణి ప్రార్థిస్తాడు. భగవత్ప్రార్థన, యజ్ఞయాగాది క్రతువులు చేసినంత మాత్రంచేత అతని కోరికలు తీరవు. ఆంధ్ర సామ్రాజ్యాన్ని స్థాపించిన మాధవ విద్యారణ్యుడు మహాపండితుడు. కటిక దరిద్రుడు. తన దారిద్ర్యం పోవాలి. ధనంకావాలి అని లక్ష్మీదేవిని ప్రార్థించాడు. లక్ష్మీదేవి ప్రత్యక్షమై ఈ జన్మలో నీకు ధనయోగం లేదు. మరుజన్మలో నీకు ధనయోగం పడుతుంది అని చెప్పింది. ఆలోచించి సన్యసించాడు మాధవుడు. సన్యాసాశ్రమం స్వీకరిస్తే ఈ జన్మ పూర్తి అయినట్లే. మళ్ళీ క్రొత్త జన్మ ప్రారంభం అవుతుంది. సన్యసించి ఇప్పుడు లక్ష్మీదేవిని ప్రార్థించి 'మరుజన్మలో ధనయోగం ఉన్నది అన్నావు కదా ! ఇప్పుడు ధనాన్ని ఇవ్వు' అన్నాడు 'అలాగే' అన్నది లక్ష్మీదేవి. ఒకచోట పొలం తవ్వుతుంటే బంగారు నాణేలు బస్తాలకొద్దీ దొరికాయి. వాటితోనే విజయనగర సామ్రాజ్య స్థాపనకు పునాది వేశాడు మాధవ విద్యారణ్యుడు. అలాగే మృకండ మహర్షి సంతానం కోసం ఈశ్వరుణ్ణి గురించి తపస్సు చేశాడు. ఈశ్వరుడు ప్రత్యక్షమై ఈ జన్మలో నీకు సంతాన యోగం లేదు అన్నాడు. పట్టు వదలకుండా తపస్సు చేశాడు మహర్షి. అల్పాయుష్కుడు గుణవంతుడు విద్యావంతుడు అయిన కుమారుణ్ణి ప్రసాదించాడు ఈశ్వరుడు. అతడే మార్కండేయుడు. అలాగే అనిష్ట పరిహారం. అవసరం లేని ఇష్టం లేని వాటిని వదిలించుకోవటం. ఇలా చెయ్యాలనుకునేది మనస్సే. నాకు ఇది కావాలి. ఇది వద్దు అనుకోవటమే బంధం. అలాగే రాగము, ద్వేషము, సంతోషము, దుఃఖము, విచారము వంటివి ఏవీ ఉండకూడదు. ఇవి లేశమాత్రంగా ఉన్నా బంధాలే. దీనికి మంచి ఉదాహరణ జడభరతుడు. రాజ్యాన్ని

వదిలి, తపస్సు చేసుకుందామని వానప్రస్థం స్వీకరించిన రాజుకు లేడిపిల్ల మీద దయ, జాలి కలిగాయి. అవే బంధాలుగా మారాయి. ఆ లేడిపిల్లని గురించి ఆలోచిస్తూనే కన్ను మూశాడు. ఫలితంగా మరుజన్మలో లేడిగా జన్మించాడు.

కాబట్టి ఇష్టము, అయిష్టము, రాగము, ద్వేషము ఏ మాత్రం ఉన్నా బంధాలు ఉన్నట్లే. మనస్సుకు బానిసగా జీవితాన్ని సాగించటం బంధం. మనస్సు, శరీరము వీటి ఇష్టాఇష్టాలకు వశుడై, వాటిని తృప్తిపరచటానికి ప్రయత్నించటమే బంధస్థితి. ఇలా బంధాలతో తగులుకున్నవాడు, వాటి నుంచి బయట పడలేడు.

**తదా ముక్తిర్యదా చిత్తం న వాంఛతి న శోచతి ।**

**న ముంచతి న గృహ్ణాతి న హృష్యతి న కుప్యతి ॥** **2**

మనసులో కోరికలు, విచారాలు, సంతోషము, దుఃఖము, రాగము, ద్వేషము వంటివి లేనప్పుడు, మానవుడు వీటికి వశం కానప్పుడు, అతడు ముక్తస్థితిలో ఉన్నట్లే.

ఇందాకటి శ్లోకంలో బంధస్థితి వివరించి ఇప్పుడు ముక్తస్థితిని చెబుతున్నారు. గతంలో చెప్పినట్లుగా ముక్తి అంటే–విముక్తి. ఐహిక బంధనాల నుంచి విముక్తి. ముక్తి, మోక్షము అనేవి ప్రత్యేకంగా ఎక్కడి నుంచో రావు. బంధాలు లేని స్థితే ముక్తి. కోరికలు నశించిన మనసులో ముక్తి లభిస్తుంది. కామక్రోధ లోభ మోహ మదమాత్సర్యాలను జయించినప్పుడు, రాగద్వేషాలు, అహంకార మమకారాలను త్యజించినప్పుడు మనసులో కల్లోలాలు ఉండవు. అది కావాలి. ఇది వద్దు అని ఉండదు ప్రియము అప్రియము అనేవి ఉండవు. ఆ సమయంలో మనసు ప్రశాంతంగా ఉంటుంది. తన రూపాన్ని కోల్పోయి స్వరూపంలో నిలుస్తుంది. దీన్నే 'ముక్తావస్థ' అంటారు.

**న మోక్షే నభవః పృష్ఠే నపాతాళే న చ భూతలే**

**సర్వాశాసంక్షయే చేతః క్షయో మోక్ష ఇతీష్యతే ।**

ఈ విషయాన్నే చెబుతోంది **అన్నపూర్ణోపనిషత్తు.**

**భావనాశనం మోక్షో బంధో హి దృఢభావనా ॥**

భావాలు, ఆలోచనలు, సంకల్ప వికల్పాలు నశించటమే ముక్తి. అలా కాకుండా దృడమైన ఆలోచనలు, కోరికలు విషయ వాసనలు, సంకల్పాలు ఉంటే అది బంధము అవుతుంది అంటోంది **యోగవాశిష్ఠం.**

మనసులో ఉన్న దృశ్య భావాలను తుడిచి వేసినట్లైతే మహోన్నతమైన నిర్వాణ సుఖము లభిస్తుంది. వాసనలను పూర్తిగా త్యజించటమే మోక్షము. ఎవరైతే పరిశుద్ధ వాసన కలిగి ఉన్నారో, వారికి పునర్జన్మ ఉండదు. వారు యధార్ధాన్ని తెలుసుకో గలుగుతారు. వాసనలు మూడు రకాలు.

1. దేహవాసన – దేహానికి సంబంధించిన విషయాలు, కోరికలు

2. లోకవాసన – ఐహికమైనవి విషయ వాంఛలు

3. శాస్త్రవాసన – వివిధ శాస్త్రాలు చదవటం పండితుడు అనిపించుకోవటం, సత్కారాలు పొందటం.

దృఢమైన వాసనలే బంధాలు. వాసనాక్షయమే మోక్షము. జీవించి ఉండగానే ఇటువంటి ముక్తస్థితికి చేరిన వారు జీవన్ముక్తులు. కాలానుగుణంగా సంతోషము, దుఃఖము అనుభవిస్తున్నప్పటికీ, సంతోషము దుఃఖము పొందనివాడు జీవన్ముక్తుడు వాటిని అనుభవిస్తూ కూడా వాటిని మనసుకు పట్టించుకోని నాడు జీవన్ముక్తుడు. హర్షము, శోకము, ఓర్వలేనితనము, భయము, క్రోధము, కామము, కార్పణ్యము లేనివాడు జీవన్ముక్తుడు. అహంకారాన్ని వదలి, దృశ్యాన్ని నాశనం చేసినవాడు జీవన్ముక్తుడు. ఇష్టాఇష్టాలు లేనివాడు జీవన్ముక్తుడు. ఎప్పుడూ ఆత్మానందం పొందేవాడు మనసును పవిత్రంగా ఉంచుకునే వాడు జీవన్ముక్తుడు.

ఆకాశం లాగా ఎవరి హృదయము దృశ్యముల యందు సంగమము కాకుండా ఉంటుందో, ఎవరి బుద్ధి జడము కాదో, ఎవడు చైతన్యవంతుడో వాడు జీవన్ముక్తుడు. ఎవని మనసు ప్రశాంతంగా ఉంటుందో అతడు జీవన్ముక్తుడు. ఇది ముక్తావస్థ. కోరికలు నశించిన స్థితే మోక్షము.

**తదా బంధో యదా చిత్తం సక్తం కాస్వపి దృష్టిషు ।**
**తదా మోక్షో యదాచిత్త మసక్తం సర్వదృష్టిషు ॥** **3**

ఇంద్రియ గోచరమైన ఏ వస్తువుమీద కోరిక ఉంటే అదే బంధమవుతుంది. ఇంద్రియ గోచరమైన వస్తు ప్రపంచం మీద ఆసక్తి లేకుండా ఉండటమే మోక్షము.

మమ అనుకుంటే బంధం. నమమ అనుకుంటే మోక్షము. మమ అని దేన్ని అనుకుంటాడు? అంటే దృశ్యమానమైన జగత్తులో ఇంద్రియ గోచరమైన ఏ వస్తువునైనా నాది అనుకోవచ్చు. దానిమీద కోరిక కలగవచ్చు. ఆ వస్తువును కంటితో చూడలేక పోవచ్చు. కాని జ్ఞానేంద్రియాలలో దేనితోనైనా దీన్ని చూడగలం. రూపాన్ని కంటిలో చూస్తాం. శబ్దాన్ని చెవితో వింటాం. రుచిని – నాలుకతో ఆస్వాదిస్తాం. స్పర్శని – చర్మం ద్వారా తెలుసుకుంటాం. వాసన – ముక్కు ద్వారా పీలుస్తాం. వీటన్నింటినీ దర్శించినట్లే భావించాలి. అందుకే 'ఇంద్రియ గోచరమైన వస్తువు మీద కోరిక' అన్నారు.

**కురంగ మతంగ పతంగ భృంగమీనాః**

**1.కురంగము** అంటే – జింక. దీనికి శృంగనాదము (కొమ్ము బూర శబ్దము అంటే చాలా యిష్టం. వేటకాడిని చూసి జింకలు పొదలలోకి వెళ్ళి నక్కి దాక్కుంటాయి. అప్పుడు శృంగనాదం చేస్తాడు వేటకాడు. ఆ శబ్దం వినటానికి జంకలు బయటకు వస్తాయి. వాటిని చంపేస్తాడు.

**2.మతంగము** అంటే  మగ ఏనుగు. ఆడ ఏనుగు స్పర్శ కోసం వచ్చి గోతిలో పడి, వేటకాడికి చిక్కుతుంది.

**3.పతంగము** అంటే మిడత. దీపాన్ని చూసి ఏదో తినే వస్తువు అనుకుని, దాని మీద వాలిమాడి చచ్చిపోతుంది.

**4.భృంగము** తుమ్మెద. తేనె త్రాగుదామని పూలమీద వ్రాలుతుంది. ఒక రకమైన చెట్లు పూవుల మీద తుమ్మెద వ్రాలగానే ఆ పూవు కాస్తా ముడుచుకుపోయి లోపల ఉన్న తుమ్మెదను చంపి, దాని రక్తం పీల్చేస్తాయి.

**5.మీనా** చేపకు వానపాము చాలా ఇష్టమైన ఆహారము. అందుకే గాలానికి ఎరను గ్రుచ్చి నీటిలో వదులుతారు. ఎర నుంచి వచ్చే వాసనకు ఆకర్షింపబడి చేప వచ్చి ఎరను మ్రింగబోయి గాలానికి చిక్కుతుంది. ఈ రకంగా ఇంద్రియ గోచరమైన వస్తువులపై కోరికల వల్ల జీవులకు ప్రాణాపాయం సంభవిస్తుంది. అందుకే దేనిమీదా

కోరికలు పెంచుకోవద్దు. ఒకవేళ దేనిమీదైనా కోరికలు పెరిగితే అవి బంధాలవుతాయి. గతంలో జడభరతుడి కథ చెప్పుకున్నాం. అలాగే పురంజనుడు కూడా. మానవుడికి అంత్య కాలంలో మనసుదేనిమీద లగ్నం అవుతుందో, మరుజన్మలో ఆ రూపాన్నే ధరిస్తాడు అనటానికి పైన చెప్పిన జడభరతుడు మరుజన్మలో లేడిగా జన్మిస్తే, పురంజనుడు రాకుమార్తెగా జన్మించాడు. కాబట్టి ఏ రకమైన కోరిక ఉన్నప్పటికీ అది బంధం అవుతుంది. ఆ కోరిక తీరటానికి మానవుడు మళ్ళీ జన్మ ఎత్తాలి. ఈ రకంగా కోరికలు బంధాలై మోక్షానికి అవరోధమవుతాయి.

ముక్తి కావాలంటే ఇంద్రియ గోచరమయ్యే వస్తువుల యందు కోరికలు లేకుండా, ఆసక్తి లేకుండా ఉండాలి. ఏ వస్తువు మీద, ఏ ప్రాణిమీద, చివరకు నీ మీద నీకు కూడా ఏ రకమైన ఇష్టము ఉండకూడదు. జగత్తు మీద లౌకిక సుఖాల మీద నిరాసక్తతతో ఉండాలి. అటువంటి స్థితినే ముక్తి అంటారు. కాబట్టి ముముక్షువు వాసనాక్షయం కోసం ప్రయత్నించాలి. వాసనలే బంధము. వాసనాక్షయమే ముక్తి.

**యదా నాహం తదామోక్షః యదాహం బంధనం తదా ।**

**మత్వేతి హేలయా కించిన్మాగృహాణ విముంచమా ॥** 4

నేను అనే అహంకారం లేకపోవటమే ముక్తి. అహంకారం ఉండటమే బంధము. ఈ విషయాన్ని గ్రహించి ఆకర్షణలకు లోను కాకుండా, సంకల్ప వికల్పాలు లేకుండా, దేనినీ ఆమోదించకుండా త్యజించకుండా పరమశాంతంగా, ఆనందంగా జీవించు అంటున్నాడు అష్టావక్రుడు.

ఇంద్రియ గోచరమయ్యేదంతా సత్యంకాదు. కంటిని కనిపించేదంతా నిజం కాదు. ఈ విషయాలు గుర్తించి శాంతంగా జీవించాలి. ఇంద్రియ గోచరమైన వస్తువు సత్యంకాదు అని గట్టిగా అన్నామనుకోండి. నీకు అహంకారము ఉన్నట్లే. అందుకే దేన్నీ బలపరచవద్దు, నిరాకరించనూ వద్దు. వీటిలో ఏది చేసినా అహంకారం బలపడి, బంధాలు ఏర్పడతాయి. ఎప్పుడైతే అహంకారం ఉండదో అప్పుడు బంధాలు అవరోధాలు ఉండవు. ఇక్కడ ఒక చిన్న విషయాన్ని చూడండి.

ఒకసారి తమిళనాడులోని ఒక గ్రామంలోని ఆలయాన్ని పునరుద్ధరించాలనే సంకల్పంతో ఆ గ్రామ ప్రజలు కొంతమంది కంచి పరమాచార్యులు శ్రీశ్రీశ్రీ

చంద్రశేఖర సరస్వతీ స్వామివారి ఆశీస్సుల కోసం, స్వామివారి దగ్గరకు వచ్చారు. వారితో మాట్లాడుతున్న సమయంలో గ్రామస్థులలో రెండు వర్గాలున్నాయనే విషయం అర్థమయింది స్వామి వారికి. అందులో ఎవరికి వారు తమ వర్ణమే ఉన్నతమైనది అని భావిస్తున్నారు. వీరి మధ్య సయోధ్య లేదు. ఐక్యత లేకపోతే ఆలయ పునరుద్ధరణ సజావుగా జరగదు. ఇరువర్గాలు కలిసి పనిచేస్తే పని చాలా బాగా పూర్తవుతుంది. వారు చెప్పినదంతా విని "ముందు మీరు వెళ్ళి భోజనం చేసి రండి. ఆ తరువాత మాట్లాడదాం" అన్నారు. స్వామి వారి మాట ప్రకారం అందరూ భోజనాలు పూర్తి చేసి వచ్చారు. స్వామి ఎదురుగా ఇరువర్గాల వారు కూర్చున్నారు. వారిరువురి ధ్యేయం ఒకటే. ఆలయ పునరుద్ధరణ. వారిలో ఐక్యత లేదు ఇదే అక్కడ పెద్ద లోపం.

స్వామి వారు గ్రామప్రజల్ని చూస్తూ 'భోజనాలు చేశారా?' అన్నారు 'చేశాం స్వామీ' అందరూ ముక్తకంఠంతో సమాధానం చెప్పారు. 'భోజనంలో ఏం వడ్డించారు?" స్వామివారే మళ్ళీ అడిగారు. "కుళుంబు, రసం, పాయసం, కూర, అప్పడం, వడియం" అన్నారు గ్రామస్థులు. స్వామివారు చిరునవ్వు నవ్వుతూ" కుళుంబు, రసం వీటి మధ్య తేడా ఏమిటి?" అన్నారు. "ఏముంది స్వామీ! కుళుంబులో కూరగాయలుంటాయి. రసంలో కూరగాయలుండవు అంతే" అన్నారు గ్రామస్థులు. కూరగాయలను తమిళంలో తాన్/దాన్ అంటారు. తాన్ అంటే నేను, అహంకారము అనే అర్థం కూడా ఉంది. ఇప్పుడు స్వామివారు"కుళుంబులో తాన్ లేకపోతే అది రసం అవుతుంది. అహంకారం లేకపోతే రసమయం అవుతుంది. అది బ్రహ్మానందం. అహం యొక్క అంతమే బ్రహ్మానందం" అన్నారు. ఈ మాటలతో గ్రామస్థులకు కనువిప్పు కలిగింది. వారిలో అహంకారం పోయింది. ఐకమత్యం కలిగింది. ఆలయ పునర్నిర్మాణం అద్భుతంగా జరిగింది.

అహంకారం బలపడితే బంధాలు ఏర్పడతాయి. బంధాలు వదిలేస్తే ముక్తి లభిస్తుంది. ఈ విషయాన్నే చెప్పాడు అష్టావక్రుడు ఈ శ్లోకంలో.

# అధ్యాయం-9

## నిర్వేదాష్టకము (నిర్లిప్తత)

చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. జగత్తే పరమేశ్వరుడు. పరమేశ్వరుడే జగత్తు. ఈ విషయం తెలిసినవాడు మహాజ్ఞాని. అతడికి పునర్జన్మ ఉండదు. పుస్తకాలు చదివి, ఉపన్యాసాలు విని ఈ విషయం తెలుసుకోవచ్చు. అది చాలదు. మనసా వాచా కర్మణా ఈ విషయాన్ని అనుభవ పూర్వకంగా తెలుసుకోవాలి. **అహంబ్రహ్మాస్మి** నేనే పరమేశ్వర స్వరూపాన్ని అనే విషయం తెలుసుకోవటమే స్వరూప జ్ఞానం. స్వరూప జ్ఞానం పొందిన వాడికి పిపీలికాది బ్రహ్మ పర్యంతము తనలాగానే కనుపిస్తుంది. అతడు ప్రతివస్తువు నందు ప్రతిజీవియందు పరమాత్మని చూడగలుగుతాడు.

అందరూ ఈ రకమైన జ్ఞానాన్ని పొందలేరు. దీనికి కారణం భవబంధాలు. మమ అనుకుంటే బంధం. నమమ అనుకుంటే మోక్షము. మోక్షగామి రాగద్వేషాలు, అహంకార మమకారాలు. అరిషడ్వర్గాలు అన్ని జయించాలి. కొంతమంది వీటిని జయించకుండానే సన్యసిస్తున్నారు. మోక్షం కావాలి అనుకుంటున్నారు. అగ్ని చాలా గొప్పది. ప్రపంచంలో దేన్నైనా దహించి వేస్తుంది. కాని మణి, మంత్ర ఔషధాలతో కట్టడి చేయబడినట్లైతే, గడ్డిపోచను కూడా దహించలేదు. అలాగే స్వస్వరూప జ్ఞానమున్నప్పటికీ, బంధాలు వదిలించుకోకపోయినట్లైతే మోక్షం సిద్ధించదు.

**ప్రతిబంధోవర్తమానో విషయాసక్తి లక్షణః**

**ప్రజ్ఞామాంద్యం కుతర్కశ్చ విపర్యయ దురాగ్రహః ॥**

1. విషయాసక్తి – లౌకిక విషయముల యందు కోరిక
2. ప్రజ్ఞామాంద్యం – బుద్ధి పరిశుద్ధం కాకపోవటం
3. కుతర్కము – విపరీతార్థాలు చెప్పటం
4. విపర్యము – అనాత్మ పదార్థాల యందు ఆత్మబుద్ధి కలిగి ఉండటము
5. దురాగ్రహము – అనవసరంగా కోపగించటం

ఇవన్నీ రజోగుణ, తమోగుణ లక్షణాలు, స్వస్వరూప జ్ఞానానికి ప్రతిబంధకాలు. ఇవి పోవాలంటే విపరీతమైన తపస్సు చెయ్యాలి. అగ్నిలో కట్టెలు దహింపబడినట్లుగా, ఈ గుణాలన్నీ తపస్సుచేత దహించబడతాయి.

సాధకుడు స్వస్వరూప జ్ఞానం సంపాదించాలంటే ముఖ్యంగా మూడు గుణాలను అభివృద్ధి చేసుకోవాలి. అవి 1 నిర్వేదము (నిర్లప్తత) 2.సమత 3.యుక్తి. ఇందులో ప్రతి ఒక్కటి, మిగిలిన వాటివల్ల ప్రభావితం అవుతుంది. నిర్వేదము అంటే – ఏ వస్తువు లేదా విషయంపట్ల ఆసక్తి లేకపోవటం. ఎప్పుడైతే రాగద్వేషాలు, అహంకార మమకారాలు నశించాయో, అప్పుడు ఇది కావాలని, ఇది వద్దని ఉండదు. దేనిమీద వ్యామోహం ఉండదు. కళ్ళముందు ఏం జరుగుతున్నా ఉదాసీనంగా, తూష్ణీభావంతో చూస్తూ ఉంటాడు. అతని కళ్ళు పనిచేస్తున్నాయి కాని తాను చూస్తున్న దృశ్యం మనసున కందదు. కారణం అతనికి మనస్సు లేదు. నశించిపోయింది. వేయించిన విత్తనాలు లాగా అయిపోయింది. విత్తనాలను వేయిస్తే అవి మొలకెత్తటానికి పనికి రావు. అలాగే ఇతని మనసులో సంకల్ప వికల్పాలుండవు. చూస్తున్న అన్ని దృశ్యాలు ఒకలాగే ఉంటాయి. రుచి అనేది ఉండదు. తీపి పులుపు ఉప్పు కారం చేదు వగరు ఈ రకమైన తేడాలుండవు. ఏ విషయంమీద ఆసక్తి ఉండదు. సమత అంటే – సమత్వము. ఇతడి దృష్టిలో అన్నీ సమానంగానే ఉంటాయి. దానికి దీనికి తేడా ఏ మాత్రము ఉండదు. ఇలా ఉంటేనే ఏ విషయాన్నైనా తార్కికంగా, యుక్తిపరంగా ఆలోచించగలుగుతాడు. నిర్వేదం కావాలి అంటే సమత్వబుద్ధి, యుక్తి రెండూ ఉండి తీరాలి. ఈ మూడింటినీ శరీరము, మనస్సు, బుద్ధిల ద్వారా ఒకే కాలంలో సాధించాలి.

విషయ వాసనల నుండి దేహం దూరంగా ఉండాలి. అంటే లౌకికమైన సుఖాలకు, ఆకర్షణలకు లోను కాగూడదు. ముఖ్యంగా స్త్రీని అంటరానిదిగా చూడాలి. ఇక్కడ స్త్రీలకు కోపం రావచ్చు. సాధకుడు గనక స్త్రీ అయితే వారు పురుషుణ్ణి అంటరానివాడుగా భావించాలి. దూరంగా ఉంచాలి. సృష్టిలో స్త్రీ పురుషులకు మించిన ఆకర్షణ ఏదీలేదు. స్త్రీలు గాని, పురుషులు గాని ఈ ఆకర్షణకు లోనైతే అథఃపతన మవుతారు. ఆకాశమంత ఎత్తుకు ఎదిగిన వారు పాతాళంలో పడిపోతారు. అందుకే స్త్రీలు పురుషుల పట్ల "జాలరివాడు గాలానికి తగిలించే ఎరలు" "వేటగాడు పక్షుల

కోసం విసిరిన వలలు" అంటారు. ఇది స్త్రీ పురుషులిద్దరికీ వర్తిస్తుంది. మోక్షగామియైన వాడు శరీరాన్ని శవంలాగా చూస్తాడు. దేహాభిమానం ఏ మాత్రము పనికిరాదు. రాగద్వేషాల ఆధారంగా శరీరం తన ఇష్టం వచ్చినట్లు వర్తిస్తుంది. అలా జరగకూడదు. అంటే సమత్వభావం కావాలి. ఇంద్రియ గోచరమయ్యే ప్రపంచం కేవలం మనోకల్పితము అనే విషయాన్ని గురూపదేశము, శాస్త్రాల సహాయము, విచారణ, యుక్తి వీటి సహాయంతో తెలుసుకోవాలి.

దేహంతో ఎప్పుడూ తాదాత్మ్యత పనికిరాదు. దేహంతో తాదాత్మ్యత అంటే నేను అంటే దేహము అని నమ్మటము. దీనివల్ల శరీర సుఖాల పట్ల మక్కువ పెరుగుతుంది. దానివల్ల అజ్ఞానం పెరుగుతుంది. ఈ అజ్ఞానం నుంచి బయట పడటం అసాధ్యం. శ్లేష్మంలో పడ్డ ఈగలాగా అందులో నుంచి బయటకు రాలేక శతమతమవుతుంటాడు. దీనిలోంచి బయట పడాలంటే నిర్వేదము లేదా నిర్లిప్తత అనేది ఒకటే మందు. దీనివల్ల విషయవాసనల మీద, భోగాలమీద ఆకర్షణ తగ్గి సాధకుడు వాటినుంచి బయట పడతాడు. అప్పుడు ఇష్టాఇష్టాలు ఉండవు. శారీరక సుఖాలమీద కోరిక నశిస్తుంది.

సృష్టి ఎలా జరిగింది అనే విషయం చూస్తే, జగత్తులో పరబ్రహ్మము నుంచి ముందుగా అవ్యక్తము (మాయ) దాని నుంచి మహత్తత్త్వము (హిరణ్యగర్భుడు) దాని నుంచి అహంకారము (విరాడ్రూపము) ఆవిర్భవించాయి. తరువాత పంచతన్మాత్రలు, ఆ తరువాత తన్మాత్రల స్థూలరూపాలయిన పంచభూతాలు వచ్చాయి. ఇప్పుడు వీటి పంచీకరణ జరగటం వల్ల జగదావిర్భావము జరిగింది. అంటే జగత్తంతా పంచభూతాల సమ్మేళనంతో, త్రిగుణాల ఆధారంగా జరిగింది. పంచభూతాలు, త్రిగుణాలు వేరు వేరు నిష్పత్తుల రూపంతో జగత్తు ఆవిర్భవించింది. వీటన్నింటి యథాతథంగా చూస్తే వాటికి ఏ నిలువ లేదు. కాని రాగద్వేషాల వల్ల వాటికి ప్రత్యేకమైన నిలువలు ఆపాదించబడుతున్నాయి. ఈ రకంగా మనం కల్పించుకున్న మానసిక విలువలతో కూడిన ఈ వస్తువులను సంపాదించుకోవటానికి అహర్నిశలు విపరీతమైన శ్రమ పడుతున్నాం. అది ఎలా అంటే ఈ రోజున ఉన్న కరన్సీ నోట్లు. ఇవి కేవలం కాగితం ముక్కలు. వీటికి అసలు విలువ ఏ మాత్రమూ లేదు. కాని వాటికి విలువను ఆపాదించి, ఆ కరన్సీ నోట్లు సంపాదించటానికి

మానవుడు రేయింబవళ్ళు కష్టపడుతున్నాడు. మట్టికీ బంగారానికీ ఏ మాత్రం తేడాలేదు. కాని బంగారానికి విలువను ఆపాదించి, దానికోసం విపరీతమైన శ్రమ పడుతున్నాడు. ఉదాసీనత, నిర్వేదము లేదా నిర్లిప్తతను పెంచుకుంటే మానవుడు ఈ కోరికల నుంచి విడివడతాడు.

కోరికే సంసారం. నిర్వేదమే ముక్తి మార్గము. ఈ విషయాన్ని అష్టావక్రుడు తొమ్మిదవ అధ్యాయంలోని ఎనిమిది శ్లోకాలలో వివరించారు.

**కృతాకృతే చ ద్వంద్వాని కదా శాంతాని కస్య వా ।**
**ఏవం జ్ఞాత్వేహ నిర్వేదాద్భవత్యాగ పరోఽవ్రతీ ॥ 1**

ఇది చేయతగిన పని. ఇది చేయతగనిది. అనే కర్తవ్య దీక్ష, సుఖదుఃఖాల యందు అభిమానము. పాపపుణ్యాలు మొదలైన ద్వంద్వాల యందు అభిమానము ఎప్పటికీ పోదు. ఈ విషయం గుర్తించి అన్ని వ్యవహారముల మీదకి మనసు పోకుండా చూసుకో.

అష్టావక్రుడు జనక మహారాజుకు చెబుతున్నాడు. ఓ జనక మహారాజా! సాధకుడు తాను చేసే కర్మలన్నింటికీ నేనే కర్తని అని భావించినట్లైతే అహంకారం పెరగి బాధిస్తుంది. ఏదైనా ఒక పని చేసినప్పుడు నేను ఈ పని చేశాను. నేను చేయగలిగాను అని ఆనందిస్తాడు. ఒకవేళ చెయ్యలేకపోతే నేను ఈ పని చెయ్యలేక పోయాను అని దుఃఖిస్తాడు. ఇలా సంతోషించటము, దుఃఖించటము అహంకార ధర్మం.

ఒకవేళ నేను భోక్తని అనుకుంటే నేను చేసిన కర్మల ఫలితాన్ని నేను అనుభవిస్తున్నాను. పాపపుణ్యాలు, సుఖదుఃఖాలు నేనే అనుభవిస్తున్నాను. అనుకుంటాడు. దానివల్ల రాగద్వేషాలు మొదలైన ద్వంద్వాలు బలపడతాయి. అంటే ఇవి సాధకుణ్ణి బలంగా ఆవరిస్తాయి. ద్వంద్వాల ప్రభావాన్ని భోక్తగా అనుభవించేది అహంకారమే. అహంకారం నశిస్తేనే ద్వంద్వాలు నశిస్తాయి. ఈ ద్వంద్వాలన్నీ మనసు చేత కల్పించబడినవి. అజ్ఞానంతో కూడిన అహంకారానికి చెందినవి.

మసక చీకటిలో స్తంభాన్ని చూసి భూతం అనుకున్నాడు. ఇలా భావించటం చేత భూతమూ, దానికి సంబంధించిన బాధలు ఏ రకంగానూ స్తంభాన్ని బాధించలేవు.

అలాగే అహంకారము ఆత్మమీద ఆరోపించబడిన భ్రమ. కాబట్టి అహంకారానికి చెందిన బాధలేవీ ఆత్మను బాధించలేవు. ఆరోపించబడిన సర్వజగత్తుకు నేనే అధిష్టానాన్ని అని భావన చెయ్యాలి.

అయితే దృశ్యమానమైన జగత్తును ఏ దృష్టితో చూడాలి? అనేది ప్రశ్న. నువు నన్ను చూస్తున్నావు. నేను సామాన్యమైన మానవుణ్ణి. కాని నాలో నీకు రెండు కొమ్ములు ఒక తోక కనుపిస్తున్నాయి. ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమంటే నాకు నిజంగా కొమ్ములు లేవు. తోక అంతకన్నా లేదు. వాటికి నాకు ఏ రకమైన సంబంధము లేదు. అలాంటప్పుడు వాటిపైన ఉదాసీన భావంతో ఉంటూ నీ అజ్ఞానానికి జాలి పడతాను. నామీద నీకు అత్యంతమైన అభిమానం ఉంది. దాని కారణంగా నాకు సేవ చెయ్యాలనుకుంటున్నావు. నన్ను అందంగా తయారుచెయ్యాలి అనుకుంటున్నావు. అలాగే నీ ఇష్టాన్ని నేనెందుకుకాదనాలి. లేని కొమ్ములకు నూనె వ్రాస్తే, అది ఎలాగూ నన్నంటు కోదు. పైగా నాకు సేవ చేశాననే తృప్తి నీకు మిగులుతుంది. అలాంటప్పుడు నేనెందుకు నిన్ను కాదనాలి?

ప్రపంచంలోని జ్ఞానులందరూ ఇలాగే వ్యవహరిస్తారు. కాబట్టి ఓ రాజా! రాగద్వేషాలు లేకుండా ఆత్మను ఆత్మగా చూస్తూ, భ్రమలు వదిలిపెట్టి పరమశాంతంగా జీవించు.

**త్యాగపరాఃవ్రతీ ॥**

త్యాగంతో, అవ్రతీ ఏ వ్రతము చెయ్యనివాడై ఉన్నాడు. కోరికలు ఉండి అవి తీరనివాడు, వాటిని తీర్చుకోవటం కోసం వ్రతాలు చేస్తాడు. అసలు కోరికలే లేనివారికి వ్రతాలు, నిష్టలు ఎందుకు? వాటితో పని ఏమిటి? కాబట్టి ఓ రాజా! రాగరహితుడవు కావలసింది అంటున్నారు. ఉపనిషత్తులలో చెప్పినట్లుగా ధర్మశాస్త్రాలపట్ల ఉదాసీనత చూపుతూ, శాంత గంభీరమైన స్థితిలో జ్ఞాని పరమశాంతంగా ఉంటాడు.

**కస్యాపి తాత ! ధన్యస్య లోకచేష్టావలోకనాత్ ।**
**జీవితేచ్ఛా బుభుక్షాచ బుభుత్సోపశమం గతాః ॥ 2**

కుమారా ! లోకాన్ని బాగా అర్థం చేసుకోవటం వల్ల అనుభవించాలనీ, తెలుసుకోవాలనే కోరికలు నశించగా శాంతుడుగా జీవించే జ్ఞాని లోకంలో చాలా అరుదుగా ఉంటాడు అతడి జన్మధన్యము అంటున్నాడు అష్టావక్రుడు.

జగత్తంతా జనన మరణాలతో కూడినది. ఇది మరణమే ధర్మముగా గల మర్త్యలోకము. ఇక్కడ జన్మించిన ప్రతిజీవి, ప్రతి వస్తువు నశించి తీరాల్సిందే. ఇక్కడ ఎవరూ శాశ్వతం కాదు. కొన్ని కోట్ల సంవత్సరాల నుంచి జగత్తు ప్రవర్తిల్లుతున్నది. ఎప్పటికప్పుడు ప్రాణులు, వస్తువులు పుడుతూ ఉంటాయి ఛస్తూ ఉంటాయి. ఒకప్పుడు విశాలమైన నగరాలు కొంత కాలానికి నాశనమై పోవచ్చు. బీడు భూములుగా, పంట పొలాలుగా మారవచ్చు. అలాగే పంట పొలాలు పట్టణాలుగా మారవచ్చు. ఇందులో ప్రాణికోట మాత్రం నిరంతరం జనన మరణాల వలయంలో తిరుగుతూనే ఉంటుంది. **రారే రాజులు రాజ్యముల్ గల్గవే, వారేరీ** ఈ దేశాన్ని ఎంతోమంది మహారాజులు పాలించారు. విశ్వవిజేత అలెగ్జాండరు. నెపోలియన్ వంటి మహానుభావులు అనేకమంది ధరామండలాన్ని పాలించాడు. వారంతా ఏరి? ఎక్కడికి వెళ్ళిపోయారు? ఇవాళ్టి రోజున కొంతమంది పేరు కూడా వినబడటం లేదు. అంతదాకా ఎందుకు నీ తాత, నీ తండ్రి నీ కళ్ళ ఎదుటే మరణించారు. రేపో మాపో నువు కూడా మరణిస్తావు. లోకంలో ప్రతి మానవుడు ప్రతి సంవత్సరం జన్మదిన వేడుకలు జరుపుకుంటాడు. ఆనందంగా కేరింతలు కొడతాడు. కాని తన ఆయుష్షు ప్రతిసంవత్సరం తరిగిపోతోంది అని గుర్తించడు. అందరూ మరణించే వారే. తాను కూడా ఏదో ఒక రోజున మరణిస్తాడు. ఈ విషయం అతనికి కూడా తెలుసు. అయినప్పటికీ జీవితంమీద విపరీతమైన మమకారం. దీనికి కారణం అజ్ఞానం. ఇంకా విచిత్రం ఏమంటే ప్రతివాడు ఇంకా జీవించాలనే అనుకుంటాడు. మరణించటానికి ఒప్పుకోడు.

**చావుంగాలము చేరువౌ టెరింగియున్ జాలింపగాలేక త**
**న్నే వైద్యుండు చికిత్స బ్రోవగలడో? ఏమందు రక్షించునో**
**ఏ వేల్పుల్ కృపచూతురో అనుచు నిన్నింతైనన్ చింతింపడా**
**జీవచ్ఛ్రాద్ధము చేసికొన్న యతియున్ శ్రీకాళహస్తీశ్వరా ॥**

పోయే కాలం వచ్చింది. అవసాన కాలం ఆసన్నమైంది. అయినప్పటికీ మరణించటానికి ఇష్టపడడు. ఏ వైద్యుడైనా వచ్చి చికిత్స చేస్తాడేమో? ఏ మందులో ఏముందో, ఏ భగవంతుడైనా దయచూపక పోతాడా? అంటూ జీవశ్రాద్ధము పెట్టుకున్న వాడుకూడా ఎదురు చూస్తుంటాడు. ఇంకా జీవించాలి అనుకుంటాడే కాని మరణించటానికి మాత్రం ఇష్టపడడు. ఇది మానవ నైజం.

వయసు వళ్ళినా, ఓపిక, సత్తువ లేకపోయినా ఇంకా ఏదో అనుభవించాలనే కోరిక. ప్రపంచం మొత్తాన్ని పాలించాలనే కోరిక. అన్ని సుఖాలలోకి స్త్రీసౌఖ్యము అత్యంత ప్రియమైనది. వయసుమళ్ళినా, కాలుచేతులు కదలకపోయినా, కళ్ళు కనుపించక పోయినా, శరీరం సహకరించక పోయినా ఇంకా ఇంకా కావాలి. అనుభవించాలి అనే అనుకుంటాడు. **'తాతా మళ్ళీ పెళ్ళి చేసుకుంటావా' అంటే 'నాకెవడు పిల్లనిస్తాడ్రా!'** అంటాడు. అంతేకాని నేను చేసుకోను అని మాత్రం అనడు కారణం ఇంకా ఏదో అనుభవించాలనే కోరిక. ఇలా ఈ కోరికలు మానవుణ్ణి పట్టి పీల్చి పిప్పి చేస్తుంటాయి. కోరికలు అనంతం. ఒకటి తరువాత ఒకటి వస్తూనే ఉంటాయి. కోరికలు తీరినంత మాత్రం చేత హాయి, సుఖము ఉంటాయనేది నిజంకాదు. కోరికలు తీరకపోతే ఒక బాధ. తీరితే ఇంకో రకమైన బాధ. కోరికలు దుఃఖహేతువులు. ఈ విషయం అందరికీ తెలుసు. కాని కోరికలను వదలుకోలేరు. అదే అజ్ఞానము. కోరికలు నశించవు. మనసు నశిస్తేనే కోరికలు నశిస్తాయి. కోరికలు నశించిన వాడు జ్ఞాని. ఇటువంటి జ్ఞానులు లోకంలో చాలా అరుదుగా ఉంటారు. వారు ధన్యజీవులు. వాళ్ళనే **పండితాస్సమదర్శనః** అన్నింటినీ సమానంగా చూస్తారు.

ఈ శరీరం, ఈ వస్తువులు, ఈ జగత్తు, బాంధవ్యాలు అన్నీ అశాశ్వతమే. ఈ విషయం తెలిసినా కూడా, వాటి నుంచి బయటకు రాలేడు. జగత్తంతా ఇంద్రజాలం వంటిది. ఈ విషయం కూడా తెలుసు. అయినప్పటికీ జీవితంమీద విపరీతమైన మక్కువ. దీనంతటికీ కారణం అజ్ఞానం.

కాబట్టి అజ్ఞానం గనక నాశనమైతే, మనసు, కోరికలు వాటంతటవే నశిస్తాయి. ఇది కేవలము జ్ఞానికి మాత్రమే సాధ్యము. అందుకే అటువంటి జ్ఞాని ధన్యుడు అంటున్నాడు అష్టావక్రుడు.

**అనిత్యం సర్వమేవేదం తాపత్రితయ దూషితమ్ ।**
**అసారం నిందితం హేయమితి నిశ్చిత్య శామ్యతి ॥ 3**

ఈ జగత్తు అసత్యము, అనిత్యమైనది. త్రివిధ తాపములచే బాధింపబడు తుంటుంది. సారము లేనిదే సంసారము. అందుకే దీనిని విడనాడిన వారికే శాంతి లభిస్తుంది. ఈ విషయం తెలుసుకున్న జ్ఞాని అన్నిటా సమచిత్తం గలిగి పరమ శాంతంగా ఉంటాడు.

అష్టావక్రుడు తన శిష్యుడైన జనక మహారాజుతో చెబుతున్నాడు. రాజా! దృశ్యమానమైనదంతా నశించేదే. ఒక్కమాట విను. ఈ లోకంలో కంటికి కనుపించేది, నామరూపాత్మకమైనది అంతా అశాశ్వతమైనదే. ఇదంతా నాశనమై పోతుంది. అందుకే లౌకికంలో ప్రళయకాలంలో అన్నీ నశించిపోతాయి. పరమాత్మ ఒక్కడే ఉంటాడు అని చెబుతారు. పరమాత్మ నిరాకారుడు. అందుకనే ఆయన నిత్యము, శాశ్వతము అయినవాడు. ఆయన తప్ప లోకంలో అన్నీ అనిత్యాలే. అశాశ్వతాలే. అనిత్యమైన ఈ జగత్తు నిత్యము శాశ్వతము అయిన పరమాత్మ యందు ఆరోపించబడింది. అంటే జగత్తు పరమాత్మకన్న వేరైనది కాదు. ఆత్మకు త్రివిధ తాపములు ఉండవు. తాపములు అంటే బాధలు. ఇవి మూడు 1.ఆదిభౌతిక 2.ఆధిదైవిక 3.ఆధ్యాత్మిక భావనలు. ఇవేవీ పరమాత్మకు ఉండవు. సంసారంలో అసలు రుచి ఏ మాత్రం ఉండదు. అందుకే దీన్ని **'సారము లేనిది సంసారము'** అన్నారు. కాబట్టి ఓ జనకరాజా! దృశ్యమానమైన జగత్తును ఆదరించవలసిన పనిలేదు. జ్ఞాని ఈ విషయాన్ని గట్టిగా నిశ్చయించుకుని దేనియందు, ఎటువంటి ఆసక్తి లేకుండా జీవిస్తాడు.

లోకంలో మానవుడు కళ్ళుండి చూస్తున్న గ్రుడ్డివాడు, చెవులు ఉండి వింటున్న చెవిటివాడుగా, బుద్ధిని ఏ మాత్రం ఉపయోగించకుండా, సద్వినియోగం చేసుకోకుండా, జీవితాన్ని వృధా చేస్తున్నాడు. విషయభోగాలు అనుభవించే వారికి విషాదం తప్పదని తెలిసి కూడా, వాటి నుంచి విరక్తుడు కావటం లేదు.

అజ్ఞాని ఎప్పుడూ సమస్యలతో, సందేహాలతో, బాధలతో కొట్టుమిట్టాడుతుండాలి. ఈషణత్రయానికి వశుడై పోతాడు. ఈషణత్రయము అంటే 1.ధనేషణ 2.దారేషణ 3.పుత్రేషణ

వంశాభివృద్ధి చెందాలి. అంటే పుత్రులు కావాలి. కాబట్టి ముందుగా పుత్రసంతానం కోసం ప్రయత్నిస్తాడు. పుత్రులు కావాలంటే ముందు భార్య కావాలి. భార్యాబిడ్డలను పోషించటాన్ని ధనం కావాలి. ఈ రకంగా ధనేషణ దారేషణ పుత్రేషణ అనబడే మూడింటిలోను (ఈషణత్రయంలో) చిక్కుకుపోతాడు. అందులోంచి బయట పడలేడు. అహంకార మమకారాలు, రాగద్వేషాలు అన్నీ విడనాడిన జ్ఞాని అన్ని జీవులను సమానంగా చూడగలుగుతాడు. **పండితాస్సమదర్శనః.** కాబట్టి జనక మహారాజా! త్రివిధ తాపములు, ఈషణత్రయము లేనివాడు మాత్రమే జ్ఞాని అవుతాడు.

**కో౽సౌకాలో వయః కిం వా యత్ర ద్వంద్వాని నోనృణామ్ ।**
**తాన్యుపేక్ష్య యథా ప్రాప్తవర్తీ సిద్ధి మవాప్నుయాత్ ॥ 4**

మానవజీవితంలో ఏ కాలంలోనైనా సరే ద్వంద్వాలు తమ ప్రభావం చూపుతూనే ఉంటాయి. వీటిలో దేనినీ కావాలి అనుకోకుండా, వద్దు అని నిరసించకుండా, వచ్చిన వాటిని అనుభవిస్తూ, తటస్థంగా ఉంటూ, స్థిరత్వంతో జీవించే వాడికి పూర్ణత్వం సిద్ధిస్తుంది.

లోకంలో జనులకు త్రికాలముల యందు అంటే భూత భవిష్యద్వర్తమానాల యందు, బాల్యము, కౌమారము, యవ్వనము, వృద్ధాప్యము మొదలైన అవస్థల యందు, ద్వంద్వములు లేని కాలమే ఉండదు. ఇక్కడ ప్రత్యేకంగా ద్వంద్వములు అంటే సుఖదుఃఖాలు. వీటిని ఎప్పుడూ ఏ మాత్రము లెక్కచేయక అనాసక్త బుద్ధితో అనుభవించే వాడు స్థితప్రజ్ఞుడు. సుఖము వచ్చినప్పుడు ఆనందించడు ఎగిరి గంతులు వేయడు. అలాగే దుఃఖాలు వచ్చినప్పుడు బాధపడడు. క్రుంగిపోడు. విచారించడు. మానావమానాలు సమానంగా తీసుకుంటాడు. అతడికి జననంమీద ఆసక్తి ఉండదు. మరణం మీద విరక్తి ఉండదు. అసలు జనన మరణాల గురించి పట్టించుకోడు. అతడికి రాగద్వేషాలు, అహంకార మమకారాలు, సుఖదుఃఖాలు పాపపుణ్యాలు మానావమానాలు ఇటువంటి ద్వంద్వములు ఉండవు. ఇటువంటి వ్యక్తి వాసనా క్షయమును పొంది ముక్తుడౌతాడు.

కష్టసుఖాలతో నిండిన ఈ జీవితంమీద ఆసక్తి ఉన్నంత వరకు ద్వంద్వాలు బాధిస్తూనే ఉంటాయి. మనస్సుతో గనక తాదాత్మ్యము ఉన్నట్లైతే జీవించినంత కాలము సుఖదుఃఖాలు, శీతోష్ణాలు, కలిమిలేములు, ఇష్టాయిష్టాలు మొదలైన ద్వంద్వాలు లెక్కకు మించినవి మనస్సులో కల్లోలాన్ని రేపుతుంటాయి. బాధ పెడుతుంటాయి. దుర్భరమైన కల్లోలాన్ని సృష్టించి పెంచి పోషిస్తుంటాయి. మానవుడి జీవితంలో ఈ ద్వంద్వాల ప్రభావం ఎప్పుడూ ఉంటుంది. మనసుతో తాదాత్మ్యత ఉన్నంత వరకు, అహంకారం ఉన్నంతవరకు ఈ ద్వంద్వాలు ఉంటాయి. మనిషిని బాధపెడుతుంటాయి.

ద్వంద్వాల ప్రభావం నుంచి బయట పడటం ఎలా? దీనికి ఒక్కటే మార్గం. మనసుతో గల తాదాత్మ్యాన్ని వదిలెయ్యాలి. మనసును అధిగమించి ద్వంద్వాల కతీతంగా నిలవగలగాలి. అలా నిలువ గలిగిన వ్యక్తి మాత్రమే పరిపూర్ణమైన శాంతితో

జీవించగలుగుతాడు. ఏ విషయాన్నైనా, ఎటువంటి పరిస్థితులనైనా సమానంగా భావించగలుగుతాడు. **యథాప్రాప్తవర్తీ** – యాదృచ్ఛికంగా వచ్చిన భోగాలు అనుభవిస్తాడు. అటువంటి వాడికి అజ్ఞానంతో వచ్చిన అహంకారం నశించి జ్ఞానం వెలగొందుతుంది. సంతోషము అనే అమృతాన్ని పానం చేసిన మహాత్ములు శాంతిని తృప్తిని పొంది ఆత్మజ్ఞానంతో ఆత్మనిష్ఠులౌతారు.

ఇక్కడ గుర్తించాల్సింది ఏమంటే ద్వంద్వాలలో ఏ ఒకటి ఉన్నా రెండవది కూడా ఉండి తీరుతుంది. వెలుతురు ఉంటే చీకటి ఉంటుంది. అలాగే సుఖము ఉంటే దుఃఖము ఉండి తీరుతుంది. పుణ్యము ఉన్నది అంటే పాపం కూడా ఉన్నదన్న మాటే. అలా కాకపోతే పుణ్యము ఉన్నది అనరు. ఉత్తరదిక్కు అంటే దక్షిణ దిక్కు కూడా ఉన్నదని అర్థం. కాబట్టి ఇందాక చెప్పినట్లుగా అహంకారము, మనస్సు ఈ రెండూ గనక ఉంటే ద్వంద్వాలు ఉండి తీరతాయి. ఇందులో సందేహం లేదు. బండి చక్రం క్రింది నుంచి పైకి, పైనుంచి క్రిందికి తిరుగుతూ ఉంటుంది. ఒకసారి పైన ఉన్న భాగము ఇంకొకసారి క్రిందికి వస్తుంది. చీకటి పోయిన తరువాత వెలుగు వస్తుంది. వెలుతురు వచ్చిన తరువాత చీకటి ఉండదు. పగలు తరువాత రాత్రి వచ్చి తీరుతుంది.

**సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖం**
**ద్వయమేతద్ధి జంతూనాం అలంఘ్యం దివారాత్రమ్ ॥**

ఏ ప్రాణికైనా సరే సుఖం తరువాత దుఃఖం, దుఃఖం తరువాత సుఖం తప్పకుండా వస్తాయి. వీటిని ఎవరూ తప్పించుకోలేరు. పగలు రాత్రి క్రమం తప్పకుండా ఎలా వస్తాయో, అలాగే సుఖదుఃఖాలు కూడా సహజంగా వరుస తప్పకుండా వస్తాయి.

మనసుకు కష్టం కలిగింది. విచారంగా ఉంది. దీన్నుంచి బయట పడాలంటే సుఖాన్ని పొంది తీరాలి. దేనిద్వారా సుఖం వస్తుందో దాన్ని పొందాలి. కాబట్టి మనసున్నంత వరకు కష్టం నుంచి బయట పడాలంటే సుఖం పొందాలి. సుఖం వద్దనుకుంటే కష్టాలు అనుభవించాలి. ఇంతకు మించి ఇంకో మార్గంలేదు. సముద్రంలో ప్రయాణం చేస్తుంటే అలల తాకిడి తప్పదు. అలల నుంచి తప్పుకోవాలి అంటే సముద్రం నుంచి దూరంగా వెళ్ళిపోవాలి. అలాగే ఈ ద్వంద్వాలన్నీ మనసు,

అహంకారము వల్ల వస్తున్నాయి. కాబట్టి మనస్సును, అహంకారాన్ని వదలగలిగితే ద్వంద్వాల ప్రభావం ఉండదు.

ఒకసారి శ్రీకృష్ణపరమాత్ముని పట్టపురాణి రుక్మిణీదేవి, భగవానుని చేతిలో ఉన్న వేణువును చూసి "ఓ వేణువా! నువు ఎంత పుణ్యం చేసుకున్నావో ఎల్లప్పుడూ శ్రీకృష్ణ పరమాత్ముని చేతుల్లోనే ఉంటావు. స్వామి నిన్ను అంతగా ఆదరించటానికి నీ దగ్గర ఏముంది?" అని అడిగింది. దానికి వేణువు "ఓ రుక్మిణీదేవీ! నా దగ్గర ఏముంది? అంతా డొల్లతప్ప" అందట.

ఇక్కడ చాలా జాగ్రత్తగా చూడండి సాకారమైనా, నిరాకారమైనా పరమాత్ముడి సన్నిధికి చేరాలంటే ద్వంద్వాలు అన్నీ వదిలెయ్యాలి. రాగద్వేషాలు, అహంకార మమకారాలు, నీది నాది అనే తేడాలు ఇలాంటివన్నీ వదిలేసి కేవలుడుగా మిగలాలి. అప్పుడు ఇంకా ఉండేదేముంది డొల్లతప్ప. అదే మాట వేణువు చెప్పింది "నా దగ్గరేముంది డొల్ల తప్ప" పరంధాముణ్ణి చేరాలంటే నీ దగ్గర ఏమీ ఉండకూడదు.

శ్రీకృష్ణుడు, కుచేలుడు బాల్యమిత్రులు, సహాధ్యాయులు. ప్రాణమిత్రులు. కుచేలుడు కడు పేదరికం అనుభవిస్తున్నాడు. ఒకరోజున రుక్మిణి "దేవదేవా! కుచేలుడు నీ బాల్యమిత్రుడు. అతణ్ణి కరుణించి పేదరికం తొలగించి ఐశ్వర్యం ప్రసాదించవచ్చు కదా!" అంటుంది. అప్పుడు భగవానుడు 'దేవీ ! కుచేలుడికి అజ్ఞానం పోయింది. కాని నన్ను చేరగలిగే స్థితి ఇంకా రాలేదు. అతడు మహామోహాన్ని గెలవాలి. అదిగో వస్తోంది మహామోహం" అంటాడు.

అదే సమయంలో కుచేలుడు భిక్షాటనకు బయలుదేరాడు. త్రోవలో పల్లకిలో పెడుతున్న ఒక వ్యక్తి కుచేలుణ్ణి చూసి పల్లకి దిగి వచ్చాడు. ఇద్దరూ కలుసుకున్నారు. వారిద్దరూ కూడా బాల్యస్నేహితులే. పల్లకిలోంచి దిగిన వ్యక్తి అంటాడు. "కుచేలా! నువ్వు గొప్ప పండితుడివి. నాతోపాటు రా. రాజాగారి దగ్గరకు తీసుకువెడతాను. ఆయన నిన్ను ఆదరిస్తారు. నాకు లాగానే నువ్వుకూడా భోగభాగ్యాలతో తులతూగవచ్చు" అని. ఆ మాటలు విన్న కుచేలుడు మిత్రుని ప్రతిపాదనను సున్నితంగా నిరాకరిస్తాడు. మిత్రుడు పల్లకిలో వెళ్ళిపోయాడు. పరమాత్ముడు రుక్మిణితో అంటాడు. "రుక్మిణీ! ఇప్పుడు కుచేలుడు మహామోహాన్ని గెలిచాడు. ఇక నా దగ్గరకు

వస్తాడు” అని. ఆ మరునాడే కుచేలుడు అటుకులు మూటకట్టుకుని భగవానుడి దగ్గరకువచ్చాడు. తరువాత జరిగింది మనకు తెలిసిందే.

కాబట్టి పరమేశ్వరుణ్ణి చేరాలి అంటే, ముక్తి కావాలంటే అన్నింటినీ వదిలెయ్యాలి. ముఖ్యంగా మనస్సు, అహంకారాలను వదిలెయ్యాలి అని చెబుతున్నాడు అష్టావక్రుడు.

**నానామతం మహర్షీణాం సాధూనాం యోగినాం తథా ।**

**దృష్ట్వా నిర్వేద మాపన్నః కో న శామ్యతి మానవః ॥ 5**

ఎంతోమంది గొప్పవారు సాధువులు, యోగులు, ఋషులు వీరు రకరకాలుగా మాట్లాడినా, ఇక్కడ ఉన్న సత్యం ఒక్కటే. ఈ విషయం తెలిసిన జ్ఞాని నిర్వేదంతో శాంతుడవుతాడు.

జైమిని, గౌతముడు, వ్యాసుడు, కణాదుడు మొదలైన వారు ఈ జగత్తును గురించి అనేక రకాలుగా చెప్పారు. మోక్షం పొందటానికి కొందరు జ్ఞానమార్గం చెబితే కొందరు యోగమార్గము, కొందరు కర్మమార్గములు చెప్పారు. అనేక రకాల వ్రతాలు చాంద్రాయణ వ్రతము, కృచ్ఛ్రక వ్రతము ఇలా అనేక వ్రతాలు చెప్పారు. ఇవన్నీ ఒకదానికి ఒకటి భిన్నమైన మార్గాలుగా కనుపిస్తాయి. ఒకదానితో ఒకటి సంబంధం లేకుండా ఉంటాయి. వీటన్నింటిలోను సత్యము ఒక్కటే. ఈ మార్గాలన్నీ తరచి చూసిన మహానుభావులు **నిరాకారుడు నిర్గుణస్వరూపుడు పరబ్రహ్మ. జీవాత్మ పరమాత్మల ఏకీభావమే మోక్షము. జ్ఞానాదేవతుకైవల్యం జ్ఞానం వల్లనే మోక్షం లభిస్తుంది** అని నిర్ధారించారు. ఈ మార్గాన్ని అనుసరించిన సాధకుడికి ఇతర మార్గాలు ఏ మాత్రము ఆమోదం కాదు.

ఎందరో మహానుభావులు తమ బుద్ధిని బట్టి, ఆలోచనలను బట్టి, అనుభవాన్ని బట్టి పరమాత్మ స్వరూపాన్ని, మోక్షాన్ని వివరించారు. దీనివల్లనే భారతీయ తత్త్వ శాస్త్రం శాఖోపశాఖలుగా విస్తరించింది. వీటన్నింటినీ చదివిన వాడికి ఏదీ అర్థం కాలేదు. అతడి పరిస్థితి గందరగోళంలో పడింది. దాంతో సాధకుడు ఈ విషయాల జోలికి వెళ్ళాలంటే భయపడిపోయాడు.

**శబ్దజాలం మహారణ్యం చిత్తభ్రమణ కారణమ్**

**అంతః ప్రయత్నాజ్ఞాతవ్యం తత్త్వజ్ఞ స్తత్త్వమాత్మనః ॥**

తత్త్వశాస్త్రం శాఖోపశాఖలుగా విస్తరించి మహారణ్యం లాగా భయంకరంగా తయారయింది. ఇందులోకి ప్రవేశించిన వాడు, బయటకు రావటం మహాకష్టం. తెలివైన సాధకులు గందరగోళంలో పడకుండా, చైతన్య స్వరూపమైన ఆత్మను తెలుసుకుని ముక్తి పొందాలి. అంటారు భగవత్పాదులవారు తమ **వివేకచూడామణిలో**.

గతంలో చెప్పినట్లుగా సాధకుడు గురువుగారు చెప్పిన విషయాలు జాగ్రత్తగా వినాలి. శాస్త్రాలు చదవాలి. సహాధ్యాయులతో చర్చించాలి. విచారణ చెయ్యాలి. వివేకంతో, విచక్షణతో, బుద్ధికి పరిమితమైన జ్ఞానంతో బుద్ధికి అతీతమైన చైతన్యాన్ని గురించి తెలుసుకోవాలి. పరమాత్మను తెలుసుకున్న తరువాత, తానే పరబ్రహ్మను అని తెలుసుకున్న తరువాత ఇతర వాదనల యందు, ఇతర మతాల యందు ఆసక్తి చూపడు. వాటిపట్ల నిర్లిప్తంగా ఉంటాడు. విచారణ వల్ల జ్ఞానం, వాదన వల్ల అజ్ఞానము పెరుగుతాయి. కాబట్టి చిత్తశుద్ధి కలిగిన సాధకులు వాదప్రతివాదాల జోలికి పోకుండా శాంతము శుద్ధము చైతన్యము అయిన ఆత్మను సాధిస్తారు. ఎవరెన్ని విధాలుగా చెప్పినా ఉన్నది ఒక్కటే. అదే సత్యము, నిత్యము, శాశ్వతము అని గుర్తించి, నిర్వేదంతో శాంతుడవుతాడు.

**కృత్వా మూర్తిపరిజ్ఞానం చైతన్యస్య న కిం గురుః ।**
**నిర్వేద సమతా యుక్త్యా యస్తారయతి సంసృతే ॥ 6**

పరిశుద్ధమైన ఆత్మ చైతన్యాన్ని తెలుసుకుని, ప్రపంచం పట్ల నిర్వేదం ప్రదర్శిస్తూ, జనన మరణాలతో కూడిన సంసారబంధం నుండి విముక్తుడైన వాడు ముముక్షువులకు త్రోవ చూపగలడు.

నిర్వేదము అంటే నిరాసక్తత. ఐహిక విషయాల యందు, సంసార విషయాల యందు ఏ మాత్రము ఆసక్తి లేకుండా స్తబ్దుగా ఉండిపోవటము. సమత అంటే సమత్వము. ఎవరి యందు మిత్రత్వం గాని శత్రుత్వం గాని లేకుండా సమానమైన బుద్ధి గలిగి ఉండటము. యుక్తి అంటే తెలివితేటలు. వేదాలకు, శాస్త్రాలకు విరుద్ధం కాని విధంగా విచారణ చెయ్యటం. దేనికీ విపరీతార్థాలు చెప్పకపోవటం. దీనివల్ల ఆత్మసాక్షాత్కారం జరుగుతుంది. ఆ తరువాత ఇంకా గురువు సహాయం అవసరం లేదు. అటువంటి వాడు భవబంధాల నుంచి బయటపడి ముక్తుడౌతాడు.

**మహోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఆత్మసాక్షాత్కారము కావాలంటేమనోమాలిన్యం పూర్తిగా తొలగిపోవాలి. ఈ మాలిన్యము ఏ కొంచెము మిగిలినా, అది మళ్ళీ పెరిగి పెద్దదవుతుంది. ఇక్కడ చిన్న ఉదాహరణ చూడండి ఇంట్లో డ్రైనేజీ ప్రవహిస్తోంది. అంతా సాఫీగా ఉంది. ఇలాంటి సమయంలో చిన్న వెంట్రుకలతుట్టె నీళ్ళలో కొట్టుకుపోతూ అక్కడ ఉన్న ఒక చిన్నరాయిని పట్టుకుని ఆగిపోయింది. ఆ తరువాత వచ్చిన చెత్తా చెదారం ఒకదాని తరువాత ఒకటిగా, ఈ వెంట్రుకల తుట్టెకు తగిలి ప్రవాహానికి అడ్డం పడిపోయినాయి. డ్రైనేజీ పూడిపోయింది. అలాగే మనోమాలిన్యం ఏ మాత్రం మిగిలినా, కొద్దికొద్దిగా పెరిగి పెద్దదై ఆధ్యాత్మిక భావనకు అడ్డు పడుతుంది. అందుకే భ్రమలు పూర్తిగా నశించిపోవాలి. మోక్షద్వారానికి 1.శమము 2.విచారణ 3.సంతుష్టి 4.సజ్జన సాంగత్యము అనే నలుగురు ద్వారపాలకులుంటారు. వీరిలో ఏ ఒక్కరిని గట్టిగా పట్టుకున్నా సరే, మిగిలిన ముగ్గురూ వశమవుతారు. అందుచేత వీరిలో ఏ ఒక్కరినైనా సర్వప్రయత్నాల చేత, సమస్తాన్ని త్యజించి అయినా సరే ఆశ్రయించాలి. శాస్త్రాభ్యాసము, సజ్జన సంపర్కము, అనే తపస్సు చేత, దమము అంటే బాహ్యేంద్రియ నిగ్రహము చేత ముందుగా సంసార బంధనాల నుండి విముక్తి కోసం గట్టిగా ప్రయత్నం చెయ్యాలి. శాస్త్రవాక్యము, స్వానుభవము, సద్గురు వాక్యము అనే ఈ మూడూ సమన్వయంతో ఎవరి ఆత్మలో ఎప్పుడూ దర్శనమిస్తాయో అతనికి పరమాత్మ దర్శనమిస్తాడు.

ఆత్మసాక్షాత్కారము పొందటము అంటే తనను తాను తెలుసుకోవటం. స్వస్వరూప జ్ఞానం. నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని నాకన్న వేరుగా ఈ జగత్తులో ఏదీలేదు అనే విషయం అనుభవ పూర్వకంగా తెలుసుకోవటం. ఆత్మసాక్షాత్కారం కావాలంటే మంచి గురువును ఆశ్రయించాలి. నిజమైన గురువుకు కొన్ని లక్షణాలుంటాయి. అంటోంది గురుగీత.

**గు కారశ్చాంధకారోహి । రుకారస్తేజ ఉచ్యతే**

**అజ్ఞానగ్రాసకం బ్రహ్మ । గురురేవ నసంశయః ॥**

గుకారము అంటే అంధకారము. రుకారము అంటే తేజస్సు. అజ్ఞానమనే అంధకారాన్ని నశింపచేసేవాడు గురువు. ఇందులో సందేహం లేదు.

(సద్గురువు లక్షణాలను గురుగీతలో 99 నుంచి 112 శ్లోకాలలో వివరించటం జరిగింది.)

**జ్ఞానహీనో గురుత్యాజ్యః । మిధ్యావాదీ విడంబకః**
**స్వవిశ్రాంతిం న జానాతి పరశాంతిం కరోతి కిం? ॥**

జ్ఞానహీనుడు, గురువును వదిలేసిన వాడు, మిధ్యావాది, బాహ్యావేషము లందు ఆసక్తి గలవాడు, మూఢుడు తనకే మార్గం తెలియనివాడు ఇతరులకు ఏం చెబుతాడు?

**శిలాయాః కిం పరం జ్ఞానం । శిలాసంఘ ప్రతారణే ।**
**స్వయంతర్తుం నజానాతి । పరం నిస్తారయేత్కథం ॥**

శిలలకు జ్ఞానముండదు. జ్ఞానం లేనివాడు శిలలాంటివాడే. అటువంటి జ్ఞానహీనుడికి తనకు తాను తరించటం తెలియదు. ఇతరులను ఎలా తరింపజేస్తాడు?

**నవందనీయాస్తే కష్టం । దర్శనాద్భ్రాంతి కారకాః**
**వర్జయేత్తాన్ గురూన్ దూరే । ధీరస్యతు సమాశ్రయేత్ ॥**

దర్శించినంత మాత్రంచేతనే భ్రమను కలిగించే గురువును విడిచిపెట్టాలి. అటువంటి వాడికి నమస్కారం కూడా చెయ్యరాదు. మంచి ధీరుడు జ్ఞాని అయిన గురువును మాత్రమే ఆశ్రయించాలి.

ఈ రకంగా సద్గురువును ఆశ్రయించి ఆత్మసాక్షాత్కారం పొందాలి.

**సర్వ(పంచ)భూత వికారాం స్త్వం భూతమాత్రాన్ యథార్థతః ।**
**తత్ క్షణాత్ బంధనిర్ముక్తః స్వరూపస్థో భవిష్యసి ॥** **7**

పంచమహాభూతాలు పరిణామం చెందటం వల్ల ఈ జగత్తు ఏర్పడింది. జగత్తు గాని, ఇందులోని వస్తువులు గాని ఆ భూతాలకన్న వేరుగా ఏవీలేవు. ఈ విషయం తెలుసుకుంటే బంధాలు విడివడతాయి. ఈ రకంగా బంధాల నుంచి విడివడి స్వస్వరూపంలో నిలచిపోవలసింది అంటున్నాడు అష్టావక్రుడు.

అసలు ముందుగా పంచభూతాలను చూద్దాం

సృష్టి ప్రారంభం కాక ముందు ఈ జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని పరమేశ్వరస్వరూపం ఆక్రమించి ఉన్నది. కొంత కాలానికి ఆ పరమాత్మ సృష్టి

చెయ్యాలని సంకల్పించుకున్నది. అప్పుడు మొదటగా పరమేశ్వరుణ్ణించి సత్త్వగుణం బయటకు వచ్చింది. అదే అవ్యక్తము, మాయ. ఆ తరువాత సత్త్వగుణం నుంచి రజోగుణం వచ్చింది అదే మహతత్త్వము, హిరణ్యగర్భుడు. రజోగుణం నుంచి తమోగుణం వచ్చింది. అదే అహంకారము, విరాడ్రూపము. ఈ రకంగా మొదటగా ఆ పరమేశ్వరుణ్ణించి సత్త్వరజస్తమో గుణాలు వచ్చినాయి. అవే అవ్యక్త మహత్తత్త్వ అహంకారాలు, అహంకారం నుంచి మొదటగా శబ్ద స్పర్శ రూప రస గంధములు అనబడే తన్మాత్రలు వచ్చినాయి. ఆ తరువాత వాటి స్థూలరూపాలయిన పంచభూతాలు ఆవిర్భవించినాయి. శబ్ద స్పర్శ రూప రస గంధాలు వీటి గుణాలు. ఐతే ఈ గుణాలు వరుసగా ఆకాశంలో – ఒకటి, వాయువులో – రెండు, అగ్నిలో – మూడు, జలంలో – నాలుగు, భూమియందు – ఐదు ఉంటాయి. అంటే –

| | | |
|---|---|---|
| ఆకాశంలో | – | శబ్దము |
| వాయువులో | – | శబ్దము, స్పర్శ |
| అగ్నిలో | – | శబ్దము, స్పర్శ, రూపము |
| జలము నందు | – | శబ్దము, స్పర్శ, రూపము, రసము |
| భూమియందు | – | శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము |

ఉంటాయి. ఈ గుణాలు ఎలా ఉంటామో చూద్దాం.

**ప్రతిధ్వనిర్వియచ్ఛబ్దో । వాయౌ బీసీతీ శబ్దనమ్ ।**
**అనుష్ణాశీత సంస్పర్శో వహ్నౌ భుగుభుగు ధ్వనిః ॥**

**ఉష్ణః స్పర్శః ప్రభారూపం జలే బులు బులు ధ్వనిః ।**
**శీతస్పర్శః శుక్లరూపం రసోమాధుర్యమీరితమ్ ॥**

**భూమౌ కడకడా శబ్దః కాఠిన్యం స్పర్శ ఇష్యతే ।**
**నీలాదికం చిత్రరూపం మధురామ్లాదికో రసః ॥**

**సురభీతరగంధౌ ద్వౌగుణాః సమ్యగ్వివేచితాః ।**
**శ్రోతం త్వక్ చక్షుషీ జిహ్వా ఘ్రాణం చేన్ద్రియ పంచకమ్ ॥**

ఆకాశంలో ప్రతిధ్వని రూపంలో శబ్దము అనే గుణం ఉంది. వాయువులో సీ సీ అనే శబ్దంతో పాటు ఉష్ణము, శీతము కానటువంటి స్పర్శ గుణం ఉంది. అగ్నిలో

భుగభుగ అనే ధ్వనితో పాటు ఉష్ణమనే స్పర్శ, ప్రకాశమనే రూపము ఉన్నాయి. జలంలో బుళ్‌బుళ్ అనే ధ్వనితోపాటు, తెల్లని రూపం, చల్లని స్పర్శ, తియ్యటి రసం, అనే నాలుగు గుణాలున్నాయి. భూమిలో కడకడమనే ధ్వనితోబాటు కఠిన స్పర్శ, నీలము, పసుపులాంటి రూపము, మధురతిక్త ఆమ్లాది రసాలు, గంధము (సుగంధం, దుర్గంధం) అనే ఐదు గుణాలు ఉన్నాయి. ఇవి పంచభూతాల గుణాలు. అలాగే ఈ భూతాలకు కార్యాలు కూడా ఉన్నాయి. కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము అనేవి జ్ఞానేంద్రియాలు పంచభూతాల కార్యాలు. ఈ ఐదు ఇంద్రియాలు చిల్లులు లేదా కంతలలో ఉంటాయి. కన్ను, ముక్కు, చెవి ఇవన్నీ కంతలే పైకి కనిపించే దొప్పలు, రెప్పలు ఇంద్రియాలు కాదు. అవి చాలా సూక్ష్మంగా ఉంటూ శబ్దస్పర్శ రూప రస గంధాలను గ్రహిస్తాయి. ఈ ఇంద్రియాలు చాలా సూక్ష్మమైనవి. అందుకే వాటి కార్యాలను బట్టి ఊహించి తెలుసుకోవటానికి వీలుంటుంది. ఎక్కువగా ఈ ఇంద్రియాలు బాహ్యవిషయాల వైపుకే పరుగులు తీస్తాయి. కఠోపనిషత్తులో చెప్పినట్లుగా బ్రహ్మ ఈ ఇంద్రియాలను బహిర్ముఖం చేశాడు. అందుకే ఇవి జీవుని స్వరూపాన్ని కాకుండా బయట వైపుకు చూస్తుంటాయి. కాని అప్పుడప్పుడు అంతర్విషయాలకు సంబంధించిన జ్ఞానం కూడా కలుగుతుంటుంది. మనం వ్రేళ్ళతో చెవులు మూసినప్పుడు, లోపల ఉన్న ప్రాణవాయువు, జఠరాగ్ని వీటికి సంబంధించిన ఒక రకమైన ధ్వని వినిపిస్తుంది. చల్లని నీళ్ళు త్రాగేటప్పుడు, మన లోపల చల్లగా స్పర్శ కలుగుతుంది. రెండు కళ్ళూ మూసుకున్నప్పుడు లోపల ఉన్న అంధకారము కనిపిస్తుంది. త్రేపులు వచ్చినప్పుడు లోపల ఉన్న రసము, గాలి బయటకు వచ్చినప్పుడు వాసన తెలుస్తుంది. ఈ విధంగా జ్ఞానేంద్రియాల వల్ల లోపల ఉన్న జ్ఞానము కూడా తెలుస్తుంది.

కర్మేంద్రియ వ్యాపారం. మాట్లాడటం, తీసుకోవటము, నడవటము, మలవిసర్జన, విషయ సంభోగము. వీటినే వచన దానా గమన విసర్గానందములు అంటారు. ఇవి కర్మేంద్రియాలు చేసే పనులు. వాక్కు, పాణి, పాద, పాయు, ఉపస్థలు కర్మేంద్రియాలు. ఇవి నోరు మొదలైన వాటి స్థానాల్లో ఉంటాయి. మనస్సు అనేది పదకొండవ ఇంద్రియం. ఇది కేవలము మానవుడికి మాత్రమే ప్రసాదించబడిన వరం. ఇది జ్ఞానేంద్రియాలకు, కర్మేంద్రియాలకు అధిపతి. ఇంద్రియాలను ప్రేరేపించేది మనస్సే. ఇది అంతఃకరణ లోపల ఉండే ఇంద్రియం. హృదయ కమలంలో ఉండే

ఛిద్రమే దాని స్థానం. మనస్సు ఇంద్రియ సాయం లేకుండా స్వతంత్రంగా ఏ పని చెయ్యలేదు. ఇంద్రియాలు లేకుండా శబ్దాది బాహ్య విషయాలను గ్రహించలేదు. కన్ను మొదలైన ఇంద్రియాలు ఆయా విషయాల్లో పరిణతమైనప్పుడు, రూపము మొదలైన జ్ఞానం కలిగిన తరువాత, వాటి గురించిన గుణదోషాలను చర్చించేది మనస్సే. సత్త్వము, రజస్సు, తమస్సు అనేవి మనస్సు యొక్క గుణాలు. వీటివల్లనే మనసు మార్పు చెందుతున్నది. గుణదోష విచారణ ఆత్మ, ఇంద్రియాలు చెయ్యవు. కేవలము మనస్సే చేస్తుంది. మనస్సులో పుట్టే కామక్రోధాది వృత్తులు అన్నీ గుణత్రయము యొక్క వికృతులే. ఈ మూడు గుణాలలోని భేదంవల్లనే మనస్సులో అనేకమైన వృత్తులు, వికారాలు పుడతాయి. మనస్సులో వైరాగ్యం, క్షమ, ఔదార్యం లాంటి దైవీ వృత్తులన్నీ సత్త్వగుణం వల్ల పుడతాయి. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాల్లాంటివి రజోగుణం వల్ల పుడతాయి. సోమరితనము, నిద్ర, భ్రాంతి లాంటి అసురీ వృత్తులు తమోగుణం వల్ల పుడతాయి. సత్త్వగుణం వల్ల, దాని కార్యాలైన వైరాగ్యాదుల వల్ల, పుణ్యం వస్తుంది. రజోగుణం వల్ల, దాని కార్యాలైన కామక్రోధాదుల వల్ల, పాపం వస్తుంది. తమోగుణము వల్ల, దాని కార్యాలైన నిద్రాదుల వల్ల, కాలనష్టము, ఆయుక్షీణము తప్ప ఏమీ ఉపయోగముండదు. వేదాంత శాస్త్రంలో 'అహం' ప్రత్యయం – నేను అనే అభిమానం కలిగి ఉండేవాణ్ణి కర్త, స్వామి, ప్రభువు అంటారు. లౌకికంలో కూడా ఇలా జరుగుతుంది. కాబట్టి అంతఃకరణ వృత్తులలో అహంవృత్తి గల వాడే యజమాని.

జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, ఈ పదకొండు ఇంద్రియాల ద్వారా, అనుమాన ప్రమాణము, శాస్త్ర ప్రమాణముల చేత తెలుసుకోబడే అన్ని పదార్థాలు, ఈ జగత్తులో కనిపించే వస్తువులు, 'ఇదమ్' ఇది అనే శబ్దంతో సూచించబడతాయి. అంటే ప్రత్యక్ష, అనుమాన, శబ్ద ప్రమాణాల ద్వారా, ఉపమానం ద్వారా ఇతర వాటి ద్వారా తెలుసుకోబడే సమస్తమూ 'ఇదం' అనే గుర్తించాలి. సృష్టికి పూర్వం ఈ జగత్తంతా అద్వితీయమైన బ్రహ్మలో అవ్యక్త రూపంలో ఉంది. అప్పుడు దానికి నామరూపాలు లేవు. అందులో స్వగతభేదం లేదు. సజాతీయ విజాతీయ భేదం అసలే లేదు. ఇప్పుడు ఈ భేదాలేమిటో చూద్దాం.

**1. స్వగతభేదము :** ఒకే దానిలో ఉండే తేడాలు. ఉదా : ఒక చెట్టు ఉంది. దానికి ఆకులు, పూలు, కొమ్మలు, రెమ్మలు, కాయలు, పండ్లు. ఇవన్నీ ఆ చెట్టు యొక్క అంగాలే. కాని ఒక దానికి ఇంకొక దానికి అంటే ఆకుకు – కాయకు, ఆకుకు – పూవుకు పోలిక ఉండదు. ఇలా భిన్న అంగాల మధ్య ఉండే భేదాన్నే స్వగతభేదము అంటారు.

**2. సజాతీయ భేదము :** ఒకే జాతికి చెందిన రెండు వస్తువుల మధ్య ఉండే తేడా. మర్రిచెట్టు, రావిచెట్టు. ఈ రెండూ వృక్షజాతివి. కాని రెండింటి మధ్యనా తేడా ఉంది. అదే సజాతీయము.

**3. విజాతీయ భేదము :** రెండు భిన్న జాతి వస్తువుల మధ్యన ఉండే భేదము. వృక్షము, బండరాయి. ఈ రెండూ విజాతీయాలు. ఈ రెండింటి మధ్యన ఉండే తేడాను విజాతీయ భేదము అంటారు. పరబ్రహ్మలో ఈ మూడు రకాల భేదాలు లేవు. ఈ భేదాలు అనాత్మ వస్తువులందు మాత్రమే ఉంటాయి. సద్వస్తువుకు ఈ రకమైన తేడాలుండవు. ఎందుకంటే –

**1. స్వగతభేదము :** సద్వస్తువుకు అవయవాలుండవు. సద్వస్తువు యొక్క అంశ, భాగాన్ని మనం నిరూపించలేము. స్వగతభేదమనేది అవయవాల వల్లనే కలుగుతుంది. సృష్టికి పూర్వం ఉన్న సద్వస్తువుకు అంశ అనేది లేదు. పుట్టుక లేదు. నామరూపాలు లేవు. అవయవాలు అంతకన్నా లేవు. కాబట్టి అందులో స్వగతభేదముండదు. అయితే ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. సృష్టికి పూర్వం నామరూపాలు లేవా ? లేవు అని ఖచ్చితంగా చెప్పాలి. ఎందుకంటే నామరూపాలు ఉంటే సృష్టి జరిగినట్లే.

**2. సజాతీయ భేదము :** ఒకే జాతికి చెందిన రెండు వస్తువుల మధ్య ఉండే భేదాన్ని సజాతీయ భేదము అంటారు. సృష్టికి ఇన్ని జాతులు, వస్తువులు ఎక్కడున్నాయి. ఉన్నది ఒక్కటే. అద్వితీయమైన పరబ్రహ్మ. కాబట్టి సజాతీయ భేదం లేదు.

**3. విజాతీయ భేదము :** బ్రహ్మమనేది సద్వస్తువు. దానికి విజాతీయమున్నది అంటే అది అసద్వస్తువు అవుతుంది. అందుకే ఇంకొక జాతి గాని, వస్తువు కాని, లేదు. కాబట్టి పరబ్రహ్మకు విజాతీయ భేదం కూడా లేదు. అంతఃకరణ నాలుగు భాగాలుగా ఉంటుంది. అవి 1. మనస్సు 2. బుద్ధి 3. చిత్తము 4. అహంకారము. పంచభూతాలలోను ఆకాశం వాయుతో కలిస్తే మనస్సు, అగ్నితో కలిస్తే బుద్ధి, జలంతో కలిస్తే చిత్తము, పృథివితో కలిస్తే అహంకారము ఏర్పడతాయి. వీటిలో

**1. మనస్సు :** సంకల్ప వికల్పాలకు కారణమైనది. ధర్మాధర్మాలను, యుక్తాయుక్తాలను గురించి ఆలోచించేది మనస్సు. మనస్సునే హృదయము అంటారు. దీనికి స్థానం గళానికి చివరి భాగం. దీనికి విషయం సంశయం.

**2. బుద్ధి :** నిశ్చయాత్మకమైనది బుద్ధి. ఏ రకమైన నిర్ణయమైనా ఇదే తీసుకుంటుంది. దీనికి స్థానం వదనం. దీనికి విషయం నిశ్చయం.

**3. చిత్తం :** చింతించేది చిత్తం. గతంలో కలిగిన అనుభవాలను గురించి ఆలోచిస్తుంది. దీనికి స్థానం నాభి. దీనికి విషయం ధారణ.

**4. అహంకారం :** నేను అనే భావన అహంకారం. దీనివల్లనే మానవుడు పట్టుదలకు పోవటం వంటివి చేస్తాడు. దీనికి స్థానం హృదయం. దీనికి విషయం అభిమానం.

కళ్ళు మొదలైన ఇంద్రియాల ద్వారా అంతఃకరణ వ్యక్తమవుతుంది. "అవే నేను" అనుకుని వాటితో తాదాత్మ్యం చెందుతూ, ఆత్మ యొక్క ప్రతిబింబంలో జీవిస్తూ ఉంటుంది. అహంకారం శరీరంతో తాదాత్మ్యత చెందినప్పుడు కర్తగా, భోక్తగా తనను తాను భావిస్తుంది. సత్త్వాది గుణాలతో కలిసి అవస్థాత్రయంలో విహరిస్తుంది. ఇంద్రియ భోగ్యవస్తువులు మనకు అనుగుణంగా ఉంటే సుఖంగా ఉంటాం. లేనప్పుడు దుఃఖిస్తాము. ఈ సుఖదుఃఖాలనేవి అహంకారం ధర్మాలు. దృశ్యమానమయిన జగత్తంతా మిథ్యే. క్షణికమైన అహంకారం కూడా సత్యం కాదు. క్షణక్షణము మార్పు చెందే అహంకారం నాకు అన్నీ తెలుసు అనుకుంటుంది. అహంకారంతో సంబంధం ఉన్నంతవరకు మానవుడు ముక్తిని గురించి మాట్లాడలేడు. అహంకారం నుంచి విడివడినవాడు, తానే పరమాత్మనని తెలుసుకుంటాడు.

**పంచీకరణము :** స్థూలంగా ఉండే పంచభూతాలు ఒకదానితో ఒకటి కలిసి ఉండటాన్నే పంచీకరణ అంటారు. అదెలా జరుగుతుందంటే, ముందుగా ఆకాశం తీసుకుందాం. ఆకాశాన్ని రెండు భాగాలుగా చెయ్యాలి. మొదటి భాగంలో పూర్తిగా ఆకాశం ఉంటుంది. రెండవ భాగాన్ని మళ్ళీ నాలుగు భాగాలుగా చెయ్యాలి. వీటిలో మిగిలిన నాలుగు భూతాలను సమానంగా ఉంచాలి. అంటే

ఆకాశంలో– ఆకాశము 1/2, వాయువు 1/8, అగ్ని 1/8, జలము 1/8, పృథివి 1/8గా ఉంటాయి.

వాయువులో - వాయువు 1/2, ఆకాశం 1/8, అగ్ని 1/8, జలము 1/8, పృథివి 1/8 ఉంటాయి.

అగ్నిలో – అగ్ని 1/2 మిగిలిన నాలుగు భూతాలు 1/8 చొప్పున ఉంటాయి.

జలంలో – జలం 1/2 మిగిలిన నాలుగు భూతాలు 1/8 చొప్పున ఉంటాయి.

భూమిలో – భూమి 1/2 మిగిలిన నాలుగు భూతాలు 1/8 చొప్పున ఉంటాయి.

పంచభూతాలు ఈ రకంగా పంచీకరణ చెంది త్రిగుణాలతో కలియటం వల్ల సృష్టి ఏర్పడింది.

పంచభూతాలలో ఆకాశం కూడా శాశ్వతమైనది కాదు. ఆకాశం అంతటా వ్యాపించి ఉంటుంది. అంతేకాని అనిత్యమైనది. ప్రళయ కాలంలో భూమి జలంలో, జలం అగ్నిలో, అగ్ని వాయువులో, వాయువు ఆకాశంలో, ఆకాశం మాయలో, మాయ పరమేశ్వరునిలో లీనమై పోతాయి. అంటే ప్రళయ కాలంలో పంచభూతాలన్నీ నశించి పోతాయి. కాబట్టి ఇవేవీ ఆత్మకాదు.

ఈ రకంగా పంచభూతాలు పంచీకరణ చెంది వస్తువులుగా మారినాయి. కాబట్టి ఈ జగత్తుకు పంచ మహాభూతాలకు తేడా లేదు అని తెలుసుకుంటే బంధాలు ఉండవు. బంధరహితుడవైన నువ్వు నీ స్వరూపంలో ఉండిపోవలసింది అంటున్నాడు అష్టావక్రుడు.

**వాసనా ఏవ సంసార యితి సర్వా విముంచతాః ।**
**తత్త్యాగో వాసనాత్యాగాత్ స్థితిరద్య యథా తథా ॥ 8**

కోరికల వల్లనే ఈ జగత్తంతా ప్రవర్తిల్లుతున్నది. కాబట్టి కోరికలను త్యజించు. కోరికలను విడనాడగలిగితే ఈ జగత్తును విడిచినట్లే. కోరికలు లేని స్థితిలో నువ్వు ఎక్కడ ఉన్నా సమానమే. తేడా ఏమీ ఉండదు.

కోరికలు అంటే మనలో ఉండే వాసనలే. ఈ విషయ వాసనలే మనసులో కోరికలుగా, బుద్ధిలో ఆలోచనలుగా వ్యక్తం అవుతుంటాయి. వాసనలే కోరికలు. మానవ శరీరాన్ని 1.స్థూల శరీరము 2.సూక్ష్మశరీరము 3.కారణ శరీరము అని మూడు రకాలుగా చెబుతాం. మనిషిలో ఉండే మొత్తం వాసనలను సూక్ష్మకారణ శరీరాలు అంటారు. ఇప్పుడు సూక్ష్మ కారణ శరీరాలను ఒకసారి చూద్దాం.

**2. సూక్ష్మశరీరము :**

**పంచప్రాణ మనోబుద్ధి దశేంద్రియ సమన్వితమ్ ।**
**అపంచీకృత భూతోత్థం సూక్ష్మాంగం భోగసాధనమ్ ॥**

పంచప్రాణాలు, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు ఈ పదిహేడింటితోనూ కూడినది, అపంచీకృత మహాభూతాల వల్ల ఏర్పడ్డది సూక్ష్మశరీరము. సుఖదుఃఖాలనుభవించేది దీనితోనే. దీన్ని పొందిన ఈశ్వరుడే – హిరణ్యగర్భుడు, బ్రహ్మవేత్త – అనుజ్ఞాత అనబడతాడు.

1. జ్ఞానేంద్రియాలు 2. కర్మేంద్రియాలు 3. పంచప్రాణాలు 4. పంచభూతాలు 5. బుద్ధి 6. అవిద్య 7. కామం 8. కర్మ. వీటిని అష్టపురములు అంటారు. వీటితో కూడినదే సూక్ష్మశరీరం. దీన్నే లింగశరీరము అంటారు. సూక్ష్మభూతాలతో ఉత్పత్తి అయిన ఈ శరీరం పూర్తిగా వాసనలతో నిండి ఉంటుంది. జీవుడికి గతంలో తాను చేసిన కర్మలకు అనుగుణమైన అనుభవాలు కలగటానికి ఈ వాసనలే కారణం. తనను తాను తెలుసుకోలేకపోవటమే అజ్ఞానం. ఈ అజ్ఞానం కారణంగానే ఇది అనాదిగా ఆత్మను అచ్ఛాదిస్తోంది.

ఇంతవరకూ వ్యక్తం కాకుండా ఉన్నవి అన్నీ ఇప్పుడు వ్యక్తమవుతాయి. వ్యక్తిలో గుప్తంగా ఉన్న ప్రేరణలన్నీ రహస్యంగా ఇందులో ఉన్నాయి. ఈ సూక్ష్మశరీరం పంచీకరణ చెందని పంచభూతాలతో నిర్మించబడి ఉన్నది. వాసనలతో కూడిన ఈ సూక్ష్మశరీరమే ఆత్మను మరుగుపరచి, వ్యక్తిగత అహంకారాన్ని సృష్టిస్తుంది. గతంలో వ్యక్తిత్వాన్ని ప్రభావితం చేసిన ఆలోచనలు, కర్మలయొక్క జాడలే ఈ వాసనలు. ఈ వాసనలే ఆలోచనలను ప్రేరేపిస్తాయి. దీనివల్లనే నిరంతరము మనం కర్మలు చేస్తుంటాము. గతంలో చేసిన పాపపుణ్యాల ఫలితంగానే సుఖదుఃఖాలు కలుగుతాయి. జాగ్రదావస్థలో సూక్ష్మశరీరం వ్యక్తం కాదు. స్వప్నావస్థలో ఇది పూర్తిగా వ్యక్తమవుతుంది. జాగ్రదావస్థలో గడించిన అనుభవాలు, వాసనలకు అనుగుణంగా, బుద్ధి స్వప్నావస్థలో అనుభవాలు తనంత తానుగా పొందుతుంది. ఈ స్థితిలో బుద్ధి మాత్రమే ఆవరణగా ఆత్మ స్వయంగా తనలో తాను ప్రకాశిస్తూ ఉంటుంది. బుద్ధి చేసే ఏ కర్మలవల్లా ప్రభావితం కాకుండా నిశ్చలంగా, సర్వానికీ సాక్షిగా ఉంటుంది.

ఉపాధులు చేసే ఏ పనులకు ఇది వికారం పొందదు. కేవలం సూక్ష్మశరీరం ద్వారా మాత్రమే వ్యక్తమయ్యే ఆత్మచైతన్యస్థితే స్వప్నము. జాగ్రదావస్థలో ఆత్మచైతన్యం స్థూల సూక్ష్మ శరీరాలు రెండింటి ద్వారా వ్యక్తమవుతుంది. కాని స్వప్నావస్థలో కేవలం సూక్ష్మశరీరం ద్వారా మాత్రమే వ్యక్తమవుతుంది. వడ్రంగి వాడికి బాడిసలాగా ఆత్మకు ఈ సూక్ష్మశరీరం కార్యకలాపాల నిర్వహణలో ఉపయోగిస్తుంది.

సూక్ష్మశరీరము ఏ రకంగా వచ్చిందంటే, పంచభూతాల రజోగుణాన్ని నాలుగు భాగాలుగా చేసి అందులోని మూడు భాగాల నుంచి ప్రాణాలను సృష్టించటం జరిగింది. ప్రాణాలు ఐదు రకాలు.

1. ప్రాణ 2. అపాన 3. వ్యాన 4. ఉదాన 5. సమానములు.

**1. ప్రాణవాయువు :** ఇది హృదయంలో ఉంటుంది. దీనికి అధిష్ఠాన దేవత 'విశిష్టకుడు' ఇది శ్వాసాదులను ఇడ పింగళ నాడుల ద్వారా బయటకు పంపుతుంది.

**2. అపాన వాయువు :** ఇది గుదస్థానంలో ఉంటుంది. దీనికి అధిష్ఠాన దేవత 'విశ్వకర్త'. ఇది అథోముఖంగా సంచరిస్తూ శుక్లము, మలము, మూత్రము, రక్తములను కుహూనాడి, సినీవాలీనాడి ద్వారా బయటకు పంపుతుంది. దీని కారణంగానే మలమూత్రాలు అథోముఖంగా విసర్జించబడతాయి.

**3. వ్యానవాయువు :** ఇది నాభిస్థానంలో ఉంటుంది. అధిష్ఠాన దేవత 'విశ్వయోని' ఇది బయటి శీతోష్ణాలను లోపలకు, లోపల శీతోష్ణాలను బయటకు పంపుతూ ఉంటుంది. తీసుకున్న ఆహారాన్ని శరీరమంతా వ్యాపింపచేస్తుంది.

**4. ఉదాన వాయువు :** ఇది కంఠస్థానంలో ఉంటుంది. దీనికి మాటల రూపంలో వెల్లడిస్తుంది. సుషుప్తిలో ఇంద్రియాలను స్వాధీనం చేసుకుని, తనకు కారణమైన అజ్ఞానంలో మునిగిపోతుంది. జాగ్రదావస్థలో ఇంద్రియాలను వాటి వాటి స్థానాలలో నిలబెడుతుంది. ఈ వాయువు సుషుమ్నగుండా సహస్రారం దాకా సంచరిస్తుంది.

**5. సమాన వాయువు :** ఇది శరీరంలోని అన్ని అంగాల యందు వ్యాపించి ఉంటుంది. దీనికి అధిష్ఠాన దేవత 'జయుడు' ఇది జఠరాగ్నిని ప్రజ్వలింపచేసి, తిన్న ఆహారాన్ని అరిగించి, శరీరంలోని డబ్బైరెండు వేల నాడీమండలానికీ సమానంగా అందిస్తుంది.

ఉపవాయువులు కూడా ఐదున్నాయి. అవి

1. నాగవాయువు – వాంతిని కలిగిస్తుంది
2. కూర్మవాయువు – కనురెప్పలను కదలిస్తుంది.
3. కృకర వాయువు – తుమ్ములను కలిగిస్తుంది
4. దేవదత్త వాయువు – ఆవలింతలు కలిగిస్తుంది.
5. ధనుంజయ వాయువు – శరీరమంతా వ్యాపించి, శరీరాభివృద్ధి కలిగిస్తుంది.

పంచభూతాల రజోగుణంయొక్క నాల్గవభాగంతో కర్మేంద్రియాలు సృష్టించబడ్డాయి. వాక్కు, పాణి, పాదము, గుదము, ఉపస్థ అనేవి కర్మేంద్రియాలు. మాట్లాడటము, ఇవ్వటము, నడవటము, విడచుటము, ఆనందించటము అనేవి కర్మేంద్రియాల విషయాలు. అగ్ని, దేవేంద్రుడు, ఉపేంద్రుడు, మృత్యువు, ప్రజాపతి వీరు కర్మేంద్రియాలకు అధిష్ఠాన దేవతలు.

పంచభూతాల సత్త్వగుణాన్ని నాలుగు భాగాలుగా చేసి, అందులోని మూడు భాగాలతో అంతఃకరణను సృష్టించటం జరిగింది. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, అనేవి అంతఃకరణ చతుష్టయము. ఆలోచించటం, నిశ్చయించటం, స్మరించటం, అభిమానించటం, అనుసంధానం చెయ్యటం ఇవి అంతఃకరణ విషయాలు. గళము, వదనము, నాభి, హృదయము, భ్రూమధ్యము అంతఃకరణ చతుష్టయానికి అధిదేవతలు. పంచభూతాల సత్త్వగుణంయొక్క నాల్గవభాగంతో జ్ఞానేంద్రియాలను సృష్టించటం జరిగింది. శ్రోత్రము, చర్మము, కన్ను, నాలుక, ముక్కు ఇవి జ్ఞానేంద్రియాలు. శబ్ద స్పర్శ రూప రస గంధాలు వీటి విషయాలు. దిక్కులు, వాయువు, భానుడు, వరుణుడు, అశ్వనీదేవతలు వీటికి అధిష్ఠాన దేవతలు. గతంలో చెప్పినట్లుగా కోశములు ఐదు. వీటిలో అన్నమయ కోశమే స్థూలదేహము. ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలే సూక్ష్మదేహము. సూక్ష్మశరీరంలో కామము, క్రోధము, లోభము, మోహము మొదలైనవి కలగటం వల్ల కలిగే తాపాలు శమము, దమము, తితిక్ష మొదలైన సద్గుణాలు లభించినందువల్ల కలిగే తాపాలు, దుఃఖాలు కలుగుతూ ఉంటాయి. వీటన్నింటినీ సామాన్యుడు అనుభవిస్తూనే ఉంటాడు. ఈ సూక్ష్మశరీరం ఆత్మకాదు.

### 3. కారణ శరీరము :

**అనాద్యవిద్యానిర్వాచ్యా కారణోపాధి రుచ్యతే ।**
**ఉపాధి త్రితయాదన్య మాత్మాన మవధారయేత్ ॥**

వాక్కుచేత చెప్పనలవి కానిది, ఆది లేనిది అయిన అజ్ఞానమే కారణ శరీరము. దీనిని పొందిన ఈశ్వరుడు–'అవ్యాకృతుడు', బ్రహ్మవేత్త 'అనుజ్ఞైకరసుడు' అనబడతాడు.

గుణత్రయమే ఆత్మయొక్క కారణ శరీరము. ఇది సుషుప్తిలో ఉంటుంది. ఈ స్థితిలో అన్ని రకాలైన జ్ఞానము నశిస్తుంది. బుద్ధి కేవలము బీజరూపంలో ఉంటుంది. సామాన్యంగా నిద్రలో నాకేమీ తెలియదు అంటాం. అదే సుషుప్తి. ఆ స్థితిలో శరీరంలోని అన్ని అవయవాలు పూర్తిగా విశ్రమిస్తాయి. మూడు గుణాలు కూడా కలిసి మిశ్రమంగా ఉండే స్థితి ఇది. దీని ప్రత్యేకతే గాఢనిద్ర. ఈ స్థితిలో మనస్సు, బుద్ధి, ఇంద్రియాల కార్యకలాపాలన్నీ పూర్తిగా ఆగిపోతాయి. ఈ అవస్థలో మనసు విత్తనం వంటి స్థితిలో ఉంటుంది. నాకేం తెలియదు' అనేదే అనుభవం.

ఇక్కడ సత్త్వరజస్తమోగుణాలు మూడు కూడా పూర్తిగా అవ్యక్తమైన స్థితిలో బీజరూపంగా ఉంటాయి. జాగ్రస్వప్నాల అనుభవాలన్నీ బీజరూపంలో ఉంటాయి. ఈ అనుభవాలు జాగ్రదావస్థలో స్థూలరూపంలోను, స్వప్నావస్థలో – సూక్ష్మరూపంలోను, సుషుప్తిలో బీజరూపంలోను ఉంటాయి. వ్యక్తి గాఢనిద్రలో ఉన్నప్పుడు, అతని శారీరక, మానసిక, బుద్ధిపరమైన కర్మలన్నీ విశ్రాంతి తీసుకుంటాయి. ఇదే అవ్యక్త స్థితి.

ఈ స్థితిలో బాహ్య ప్రపంచం ఏమీ తెలియదు. అలా అని సత్యస్వరూపం అంతకన్నా గోచరించదు. సత్యాన్ని చూడకుండా ఉన్న అవస్థ. పూర్తిగా తమోగుణ ప్రధానమైనది. 'నిద్రలో నాకేం తెలియలేదు. హాయిగా ఉంది' అంటాడు. ఇక్కడ 'ఏమీ తెలియదు' అనే విషయం తెలుస్తుంది. 'హాయి' అనేది తెలుస్తుంది. అందుకే సంపూర్ణమైన అజ్ఞానమే ఈ స్థితి ధర్మం. బుద్ధి ఉండదు కాబట్టి, బుద్ధి రూపమయిన ప్రపంచము ఉండదు. దేనినీ తెలుసుకోలేని ఈ అవస్థే కారణ శరీరము. మలినమైన సత్త్వరజస్తమోగుణాత్మకమైన అవిద్యయే కారణ శరీరము. వాక్కుచేత చెప్పనలవి

కానిది, ఆది లేనిది అయిన అజ్ఞానమే కారణ శరీరము. ఆత్మ కారణశరీరంలో ప్రవేశించినప్పుడు తనను గురించి, ఇతరుల గురించి కూడా తెలియదు. అజ్ఞానంతో మూసుకుపోతుంది. ఈ అవస్థే రాబోయే దుఃఖాలకు కారణమవుతున్నది. అజ్ఞానం వల్ల ఏమీ తెలియక సర్వమూ నష్టమై పోయినట్లు అనిపించటం, రాబోయే సుఖ దుఃఖాలకు కారణం అవటం. ఇవన్నీ కారణ శరీరానికి కలిగే తాపాలు. ఈ కారణ శరీరం ఆత్మకాదు.

మనసులో ఆలోచనలుగా, కోరికలుగా వ్యక్తమయ్యే ఈ వాసనలే అహంకారాన్ని బంధిస్తాయి. దీంతో జనన మరణాలతో కూడిన జీవితచక్రం క్రమం తప్పకుండా పరిభ్రమిస్తుంది. **వాసనా ఏవసంసారః** అంటున్నాయి శాస్త్రాలు కోరికలు అంటే వాసనలు లేకపోయినట్లైతే ముక్తి లభిస్తుంది. **అసలు బంధం అనేది ఏదైనా ఉన్నది అంటే అది వాసనలే. వాసనాక్షయమే మోక్షము.** కాబట్టి ముందు వాసనలను పూర్తిగా నాశనం చేసి, తరువాత ముక్తి పొందాలి అనే కోరికను కూడా విడిచిపెట్టాలి. అప్పుడు మాత్రమే నీ లక్ష్యాన్ని చేరగలుగుతావు అంటున్నాడు అష్టావక్ర మునీంద్రుడు.

# అధ్యాయం-10

# వైరాగ్యము

ఈ జగత్తులో 84 లక్షల రకాలైన జీవరాసి ఉన్నది దీనిలో క్రిమికీటకాలు, పశువులు, పక్షులు, మృగాలు, జంతువులు, జలచరాలు, భూచరాలు, ఖేచరాలు అనేకమున్నాయి. మానవుడు చేసిన కర్మను బట్టే అతడికి మరుజన్మ వస్తుంది అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. పుణ్యకర్మలు చేసినవారు ఉత్తమ యోనులందు జన్మిస్తారు. ఉత్తమ వంశంలో జన్మిస్తారు. పాపకర్మలు చేసినవారు నీచజన్మలు ఎత్తుతారు. దుర్మార్గపు పనులు చేసినవారు పశుపక్ష్యాదులుగా జన్మిస్తారు. అంతకన్నా నీచమైన, ఘోరమైన పనులు చేసిన వాళ్ళు క్రిమికీటకాలుగా జన్మించి, పుడుతూ ఛస్తూ ఉంటారు. వీటిలో పశుపక్ష్యాదులు తాము చేసిన కర్మ ఫలాన్ని అనుభవిస్తాయి. అంతేకాని కర్మను చెయ్యలేవు. వాటికి ఏ మాత్రము వివేకము ఉండదు. యుక్తాయుక్త విచక్షణ అసలే ఉండదు. ఇక దేవతల సంగతి చూస్తే వారికి శరీరంలేదు. అశరీరులు. కర్మ చేసే అవకాశం కాని, అధికారం కాని వారికి ఉండదు. దేవతలు కూడా ఏదైనా కర్మ చెయ్యాలి అంటే భూలోకంలో మానవులుగా జన్మించాల్సిందే. ఈ లోకంలోనే కర్మ చెయ్యాలి. అందుకే భూలోకాన్ని కర్మభూమి అంటారు.

కర్మ చెయ్యటం, సత్కర్మల ద్వారా పాపాలను నశింప చేసుకునే అవకాశం, శక్తి మానవుడికి మాత్రమే ఉన్నాయి. అందుకే ఈ జగత్తులో అన్నింటికన్నా ఉత్తమమైన జన్మ మానవజన్మ. ఈ రకంగా ఉత్తమమైన జన్మ పొంది, జీవిత లక్ష్యమైన మోక్షం కోసం ప్రయత్నించని వాడు మూర్ఖుడు. **ఆత్మహంతకుడు** అనబడతాడు. ముముక్షుత్వము, సజ్జన సాంగత్యము అనేవి భగవత్కృప వల్లనే కలుగుతాయి. ఎన్ని శాస్త్రాలు చదివినా యజ్ఞయాగాది కర్మలు చేసినా, వేదాభ్యాసం చేసినా, దేవతలను ఉపాసించినా, జీవాత్మ పరమాత్మల ఏకత్వం గురించి తెలియకపోతే ఉపయోగం లేదు. అతనికి ఎన్ని కల్పాలు గడిచినా మోక్షం రాదు. **వేదాలు చదివితే మోక్షం రాదు. యజ్ఞయాగాది క్రతువులు చేస్తే మోక్షం రాదు. జ్ఞానాదేవతుకైవల్యం కేవలం జ్ఞానం వల్లనే మోక్షం వస్తుంది. జ్ఞానమే మోక్షసాధనము.** అందుకే విద్వాంసుడైన వాడు ఐహిక సుఖాలను వదిలిపెట్టి, సద్గురువును ఆశ్రయించి, ఆయన చెప్పే

విషయాలను జాగ్రత్తగా వింటూ, బ్రహ్మచర్యం పాటిస్తూ మోక్షం కోసం ప్రయత్నించాలి. ఆత్మనిష్ఠ కలగాలంటే విద్వాంసుడికి నాలుగు లక్షణాలుండాలి. వాటినే **సాధన చతుష్టయము** అంటారు. సత్యాన్వేషణకు విధిగా ఈ నాలుగు లక్షణాలుండాలి అవి

1. నిత్యానిత్యవివేకము 2. వైరాగ్యము 3. షట్సంపత్తి 4. ముముక్షుత్వము

వీటిలో రెండవది వైరాగ్యము. వైరాగ్యము అంటే ఐహిక సుఖాల యందు విముఖత. ఈ లోకంలో మనం అనుభవించే సుఖాలనే ఐహిక సుఖాలు అంటారు. సిరిసంపదలు, భోగభాగ్యాలు, అధికారము, స్త్రీ సుఖము మొ॥వి ఈ సుఖాల పట్ల విముఖత కలగటమే వైరాగ్యము. వీటియందు విముఖత ఎలా కలుగుతుంది? **సుఖాలను ఎక్కువగా అనుభవిస్తే విముఖత కలుగుతుంది అని చాలామంది అనుకుంటారు. అది నిజం కాదు.**

**న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి**
**హవిషాకృష్ణవర్త్మేన భూయ ఏవాభివర్ధతే ॥**

ఆజ్యం పోస్తే అగ్ని ప్రజ్వరిల్లుతుంది. అంతేకాని ఆరిపోదు. అలాగే అనుభవించటం వల్ల కోరికలు తీరవు. నీళ్ళు పోస్తే అగ్ని చల్లారిపోతుంది. అదే విధంగా విముఖత వల్లనే వైరాగ్యం వస్తుంది. విముఖత అనేది మనసా వాచా కర్మణా రావాలి. లోకంలో సుఖాలన్నీ ఇంద్రియాల ద్వారానే అనుభవిస్తాము. కాబట్టి, వైరాగ్యం కావాలంటే ముందుగా ఇంద్రియాలను అదుపులో పెట్టుకోవాలి. ఇంద్రియాలు రెండు రకాలు. 1.అంతరింద్రియాలు 2.బాహ్యేంద్రియాలు. కాలు, చెయ్యి, కన్ను, ముక్కు వంటివన్నీ బాహ్యేంద్రియాలు. కొంత ప్రయత్నం మీద వీటిని అదుపు చెయ్యవచ్చు. కాని అంతరింద్రియాలను జయించటం కష్టం. వాటిని జయించకపోతే విముఖత కలగదు. అందుకే త్రికరణ శుద్ధిగా వైరాగ్యాన్ని అలవరచుకోవాలి. వైరాగ్యము అంటే కేవలము ఐహిక సుఖాలపట్ల విముఖత మాత్రమే కాదు. పరలోక సుఖాల పట్ల కూడా విముఖత రావాలి. జగత్తులో పిపీలికాది బ్రహ్మ పర్యంతము అన్ని వస్తువులు, ప్రాణులు నశించిపోయేవే. సుఖంమీద ఏ మాత్రము కోరిక ఉండరాదు. ఇంకా చెప్పాలంటే మోక్షం కావాలనే కోరిక కూడా ఉండరాదు.

ఇహలోక సుఖాలు కాని, పరలోక సుఖాలు కాని కాకిరెట్టతో సమానంగా చూడాలి. అనుభవించటానికి అవకాశం ఉండి కూడా అనుభవించక పోవటం. అనుభవము నందు ఆసక్తి ఉండరాదు. అదే వైరాగ్యము.

శంకర భగవత్పాదులవారు తమ **సర్వవేదాంత సిద్ధాంతసార సంగ్రహంలో** వైరాగ్యాన్ని వివరిస్తూ

నిత్యానిత్య వివేకము వల్ల భార్యాపుత్రాది పదార్థములన్నీ అనిత్యములు అని గ్రహించి, వాటియందు వాంఛ లేకుండా ఉండటమే వైరాగ్యము అన్నారు.

బ్రహ్మ పదార్థ యొక్కటే నిత్యమైనది. మిగిలిన పదార్థాలన్నీ అసత్యములు అని తెలిసిన వారికి  మరుక్షణంలోనే పూలమాలలు, పరిమళ ద్రవ్యాలు, స్త్రీలు మొదలగు అనిత్యమైన వస్తువులందు వైరాగ్యం కలుగుతుంది.

కాకిరెట్టను చూసి అసహ్యించుకున్నట్లుగా, భార్య పుత్రులు మొదలైన విషయములు చూసి అసహ్యపడుటే తీవ్రవిరక్తి. ఇది ఎలా కలుగుతుంది అంటే, విషయములలో ఉన్న దోషాలను విచారిస్తే, వాటియందు వైరాగ్యము దృఢపడుతుంది. స్త్రీలు మహాభయంకరమైన నల్లతాచు కన్న శక్తిమంతులు. ఎందుకంటే పాము విషయం కాటు వేయబడ్డ వాడినే నాశనం చేస్తుంది. చూసేవారిని, వినేవారిని ఏమీ చెయ్యదు. కాని స్త్రీలు అనుభవించే వారినే కాక చూసేవారిని, వినేవారిని కూడా నాశనం చేస్తారు. ఇక్కడ స్త్రీలు అంటే వేశ్యాంగనలు)

విషయములందున్న దోషాలు గనక పూర్తిగా తెలుసుకుంటే, మానవులు మళ్ళీ ఆ విషయాల జోలికి పోరు. వేశ్యల దగ్గరకు పోయేవారికి వారి దగ్గర రోగాలున్నాయని తెలిస్తే మళ్ళీ వారి దగ్గరకు పోరు.

ముక్తి కావాలనుకునే వారు ముందుగా పదార్థముల నిజస్వరూపాన్ని బాగా పరిశీలించాలి. అలా చేస్తే వాటిలోని దోషాలు తెలుస్తాయి. అప్పుడు ఇంక ఆ పదార్థముల యందు వాంఛ ఉండదు.

మానవుడు మాతృగర్భంలో పడే యాతన తెలిస్తే మళ్ళీ గర్భవాసం చెయ్యటానికి ఇష్టపడడు.

**దేవీభాగవతం**లో ఒక కథ ఉంది. శుక్రాచార్యుడు ఈశ్వరుడి దగ్గరకు వెళ్ళి మృతసంజీవినీ విద్య కావాలని అడిగాడు. 12 సం॥లు తలక్రిందులుగా నుంచుని ఘోరమైన తపస్సు చేస్తే ఆ విద్య నీవశమవుతుంది అని చెప్పాడు ఈశ్వరుడు. శుక్రుడు తపస్సు చెయ్యటానికి హిమాలయాలకు వెడుతూ, "నేను వచ్చే వరకు మీరెవరూ దేవతలతో తగాదా పెట్టుకోకుండా మునివేషంలో సంచరించండి.' అని రాక్షసులకు చెప్పాడు. వారు అలాగే మునివేషంలో తిరుగుతున్నారు. ఈ విషయం దేవతలకు తెలిసి, వారంతా రాక్షసులను చావకొట్టటం మొదలు పెట్టారు. ఆ సమయంలో రాక్షసులంతా భృగుమహర్షి ఆశ్రమానికి పరుగెత్తారు. భృగుమహర్షి హిమాలయాల్లో తపస్సు చేస్తున్నాడు. ఆయన కుమారుడైన శుక్రుడు తపోనిష్ఠలో ఉన్నాడు. దాంతో రాక్షసులు భృగుపత్నిని శరణువేడారు. ఆవిడ వారికి అభయం ఇచ్చింది. దేవేంద్రుడు వచ్చి రాక్షసులను వదలమని అడిగాడు. వదలను అన్నది భృగుపత్ని. ఇంద్రుడు వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. భృగుపత్ని సమ్మోహనాస్త్రాన్ని ప్రయోగించింది. దేవతలంతా మూర్ఛపోయారు.ఇంద్రుడు మాత్రం పలాయనం చిత్తగించి మహావిష్ణువును శరణువేడాడు. మహావిష్ణువు చక్రాయుధాన్ని ప్రయోగించాడు. అది సమ్మోహనాస్త్రాన్ని నాశనం చేసి దాన్ని ప్రయోగించిన భృగుపత్నిని కూడా చంపేసింది. ఈ విషయం తెలిసిన భృగుమహర్షి శ్రీమహావిష్ణువును నానాయోనులందు జన్మించమని శపించాడు. అప్పుడు శ్రీమహావిష్ణువు విచారిస్తాడు. ఎందుకిలా జరిగింది? దేవతలకు మేలు చెయ్యబోతే తనకు కీడు జరిగింది. నానాయోనులందు జన్మించటము అంటే అనేక జన్మలు ఎత్తటం. మాతృగర్భంలో నవమాసాలు ఉండటం కన్నా కల్పాంతము నరకం అనుభవించటం మేలు. గర్భంలో తలక్రిందులుగా వ్రేలాడుతూ తొమ్మిది నెలలుండాలి. ఆకలి వేస్తే తినటానికి లేదు. బాధ కలిగితే ఏడవటానికి లేదు. బయటకు వచ్చే మార్గం చాలా ఇరుకుగా ఉంటుంది. తీరా బయటకు వచ్చాక బాల్యావస్థలో అనేక బాధలు, బాలగ్రహాలు, వీటిని గురించి ఆలోచిస్తే బాల్యావస్థ కావాలనుకోరు. కౌమారావస్థలో యుక్తాయుక్త వివేచన ఉండదు. అప్పుడు చేసే పనులకు ప్రయోజనం ఉండదు. పెద్దలంటే భక్తి ఉండదు. నోటికి వచ్చినట్లు మాట్లాడతారు. చేతికి అందింది తింటారు. వెళ్ళరాని ప్రదేశాలకు వెడతారు.

ఇలాంటప్పుడు పెద్దవారు దండిస్తారు. ఆ సమయంలో జీవితంమీద విరక్తి కలుగుతుంది.

యవ్వనంలో మదము వస్తుంది. దాంతో పెద్దలమాట వినరు. వారిని తిరస్కరిస్తారు. స్త్రీ లోలురై శాస్త్రమర్యాదల నతిక్రమిస్తారు. స్త్రీల మాటలు నమ్ముతారు. వారు చెప్పినవన్నీ చేస్తారు. యవ్వనదశ అన్ని దోషాలతోను కూడినది. జాగ్రత్తగా ఆలోచిస్తే దానిమీద వైరాగ్యం కలుగుతుంది.

ముసలితనంలో శరీరం పట్టుకోల్పోతుంది. ప్రతిదానికి ఇంకొకరిమీద ఆధారపడాలి. కావలసిన వస్తువులు దొరకవు. జ్ఞాపకశక్తి మందగిస్తుంది. అందరూ అసహ్యించుకుంటారు. ఇలాంటి విషయాలు ఆలోచిస్తే విరక్తి పుడుతుంది. మరణకాలంలో యమ దర్శనమవుతుంది. మరణమంటే భయం కలుగుతుంది.

మరణించిన తరువాత, అతడు చేసిన కర్మల ననుసరించి స్వర్గనరకాలు ప్రాప్తిస్తాయి. నరకంలో అనేక రకాల శిక్షలు.

పుణ్యకర్మలు చేసినవారు స్వర్గలోకం వెడతారు. కాని పుణ్యం తీరిన తరువాత అక్కడ నుంచి క్రిందికి తోసేస్తారు. ఈ విషయం తెలిసిన వారు స్వర్గానికి పోవటానికి కూడా ఒప్పుకోరు. అంటూ బాధపడతాడు శ్రీమహావిష్ణువు.

ఈ విధంగా చూస్తే జీవితంమీద ఎవరికీ కోరిక ఉండదు. వైరాగ్యమే కలుగుతుంది. అందుకే అష్టావక్రుడు కోరికను నీ శత్రువుగా భావించు. ఐశ్వర్యం అనర్థహేతువు. అదృష్టవశాత్తు ప్రాప్తించిన భోగాలు స్వప్నం వంటివి. ఇంద్రజాలం వంటివి. కోరిక ఉంటేనే ప్రపంచం ఉంది. కోరికలు బంధ హేతువులు. ప్రపంచం పట్ల వైరాగ్యం పెరిగితేనే ఆత్మానందం లభిస్తుంది. ప్రపంచమంతా జడం. నువు శుద్ధ చైతన్యానివి. అజ్ఞానానికి ఉనికి లేదు. భార్యాపిల్లలు, భోగభాగ్యాలు అనేక జన్మల నుంచి పోగొట్టుకుంటూనే ఉన్నావు. ఎంత ప్రయత్నించినా వాటిని నిలబెట్టుకోలేకపోయావు. ఇప్పటివరకు అనుభవించింది చాలు. అనేక జన్మల నుండి ఈ మనస్సు శరీరాలతో కర్మలు చేస్తూనే ఉన్నావు. ఇకనైనా నీ ప్రయత్నాలు ఆపవలసింది అంటున్నారు. ఈ అధ్యాయంలో

పూర్వకాలంలో అర్హత ఉన్న వాళ్ళు సామాన్యంగా సన్యసించే వాళ్ళు. కారణం ఏమంటే సన్యాసికి తప్పనిసరిగా మోక్షం వస్తుంది అని నమ్మకం. సన్యాసులు నాలుగు రకాలు

**1. కర్మసన్యాసి :** ఇంతవరకు కర్మలు చేసినవాడు, కర్మ చేసినా చెయ్యకపోయినా ఒకటే అనే విషయం తెలుసుకుని సన్యసించటం.

**2.జ్ఞానసన్యాసి :** జ్ఞానసముపార్జన వల్ల, గురూపదేశం వల్ల లౌకిక వాంఛలు పోయి, వాసనాత్రయము నశించి సాధన చతుష్టయ సంపన్నుడైన సన్యాసిని జ్ఞానసన్యాసి అంటారు.

**3.వైరాగ్య సన్యాసి :** పూర్వజన్మల కృతంవల్ల లౌకిక విషయాలమీద ఆసక్తి పోయి, సన్యసించిన వాడు వైరాగ్య సన్యాసి.

**4. జ్ఞానవైరాగ్య సన్యాసి :** జ్ఞానము వైరాగ్యము కలిగి సన్యసించటము.

వైరాగ్యం కలిగితేనే సన్యసించాలి. లేకపోతే గృహస్థులాగానే ఉండాలి. కోరికలు తీరనివాడు. వైరాగ్యం లేనివాడు సన్యసిస్తే నరకానికి పోతాడు. జిహ్వ, ఉపస్థ, ఉదరము, హస్తములను తన అధీనంలోకి తెచ్చుకున్న వాడు మాత్రమే సన్యసించాలి.

ఈ రకంగా వైరాగ్యములు గలవాడే సన్యాసానికి అర్హుడు అంటున్నాయి సన్యాసోపనిషత్తులు.

ఇప్పుడు నిర్మమత్వము, (వైరాగ్యము) గురించి పదవ అధ్యాయంలోని ఎనిమిది శ్లోకాలలో వివరిస్తున్నాడు అష్టావక్రుడు.

**విహాయవైరిణిం కామ మర్థం చానర్థ సంకులమ్ ।**
**ధర్మమప్యేతయోర్హేతుం సర్వత్రానాదరంకురు ॥ 1**

జనక మహారాజా ! కోరికలు నీ శత్రువులు. ఐశ్వ్యం అనర్థహేతువు. ఐశ్వర్యం వల్ల కోరికలు పెరుగుతాయి. ఈ రెండింటికీ అంటే కోరికలకు, ఐశ్వర్యానికి కూడా మూలం ధర్మం. ఈ విషయాన్ని గుర్తించి కోరికలు, సంపద, అధర్మము అన్నింటినీ ఉదాసీన భావంతో పరిత్యజించు.

జ్ఞానసముపార్జన చెయ్యటానికి కోరికలు అడ్డు వస్తాయి. అందుకని కోరికలు, విషయాల యందు ఆసక్తి వదలి పెట్టెయ్యాలి. ధనార్జన చెయ్యటానికి అనేక తప్పు పనులు, పాపపు పనులు చెయ్యాలి. సంపాదించిన ధనాన్ని కాపాడుకోవటానికి చాలా కష్టాలు పడాలి. ఈ కారణం చేత అసలు కోరికలు, సంపద, అధర్మము అన్నీ వదిలిపెట్టాలి అంటున్నాడు అష్టావక్రుడు.

హైందవ ధర్మంలో **'చతుర్విధ పురుషార్థ సాధన'** అనేది చాలా ముఖ్యమైనది. ధర్మ అర్థ కామ మోక్షాలే చతుర్విధ పురుషార్థాలు. ఈ నాల్గింటిలోను ముఖ్యమైనది మోక్షము. అసలు పురుషార్థము అంటే మోక్షమే. ఆ మోక్ష సాధన కోసమే మిగిలిన మూడు ఉపకరిస్తాయి. ప్రతి మనిషికి జీవించాలంటే రెండు, మూడు పురుషార్థాలు కావాలి. అవే అర్థకామాలు. వీటిని గురించే చెబుతున్నాడు ఇక్కడ అష్టావక్రుడు. ముందుగా మూడవదైన కామాన్ని వివరిస్తున్నాడు. కామము అనగానే ముందుగా స్ఫురించేది స్త్రీ వాంఛ. కాని కామము అంటే కోరిక అని అర్థం. ఈ కోరిక ఏ రకమైనదైనా కావచ్చు. కోరికలు చాలా విచిత్రంగా ఉంటాయి. కొంతమందికి బాగా చదువుకోవాలని, శాస్త్రపండితులు కావాలని కోరిక. అలా చదువుకుని దేశానికి ఏదో చెయ్యాలనే కోరిక. దీని కోసం తమ సర్వస్వాన్ని ధారపోస్తారు. మాజీ రాష్ట్రపతి అబ్దుల్‌కలామ్, యాంటీ బయాటిక్ కనిపెట్టిన డా॥ సుబ్బారావు గారు లాంటి వాళ్ళు తమ వైవాహిక జీవితాన్ని పణంగా పెట్టి, అహర్నిశలు కృషి చేశారు. కొంత మందికి ధనార్జన చెయ్యటం. విపరీతంగా ధనాన్ని సంపాదించటం కూడబెట్టటం. ఇదే కోరిక. వీరు తిండి కూడా సరిగా తినకుండా ధనార్జన కోసం పాటు పడతారు. గతంలో మాతోపాటు పనిచేసిన ఒకాయన చెప్పేవారు. “మీకు డబ్బులు ఖర్చుపెట్టి అనుభవిస్తే ఆనందం. కాని నాకు ఆ డబ్బులతో బంగారు రింగులు పెద్ద పెద్దవి చేయించి, ఇనప్పెట్టెలో తగిలించి, ప్రతిరోజు నిద్ర లేవగానే వాటిని చూడటం ఆనందం” అని కొంతమందికి జూదము, మధుపానము వంటివి కోరికలు. వాటికోసం ఇల్లు వళ్ళు గుల్ల చేసుకున్న వారు అనేకులు. కొంతమందికి స్త్రీ వ్యామోహం. కొంతమందికి అధికార పిచ్చి. తన అధికారం చెలామణి కావాలని, ప్రపంచం మొత్తాన్ని శాసించాలని కోరిక. ప్రపంచ విజేత అలెగ్జాండరు, నెపోలియను, హిట్లరు వంటి వారు. ఇలా అనేక రకాలయిన కోరికలు. కాని వీరిలో ఎక్కువ

మందికి ఉండేది స్త్రీ వాంఛ, మద్యపానము, జూదము. వీటిలో ఏ కోరిక తీరాలన్నా ధనం కావల్సిందే. అందుకే ధనం సంపాదించాలి. ధనం గనక ఉన్నట్లైతే చాలా కోరికలు తీరతాయి. అందుకే

**వేదమూలమిదం బ్రాహ్మ్యం । భార్యామూలమిదం గృహం**

**కృషిమూలమిదం ధానం । ధనమూలమిదం జగత్ ॥**

అన్నారు. చేతిలో ధనం ఉన్నంత మాత్రం చేత లోకంలో అన్నీ లభించవు కాని చాలావరకు లభిస్తాయి. అందుకే ప్రతివాడు ధనం సంపాదించేందుకు అక్రమ పద్ధతులు అనుసరిస్తాడు. ఆ పనే చెయ్యద్దు అంటున్నాడు అష్టావక్రుడు. అర్థ కామాలు కావాలంటే పురుషార్థాలలో మొదటిదైన ధర్మాన్ని అనుసరించే ఉండాలి. ధనాన్ని సంపాదించటం గాని, ఆ ధనాన్ని ఖర్చు పెట్టి కోరికలు తీర్చుకోవటం గాని రెండు కూడా ధర్మబద్ధంగానే ఉండాలి. కాబట్టి ఓ జనక మహారాజా! కోరికలు, సంపద వీటికి కూడా పరిమితులు ఉన్నాయని గుర్తించు. ఉదాసీనంగా వ్యవహరించు అంటున్నాడు.

**స్వప్నేంద్రజాలవత్పశ్యత్‌దినాని త్రీణి పంచవా ।**

**మిత్రక్షేత్ర ధనాగార దారదాయాది సంపదః ॥ 2**

అదృష్టవశాన లభించిన మిత్ర క్షేత్ర, దారాసుతాది బంధువులంతా కలలాగా, లేదా మాయలాగా మూడునాళ్ళ ముచ్చటగా భావించి వ్యామోహాన్ని విడిచిపెట్టు.

ఈ లోకంలో మనం అనుభవించే సుకాలన్నీ కూడా ధనము, భార్య, పిల్లలు, మిత్రులు, చుట్టాలు, ఆస్థిపాస్తులు. ఇవేవీ శాశ్వతం కాదు.

**అర్థాగృహే నివర్తంతే స్మశానే మిత్రబాంధవాః**

**సుకృతం దుష్కలృతం చైవ గచ్ఛంత మనుగచ్ఛతి ॥**

మనం సంపాదించిన ధనం అంతా మన ఇంట్లోనే ఇనప్పెట్టెలో భద్రంగా ఉంటుంది. నేలమాళిగలలో దాచబడి ఉంటుంది. ప్రస్తుత కాలంలో అయితే విదేశీ బ్యాంకులలో దాచబడి ఉంటుంది. ఎక్కడిదక్కడే భద్రంగా ఉంటుంది. ఇక సంపాదించిన ఇల్లు, పొలాలు, స్థలాలు ఇవన్నీ ఇక్కడే ఉంటాయి. ఎక్కడికీ పోవు.

అప్పటిదాకా నీతో కలిసి కాపురం చేసిన భార్య, పిల్లలు ఇంటిదగ్గరే ఉంటారు. నీమీద ప్రేమ అభిమానం ఉన్న మిత్రులు, బంధువులు మహా అయితే స్మశానం దాకా వస్తారు. పోయేటప్పుడు నీతో వచ్చేది కేవలము నువు చేసిన మంచి చెడులు మాత్రమే.

**పూజకొద్ది పురుషుడు దానం కొద్ది బిడ్డలు** ఇది సామెత. భర్త దుర్మార్గుడైనప్పుడు గతరోజుల్లో స్త్రీలను సముదాయించటానికి ఈ మాట చెబుతుండేవారు. నా చిన్నప్పుడు మా ఇంటిదగ్గర ఒక కుటుంబం ఉండేది. ఆయన వ్యసనాలకు బానిస. పిల్లలు కూడా చదువు సంధ్య లేకుండా ఎందుకూ పనికి రాకుండా పోయారు. ఆ ఇల్లాలు అంటుండేది గతజన్మలో నేను **నిప్పుల పూజ బొగ్గులు దానం** చేశాను. అందుకే నా జీవితం ఇలా అయింది అని. అలాగే ఇంకొక కుటుంబంలో ఆవిడ ఆ రోజుల్లోనే బి.ఎ ప్యాసయింది. ఉన్నత స్థాయిలో పెరిగింది భర్త ఒక హైస్కూల్ టీచరు. ఆయన ఆవిడకు ఏ మాత్రం నచ్చలేదు అందుకే **దశకొద్దీ దొరికాడు దరిద్రపు మొగుడు** అనేది.

మన జీవనస్థాయి, విధానం అంతా గతజన్మలలో చేసిన కృతం వల్లనే అని గుర్తించాలి. గతజన్మలో విద్యాదానం చేసినవారు ఈ జన్మలో గొప్ప పండితులవుతారు. దానధర్మాలు చేసినవారు ఈ జన్మలో గొప్ప భాగ్యవంతులౌతారు. ఇతరులను గౌరవించినవారు, ఆదరించిన వారు సకల భోగాలు అనుభవిస్తారు. కాబట్టి ఈ జన్మలో అనుకూలవతి అయిన భార్య, మంచి పిల్లలు, ధనధాన్యాలు, భోగభాగ్యాలు అనుభవిస్తున్నామంటే అవన్నీ గతజన్మలలో చేసిన కర్మఫలాలే.

ఇక్కడ గుర్తించవలసింది ఇంకోటుంది. జీవితం బుద్బుదప్రాయం గాలి బుడగ వంటిది ఈ జీవితం. చాలా తక్కువ కాలం ఉటుంది. ఎప్పుడు మరణిస్తారో ఎవరికీ తెలియదు. అందుకే జీవితం క్షణభంగురం. మూణ్ణాళ్ళముచ్చట. నిద్ర పోతున్నప్పుడు కల వస్తుంది. మెలకువ రాగానే కరిగిపోతుంది. ఆ కలలాంటిదే ఈ జీవితం కూడా అందుకే ఓ కుమారా! జనక రాజా! భార్య, పిల్లలు, మిత్రులు అందరూ కలలాగా, గారడీ విద్యలాగా కొద్దికాలమే ఉంటారు అని తెలుసుకో అంటున్నాడు అష్టావక్రుడు.

**యత్రయత్ర భవేత్తృష్ణా సంసారం విద్ధి తత్ర వై ।**
**ప్రౌఢ వైరాగ్య మాశ్రిత్య వీతతృష్ణ స్సుఖీభవ ॥ 3**

కోరిక ఉంటేనే ఈ జగత్తు ఉంటుంది. కాబట్టి వైరాగ్యంతో కోరికల నధిగమించి హాయిగా జీవించు అంటున్నాడు అష్టావక్రుడు.

సంసారానికి కారణం మనస్సు. బంధమోక్షాలు ఈ మనస్సు వల్లనే కలుగుతున్నాయి. మానవుడి కోరికలే బంధాలవుతున్నాయి. మనస్సు వల్లనే రాగద్వేషాలు అహంకార మమకారాలు కలుగుతున్నాయి. మమ అనుకుంటే బంధం. నమమ అనుకుంటే మోక్షం. నా భార్య, నా పిల్లలు, నా శత్రువులు, నా మిత్రులు అనుకోవటం వల్లనే బంధాలు ఏర్పడుతున్నాయి. ఇదే సంసారం. ఈ బంధాలన్నీ మానవుడు కావాలని తగిలించుకుంటున్నాడు. గతంలో చెప్పినట్లుగా మనస్సు వల్లనే బంధాలు ఏర్పడుతున్నాయి. మనసు లేనివాడికి కోరికలు బంధాలు ఉండవు. పిచ్చివాడికి, పసిపిల్లవాడికి బంధాలు ఉండవు. అలాగే మహాజ్ఞానికి కూడా బంధాలుండవు. సన్యాసం స్వీకరించిన వాడు అన్ని బంధాలను వదిలేస్తాడు. అవధూత పిచ్చివాడి లాగా అడవులు వెంబడి తిరుగుతుంటాడు. బృహస్పతి అన్నగారు సంవర్తకుడు అవధూత. పిచ్చివాడిలాగా అడవుల వెంబడి తిరుగుతాడు. వీళ్ళు సదా సత్యాన్వేషణలో ఉంటారు. కాబట్టి మోక్షం కావాలంటే బంధాలను వదిలెయ్యాలి. కోరికలను జయించాలి. విషయ వాంఛలను వదలిన మనస్సు ఆత్మరూపం పొందుతుంది. అందుకే ఓ జనక మహారాజా! విషయాసక్తి గనక ఉంటే సంసారము కలుగుతుంది. విషయ వాంఛలవల్లనే కర్మలు చేస్తారు. ఆ కర్మద్వారా సంసారం కలుగుతుంది. కాబట్టి గాఢమైన వైరాగ్యం వల్ల ఆత్మనిష్ఠ కలిగి బ్రహ్మానందం అనుభవించవలసింది.

**ఆశాహి పరమందుఃఖం నైరాశ్యం పరమం సుఖం**

కోరికలు దుఃఖహేతువులు. వైరాగ్యము పరమ సుఖాన్నిస్తుంది అంటున్నాడు అష్టావక్రుడు

**తృష్ణామాత్రాత్మకో బంధ స్తన్నాశో మోక్ష ఉచ్యతే ।**
**భవా సంసక్తిమాత్రేణ ప్రాప్తి తృష్టిముహుర్ముహుః ॥ 4**

కోరికలు బంధహేతువులు. వాటి నాశమే ముక్తి. ప్రపంచం పట్ల వైరాగ్యభావన కలిగి ఉండటమే ఆత్మానంద హేతువు.

ఇందాక చెప్పినట్లుగా కోరికలే అన్ని అనర్థాలకు కారణము. దేన్నో పొందాలి దేన్నో సాధించాలి. అందరికన్న గొప్పవాళ్ళం కావాలి. ప్రపంచ విజేత కావాలి. అనేవి కోరికలు. జానపద కథలలో చదువుతుంటాం. వందమంది రాకుమారులను బలి ఇస్తే ప్రపంచాధిపత్యం వస్తుంది. దాన్ని సాధించటానికి అనేక దురాగతాలు చేస్తారు. ఈ రోజున కూడా చూడండి గుప్తవిధులు బయటకు తియ్యటానికి ఐదు సంవత్సరాల బాలికను బలి ఇచ్చారు 'కర్ణాటక'లో కాబట్టి కోరికలు తీరాలంటే అనేక దురాగతాలు, దుర్మార్గులు చేస్తున్నారు. ఈ కోరికల వల్ల బంధాలు పెరుగుతున్నాయి. సంసారం ఇంకా బలపడుతోంది. సంసారము అంటే అజ్ఞానమన్న మాట. ఈ కోరికల వల్ల అజ్ఞానం ఇంకా ఇంకా బలీయమవుతున్నది. దాంతో మానవుడు శ్లేష్మంలో పడ్డ ఈగలాగా సంసారంలో ఇంకా ఇంకా కూరుకుపోతున్నాడు. కోరికలు గనక నశిస్తే ఆలోచనలు ఆగిపోతాయి. ఆలోచనలు లేకపోతే మనసుకు పని ఉండదు. మనస్సు లేకపోతే అహంకారం ఉండదు. ఒకవేళ ఈ అహంకారమే గనక లేకపోతే ఈ ప్రపంచాన్ని అనుభవించే దెవరు? కాబట్టి ఆత్మానుభవం కావాలంటే వైరాగ్యం ఉండి తీరాలి. ఇదే సక్రమమైన మార్గం. అందుకే "ఓ జనక మహారాజా! కర్మవాసనలు బంధానికి కారణమవుతాయి. విషయ వాసనలు విషయంతో సమానము. విషయ వాసనలే బంధానికి కారణము. విషయవాసన నశిస్తే మోక్షం సిద్ధిస్తుంది. ప్రతిక్షణము ఆత్మప్రాప్తిలో సంతోషం కలుగుతుంది. కాబట్టి కోరికలను నాశనం చేసి మోక్షమార్గంవైపు పయనించు" అంటున్నాడు గురువు గారైన అష్టావక్రుడు.

**త్వమేకశ్చేతన శ్శుద్ధః జడం విశ్వమసత్తథా ।**
**అవిద్యాపి న కించిత్సా కా బుభుత్సా తథాఽపి తే ॥ 5**

రాజా! నువ్వు శుద్ధ చైతన్యానివి. ఈ జగత్తంతా మిథ్య. జపం అజ్ఞానంతో కూడుకున్నది. నువు ఇంకా దేన్ని గురించి తెలుసుకోవాలనుకుంటున్నావు?

చరాచర జగత్తులో నామరూపాత్మకమైనవన్నీ అశాశ్వతాలే. అసలు జగత్తే లేదు. బ్రహ్మము ఒక్కటే సత్యము, నిత్యము, శాశ్వతమైనది. ఈ జగత్తంతా మిథ్య. భ్రాంతి చేత అజ్ఞానం చేత కల్పించబడింది.

జగత్తును సృష్టించటానికి ప్రత్యేకంగా బ్రహ్మదేవుడు లేడు. కలలను సృష్టించినట్లే మనస్సే ఈ జగత్తును సృష్టిస్తోంది. అందుచేతనే మనస్సులేని పసిపిల్లవాడికి, పిచ్చివాడికి ఈ జగత్తు కనుపించదు. స్వప్నంలాగానే ఈ జగత్తు అంతా కల్పనా మాత్రము. మానవుడికి జ్ఞానం కలిగితే జగత్తు నశిస్తుంది. ఒకవేళ జగత్తు సత్యమైనదే అయితే జ్ఞానం కలిగినా అది నశించదు. భ్రాంతి సిద్ధమైన వస్తువులు జ్ఞానంతో నశిస్తాయి. జ్ఞాన సముపార్జనతో నశించేవి అసత్యమైనవి. దీనికంతటికీ కారణం మనస్సు. తన రచనాశక్తితో 84 లక్షల రకాలైన జీవరాసిని సృష్టించి, బ్రహ్మవేత్తలను కూడా అందులో ముంచేస్తున్నది. జగత్తంతా మనస్సు వల్లనే కల్పించబడుతున్నది. యధార్థంగా చూస్తే అసలు సంసారమే లేదు. మనసు పనిచేయని సుషుప్తి, మూర్ఛ వంటి అవస్థలలో సంసారం కనుపించదు. మనసున్నచోటే లోకాలున్నాయి. మనసు లేకపోతే లోకాలు లేవు. సృష్టిలేదు అసలు జగత్తే లేదు.

ఎడారిలో ప్రయాణం చేసేవాడికి ఎండమావులు నీరులాగా కనిపిస్తాయి. అలాగే బ్రహ్మమును గురించి తెలియని అజ్ఞానులకు జగత్తు సత్యంగా కనుపిస్తుంది. అవి ఎండమావులు అనే జ్ఞానం కలిగితే, ఎండమావులలో నీరు కనుపించదు. అలాగే జగత్తుకు అధిష్టానమైన బ్రహ్మము గురించి తెలియగానే జగత్తంతా బ్రహ్మముగానే కనుపిస్తుంది. అప్పటిదాకా కనుపించిన జగత్తు బ్రహ్మములో నిలచి ఉంటుంది.

త్రాడును చూసి పాము అనుకున్నాం. అది నిజంగా పాముకాదు. అజ్ఞానంతో దాన్ని పాము అనుకున్నాం. ఇప్పుడు జ్ఞానం కలిగింది. అజ్ఞానం పోయింది. త్రాడులో కనుపించిన పాము ఇప్పుడు లేదు. అది తన అధిష్ఠానంలో నిలచిపోయింది. త్రాడు త్రాడుగానే మిగిలిపోయింది. విచిత్రం ఏమంటే త్రాడు ఎప్పుడూ త్రాడుగానే ఉంది. అజ్ఞానంతో నువ్వే దాన్ని పాము అనుకున్నావు. అజ్ఞానం పోగానే అది పాము అనే భావన పోయి త్రాడు మిగిలింది. నీ అజ్ఞానం పోకముందు అక్కడ ఉన్నది త్రాడే. పోయిన తరువాత అక్కడ ఉన్నది త్రాడే. అందులో ఏ మార్పులేదు. ఉన్నదంతా నీ భావనలోనే. అలాగే నీ అజ్ఞానంతో జగత్తును భావన చేశావు. అజ్ఞానం పోయిన తరువాత జగత్తు లేదు. కేవలము బ్రహ్మమే మిగిలింది. అందుకే **బ్రహ్మసత్యం**

**జగన్మిథ్య.** దీనిమీద వివరాలకు నేను వ్రాసిన **'బ్రహ్మసత్యం–జగన్మిధ్యా'** పుస్తకం చూడండి.

కలలో కనుపించిన విషయాలు మెలకువ రాగానే ఎలా కరిగిపోతాయో, అలాగే జ్ఞానం కలుగగానే జాగ్రదావస్థలోని జగత్తు అదృశ్యమై పోతుంది. తన అధిష్ఠానంలో కలిసిపోతుంది. ఇక్కడ మనస్సు తన అజ్ఞానంతో జగత్తును ఊహించుకుంటోంది. ఇదంతా ఊహ, కల్పన, భ్రాంతి. అయితే ఇక్కడ చిన్నతేడా ఉంది. కలలోని వస్తువులు మెలకువ రాగానే కరిగిపోతాయి. కాని జాగ్రదావస్థలో వాటిని చేత్తో తాకుతాము. అనుభవిస్తాము. వివాహం చేసుకున్నాం. భార్య ఇంటికి వచ్చింది. తనతోనే ఉంటుంది. ఇల్లు కట్టుకున్నాడు. గృహప్రవేశం చేశాడు. ఆ ఇంట్లోనే ఉంటున్నాడు. భార్యాపిల్లలు ఎదురుగానే కనుపిస్తున్నారు. వారందరితోను తాను కలిసే ఉంటున్నాడు. అందుకే అదంతా సత్యము అనుకుంటున్నాడు. మంచి గురువును చేరి శుశ్రూష చేసి జ్ఞాన సముపార్జన చేస్తే, జాగ్రదావస్థలోని విషయాలు కూడా స్వప్నంలోని విషయాల లాగానే అసత్యము, భ్రాంతి అని తెలుస్తుంది. ఇప్పుడు దృశ్యమానమైన జగత్తు అదృశ్యమై పోతుంది. ఇప్పుడు మిగిలేది అధిష్ఠానమైన బ్రహ్మము ఒక్కటే. అందుకే **బ్రహ్మసత్యం జగన్మిథ్య** అన్నారు.

ఓ రాజా ! ప్రపంచం అంతా మిథ్య. నువ్వు శుద్ధ చైతన్యానివి. మరింకా దేన్ని గురించి తెలుసుకోవాలనుకుంటున్నావు? అంటున్నాడు అష్టావక్రుడు.

**రాజ్యం సుతాః కళత్రాణి శరీరాణి సుఖానిచ ।**
**సంసక్తస్యాపి నష్టాని తవజన్మని జన్మనీ ॥** **6**

రాజ్యభోగాలు, భార్య, పిల్లలు, సిరిసంపదలు, శరీరము వీటన్నింటినీ అనేక జన్మల నుంచి పోగొట్టుకుంటున్నావు. వాటిని నువ్వు ఎంత అభిమానించినా నిలబెట్టుకోలేవు.

మనం ఇప్పటికి అనేక కోట్ల జన్మలు ఎత్తాం. క్రిమికీటకాలు కొన్ని గంటలు మాత్రమే జీవిస్తాయి. కుక్కలు నక్కలు 10 సంవత్సరాలు జీవిస్తాయి. పశువులైతే 20,25 సంవత్సరాలు జీవిస్తాయి. ఏనుగులాంటి జీవులైతే 75 నుంచి 100 సంవత్సరాలు జీవిస్తాయి. మానవుడి ఆయుష్యు వంద సంవత్సరాలని ఇది పూర్ణాయువు అని చెబుతున్నారు. ఇప్పటికి ఈ సృష్టి ప్రారంభమయి వందలకోట్ల

సంవత్సరాలయింది. ఈ రోజు అంటే 13-5-2017 ఈనాడు పేపర్లో కదిలేకొండ - మేడంత మోడు శీర్షికతో ఒక వార్త పడింది చూండి. ఎప్పుడో 160 మిలియన్ సంవత్సరాల క్రితం అంటే ఒక కోటి అరవై లక్షల సంవత్సరాల క్రితం జీవించిన డైనాసార్ జాతికి చెందిన జీవిని గురించి వ్రాశారు. దీన్ని బట్టి కోటి అరవై లక్షల సంవత్సరాల క్రితమే ఈ సృష్టి పరిపూర్ణంగా ఉంది. ఇలా చూస్తే కొన్ని వందల కోట్ల సంవత్సరాల క్రితం సృష్టి ప్రారంభమయింది. ఇంత కాలం నుంచి నువ్వు వివిధ రూపాలలో జన్మిస్తూనే ఉన్నావు. కొన్ని కోట్ల జన్మలెత్తావు. పశువుగా, పక్షిగా, క్రిమికీటకాలుగా, మానవుడిగా కూడా గతంలో జన్మించి ఉండవచ్చు. ఇక్కడ చాలామందికి అనుమానం వస్తుంది **"జంతూనాం నరజన్మ దుర్లభం**. అన్నారు. జన్మలన్నింటిలోకీ మానవజన్మ దుర్లభమైనది. ఎంతో పుణ్యం చేసుకుంటే గాని మానవజన్మ రాదు. అలాంటిది మనిషిగా జన్మించిన తరువాత ఇక మళ్ళీ వెనక్కి వెళ్ళరు కదా!" అని. ఇది నిజం కాదు బృహదారణ్యకోపనిషత్తులో" పాపకార్యాలు చేసిన వారు నీచమైన జన్మలు ఎత్తుతారు. పుణ్యకార్యాలు చేసినవారు ఉత్తమజన్మలు ఎత్తుతారు. దుర్మార్గపు పనులుచేసినవారు పరమనీచమైన జన్మలు కుక్కలు పందులగా జన్మిస్తారు. ఇంకా పాపాలు చేసినవారు క్రిమికీటకాలుగా జన్మిస్తారు" అని చెప్పబడింది. ఇంద్రపదవిని చేపట్టిన నహుషుడు కొండచిలువైనాడు. అనేకమంది గంధర్వులు రాక్షసులుగా జన్మించారు. కాబట్టి మానవుడు చేసే కర్మను అనుసరించి అతనికి మరుజన్మ ఉంటుంది. ప్రతిజన్మలోను భార్యాపిల్లలు సంసారము ఉన్నాయి. ప్రతిజన్మలోను ఒక శరీరాన్ని ధరించాడు. ఇలా బంధాలు, సంసారము, శరీరము ఎప్పటికప్పుడు, ఏ జన్మకి ఆ జన్మలోనే కలుగుతున్నాయి. అవి ఏవి? ఇప్పుడు ఒక్కటి కూడా కనిపించటం లేదుకదా? ఏ జన్మలో బంధాలు ఆ జన్మలోనే నిలిచిపోతాయి. **ఋణానుబంధరూపేణ పశుపత్ని సుతాదయా** గతజన్మలలో మనం ఋణం ఉన్నవాళ్ళు, లేకపోతే మనకు ఋణపడి ఉన్నవాళ్ళు ఇలా భార్యా బిడ్డలుగా, పశువులుగా జన్మించి ఆ ఋణం తీర్చుకుంటూ ఉంటారు. ఆ ఋణం తీరగానే వాళ్ళు వెళ్ళిపోతారు. ఈ బంధాలు ఏవీ శాశ్వతం కాదు. జనక మహారాజా! నువ్వు విజ్ఞుడివి. నీకు అన్ని విషయాలు తెలుసు. అయినప్పటికీ మళ్ళీ ఒకసారి గుర్తు చేస్తున్నాను. ఆ జన్మలో ఆ శరీరం మీద విపరీతమైన మమకారం పెంచుకుని ఉంటాం. కాని ఎంత ప్రయత్నించినా ఆ శరీరాన్ని నిలబెట్టుకోలేము కదా? ఇక్కడ ఒక చిన్న కథ చెబుతాను విను. పూర్వకాలంలో ఒక గురువుగారు ఉండేవాడు.

ఆధ్యాత్మిక విద్యలో చాలా గొప్పవాడు. ఆయనకు చాలామంది శిష్యులున్నారు. ఆయనకు అవసానకాలం సమీపించింది. మరుజన్మ ఆయన కళ్ళకు కనుపిస్తోంది. ప్రక్కవీధిలో ఉన్న పందికి ఆఖరు సంతానంగా తాను జన్మిస్తాడు. ఇప్పుడు అది గర్భవతి. ఈ విషయం తెలిసి చాలా బాధపడ్డాడు. ఒక శిష్యుణ్ణి పిలిచి విషయం చెప్పి, నేను భూమిమీద పడగానే నన్ను చంపెయ్యి. ఈ నీచమైన పంది జన్మను నేను భరించలేను అన్నాడు. గురువుగారు మరణించారు. ప్రక్కవీధిలోని పంది ప్రసవిస్తోంది. శిష్యుడు దాని దగ్గరకు వెళ్ళి నుంచున్నాడు. ఆఖరి పిల్ల బయటకు వస్తోంది. తన చేతిలో ఉన్న కర్రతో బలంగా కొట్టి ఆ పిల్లను చంపెయ్యాలి. గురువు గారికి పందిజన్మ నుంచి విముక్తి కలిగించాలి అనుకుంటున్నాడు. కర్రతో ఆ పిల్లను కొట్టబోయాడు. వెంటనే ఆ పందిపిల్ల మానవభాషలో 'ఎందుకురా మూర్ఖుడా! పుట్టీపుట్టగానే నన్ను చంపాలని చూస్తావు. నా బ్రతుకు నన్ను బ్రతకనీ అన్నది. రాజా ! తాను మానవుడిగా ఉన్నప్పుడు పంది జీవితంమీద అసహ్యం వేసింది. కానీ తానే పందిగా జన్మిస్తే ఆ శరీరంమీద, ఆ జీవితం మీద మమకారం ఏర్పడింది. ఎప్పుడైనా అంతే. ఈ దేహం మీద జీవికి విపరీతమైన మమకారం ఉంటుంది. కాని ఆ దేహం శాశ్వతం కాదు. ఓ రాజా! నువ్వు ఎంత ప్రయత్నించినా ఆ శరీరాలు కాని, బంధాలు గాని నిలబెట్టుకోలేక పోయావు. కాబట్టి సిరిసంపదలు, భోగభాగ్యాలతో, బంధాలతో కూడిన ఈ సంసారము అనిత్యము. కలలాగా అంతా మిథ్య ఆత్మ ఒక్కటే సత్యము, నిత్యము శాశ్వతమైనది. ఈ విషయాన్ని గ్రహించు అంటున్నాడు అష్టావక్రుడు.

**అలమర్థేన కామేన సుకృతే నాపి కర్మణా ।**
**ఏభ్యః సంసార కాంతారే న విశ్రాంత మభూన్మనః ॥ 7**

ఇప్పటికి అనుభవించబడిన ఈ కోరికలు, సంపదలు, చేసిన ధర్మకార్యాలు చాలు. ప్రపంచమనే మహారణ్యంలో శాంతి ఎక్కడా లభించటం లేదు.

ఓ రాజా ! కోరికలు అనంతమైనవి. ఒకటి తీరగానే ఇంకొకటి వస్తూనే ఉంటుంది. లక్ష రూపాయలు సంపాదించిన వాడికి కోటి సంపాదించాలనిపిస్తుంది. కోటి సంపాదించిన వాడికి పదికోట్లు కావాలనిపిస్తుంది. ఇక్కడ ఒక చిన్నకథ చూడండి. సంపాదించాలనే ఆశ బాగా ఉన్న ఒక బ్రాహ్మణుడు రాజుగారి దగ్గరకు

వెళ్ళాడు. అతణ్ణి గురించి పూర్తిగా విన్నాడు రాజుగారు. ఇతడికి తృప్తి అనేది లేదు. ఎంత ఇచ్చినా ఇంకా కావాలి అంటాడు. అందుకని అతనితో ఓ బ్రాహ్మణుడా రేపు ఉదయం సూర్యోదయం దగ్గర నుంచి సూర్యాస్తమానందాకా నువ్వు ఆగకుండా ఎంత దూరం పరిగెడితే, అంతవరకు ఉన్న నేల అంతా నీకు ఇచ్చేస్తాను అన్నాడు. రాజభటులు వెంటరాగా మరునాడు ఉదయాన్నే పరుగు ప్రారంభించాడు. ఊరిలో వారందరూ చూస్తున్నారు. ఎంత నేల సంపాదిస్తాడా అని. ఆగకుండా పరుగు పెడుతున్నాడు. మధ్యాహ్నం అయ్యేసరికి బాగా అలిసిపోయాడు. అయినా ఆగలేదు. ఇంకా చాలా సమయం ఉంది. కాబట్టి ఇంకా పరుగెత్తవచ్చు. పరుగెడుతున్నాడు. ప్రొద్దుకుంకుతున్నది. శరీరం బాగా అలసిపోతోంది. ఇంకా కొంచెం దూరం పరుగెడదాం. అనుకుని అలాగే ఓపిక లేకపోయినా ఓపిక చేసుకుని మరీ పరుగు పెడుతున్నాడు. మనిషి వేగం బాగా తగ్గింది. అలసట పెరిగిపోతోంది. కాలు తీసి కాలు వెయ్యలేని పరిస్థితి. శ్వాస తీసుకోవటం కూడా కష్టమై పోతోంది. పోనీ ఆగిపోతే, అమ్మో! సూర్యాస్తమానానికి ఇంకా సమయం ఉంది. కాబట్టి ఎలాగైనా సరే ఓపిక చేసుకుని నాలుగడుగులు వేద్దాం అనుకున్నాడు శరీరం సహకరించటం లేదు. తల తిరుగుతున్నట్లొతోంది. బాగా విపరీతంగా ఆయాసంగా ఉంది. గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. అడుగు ముందు పడటం లేదు. ఊరి ప్రజలు ఏం జరుగుతుందా అని ఆత్రుతగా చూస్తున్నారు. ఇంతలో ఒకసారిగా కుప్ప కూలిపోయాడు. వైద్యులు పరీక్షించారు. అప్పటికే ప్రాణాలు పోయినాయి రాజుగారు అతడి కళేబరాన్ని ఆరడగులు గొయ్యి తీయించి అందులో పాతిపెట్టించారు. కాబట్టి ఆశ, కోరిక అనేది ప్రాణాలు కూడా తీసేస్తుంది. **ఆశాపాశము తాకడున్ నిడువు. లేదంతంబు** కాబట్టి ఓ రాజా ! ఆశకు అంతం లేదు. హోమాలు యాగాలు చెయ్యాలని కోరిక కలిగింది. అలా చేస్తూనే ఉంటాడు. దానికి అంతం లేదు. ధనార్జన, ధర్మకార్యాలు కూడా అంతే. ఎంత ధనం సంపాదించినా, ఎన్ని దానధర్మాలు చేసినా, పుణ్యలోకాలు వస్తాయి తప్ప మోక్షం మాత్రం రాదు. కాబట్టి చేసిన దానాలు, ధర్మాలు, క్రతువులు చాలు. ధర్మార్థకామాల యందు కోరిక ఉండకూడదు. వీటివల్ల మనశ్శాంతి రాదు. ఇవి మోక్షకారకాలు కావు. అంటున్నాడు అష్టావక్రుడు.

**కృతం న కతిజన్మాని కాయేన మనసాగిరా ।**

**దుఃఖ మాయాసదం కర్మ తదద్యా ప్యుపరమ్యతాం ॥ 8**

రాజా ! అనేక జన్మల నుండి ఈ మనస్సుతోను, దేహంతోను కష్టమైన, బాధాకరమైన పనులు చేస్తూనే ఉన్నావు. ఇకనైనా ప్రయత్నాలను ఆపెయ్యి.

త్రిగుణాలతో ఏ పనులు చేసినా అవి బంధహేతువులే అవుతాయి. సామాన్యంగా మనం అనుకుంటాం. మనకు కావలసినది సత్వగుణం. రజోగుణం తమోగుణాలతో ఏ పనులు చేయరాదు అని. నిజం చెప్పాలంటే సత్వగుణంకూడా పనికిరాదు. సత్యగుణ సంపన్నుడికి ఒక రకమైన అహంకారం వస్తుంది. నేను గొప్పవాణ్ణి. ఈ శాస్త్రాలన్నీ నాకే తెలుసు. నేను గొప్ప తపస్విని. దీన్ని సాత్వికాహంకారము అంటారు. నిజానికి ఇదికూడా పనికిరాదు. అందుకే గుణాలతో అంటే కోరికలతో చేసే ఏ కర్మలు పనికిరావు. గతంలో చెప్పినట్లుగా ఇప్పటికి లెక్కలేనన్ని జన్మలు ఎత్తావు. ప్రతిజన్మలోను మనస్సుతో ఆలోచిస్తున్నావు. దేహంతో కర్మ చేస్తున్నావు. చేసే కర్మ సామాన్యంగా ఉండరాదు. అందులో ప్రత్యేకత ఉండాలి. అని శరీరాన్ని విపరీతంగా శ్రమ పెట్టి మరీ కర్మలు చేస్తున్నావు. వాటివల్ల ఏ ప్రయోజనం లేదు. ఈ కర్మలు చెయ్యటంవల్ల స్వర్గము వస్తుంది అంతేకాని మోక్షం రాదు. కాబట్టి ఓ రాజా! ఇలా సత్కర్మలు చెయ్యటంవల్ల పుణ్యం వస్తుంది. ఫలితంగా ఉత్తమజన్మలు వస్తాయి. మళ్ళీ మంచి కర్మలు చేస్తావు. ఉత్తమజన్మలు ఎత్తుతావు. దీనికి అంతమెక్కడ? ఈ కర్మలు చెయ్యటం వల్ల మళ్ళీ బంధాలు ఏర్పడుతూనే ఉన్నాయి. కాబట్టి ఓ రాజా ! ఇకనైనా ఈ పుణ్యకర్మలు చెయ్యటం ఆపెయ్యి. చేసింది చాలు అంటున్నాడు అష్టావక్రుడు.

ఈ మాటలు చెబుతున్నది మనలాంటి వారికి కాదు. జనక మహారాజు లాంటి ఉత్తములకి. పాపకర్మలు చేస్తే నరకం వస్తుంది పుణ్యకర్మలు చేస్తే స్వర్గం వస్తుంది. స్వర్గనరకాల్లో కర్మఫలం అనుభవించిన తరువాత కర్మఫలశేషం అనుభవించటానికి మళ్ళీ జన్మించాల్సిందే. కర్మ ఎలాంటిదైనా, కర్మశేషం మరుజన్మలోనే అనుభవించాలి అంటే మళ్ళీ జన్మించాలి. ఇలా జనన మరణాల వలయంలో చిక్కుకుపోతాడు మానవుడు. అందుకే అంటున్నాడు అష్టావక్రుడు రాజా ! ఇంతవరకు చేసింది చాలు. ఇప్పటికైనా ఆ కర్మలు చెయ్యటం ఆపెయ్యి అని.

# అధ్యాయం-11

## జ్ఞానాష్టకము

చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపము. పరమేశ్వరుడు నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు నిర్వికల్పుడు, నిరంజనుడు, సృష్టి స్థితి లయాలకు కారకుడు. జగత్తులో ఆ పరమేశ్వరుడు తప్ప ఇంకేదీ లేదు. జగత్తే పరమేశ్వరుడు. పరమేశ్వరుడే జగత్తు. ఆయన సర్వాంతర్యామి. అన్నింటియందు అంతర్లీనంగా ఉన్నాడు. పిపీలికాది బ్రహ్మపర్యంతము ఆ పరమేశ్వరుడే నిండి ఉన్నాడు. ఈ విషయాన్ని త్రికరణ శుద్ధిగా తెలుసుకోవటమే జ్ఞానము. **ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పినట్లుగా తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం దశదిశలు పరబ్రహ్మమే. భూమి ఆకాశము, సముద్రాలు, పర్వతాలు, కొండలు, లోయలు, నదీనదాలు పరబ్రహ్మ స్వరూపమే. ఆకాశంలో కనుపించే సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు అన్నీ పరబ్రహ్మమే. శ్రవణం బ్రహ్మ, దృష్టిబ్రహ్మ, మనసు బ్రహ్మ. ప్రాణం బ్రహ్మ. ఉపనిషత్తులలో చెప్పిన విషయాలను పట్టి చూస్తే **చరాచర జగత్తంతా పరబ్రహ్మమే. పిపీలికాది బ్రహ్మపర్యంతము పరబ్రహ్మమే. జగత్తులో బ్రహ్మముకన్న గొప్పదైనది కాని, దానితో సమానమైనది కాని వేరొకటి లేదు.**

నాలుగు వేదాలలోను ఉన్న ఉపనిషత్తుల నుంచి నాలుగు మహావాక్యాలు చెప్పబడుతున్నాయి. 1.ప్రజ్ఞానంబ్రహ్మ 2.అహంబ్రహ్మోస్మి 3.అయమాత్మా బ్రహ్మ 4.తత్త్వమసి. ఈ నాలుగూ మహావాక్యాలు. వీటి అర్థం ఏమిటి అంటే **నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని. నాకు వేరుగా జగత్తులో ఏదీలేదు.** తత్త్వమసి అనే మహావాక్యానికి అర్థం తెలుసుకుంటే మిగిలిన మహావాక్యాల అర్థం తేలికగా తెలుస్తుంది. శంకర భగవత్పాదుల వారు వ్రాసిన 'మహావాక్యదర్పణము' అనే గ్రంథంలో తత్త్వమసి అనే మహావాక్యమే వివరింపబడుతుంది. ఈ గ్రంథానికి నేను కూడా వివరణ వ్రాయటం జరిగింది. **ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు బ్రహ్మ విద్యను బోధిస్తూ ఆకాశంలో ప్రకాశిస్తూ దివ్యమైన కాంతినిచ్చే సూర్యునిలో ఏ తత్త్వమైతే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. శ్వేతకేతూ అదే నీవు. చంద్రునిలో ఏ చల్లదనమైతే ఉన్నదో అదే నీవు. ఈ రకంగా జగత్తులోని చరాచరముల

యందు ఉన్న తత్త్వమే నీవు. నీకు వేరుగా ఏదీలేదు అంటాడు. అంటే చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. ఆ బ్రహ్మమే నీవై ఉన్నావు అని అర్థం. **బృహదారణ్యకోపనిషత్తు**లో యాజ్ఞవల్క్యుడు అంతర్యామిని గురించి చెబుతూ అతడు ఆకాశంలో ఉంటాడు. ఆకాశం అతన్నెరగదు. ఆకాశమే అతని శరీరం. ఆకాశంలో ఉంటూనే ఆకాశాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ. అతడు పంచభూతాలలో ఉంటాడు. అన్ని ప్రాణుల యందు ఉంటాడు. 84 లక్షల జీవరాసి యందు ఉంటాడు. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు అన్నింటి యందు ఉంటాడు. అన్నింటినీ నియంత్రిస్తూ ఉంటాడు అతడే అంతర్యామి. ఈ రకంగా జగత్తులోని చరాచరములన్నింటి యందు ఉంటాడు. జగత్తంతా నిండి ఉంటాడు. అతడే సృష్టి స్థితి లయకారకుడు. అతడికి సుఖదుఃఖాలు, మానావమానాలు, కష్టసుఖాలు, ఆకలిదప్పికలు, నిందాస్తుతులు, పాపపుణ్యాలు ఏవీ ఉండవు. తనవారు, బయటివారు ఉండరు. అతడు ఏ పనీ చెయ్యడు. అలా చూస్తూ సర్వానికీ సాక్షిగా ఉంటాడు. అన్నింటి యందు నిండి ఉంటాడు. అంతటా ఆవరించి ఉంటాడు. అన్నింటికీ అతీతుడు. ఈ జగత్తు ఆ పరబ్రహ్మ కన్న వేరుకాదు. నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని నాకన్న వేరైనది ఈ జగత్తులో ఏదీలేదు. అని తెలుసుకోవటమే జ్ఞానము. ఈ విషయం తెలిసినవాడు జ్ఞాని. ఇతడు పరమశాంత స్వరూపుడు. ప్రలోభాలకు లొంగడు. కోరికలు ఉండవు. రాగద్వేషాలు, మానావమానాలు ఉండవు. కర్మలు చెయ్యడు. కర్మఫలం అతనికి ఉండదు. నేను అంటే దేహము కాదు ఆత్మ. అని తెలుసుకున్న జ్ఞాని పరమశాంతంగా ఉంటాడు. ఈ విషయాన్ని 11వ అధ్యాయంలోని 8 శ్లోకాలలో వివరిస్తున్నాడు అష్టావక్రుడు

**భావాభావవికారశ్చ స్వభావాదితి నిశ్చయా ।**
**నిర్వికారో గతక్లేశ స్సుఖేనైవోప శామ్యతి ॥** **1**

నామరూపాలు కలిగినది ఏదైనా సరే నాశనమవుతుంది. ఇది సృష్టి ధర్మం. ఈ విషయం తెలిసినవాడు దుఃఖించకుండా శాంతంగా ఉండగలడు.

చరాచర జగత్తంతా దృశ్యమానమైనదే. కంటికి కనుపించేదే. ఏదైనా సరే ఒక వస్తువుకు రూపమున్నది అంటే తప్పనిసరిగా నామం కూడా ఉండి తీరుతుంది.

అలాగే పేరు ఉంటే దానికి ఒక ఆకారం ఉంటుంది. అందుకే జగత్తంతా నామరూపాత్మకమైనది. ఈ జగత్తులో పుట్టిన ప్రతిజీవి, ప్రతి వస్తువు నశించి తీరాలి. ఇది మర్త్యలోకము మరణము ధర్మముగా గలది. ఇక్కడ పుట్టిన ప్రతిజీవి నశించి తీరుతుంది. పుట్టటము, వృద్ధి చెందటము, నశించటము అనేవి ఈ లోకంలోని లక్షణాలు. వీటినే సృష్టి స్థితి లయాలు అంటారు. సృష్టి అనేది ఉంటే లయం ఉండి తీరుతుంది. కొంతమంది అనుకుంటారు. కొండలు, బండలు శాశ్వతంగా అలాగే ఉంటాయి అని. అది నిజం కాదు. కొండలు పగిలిపోయి రాళ్ళవుతాయి. రాళ్ళు పగిలిపోయి మట్టి అవుతుంది. గతంలో ప్రవహించిన కొన్ని నదులు కొంతకాలం తరువాత కనుపించవు. సరస్వతీ నది గతంలో ఉండేదట. ఇప్పుడు లేదు. అందుకే త్రివేణీ సంగమంలో సరస్వతీ నది అంతర్వాహిని అంటారు. ఈ లోకంలో జన్మించిన ప్రతిజీవి మరణిస్తుంది. ఎక్కువ కాలం జీవించేది మానవుడే. కాని సర్పం వేయి సంవత్సరాలు జీవిస్తుంది. అలాగే అఘోరీలు రెండువందల నుంచి రెండు వందల యాభై సంవత్సరాల వరకు జీవిస్తారు అంటారు. సైన్సు ప్రకారము ఇది నిర్ధారణ కాలేదు. తన జీవితకాలం పూర్తి అయిన తరువాత ప్రతిజీవి నశించి పోతుంది. ఈ విషయం తెలిసిన వాడిని దుఃఖం బాధించదు.

పుట్టిన ప్రతిదీ నశించి తీరుతుందనే నిశ్చయ జ్ఞానం కలవాడు పరమశాంతంగా ఉంటాడు. ప్రతిరోజూ సూర్యాస్తమానం గురించి ఎవరూ బాధపడరు. ఇది సహజంగా జరిగే ప్రక్రియ. సృష్టి ధర్మం. అలాగే సముద్రంలో ఉవ్వెత్తున లేచిన తరంగాలు మరుక్షణంలో క్రింద పడిపోతాయి. దీనికి ఎవరూ విచారించరు. అదే విధంగా పుట్టిన ప్రతిజీవి గిట్టక మానదు. ఈ విషయం తెలిసిన జ్ఞాని శాంత గంభీరంగా ఉంటాడు కాని ఏ మాత్రము విచారించడు.

**ఈశ్వర స్సర్వనిర్మాతా నేహాన్య ఇతి నిశ్చయీ ।**
**అంతర్గళిత సర్వాశ శ్శాంతఃక్వాపి న సజ్జతే ॥ 2**

కంటికి కనుపించేదంతా పరమేశ్వరుడిచేత సృష్టించబడింది. జగత్తులో ఈశ్వరుడు తప్ప రెండవ వారు ఎవరూ లేరు. అనే విషయం తెలిసినవాడు కోరికలు నశించి పరమశాంతంగా ఉంటాడు. అతనికి కోరికలు, ప్రలోభాలు ఉండవు.

జగత్తులో ఉన్నది పరమేశ్వరుడొక్కడే. అతడు తప్ప రెండవ వారు లేరు. అతనికన్న ఎక్కువైన వారు కాని, అతనితో సమానమైన వారు గాని లేరు. కుమ్మరి వాడు మట్టిని బాగా కలిపి, త్రొక్కి దాంతో కుండలు, చట్టులు, బానలు, పిడతలు, మూకుళ్ళు ఇలా రకరకాల వస్తువులు తయారుచేస్తాడు. వస్తువు లేదా పాత్ర ఏదైనా, దాని రూపము నామము వేరు వేరైనా వాటిలో ఉన్న మట్టి ఒక్కటే. ఆభరణాలు వేరైనా వాటిలో ఉన్నది బంగారమే.

జగత్తు అంతా మనసు చేసే ఇంద్రజాలం. అందుకే దీన్నిభ్రాంతి, భ్రమ అంటారు. ఈ జగత్తంతా మనోసంకల్పంతోనే ఆవిర్భవిస్తున్నది. మనసులో ఆలోచనా తరంగాలు లేకపోతే వస్తు ప్రపంచం లేదు. ఈ విషయం తెలసినవాడు కోరతగినది, పొందతగినది ఏదీలేదు. అందుకే అతడు శాంతంగా నిద్రపోతాడు.

**ఆపదస్సంపదః కాలే దైవా దేవేతి నిశ్చయీ ।**
**తృప్తః స్వస్థేంద్రియో నిత్యం న వాంఛతి న శోచతి ॥ 3**

ప్రారబ్ధానుసారంగా కష్టాలు సుఖాలు అర్హమైన కాలంలో అనుభవానికి వస్తాయని నిశ్చయంగా తెలిసిన జ్ఞాని రాగద్వేషాలకు లోనుగాక, నిశ్చలమైన మనస్సుతో ప్రాప్తించిన ఫలితాన్ని స్వీకరించి, పరమశాంతంగా ఉంటాయి.

మన కర్మలు చేస్తున్నాం. మనం చేసిన కర్మలు ఫలితాన్నిస్తాయి. కర్మలు రెండురకాలు 1.వెంటనే ఫలితాన్నిచ్చేవి. 2.కొంత కాలం తరువాత ఫలితాన్నిచ్చేవి.

**1. వెంటనే ఫలితాన్నిచ్చేవి :** కొన్ని రకాల కర్మలు చేసిన వెంటనే ఫలితాన్నిస్తాయి. ఏ మాత్రము ఆలస్యం ఉండదు. నిప్పులో చెయ్యి పెట్టాం. వెంటనే కాలిబొబ్బ లెక్కుతుంది. నిప్పు బాగా వేడిగా ఉంటే చెయ్యి మాడి మసి అయిపోతుంది. కత్తితో దెబ్బ వేశాం. వెంటనే తలతెగి క్రింద పడుతుంది. కత్తితో పీక తెగ్గోశాం. నిమిషాల్లోనే ప్రాణం పోతుంది. మేడమీద నుంచి క్రిందకి దూకాం. కాళ్ళు విరుగుతాయి. ఇలాంటి కర్మలు ఆలస్యం లేకుండా ఫలితాన్నిస్తాయి.

**2. కొంతకాలం తరువాత ఫలితాన్నిచ్చేవి :** ఇవి మళ్ళీ రకాలుగా ఉంటాయి. 1.స్వల్పకాలం తరువాత ఫలితం ఇచ్చేవి. 2.దీర్ఘకాలం తరువాత ఫలితం ఇచ్చేవి.

**1.స్వల్పకాలం తరువాత ఫలితాన్నిచ్చేవి :** చెడిపోయిన పదార్థాలు. అరగని పదార్థాలు, తినకూడని పదార్థాలు తిన్నాం. వీటిని తిన్నప్పుడు ఏంకాదు. ఒకగంట, రెండు గంటలు, ఒకరోజు తరువాత వాంతులు, విరేచనాలు అవుతాయి. కడుపులో నొప్పి వస్తుంది.

**2.దీర్ఘకాలం తరువాత ఫలితాన్నిచ్చేవి :** సంతానం కోసం పుత్రకామేష్టి చేశాం. లేదా కృత్రిమ పద్ధతులలో వైద్యుల సాయంతో ప్రయత్నం చేశాం. సంతానం కలిగే సరికి తొమ్మిది నెలలు జరగాలి. శాశ్వత స్వర్గలోక నివాస సిద్ధ్యర్థం అగ్నిచయనం అనే యాగం చేశాం. మరణించిన తరువాత కాని స్వర్గలోకం రాదు. ఇలా కర్మ ఫలితం రావటానికి కొంతకాలం పడుతుంది. విత్తనాలు నాటగానే పంట పండదు.

కర్మ చెయ్యగానే కర్మఫలితము సూక్ష్మరూపంలో కర్త హృదయంలోకి చేరి అదృశ్యంగా ఉండి, అర్హమైన సమయం వచ్చినప్పుడు బయటకు వచ్చి కర్తకు ఫలితాన్నిస్తుంది. **దీన్నే అపూర్వము, అదృష్టము అంటారు.** ఏదనా పెద్ద ఆపద నుంచి బయట పడ్డప్పుడు 'అది వాడి అదృష్టం' అంటారు. అది అతడు గతంలో చేసిన సత్కర్మల ఫలితమన్న మాట. దాని మూలంగానే బ్రతికి బయటపడ్డాడు.

ఒకసారి కారు ప్రమాదం జరిగింది. కారులో ఆరుగురు వ్యక్తులు ఇద్దరు పురుషులు, ఇద్దరు స్త్రీలు, నాలుగు సంవత్సరాల పాప, మూడు నెలల పసిపాప ఉన్నారు. దారిలో మతిమీరిన వేగంతో కారు అదుపు తప్పింది. అనుకోని ప్రమాదం జరిగింది. డ్రైవరుతో సహా కారులో ప్రయాణం చేస్తున్న వారందరూ అక్కడికక్కడే మరణించారు. విచిత్రం ఏమంటే మూడు నెలల పసిపాప మాత్రం కారులోంచి ఎగిరి రోడ్డు ప్రక్కన ఉన్న గడ్డిమబ్బులలో పడింది. ఏ మాత్రం దెబ్బ తగలలా. ఆ పాప పసితనంలోనే తల్లిదండ్రులను కోల్పోయినందుకు దురదృష్టవంతురాలు అనాలా? బ్రతికి బయటపడ్డందుకు అదృష్టవంతురాలు అనాలా? ఏమైనా ఇది గత జన్మలలో చేసిన కర్మ ఫలితమే.

ఈ రకంగా చేసిన కర్మలఫలితాన్ని మానవుడు అనుభవిస్తాడు అని తెలిసిన జ్ఞాని రాగద్వేషాలకు లోనుకాడు. ప్రారబ్ధకర్మ ఎక్కుపెట్టి విడిచిన బాణం లాంటిది. దాన్ని ఆ పటం ఎవరివల్లా కాదు. బాణం వదిలిన వాడు కూడా దాన్ని ఆపలేడు.

జ్ఞానంతో సంచితకర్మను నాశనం చెయ్యవచ్చు. అంతే కాని ప్రారబ్ధం మాత్రం అనుభవించి తీరాలి. అందుకే జ్ఞానియైన వాడు కర్మఫలాన్ని నవ్వుతూ అనుభవిస్తాడు. ఒకవేళ అనుభవించకుండా దాన్నుంచి తప్పుకుంటే ఆ కర్మఫలం అనుభవించటానికి మళ్ళీ జన్మించవలసి వస్తుంది.

పూర్వకాలంలో ఒక పండితుడు, మహాజ్ఞాని ఉండేవాడు. ఆయన అనేకమంది విద్యాదానం చేశాడు చేస్తున్నాడు. ఆయనకు కర్మవశాన కుష్టువ్యాధి వచ్చింది. ఆయన శిష్యులు చాలా బాధపడ్డారు. వారిలో ఒకడు ఇంద్రుణ్ణి గురించి తీవ్రమైన తపస్సు చేసి గురువుగారి కుష్టు రోగాన్ని పోగొట్టాడు. అతడు ఆశ్రమానికి తిరిగి వచ్చేసరికి గురువుగారు ఆరోగ్యంగా తిరుగుతున్నారు. అతడు మహదానంతో తాను తపస్సు చేసిన విషయం గురువు గారికి చెప్పాడు. గురువుగారు తీవ్రమైన కోపంతో 'ఎంత పని చేశావురా! ఇది నా కర్మఫలం. ఈ జన్మలో అనుభవించాలి. ఇప్పుడు అనుభవించ లేదంటే దీని కోసం మళ్ళీ జన్మించాలి. కాబట్టి వెంటనే వెళ్ళి ఇంద్రుణ్ణి ప్రార్థించి నా కుష్టురోగం నాకు తిరిగి వచ్చేట్లుగా చెయ్యి' అని మళ్ళీ తన రోగాన్ని తాను తెప్పించుకున్నాడు.

ప్రారబ్ధం ఈ జన్మలోనే అనుభవించాలి అని తెలిసిన జ్ఞాని నిశ్చలమైన మనస్సుతో, తనకు వచ్చిన కష్టాలు, దుఃఖాలు భగవత్ప్రసాదంగా స్వీకరించి అనుభవిస్తూ పరమశాంతంగా జీవిస్తాడు.

ఏ రకమైన కోరికలు లేక, సుఖదుఃఖాలు, రాగద్వేషాలు మొదలైన ద్వంద్వాలను త్యజించిన మానవుడు అమరుడయి తానే పరబ్రహ్మాను అని తెలుసుకుంటాడు.

**సుఖదుఃఖే జన్మమృత్యూ దైవాదేవేతి నిశ్చయీ ।**
**సాధ్యాదర్శీ నిరాయాసః కుర్వన్నపి న లిప్యతే ॥** **4**

సుఖదుఃఖాలు, జనన మరణాలు గతజన్మ కర్మఫలితాలని తెలిసిన జ్ఞాని లౌకికమైన భోగాలను కోరదు. బాధ్యతల నుండి, కోరికల నుండి విముక్తుడవుతాడు. నిష్కామ్య కర్మలు చేస్తాడు కాబట్టి బంధాలుండవు. గతంలో చెప్పినట్లుగా కర్మ మూడు విధాలు. 1.సంచితకర్మ 2.ప్రారబ్ధకర్మ 3.ఆగామికర్మ

ప్రతిజన్మలోను చేసిన కర్మంతా ఒకచోట చేరి పెద్దరాసిగా తయారవుతుంది. దాన్నే సంచితకర్మ అంటారు. మానవుడు చేసిన కర్మంతా వచ్చి దీంతో కలుస్తుంటుంది. కాబట్టి పెద్ద కొండలాగా పెరుగుతూ ఉంటుంది. ఇందులో నుంచి కొంత భాగాన్ని ఒక్కొక్క జన్మలో అనుభవిస్తాడు. మానవుడు తాను అనుభవించాల్సిన కర్మ ననుసరించే అతడికి శరీరాదులు ఏర్పడతాయి. అతడు ఉత్తమకర్మ చేస్తే ఉత్తమ వంశంలో జన్మిస్తాడు. పాపపుకర్మ చేస్తే నీచుడుగా జన్మిస్తాడు. నీచమైన కర్మ చేసినవారు పశుపక్ష్యాదులుగా, అంతకన్నా హేయమైన కర్మచేసిన వారు క్రిమికీటకాలుగా పుడుతూ చస్తూ ఉంటారు. ఇక్కడ మాతృగర్భం నుంచి జన్మించటమనేది సామాన్యమైన విషయం కాదు. గర్భంలో తొమ్మిది మాసాలు తల క్రిందులుగానే వ్రేలాడాలి. ఆకలి వేస్తే ఏడవటానికి లేదు. దాహం వేస్తే అడగటానికి లేదు. తల్లి తీసుకున్న ఆహారమే తాను గ్రహించాలి. తొమ్మిది నెలల తరువాత భూమిమీదకి రావాలి. అలా రావటానికి ఏ రాజమార్గము ఉండదు. యోని ద్వారం చిన్నగా ఉంటుంది. ఇరుకుగా ఉంటుంది. అందులో నుంచే బయటకురావాలి. బయటకు వచ్చిన తరువాత బాలారిష్టాలు, ఆ తరువాత విద్యాభ్యాసము, వివాహము. సంతానము కుటుంబపోషణ. ఇలా జీవితమంతా కష్టాలే. పోనీ మరణమన్నా సుఖంగా ఉంటుందా అంటే అదీ ఉండదు. అవసాన కాలం సమీపించినా, ఆయువు తీరినా, జీవి ఈ శరీరాన్ని వదలటానికి ఇష్టపడడు. చివరకు శరీరం నుంచి గెంటి వేయబడతాడు. జన్మించాలి అంటే ఏదో ఒక శరీరం కావాలి. తాను అనుభవించవలసిన కర్మఫలితం వల్లనే ఈ శరీరము ఏర్పడుతుంది. ఒకేచోట పుట్టిన వారందరూ ఒకే రకంగా ఉంటారని చెప్పటానికి లేదు. ఎవరి కర్మ వారిది. ఎవరి అదృష్టం వారిది. ఈ జన్మలో మానవులుగా జన్మించాము అంటే గతజన్మలో చేసిన కర్మే దానికి కారణం. అలాగే మనం అనుభవించే కష్టాలు, సుఖాలు వీటికి కూడా గతజన్మలలో చేసిన కర్మఫలమే కారణం.

ఒక పండితుడికి కొడుకు పుట్టాడు. కాలం గడుస్తోంది. కాని అందరికి మల్లే ఆరోగ్యంగా లేడు. ఆ పిల్లవాడు మాటలు కూడా సరిగా రావు. పిచ్చిచూపులు చూస్తుంటాడు. ఆకలి వేస్తే తినాలి అని కూడా సరిగా తెలియదు. వాడు కట్టుకునే బట్టల దగ్గర నుంచీ ఎవరైనా చూడాల్సిందే. పండితుడు చాలా బాధ పడేవాడు. ఉన్న ఒక్కగానొక్క కొడుకు ఇలా అయిపోయాడేమిటి? ఆ పిల్లవాణ్ణి తీసుకుని తిరగని

క్షేత్రం గాని, ఆడని తీర్థం గాని లేవు. కనుపించిన పెద్దవారందరి దగ్గరకీ వెళ్ళాడు. పిల్లవాడు అలా ఉండటానికి కారణం తెలియలేదు. నివారణ అంతకాన్న రాలేదు. ఒకసారి ఒక స్వామివారు ఆ ఊరు వచ్చారు. యథాప్రకారం పండితుడు పిల్లవాణ్ణి తీసుకుని స్వామివారి దగ్గరకు వెళ్ళాడు. తన కుమారుడు ఇలా ఉండటానికి కారణం ఏమిటి? నివారణోపాయం ఏమిటి? అని అడిగాడు. స్వామివారు కొద్దిసేపు మౌనం వహించి "నాయనా! గతజన్మలో కూడా నువ్వు చాలా గొప్ప పండితుడివి. బాగా ధనవంతుడివి కూడా. నీ వ్యవహారాలతో ఎప్పుడు తీరుబడి లేకుండా తిరుగుతుండే వాడివి. నీ తండ్రికి వృద్ధాప్యం వచ్చింది. దాంతోపాటు ఆరోగ్యం కూడా దెబ్బ తిన్నది. అయినా సరే నువు ఏ మాత్రము ఆయన గురించి ఆలోచించలేదు. ఆయన లేవలేని స్థితిలో, కదలలేని స్థితిలో ఉన్నప్పటికీ, ఆయన్ని గురించి పట్టించుకునే వాడివి కాదు కదా, కనీసం పలకరించే వాడివి కూడా కాదు. నువ్వు ఎప్పుడు కనుపిస్తావా అని నీ తండ్రి ఎదురు చూసేవాడు. నువు కనీసం పలకరించే వాడివి కూడా కాదు. ఆ స్థితిలో ఆయనకు నీమీద బాగా కోపం వచ్చేది. ఏమీ చెయ్యలేక లోలోపలే బాధ పడుతూ అలాగే కాలం చేశాడు. ఈ జన్మలో ఆయనే నీ కుమారుడుగా జన్మించాడు. ఓ పండితోత్తమా ! ఇదంతా నీ నిర్వాకమే. అప్పుడు గనక నీ విధి నువ్వు నిర్వర్తించి ఉంటే ఈ పరిస్థితి వచ్చేది కాదు. ఇప్పుడు చెయ్యగలిగింది ఏమీలేదు. **ఋణానుబంధరూపేణ పశుపత్ని సుతాదయా** ఋణం తీరేదాకా నువ్వు ఇలా భరించాల్సిందే." అన్నాడు. కాబట్టి ఈ జన్మలో మనం అనుభవించే సుఖదుః ఖాలకు కారణం గతజన్మలలో మనం చేసిన కర్మఫలమే.

మొత్తంమీద మనం పశువుగా పుట్టినా, పక్షిగా ఉట్టినా, మనిషిగా జన్మించినా, అంతా ప్రారబ్ధమే. మనిషిగా పుట్టినంత మాత్రాన మనం ఉత్తములం అని కాదు. శరీర అవయవాలన్నీ సరిగా ఉండాలి. విద్యాబుద్ధులు, సంస్కారం ఉండాలి. సంఘంలో గౌరవం అధికారం, ధనం ఇవన్నీ ఉండాలంటే గతజన్మల కర్మఫలం బాగా ఉండాలి. అలాగే గతజన్మలలో పుణ్యకార్యాలు, ధర్మకార్యాలు చేసినవారు ఈ జన్మలో ధనధాన్యాలు, సిరిసంపదలు, భోగభాగ్యాలు అనుభవిస్తారు. అదే దుష్కర్మలు చేసిన వారికి ఇవన్నీ ఉండవు. ఈ విషయాలు తెలిసిన జ్ఞాని తాను అనుభవిస్తున్న వన్నీ కర్మానుసారం వచ్చినవి అని క్షుణ్ణంగా తెలుసుకుని ఏ ఆలోచనా లేకుండా

వాటిని అనుభవిస్తాడు. లౌకిక సుఖాలు, విషయభోగాలు కోరడు. అతడికి ఏ రకమైన కోరికలు ఉండవు.

ఇతడు జ్ఞాని. ఎప్పుడూ కర్మ చెయ్యడు. అతడికి ఆగామి కర్మ అంటే ఈ జన్మలో చేసిన కర్మ ఉండదు. అయితే ఇక్కడ ఒక చిన్నచిక్కు వస్తుంది. ఇలాంటి జ్ఞానులను, గురువులను సామాన్యులు ఆదర్శంగా తీసుకుంటారు. వారు చేసే పనులు వీరు కూడా చెయ్యటానికి ప్రయత్నిస్తారు. కొన్నిసార్లు చేస్తారు కూడా. జ్ఞాని కర్మ చెయ్యడు అన్నాం. సామాన్య మానవుడు ఈ జ్ఞానిని ఆదర్శంగా తీసుకుని 'ఆయన కర్మ చెయ్యడు కదా? మరి నేను మాత్రం ఎందుకు చెయ్యాలి? అని కర్మలు చెయ్యటం మానేస్తాడు. ఇది మంచి పద్ధతి కాదు. జ్ఞానికి కర్మ అవసరం లేదు. సామాన్యుడు మాత్రం కర్మచేసి తీరాలి. ఇతడు కూడా జ్ఞానసముపార్జన చేసేదాకా కర్మలు చెయ్యాలి. ఈ కారణంచేత జ్ఞాని వంటరిగా ఉన్నప్పుడు కర్మలు చెయ్యనవసరం లేదు. అజ్ఞానుల దగ్గర ఉన్నప్పుడు తాను కూడా వారితో కలసి కర్మ చెయ్యాలి. ఆ కర్మ నిష్కామ్యంగా ఉండాలి. అందుకే జ్ఞానికర్మలు చేసినప్పటికీ, అతడికి కోరికలు ఉండవు కాబట్టి బంధాలు కూడా ఉండవు.

**చింతయా జాయతే దుఃఖం నాన్యథేహేతి నిశ్చయీ ।**
**తయాహీన స్సుఖీశాంత స్సర్వత్ర గళితస్స్పృహః ॥ 5**

మన ఆతృతే మనకు దుఃఖాన్ని కలిగిస్తుంది. ఈ విషయం తెలిసిన జ్ఞాని ఆతృతే లేకుండా, కోరికలు లేని స్థితిలో నిష్కాముడై ప్రశాంతంగా ఉంటాడు.

మనస్సులోని కోరికల వల్లనే దుఃఖాలు వస్తాయి. కోరికలు దుఃకానికి హేతువులు. ఈ విషయాన్ని చాలాసార్లు చెప్పుకున్నాం. ఇప్పుడు అదెలాగో చూద్దాం. రాగము అంటే అనురాగము. అభిమానము, ఇష్టము, ప్రేమ, కోరిక, ఒక వ్యక్తి యందు కాని, ఒక వస్తువునందు కాని ఇష్టత ఏర్పడితే, అది మనకు కావాలి అనిపిస్తుంది. అది దక్కితే సరే. లేకపోతే దానిమీద కోరిక ఇంకా పెరుగుతుంది. అది విపరీతమైన వాంఛగా పరిణమిస్తుంది. ఆ కోరిక తీరేదాకా నిద్ర పట్టదు. ఆకలి దప్పికలు ఉండవు. ఆ కోరిక తీరకపోతే మన దగ్గర ఉన్నవన్నీ వృధా అనిపిస్తుంది. ఏమైనా సరే అది మనకు కావాలి అనిపిస్తుంది. దుసఖం వస్తుంది.

క్రమేణా ఈ రాగము ద్వేషంగా మారుతుంది. తాను ఆసించింది ఇంకొకరికి వచ్చింది అనుకోండి. మనకు తెలియకుండానే దాన్ని దక్కించుకున్న వారిపై ద్వేషం పెరుగుతుంది. నాకు దక్కనిది వేరెవరికీ దక్కకూడదు అనిపిస్తుంది. ఈ ద్వేషం అవతల వ్యక్తిని చంపేంత వరకు వెడుతుంది. మన పిల్లవాడు కె.జి చదువుతున్నాడు. మంచి విద్యార్థి. తరగతిలో ఇతడే ప్రథమశ్రేణిలో ఉంటాడు అనుకున్నాం. కాని ఒక మార్కు తేడాతో వేరే విద్యార్థికి ప్రథమశ్రేణి వచ్చింది. మనకు రాలేదని నిరాశ, అది ఇంకొకరికి వచ్చిందని బాధ. ఈ రెండూ కలిసి మనల్ని ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. కోపం, దుఃఖం, బాధ అన్నీ ఒక్కసారి చుట్టుముడతాయి. వీటన్నింటికీ కారణం మన కోరిక తీరకపోవటం. అందుకే **చింతయాజాయతే దుఃఖం** చింతించటం వల్ల దుఃఖం కలుగుతుంది. దుఃఖమనేది కేవలం కోరికలు తీరకపోవటం చేతనే కాదు. ఏదైనా విషయాన్ని గురించి ఎక్కువగా ఆలోచించటం వల్ల కూడా కలుగుతుంది. గతంలో మనకు ఎదురైన కష్టాలు, బాధలు, ఆశించినవి పొందలేకపోవటం. ఇష్టమైన వారు దూరం కావటం. ఇలాంటి విషయాలను గురించి ఆలోచించినా, మనసుకు బాధ, దుఃఖము కలుగుతాయి. ఈ విషయం నిశ్చయంగా తెలిసిన జ్ఞాని వాటిని గురించి ఆలోచించడు. నీకు ఆనందాన్నిచ్చే విషయాలను ఒకటికి పదిసార్లు గుర్తు తెచ్చుకో. ఆనందం కలుగుతుంది. కాని బాధ పెట్టే విషయాలను ఎంత ఎక్కువగా ఆలోచిస్తే, బాధ అంత ఎక్కువ అవుతుంది. జ్ఞాని సుఖదుఃఖాలకు అతీతుడు. అతడికి అన్ని విషయాలు తెలుసు. కాబట్టి ఈ విషయాలను గురించి ఆలోచించకుండా, ఏ కోరికలు లేనివాడై, నిష్కాముడై శాంతంగా జీవిస్తాడు.

**నాహందేహో న మే దేహః బోధో౽హమితి నిశ్చయీ ।**
**కైవల్యమివ సంప్రాప్తః న స్మరత్యకృతం కృతమ్ ॥ 6**

ఈ దేహం నేను కాదు. ఈ దేహం నాది కాదు నేను శుద్ధ చైతన్యాన్ని. ఈ విషయం నిశ్చయంగా తెలిసిన జ్ఞాని, గతంలో తాను చేసినవి, చెయ్యనివి గుర్తించడు. వాటిని తలవను కూడా తలవడు. కేవలము నేను మాత్రమే ఉన్నాను అని భావిస్తాడు.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఒక కథ ఉంది.

పూర్వకాలంలో ప్రజాపతి ఇంద్రుడికి ఆత్మతత్త్వాన్ని వివరించాడు.

పూర్వకాలంలో ఒకసారి ప్రజాపతి ఆత్మతత్త్వాన్ని గురించి ఒక ప్రకటన చేశాడు.

“ఆత్మకు పాపం అంటదు. ముసలితనం రాదు. మృత్యువు దాన్ని కబళించదు. శోకం తాకదు. దానికి ఆకలి దప్పికలు లేవు. మానవుడు సత్యకాముడు, సత్య సంకల్పుడు అయి ఆత్మజిజ్ఞాసను అలవరచుకోవాలి. ఆత్మకోసం అన్వేషించినవాడు, ఆత్మను అనుభవించినవాడు ఆత్మస్వరూపాన్ని పొందుతాడు. పూర్ణస్థితి అతనికి వస్తుందన్నమాట.”

దేవతలు, రాక్షసులుకూడా ఆ మాటలు విన్నారు. “ఆత్మను గురించి మనంకూడా అన్వేషిద్దాం. ఆత్మవల్ల అన్ని కోరికలు తీరతాయని బ్రహ్మచెప్పాడు కదా!” అని వారు భావించారు.

దేవతలరాజు ఇంద్రుడు, రాక్షసుల రాజు విరోచనుడు ఇద్దరూ ఆత్మజ్ఞానం సంపాదిద్దామని చేతితో దర్భలు పట్టుకుని బ్రహ్మవద్దకు వెళ్ళారు. బ్రహ్మ వీరిద్దరినీ ముప్పైరెండు సంవత్సరాలు, బ్రహ్మచర్యదీక్ష వహించమని చెప్పాడు. దీక్ష పూర్తి చేశారిద్దరూ.

“వత్సలారా ! మీరు నాకోసం దేనికి వచ్చారు?” అన్నాడు బ్రహ్మ.

“భగవాన్ ! ఆత్మ తత్త్వాన్ని గురించి చెప్పిన విషయాలు విన్నాం. ఆత్మను గురించి ప్రత్యక్షంగా తమ నోటిమీదుగా వినాలని వచ్చాం” అన్నారు. ఇంద్ర విరోచనులు.

“మనుష్యుల కనుపాపలలో మెదలుతూ కనుపించే పురుషుడే ఆత్మ. ఆత్మ అభయం. అమృతమయం. అదే బ్రహ్మం” అన్నాడు బ్రహ్మ.

అదివిన్నవారు “భగవాన్ ! నీటిలో కనుపించే ప్రతిబింబం, అద్దంలో కనిపించే ప్రతిబింబం. ఈ రెంటిలో ఏది ఆత్మరూపం?” అని అడిగారు.

“నేను మొదటగా కళ్ళలో మెరిసే ఏపురుషుని వర్ణన చేశానో వీటన్నింటిలోనూ ప్రతిఫలించేది ఆ పురుషుడే. ఒకసారి నీళ్ళలోను, అద్దంలోను మీ రూపాలు చూసుకుని మీ అనుభవాలు నాకు చెప్పండి” అన్నాడు బ్రహ్మ. ఇంద్ర విరోచను లిద్దరూ అలాగే చేసి ప్రజాపతి దగ్గరకు వెళ్ళారు. ప్రజాపతి వీరిని చూసి “మీరు ఏం చూశారు.” అన్నాడు.

"నఖశిఖ పర్యంతము కేశపాశాలతో మా శరీరాల ప్రతిరూపమే మాకు నీళ్ళలోనూ, అద్దంలోనూ కూడా కనిపించింది" అన్నారు వారు.

"నాయనలారా ! శరీరాలు శుభ్రపరచుకుని, మంచి వస్త్రాలు ఆభరణాలు ధరించి నీటిలో మీ ముఖాన్ని చూసుకోండి. తరువాత ఏం చేశారో నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ 'అలాగే' అని చెప్పి ఇద్దరూ వెళ్ళిపోయారు. మరునాడు తిరిగి వచ్చి "స్వామీ ! ఈ చక్కని వస్త్రాలతో ఆభరణాలతో అలంకరించిన మా శరీరాలే నీటిలో కనిపించాయి" అన్నారు.

"అభయమూ, అమృతమయమూ అయిన ఆత్మ అదే. అదే బ్రహ్మము" అన్నాడు ప్రజాపతి

అదివిన్న ఇంద్ర విరోచనులు ఆత్మను గురించి తమకు అంతా తెలిసిందనుకుని తిరిగి వెళ్ళిపోయారు. అలా వెళ్ళిపోతున్నవారిని చూసి" అసలు ఆత్మజ్ఞానం లభించకుండానే వారు తెలిసింది అనుకుని వెళ్ళిపోతున్నారు. వారు దేవతలైనా, రాక్షసులైనా **శరీరాన్నే ఆత్మ అని భావించటం పతన హేతువు"** అనుకున్నాడు.

విరోచనుడు ఆత్మని గురించిన ఈ సిద్ధాంతంతోనే తృప్తి చెంది, రాక్షస జాతి కంతటికీ ఈ సిద్ధాంతాన్నే బోధించాడు. అసలైన పరమసత్యం తనకు లభించిందని తృప్తి చెందాడు. దేహమే ఆత్మ అని ప్రచారం చేశాడు.

ఇంద్రుడు దేవలోకానికి బయలుదేరాడు. దారిలో తాను నేర్చుకున్న దానిలో ఏదో లోపం కనిపించింది. తను నేర్చుకున్న సిద్ధాంతాన్ని ఒకసారి సమీక్షించుకున్నాడు. విషయాన్ని విమర్శచేసి చూశాడు. బాగా అలంకరించుకుంటే అలంకరించినట్లు, మంచి వస్త్రాలు ధరిస్తే ధరించినట్లు, కుంటివాడైతే కుంటివాడిలాగా, గ్రుడ్డివాడైతే గ్రుడ్డివాడిలాగా శరీర ప్రతిబింబం కనిపిస్తుంది. మరణానంతరం శరీరం లేనప్పుడు ఆత్మ ఏమౌతుంది. మృత్యువువాత పడే ఈ శరీరాన్ని అమృతమయమగు ఆత్మ అనటంలో అర్థంలేదు. ఇంద్రుడి సంశయాలు తీరలేదు. సంతృప్తి లభించలేదు. వెనక్కి తిరిగి ప్రజాపతి దగ్గరకు వెళ్ళి నుంచున్నాడు.

తిరిగి వచ్చిన ఇంద్రుణ్ణి చూసి ప్రజాపతి "ఇంద్రా! నువు విరోచనుడితో వెళ్ళిపోయావు కదా! మళ్ళీ ఎందుకు తిరిగి వచ్చావు?" అని అడిగాడు.

ఇంద్రుడు తన అనుమానాలన్నీ వివరించాడు "ప్రభూ! శరీరంలోగాని, శరీరచ్ఛాయలో గాని నాకు ఏమీ విశేషం కనబడలేదు. అందుకని గతంలో నేర్చుకున్నది తృప్తిని కలిగించలేదు. ఆత్మజ్ఞానాన్ని మీవద్ద అభ్యసించాలని మళ్ళీ వచ్చాను" అన్నాడు.

ఇంద్రుడి జిజ్ఞాసకు ఆనందించాడు బ్రహ్మ. ఇంద్రుణ్ణి మళ్ళీ ముప్ఫై రెండు సంవత్సరాలు బ్రహ్మచర్యదీక్ష పాటించమన్నాడు. ఇంద్రుడు దీక్షతో బ్రహ్మవద్దనే గడిపాడు. దీక్ష పూర్తి అయిన తరువాత ప్రజాపతి ఇంద్రుడితో "స్వప్న ప్రపంచంలో ప్రభువులాగా స్వేచ్ఛగా విహరించే చైతన్యమే ఆత్మ" అన్నాడు.

ఈ మాటలతో ఇంద్రుడు తృప్తిపడి తిరిగి వెళ్ళిపోవటానికి బయలుదేరాడు. అలా వెడుతుంటే త్రోవలో మళ్ళీ అనుమానం వచ్చింది. "స్వప్నాలు అనుభవించే చైతన్యమే ఆత్మ ఎలా అవుతుంది. మనకు ఒక్కొక్కసారి కలలో ఎవరో పీడిస్తున్నట్లు అనిపిస్తుంది. మనం దుఃఖిస్తాము. పాపరహితము, అభయము అయిన ఆత్మ ఈ రకంగా దుఃఖించటంలో అర్థం లేదు. ఇది సత్యంకాదు." అనిపించింది. మళ్ళీ తిరిగి వచ్చాడు ఇంద్రుడు. ప్రజాపతి ఆదేశం మేరకు మళ్ళీ కొన్ని సంవత్సరాలు బ్రహ్మచర్య దీక్ష గడిపాడు. అప్పుడు ప్రజాపతి ఇంద్రుడితో ఈ విధంగా చెప్పాడు. "గాఢసుషుప్తిలో సంతృప్తిగా ఆనందాన్ని అనుభవించేదే ఆత్మ."

ఇంద్రుడు ఈ మాట నిజమే అని నమ్మి దేవలోకానికి బయలుదేరాడు. మార్గమధ్యంలో ఇంద్రుడికి మళ్ళీ అనుమానం వచ్చింది. గాఢనిద్ర అనుభవిస్తున్నదే ఆత్మ అనుకుంటే ఆత్మ తనను తాను తెలుసుకోలేని స్థితిలో ఉంటుందన్నమాట. తనను గురించి తాను తెలుసుకోలేని అవ్యక్తతత్త్వం ప్రకాశవంతమైన ఆత్మ ఎలా అవుతుంది? ఈ అనుమానంతో ఇంద్రుడు తిరిగి ప్రజాపతి దగ్గరకు వచ్చాడు. ఈ సారి ప్రజాపతి ఇంద్రుణ్ణి కేవలం ఐదు సంవత్సరాలు తనదగ్గర బ్రహ్మచర్య దీక్షతో ఉండమన్నాడు.

గడువు పూర్తయిన తరువాత ఇంద్రుడి పట్టుదలకు మెచ్చి ఆత్మతత్త్వాన్ని పూర్తిగా వివరించాడు.

నేను అంటే దేహం కాదు. నేను అంటే ఆత్మ. అనే విషయాన్ని ఇంద్రుడికి వివరించాడు ప్రజాపతి.

కాబట్టి నేను అంటే దేహం కాదు. నేను అంటే ఆత్మ. శంకర భగవత్పాదుల వారు తమ **నిర్వాణషట్కం**లో చెప్పినట్లుగా

**మనోబుద్ధ్యహంకార చిత్తానినాహం**
**నశ్రోత్రం న జిహ్వా నచఘ్రాణ నేత్రే**
**నచవ్యోమభూమి ర్నతేజోనవాయుః**
**చిదానంద రూపశ్శివోహం శ్శివోహం ॥**

మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే అంతఃకరణ నేను కాదు. కన్నులు, చెవులు, ముక్కు, నాలుక, చర్మము అనే జ్ఞానేంద్రియాలు నేను కాదు. ఆకాశము, వాయువు, నిప్పు, నీరు, భూమి నేను కాదు. చిదానందరూపమైన పరమేశ్వరుడను నేను.

ఈ విషయాలు స్పష్టంగా తెలిసిన జ్ఞాని గతంలో జరిగిన వాటిని గురించి ఆలోచించడు. నేను మాత్రమే రాగద్వేషాలు, అహంకార మమకారాలు లేకుండా కేవలుడుగా ఉన్నాను. అని తెలుసుకుంటాడు.

**ఆబ్రహ్మస్తంబపర్యంత మహమేవేతి నిశ్చయీ ।**
**నిర్వికల్పశ్శుచిశ్శాంతః ప్రాప్తాప్రాప్త వినిర్వృతః ॥** **7**

పిపీలికాది బ్రహ్మ పర్యంతము జగత్తంతా నేనే ఆవరించి ఉన్నది. ఈ విషయం నిశ్చయంగా తెలిసిన వాడికి ఏ రకమైన భావోద్రేకాలు ఉండవు. అన్ని రకాల సంకల్ప వికల్పాల నుండి విముక్తుడై, నిర్వికల్పుడై శాంతంగా ఉంటాడు.

పరమేశ్వరుడు సర్వవ్యాపి. పిపీలికాది బ్రహ్మపర్యంతము జగత్తంతా ఆవరించి ఉన్నాడు. **ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పినట్లుగా దశదిశలు పరబ్రహ్మ స్వరూపమే. నదీనదాలు, అడవులు, కొండలు, పర్వతాలు, లోయలు, సముద్రాలు, ఎడారులు అన్నీ పరబ్రహ్మ స్వరూపమే. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు అన్నీ పరబ్రహ్మ స్వరూపమే. ప్రాణం బ్రహ్మ. శ్రవణం బ్రహ్మ. దృష్టి బ్రహ్మ అన్నీ బ్రహ్మమే. ఏ తత్త్వమైతే జగత్తంతా వ్యాపించి ఉన్నదో అదే పరబ్రహ్మ స్వరూపము.

**ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఈ జగత్తంతా సృష్టించిన తరువాత మానవుణ్ణి సృష్టించాడు పరమేశ్వరుడు. ఇప్పుడు ఈ మనిషిలో నేను లేకపోతే

ఎలాగ? అనుకున్నవాడై బ్రహ్మరంధ్రం ద్వారా ఈ శరీరంలో ప్రవేవించాడు. అలా ప్రవేశించి ఇంద్రియాలతో లౌకికమైన అన్ని సుఖాలు అనుభవిస్తూ 'నేను అంటే ఆత్మను' అనే భావం మరిచిపోయి నేను అంటే దేహము అని భావన చేసి, తాను వచ్చిన దారి కూడా మరిచిపోయి నవరంధ్రాలతో ఏర్పడిన ఈ దేహంలో పంజరంలో బంధింపబడిన పక్షిలాగా బందీ అయిపోయాడు. శరీరంలో ప్రవేశించటానికి రెండు మార్గాలున్నాయి. ఒకటి పై నుంచి రెండవది క్రింద నుంచి, మానవ శరీరంలో బ్రహ్మరంధ్రం ద్వారా ప్రవేశించాడు. అదే జంతువులతో క్రింద నుంచి ప్రవేశించాడని చెబుతున్నాయి ఉపనిషత్తులు. **బృహదారణ్యకోపనిషత్తు**లో పరమేశ్వరుడు సర్వాంతర్యామి. అన్నింటియందు ఉన్నాడు. ఆకాశంలో అత్యంతమైన వేడి నిచ్చే సూర్యునిలో ఉన్నాడు. సూర్యుడు అతణ్ణెరుగడు. సూర్యుడే అతని శరీరం. సూర్యునిలో ఉంటూ ఆ సూర్యుణ్ణి నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ. చంద్రునిలో ఉంటాడు. కాని చంద్రుడుఅతణ్ణెరగడు. చంద్రుడే అతని శరీరం. చంద్రునిలో ఉంటూనే చంద్రుణ్ణి నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ. నక్షత్రాలలో ఉంటాడు. నక్షత్రాలు అతణ్ణెరగవు. నక్షత్రాలే అతని శరీరం. నక్షత్రాలలో ఉంటూనే నక్షత్రాలను నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ. ఈ రకంగా భూమిలో, పంచభూతాలలో, నదులు, సముద్రాలు ఒకటేమిటి చరాచర జగత్తంతా అంతర్లీనంగా ఉంటూ, జగత్తంతటనూ నియంత్రిస్తుంటాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ అని చెప్పబడింది. **సుబాలోపనిషత్తు**లో కూడా ఈ విషయం చెప్పబడింది. **కేనోపనిషత్తు**లో కంటికి చూసే శక్తినిచ్చేది ఆత్మ. చెవికి వినికిడి శక్తిని, ముక్కుకు వాసన చూసే శక్తిని, నాలుకకు రుచి చూసే శక్తిని, చర్మానికి స్పర్శశక్తిని ఇచ్చేది ఆత్మ. అంటే వీటన్నింటి యందు ఉండి వీటిని నడిపించేది ఆత్మ అని చెప్పబడింది.

పరమేశ్వరుడు కొన్ని కోట్ల సూర్యులకాంతులతో, కొన్ని కోట్ల చంద్రుల చల్లదనంతో ప్రకాశిస్తున్నాడు. అతనికి ఆద్యంతాలు లేవు. చరాచర జగత్తంతా నిండి ఉన్నాడు. సూర్యుడు, చంద్రుడు, అగ్ని అందరూ పరమేశ్వరుని కాంతులతోనే ప్రకాశిస్తున్నారు.

ఈ రకంగా చరాచర జగత్తులో చలనమున్నవి. చలనము లేనివి, ప్రాణమున్నవి, ప్రాణం లేనివి. అన్నీ పరమేశ్వర స్వరూపమే. 84 లక్షల జీవరాసి పరమేశ్వర

స్వరూపమే అంటున్నాయి ఉపనిషత్తులు. ఈ విషయం తెలిసినవాడు, ఈ జగత్తులో పిపీలికాది బ్రహ్మ పర్యంతము తానే అయినవాడు పబ్రహ్మ. నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని నాకన్న వేరుగా ఈ జగత్తులో ఏదీలేదు. నేనే జగత్తు. జగత్తే నేను అనే విషయం తెలిసిన వాడికి భావోద్రేకాలుండవు. లౌకిక సుఖాల గురించి ఆలోచించడు. తాను తప్ప ఈ జగత్తులో ఇంకేదీ లేదు కాబట్టి, ఇంక దేన్ని గురించే ఆలోచించవలసిన అవసరం లేదు. అందుకే అతడు భావోద్రేకాలకు లోను గాకుండా పరమశాంతంతో నిర్వికల్పమై ఉంటాడు.

**నానాశ్చర్యమిదం విశ్వం న కించిదితి నిశ్చయీ ।**
**నిర్వాసనస్ఫూర్తి మాత్రో న కించిదివ శామ్యతి ॥ 8**

నానాత్వంతో ప్రకాశించే ఈ జగత్తంతా కేవలము భ్రమ అని తెలుసుకున్న జ్ఞాని, సంకల్ప వికల్పాలు లేకుండా శాంతుడై జీవిస్తాడు.

ఈ జగత్తంతా నానాత్వంతో ప్రకాశిస్తోంది. చూసే వాడికి జగత్తు అంటే అనేకానేకమైన నామరూపాలతో కనుపిస్తుంది. జగత్తులో 84 లక్షల రకాలైన జీవరాసి కొన్ని లక్షల రకాల వృక్షజాతి, అడవులు, కొండలు, ఎడారులు వీటిలో ఒకదానితో ఒకదానికి సంబంధం ఉండదు. అలా కంటికి కనుపిస్తుంది. ఇదంతా భ్రమ. ఈ జగత్తంతా భ్రమ.

భ్రమ అంటే వస్తువు రూపాన్ని యథార్థం కన్న వేరుగా గ్రహించటం. భ్రమ రెండు రకాలుగా ఉంటుంది. **1.సంవాది భ్రమ2.అసంవాది భ్రమ.** ఇక్కడ ఒక చిన్న ఉదాహరణ. ఒక పెద్ద భవనంలో విడివిడిగా రెండు గదులున్నాయి. ఆ గదులలో నుంచి గొప్ప కాంతులు వస్తున్నాయి. ఆ కాంతులను ఇద్దరు వ్యక్తులు చూశారు. ఆ కాంతులు మణిప్రభలు అనుకున్నారు. ఆ గదులలో మణులు ఉన్నాయి అని భావించి వాటి కోసం పరుగులు తీశారు. ఇద్దరూ అక్కడ ఉన్నవి మణులే అని భ్రమించి, వాటి కోసం పరుగులెత్తారు. అందులో ఒకడికి నిజంగానే గదిలో మణి దొరికింది. అతడిది సంవాది భ్రమ. రెండవ గదిలో మణిలేదు. దీపపు కాంతి మాత్రమే ఉన్నది. అతడిది అసంవాది భ్రమ.

మణిని మణిగా భావించటం సంవాది భ్రమ.

దీపాన్ని మణిగా భావించటం అసంవాది భ్రమ.

సంవాది భ్రమ మళ్ళీ మూడు రకాలుగా ఉంటుంది.

**1. ప్రత్యక్ష సంవాది భ్రమ :** ఇందాకటి ఉదాహరణలో మణిని చూసి మణి అని భావించటం.

**2. అనుమాన సంవాది భ్రమ :** ఒకచోట నీటి ఆవిరి వస్తోంది. దాన్ని చూసి పొగ అనుకుని, అక్కడ నిప్పు ఉంటుంది అని భావించి, అక్కడికి వెళ్ళిన వాడికి విధివశాత్తు అక్కడ నిప్పు కనుపించింది. ఇది అనుమాన సంవాది భ్రమ.

**3. ఆగమ సంవాది భ్రమ :** చేసిన పాపాలు పోవటానికి గంగా జలంలో స్నానం చెయ్యాలి అనుకున్నాడు. కాని గోదావరిని చూసి గంగ అనుకుని అందులో స్నానం చేశాడు. అయితే గంగకున్న పవిత్రత గోదావరికి కూడా ఉంది. కాబట్టి అతడికి పాపప్రక్షాళన జరిగింది. ఇది ఆగమ సంవాది భ్రమ.

రావణుడు, హిరణ్యకశ్యపుడు, శిశిపాలుడు వంటివారు శ్రీమన్నారాయణుణ్ణి శత్రువుగా భావించి, ఆయననే స్మరిస్తూ ప్రాణాలు వదలి స్వర్గం చేరారు. ఇది కూడా ఆగమ సంవాది భ్రమే. ఏది ఏమైనా భ్రమ అనేది మిథ్యాజ్ఞానం కాబట్టి పనికి రాదు.

భ్రమను మళ్ళీ రెండు రకాలుగా విభజించవచ్చు. 1.నిరుపాధికభ్రమ 2.సోపాధిక భ్రమ.

కేవలము జ్ఞానం ఉత్పన్నమయ్యే భ్రమని నిరుపాధికి భ్రమ అంటారు. దర్పణంలోని ప్రతిబింబానికి సంబంధించిన భ్రమ. ఇది అజ్ఞానం వల్ల కలిగే భ్రమ. దీనిని సోపాధిక భ్రమ అంటారు. నిరుపాధిక భ్రమలో అధిష్ఠానానికి సంబంధించిన జ్ఞానం వల్ల కార్యంతోపాటు అజ్ఞానం కూడా నశిస్తుంది. జ్ఞానం కలగగానే కల్పిత రూపం ఉండదు. ఇది నిరుపాధిక భ్రమ లక్షణం. కాని సోపాధిక భ్రమలో ఆవరణ సహితంగా అజ్ఞానం నశిస్తుంది. కాని అజ్ఞానానికి ఉపాధి రూపమైన ప్రతిబంధ కారణంగా విక్షేప రూపమయిన కార్యంతో పాటు స్వరూపం యొక్క అభావం జరగదు. కాబట్టి అధిష్టానం మిగలకపోవటం, ఆరోపిత స్వరూపం ఉండక పోవటం జ్ఞానానికి లక్షణం కాదు. మిథ్యాత్వ నిశ్చయ రూపమైన జ్ఞానమే దాని లక్షణం.

వీటిలో తలక్రిందులుగా కనుపించే వ్యక్తి ఎక్కడా ఉండడు. ఒడ్డున ఉన్నవాడు జ్ఞాని అయినా, అజ్ఞాని అయినా అది నీడ మాత్రమే అని తెలుసుకుంటాడు. అంతేగాని నీటిలో తలక్రిందులుగా వ్యక్తి ఉన్నాడని నమ్మడు. అలాగే ఆత్మజ్ఞానం కలిగిన తరువాత, జ్ఞాని ఈ జగత్తును మిధ్య అని భావించినా, జగత్తు యొక్క ప్రతీతి మాత్రం జరుగుతూనే ఉంటుంది. అయితే జ్ఞాని ఈ ప్రతీతి ఇంద్రియాల వల్ల కలిగే భ్రాంతి అని తెలుసుకుని పట్టించుకోడు. జగత్తు సత్యము అని భావించేవాడు చేసే ఏ పనీ జ్ఞానంతో చెయ్యడు. అద్వైతుల దృష్టిలో ఆత్మ తప్ప అన్నీ మిథ్య. ఆత్మ తప్ప అన్నీ మిథ్య అని తెలుసుకోవటమే పురుషార్థము. ఇంతవరకు కుండ, మట్టి యొక్క వివర్తము (మార్పు) అని తెలియకపోవటం వల్ల కుండ సత్యము అనుకున్నాడు. ఎప్పుడైతే కుండ మట్టి యొక్క మార్పు, రూపాంతరము అని తెలిసిందో, అప్పుడు కుండ శాశ్వతము కాదు. సత్యం అంతకన్నా కాదు. అని తెలుసుకుంటాడు.

ఈ రకంగా నానాత్వంతో కనుపించే జగత్తంతా కేవలము భ్రమ అని తెలుసుకున్న వాడు, సంకల్ప వికల్పాలు పూర్తిగా వదలి శాంతంగా ఉంటాడు అని చెబుతున్నాడు అష్టావక్రుడు ఈ అధ్యాయంలో.

# అధ్యాయం-12

# ఆత్మ నిష్ఠ

ఈ అధ్యాయంలో 8 శ్లోకాలున్నాయి. వీటిలో ఆత్మ నిష్ఠను గురించి వివరిస్తున్నారు. అసలు ఆత్మనిష్ఠ అంటే ఏమిటో దాన్ని ఎలా సాధించాలో చూద్దాం.

మనస్సును, బుద్ధిని ఆత్మయందు లయం చెయ్యటమే ఆత్మనిష్ఠ అనబడుతుంది. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. జగత్తులో పరమేశ్వర స్వరూపాన్ని మించినది లేదు. ఉన్నది ఒకటే రెండవది లేదు. అదే ఆత్మ. నేను కూడా పరమేశ్వర స్వరూపాన్నే. అసలు నేనే పరమేశ్వరుణ్ణి. నాకన్న వేరుగా ఏదీ లేదు అని నిశ్చయంగా తెలుసుకోవటమే జ్ఞానం. తరువాత మనస్సును అశాంతికి గురిచేసే ఆలోచనలను పూర్తిగా వదలివేసి, శాంతస్వరూపమైన ఆత్మను దర్శించాలి. ఆలోచనలు వదలి పెట్టటమనేది చాలా కష్టమైనపని. అంతేకాని అసాధ్యం మాత్రం కాదు. విపరీతమైన కృషి గనక చేసినట్లైతే ఆలోచనలను అరికట్టగలుగుతాం. అహంకార మమకారాలను పూర్తిగా జయించాలి. మమకారం ఎంత బాగా వ్యాపిస్తే, ఆలోచనలు దుఃఖాలు కూడా అంతబాగా విస్తరిస్తాయి. దీనిఫలితం అశాంతి. అందుకని క్రమంగా దశలవారీగా, శాస్త్రజ్ఞానమాధారంగా, గురువుగారి పర్యవేక్షణలో మమత్వ పరిధిని తగ్గించాలి. అప్పుడు ఆలోచనలు వాటంతటవే తగ్గుతాయి. మనస్సు నిశ్చలం అవుతుంది. నిర్మలమైన మనస్సులో ఆత్మజ్యోతి ప్రకాశిస్తుంది. ముందుగా ఆత్మనిష్ఠ ఎలా సాధించాలో చూద్దాం.

**ఎలా సాధించాలి :** జగత్తంతా పరబ్రహ్మ స్వరూపం అని అర్థమయింది. జగత్తులో ఉన్నది ఆ పరబ్రహ్మ ఒక్కడే. అదే నేను. నేను తప్ప ఇంకేదీ లేదు. ఈ విషయాలు శాస్త్రాలు చదవటంద్వారా, గురూపదేశం ద్వారా, ప్రత్యక్షానుభవం ద్వారా తెలుసుకున్నాడు. ఇప్పుడు కర్మలు చేసినా, చెయ్యకపోయినా ఒకటే అని తెలిసింది. క్రమేణా కర్మలయందు విరక్తి కలిగింది. కర్మలు చెయ్యటం వల్ల మోక్షంరాదు. ఈ విషయం రూఢిగాతెలిసింది. జగత్తులోఉన్నది తానొక్కడే. తనుతప్ప ఇంకెవరూ లేరు. కాబట్టి ఇతరులతో మాట్లాడటం వ్యర్థం. ఇతరులతో మాట్లాడటము అంటే, తనలో తాను మాట్లాడుకున్నట్లే. ఎందుకంటే, జగత్తులోని ప్రతిజీవి పరబ్రహ్మస్వరూపమే.

తనలో తాను మాట్లాడుకోవటం పిచ్చివాడి చేష్ట. ఈ రకంగా శారీరక, వాచక, మానసిక కర్మలయందు సంపూర్ణంగా విముఖత గలగాలి. అలా కలిగి నేను ఆత్మస్థితుడనైనాను. ఆత్మనిష్ఠుడనైనాను అనే భావనకు రావాలి.

యోగవాసిష్టంలో చెప్పినట్లుగా "గతజన్మలలో చేసిన కర్మల ఫలితమే ఈ శరీరం. గతంలో ఉన్న వాసనలతో రూపుదాల్చి జీవుడైన అహంకారము మనస్సు, శరీరాల ద్వారా కర్మలు చేయిస్తుంది. ఇక్కడ జీవుడుఅంటే ఈశ్వరుని వ్యక్తస్వరూపమే. ఈశ్వరుడు ఆత్మ వేరు కావు. ఉన్నదంతాఒకటే అదే పరబ్రహ్మ" ఈ భావన కలిగినవాడు ఆత్మనిష్టుడవుతాడు. ఆత్మజ్ఞానసంపన్నుడు కావాలనుకున్నవాడు విషయ వాంఛలయందు ఆసక్తిని విడనాడాలి. అవి ప్రాణాపాయం కూడా కలగజేస్తాయి. దానికి ఉదాహరణగానే **"కురంగ, మతంగ, పతంగ, భృంగ, మీనాః"** కురంగము అంటే లేడి. సంగీతమంటే ఇష్టపడే లేడి, దాని కారణంగానే వేటకాడికి చిక్కి ప్రాణాలు కోల్పోతుంది. అలాగే ఆడఏనుగుస్పర్శను కోరిన మగఏనుగు, నిప్పును చూసి పండు అని భ్రమపడిన మిడత, తేనేకోసం వెళ్ళి తుమ్మెద, ఎరకోసం వెళ్ళిన చేప కూడా ప్రాణాలుకోల్పోతాయి. కాబట్టి శబ్దాదివిషయాలు నన్నుఆకర్షించటం లేదు. సంకల్పవికల్పాలకు కారణమయిన మనసును నాశనంచేశాను. మనోనాశనం జరిగింది. కాబట్టి మనస్సులో ఏ రకమైన ఆలోచనలు రావు. ఇలా సంకల్పం లేకుండా ఉన్న ఆత్మను నేనే అని భావిస్తాడు. ధ్యానము, సమాధి లాంటివి చెయ్యాలా? వద్దా ? ఇదీ అనుమానం. మనసులో ఆలోచనలు తరంగాలుగా లేస్తున్నప్పుడు మాత్రమే ధ్యానము సమాధి కావాలి. మనసులో ఆలోచనలే లేనప్పుడు ఇంకా ధ్యాన సమాధుల అవసరం లేదు. జగత్తంతా పరమేశ్వర స్వరూపమని తెలిసిన జ్ఞాని అంగీకరించవలసినది, నిరాకరించవలసినది ఏదీఉండదు. అతడికి సుఖ దుఃఖాలు ఉండవు. ప్రత్యేకంగా ఒక ఆశ్రమంలో ఉండటం, ధ్యానం, మనోనియమాలు ఇవన్నీ ఆత్మస్థితి నుంచి దూరం చేస్తాయి. ఈ విషయాలు తెలుసుకున్నవాడు అన్ని రకాల సంకల్పాలను విడిచి, ఆత్మనిష్ఠుడౌతాడు. సర్వానికీ తానేసాక్షి అని తెలుసుకున్న వాడికి కులాలు, మతాలు, ఆశ్రమ ధర్మాలు ఏవీలేవు. కర్మలు చెయ్యటమే కాదు వాటిని త్యజించటం కూడా అజ్ఞానమే. ఈ సత్యాన్ని గ్రహించి, నేను కర్మ చెయ్యాలని గాని, వద్దనిగాని భావించరాదు. ఆలోచనలు వదిలి, ఆత్మయందే స్థితుడు కావాలి. ఈ రకంగా భావనచేసినవాడు ఆత్మనిష్ఠుడవుతాడు.

ఈ అధ్యాయంలో 7 శ్లోకాలలో, ప్రతి శ్లోకం 2వ పాదం చివర **అహమేవాస్థితః** నేనే ఉంటున్నాను అని చెబుతున్నాడు జనక మహారాజు.

**కాయకృత్యా సహః పూర్వం తతో వాగ్విస్తరాసహః ।**

**అథ చింతా సహస్తస్మాదేవ మేవాహమాస్థితః ॥ 1**

ముందుగా శారీర కర్మలను వదలి, తరువాత వాగ్రూపమైన కర్మలను వదలి, ఆ తరువాత మానసిక కర్మలయందు పూర్తిగా విముఖత కలిగి, చివరకు నిర్వికల్పంగా నేను నేనుగా ఆత్మనిష్టుడనైనాను.

కర్మలు మూడు రకాలు. మనోవాక్కాయములు.

1. మనో – మనస్సుతో చేసేవి. జపతపాలు

2. వాక్కు – నోటితో చేసేవి. భజనలు, గానాలు

3. కాయము – శరీరముతో చేసేవి. పూజలు, యజ్ఞయాగాదులు

వీటిలో ముందుగా మూడవదాన్ని చూద్దాం.

3. శరీరముతో చేసే కర్మలు : యజ్ఞయాగాలు, హోమాలు, పూజలు, జాతరలు, ఉత్సవాలు మొ॥వి ఇవన్నీ కూడా సమాజ శ్రేయస్సు కోసం, కొన్ని సందర్భాలలో తన శ్రేయస్సుకోసం, ఇంకొన్ని సందర్భాలలో రెండింటి కోసం చెయ్యటం జరుగుతుంది. ముందుగా యజ్ఞాలు యాగాలు అన్నాం. ఈ రెండింటి మధ్యన ఉన్న తేడా ఏమిటి? 1.యజ్ఞము పారమార్థిక దృష్టితో, నిష్కామ్యంగా చేసేది. వీటిని చెయ్యటం వల్ల ఫలితం దేశానికి ప్రజలకు లభిస్తుంది. పూర్వ కాలంలో మునీశ్వరులు ఋషీశ్వరులు ఈ రకమైన యజ్ఞాలు చేసేవారు. ఆ యజ్ఞఫలం ఆ దేశాన్నిపాలించే రాజుకు, దేశప్రజలకు వస్తుంది. అందుకే యజ్ఞానికి కావలసిన సంచారాలన్నీ మహారాజు గారే సమకూర్చే వారు. దుష్టశక్తుల బారి నుండి యజ్ఞాన్ని రక్షించవలసిన బాధ్యత కూడా రాజుగారే స్వయంగా తీసుకునే వాడు. రామాయణంలో విశ్వామిత్రుడు దశరథుడి దగ్గరకు వచ్చి "రాజా ! నేను ఒక మహాయజ్ఞం చేస్తున్నాను. రాక్షసులు ఆ యజ్ఞానికి విఘాతం కలిగిస్తున్నారు. కాబట్టి నీ కుమారుడైన రాముణ్ణి యాగరక్షణ కోసం పంపవలసింది" అని రామలక్ష్మణులను వెంట పెట్టుకుని వెళ్ళాడు. విశ్వామిత్రుడు చేసిన ఆ యాగం దేశసౌభాగ్యం కోసమే.

2.యాగము : లౌకిక దృష్టితో ఫలితం ఆశించి చేసేది. ఇవి రెండు రకాలు.

**1.యజమాని కోరికలు తీరటానికి చేసేవి :**

**పుత్రకామేష్టి –** సంతానం కోసం చేసేది. దశరథుడు చేసిన యాగం ఇదే.

**రాజసూయము –** సార్వభౌమాధికారం కోసం చేసేది. భారతంలో ధర్మరాజు తన పితృదేవతలు స్వర్గం చేరటం కోసం ఈ యాగం చేశాడు.

**2. దేశ ప్రయోజనాల కోసం చేసేవి :**

**అశ్వమేథ యాగము :** ఆ దేశంలో బాగా వర్షాలు కురవాలని, పంటలు బాగా పండాలని, విద్వాంసులు వీరులు, శూరులు రణరంగ ధీరులైన మగపిల్లలు, అందగత్తెలు, ఆటపాటల యందు ప్రావీణ్యం గల మంచి బుద్ధిమంతులైన ఆడపిల్లలు కలగాలని, వేగంగా పరుగులెత్తే గుర్రాలు, బాగా ఎక్కువగా బరువులాగే ఎద్దులు పుట్టాలని, దేశం శుభిక్షంగా ఉండాలనే కోరికతో చేసేవి.

**3. ఇద్దరికీ మేలు కలగాలని చేసేవి –** యజమానికి, అతడు పాలించే దేశానికీ కూడా మేలు కలగాలని చేసే క్రతువులు. వాజపేయము వంటి క్రతువులతో రాజు చక్రవర్తిత్వాన్ని, సార్వభౌమత్వాన్ని పొందుతాడు. దేశం కూడా శుభిక్షంగా ఉంటుంది. ఈ రకంగా ఉభయత్రా ఉపయోగం ఉన్నవి.

**1.శారీరకాలు :**

ఈ రకంగా యజ్ఞయాగాది క్రతువులే కాకుండా ఉత్సవాలు, జాతరలు మొ॥వి. సామాన్యంగా ప్రతి గ్రామంలోను గ్రామదేవతకు జాతర నిర్వహిస్తారు. ఇది కూడా దేవత పూజ, అర్చనలో భాగమే. ఆలయంలో ఉత్సవాలు చేసేది ఎందుకంటే, అక్కడ ఉన్న దేవత శక్తి పెరగటానికి ఈ రోజున తిరుపతిలో అనేక రకాల ఉత్సవాలు ప్రతిక్షణం జరుగుతూనే ఉంటాయి. ఇవన్నీ భగవంతుడికి సేవలే. అర్చనా విధానంలో భాగాలు. శివాలయంలో అభిషేకాలు, అమ్మవారి ఆలయంలో చక్రార్చనలు, సహస్ర నామార్చన, పారాయణలు. వీటివల్ల ఆ దేవత శక్తి పెరుగుతుంది. తద్వారా సాధకుడి కోరికలు తీరతాయి. గ్రామదేవతలకు జరిపే జాతరలు, ఇచ్చే బలులు కూడా ఇలాంటివే. బలి అంటే ఆహారము నివేదన అని అర్థం. ఏదో ఒక జంతువును కూడా దేవతకు నివేదనగా సమర్పిస్తారు. ఇవన్నీ శారీరకంగా చేసేవి.

**2. వాక్కు ద్వారా చేసేవి –** భజనలు, గానాలు. ఇవన్నీ సామూహికంగా జరుగుతాయి. నామసంకీర్తన, భగవంతుని మాహాత్మ్యమాన్ని గానం చెయ్యటం.

**3.మనస్సు ద్వారా చేసేవి :** జపతపాలు. ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. జపానికి, తపానికి తేడా ఏమిటి? ఈ రెండూ కూడా సమాధి స్థితిలో కూర్చుని ధ్యేయ వస్తువు నందు మనసు నిల్పటం. తదేక దృష్టితో ధ్యానించటం. జపము అనేది గృహస్తు తన ఇంటిలో కూర్చుని చేసేది. ఇది కొద్దికాలమే సాగుతుంది. తపస్సు. నిర్మలమైన, నిశ్శబ్దమైన ప్రదేశంలో కూర్చుని ధ్యేయంపైనే దృష్టి నిల్పి, తదేక దృష్టితో నిర్వికల్ప సమాధిలో ఉండటం. ఈ రెండూ మానసికంగా చేసేవి.

ఆత్మనిష్ఠుడైన సాధకుడు మనోవాక్కాయ కర్మల యందు విముఖత కలిగి మనసును, బుద్ధిని ఆత్మ యందు లయం చేసి, ఆత్మనిష్ఠుడై కేవలుడుగా ఉండాలి. కేవలుడు అంటే రాగద్వేషాలు, అహంకార మమకారాలు, అరిషడ్వర్గాలు ఏవీ లేకుండా కేవలము తాను ఆత్మ స్వరూపం కావటం.

**ప్రీత్యభావేన శబ్దాదేరదృశ్యత్వేనచాత్మనః ।**
**విక్షేపైకాగ్రహృదయః ఏవమేవాహమాస్థితః ॥** **2**

శబ్దాది విషయాలేవీ నన్ను ఆకర్షించటం లేదు. నా మనస్సులో ఏ విధమైన ఆలోచనలు మొదలటం లేదు. సంకల్ప రహితంగా, కేవలము ఆత్మగా ఉన్నాను అంటున్నాడు జనక మహారాజు.

శబ్దాది విషయాలు నన్నుఏ మాత్రము ఆకర్షించటం లేదు అంటున్నాడు జనక మహారాజు. పంచభూతాల సూక్ష్మరూపాలే తన్మాత్రలు, శబ్ద స్పర్శ రూప రస గంధాలు, ఇవి పంచభూతాలకు క్షణాలు.

ఆకాశము లక్షణము – శబ్దము
వాయువు లక్షణము – స్పర్శ
అగ్ని లక్షణం – రూపము
జలం లక్షణం – రసము, రుచి
భూమి లక్షణం – గంధం
ఇవన్నీ మానవ శరీరంలో ఉన్నాయి
శబ్దము – చెవి యందు
స్పర్శ – చర్మము నందు
రూపము – కంటి యందు

రసము - నాలుక యందు

గంధము - ముక్కు నందు

ఈ విధంగా పంచభూతాల సూక్ష్మరూపాలైన తన్మాత్రలు మానవ శరీరంలోనే ఉన్నాయి. అందుకే దేహము పాంచభౌతికము అంటారు. ఇప్పుడు శబ్దాది విషయాలు నన్ను ఆకర్షించటం లేదు అంటే శబ్ద స్పర్శ రూప రస గంధాలు ఏవీ తనను ఆకర్షించటం లేదు అంటున్నాడు జనకరాజు. లౌకిక పరమైన కోరికలు లేవు. కాబట్టే విషయ వాంఛలు ఆకర్షించటం లేదు. ఈ కారణం చేతనే ఏ విధమైన ఆలోచనలు కోరికలు లేకుండా, సంకల్ప రహితంగా ఆత్మ స్వరూపంలో ఉన్నాను అంటున్నాడు.

**సమాధ్యాసాది విక్షేపౌ వ్యవహార స్సమాధయే ।**
**ఏవం విలోక్య నియమమేవ మేవాహమాస్థితః ॥ 3**

కర్తృత్వ భోక్తృత్వ అధ్యాసము వల్ల చలనము కలిగినప్పుడు దాన్ని దూరం చెయ్యటానికి ధ్యానము, సమాధి కావాలి. అసలు అటువంటి చలనమే లేనప్పుడు ఇంకా ధ్యానంతో కాని, సమాధితో గాని పని ఏమిటి? నాకు పరిశుద్ధమైన ఆత్మజ్ఞానము తప్ప ఇంకేదీ లేదని తెలుసుకుని ధ్యానము, సమాధి లేని స్వరూప స్థితిలో నిరతుడనై ఉన్నాను.

లౌకికమైన విషయాల వల్ల మనసులో అలజడి రేగినప్పుడు, ఆ మనసును అధీనంలోకి తెచ్చుకోవటానికి ధ్యానము, సమాధి వంటివి కావాలి. ఇక్కడ అష్టాంగ యోగము గురించి మాట్లాడుతున్నాడు. 1.యమ 2.నియమ 3.ఆసన 4.ప్రాణాయామ 5. ప్రత్యాహార 6.ధారణ 7.ధ్యాన 8.సమాధి. వీటిని యోగశాస్త్రంలో అష్టాంగాలు అంటారు. వీటిని రెండు భాగాలుగా విభజిస్తారు. మొదటి ఐదు ఒక జట్టు. చివరి మూడు రెండవ జట్టు. ఆత్మసాక్షాత్కారము కావాలంటే చివరి మూడు ధారణ, ధ్యాన, సమాధులు కావాలి. వీటిని సాధించటానికి మొదటి ఐదు అంగాలు సోపానాలుగా ఉపకరిస్తాయి.

**ధారణ :** శరీరానికి బయట గాని, లోపల గాని, ఏదైనా ఒక ప్రదేశంలో సాధకుడు తన చిత్తాన్ని నిలపటాన్నే ధారణ అంటారు. మనసు వెళ్ళిన చోటల్లా

బ్రహ్మసాక్షాత్కారం పొందుతూ, మనసును స్థిరంగా ఉంచుకోవటమే ధారణ. శరీరం బయట, ఏదైనా ఒక ప్రదేశంమీద కాని, వస్తువు మీద కాని చిత్తాన్ని నిలపటమే సాధన. శరీరంలోపల అంటే షట్చక్రాలలోను ఏదైనా ఒక చక్రంమీద గాని, బ్రహ్మరంధ్రము, సుషుమ్నానాడి మొ॥ వాటిలో దేనిమీదయినా చిత్తాన్ని నిలపటాన్నే ధారణ అంటారు. ఇది ఏకాగ్ర దృష్టి. ఆ స్థితిలో చిత్తము తనకు కావలసిన విషయం తప్ప ఏ ఇతర విషయాన్ని గ్రహించదు.

**ధ్యానము :** ఏ ప్రదేశంలో చిత్తాన్ని లగ్నం చేశామో, దానియందే జ్ఞానవృత్తి అఖండ ధారావాహిక రూపంలో సాగినప్పుడు దాన్ని ధ్యానము అంటారు. ఏ వస్తువు మీద మనస్సును లగ్నం చేశామో, ఆ వస్తువు గురించి నిరంతరము ఆలోచించటాన్ని ధ్యానము అంటారు. ధ్యానమనేది ధారణ వల్ల తేలికగా సిద్ధిస్తుంది. శంకర భగవత్పాదులు ఈ ధ్యానాన్ని వివరిస్తూ "అహం బ్రహ్మోస్మి" నేనే పరబ్రహ్మను అనే సద్వృత్తితో పరమానందాన్ని కలిగించే నిరాలంబ స్థితి. దేనిమీద ఆధారపడకుండా ఉండే స్థితినే ధ్యానము" అన్నారు. ధ్యానానికి ప్రధానమైన లక్షణాలు రెండు. 1.బ్రహ్మభావన 2.నిరాలంబ స్థితి. సవికల్ప సమాధిలో మనసులో సంకల్ప వికల్పాలు కలుగుతాయి. ఈ స్థితిలో మనసు పని చేస్తుంది. హిరణ్యకశ్యపుడు మొ॥ రాక్షసులు 12 సంవత్సరాలు సమాధి స్థితిలో ఉండి బ్రహ్మను గురించి తపస్సు చేశారు. అది సవికల్ప సమాధి. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమైతే ఆయన్ను ఏ రకంగా స్తోత్రం చెయ్యాలి. ఏ వరం కోరుకోవాలి మొ॥ విషయాలను ముందుగానే ఆలోచించి నిర్ణయించుకున్నారు. బ్రహ్మ ప్రత్యక్షమయిన తరువాత అదే పనిచేశారు. నిర్వికల్ప సమాధిలో మనసు కూడా పని చెయ్యదు. భగవంతుడు ప్రత్యక్షమైతే ఏ వరం కావాలో కోరుకోమంటే ఏం చెయ్యాలో కూడా తెలియని స్థితి. ఇక్కడ మనసు పని చెయ్యదు. దీన్నే ఉన్మనాస్థితి అంటారు. పరిపూర్ణమైన సమాధికి కావలసింది ఇది.

మనసులో ఆలోచనలవల్ల అలజడి రేగినప్పుడు, మనసును శాంతపరచి, యథాస్థానంలోకి తీసుకు రావటానికి ధారణ, ధ్యానము, సమాధి వంటి పద్ధతులు కావాలి. నా మనస్సులో అసలు ఆలోచనలే లేవు. అటువంటి నాకు ధారణ, ధ్యానము, సమాధులతో పని ఏముంది? నేను ఆత్మనిష్ఠుడనై ఉన్నాను. అంటున్నాడు జనక మహారాజు.

**హేయోపాదేయ విరహాదేవం హర్ష విషాదయోః ।**
**అభావాదద్య హే బ్రహ్మన్నేవ మేవాహమాస్థితః ॥** **4**

నేను చిద్రూపుడనైన పరమాత్మను. నాకు ఇవ్వటము లేదు పుచ్చుకోవటము లేదు. కాబట్టి నాకు సుఖదుఃఖాలు లేవు. నేను స్వరూప నిరతుడనై ఉన్నాను.

**హే బ్రహ్మన్** ఓ బ్రాహ్మణోత్తమా! బ్రహ్మజ్ఞాన సంపన్నుడా ! ఓ గురుదేవా! ఓ పరబ్రహ్మ స్వరూపమా ! అని గురువు గారిని సంబోధిస్తున్నాడు. **బ్రహ్మవిద్ బ్రహ్మైనభవతి** బ్రహ్మను గురించి తెలుసుకున్న వాడు కూడా బ్రహ్మమే అవుతాడు అనేది **బృహదారణ్యకం**లో చెప్పిన మాట. అష్టావక్రుడు బ్రహ్మజ్ఞాని. సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపమే. అందుకే జనక మహారాజు ఆ విధంగా సంబోధిస్తున్నాడు.

హేయము అంటే – విసర్జించటం

ఉపాధి అంటే – స్వీకరించటం

పరమేశ్వర స్వరూపానికి ఈ రెండూ ఉండవు. అందుచేతనే లలితా సహస్రంలో 304వ నామము **హేయోపాధేయవర్జితా** ఇష్టాఇష్టములు లేనిది. నింద్యానింద్యములు లేనిది. ప్రవృత్తి నివృత్తులు లేనిది పరబ్రహ్మ స్వరూపము. ఆ బ్రహ్మమునకు జాతి, కుల, మత భేదాలు ఉండవు. స్వపర భేదాలుండవు. వీరు తనవారు, వీరు పరాయి వారు అని ఉండదు. ఎవరి యందు ప్రీతి ఉండదు అలాగని ద్వేషము ఉండదు. కేవలము జ్ఞానవైరాగ్యాలే కావాలి.

ఇక్కడ జనక మహారాజు చెబుతున్నాడు. ఓ గురుదేవా! నాకు ధర్మాధర్మాలు, సుఖదుఃఖాలు, పాపపుణ్యాలు, మానావమానాలు ఏవీలేవు. హేయము ఉపాధేయము లేవు. నేను సర్వానికీ సాక్షిగా ఉన్నాను. నేను పరబ్రహ్మను. నాకు ఆమోదించ వలసినది, నిరాకరించవలసినది ఏదీలేదు. ఇవ్వటము పుచ్చుకోవటము వంటివి లేవు. నేను పరబ్రహ్మను. ఏవీ లేకుండా సదా ఆత్మనిష్ఠలో ఉంటాను.

**ఆశ్రమానాశ్రమం ధ్యానం చిత్తస్వీకృత వర్జనమ్ ।**
**వికల్పం మమవీక్ష్యై తైరేవమేవాహమాస్థితః ॥** **5**

ఒక ప్రత్యేకమైన ఆశ్రమంలో ఉండటము లేకపోవటం, ధ్యానము, మనస్సుకు సంబంధించిన నియమాలు అన్నీ కూడా నా స్థితి నుంచి నన్ను దూరం చేసే

భావాలు. ఈ విషయం గుర్తించి సంకల్ప వికల్పాలు లేకుండా సదా ఆత్మనిష్ఠుడనై ఉంటాను.

మానవ జీవితాన్ని నాలుగు భాగాలుగా విడగొట్టారు. ఒక్కొక్క భాగానికి ఆశ్రమము అని పేరు పెట్టారు. వీటినే చతురాశ్రమాలు అన్నారు. అవి

1. బ్రహ్మచర్యము 0–25 సంవత్సరాలు
2. గృహస్థాశ్రమము 25–50 సంవత్సరాలు
3. వానప్రస్థము 50–75 సంవత్సరాలు
4. సన్యాసము 75–100 సంవత్సరాలు

**1. బ్రహ్మచర్యము :** ఇది పూర్తిగా విద్యాభ్యాసం గావించే సమయం. పిల్లవాడికి ఉపనయనం చేసి గురుకులానికి పంపుతారు. అక్కడ పిల్లవాడికి కావలసిన విద్య అంతా నేర్పుతారు. గురుకులాలను రాజుగారి ఆధ్వర్యంలో నిర్వహించటం జరుగుతుంది. ఆ రోజుల్లో ఎక్కువ మంది గురువుగారికి సేవ చేసి, వారి దగ్గర విద్యాభ్యాసం చేసేవారు. విద్యాభ్యాసానికి మూడు పద్ధతులున్నాయి. 1.గురువుగారికి శిష్యరికం (సేవ) చేసి వారి దగ్గర విద్య నేర్చుకోవటము. 2.తగినంత ధనమిచ్చి, కావలసిన విద్యను అభ్యసించటము. 3.తనను తెలిసిన విద్యను గురువు గారికి చెప్పి, వారి దగ్గర తనకు కావలసినది చెప్పుకోవటము. అయితే ఎక్కువ మంది మొదటి పద్ధతినే అవలంబించే వారు. శ్రీకృష్ణభగవానుడు కూడా సాందీపుడికి శిష్యరికం చేసి, సేవలు చేసి, విద్యాభ్యాసం చేశాడు. విద్యాభ్యాసం చేసే కాలంలో విద్యార్థులు కఠినమైన నిబంధనలు పాటించే వారు. 25 సంవత్సరాల వరకు గురుకులంలో విద్యాభ్యాసం చేసేవారు.

**2. గృహస్థాశ్రమము :** విద్యాభ్యాసం పూర్తయిన తరువాత అనుకూలవతి అయిన పిల్లను చూసి వివాహం చేసుకునే వాడు. వివాహం ఒక పవిత్ర బంధం. భార్య ప్రతిదానికీ భర్తమీదనే ఆధారపడి జీవిస్తుంది. ఆవిడ ఒక బానిసలాగా కాక స్నేహితురాలుగా, గృహలక్ష్మిగా, ఇంటి దీపం, కంటి వెలుగుగా చెప్పబడింది. నాలుగు ఆశ్రమాలలోను గృహస్థుదే ఎక్కువ బాధ్యత. బ్రహ్మచారి, సన్యాసి భిక్షాటనతోనే జీవిస్తారు. వారికి భిక్ష వేయవలసింది గృహస్థే. అలాగే పశువులు, పక్షులు, జంతువులు

అన్నింటినీ పోషించవలసిన బాధ్యత గృహస్తుదే. కాబట్టి గృహస్త్రాశ్రమము చాలా ముఖ్యమైనది. 25 నుండి 50 సంవత్సరాల వరకు గృహస్త్రాశ్రమంలో ఉండేవారు.

**3. వానప్రస్థము :** తనకు 50 సంవత్సరాల వయసు దాటిన తరువాత వానప్రస్థానికి వెళ్ళేవాడు.

**4. సన్యాసము :** 75 సంవత్సరాల వయసు దాటిన తరువాత భార్యను కుమారుల కప్పగించి తాను సన్యసించే వాడు. వేదకాలంలో సామాన్యంగా ప్రతి బ్రాహ్మణుడు సన్యసించే వాడు. ఆ కాలంలో సన్యాసి మోక్షం పొందుతాడని ఒక నమ్మకం ఉండేది.

సన్యాసాశ్రమానికి అతీతంగా ఉండేది **'అవధూత'** స్థితి. అవధూత ఒక పిచ్చివాడులా ఉంటాడు. దుస్తులు కూడా ధరించాడు. అన్నపానీయాలు ముట్టడు. ఎవరితోనూ మాట్లాడడు. తనలో తానే మాట్లాడుకుంటూ నవ్వుతూ ఉంటాడు. పిచ్చివాడు లాగా అరణ్యాల వెంబడి తిరుగుతుంటాడు. సంవర్తకుడు, దత్తాత్రేయుడు ఇలాంటి అవధూతలే.

ఇప్పుడు జనక మహారాజు అంటున్నాడు. "ఈ ఆశ్రమాలలో దేనిలో ఉన్నాం? దేనిలో లేము అనేది విషయం కాదు. అలాగే ధారణ, ధ్యానము, సమాధి వంటివి నన్ను నేను ఉన్న స్థితి నుంచి దూరం చేస్తాయి. కాబట్టి నేను ఏ రకమైన సంకల్పము లేకుండా ఆత్మనిష్ఠుడనై ఉంటాను."

**కర్మానుష్ఠాన మజ్ఞానా ద్యథైవోపరమస్తథా ।**
**బుద్ధ్వాసమ్యగిదం తత్త్వమేవ మేవాహ మాస్థితః ॥ 6**

కర్మలను చెయ్యటం అజ్ఞానం. అలాగే కర్మలను వదలటం కూడా అజ్ఞానమే. అందుకనే నేను కర్మలను చెయ్యాలని కాని, చెయ్యకూడదని కాని అనుకోవటం లేదు.

కర్మ చేస్తే పుణ్యం వస్తుంది. స్వర్గసుఖాలు వస్తాయి. ఉత్తమ జన్మలు వస్తాయి. అంతేకాని మోక్షం రాదు. కర్మల వల్ల మోక్షం రాదు. కర్మలు చెయ్యటం వల్ల మనస్సు నిర్మలమవుతుంది. ధ్యానానికి, సమాధికి మార్గము కనుపిస్తుంది. తద్వారా మోక్షమార్గంలో నడవటానికి వీలవుతుంది. అంతేకాని కర్మల వల్ల మోక్షం రాదు. కర్మలు చెయ్యటం పూర్తిగా అజ్ఞానం అలాగని కర్మలను వదిలి పెట్టటం కూడా అజ్ఞానంలో భాగమే. జనక మహారాజు అంటున్నాడు "ఓ గురుదేవా! ఈ విషయం

నాకు పూర్తిగా తెలుసు. ఈ కారణం చేతనే ఆత్మస్వరూపుడనయిన నేను కర్మలు చెయ్యాలని గాని, చెయ్యకూడదని కాని అనుకోను. నేను సదా ఆత్మనిష్ఠలోనే ఉంటాను.”

**అచింత్యం చింత్య మానోపి చింతారూపం భజత్యసౌ ।**

**త్యక్త్వా తద్భావనం తస్మాదేవమేవాహమాస్థితః ॥ 7**

ఆత్మ అవాఙ్మానస గోచరము. కాబట్టి ఏ రకమైన ఆలోచనలు లేక ఆత్మచైతన్యంగా ఉన్నాను.

ఆత్మ వాక్కుకు మనసుకు ఇంద్రియాలకు అందనిది **కేనోపనిషత్తులో**

**న చక్షుర్ గచ్ఛతి నవాగ్గచ్ఛనోమనః నవిద్మోన**

**విజానీయో యథైతదను శిష్యాదన్యదేవ తద్విధితా దథో అనిది తాదధి**

**ఇతి శుశ్రుమ పూర్వేషాం యేనస్తద్ వ్యాచ చక్షిరే”**

ఆ పరబ్రహ్మను కనులతో చూడలేము. వాక్కుతో చెప్పలేము. మనసుతో చింతించలేము. అటువంటి ఆత్మను గురించి ఏమని చెప్పగలము. ఆత్మ తెలిసిన వాటికి, తెలియని వాటికి అతీతముగా ఉన్నది. ఆత్మను గురించి మా గురుదేవులు ఈ విధంగా చెప్పారు.

**యద్వాచానభ్యుదితం యేన వాగభ్యుద్యతే**

**త దేవ బ్రహ్మతం విద్ధి నేదం యదిదముపాసతే ॥**

ఏ ఆత్మ వాగింద్రియముచే తెలుసుకొనబడదో, వాగింద్రియము ఏ శక్తి వల్ల పని చేస్తున్నదో అదే ఆత్మ.

**యన్మనసా నమనుతే యేనాహుర్మనో మతత్**

**తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యది దముపాసతే ॥**

దేన్ని మనస్సు చేత ఊహించటానికి వీలు కాదో, దేనివల్ల మనసు పని చేస్తున్నదో అదే ఆత్మ.

**యచ్చక్షుషా నపశ్యతి యేన చక్షూగ్ షి పశ్యతి**

**తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యది దముపాసతే ॥**

దేనిని కళ్ళు చూడలేవో, దేని శక్తివల్ల కనులు పని చేస్తున్నామో అదే ఆత్మ.

**యత్ శ్రోత్రేణ నశృణోతి యేనశ్రోత్రమిదం శ్రుతమ్**

**తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యది దముపాసతే ॥**

దేనిని చెవుల ద్వారా వినలేమో, దేనివలన చెవులు పని చేస్తున్నాయో అదే బ్రహ్మము.

**యత్ ప్రాణేన నప్రాణితి యేనప్రాణః ప్రణీయతే**

**తదేవ బ్రహ్మత్వం విద్ధి, నేదంయది దముపాసతే ॥**

ప్రాణాల వలన దేనిని తెలుసుకోలేమో, దేనిశక్తి వల్ల ప్రాణాలు పని చేస్తున్నాయో అదే **ఆత్మ.**

ఆత్మ మనసుకు ఇంద్రియాలకు అందనిది. ఆత్మపురుషుని ముందు సూర్యచంద్రులు కూడా కాంతిహీనమయి వెలవెలబోతారు. ఆత్మ అంత కాంతి వంతమైనది. పరమేశ్వరస్వరూపము కొన్ని కోట్ల సూర్యులకాంతులతో, కొన్ని కోట్ల చంద్రుల చల్లదనంతో, కొన్ని కోట్ల విద్యుల్లతలు ఒక్కసారి ప్రకాశించినట్లుగా ప్రకాశిస్తుంటుంది. ఆ పరమేశ్వరుని కాంతుల వల్ల సూర్యుడు, చంద్రుడు. అగ్ని కాంతులు ప్రసరిస్తున్నారు. కాబట్టి ఆత్మ వాక్కుకు, మనసుకు, ఇతర ఇంద్రియాలకు అందనిది. ఇంద్రియాల వల్ల ఆత్మను తెలుసుకోలేము. ఇదే విషయం జనక మహారాజు చెబుతున్నాడు. గురుదేవా ! ఆత్మ వాక్కుకు మనసుకు ఇతర ఇంద్రియాలకు అందనిది. నేను ఆత్మ పురుషుడిని. అందుచేత ఆలోచనలు లేనివాడనై ఆత్మచైతన్యంగా ఉన్నాను.

ఇప్పటివరకు ఈ అధ్యాయంలోని ఏడు శ్లోకాల రెండవ లైన్ చివర **ఏవమేవాహ మాస్థితః** అనే మాటను చెప్పారు.

**ఏవమేవకృతం యేన స కృతార్థో భవేదసౌ ।**

**ఏవమేవ స్వభావో యః స కృతార్థో భవేదసౌ ॥** **8**

ఈ స్థితిని పొందిన సాధకుడు ధన్యుడు. తన స్వస్వరూప దర్శనం చేసుకున్న వాడి జన్మధన్యము. అంటున్నాడు జనకుడు. ఈ శ్లోకంలో

ఆత్మ సర్వవ్యాపి చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నది. అన్నింటికీ అధిష్టానమైనది ఆత్మ. అన్నింటికీ చలనశక్తిని ఇచ్చేది ఆత్మ. పిపీలికాది బ్రహ్మ పర్యంతము. అన్నింటియందు ఆత్మ ప్రకాశిస్తున్నది. ఈ విషయం తెలిసిన వాడు ధన్యుడు. అతడికి మరుజన్మ ఉండదు అంటున్నాడు జనక మహారాజు.

# అధ్యాయం-13

# పరమానందము

దీన్నే 'యథాసుఖసప్తకము' అని కూడా అంటారు. ఈ అధ్యాయంలో ఏడు శ్లోకాలున్నాయి. పరమమైన ఆనందము. అన్నింటికీ మించిన ఆనందము. జగత్తులో దీనికి మించిన ఆనందము ఇంకొకటి లేదు. అది పరబ్రహ్మ పొందే ఆనందము. దీన్నే బ్రహ్మానందము అంటారు. బ్రహ్మము పొందే ఆనందం కాబట్టి బ్రహ్మానందము అనబడుతుంది.

చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. ఆకాశానికి కారణం పరబ్రహ్మ. సృష్టికి ముందు ఈ జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని పరబ్రహ్మ ఆవరించి ఉన్నాడు. అతడే నామరూపాత్మకమైన జగత్తును సృష్టించాడు. ఆ పరబ్రహ్మ ఆనందకారకుడు అతన్ని సాక్షాత్కరింప చేసుకున్నవాడు ఆనందం పొందుతాడు. దహరాకాశంలో ఆ పురుషుడు లేకపోతే ఊపిరి పీల్చటం కూడా జరగదు. ఆ పరమేశ్వరుడు హృత్పద్మంలోనే ఉన్నాడు. సాధకుడు తానే పరబ్రహ్మస్వరూపాన్ని అని తెలుసుకుంటే భయాలుండవు. బ్రహ్మానికి తనకు భేదం కనిపిస్తేనే భయముంటుంది. తాను వేరు బ్రహ్మమువేరు కాదు. ఇద్దరూ ఒకటే అని భావన చేస్తేనే ముక్తి లభిస్తుంది. పరబ్రహ్మను గురించిన భయంతోనే గాలి సవ్యంగా వీస్తోంది. సూర్యోదయ సూర్యాస్తమానాలు సక్రమంగా జరుగుతున్నాయి. దేవతలు తమ విధులు సక్రమంగా నిర్వర్తిస్తున్నారు. ఈ రకంగా అందరి భయానికి కారణమైన బ్రహ్మమే ఆనందము. ఇది శాశ్వతమైన ఆనందము. విషయవాంఛల వల్ల కలిగేది లౌకికానందం. ఇది అనుభవించగానే తగ్గిపోతుంది. విషయవాంఛలు తగ్గిన కొద్దీ ఆనందము పెరుగుతుంది. ఆ ఆనందమే పెరిగి పెరిగి పరిపూర్ణానందంగా మారుతుంది. అదే అద్వైతానందం. ఈ ఆనందం శ్రోత్రియుడు, (వైదిక కర్మలు చేసేవాడు) సదాచార సంపన్నుడు, నిష్కాముడు అయిన బ్రహ్మవేత్త అనుభవించడానికే ఉన్నది. బ్రహ్మవేత్త మాత్రమే ఈ ఆనందం పొందగలుగుతున్నాడు.

ఈ లోకంలోని సంపద అంతా యువకుడు, సదాచార సంపన్నుడు, వేదవిదుడు, బలమైనవాడు అనుభవించటానికే ఉన్నది. దీన్ని అనుభవించటంవల్ల కలిగే ఆనందాన్ని మానుషానందము అంటారు.

మానుషానందానికి నూరు రెట్లు – మానవ గంధర్వానందం

మానవ గంధర్వానందానికి నూరు రెట్లు – నిజగంధర్వానందం

నిజగంధర్వానందానికి నూరు రెట్లు – చిరలోకపితరానందం

చిరలోక పితరానందానికి నూరు రెట్లు – అజానజదేవానందం

అజానజ దేవానందానికి నూరు రెట్లు – కర్మ దేవానందం

కర్మ దేవానందానికి నూరు రెట్లు – దేవానందం

దేవానందానికి నూరు రెట్లు – ఇంద్రానందం

ఇంద్రానందానికి నూరు రెట్లు – బృహస్పతి ఆనందం

బృహస్పతి ఆనందానికి నూరు రెట్లు – ప్రజాపతి (విరాట్పురుషుడు) పొందే ఆనందం.

ప్రజాపతి ఆనందానికి నూరు రెట్లు – బ్రహ్మానందం.

ఇతడు అన్ని ప్రాణులయందు ఉంటాడు. మానవులందరిలోను ఉన్నాడు.

ఈ రకంగా పరబ్రహ్మను గురించి తెలుసుకున్న వారికి ఏ రకమైన ద్వంద్వాలు అంటవు. అతన్ని ఏవీ బాధించవు. అతనికి అజ్ఞానము, భేదబుద్ధి ఉండవు. బ్రహ్మజ్ఞాని పాపపుణ్యాలకు అతీతుడుగా ఉంటాడు. ఆనందస్వరూపుడైన పరమేశ్వరుణ్ణి మనం వాక్కుతో గాని కంటితో గాని అవయవాలతో గాని దేనితోను తెలుసుకోలేము. ఇంద్రియాలకు అతీతమైన బ్రహ్మను బ్రహ్మజ్ఞానం ద్వారానే తెలుసుకోవాలి. ఈ రకంగా పరబ్రహ్మ పొందే ఆనందము అంటే మానవుడు పొందే ఆనందానికి కొన్ని కోట్ల రెట్లు ఉంటుంది. దాన్నే బ్రహ్మానందము అంటారు. ఆ బ్రహ్మ ఈ రకమైన ఆనంద డోలికలలో ఓలలాడుతుంటాడు. అటువంటి పరబ్రహ్మను చేరటమే ముక్తి, సాయుజ్యము, పరమపదము అంటారు. ఆనందం ఐదు రకాలుగా ఉంటుంది. అవి 1. జ్ఞానానందం 2. విషయానందం 3. ఆత్మానందం 4. అద్వైతానందం 5.యోగానందం ఈ ఆనందాలను పొందితేనే బ్రహ్మానందం సాధ్యమవుతుంది.

**"ఆనందో(బ్రహ్మేతి వ్యజానాత్, ఆనందాధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే ఆనందేన జాతాని జీవంతి"** అంటోంది తైత్తిరీయోపనిషత్తు. ఆనందమే బ్రహ్మ. ఆనందంలో నుంచే అన్నీ పుడుతున్నాయి. ఆనందంలోనే జీవిస్తున్నాయి. మళ్ళీ ఆనందంలోనే లయమవుతున్నాయి. అందుచేత ఆనందము. బ్రహ్మానందంలో

లీనమవటమే సుఖానికి పరమావధి. బ్రహ్మానందం అనేది బ్రహ్మజ్ఞానం వల్లనే వస్తుంది. బ్రహ్మజ్ఞానే బ్రహ్మానందాన్ని పొందగలుగుతాడు. బ్రహ్మజ్ఞానం వల్ల రెండు పనులు జరుగుతాయి. 1. ఇష్టప్రాప్తి 2. అనర్థ నివారణ. తైత్తిరీయోపనిషత్తు, ఛాందోగ్యోపనిషత్తులలో చెప్పినట్లుగా బ్రహ్మమును తెలుసుకున్నవాడు పరమమైన బ్రహ్మను పొందుతాడు. ఛాందోగ్యోపనిషత్తులో సనత్కుమారుడు నారదుడికి చెబుతాడు. "ఓ నారదా ! ఆత్మజ్ఞానియైన వాడు అజ్ఞాన మూలకమైన సంసారాన్ని, సంసార సాగరమనే దుఃఖాన్ని దాటి తరిస్తాడు." బ్రహ్మము ఆనంద స్వరూపం గలది. ఆనంద స్వరూపమైన బ్రహ్మను పొంది 'అహం బ్రహ్మాస్మి' నేనే పరబ్రహ్మను అనే జ్ఞానంతో సాధకుడు తాను బ్రహ్మమే అవుతాడు. బ్రహ్మైక్యతను తెలుసుకుంటేనే తప్ప ఆనంద స్వరూపుడవటం జరగదు. ముముక్షువైన వాడు అదృశ్యము, వికారము, అనిర్వచనీయము, నిరాధారము అయిన బ్రహ్మయందు అభయ స్థితి పొందినప్పుడు అభయ పదవి అంటే మోక్షం పొందుతాడు. పరమాత్మ విషయంలో భేదభావము ఏ మాత్రం ఉన్నా అతడు భయం నుంచి విముక్తుడు కాడు. అహంకారం ఉన్న ప్రతివాడికీ భయముంటుంది. కాబట్టి అహంకారం నుంచి విముక్తుడైన వాడే భయం నుంచి విముక్తుడవుతాడు. భయం ఎప్పుడూ ద్వైతంలోనే ఉంటుంది. నేను గాక ఇంకెవరో ఉన్నారు అన్నప్పుడు భయం కలుగుతుంది. అద్వైతంలో భయముండదు. ఉన్నది నేను ఒక్కడినే. రెండో వారెవరూ లేరు అన్నప్పుడు ఇంక భయమనేది ఉండదు. అటువంటి స్థితిలో సాధకుడు మోక్షరూపమైన అద్వితీయ బ్రహ్మను పొందుతాడు. **'బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి'** బ్రహ్మను గురించి తెలుసుకున్నవాడు సాక్షాత్తు తానే బ్రహ్మ అవుతాడు. వాయువు, సూర్యుడు, అగ్ని, ఇంద్రుడు యముడు, వీరు గతజన్మలో ఇష్టాపూర్తి (కోరికలు తీరాలని చేసే కర్మ) కర్మలు చేశారు కాబట్టే పరమాత్మ యందు భేదభావాన్ని పాటించి, ఈ జన్మలో ఈ రూపాలు పొందారు. కఠోపనిషత్తులో సాక్షాత్తు యముడే నచికేతుడితో "నచికేతా ! చయనము అనే కర్మ చేసినందువల్ల శాశ్వత స్వర్గలోక ప్రాప్తి కలుగుతుంది. అంతేకాని మోక్షం రాదు. ఈ విషయం తెలిసి కూడా నేను ఆ కర్మను చేశాను. ఫలితంగా యమలోకాధిపతి నైనాను" అని చెబుతాడు. ఈ రకంగా బ్రహ్మజ్ఞానం కలిగినందువల్ల ఇష్టప్రాప్తి జరుగుతుంది. ఇక **అనర్థనివృత్తి** ఎలా జరుగుతుందంటే – బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకున్న జ్ఞాని దేనికీ భయపడడు. కర్మ చెయ్యటం వల్ల వచ్చే ఫలితం జ్ఞాని, అజ్ఞాని ఇద్దరూ అనుభవించాల్సిందే. కాని బ్రహ్మజ్ఞాని తాను చేసిన పాపాలను

అనుభవించటానికి భయపడడు. నేను పుణ్యం ఎందుకు చెయ్యలేదు? పాపం ఎందుకు చేశాను? అని దుఃఖించడు. పుణ్యపాపాలు తత్త్వవేత్తను ఏ మాత్రము బాధించవు. విద్వాంసుడు పుణ్యకర్మలు, పాపకర్మలు అన్నీ వదిలి, నిరంతరము ఆత్మచింతన చేస్తుంటాడు. పుణ్యపాప కర్మలన్నీ తన స్వరూపంగానే భావిస్తాడు. ఆ పరమాత్మ అందరి యందు సర్వత్రా వ్యాపించి ఉన్నాడు అని భావించి, అతన్నే ధ్యానిస్తాడు. కాబట్టి అతని దృష్టిలో పుణ్యపాపాలు రెండు మిధ్యే. సమస్తమూ ఆత్మ స్వరూపమే. అందుకే అతడికి పుణ్యపాపాలు అంటవు. బ్రహ్మజ్ఞానికి ప్రారబ్ధము తప్ప, సంచితము, ఆగామికర్మలుండవు. జ్ఞానంవల్ల సంచిత కర్మ పూర్తిగా దగ్ధమై పోతుంది. ఈ జన్మలో కర్మ చెయ్యడు అంటే ఆగామికర్మ ఉండదు. దేహం ఉన్నంతవరకు ప్రారబ్ధము మాత్రం అనుభవించాలి.

జగత్తులో అన్నింటికన్నా ఉత్కృష్టమైన ఆనందమే ఈ పరమానందం. పరబ్రహ్మతో పాటుగా, సర్వసంఘ పరిత్యాగి రాగద్వేషాలు, అహంకార మమకారాలు వంటి ద్వంద్వాలు, అరిషడ్వర్గాలు జయించినవాడు, మనసును నాశనం చేసి మనోజయము సాధించి, చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. ఆ పరమేశ్వరుడే నేను అని భావించగలిగిన మహాజ్ఞాని జీవించి ఉండగానే ఈ రకమైన ఆనందాన్ని పొందుతాడు. జనక మహారాజు తాను పరమానందాన్ని పొందుతున్నానని ఈ అధ్యాయంలోని ఏడు శ్లోకాలలో చెబుతున్నాడు. ప్రతి శ్లోకంలోను **అహమాసే యథాసుఖమ్.** నేను సదా చిద్రూపుడనై సుఖంగా ఉన్నాను అంటున్నాడు.

**అకించనభవంస్వాస్థ్యం కౌపీనత్వేఽపి దుర్లభమ్ ।**
**త్యాగాదానే విహాయాస్మాదహమాసే యథా సుఖమ్ ॥ 1**

జగత్తులో ఆత్మ ఒక్కటే ఉన్నది. రెండవది లేదు. అనే జ్ఞానం వల్ల గొప్ప శాంతి లభిస్తుంది. కౌపీనధారణ చేసినా ఆ శాంతికి భంగం వాటిల్లుతుంది. అందుకే గ్రహణ త్యాగములందు ఏ మాత్రము ఆశక్తి లేకుండా చిద్రూపుడనై ఉన్నాను అంటున్నాడు జనక మహారాజు.

ఈ చరాచర జగత్తులో ఉన్నది ఆత్మ ఒక్కటే. ఆత్మ కన్న వేరైనది లేదు. జగత్తంతా ఆత్మ స్వరూపమే. జగత్తే ఆత్మ, ఆత్మే జగత్తు. జగత్తులో అడవులు, కొండలు, ఎడారులు, నదులు, సముద్రాలు, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, భూమి, ఆకాశము,

పంచభూతాలు, తన్మాత్రలు, ప్రాణము, దృష్టి శ్రోత్రము, మనస్సు ఒకటేమిటి? ప్రాణమున్నవి, ప్రాణం లేనివి. చలనమున్నవి చలనం లేనివి అన్నీ పరబ్రహ్మ స్వరూపమే. కర్త కర్మ క్రియ అన్నీ బ్రహ్మమే. ఇవ్వటము, పుచ్చుకోవటము, తినటము, త్రాగటము అన్నీ పరబ్రహ్మ స్వరూపమైనదే. **ఛాందోగ్యోపనిషత్తు**లో ఒక కథ ఉంది.

పూర్వ కాలంలో ఒక భయంకరమైన అరణ్యంలో ఒక ఆశ్రమం ఉండేది. అందులో శౌనకుడు, అభిప్రతారి అని ఇద్దరు ఋషులుండేవారు. వాయుదేవుడు వారి ఆరాధ్యదైవం. ఒక రోజు మధ్యాహ్నం వారు భోజనం చెయ్యబోయే సమయంలో తలుపు తట్టిన చప్పుడయింది. "భవతీ బిక్షాందేహి" అని వినిపించింది. ఎవరో బ్రహ్మచారి భిక్షాటనకు వచ్చాడు. 'ఇది సమయం కాదు. వెళ్ళు' లోపల నుంచి సమాధానం. భిక్షకుడికి లేదు అని చెప్పటం పెద్ద విచిత్రం ఏమీ కాదు. కాని ఋష్యాశ్రమంలో తిరస్కారం. ఆశ్చర్యపోయాడు బ్రహ్మచారి. ఈ ఆశ్రమవాసులను తేలికగా వదలకూడదు అనుకున్నాడు. వెంటనే లోపల ఉన్న వారిని ఉద్దేశించి 'ఆర్యా! తమరు ఏ దేవతను ఉపాసిస్తారు?' అని అడిగాడు. 'నువ్వు చాలా మొండివాడిలా ఉన్నావు. మా ఉపాసనా దైవం వాయువు. ఆయనే ప్రాణం కూడా" అన్నారు లోపల ఉన్న ఋషులు. 'స్వామీ! ఈ ప్రపంచం అంతా ప్రాణంవల్ల రూపం దాల్చింది. సృష్టి అంతా తిరిగి ప్రాణంలోనే లయం అయిపోతుంది. ఈ విషయం తమకు తెలుసు కదా ! ప్రాణం వ్యక్తావ్యక్తము లన్నింటియందు ఉంటుంది కదా!" అన్నాడు బ్రహ్మచారి.

'ఎందుకు తెలియదయ్యా! నువ్వు చెప్పేదంతా మాకు తెలిసినదే. క్రొత్తది ఏమీ కాదు' అన్నాడు లోపల ఉన్న ఋషి.

'అయితే సరే ! ప్రస్తుతం అన్నం తినబోతున్నారు కదా! ఆ అన్నం ఎవరి కోసం వండారు? ఎవరికి నివేదన చేస్తారు?' తిరిగి ప్రశ్నించాడు బ్రహ్మచారి.

'ఆ మాత్రం తెలియదా! మేము ఆరాధించే వాయుదేవుడికి సమర్పించటానికి 'చాలా తేలిక భావంతో సమాధానం చెప్పాడు ఋషి.

'అయితే వినండి. ప్రాణం అనేది విశ్వమంతా వ్యాపించి ఉన్నది. ఆ ప్రాణానికి నైవేద్యంగా మీరు అన్నం వండారు. ఈ విశాల విశ్వంలో నేను కూడా ఒక భాగమే. అంటే నాలో కూడా ప్రాణమున్నది. మీరు ఉపాసించే పరబ్రహ్మ ప్రాణరూపంలో

మీలో ఉన్నది. అలాంటప్పుడు ఆకలితో ఉన్న బ్రహ్మచారి రూపంలో ఉన్న మీ ఉపాసనా దైవమైన వాయువే మిమ్మల్ని భిక్ష అడుగుతుంటే మీరు ఎందుకు లేదంటున్నారు? అని ప్రశ్నించాడు బ్రహ్మచారి.

ఆ వివరణకు ఆశ్రమంలోని ఋషులు చాలా సంతోషించారు. 'బ్రహ్మచారీ! నువు చెప్పింది ముమ్మాటికీ సత్యం' అన్నారు.

"ఋషీశ్వరులారా ! నాకు భిక్ష పెట్టకుండా పొమ్మంటే నాలో ఉన్న ప్రాణాన్ని అంటే మీ ఆరాధ్య దైవాన్ని తిరస్కరించినట్లే కదా? మీరు ఎవరి కోసం అన్నం వండారో, ఆ దేవునికే ఆహారం పెట్టననటం న్యాయమేనా?" అన్నాడు బ్రహ్మచారి.

ఈ మాటలకు ఋషీశ్వరులు చాలా సిగ్గు పడ్డారు. వెంటనే లేచి గౌరవంగా బ్రహ్మచారిని లోపలికి తీసుకువచ్చారు. **దేవత యొక్క బాహ్యరూపాన్నే కాకుండా, ఆంతర్యం తెలుసుకుని ఆరాధించాలి** అని తెలుసుకుని బ్రహ్మచారికి భోజనం పెట్టి పంపించారు.

కాబట్టి జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. ఇందులో ఇచ్చేవాడు, పుచ్చుకునే వాడు, ఇవ్వటం పుచ్చుకోవటం అంతా పరమేశ్వరమయం. కాబట్టి మహాజ్ఞాని అయిన వాడు గోచీ పెట్టుకున్నా జగత్తంతా పరమేశ్వర స్వరూపము అనే భావనకు అడ్డు వస్తుంది. అందుకనే జనక మహారాజు అంటున్నాడు 'ఓ గురుదేవా! ఈ కారణం వల్లనే త్యాగము గ్రహణము (ఇవ్వటము, పుచ్చుకోవటము) లను కూడా విడిచిపెట్టి నేను చిద్రూపునిగా **అహమాసే యథాసుఖమ్** సుఖంగా ఉన్నాను అంటున్నాడు జనక మహారాజు.

**కుత్రాపిఖేదః కాయస్య జిహ్వా కుత్రాపి ఖిద్యతే ।**
**మనఃకుత్రాపి తత్త్యక్త్వా పురుషార్థే స్థితస్సుఖమ్ ॥** **2**

ఆసనం వేసుకుని సమాధిలో కూర్చుంటే శరీరానికి కష్టం కలుగుతుంది. జపము, కీర్తనము వలన నాలుకకు శ్రమ కలుగుతుంది. ధ్యానం వల్ల మనః క్లేశము కలుగుతుంది. కాబట్టి మనోవాక్కాయ కర్మలు వదలి పరమపురుషార్థమైన సచ్చిదానంద రూపుడుగా ఉన్నాను.

జీవితంలో ఏ పనులు చేసినా అవి మనోవాక్కాయముల ద్వారానే జరుగుతాయి. తపస్సు చేస్తున్నాం. అంటే నియమ నిష్ఠలతో భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నామన్న మాట.

దీనికి అనేక పద్ధతులున్నాయి. సాధకుని కోరికను పట్టి ఆ పద్ధతులు అనుసరించ బడతాయి. కొంతమంది పద్మాసనం వేసుకుని తపస్సు చేస్తారు. కొంతమంది ఒంటి కాలిమీద నుంచుని, కొంతమంది పీకలదాకా నీటిలో కూర్చుని, కొంతమంది పంచాగ్ని మధ్యలో నిలబడి, కొంతమంది తలక్రిందులుగా నిలబడి, ఆహారం తీసుకోకుండా శరీరాన్ని శుష్కింపచేసి సమాధిలో సంవత్సరాల తరబడి ఉంటారు. కొంతమంది ఉపవాసాలు ఉండి, చాంద్రాయణాది వ్రతాలు చేసి భగవంతుణ్ణి ప్రార్థిస్తారు. దీనివల్ల శరీరానికి విపరీతమైన శ్రమ కలుగుతుంది.

కొంతమంది మానసికమైన కర్మలు చేస్తారు. వాటివల్ల మనస్సుకు శ్రమ కలుగుతుంది.

అలసటకీ, అశాంతికీ కారణం మనోవాక్కాయ కర్మలే. ఇంద్రియాలు ఎప్పుడూ అశాంతిని సృష్టిస్తాయి. **యోగవాశిష్ఠం**లో చెప్పనట్లుగా

**కురంగాలి పతంగే భమీనాస్త్వే కైకశోహతాః**

**సర్వైర్యుక్తైర్ అనర్థైస్తు వ్యాప్త స్యాజ్ఞ కుతః సుఖమ్ ॥**

లేడి, తుమ్మెద, సీతాకోకచిలుక, ఏనుగు, చేప వీటిలో ఒక్కొక్కటీ ఒక్కొక్క జ్ఞానేంద్రియం మీద వ్యామోహంతో తమ చావు తెచ్చుకుంటున్నాయి.

**కురంగ మతంగ పతంగ భృంగ మీనాః**

**పంచభిరేవ పంచ**

**1. కురంగము** అంటే – లేడి. దీనికి శృంగనాదము (కొమ్ము బూర శబ్దము) అంటే ఇష్టం. అడవిలోకి వేటగాడు వచ్చినప్పుడు అతడి కంట పడకుండా పోయి పొదలలో దాక్కుంటుంది లేడి. అప్పుడు వేటగాడు శృంగనాదం చేస్తాడు. ఆ శబ్దానికి ఆకర్షితురాలై పొదమాటు నుంచి బయటకు వచ్చి వేటగాడికి చిక్కి ప్రాణాలు కోల్పోతుంది.

**2. మతంగము** అంటే మగఏనుగు. అడవిలో యథేచ్ఛగా తిరుగుతుంటుంది. దాన్ని పట్టి బంధించటం తేలికైన పని కాదు. అందుకనే వేటగాడు తనకు మాలిమి అయిన ఆడు ఏనుగును పంపుతాడు. ఆడు ఏనుగు స్పర్శ అంటే మగ ఏనుగుకు మహాప్రాణం. అందుకని దానితోపాటు బయలుదేరి వస్తుంది. అలా తీసుకు వచ్చి మగ ఏనుగును అంతకుముందే వేటగాడు ఏర్పాటు చేసిన గోతిలో పడేస్తుంది. ఈ రకంగా వేటగాడికి చిక్కుతుంది మగ ఏనుగు.

**3. పతంగము** అంటే – మిడత. మండుతున్న మంటను లేదా దీపాన్ని చూసి, అదేదో పండు అని భావించి దాన్ని తినబోయి మంటలో పడి మాడి మసి అయిపోతుంది.

**4. భృంగము** అంటే – తుమ్మెద. పూవు పూవుకు తిరిగి తేనె త్రాగుతుంటుంది. తేనె అంటే దీనికి చాలా ఇష్టం. అలా తేనె కోసం వెళ్ళినప్పుడు అడవిలో ఒక రకమైన చెట్లు ఉంటాయి. వాటి పూవులమీద ఏదైనా కీటకం వాలితే వెంటనే అవి ముడుచుకుపోయి, ఆ కీటకాన్ని ఆహారంగా తీసుకుంటాయి. ఈ రకంగా తుమ్మెద తన ప్రాణాలు కోల్పోతుంది.

**5. మీనము** అంటే – చేప. నీటిలో తిరిగే చేపకు వానపాము అంటే చాలా ఇష్టం. జాలరి వాడు తన గాలానికి వానపామును గ్రుచ్చి నీటిలో వేస్తాడు. వానపాము (ఎర) యొక్క వాసన వల్ల ఆకర్షింపబడిన చేప. ఎరను మ్రింగటానికి వచ్చి గాలానికి చిక్కి ప్రాణాలు పోగొట్టుకుంటుంది.

శరీరంలో ఇంద్రియాలు చాలా ప్రమాదకరమైనవి. పంచభూతాల సూక్ష్మరూపాలే తన్మాత్రలు. అవి జ్ఞానేంద్రియాల యందుంటాయి. వీటి ద్వారా ఆకర్షితుడై మానవుడు ప్రాణాలు పోగొట్టుకుంటాడు. దీనికి ఉదాహరణగానే ఈ శ్లోకం చెప్పటం జరిగింది.

1. శబ్దము వల్ల ఆకర్షింపబడి లేడి
2. స్పర్శకు ఆకర్షింపబడి మగఏనుగు
3. రూపానికి (అగ్ని) ఆకర్షింపబడి మిడత
4. రసానికి (తేనె) ఆకర్షింపబడి తుమ్మెద
5. గంధానికి (వాసన) ఆకర్షింపబడి చేప

తమ ప్రాణాలు పోగొట్టుకుంటున్నాయి. అజ్ఞాని అయిన మానవుడు ఈ జ్ఞానేంద్రియాలతో మమేకమవుతున్నాడు. అతడికి కష్టాలు తప్ప ఏ విధంగాను ఈ ప్రపంచంలో సుఖం దొరకదు.

శరీరాన్ని కష్టపెట్టి మనోవాక్కాయ కర్మలచేత చేసే పనులవల్ల మోక్షం రాదు. వీటివల్ల కేవలము స్వర్గమే వస్తుంది. అందుకే వీటన్నింటినీ వదలి చిద్రూపుడనై పరమ సంతోషంగా ఉన్నాను **అహమాసే యధాసుఖమ్** అంటున్నాడు జనక మహారాజు.

**కృతం కిమపినైవస్యాదితి సంచింత్య తత్త్వతః ।**

**యదా యత్కర్తుమాయాతి తత్కృత్వాఽఽసే యథా సుఖమ్ ॥ 3**

ఆత్మ ఏ రకమైన కర్మలు చెయ్యదు అని తెలిసి, చేసే పనులన్నీ కర్తృత్వ భావం లేకుండా చేస్తూ ఆనందమయుడనై ఉన్నాను.

**ముండకోపనిషత్తులో**

**ద్వాసుపర్ణా సయుజా సుఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే ।**
**తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య నశ్నన్నన్యో అభిచాకశీతి ॥**

ఒకే రూపము, రంగు కలిగిన రెండు పక్షులు సంసారమనే వృక్షంమీద కూర్చుని ఉన్నాయి. అందులో ఒకటేమో దొరికిన కాయలు ఫలాలు తింటున్నది. రెండవది ఏమీ తినకుండా దిక్కులు చూస్తున్నది. దొరికిన కాయలు పండ్లు తింటున్నది జీవాత్మ. ఆ కాయలు పండ్లు దాని కర్మ ఫలాలు. రెండవది పరమాత్మ. పరమాత్మ ఏ కర్మా చెయ్యదు కాబట్టి అనుభవించటానికి కర్మఫలము ఏమీ ఉండదు. అందుకనే ఏమీ తినకుండా దిక్కులు చూస్తూ కూర్చుంది.

ఇదే మంత్రం **శ్వేతాశ్వతరోపనిషత్తు**లో నాల్గవ అధ్యాయంలో ఆరవ మంత్రంగా ఉన్నది.

కర్మలు చేసే మోక్షం రాదు. కర్మ అంటే పని. అది మంచి పని కావచ్చు చెడ్డపని కావచ్చు. వీటినే సత్కర్మ, దుష్కర్మ అంటారు. కర్మ చేసినప్పుడు దాని ఫలితం తప్పకుండా అనుభవించాలి. కర్మ చేసిన వెంటనే దాని ఫలితము సూక్ష్మరూపంలో కర్మ హృదయంలోకి చేరి, అనుకూలమైన పరిస్థితులు వచ్చినప్పుడు, అనుభవంలోకి వస్తుంది. దీన్నే అపూర్వము, అదృష్టము అంటారు. కొంతమంది చెబుతుంటారు 'తృటిలో ప్రమాదం తప్పిపోయింది' అది కేవలము మన అదృష్టం అని. గతజన్మలలో చేసిన కర్మల ఫలితం. కొన్నిసార్లు ఈ కర్మఫలాన్ని మనమే కాకుండా మన పిల్లలు, వారసులు, కుటుంబ సభ్యులు కూడా అనుభవిస్తారు.

కర్మలు చేస్తే మోక్షం రాదు. తీర్థాలలో స్నానాలు చెయ్యటం, క్షేత్రాలు దర్శించటం, జపతపాలు, యజ్ఞయాగాలు, పూజలు, అర్చనలు, వ్రతాలు, దానధర్మాలు, ప్రజోపయోగమైన పనులు మొ॥వి చేస్తే స్వర్గం వస్తుంది. ఏ రకమైన కర్మ చేసినా దానికి తగిన ఫలితం వస్తుంది. మరుజన్మలో ఉత్తమజన్మ కలుగుతుంది.

మంచి వంశంలో జన్మించటం, మంచివిద్య, ఉద్యోగము, హోదా, గౌరవము, ధనధాన్యాలు, సిరిసంపదలు, భోగభాగ్యాలు ఇవన్నీ కలుగుతాయి. కర్మలు చేస్తే స్వర్గసుఖాలు వస్తాయి అంతేకాని మోక్షం రాదు. **కఠోపనిషత్తు**లో యముడు నచికేతుడితో చెబుతాడు. 'నచికేతా! అగ్నిచయనము చేస్తే శాశ్వత స్వర్గలోకం వస్తుంది. అంతేకాని మోక్షం రాదు. ఈ విషయం తెలిసి కూడా నేను అగ్నిచయనము చేశాను.' అంటాడు. జ్ఞానికి కావలసింది మోక్షము అంతేకాని స్వర్గం కాదు. అందుకే జ్ఞాని ఏ కర్మ చెయ్యడు. ఇక్కడ జ్ఞాని అంటే పరబ్రహ్మ స్వరూపమే. కాబట్టి ఆత్మ ఏ పనీ చెయ్యదు. అన్నింటికీ సాక్షీభూతంగా చూస్తూ ఉంటుంది. నేను చిద్రూపమైన ఆత్మ స్వరూపాన్ని కాబట్టి ప్రాప్తించిన వాటిని కర్తృత్వ భావం లేకుండా చేస్తూ **అహమాసే యథా సుఖం** నేను సుఖంగా ఉన్నాను అంటున్నాడు జనక మహారాజు.

**కర్మనైష్కర్మ్య నిర్బంధ భావా దేహస్థయోగినః ।**
**సంయోగా యోగ విరహా దహమాసే యథా సుఖమ్ ॥** **4**

దేహాభిమానం గల యోగులు కర్మ చెయ్యాలని, జ్ఞానాన్ని ఆశ్రయించిన వారు కర్మలు అవసరం లేదని అంటారు. నేను మాత్రం ఈ రెండు భావాలకు అతీతంగా సుఖంగా ఉన్నాను.

అజ్ఞానులు దేహమే ఆత్మ అని భావిస్తారు అంటూ దీనికి ఉదాహరణగా **ఛాందోగ్యోపనిషత్తు**లోని 'ప్రజాపతి' కథను కూడా గతంలో చెప్పుకున్నాం. రాక్షస రాజైన విరోచనుడు అజ్ఞానంతో దేహమే ఆత్మ అని ప్రచారం చేశాడు. దేహమే ఆత్మ అని భావించాడు. ఈ రకంగా అజ్ఞానులు దేహమే ఆత్మ అని నమ్మి కర్మలు చేస్తారు. కర్మలు చేస్తే దాని ఫలితం దానికి వస్తుంది. కాబట్టి కర్మలు చెయ్యాలి అంటారు. తమోగుణ ప్రధానులైన వారు కర్మలు చేస్తే రజోగునాన్ని సాధిస్తారు. రజోగుణ ప్రధానులైన వారు కర్మలు చేస్తే సత్త్వగుణాన్ని సాధిస్తారు. సాత్వికులు కర్మల నాచరిస్తే ఆత్మానుభవాన్ని పొందగలుగుతారు. అంటే **కర్మలు చెయ్యటం వల్ల మనసు నిర్మలమై మోక్షమార్గం దొరుకుతుంది.** అందుచేతనే వీరు కర్మలను తప్పనిసరిగా చెయ్యాలి అంటారు.

మోక్షమార్గంలో పయనించే వారు కర్మలు చేయరాదు అంటారు. కర్మలు చేస్తే పుణ్యం తద్వారా స్వర్గం వస్తుంది. అంతేగాని మోక్షం రాదు పై పెచ్చు మోక్షానికి కర్మలు అడ్డుగా నిలుస్తాయి. కాబట్టి జ్ఞానులు కర్మలు అవసరం లేదు. చెయ్యవద్దు

అంటారు. ఒకవేళ తప్పనిసరి పరిస్థితులలో కర్మ చేయవలసి వస్తే దాన్ని నిష్కామ్యంగా చెయ్యాలి అంటారు. మొత్తం మీద కొంతమంది కర్మలు చెయ్యాలనీ, కొంతమంది వద్దని అంటారు. నేను చిద్రూపుణ్ణి కాబట్టి ఈ రెండు రకాల భావాల నుండి విడిగా ఉండి, పరమసుఖాన్ని అనుభవిస్తున్నాను **అహమాసే యథాసుఖమ్** అంటున్నాడు జనక మహారాజు

**అర్థానర్థౌ న మేస్థిత్యా గత్యా వా శయనేన వా ।**
**తిష్ఠన్ గచ్ఛన్ స్వపన్ తస్మాదహమాసే యథాసుఖం ॥ 5**

నేను చిద్రూపుణ్ణి, కాబట్టి కర్మ చెయ్యటంలో గాని, మానెయ్యటంలో గాని, మంచి చెడులు, సుఖదుఃఖాలు నాకు ఉండవు. అందుచేత నేను ఏ స్థితిలో ఉన్నాను అంటే నుంచున్నా, కూర్చున్నా, పడుకున్నా, సుఖంగానే ఉంటాను.

నేను చిద్రూపుడిని, కాబట్టి ఏ స్థితిలో ఉన్నా ఒకటే. నిద్ర పోయినా, మెలకువగా ఉన్నా, కర్మ చేసినా, చెయ్యకపోయినా, కూర్చున్నా నుంచున్నా ఎలా ఉన్నా ఏ రకమైన తేడా ఉండదు. నాకు సుఖదుఃఖాలు లేవు. దేనియందు ఆసక్తి లేదు. కాబట్టి మహాసుఖంగా ఉన్నాను.

మనం ఏ పని చేసినా దాని ఫలితాన్ని ముందే ఊహించుకుని చేస్తాం. అప్పుడే దాని పూర్తి ఫలితం మనకు వస్తుంది. జ్ఞాని అయినవాడు ఏ కర్మా చెయ్యడు కాబట్టి అతడికి మంచి చెడు, సుఖదుఃఖాలు ఉండవు. జ్ఞాని కర్మలు చేసినా నిష్కామ్యంగా, లోకకళ్యాణం కోసం చేస్తాడు. కాబట్టి వాటివల్ల అతనికి ఏ రకమైన ఫలితము ఉండదు. అతడు సర్వకాల సర్వావస్థలలోను ఆనంద డోలికలలో తేలియాడుతూ ఉంటాడు. ఇటువంటి వారిని జీవన్ముక్తులు అంటాం. వీరు జీవించి ఉండగానే ముక్తి పొందిన వారు. ఆయువు ఉన్నంత వరకు జీవించి, ఆయువు తీరగానే దేహపాతం జరిగి విదేహముక్తి పొందుతారు. అందుకే జనక మహారాజు నేను ఏ స్థితిలో ఉన్నా సుఖంగానే ఉన్నాను **అహమాసే యథాసుఖమ్** అంటున్నాడు.

**స్వపతో నాస్తి మే హానిః సిద్ధిర్యత్నవతో న వా ।**
**నాశోల్లాసౌ విహాయాస్మా దహమాసే యథాసుఖమ్ ॥ 6**

నిద్రపోతే వచ్చే నష్టమూ లేదు. మెలకువగా ఉంటే వచ్చే లాభము లేదు. అందుకే లాభనష్టాల ఆలోచన లేకుండా నేను సుఖంగా ఉన్నాను. **అహమాసే యథాసుఖమ్**

నేను ఏ విధమైన కర్మ చెయ్యను. ఏమీ చెయ్యకపోయినా నాకు ఏ విధమైన అపకారము లేదు. ఈ కర్మల వల్ల ఏదో రావాలి అనే కోరిక నాకు ఏమీ లేదు. కాబట్టి నేను ఎలా ఉన్నప్పటికీ నాకు సుఖదుఃఖాలు లేవు. అందుచేత నేను సర్వదా సుఖంగానే ఉన్నాను అంటున్నాడు జనక మహారాజు. **తైత్తిరీయోపనిషత్తు**లో చెప్పినట్లుగా

**ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ః**
**ఆనందాద్ధ్యేవ ఖల్విమానిభూతాని జాయంతే**
**ఆనందేన జాతాని జీవంతి ॥**

వరుణమహర్షి కుమారుడు భృగుమహర్షి విద్యాభ్యాసం పూర్తి చేసి తండ్రి దగ్గరకు వచ్చి బ్రహ్మవిద్యను చెప్పమన్నాడు. 'బ్రహ్మవిద్య ఒకరు చెబితే వచ్చేది కాదు. వెళ్ళి తపస్సు చెయ్యి. నీకే తెలుస్తుంది' అన్నాడు తండ్రియైన వరుణ మహర్షి. కొంతకాలం పాటు తపస్సు చేశాడు భృగువు. ఇప్పుడు అన్నమే పరబ్రహ్మ స్వరూపమని తెలిసింది. అదే మాట తండ్రికి చెప్పాడు. 'అన్నం కూడా పరబ్రహ్మమే. కాని అన్నమే పరబ్రహ్మ కాదు. వెళ్ళి మళ్ళీ తపస్సు చెయ్యి' అన్నాడు తండ్రి. మళ్ళీ తపస్సు చేశాడు భృగువు. ఈసారి ప్రాణమే పరబ్రహ్మ స్వరూపము అని తెలిసింది. అదే మాట చెప్పాడు తండ్రికి. కాదన్నాడు వరుణ మహర్షి. 'ప్రాణం కూడా పరబ్రహ్మమే. కాని ప్రాణమే పరబ్రహ్మ కాదు. ఇంకొంతకాలం తపస్సు చెయ్యి' అన్నాడు.

మళ్ళీ కొంతకాలం తపస్సు చేశాడు భృగువు. ఇప్పుడు తెలిసింది 'మనస్సే పరబ్రహ్మ' అని. అదే మాట తండ్రికి చెప్పాడు. కాదన్నాడు తండ్రి. 'మనస్సు కూడా పరబ్రహ్మమే కాని మనస్సే పరబ్రహ్మ కాదు. మళ్ళీ వెళ్ళి తపస్సు చెయ్యి' అన్నాడు. మళ్ళీ కొంతకాలం తపస్సు చేశాడు భృగువు. ఇప్పుడు తెలిసింది విజ్ఞానమే పరబ్రహ్మ అని అదే మాట తండ్రికి చెప్పాడు. కాదన్నాడు తండ్రి. 'విజ్ఞానం కూడా పరబ్రహ్మమే. కాని విజ్ఞానమే పరబ్రహ్మ కాదు. మళ్ళీ వెళ్ళి తపస్సు చెయ్యి' అన్నాడు. మళ్ళీ కొంత కాలం తపస్సు చేశాడు భృగువు. ఇప్పుడు తెలిసింది ఆనందమే పరబ్రహ్మము అని ఈ మాటే తండ్రికి చెప్పాడు. అప్పుడు తండ్రి అయిన వరుణమహర్షి చెబుతున్నాడు. 'కుమారా! అన్నింటి కన్నా బాగా పరమాత్మ తత్త్వాన్ని వ్యక్తం చేసేది ఆనందమే. అన్నము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము అన్నీ ఆనంద స్వరూపాలే. ఇవన్నీ ఒకదానికన్న ఒకటి సూక్ష్మమైనవి. అన్నింటినీ మించినది ఆనందము. ఈ

ఆనందము క్షణికమైనది కాదు. శాశ్వతమైనది. ఆనందమే పరబ్రహ్మ స్వరూపము' ఇప్పుడు జనక మహారాజు ఆ ఆనందస్థితిలోనే ఉన్నాడు. అందుకే అంటున్నాడు 'గురుదేవా! నేను ఏ స్థితిలో ఉన్నప్పటికీ, ఏ రకంగానూ నాకు లాభనష్టాలతో పనిలేదు. సర్వదా ఆనందంతో సుఖంగా ఉన్నాను. **అహమాసే యథాసుఖమ్**

**సుఖాది రూపానియమం భావేష్వాలోక్య భూరిశః ।**

**శుభాశుభే విహాయాస్మాదహమాసే యథాసుఖమ్ ॥** **7**

పరిస్థితులను అనుసరించి సుఖదుఃఖాలు మారుతూ ఉంటాయి. ఈ విషయం తెలిసిన నేను మంచి చెడులను వదలి సుఖంగా ఉన్నాను. సుఖదుఃఖాలు అనిత్యములు ఒకసారి సుఖంగా ఉన్నది ఇంకొకసారి బాధ కలిగిస్తుంది. శీతాకాలంలో చలిమంట చలిని తగ్గించి హాయినిస్తుంది. అదే చలిమంట వేసవికాలంలో ఇబ్బందికరంగా ఉంటుంది. వేసవి కాలంలో ఉక్కపోతగా ఉన్నప్పుడు రాత్రిపూట ఆరుబయట చల్లగాలిలో పడుకుని హాయిగా నిద్రపోతాం. అదే శీతాకాలంలో రాత్రిపూట ఆరు బయట పడుకుంటే గడ్డకట్టుకుపోతాం. ఇప్పుడు మిత్రులుగా ఉన్నవారు కొంత కాలానికి శత్రువులు కావ్చు. అదే శత్రువులు మిత్రులుగా కూడా కావచ్చు. ఒక్కొక్కసారి శత్రువులు ఆప్తులుగా మారవచ్చు.

మానవుడు సుఖంగా ఉండాలనే కోరికతో మంచి పనులు చెయ్యటానికి ఇష్టపడతాడు. విచిత్రం ఏమంటే దుర్మార్గుడు కూడా దుర్మార్గమైన పనులు తన సుఖం కోసమే చేస్తాడు. ఏ పని చేసినా మానవుడి ధ్యేయం సుఖంగా ఉండటం. అయితే మంచి పనులు చేసినవారు సుఖంగా ఉంటే చెడు పనులు చేసినవారు దుఃఖం పొందుతారు. తమ సుఖం కోసం ఎదుటివారిని కష్టపెట్టిన వారు తాత్కాలికంగా సుఖం అనుభవించినా చివరకు దుఃఖాలపాలు గాక తప్పదు. ఒక్కొక్కసారి చేదు అనుభవం ఎదురవుతుంది. మంచి పనులు చేసిన వారికి కూడా కష్టాలు సంభవిస్తాయి. అది పూర్వజన్మకృతంమీద ఆధారపడి ఉంటుంది. ఈ రకంగా పరిస్థితుల ప్రభావంతో సుఖాలు, దుఃఖాలు మారుతుంటాయి. ఓ గురుదేవా ! ఈ విషయం తెలిసిన నేను మంచి చెడులు, పాపపుణ్యాలు అన్నీ విసర్జించి సుఖంగా ఉన్నాను. **అహమాసే యథాసుఖమ్** అంటున్నాడు జనక మహారాజు.

# అధ్యాయం-14

# శాంతి చతుష్టయము

ఈ అధ్యాయంలో నాలుగు శ్లోకాలున్నాయి. వాటిలో ఆత్మ పరమశాంత స్వరూపము అని చెబుతున్నాడు జనక మహారాజు. శాంతము అంటే ఎటువంటి పరిస్థితులనైనా సహించే శక్తి. చింత, దుఃఖము, ప్రతీకారము, బాధ ఏమీ లేకుండా అన్ని దుఃఖాలు, బాధలు, కష్టాలు సహించటము. చేయగలిగిన శక్తి ఉండి కూడా ఇతరులకు అపకారం చెయ్యకుండా ఉండటము. ఆత్మకు ఏ లక్షణాలు, గుణాలు లేకుండా అన్నింటినీ ఓర్పుతో భరించటము. తనకు ఒకవేళ అపకారం చేసినా, అపకారం చేసిన వారి మీద ఏ మాత్రం కోపం తెచ్చుకోకుండా, గొప్పదైన ఓర్పుతో వారిని క్షమించటము. ఒకచిన్న ఉదాహరణ చూడండి. నిండు సభలో ద్రౌపది వలువలు ఊడదీసినప్పుడు కూడా ధర్మరాజు మాట్లాడకుండా చూస్తూ ఉన్నాడు ద్రౌపదిని అంతగా అవమానించిన దుర్యోధనుణ్ణి ఘోషయాత్రలో గంధర్వులు బందీగా పట్టుకుంటే, వారిని విడిపించాడు. తమకు తీరని హాని చేసిన వారిని క్షమించి, వారికి ఉపకారం కూడా చేశాడు. ఎదుటివారు తప్పు చేసినా క్షమించటము అంటే, చేతకానితనంతో చూస్తూ ఊరుకోవటం కాదు. దుర్మార్గాన్ని ఆపగల శక్తి ఉండి, ఎదిరించగల ధైర్యం, పరాక్రమం ఉండి, వారిని శిక్షించగల బలముండి కూడా, అత్యంతమైన ఓర్పుతో, క్షమతో ఉండటము. మనం నవరసాలను చెబుతుంటాం.

1. శృంగారము
2. వీరము
3. కరుణ
4. అద్భుతము
5. హాస్యము
6. భీభత్సము
7. భయానకము
8. రౌద్రము
9. శాంతరసము

నవరసాలలోను రసరాజము శృంగార రసము కాగా అత్యంత ఉన్నతమైనది శాంతరసము. శ్రీవిద్యలో శ్రీచక్రాన్ని చక్రరాజము అంటారు. అందులో మొత్తం తొమ్మిది ఆవరణలున్నాయి. తొమ్మిదవ ఆవరణ బిందువు. అక్కడ శివశక్తులు ఇద్దరూ

ఉంటారు. అదే పరబ్రహ్మ స్వరూపము. అక్కడ ఉండే రసము శాంతరసము. పరబ్రహ్మ ఎప్పుడూ పరమశాంతంగానే ఉంటాడు. సాకారోపాసనలో సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే పరబ్రహ్మ అతడు సాకారబ్రహ్మ. రావణ సంహారం కోసం దశరథ తనయుడు రాముడా భూలోకంలో అవతరించాడు. రామరావణ యుద్ధం జరుగుతోంది. ఆ రోజు యుద్ధంలో రాముడు, రావణుడు ప్రత్యక్షంగా యుద్ధం చేస్తున్నారు. రావణుడి సారథి మరణించాడు. గుర్రాలు చచ్చిపోయినాయి. రథం విరిగిపోయింది ధనుస్సు విరిగిపోయింది. రావణుడు విరథుడై, నిరాయుధుడై, నేలమీద నుంచున్నాడు. అతణ్ణి ఆ సమయంలో చంపటం రాముడికి అంత కష్టమైన పనేం కాదు. కాని అతణ్ణి సంహరించలేదు సరికదా "రావణా! ఇప్పటికైనా మించిపోయింది లేదు. సీతను మా కప్పగించి శరణుకోరు. లేదా నేడుపోయి బలాన్ని, బలగాన్ని కూడకట్టుకుని రేపురా!" అన్నాడు. సీతను ఒప్పగిస్తే నిన్ను క్షమిస్తాను అన్నాడు. అతణ్ణి శిక్షించగల శౌర్యపరాక్రమాలుండి కూడా శత్రువును క్షమించటం శాంతరసం.

జ్ఞాని ఎప్పుడూ ఆత్మనిష్ఠలోనే ఉంటాడు. అతడికి ఏ కోరికలు ఉండవు. ఆలోచనలు ఉండవు. శూన్యచిత్తంగా ఉంటాడు. మనస్సులో ఏ రకమైన భావాలు లేక పరమశాంతంగా ఉంటాడు. అతడు మేలుకొని ఉన్నా నిద్రించినట్లే. శారీరకంగా నిద్రపోయినా ఆత్మానుభవంలో సదా మేల్కొని ఉంటాడు. బంధమోక్షాల భ్రాంతి లేకుండా, సర్వానికీ సాక్షిగా ఉదాసీనంగా ఉంటాడు. అటువంటి జ్ఞానియొక్క స్థితి ఇంకొక జ్ఞానికే తెలుస్తుంది. ఈ విషయాలన్నీ 14వ అధ్యాయంలోని 4 శ్లోకాలలో వివరించటం జరిగింది.

**ప్రకృత్యా శూన్యచిత్తో యః ప్రమాదాద్భావ భావనః ।**
**నిద్రితో బోధిత ఇవ క్షీణ సంసరణో హి సః ॥ 1**

జ్ఞాని వృత్తి రహితము భావశూన్యము అయిన మనస్సుతో లౌకిక విషయాల మీద శ్రద్ధ లేకుండా, అసలు ధ్యాసే లేకుండా వచ్చిన సంఘటనలు వచ్చినట్లుగా చూస్తూ ఉంటాడు. కాబట్టి అతడు మేలుకొని ఉన్నా నిద్రించినట్లే లెక్క. ఒకవేళ నిద్రించినా ఆత్మానుభవంలో మేలుకొన్నట్లు గానే భావించాలి.

సహజంగా జ్ఞానికి విషయాల యందు అనురాగము. ఆసక్తి ఉండదు. ప్రారబ్ధ కర్మలను నిద్రనుంచి లేచినవాడులాగా నిరాసక్తతో భావిస్తాడు. నిద్ర పోతున్న వాడికి

ఒక్కసారిగా మెలకు వచ్చి గతంలో జరిగిన సంఘటనలు గుర్తు వస్తే ఎలా ఉంటుందో, అలా ఆ విషయాలను గ్రహిస్తాడు. అంటే ఇతడికి విషయముల యందు ఏ మాత్రము అనురాగము, ఆసక్తి ఉండవు. అటువంటి వాడు శాంతచిత్తుడు అనబడతాడు. అతడికి సంసార విషయముల యందు, లౌకిక విషయాల యందు ఏ మాత్రము ఆసక్తి ఉండదు.

ప్రాపంచిక విషయాలతో మనకు గల బంధాలు అనుభవాలు, జ్ఞాపకాలు చిత్తంలో దాగి ఉండి భవిష్యత్తును రూపొందిస్తాయి. వీటినే మనం వాసనలు అంటాం. ఈ వాసనలే కోరికలై కర్మలు చేసేందుకు పురికొల్పుతాయి. ఈ జ్ఞాపకాలతోనే మళ్ళీ మళ్ళీ అనుభవించాలి అనే కోరికతో అహంకారం బలపడుతుంది. ఇది సామాన్యుడి అవస్థ. కాని జ్ఞానికి ఈ వాసనలుండవు. అతడు వాసనలన్నీ అధిగమించిన వాడు. కాబట్టి **క్షీణసంసరణః** క్షీణించిన సంసారము గలవాడు. అంటే సంసార రహితుడు, సంసారము లేనివాడు అవుతున్నాడు. వాసనలు లేకపోతే జ్ఞాపకాలు ఉండవు. వాసనలు లేని స్థితి మనస్సంతా భావశూన్యంగా, నిశ్చలంగా ఉంటుంది. పరమశాంతంగా ఉంటుంది. ఇది జీవన్ముక్తిని యొక్క స్థితి.

జీవించి ఉండగానే ముక్తి పొందటాన్ని జీవన్ముక్తి అంటారు. అటువంటి వాడు ఆయువు ఉన్నంత వరకు జీవించి, తరువాత దేహాన్ని విడిచి పరబ్రహ్మలో లీనమవుతాడు. దీన్ని విదేహముక్తి అంటారు.

తపస్సు మొదలైన సాధన చేయకుండానే సహజంగా ఎవరికి భోగాలు ఇష్టం ఉండవో, వారు జీవన్ముక్తులు, కాలానుగుణంగా సుఖదుఃఖాలు అనుభవిస్తున్నప్పటికీ, సంతోషము, విషాదము పొందని వాడు జీవన్ముక్తుడు. సంతోషము, ఓర్వలేనితనము, భయము, క్రోధము, కామమ, కార్పణ్యము వంటివి లేనివాడు జీవన్ముక్తుడు. అహంకారిన్ని వదలి, దృశ్యాన్ని పూర్తిగా త్యాగం చేసినవాడు జీవన్ముక్తుడు. అంతర్ముఖుడై ఇష్టాఇష్టాలేకుండా ఉండేవాడు, సుషుప్త్యావస్థలో ఉన్నట్లుగా సంచరించే వాడు జీవన్ముక్తుడు. ఎప్పుడూ ఆత్మానందం పొందేవాడు, మనసును పవిత్రంగా ఉంచుకునే వాడు జీవ్ముక్తుడు. ఏ కోరికలు లేకుండా ఉండేవాడు జీవన్ముక్తుడు.

ఈ స్థితి యోగాభ్యాసం వల్ల కాని మణిమంత్ర ఔషధాల వల్ల రాదు. ఆత్మనిష్ఠుడైన బ్రహ్మజ్ఞానికి మాత్రమే వస్తుంది. అటువంటి స్థితిలోనే ఉన్నాడు జనకమహారాజు.

**క్వ ధనాని క్వ మిత్రాణి క్వ మే విషయదస్యవః ।**

**క్వ శాస్త్రం క్వ చ విజ్ఞానం యదా మే గలితా స్పృహాః ॥ 2**

కోరికలు లేని నా మనసులో సిరిసంపదలు, మిత్రులు, శత్రువులు, బంధువులు, శాస్త్రాలు, విజ్ఞానము మొ॥వి లేవు.

నాకు విషయాలమీద ఏ మాత్రము ఆసక్తి లేదు. నేను చిద్రూపుడను. జరిగిపోయిన విషయాలు నాకు గుర్తుండవు. నాకు ధనమెందుకు? ధాన్యమెందుకు? శాస్త్రాలు ఎందుకు? విజ్ఞానమెందుకు? నేనే పరబ్రహ్మను అనే ధ్యాస కూడా నాకు లేదు. నాకు దేనిమీద ఆశలేదు. మానవుడిలో అహంకారం ఉన్నంతవరకు మిత్రులు, శత్రువులు, ధనం, విజ్ఞానము, శాస్త్రాలు వీటియందు కోరిక ఉంటుంది. ఇవన్నీ అత్యంత విలువైనవిగా కనుపిస్తాయి. వీటివల్ల మానవుడికి సమాజంలో భద్రత, గౌరవము, తృప్తి, సుఖము లభిస్తాయి. మానవుడికి అహంకారం ఉన్నంతవరకు విషయాలన్నీ వ్యామోహంగా మారి శాంతి లేకుండా చేస్తాయి. ఈ వ్యామోహం వల్ల వివేకము, విజ్ఞానము, సంస్కృతి అన్నీ నాశనమై పోతాయి. ఇది నిజం. కాని కోరికలు నశించిన వాడికి నేనే పరమాత్మను అని తెలుసుకున్న వాడికి విషయాలమీద మనసుండదు. విషయ వాసనలు అతణ్ణి ఏమీ చెయ్యలేవు. వాటికి ఏ మాత్రం విలువుండదు. అజ్ఞానికి సంపదలు, భోగాలు, శాస్త్రాలు, విజ్ఞానం అన్నీ అందంగా, గొప్పగా కనుపిస్తాయి. కాని జ్ఞాని దృష్టిలో వీటికి విలువలేదు.

అన్నీ తెలిసిన వాడు జ్ఞాని. పరమేశ్వర తత్త్వం తెలిసిన వాడు. పరమేశ్వర స్వరూపుడు జ్ఞాని. అతనికి తెలియనిది ఏదీ లేదు. అతని దగ్గర లేనిది ఏదీలేదు. ఏ విషయాన్ని తెలుసుకున్నంత మాత్రం చేత జగత్తులోని అన్ని విషయాలు తెలుస్తాయో, ఆ విషయమే పరమాత్మ తత్త్వము. పరమాత్మ తత్త్వం తెలిసిన వారికి లోకంలోని అన్ని విషయాలు తెలుస్తాయి. **బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి** పరబ్రహ్మ తత్త్వం తెలిసినవాడు సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపుడు. అందుకే అతనికి కోరికలు ఉండవు. విషయ వాసనలు ఉండవు.

**విజ్ఞాతేసాక్షి పురుషే పరమాత్మని చేశ్వరే ।**

**నైరాశ్యే బంధమోక్షే చ న చింతా ముక్తయే మమ ॥ 3**

సర్వానికీ సాక్షీభూతుడైన ఆ పరమేశ్వరుణ్ణి తెలుసుకోగలిగాను. ఇందుచేతనే బంధమోక్షాలను వదలి ఉదాసీనంగా ఉన్నాను. అంటున్నాడు జనక మహారాజు.

దేహానికి ఇంద్రియాలకి సాక్షి అయిన 'త్వం', పరమాత్మ రూపమైన 'తత్' రెండూ ఒకటే అనే విషయాన్ని నేను గ్రహించాను అంటున్నాడు జనక మహారాజు, తత్ అంటే పరమాత్మ. **త్వం** అంటే జీవాత్మ. ఈ రెండూ ఒకటే. భేదం లేదు అని తెలుసు కున్నాను. కాబట్టి నాకు ఇంక బంధమోక్షాలు లేవు. ముక్తి కూడా లేదు. అంటున్నాడు.

మహావాక్యాలు నాలుగు. సామవేదానికి సంబంధించిన ఛాందోగ్యోపనిషత్తులో **తత్త్వమసి** అనే ఈ మహావాక్యము చెప్పబడింది. ఉద్దాలకుడు బ్రహ్మజ్ఞాని. ఆయన కుమారుడు శ్వేతకేతువుకు బ్రహ్మవిద్యను ఉపదేశిస్తూ ఈ వాక్యాన్ని చెబుతాడు. ఇందులో మూడు పదాలున్నాయి. తత్, త్వం, అసి. తత్ అంటే అది. త్వం అంటే నీవు. అసి అంటే అయి ఉన్నావు. అది అంటే పరమాత్మ. నువ్వు అంటే జీవాత్మ ఓ శ్వేతకేతూ ! అదే నీవయి ఉన్నావు. జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే. శ్వేతకేతూ నువ్వే పరమాత్మని.

శ్వేతకేతూ ! ఆకాశంలో సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. అతనిలో ఉన్న తేజస్సు ఏదయితే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. తత్త్వమసి. అదే నీవై ఉన్నావు.

ఆకాశంలో చంద్రుడు చల్లదనాన్నిస్తున్నాడు. అతనిలోని చల్లదనం ఏదైతే ఉన్నదో అదే నీవు. తత్త్వమసి.

జగత్తులోని అన్ని పదార్థాలకన్న అధికమైనది, త్రికాలములందు ప్రకాశిస్తూ జగత్తును ప్రకాశింప చేసేది బ్రహ్మము. అదే నీవు. దేనిని పొందిన తరువాత ఇంక పొందవలసినది ఏదీ ఉండదో, ఏ సుఖాన్ని మించిన సుఖం లేదో, ఏ జ్ఞానానికి మించిన జ్ఞానం ఇంకొకటి లేదో, అదే బ్రహ్మము. అదే నీవు. పరమాత్మ అంటే ఏదో ఒక రూపం కాదు. జ్ఞానరాసి. జ్ఞానరూపమే పరబ్రహ్మ. ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి** మూడు అవస్థల యందు జగత్తు దేనివల్ల ప్రకాశిస్తున్నాదో అదే బ్రహ్మము. **తత్త్వమసి** అదే నీవు.

శరీరత్రయము, గుణత్రయము, అవస్థాత్రయము, ఇంద్రియాలు, అంతఃకరణ చతుష్టయము మొదలైన వాటితో ఉన్నప్పటికీ దేనితోనూ సంబంధం లేనిదే బ్రహ్మము అదే నీవు. **తత్త్వమసి**

చరాచర జగత్తులో అన్నిటికీ సాక్షీభూతమైనదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

ఆద్యంతములు లేనిది, సర్వవ్యాపి, దేశకాల భేదములు లేనిది బ్రహ్మము. అదే నీవు **తత్త్వమసి.**

ఏ మాత్రము అజ్ఞానము లేని జ్ఞానరాశియే బ్రహ్మము. అదే నీవు **తత్త్వమసి.**

వికారాలు లేనిబ్రహ్మకు సంసారము లేదు. దాని నుండి విముక్తి లేదు. అదే నీవు తత్త్వమసి. దృశ్యమానమైన జగత్తంతా బ్రహ్మమే అని వేదం చెబుతోంది. ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి.**

జగత్తులో ఉన్న ప్రతి వస్తువులోను, ప్రతిప్రాణిలోను ఉన్న శక్తి, అంతా నీలోనే ఉన్నది. అదే నీవై ఉన్నావు. **తత్త్వమసి**. చరాచర జగత్తంతా వ్యాపించిన బ్రహ్మమే నీవై ఉన్నావు. **తత్త్వమసి.**

ఓ శ్వేతకేతూ ! నీవే పరమాత్మవి. అని చెబుతాడు. అందుకే ఇక్కడ జనక మహారాజు చెబుతున్నాడు. ఓ గురుదేవా! సర్వానికి సాక్షిని నేనే అని తెలుసుకున్నాను. అందుచేతనే బంధమోక్షాలు లేకుండా శాంతంగా ఉదాసీనంగా ఉన్నాను.

**అంతర్విగతకల్ప శూన్యస్య బహిస్స్వచ్ఛంద చారిణః ।**
**భ్రాంత స్యేవ దాశాస్తాస్తాస్తాదృశా ఏవ జానతే ॥ 4**

మనస్సులో ఏ భావాలు లేకుండా, చిన్న పిల్లవాడి లాగా స్వేచ్ఛగా తిరిగే జ్ఞాని మనకు మాత్రం అన్ని రకాల భ్రమలకు లోనయినట్లే కనుపిస్తాడు. కాని నిజానికి అతని స్థితి ఇంకొక జ్ఞానికి మాత్రమే తెలుస్తుంది.

అంతఃకరణలో సంకల్ప వికల్పాలు లేకుండా, పిచ్చివాడిలా తిరిగే జ్ఞాని విషయము అటువంటి జ్ఞానులకే తెలుస్తుంది.

ఏ రకమైన ఆలోచనలు, భావాలు లేకుండా చైతన్య రూపుడయిన జ్ఞాని మనస్సు శాంతంగా ఉంటుంది. బుద్ధి ఆలోచనారహితంగా ఉంటుంది. అతనిలో ఏ రకమైన సంకల్ప వికల్పాలు ఉండవు. అహంకారము అసలే ఉండదు. ఏ రకమైన ధర్మాలు ఉండవు. కోరికలు ఉండవు. చూడటానికి పిచ్చివాడు లాగా ఉంటాడు. సామాన్యుల దృష్టిలో అతను పిచ్చివాడు. అతన్ని జ్ఞానిగా గుర్తించటం ఇంకొక జ్ఞానికి మాత్రమే సాధ్యమవుతుంది అంటున్నారు ఈ శ్లోకంలో.

# అధ్యాయం-15

# తత్త్వోపదేశము

సత్యము నిత్యము శాశ్వతమైనది పరబ్రహ్మ. సత్, చిత్, ఆనంద స్వరూపమైనది. పరమాత్మకు రూపభేదము, లింగభేదము లేవు.

**పరమాత్మ:** పరమాత్మ అక్షర రూపంలో ఉపాసింపదగినవాడు. అతడే సృష్టి స్థితి లయాలకు కారణమైనవాడు. ఆద్యంతములు లేనివాడు. నిరాకారుడు, నిరంజనుడు, నిర్గుణుడు. సత్యము, నిత్యము అయినవాడు. సర్వాంతర్యామి. సర్వవ్యాపి. ఆ పరమేశ్వరుణ్ణి యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యానము, సమాధి మొదలైన యోగ ప్రక్రియలతో ఉపాసించటం జరుగుతుంది. అతడు తలవెంట్రుకలో వెయ్యోవంతు (అణుమాత్రుడై) ఉన్నాడు. ఆ పరమాత్మ పొందబడడు, జన్మించడు, మరణించడు, శుష్కింపడు, తడుపబడడు, దహించబడడు, కదలింపబడడు, భేదింపబడడు. అతడు నిర్గుణుడు. జగత్తులో జరిగే విషయాలన్నింటికీ అతడే సాక్షి. భూతభావనుడు. అనగా భూతములను అభివృద్ధి చేసేవాడు. ఆ పరమాత్మ పరిశుద్ధమైనవాడు. అతడికి కాళ్ళు, చేతులు, తల మొదలైన అవయవాలు లేవు. సూక్ష్ముడు, మమకారము లేనివాడు, శబ్దస్పర్శ రూపరస గంధాలు లేనివాడు. నిర్వికల్పుడు కోరికలు లేనివాడు. చింతించటానికి వీలుకానివాడు. రంగులేనివాడు. అశుద్ధాన్ని శుద్ధంగా, అపవిత్రాన్ని పవిత్రంగా చేసేవాడు. క్రియాశూన్యుడు. అటువంటి పరమాత్మకు సంసారములేదు.

అతడే ఆత్మసంజ్ఞగలవాడు. శుద్ధుడు. అతడు ఒక్కడుగానే ఉన్నాడు. అతనితో సమానమైనవారు కాని, అతనికన్న అధికులుగాని ఎవరూ లేరు. బ్రహ్మరూపంలో కేవలము పరబ్రహ్మమే ప్రకాశిస్తాడు. కాని సమస్త జగత్తులోనూ ఆ పరమేశ్వరుడే ప్రకాశిస్తున్నాడు. విద్య అవిద్య, భావము అభావము, గురువు శిష్యుడు అనే భేదాలతో ఆ పరబ్రహ్మ ప్రకాశిస్తున్నది. తత్త్వదర్శనములో ఆ పరబ్రహ్మమే కేవలము శుద్ధముగా గోచరిస్తున్నది. విద్యలేదు అవిద్యలేదు. జగత్తు అంతకన్నా లేదు. పరాపరములు లేవు. ఈ జగత్తు సత్యముగా కనిపిస్తే సంసారం కలుగుతుంది. అయితే వ్యవహారంలో మాత్రమే సంసారం సత్యంగా కనిపిస్తుంది. కాని పదార్థంలో సమస్త సంసారము

అసత్యము అవుతుంది. అందులో ఉన్నదంతా మట్టే అయినప్పటికీ, ఆకారాన్ని బట్టి 'కుండ' అని పిలువబడుతోంది. ఇది కుండ అని తెలుసుకోవటానికి ఎలాటి నియమము అవసరం లేదు. అలాగే ఆత్మను పోల్చి చెప్పటానికి ఇంకొక ప్రమాణం ఏదీలేదు. ప్రమాణంలో ఆత్మయే నిత్యసిద్ధముగా ప్రకాశిస్తున్నది. ఆత్మను తెలుసుకోవటానికి దేశము, కాలము, శుద్ధి, ఇవి ఏవీ అవసరం లేదు. 'నేనే పరమేశ్వరుడను' అని చెప్పగలిగే విజ్ఞానం కావాలి. ఈ రకంగా బ్రహ్మవేత్త అనుభవంతో నేనే పరబ్రహ్మను అని తెలుసుకుంటాడు.

సూర్యుని కాంతితో జగత్తంతా ప్రకాశిస్తున్నది. అలాగే, పరబ్రహ్మయొక్క తేజస్సుచేత అనాత్మ, అసత్తు నాశనం అయిపోయి ఈ జగత్తంతా ప్రకాశిస్తున్నది. వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, సకలభూతాలు ఏ ప్రకాశంచేత అర్ధవంతము, విజ్ఞానవంతము అవుతున్నాయో, అదే ఆత్మప్రకాశము. చిన్నపిల్లవాడు ఆకలి మరచిపోయి ఆటవస్తువులతో ఆడుకున్నట్లుగా, విద్వాంసుడు అహంకార మమకారాలను వదలి ఆత్మయందు రమిస్తూ ఉంటాడు. ముని తను కోరుకున్నట్లు ఒంటరిగా తిరుగుతుంటాడు. నిష్కాముడై తనయొక్క ఆత్మతోనే సర్వదా సంతుష్టుడై, స్వయంగా సర్వాత్మభావనతో సంచరిస్తూ ఉంటాడు. ఆత్మజ్ఞాని సిద్ధుడైననూ, సదాసంతుష్టుడైనప్పటికీ, సహాయము లేనివాడయినప్పటికీ, మహాబలవంతుడు. భోజనం చెయ్యకపోయినప్పటికీ నిత్యతృప్తుడు. సమానంగా కనిపించనప్పటికీ సమదర్శనుడు. అన్ని పనులు చేస్తున్నప్పటికీ ఏ పనులు చేయనివాడు. భోగాలను అనుభవిస్తున్నట్లు కనిపిస్తాడు కాని నిజానికి అభోక్త.

బ్రహ్మవేత్త శరీరము ఉండి కూడా శరీరం లేనివాడు. విభజించటానికి వీలు లేనివాడు. కాని అన్నిచోట్ల ఉంటాడు. అతడు సదా అనంతుడు. ప్రియాప్రియముల యందు, శుభాశుభముల యందు నిర్లిప్తంగా ఉంటాడు. సూర్యకాంతి ఉన్నప్పటికీ, చీకటిని కల్పించుకుని బాధపడుతున్నట్లుగా, వస్తు లక్షణాలు తెలియకుండా భ్రాంతితో నిండి జనులు బాధపడుతున్నారు. బ్రహ్మవేత్త అయినవాడు శరీరబంధనాల నుండి విముక్తి పొందుతున్నాడు. మూఢులైనవారు శరీర భ్రాంతినే చూస్తున్నారు. పాము కుబుసాన్ని విడిచినట్లుగా, జ్ఞాని దేహంమీద భ్రాంతిని వదలిపెడతాడు. గంగా ప్రవాహం ఎత్తు పల్లాలను సరిచేసేటట్లుగా ప్రాణవాయువు శరీరమంతా

సంచరిస్తున్నది. ఈ శరీరము ప్రారబ్ధంవల్ల కర్మఫలమనుభవించటానికి వచ్చింది. లక్ష్యాలక్ష్యాలను వదలి కేవలము ఆత్మరూపుడైన బ్రహ్మవిదుడు స్వయంగా పరబ్రహ్మమే అవుతాడు.

బ్రహ్మవిదుడు జీవించి ఉన్నప్పుడే సర్వదా విముక్తుడవుతాడు. కృతార్థుడవుతాడు. ఉపాధి నశించటంవల్ల సద్రూప అధ్యయమగు పరబ్రహ్మ అవుతున్నాడు. నటుడు ఆడవేషం వేసుకున్నా, వేసుకోకపోయినా పురుషుడే అయినట్లుగా, బ్రహ్మవేత్త ఎల్లప్పుడూ బ్రహ్మమే అవుతాడు. కుండ పగిలిపోయినప్పుడు, ఘటాకాశం కూడా మహదాకాశమే అవుతుంది. అలాగే ఉపాధి నశించినప్పుడు బ్రహ్మవేత్త స్వయంగా బ్రహ్మమే అవుతున్నాడు. ఆత్మవేత్త అయినవాడు. పాలలో పాలుకలసినట్లుగా, నూనెలో నూనెపోసినట్లుగా, నీటిలో నీటిని పోసినట్లుగా, తన ఆత్మను పరమాత్మలో ఏకం చేసి సుఖిస్తున్నాడు. ఈ రకంగా అఖండాత్మానందం అనుభవిస్తూ విదేహముక్తి పొందిన యతి మళ్ళీ జన్మించడు. అతడు కేవలము బ్రహ్మభావన పొందుతాడు.

విద్యావిషయమైన భ్రాంతులన్నీ బ్రహ్మవిజ్ఞానంలో దగ్ధమైపోయిన తరువాత, అతడికి పునర్జన్మ ఉండదు. తాడు పాములాగా ఉంటుంది. అలాగే మాయచేత కల్పించబడిన బంధమోక్షాలు యదార్థంగా బ్రహ్మకు లేవు. సత్తు, అసత్తు, బంధము, మోక్షము ఇవేవీ బ్రహ్మలో ఉండవు. ఈ పదార్థం ఉన్నది. ఈ పదార్థం లేదు అని చెప్పే భావము బుద్ధియొక్క గుణము. నిత్యమైన ఆత్మలో అస్తి, నాస్తి లేవు. బంధమోక్షాలన్నీ మాయాకల్పితాలు. నిష్కళము, నిష్క్రియము, శాంతము, నిరవద్యము, నిరంజనము, అద్వితీయము అయిన తత్త్వములో కల్పన ఉండదు. నిరోధము లేదు. బద్ధుడు లేడు ముక్తుడు లేడు. సాధకుడు లేడు మోక్షం లేదు. ఇదే పదార్థము. అదే పరమాత్మ.

చరాచర జగత్తులో నామరూపాత్మకమైనవన్నీ అశాశ్వతాతలే. అసలు జగత్తే లేదు. బ్రహ్మము ఒకటే సత్యము నిత్యము శాశ్వతమైనది. ఈ జగత్తంతా మిధ్య. భ్రాంతిచేత కల్పించబడింది. అజ్ఞానము చేత కల్పించబడింది.

జగత్తును సృష్టించటానికి ప్రత్యేకంగా బ్రహ్మదేవుడు లేడు. కలలను సృష్టించినట్లే ఈ జగత్తును మనస్సే సృష్టిస్తోంది. బ్రహ్మదేవుడు చేసేది సమిష్టి సృష్టి. జగత్తులోని జీవరాసి యొక్క సమ్మేళనమే బ్రహ్మదేవుడు. ఈ కారణం చేతనే బ్రహ్మ చేసే సృష్టి

అందరికీ కనుపిస్తుంది. మనసులేని పసిపిల్లవాడికి, పిచ్చివాడికి ఈ జగత్తు గాని, సృష్టి గాని కనుపించవు. స్వప్నంలాగానే ఈ జగత్తు అంతా కల్పనామాత్రము. మానవుడికి జ్ఞానం కలిగినట్లైతే ఈ జగత్తు నశిస్తుంది. ఒకవేళ ఈ జగత్తు గనక సత్యమైనది అయితే జ్ఞానం కలిగినా అది నశించదు. భ్రాంతి సిద్ధమైన వస్తువులు జ్ఞానంతో నశించిపోతాయి. జ్ఞాన సముపార్జనతో నశించే వస్తువులు అసత్యమైనవి. దీనికంతటికీ కారణం మనస్సు. తన రచనాశక్తితో 84 లక్షల రకాలైన జీవరాసితో ఈ జగత్తును సృష్టించి బ్రహ్మవేత్తలను కూడా అందులో ముంచేస్తుంది. ఈ జగత్తంతా మనసువల్లనే కల్పించబడుతున్నది. యధార్థంగాచూస్తే సంసారంలేదు. మనసు పనిచేయని సుషుప్తి, మూర్ఛ వంటి అవస్థలలో సంసారం కనుపించదు. మనసు ఉన్నచోటే లోకాలున్నాయి. మనసు లేకపోతే లోకాలు లేవు. సృష్టి లేదు అసలు జగత్తే లేదు.

ఎడారిలో ప్రయాణం చేసేవారికి ఎండమావులు నీరులాగా కనిపిస్తాయి. అలాగే బ్రహ్మమును గురించి తెలియని అజ్ఞానులకు జగత్తు సత్యంగా కనుపిస్తుంది. అవి ఎండమావులు అనే జ్ఞానం కలిగినట్లైతే, ఎండమావులలో నీరు కనుపించదు. అలాగే జగత్తుకు అధిష్ఠానమైన బ్రహ్మము గురించి తెలియగానే జగత్తంతా పరబ్రహ్మగానే దర్శనమిస్తుంది. అంటే అప్పటిదాకా కనుపించిన జగత్తు ఏమవుతుంది? ఏమీ కాదు. ఇక్కడ నుంచి ఎక్కడికి పారిపోదు. పరబ్రహ్మలో లయమై పోదు. మరి ఏమవుతుంది? అంటే – బ్రహ్మరూపంలో నిలిచి ఉంటుంది. ఒక పదార్థంలో అజ్ఞానంతో ఆరోపించబడిన వస్తువు, జ్ఞానభావన కలగగానే ఆధారమైన పదార్థము యొక్క స్వరూపముతో తప్ప ఇతరమైన దేనియందు లయమవటం గాని, ఎక్కడికైనా వెళ్ళిపోవటంగాని జరగదు. ఇదే రజ్జుసర్పభ్రాంతి. తాడును చూసి పాము అనుకుంటున్నాము. అది నిజంగా పాముకాదు. అజ్ఞానంతో దాన్ని పాము అనుకుంటున్నాము. ఇప్పుడు జ్ఞానం కలిగింది. అజ్ఞానం పోయింది. త్రాడులో ఉన్న పాము ఇప్పుడు లేదు. ఏమైంది? చచ్చిపోయిందా? పారిపోయిందా? నాశనమై పోయిందా? ఎక్కడైనా లయమై పోయిందా? అంటే ఏమీ కాలేదు. అది తన అధిష్ఠాన రూపంలో నిలిచిపోయింది. త్రాడు త్రాడుగానే మిగిలిపోయింది. విచిత్రం ఏమంటే త్రాడు ఎప్పుడూ త్రాడుగానే ఉంది. అజ్ఞానంతో నువ్వే దాన్ని పాము అనుకున్నావు. అజ్ఞానం పోగానే అది పాము అనే భావన పోయింది. త్రాడే మిగిలింది.

నీ అజ్ఞానం పోకముందు అక్కడ ఉన్నది త్రాడే. అజ్ఞానం పోయిన తరువాత అక్కడ ఉన్నది త్రాడే. అందులో ఏ మార్పు లేదు. ఉన్నదంతా నీ భావనలోనే ఉంది. అలాగే నీ అజ్ఞానంతో ఈ జగత్తును భావన చేశావు. అజ్ఞానం పోయిన తరువాత జగత్తు లేదు. కేవలము బ్రహ్మము మాత్రమే మిగిలింది. అందుకే **బ్రహ్మసత్యము** జగన్మిధ్య. నీ అజ్ఞానం పోకముందు ఇక్కడ జగత్తు లేదు. పోయిన తరువాత జగత్తు లేదు. పరబ్రహ్మలో జగత్తును నువు అజ్ఞానంతో భావన చేశావు. అజ్ఞానం కాస్తా పటాపంచలైపోయింది. ఇప్పటిదాకా చిమ్మచీకట్లు క్రమ్ముకున్నాయి. ఆ చీకటిలో అనేక రకాలైన భూతాలు, పిశాచాలు, దెయ్యాలు కనుపించాయి. ఇప్పుడు జ్ఞానజ్యోతులు వెలిగాయి. ఆ దివ్యమైన ప్రకాశంతో చీకటి ఎగిరిపోయింది. ఇప్పుడు యధార్ధం గోచరిస్తోంది. అక్కడ దెయ్యాలు, భూతాలు ఏవీలేవు. అదంతా నీ భ్రాంతి. ఆ భ్రాంతి తొలగిపోయింది. అలాగే ఇక్కడ కూడా అజ్ఞానమనే చీకట్లు తొలగిపోగానే అప్పటివరకు కనుపించిన జగత్తు కనుపించకుండా పోయింది. ఎక్కడికి పోయింది అంటే భ్రాంతి పోయింది అంతే. అసలు అక్కడ జగత్తే లేదు. అది ఎక్కడికీ పోలేదు. దేనిలోనూ లీనం కాలేదు. ఈ జగత్తంతా భ్రాంతి అనే మాటను నువ్వు తెలుసుకున్నావు. ఉన్నది ఒక్కటే. సత్యము, నిత్యము శాశ్వతము అయిన పరబ్రహ్మ. నామరూపాత్మకమైన జగత్తంతా భ్రాంతిచే కల్పించబడింది. అందుకే **బ్రహ్మసత్యం జగన్మిధ్య.**

తత్త్వం తెలుసుకోవాలనే కోరిక ఉన్నవాడికి పరమేశ్వర తత్త్వాన్ని ఏ రకంగా చెప్పినా అర్థం చేసుకుంటాడు. జీవితంలో బంధమోక్షాలు అంటాం. విషయ వాంఛలే బంధాలు. వాటిమీద విరక్తియే ముక్తి. పరబ్రహ్మను గురించిన జ్ఞానం గనక తెలిస్తే, అప్పటివరకు గలగలా మాట్లాడేవాడు మూగబోతాడు. చకచకా తిరుగుతూ పనులు చేసేవాడు అలా తిరగటం మానేస్తాడు. అందుచేతనే లౌకిక విషయాల యందు కోరిక ఉన్నవారు బ్రహ్మజ్ఞానాన్ని ద్వేషిస్తారు. నీవు అంటే దేహం కాదు. నువ్వు కర్తవీ కాదు భోక్తవీ కాదు. అన్నింటికీ సాక్షి చైతన్యానివి. రాజా ! రాగద్వేషాలు, మనోధర్మాలు నీది అని చెప్పుకుంటున్న నీ మనస్సు ఏవీ నీవి కాదు. అన్ని ప్రాణుల యందు చైతన్యంగా నువ్వు ఉన్నావు. జగత్తంతా నీలోనే ఉన్నది. సముద్రంలోని తరంగాల లాగా జగత్తంతా నీలోనే ఆవిర్భవిస్తున్నది. నీవే జ్ఞానస్వరూపానివి. నీవే ఈశ్వరుడవు. నీవే ఆత్మవు. పాంచభౌతికమైన ఈ దేహం జనన మరణాలతో కూడి

ఉంటుంది. ఆత్మకు చావు పుట్టుకలు లేవు. నీవు ఆత్మచైతన్యానివి. ఈ శరీరం ఉన్నా పోయినా జరిగేది ఏమీ లేదు. నువు శుద్ధ చైతన్యానివి. నువ్వు వేరు జగత్తు వేరు కాదు, మార్పులు లేనిది, కళంకరహితమైన శాంతమైన ఆత్మస్వరూపానివి నువ్వు. ఆభరణాలు ఏవీ బంగారం కన్న వేరు కాదు. అలాగే నువ్వు చూసే జగత్తంతా నీకన్న వేరైనది కాదు. కాబట్టి ఓ జనక మహారాజా! ఇది నేను. అది నేను కాదు అనే భావనలు విడిచిపెట్టు. కోరికలు లేకుండా హాయిగా జీవించు. కేవలం అజ్ఞానం వల్లనే ఈ జగత్తు ఉన్నట్లుగా అనిపిస్తోంది. నిజానికి ఇక్కడ నువ్వు తప్ప ఏదీలేదు. జగత్తంతా మనసుచేత కల్పించబడిన భ్రాంతి. ఈ విషయం తెలిస్తే కోరికలన్నీ నశించి శాంతంగా ఉంటావు. త్రికాలములందు ఉన్నది ఆత్మ మాత్రమే. నువ్వు చెయ్యవలసింది ఏదీ లేదు. కాబట్టి ఓ జనక మహారాజా! సంకల్ప వికల్ప రూపమైన అశాంతిని వదలిపెట్టు. పరమశాంతంగా జీవించు. ధ్యానాన్ని కూడా వదలిపెట్టు. దానితో నీకు పనిలేదు. నీవు ముక్తమైన ఆత్మవు. ధ్యాన ధారణలతో నీకు పనిలేదు. కాబట్టి అన్నింటినీ త్యజించి పరమశాంతంగా జీవించు అంటున్నాడు అష్టావక్రుడు.

ఈ విషయాలన్నీ అష్టావక్రుడు జనక మహారాజుకు చెప్పినట్లుగా కనుపిస్తాయి. జనక మహారాజు చిన్మాత్ర స్వరూపుడు అని గతంలోనే చెప్పుకున్నాం. కాబట్టి ఈ విషయాలు జనకుని పేరుతో ఆయనకు చెబుతున్నట్లుగా సామాన్యులమైన మనకు చెబుతున్నాడు అష్టావక్రుడు ఈ అధ్యాయంలో.

**యథా తథోపదేశేన కృతార్థః సత్త్వబుద్ధిమాన్ ।**
**ఆజీవమపి జిజ్ఞాసుః పరస్తత్ర విముహ్యతి ॥ 1**

సత్త్వగుణ ప్రధానుడైన సత్యాన్వేషికి ఆత్మతత్త్వం ఒక్కసారి చెబితే చాలు గ్రహించేస్తాడు. అదే సామాన్యుడి ఎన్నిసార్లు చెప్పినా బోధపడదు.

ఆత్మ విద్య. దీన్నే బ్రహ్మవిద్య అని కూడా అంటారు. ఎవరికైనా బ్రహ్మవిద్య యందు ఆసక్తి కలగాలంటే గత 21 జన్మలలో పుష్కలంగా పుణ్యం సంపాదించుకుని ఉండాలి. అదే బ్రహ్మవిద్య అవగతం కావాలంటే కొన్ని వందల జన్మల సంస్కారం ఉండి తీరాలి. ప్రతిజన్మలోను తపస్సు వేదాధ్యయనము, యజ్ఞయాగాదులు, దాన ధర్మాలు చేసి ఉండాలి. శాస్త్రాధ్యయనం చేసి ఉండాలి. అటువంటి మహానుభావుడే బ్రహ్మవిద్య నభ్యసించటంలో కృతకృత్యుడవుతాడు.

యజ్ఞయాగాది క్రతువులు, వేదాధ్యయనము, తపస్సు చాలామంది చెయ్యవచ్చు. తమోగుణ ప్రధానులు రాక్షసులు. తపస్సు చెయ్యటంలో వీరికి వీరే సాటి. ఒకసారి దేవతలకు రాక్షసులకు కూడా 'మృత సంజీవినీ' విద్య నేర్చుకోవాలనిపించింది. ఆ విద్య ఈశ్వరుడి దగ్గర ఉన్నది. రాక్షసగురువైన శుక్రాచార్యుడు ఈశ్వరుడి దగ్గరకు వెళ్ళి మృతసంజీవిని కావాలి అని అడిగాడు. చుట్టూరా పచ్చికట్టెలు మంట పెట్టి, వాటినుంచి వచ్చే పొగ పీలుస్తూ, తలక్రిందులుగా నిలబడి 10 వేల సంవత్సరాలు తపస్సు చేస్తే, ఆ విద్య నీకు సిద్ధిస్తుంది అన్నాడు శివుడు. సరేనని హిమాలయాలకు వెళ్లిపోయాడు శుక్రుడు తపస్సు చెయ్యటానికి. కొంత కాలానికి దేవతల తరఫున ఇంద్రుడు వచ్చి ఈశ్వరుణ్ణి మృతసంజివనీ విద్య కావాలని అడిగాడు శుక్రాచార్యుడికి చెప్పినట్లే ఇంద్రుడికీ చెప్పాడు ఈశ్వరుడు. ఇది జరిగేది కాదు. ఎవరూ ఈ పని చేయలేరు అన్నాడు ఇంద్రుడు. ఇప్పుడే శుక్రాచార్యుడు వచ్చి మృతసంజివినీ విద్య కావాలని అడిగాడు. నీకు చెప్పినట్లే అతడికీ చెప్పాను. సరేనని తపస్సు చెయ్యటానికి హిమాలయాలకు వెళ్ళిపోయాడు. అని చెప్పాడు ఈశ్వరుడు. ఆ మాటలు విన్న ఇంద్రుడు చిన్నగా నవ్వి, శుక్రుడి వల్ల ఆ పని కాదు. అని అక్కడ నుంచి వెళ్ళిపోయాడు. హిమాలయాలకు వెళ్ళిన శుక్రాచార్యుడు అచంచలమైన దీక్షతో పదివేల సంవత్సరాలు ఈశ్వరుడు చెప్పినట్లే తపస్సు చేసి మృతసంజీవిని విద్యను సాధించాడు. తమోగుణ ప్రధానులైన అసురులకు భయంకరమైన పట్టుదల ఉన్నది. కాబట్టే వారు అనేకసార్లు దేవతలను కూడా జయించి త్రిలోకాధిపత్యము సంపాదించారు. తపస్సు, యజ్ఞయాగాది క్రతువులు చెయ్యటంలో వీరికి వీరే సాటి. అయినప్పటికీ తమోగుణం కారణంగా బ్రహ్మవిద్య వీరికి అబ్బలేదు.

రజోగుణ ప్రధానులు మానవులు, వేదాధ్యయనము, తపస్సు, యజ్ఞయాగాది క్రతువులు చేస్తారు. కాని రజోగుణ ప్రభావంచేత విషయ వాంఛల నుండి బయట పడలేరు.

సత్త్వగుణ ప్రధానులు ఋషీశ్వరులు, మునీశ్వరులు. చాంద్రాయణ వ్రతాలతో శరీరాన్ని శుష్కింపచేసి తపస్సు, యజ్ఞము, దానము మొదలైనవి చేస్తూ భగవస్సాక్షాత్కారం కోసం పరితపిస్తారు. వీరిలో కొంతమంది కృతకృత్యులైనారు.

ఇక దేవతల విషయం చూస్తే వీరు సత్త్వగుణ ప్రధానులే. కాని అశరీరులు. ఏ కర్మ చెయ్యాలన్నా భూలోకంలో జన్మించి చెయ్యవలసిందే. అయితే దేవతలు బ్రహ్మవిద్యకు అర్హులేనా? అనే ప్రశ్న వచ్చినప్పుడు దేవతలకు బ్రహ్మవిద్యను తెలుసుకునే అర్హత ఉన్నది అని చెప్పాడు వ్యాసమహర్షి బ్రహ్మసూత్రాలలో.

తమోగుణ ప్రధానుడు కర్మలు చెయ్యటం ద్వారా రజోగుణ సంపన్నుడిగా, రజోగుణం కలిగిన వాడు కర్మానుష్ఠానం వల్ల సత్వగుణ సంపన్నుడిగా మారతాడు. ఇప్పుడు సత్త్వగుణ సంపన్నుడు అనేక జన్మలు సాధన చేస్తే బ్రహ్మవిద్యను అభ్యసించగలుగుతారు. బ్రహ్మవిద్య పూర్తిగా పట్టుబడాలంటే వాసనాక్షయము, మనోజయము కావాలి. ఇవి సాధించిన వాడికి బ్రహ్మవిద్యను ఏ రకంగా ఉపదేశించినా పట్టు పడుతుంది. ఇవి లేని వాడికి బధిరశంఖారావం లాగా ఉంటుంది. అతడికి బ్రహ్మవిద్య ఏ మాత్రము అర్థం కాదు.

**మోక్షో విషయ వైరస్యం బంధో వైషయికో రసః ।**
**ఏతావదేవ విజ్ఞానం యథేచ్ఛసి తథా కురు ॥ 2**

'జనక మహారాజా! విషయ భోగాలపై విరక్తే ముక్తి. విషయ వాంఛలే బంధం. ఈ విషయం తెలుసుకుని నీకు నచ్చినట్లుగా ఉండు' అంటున్నాడు అష్టావక్రుడు.

ఈ శ్లోకంలో బంధ మోక్షాలను వివరిస్తున్నారు. ముక్తి అంటే విముక్తి ఐహిక, లౌకిక బంధాల నుండి విముక్తి ఇప్పుడు బంధాలు అంటే ఏమిటో చూద్దాం. మానవుడికి ఉన్న విషయవాసనలే బంధాలు. విషయ వాసనలు అంటే లౌకికమైన వస్తువులమీద, వ్యక్తులమీద అభిమానము, ప్రేమ, వాటిమీద తనకుండే కోరిక. నిజజీవితంలో ఏదో ఒక వస్తువు తనకు కావాలి అనుకోవచ్చు. దాని కోసం శతవిధాల ప్రయత్నం చేస్తాడు. దాన్ని సాధించటానికి అనేక కర్మలు చేస్తాడు. ఈ కర్మల వల్ల పాపపుణ్యాలు వస్తాయి. ఏదైనా సాధించాలి అంటే యజ్ఞయాగాది సత్కర్మలే చేస్తారు కదా? అనుకోవచ్చు అది నిజం కాదు. కొన్నిసార్లు దుర్మార్గమైన, భయంకరమైన పనులు కూడా చేయవలసి ఉంటుంది. చక్రవర్తిత్వము కావాలంటే చాలామంది రాజుల్ని యుద్ధంలో ఓడించాలి. రక్తపాతం జరగాలి. అప్పుడే అతడు చక్రవర్తి అవుతాడు. ఇలా కొన్ని కర్మలు చేస్తే పాపం కూడా వస్తుంది. పాపపుణ్యాలను స్వర్గ

నరకాల్లో అనుభవించిన తరువాత కర్మశేషం అనుభవించటానికి భూలోకంలో జన్మిస్తాడు. పుణ్యకర్మలు చేసినవారు ఉత్తమ యోనులందు, పాపకర్మలు చేసినవారు నీచయోనులందు జన్మిస్తారు. ఇలా జన్మించి కర్మఫలితాన్ని అనుభవిస్తుంటారు. అయితే వీరిలో కొంతమంది ఇష్టప్రాప్తి, అనిష్ట పరిహారం కోసం యజ్ఞయాగాది క్రతువులు చేస్తారు. ఈ రకంగా కర్మలు చెయ్యటం వల్ల కోరికలు తీరి బంధాలు పెరుగుతాయి. ఉదాహరణకు దశరథ మహారాజు పుత్ర సంతానం కోసం పుత్రకామేష్టి యాగం చేశాడు. యాగఫలితంగా రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు నలుగురు పుత్రులు కలిగారు. వీరిలో రాముడు సుగుణాభిరాముడు. అతనిమీద విపరీతమైన అభిమానం పెంచుకున్నాడు దశరథుడు. ఆ అభిమానమే బంధమయింది. ఆ బంధం వల్లనే రాముడు అరణ్యాలకు వెళ్ళగానే అది భరించలేక 'హా రామా!' అంటూ ప్రాణాలు వదిలాడు ఈ బంధం ఎంత బలంగా ఉందో చూడండి. ఇలాగే ఉంటాయి బంధాలంటే. తెలియకుండానే ప్రాణాలు తీసేస్తాయి.

బంధాలు మూడు రకాలుగా ఉంటాయి. అవే 1.సాత్విక బంధాలు 2.రాజస బంధాలు 3.తామస బంధాలు. కర్మ మూడు రకాలుగా ఉంటుంది. 1.సంచితము 2.ఆగామి 3.ప్రారబ్ధము. వీటిలో ప్రారబ్ధకర్మ ఈ జన్మలో అనుభవించేది. ఇది మళ్ళీ మూడు రకాలు 1.ఇచ్ఛా ప్రారబ్దము 2.అనిచ్ఛా ప్రారబ్దము 3.పరేచ్ఛా ప్రారబ్దము

**1. ఇచ్ఛా ప్రారబ్ధము :** ఇష్టపూర్వకంగా కావాలని కోరి తెచ్చుకుని అనుభవించేది. భార్యాబిడ్డలు, ఆస్తిపాస్తులు, పెంపుడు జంతువులు వీటిమీద మమకారము. దశరథ మహారాజుకు శ్రీరామచంద్రుడి మీద ఉన్నది ఈ రకమైన బంధమే. అలాగే జడభరతుడు లేడిపిల్ల మీద మక్కువతో మరుజన్మలో లేడి అయి జన్మించాడు. ఇక్కడ ఇంకొక విచిత్రం కూడా ఉంది. భ్రమ రెండుఉ రకాలు 1.సంవాది భ్రమ 2.అసంవాది భ్రమ. సంవాది భ్రమ మళ్ళీ మూడు రకాలు 1.ప్రత్యక్ష సంవాది భ్రమ 2.అనుమాన సంవాది భ్రమ 3.ఆగమ సంవాది భ్రమ. ఇందులో ఆగమ సందాది భ్రమ విచిత్రంగా ఉంటుంది.

అజామీళుడీ కుమారుడి పేరు నారాయణుడు కుమారుడి మీద విపరీతమైన ప్రేమ తండ్రికి. అవసాన దశలో కుమారుణ్ణే తలుస్తూ, నారాయణా నారాయణా అంటూ ప్రాణాలు వదిలాడు. ఆ కారణం చేత అజామీళుడు మరణానంతరము

వైకుంఠం చేరాడు. అయితే ఇక్కడ ఈ బంధం వల్ల అతడికి మేలే జరిగింది. ఇటువంటివి చాలా తక్కువగా జరుగుతాయి. మానవుడికి సాత్విక బంధాలు పట్టుత్రాళ్ళు. బంగారు గొలుసులు.

రాజస బంధాలు నూలు త్రాళ్ళు. వెండి గొలుసులు తామస బంధాలు కంబారు త్రాళ్ళు. కొబ్బరి పీచుతో చేసినవి. ఇనుప గొలుసులు వీటిలో సాత్విక బంధాలు చూడటానికి అందంగా ఉంటాయి. వాటినే ఇచ్ఛా ప్రారబ్ధము అంటారు.

రాజస బంధాలు – అనిచ్ఛా ప్రారబ్ధము

తామస బంధాలు – పరేచ్ఛా ప్రారబ్ధముగా చెప్పవచ్చు

చేతులకు వేసిన సంకెళ్ళు బంగారువైనా ఇనుపవైనా తేడా ఏమీ లేదు. చేతులకు బిగుసుకుంటాయి. కాకపోతే బంగారు సంకెళ్ళు అందంగా కనుపిస్తాయి. అంతే. బంధం ఏదైనా, ఎలా ఉన్నా బంధమే.

కర్మఫలితాల వల్లనే బంధాలు ఏర్పడతాయి అని చెప్పుకున్నాం. మమ అనుకుంటే బంధం. నమమ అనుకుంటే మోక్షం. ఈ రెండింటికీ తేడా 'న' అనే ఒక్క అక్షరము. నాది అవుతుంటే బంధం. నాది కాదు అనుకుంటే మోక్షము. మోక్షమార్గం వైపు పయనించే వాడు నేను నాది అనే అహంకార మమకారాలను వదిలెయ్యాలి. లాభనష్టాలు, కష్ట సుఖాలు, పుణ్యపాపాలు, అహంకార మమకారాలు, అరిషడ్వర్గము. వీటన్నింటి త్యజించాలి. కోరికలు పూర్తిగా నశించాలి. సంకల్ప వికల్పాలకు కారణం మనస్సు. అటువంటి మనసును జయించాలి. జగత్తులో ఆ పరబ్రహ్మ తప్ప ఇంకెవరూ లేరు. జగత్తే పరబ్రహ్మ. పరబ్రహ్మమే జగత్తు. ఆ పరబ్రహ్మమే నేను అని త్రికరణ శుద్ధిగా భావించిన వాడు మోక్షం పొందుతాడు. పరబ్రహ్మను గురించి తెలుసుకున్న వాడు కూడా బ్రహ్మమే అవుతాడు. **బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి.** ఇది మోక్షం. విషయ వాంఛలలో చిక్కుకోవటమే బంధము. వాటి నుండి విడివడటమే మోక్షము. కాబట్టి ఓ జనక మహారాజా! ఈ విషయం తెలుసుకుని నీ ఇష్టం వచ్చినట్లుగా జీవించు అంటున్నాడు అష్టావక్రుడు.

**వాఙ్మిప్రాజ్ఞమహోద్యోగం జనం మూక జడాలసమ్ ।**
**కరోతి తత్త్వబోధోఽయ మతస్త్యక్తో బుభుక్షుభిః ॥ 3**

చురుకుగా తెలివిగా ఉండేవాడిని ఈ జ్ఞానం మూగవాడుగా, నిర్లిప్తంగా మారుస్తుంది. అందుచేతనే విషయభోగాల యందు ఆసక్తి గలవారు బ్రహ్మజ్ఞానాన్ని ఇష్టపడరు. ద్వేషిస్తారు.

లౌకికమైన వ్యవహారాలలో చిక్కుకున్నవాడు ఎప్పటికప్పుడు తాను చేసిన కర్మల ఫలితం అనుభవిస్తూ విపరీతమైన సంతోషంతో, ఆనందంతో మహా చురుకుగా ముందుకు వెడతాడు. ఏదో ఒక పని చేశాడు. లాభం వచ్చింది. దాంతో ఇంకొంచెం ముందుకు వెడతాడు. ఇలా వెళ్ళటానికి చాలా చొరవ చూపిస్తాడు. తాను చేసిన పనిలో విజయం సాధిస్తే వేగంగా ముందుకు కదుల్తాడు కాని ఆధ్యాత్మిక జీవనము అలా కాదు. లౌకికానికి పూర్తిగా విరుద్ధమైనది. విషయ వాసనలు పనికి రావు. లౌకికమైన విషయాల్లో చాలా తెలివిగా చురుకుగా వ్యవహరించేవాడు, ఆధ్యాత్మిక విషయాల దగ్గరకు వచ్చే సరికి ఇబ్బంది పడతాడు. ఇవి అందరికీ అర్థం కావు. ఒకవేళ అర్థమైనా **బ్రహ్మసత్యం జగన్మిథ్య.** దృశ్యమానమైన జగత్తంతా మిథ్య. భ్రమ. భ్రాంతి. జగత్తు అనేది ఏదీ లేదు. నీ కంటికి కనుపించేదంతా వట్టిదే. నువ్వు అనుభవిస్తున్నా ననుకుంటున్న భోగభాగ్యాలు సిరిసంపదలు. నీతో సంబంధం ఉన్న బంధుమిత్రులు, భార్యాపిల్లలు ఎవరూలేరు. నువు సంపాదించాననుకుంటున్న ఆస్థిపాస్తులు కూడా నిజంకాదు. అంతా మిథ్య. ఈ మాటలు వినేసరికి అతడికి ఏం చెయ్యాలో తెలియదు. ఏం మాట్లాడాలో అసలు తెలియదు. అందుకే అతడు మూగవాడులాగా జడుడు లాగా అయిపోతాడు.

పూర్వకాలంలో బ్రహ్మవిద్యలో దధ్యమహర్షి నిష్ణాతుడు. ఒకరోజున దేవేంద్రుడు అతని ఆశ్రమానికి వచ్చాడు. వచ్చినవాడు సాక్షాత్తు దేవేంద్రుడు. అందుకని దధ్యమహర్షి ఎదురేగి ఇంద్రుడికి స్వాగతం పలికాడు. కుశలప్రశ్నలు అయిన తరువాత 'మహర్షీ ! నేను చిన్న పనిమీద వచ్చాను' అన్నాడు ఇంద్రుడు. 'ఏం కావాలో చెప్పు దేవేంద్రా!' అన్నాడు దధ్యుడు. 'ముందుగా నువు నాకు ఒక మాట ఇవ్వాలి. తీరా నేను అడిగిన తరువాత కాదనకూడదు' అన్నాడు ఇంద్రుడు. అలాగే అన్నాడు దధ్యుడు. ఇప్పుడు ఇంద్రుడు 'నాకు బ్రహ్మవిద్య నేర్చుకోవాలని ఉన్నది. దాన్ని నువ్వే నాకు చెప్పాలి' అన్నాడు. ఇరకాటంలో పడ్డాడు దధ్యమహర్షి. ఇంద్రుడు త్రిలోకాధిపతి. దేవరాజు. స్వర్గాధిపతి. నిరంతరము అప్సరాంగనలతో సరససల్లాపాల్లో తేలియాడు

తుంటాడు. బ్రహ్మవిద్య విషయ వాంఛల కతీతమైనది. ఇది పూర్తిగా ఆధ్యాత్మిక విద్య. విషయవాసనలు లేనివారికి మాత్రమే చెప్పగలిగేది. తానేమో చెబుతానని ఇంద్రుడికి మాటిచ్చాడు. చెబితే అపాత్ర దోషం. చెప్పకపోతే అసత్యదోషం. ఇప్పుడేం చెయ్యాలి' ఆలోచిస్తున్నాడు దధ్యుడు. మళ్ళీ ఇంద్రుడే అడిగాడు. 'ఏం మహర్షీ! బ్రహ్మవిద్య చెబుతానన్నావు. ఇప్పుడు మళ్ళీ ఆలోచనలో పడ్డావు. నాకు బ్రహ్మవిద్య చెబుతావా? చెప్పవా?' అన్నాడు. చేసేది ఏమీలేక 'రేపు ఉదయం మిగిలిన శిష్యులతో పాటు గారా!' అన్నాడు.

మరునాడు శిష్యులతో పాటుగా వచ్చాడు ఇంద్రుడు. కౌపీనధారియై ఉన్నాడు. మహర్షి చెప్పటం ప్రారంభించాడు. చరాచర జగత్తంతా మిథ్య. రాజులు, రాజ్యాలు, సిరిసంపదలు, భోగభాగ్యాలు, పరిచారికలు, అప్సరాంగనలు అంతా మిథ్య' అన్నాడు వెంటనే లేచాడు ఇంద్రుడు మహర్షీ! నన్ను అవమానించటానికే ఈ మాటలు చెబుతున్నావు. ఇక్కడ ఏది అబద్ధం? నా రాజ్యమా? త్రిలోకాధిపత్యమా? అప్సరాంగనలా? స్వర్గమా? అన్నీ యధార్థమే. మరి దేన్ని అబద్ధం అంటున్నావు? ఇలాంటి మాటలు ఇంకొకసారి చెప్పావంటే వజ్రాయుధంతో నీ తల నరికేస్తాను' అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఇక్కడ చూడండి. ఇంద్రుడు లౌకికవాది ఆధ్యాత్మిక విషయాలమీద నమ్మకం ఉండదు. అతనికి బ్రహ్మవిద్య చెప్పకూడదు. లౌకికవాదులు, విషయ భోగాల యందు కోరిక ఉన్నవారు ఈ రకమైన జ్ఞానాన్ని ఇష్టపడరు పైగా ద్వేషిస్తారు.

**న త్వం దేహో న తే దేహో భోక్తా కర్తా న వా భవాన్ ।**
**చిద్రూపోఽసి సదాసాక్షీ నిరపేక్ష స్సుఖంచర ॥ 4**

ఈ శరీరమే నీవు కాదు. శరీరం నీది కాదు. నీవు కర్తవూ కాదు భోక్తవూ కాదు. అన్నింటికీ సాక్షిగా ఉండే ఆత్మచైతన్యానివి. ఈ విషయం తెలుసుకుని సుఖంగా ఉండు. అంటున్నాడు అష్టావక్రుడు జనక మహారాజుతో

పరమేశ్వరుడు మానవదేహాన్ని సృష్టించిన తరువాత, ఈ దేహంలో నేను లేకపోతే ఎలాగ? అనుకున్నాడు. అనుకున్నదే తడవుగా బ్రహ్మరంధ్రం ద్వారా మానవ దేహంలో ప్రవేశించాడు. అలా ప్రవేశించి జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సుల

ద్వారా లౌకిక సుఖాలన్నీ అనుభవిస్తూ ఈ దేహం చేసే ప్రతిపనికీ కర్త, భోక్త కూడా తానే అని భావించాడు. సుఖాలు అనుభవిస్తూ దేహంలోనే ఉండిపోయి వచ్చిన దారి కూడా మరిచిపోయి పంజరంలో బంధించబడిన పక్షిలాగా దేహంలో బందీ అయిపోయి, అజ్ఞానంతో దేహమేఆత్మ. ఆత్మేదేహము అని భావన చేశాడు. ఇదంతా అజ్ఞానం వల్ల జరిగింది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో ఒక కథ ఉంది. ఒకసారి బ్రహ్మదేవుడు ఆత్మని గురించి ఒక ప్రకటన చేశాడు. "ఆత్మకు పాపం అంటదు. ముసలితనం రాదు. మృత్యువు దాన్ని కబళించదు. శోకం తాకదు. ఆకలి దప్పికలు ఉండవు. ఆత్మకోసం అన్వేషించినవాడు, ఆత్మను అనుభవించిన వాడు ఆత్మ స్వరూపం పొందుతాడు."

ఈ మాటలు విన్న దేవతలు, రాక్షసులు ఆత్మతత్త్వాన్ని తెలుసుకోవాలనుకున్నారు. దేవతల తరుఫున ఇంద్రుడు, రాక్షసుల తరఫున విరోచనుడు బ్రహ్మవిద్య నేర్చుకునేందుకు బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్ళారు. అక్కడ బ్రహ్మ కోరిక మీద ఒక సంవత్సరం దీక్షలో ఉన్నారు. తరువాత బ్రహ్మదేవుడు "మీ కనుపాపలలో కనుపించే పురుషుడే బ్రహ్మము. వెళ్ళి కొలనులో మీ ముఖాలు చూసుకోండి" అన్నాడు. వారు అలాగే చేసి బ్రహ్మ దగ్గరకు వచ్చి "స్వామీ! నీటి కొలనులో గడ్డాలు మీసాలతో అసహ్యంగా ఉన్న మా ముఖాలే కనుపించాయి" అన్నారు. 'మీ ముఖాలు శుభ్రం చేసుకుని వెళ్ళి చూడండి' అన్నాడు బ్రహ్మ. అలాగే చేశారు వారు. ఇప్పుడు అందంగా అలంకరించబడిన వారి ముఖాలు కొలనులో కనుపించాయి. అదే పరబ్రహ్మ స్వరూపము అని తలచి తిరుగు ప్రయాణమయ్యారు వారిద్దరూ. విరోచనుడు రాక్షసుల దగ్గరకు వెళ్ళి 'దేహమే ఆత్మ' అని చెప్పాడు. కాని ఇంద్రుడికి మార్గమధ్యంలో అనుమానం వచ్చి, మళ్ళీ బ్రహ్మని సేవించి పరబ్రహ్మ తత్త్వాన్ని తెలుసుకున్నాడు.

నేను అంటే దేహం కాదు. నేను అంటే ఆత్మ. దేహం వేరు ఆత్మ వేరు. మానవుడు అజ్ఞానంతో ఈ విషయం తెలుసుకోలేకపోతున్నాడు.

**మనోబుద్ధ్యహంకార చిత్తానినాహం**
**నశ్రోత్రం నజిహ్వా నచఘ్రాణ నేత్రే ।**
**న చ వ్యోమభూమిర్నతేజోనవాయుః**
**చిదానంద రూపశ్శివోహం శ్శివోహం ॥**

నేను అంటే మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనబడే అంతఃకరణ చతుష్టయము కాను. నేత్రము, శ్రోత్రము, నాలుక, నాశిక (జ్ఞానేంద్రియాలు) కాను. ఆకాశము, వాయువు అగ్ని, నీరు, భూ (పంచభూతాలు) కాను. చిదానంద రూపమైన పరమేశ్వరుడను అంటున్నారు శంకర భగవత్పాదుల వారు తమ **నిర్వాణషట్కం**లో

**అహం నామరోనైవమర్త్యో నదైత్యో**

**నగంధర్వ రక్షః పిశాచ ప్రభేధః ।**

**ప్రమాన్నైవ న స్త్రీ తథా నైవషండః**

**ప్రకృష్ట ప్రకాశ స్వరూప శ్శివోహమ్ ॥**

నేను దేవజాతివాడను కాను. మానవజాతి వాడను కాను. దైత్యుడను కాను. గంధర్వుణ్ణి కాను. రాక్షసుణ్ణి కాను పిశాచం అంతకన్నా కాను. పురుషుడను కాను, స్త్రీని కాను నపుంసకుడను కాను. సర్వోత్కృష్ట, సర్వావభాసక, చిత్రప్రకాశరూపుడైన పరబ్రహ్మను అంటారు **నిర్వాణమంజరి**లో

అందుకే జనక మహారాజా! నువ్వు దేహానివి కాదు. ఈ దేహం నీది కాదు. దేహము పంచభూతాల చేత నిర్మించబడింది. అందుకే దీన్ని పాంచభౌతికమైన దేహము అంటారు. **ఈశావాశ్యోపనిషత్తు**లో చెప్పినట్లుగా

**వాయురనిల మమృత మథేదం భస్మాంతం శరీరం**

**ఓం క్రతోస్మరకృతగ్గ్ స్మరక్రతోస్మరకృతగ్గ్ స్మర ।**

మరణానంతరము ఈ శరీరంలో ఉన్న గాలి గాలిలో నీరు నీటిలో, అగ్ని అగ్నిలో, ఆకాశం ఆకాశంలో కలిసిపోతాయి. మిగిలినదంతా బూడిదై భూమిలో కలిసిపోతుంది. కాబట్టి ఓ సాధకుడా ! గతంలో నువు చేసిన కర్మలు గుర్తు తెచ్చుకో అంటున్నారు.

మరణానంతరము దేహంలోని పంచభూతాలు ఆయా భూతాలలో కలిసిపోతాయి. కాబట్టి దేహము అంటే నువ్వు కాదు. అంతేకాదు రాజా! నువ్వు దేనికీ కర్తవూ కాదు భోక్తనీ కాదు.

సృష్టి ప్రారంభంలో 84 లక్షల జీవరాసిని సృష్టించిన తరువాత మానవుడిని సృష్టించిన పరమేశ్వరుడు, ఈ దేహంలో నేను లేకపోతే ఎలాగ? అని భావించినవాడై,

బ్రహ్మరంధ్రం ద్వారా మానవ శరీరంలో ప్రవేశించి, ఇంద్రియాలతో చేసే కర్మలన్నింటికీ తానే కర్త, భోక్త అని భావించి, కర్మఫలాలు అనుభవిస్తూ, పంజరంలో బంధించబడిన పక్షిలాగా ఈ దేహంలో బందీ అయిపోయాడు. దేహం నుంచి బయటకు వెళ్ళే మార్గం మరిచిపోయాడు. అలా దేహంలో బందీ అయిపోయి, ఇంద్రియాలు చేసే పనులన్నింటికీ తానే కర్తను అని భావిస్తూ, వాటి ఫలితాలు కూడా తానే అనుభవిస్తున్నాను. అనుభవించాలి. అని భావన చేస్తున్నాడు. ఈ భావన అజ్ఞానంతో వస్తోంది. నిజానికి ఇంద్రియాలు చేసే పనులకు ఆత్మపురుషుడు కర్తా కాదు, భోక్తా కాదు. ఇంద్రియాలు దేహానికి సంబంధించినవి. ఈ దేహంతో చేసిన కర్మలు దేహానికే వర్తిస్తాయి కాని ఆత్మకు కాదు. **ముండకోపనిషత్తు**లో చెప్పినట్లుగా సంసారమనే వృక్షంమీద ఒకే రూపము, వర్ణము, నామము గల రెండు పక్షులు కూర్చుని ఉన్నాయి. అందులో ఒకటి దొరికిన కాయలు, పండ్లు తింటున్నది. రెండవది ఏమీ తినకుండా దిక్కులు చూస్తూ కూర్చుంది. కాయలు, పండ్లు తింటున్నది జీవాత్మ. ఈ కాయలు పండ్లు కర్మఫలాలు. దిక్కులు చూస్తున్నది పరమాత్మ. పరమాత్మ ఏ రకమైన కర్మలు చెయ్యదు కాబట్టి దానికి కర్మఫలాలు ఉండవు. అందుచేతనే ఏమీ తినకుండా దిక్కులు చూస్తూ కూర్చుంది. అయితే జీవాత్మ, పరమాత్మలు వేరు వేరా? అంటే అదేమీ కాదు. రెండూ ఒకటే. కాని అజ్ఞానంవల్ల జీవాత్మ పరమాత్మ వేరు వేరు అనుకుంటున్నాము. అజ్ఞానం వదలిపోతే ఆ రెండూ ఒకటే అనే విషయం తెలుస్తుంది. అప్పుడు అక్కడ మిగిలేది పరమాత్మ ఒక్కటే.

జరిగే పనులన్నీ ఈ దేహంతోనే జరుగుతాయి. అంతే గాని వీటిని ఆత్మ చెయ్యదు. కన్ను చూస్తుంది. చెవి వింటుంది. నోరు మాట్లాడుతుంది. నిత్యజీవితంలో జరిగే పనులన్నీ ఇంద్రియాలే చేస్తాయి. ఇంద్రియాలు అంటే దేహమే. దేహం లేకుండా ఇంద్రియాలుండవు. కాబట్టి కర్మలన్నీ దేహమే చేస్తోంది. అంతేకాని ఆత్మ చెయ్యటం లేదు. అయితే ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. ఇంద్రియాలు స్వయంగా ఏ పనీ చెయ్యలేవు. ఇంద్రియాలకు చైతన్యాన్నిచ్చేది ఆత్మ. కంటికి చూసే శక్తినిచ్చేది ఆత్మ. చెవికి వినికిడి శక్తినిచ్చేది ఆత్మ. కాబట్టి పరోక్షంగా కర్మలన్నీ ఆత్మచేతనే చెయ్యబడుతున్నాయి కదా? దీనికి సమాధానం చూడండి. ఆత్మ ఇంద్రియాలలో ప్రవేశించి ఉండటమనేది కేవలము ఇంద్రియాలకు సంపూర్ణమైన శక్తినివ్వటానికే.

ఆత్మ ఇంద్రియాలలో ప్రవేశించి, వాటి పనులు అవి చేసుకునే సామర్థ్యాన్ని ఇంద్రియాలకు ఇస్తోంది. అంతేకాని ఇంద్రియాలు చేసే పనులకు, ఆత్మ పురుషుడికీ ఏ సంబంధము లేదు. ఆత్మ స్వయంగా ఏ పని చెయ్యదు.

కర్మలు చేసేది ఆత్మకాదు. ఆత్మకన్న ఇతరమైన దేహము కర్మలు చేస్తుంది. అయినప్పటికీ అజ్ఞానంవల్ల, జీవుడు ఈ పనులన్నీ నేనే చేశాను అని భావిస్తున్నాడు. దీనివల్ల భవబంధాలు పెరుగుతున్నాయి. ఆ బంధాలలో చిక్కుకుపోయి, బయటకు రాలేక శ్లేష్మంలో పడ్డ ఈగలాగా కొట్టుమిట్టాడుతున్నాడు.

అనాత్మ అయిన దేహము చేసే అన్ని పనులు ఆత్మే చేస్తున్నది అని భావించే వారు పెద్ద అజ్ఞానులు. 'ఆత్మయే అన్నింటికీ కర్త' అని భావించేవాడికన్న అజ్ఞాని ఈ జగత్తులోనే ఉండడు. తాను చేసే కర్మలన్నింటికీ కర్త ఆత్మయే అని భావించి, ఆ కర్మల వల్ల కలిగే పాపపుణ్యాలు, సుఖదుఃఖాలు తనవిగా భావించే వాడు పెద్ద అజ్ఞాని. ఆత్మ ఏ కర్మా చెయ్యదు. దేనికీ కర్తగాని, భోక్తగాని అంతకన్నా కాదు.

శంకర భగవత్పాదుల వారు **నిర్వాణమంజరి**లో చెప్పినట్లుగా

**అహంనైవ మన్తా నగన్తా నవక్తా**
**నకర్తా నభోక్తా నముక్తా శ్రమస్థః ।**
**యథాహం మనోవృత్తి భేదస్వరూప**
**స్తదా సర్వవృత్తి ప్రదీప శ్శివోహమ్ ॥**

నేను ఆలోచనలు చేసేవాడిని కాదు. నడిచే వాడిని కాదు. మాట్లాడే వాడిని కాదు. నేను దేనికీ కర్తను కాదు భోక్తను కాదు. యతిఆశ్రమంలో ఉన్నవాడిని కాదు. అన్ని రకాల మనోవృత్తి భేదాలు నామరూపాలే. మనోవృత్తులను ప్రకాశింపచేసే పరబ్రహ్మను నేనే.

కాబట్టి ఓ రాజా! నువ్వు దేనికీ కర్తవీ కాదు భోక్తవీ కాదు. సర్వానికీ సాక్షివి. ఆత్మచైతన్యానివి. ఈ విషయం తెలుసుకుని సుఖంగా ఉండు అంటున్నాడు అష్టావక్రుడు.

**రాగద్వేషౌ మనోధర్మౌ న మనస్తే కదాచన ।**
**నిర్వికల్పోఽసి బోధాత్మా నిర్వికార స్సుఖంచర ॥ 5**

రాజా ! రాగద్వేషాలు మనోధర్మాలు. వీటితో పాటుగా మనస్సుకూడా నీది కాదు. నీవు చైతన్యమూర్తివి. నీ సమక్షంలో అవన్నీ తెలియబడుతున్నాయి. అంతేకాని నీలో ఏ మార్పు రావటం లేదు. ఈ విషయం తెలుసుకుని సుఖంగా జీవించు.

కామక్రోధాలు, రాగద్వేషాలు, అహంకార మమకారాలు అన్నీ మనోధర్మాలు. అంతఃకరణ చతుష్టయంలో మనస్సు ఒకటి. శరీరంలో జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, అని పదిరకాల ఇంద్రియాలున్నాయి. పదకొండవ ఇంద్రియం మనస్సు. అయితే మిగిలిన ఇంద్రియాలు ఎక్కడ ఉన్నాయో మనకు తెలుసు. అవి కంటికి కనుపిస్తాయి. కాని మనస్సు అనే ఇంద్రియం కంటికి కనపడదు. దానికి ప్రత్యేకమైన స్థానం లేదు. మానవుడు ఏ ఇంద్రియంతో పని చేస్తుంటే, ఆ ఇంద్రియంలోనే ఉంటుంది మనస్సు. ఈ మనస్సే సంసారానికి కారణం. మనస్సు వల్లనే రాగద్వేషాలు, అహంకార మమకారాలు కలుగుతాయి. మమ అనుకుంటే బంధం. నమమ అనుకుంటే మోక్షం. మనస్సు ఉంటేనే సంసారం ఉంటుంది. కామసంకల్పాలు లేని మనస్సు శుద్ధమవుతుంది. రాజా! ఈ మనసు కూడా నువ్వు కాదు. భగవత్పాదుల వారు తమ **నిర్వాణషట్కం**లో చెప్పినట్లుగా

**నమేద్వేషరాగౌ నమే లోభమోహౌ**
**మదోనైవ మేనైవ మాత్సర్య భావః ।**
**న ధర్మో నచార్థో నకామో నమోక్షః**
**చిదానంద రూపశ్శివోహం శ్శివోహం ॥**

రాగద్వేషాలు, కామక్రోధాలు, లోభమోహాలు, మదమాత్సర్యాలు ఇవేవీ ఆత్మకు సంబంధించినవి కాదు. అంతఃకరణకు సంబంధించినవి. పురుషార్థాలు కాని కావు. నేను చిదానందరూపుడయిన ఈశ్వరుడను.

కాబట్టి రాజా ! నువు చైతన్యమైన ఆత్మవు.నీ సమక్షంలో అవన్నీ తెలియబడు తున్నాయి. నీలో ఏ రకమైన మార్పులేదు. ఈ విషయం తెలుసుకుని సుఖంగా జీవించు అంటున్నాడు అష్టావక్రుడు.

**సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**విజ్ఞాయ నిరహంకారః నిర్మమస్త్వం సుఖీభవ ॥** **6**

అన్ని ప్రాణులలోను చైతన్యంగా నువ్వు ఉన్నావు. జగత్తంతా నీలో ఉన్నది. ఈ విషయం తెలుసుకుని అహంకార మమకారాలు లేకుండా జీవించవలసింది.

**ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా మానవుడిని సృష్టించిన తరువాత ఈ దేహంలో నేను లేకపోతే ఎలాగ అనుకుని బ్రహ్మరంధ్రం గుండా మానవదేహంలో ప్రవేశించాడు. అదే జంతువుల శరీరములోకి కాలిగిట్టల ద్వారా ప్రవేశించాడు. ఈ రకంగా చరాచర జగత్తులోని 84 లక్షల రకాలయిన జీవులయందు ప్రవేశించాడు.

**బృహదారణ్యకోపనిషత్తు**లో ఉద్దాలకుడు యాజ్ఞవల్క్యుడిని అంతర్యామి అంటే ఎవరో వివరించవలసింది అంటాడు. దానికి యాజ్ఞవల్క్యుడు.

భూమి లోపల ఉంటాడు. భూమి అతణ్ణెరగదు. భూమే అతని శరీరం. భూమి లోపల ఉంటూనే భూమిని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

నీటిలోపల ఉంటాడు. నీరే అతడి శరీరం. కాని నీరు అతణ్ణెరుగదు. నీటి లోపల ఉంటూనే నీటిని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

అగ్నిలోపల ఉంటాడు. పంచభూతాలలోను ఉంటాడు. అవేవీ అతణ్ణెరుగవు. పంచభూతాలలో ఉంటూనే వాటిని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి అతడే ఆత్మ. అంతరిక్షంలో ఉంటాడు. అంతరిక్షం అతణ్ణెరగదు. అంతరిక్షమే అతడి శరీరము. అంతరిక్షంలో ఉంటూనే అంతరిక్షాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ.

అలాగే ద్యులోకంలో ఉంటాడు. ఆదిత్యలోకంలో ఉంటాడు. చంద్రునిలో, సూర్యునిలో అన్నింటి యందు ఉండి, అన్నింటినీ నియంత్రిస్తుంటాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ. అతడు కనుపించడు కాని చూస్తాడు. వినిపించడు కాని వింటాడు. తెలియబడడు. అర్థం కాడు. కాని అతనికి అన్నీ తెలుసు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ అంటాడు.

కంటికి చూసే శక్తి అంటే చైతన్యాన్నిచ్చేది ఆత్మ. చెవికి వినే శక్తినిచ్చేది ఆత్మ. ముక్కుకు వాసన చూసే శక్తిని ఇచ్చేది ఆత్మ. నాలుకను రుచి చూసే శక్తి నిచ్చేది ఆత్మ.

ఈ రకంగా ఆత్మ సర్వప్రాణి సమూహమందు వ్యాపించి ఉన్నది. అన్నింటికీ చైతన్యాన్నిచ్చేది ఆత్మే. జగత్తంతా పరమాత్మ వ్యాపించి ఉన్నాడు. అలాగే పరమాత్మ యందు చరాచర జగత్తంతా నిండి ఉన్నది. జగత్తే పరమాత్మ. పరమాత్మే జగత్తు. ఆ పరమాత్మవి ఆ చైతన్య స్వరూపానివి నీవే. జనక మహారాజా ! ఈ విషయం తెలుసుకుని అహంకార మమకారాలు లేకుండా జీవించు అంటున్నాడు అష్టావక్రుడు.

**విశ్వంస్ఫురతి యత్రేదం తరంగా ఇవసాగరే ।**
**తత్త్వమేవ న సందేహ శ్చిన్మూర్తే విజ్వరో భవ ॥ 7**

రాజా ! చైతన్య రూపమైన నీలో, సముద్రంలో తరంగాల లాగా ఈ జగత్తు స్ఫురిస్తున్నది. కాబట్టి మానసిక కల్లోలాన్ని వీడి సుఖంగా జీవించు.

బ్రహ్మానికి జగత్తుకు తేడాలేదు. జగత్తంతా బ్రహ్మము యొక్క మార్పు. భ్రాంతితో కూడిన రూపాంతరము. జగత్తుకు ఉపాదాన నిమిత్త కారణాలు రెండూ బ్రహ్మమే. అసలు జగదుత్పత్తికి కారణాలు రెండు 1.ఆరంభ వాదము 2.పరిణామవాదము

**1. ఆరంభ వాదము :** దారపు పోగులు కలిసి వస్త్రంగా ఏర్పడతాయి. ఇందులో ఆరంభంలో ఉన్న లక్షణాలు పోకుండానే ఇంకొక వస్తువు ఆవిర్భవిస్తోంది. నూలుపోగులు వస్త్రంగా ఏర్పడప్పుడు, నూలుపోగుల లక్షణాలు వస్త్రంలో ఉంటాయి. కాని నూలు వేరు వస్త్రం వేరు.

**2. పరిణామవాదము :** ఇందులో ప్రారంభంలో ఉన్న లక్షణాలు పోయి క్రొత్త లక్షణాలు వస్తాయి. పాలుతోడు వేస్తే పెరుగవుతుంది. పెరుగులో పాలు, పాల లక్షణాలు ఉండవు.

జగత్తు ఆరంభ పరిణామము వల్ల ఏర్పడలేదు. వివర్తము వల్ల ఏర్పడింది. అంటే భ్రాంతివల్ల ఒక వస్తువు ఇంకొక వస్తువుగా కనుపిస్తుంది. ఇదే రజ్జు సర్పభ్రాంతి. పరబ్రహ్మ ఈ జగత్తును సృష్టించలేదు. విత్తనం నుంచి చెట్టు వచ్చినట్లుగా, తండ్రి నుంచి తనయుడు పుట్టిన్లుగా బ్రహ్మము నుంచి ఈ జగత్తు ఆవిర్భవించలేదు. వివర్తము అంటే అవిద్య అజ్ఞానం వల్లకలిగిన అసత్యరూపము. అసలు ఇక్కడ జగత్తే లేదు. అంతా మాయ. అజ్ఞానం వల్ల, మనస్సు చేసిన కల్పన వల్ల జగత్తు ఉన్నట్లుగా అనిపిస్తోంది. అంతేకాని అసలు జగత్తే లేదు. బ్రహ్మదేవుడు

మనస్సంకల్పంతో ఈ సృష్టి చేశాడు. ఇది సమిష్టి సృష్టి. అందుకే అందరికీ సమానంగా కనుపిస్తుంది. ఒకే రకంగా కనుపిస్తుంది. మనసున్న వాడికే ఈ జగత్తు కనుపిస్తుంది. మనస్సు లేనివాడికి ఈ జగత్తు లేదు. అజ్ఞానం వల్ల ఆవరించబడిన మాయతో ఈ జగత్తు సత్యము అనుకుంటాము. అజ్ఞానం గనక తొలగిపోతే ఈ జగత్తు ఉండదు. మిగిలేది బ్రహ్మము ఒక్కటే జగత్తంతా బ్రహ్మము యొక్క భ్రాంతి సిద్ధమైన రూపము.

ఆరంభ పరిణామము వల్ల జనించినవి అధిష్ఠానానికి వికారం కలిగిస్తాయి. అసలు వస్తువు రూపాన్ని మారుస్తాయి. వివర్త పరిణామంలో అధిష్ఠానానికి ఏ రకమైన మార్పు లేకపోయినప్పటికీ, అజ్ఞానం వల్ల మార్పు ఉన్నట్లుగా కనుపిస్తుంది. ఈ కారణం చేత బ్రహ్మకు ఏ వికారాలు లేకపోయినా, అనేక రూపాలు ఉన్నట్లుగా అనిపిస్తుంది. ఇదే రజ్జు సర్పభ్రాంతి. త్రాడులో పాము లేకపోయినప్పటికీ పాము ఉన్నట్లుగా కనుపిస్తుంది. అసలు త్రాడు మాత్రం కనపడదు. అలాగే మరు మరీచికలు (ఎడారిలో ఎండమావులు) మొదలైనవి.

రాజా ! సముద్రంలో ఉన్నదంతా నీరే. ఆ నీరు గాలికి కదలి తరంగాలుగా వడ్డుకు చేరి, మళ్ళీ నీటిలో కలిసిపోతుంది. ఇక్కడ గుర్తించవలసిన విషయం ఏమంటే అలలు, తరంగాలు, సముద్రపు నురగ ఇవేవీ సముద్రపు నీటికన్న వేరు కావు. అక్కడ ఉన్నది సముద్రపు నీరు. అంతే అదే అధిష్ఠానము. ఆ నీరే అలలుగా, తరంగాలుగా కనుపిస్తుంది. అలాగే ఇక్కడ ఉన్నది బ్రహ్మము ఒక్కటే. మనస్సు యొక్క కల్పనల వల్ల ఆ బ్రహ్మము నానాత్వము పొంది అనేక రూపాలు గల జగత్తుగా నీకు కనుపిస్తున్నది. నిజంగా ఇక్కడ ఉన్నది బ్రహ్మమే. అంతకన్న ఇంకేదీ లేదు. **దక్షిణామూర్తి స్తోత్రంలో**

**విశ్వందర్పణ దృశ్యమాన నగరీతుల్యం నిజాంతర్గతం**
**పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథానిద్రయా**
**యస్సాక్షాత్కురుతే ప్రబోధ సమయే స్వాత్మానమేవాద్వయం**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥**

కలలో మనకు కనుపించినదంతా ఎక్కడో జరుగుతున్నట్లుగా భావిస్తాము. అలాగే మన మనస్సుచేత సృష్టించబడిన జగత్తును అద్దంలో కనుపించే ప్రతిబింబం

లాగా చూస్తున్నాము. మాయ తొలగిపోగానే జగత్తంతా మనలోనే కనుపిస్తుంది. కాబట్టి ఆత్మకన్న భిన్నమైనది ఏదీలేదు అని తత్త్వబోధ చేస్తున్న గురుదేవులు దక్షిణామూర్తికి నమస్కారము.

కాబట్టి మానసిక కల్లోలాన్ని వదలి నువ్వు సుఖంగా ఉండు.

**శ్రద్ధత్స్వతాత శ్రద్ధత్స్వ నాత్ర మోహం కురుష్వభోః ।**
**జ్ఞానస్వరూపో భగవానాత్మాత్వం ప్రకృతే పరః ॥ 8**

నాయనా ! జనక మహారాజా! నువ్వు శ్రద్ధను మాత్రం వదలద్దు. నువ్వు జ్ఞానస్వరూపానివి. నువ్వే ఆత్మవి. ప్రకృతికి అతీతంగా ఉన్నావు.

**శాస్త్రస్య గురువాక్యస్య సత్యబుద్ధ్యాత ధారణమ్**
**సా శ్రద్ధా కథితా సద్భిర్యయా వస్తూపలభ్యతే ॥**

శాస్త్రము, గురువు చెప్పే దానిమీద నమ్మకము ఉంచి యధార్థాన్ని యథాతథంగా గ్రహిస్తూ, వాక్యాల భావాన్ని అర్థాన్ని జాగ్రత్తగా గ్రహించగలగటాన్నే శ్రద్ధ అంటారు. అంటున్నారు శంకరుల వారు తమ **వివేక చూడామణిలో**

శ్రద్ధ అంటే – నమ్మకము, విశ్వాసము అని అర్థం. ఏదైనా విషయాన్ని చదివేటప్పుడు లేదా వినేటప్పుడు దానిమీద అత్యంతమైన నమ్మకంతోనే చదవాలి. లేదా వినాలి. దీన్నే శ్రద్ధ అంటారు. పరీక్షలకు తయారవుతున్నాము. పాఠాలు చదువుతున్నాం. మనం చదివిన సమాధానం వ్రాస్తే పరీక్షలో మంచి మార్కులు వస్తాయి. ఉత్తీర్ణులవుతాము అనే నమ్మకంతోనే చదువుతాం. పరీక్ష రాస్తాం. చదివిన విషయమంతా జాగ్రత్తగా పరీక్షలో వ్రాస్తాం. ఇదే శ్రద్ధ. అంటే అత్యంతమైన నమ్మకంతో మనసు పెట్టి పని చెయ్యటం. అయితే శాస్త్రాలలో చెప్పినది గ్రుడ్డిగా నమ్మటం కాదు. అవసరమైతే అది నిజమో కాదో పరీక్షించి చూడాలి. **యోగవాసిష్ఠం**లో రాముడు వశిష్ఠ మహర్షిని అడుగుతాడు. 'గురుదేవా! వేదంలో చెప్పిన విషయాలు నిజమో కావో మనం పరీక్షించాలి కదా?' అని అప్పుడు వశిష్ఠ మహర్షి 'రామా ! నీకన్న ముందు ఎంతోమంది ఈ పరీక్షలు చేసి వేదంలో చెప్పిన విషయాలు నిజమేను అని నిగ్గు తేల్చారు. కాబట్టి వేరుగా నువు మళ్ళీ పరీక్షించవలసిన అవసరం లేదు.' ఇలా ఇతరులు పరీక్షించిన విషయాలను మనం మళ్ళీ పరీక్షించ వలసిన అవసరం

లేదు. కాని శాస్త్రాలలో చెప్పిన విషయాలేవీ గ్రుడ్డిగా నమ్మనక్కరలేదు. వాటిని పరీక్షించి నిజానిజాలు తెలుసుకోవాలి. ఆ తరువాతనే వాటిని ఆచరించాలి.

తన బుద్ధిమీదా, శాస్త్రం మీదా నమ్మకం ఉంచుతూ చెప్పిన విషయాన్ని అర్థం చేసుకోవటానికి ప్రయత్నం చెయ్యాలి. తాను చేసే పనిమీద విశ్వాసము శ్రద్ధ ఉన్నవారు మాత్రమే లక్ష్యాన్ని సాధిస్తారు. గమ్యం చేరతారు. కాబట్టి ఓ రాజా! అత్యంతమైన నమ్మకంతో, విశ్వాసంతో నీవు జ్ఞానస్వరూపానివి. నీవు ఆత్మవు అనే విషయాన్ని నమ్ము నీవే ఆత్మవు. అంటున్నాడు అష్టావక్రుడు.

**గుణై స్సంవేష్టితో దేహస్తిష్ఠత్యాయాతి యాతి చ ।**
**ఆత్మా న గంతా నాగంతా కిమేవమనుశోచసి ॥ 9**

ఈ దేహం పాంచభౌతికమైనది. జన్మిస్తుంది. మరణిస్తుంది. ఆత్మకు రాకపోకల్లేవు. మరి దేన్ని గురించి విచారిస్తున్నావు? అని అడుగుతున్నాడు అష్టావక్రుడు.

సృష్టి ప్రారంభంలో జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని పరమేశ్వర స్వరూపము ఆవరించి ఉన్నది. కొంత కాలానికి పరమాత్మ సృష్టి చెయ్యాలి అనుకున్నది. అప్పుడు మొదటగా పరమాత్మ నుంచి సత్త్వగుణం బయటకు వచ్చింది. అదే మాయ, అవ్యక్తము అంటారు. తరువాత అవ్యక్తము నుంచి మహత్తత్త్వము వచ్చింది. అదే హిరణ్యగర్భుడు. రజోగుణము. దీన్నే మహత్తత్త్వము అంటారు. తరువాత మహత్తత్వము నుంచి అహంకారం వచ్చింది. అదే తమోగుణము విరాడ్రూపము. తరువాత పంచతన్మాత్రలు వచ్చినాయి. అవే శబ్ద స్పర్శ రూప రస గంధాలు. ఆ తరువాత తన్మాత్రల స్థూలరూపాలయిన పంచభూతాలు వచ్చినాయి. పంచభూతాలలో ముందుగా వచ్చింది ఆకాశము.

| | | |
|---|---|---|
| ఆకాశము నుంచి | – | వాయువు వచ్చింది |
| వాయువు నుంచి | – | అగ్ని వచ్చింది |
| అగ్ని నుంచి | – | జలము వచ్చింది |
| జలము నుంచి | – | భూమి ఆవిర్భవించింది |
| ఆకాశము లక్షణము | – | శబ్దము |

| | |
|---|---|
| వాయువు లక్షణము | - స్పర్శ |
| అగ్ని లక్షణము | - రూపము |
| జలము యొక్క లక్షణము | - రసము |
| భూమి యొక్క లక్షణము | - గంధము |

ఈ పంచభూతాలు పంచీకరణ చెందినాయి.

| | |
|---|---|
| ఆకాశంలో | - శబ్దము |
| వాయువులో | - శబ్దము, స్పర్శ |
| అగ్నిలో | - శబ్దము, స్పర్శ, రూపము |
| జలములో | - శబ్దము, స్పర్శ, రూపము, రసము |
| భూమిలో | - శబ్దము, స్పర్శ రూపము, రసము గంధము ఉంటాయి |

ఈ మొత్తం కలిపి 15 భాగాలయినాయి. ఈ 15 భాగాలే **పంచదశి మహామంత్రం**లోని పదిహేను అక్షరాలు అని చెబుతోంది **శ్రీవిద్య.**

ఈ పంచభూతాల వల్ల దేహం ఏర్పడింది. దేహంలో

1. కపాలము, చర్మము, నరాలు, ఎముకలు, మాంసము, గోళ్ళు ఇవి పృథివి అంశలు

2. రక్తము, మూత్రము, లాలాజలము, స్వేదము జలము యొక్క అంశలు

3. ఆకలి, దప్పిక, ఉష్ణము, మైధునము అగ్ని యొక్క అంశలు

4. నడవటం, శ్వాశించటము, పీల్చుము వాయువు అంశలు

5. కామక్రోధాలు ఆకాశము అంశలు. ఈ రకంగా స్థూలదేహం ఏర్పడింది.

పంచభూతాల రజోగుణం నాలుగు భాగాలయింది. అందులోని మూడు భాగాల నుంచి పంచప్రాణాలు అంటే

1.ప్రాణ 2.అపాన 3.వ్యాన 4. ఉదాన 5. సమానములు. అలాగే ఉపవాయువు 1.నాగ 2.కూర్మ 3.కృకర 4.దేవదత్త 5.ధనుంజయములు వచ్చినాయి.

పంచభూతాల రజోగుణంలోని నాల్గవ భాగంతో వాక్కు, వాణి, పాదము, పాయు, ఉపస్థ అనే కర్మేంద్రియాలు వచ్చినాయి.

పంచభూతాల సత్త్వగుణం నాలుగు భాగాలయింది. అందులోని మూడు భాగాల నుంచి మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే అంతఃకరణ చతుష్టయం వచ్చింది. పంచభూతాల సత్త్వగుణం నాల్గవభాగం నుంచి శ్రోత్రము, చర్మము, చక్షువు, జిహ్వా, ఘ్రాణము అనే జ్ఞానేంద్రియాలు వచ్చినాయి.

జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, ప్రాణాలు, పంచభూతాలు, అంతఃకరణ చతుష్టయము, కామము, కర్మము, తమస్సు (అవిద్య) ఈ ఎనిమిది గల శరీరము అష్టపురము అనబడుతుంది. శరీరంలో పంచభూతాలు వాటి లక్షణాలు ఎక్కడున్నాయంటే

| | | |
|---|---|---|
| శబ్దము | – | ఆకాశ లక్షణము, చెవియందు |
| స్పర్శ | – | వాయువు లక్షణము చర్మము నందు |
| రూపము | – | అగ్ని లక్షణము. కంటి యందు |
| రసము | – | జలము యొక్క లక్షణము నాలుక యందు |
| గంధము | – | పృథివి యొక్క లక్షణము ముక్కు నందు |

ఈ రకంగా పంచభూతాల వల్ల దేహము ఆవిర్భవించింది. శరీరానికి జనన మరణాలున్నాయి. ఓ జనక మహారాజా! ఆత్మకు చావు పుట్టుకలు లేవు. మరి ఇంకా దేన్ని గురించి విచారిస్తున్నావు? అంటున్నాడు అష్టావక్రుడు.

**దేహస్తిష్ఠతు కల్పాంతం గచ్ఛత్వద్యైవ వాపునః ।**
**క్వవృద్ధిః క్వ చ వా హానిస్తవ చిన్మాత్ర రూపిణః ॥ 10**

రాజా ! ఈ శరీరం కల్పాంతందాకా ఉన్నా, ఇవాళ్నే నశించినా నీకు నచ్చే లాభము కాని నష్టము గాని లేవు.

మానవ జీవితం వంద సంవత్సరాలు, ఇది ఆ రోజుల్లో లెక్క. పూర్ణాయువు అంటే 120 సంవత్సరాలు. మహాదశల పూర్తి కాలము. ఇంతకన్న ఎక్కువ కాలం జీవించిన వారున్నారు. అఘోరీలు రెండు వందల నుంచి మూడువందల

సంవత్సరాలు జీవిస్తారు అని చెబుతారు. ఇది ఎలా సాధ్యమనే విషయం సైన్సుకు అంతు పట్టటం లేదు. అయితే ఈ ఆయువును వంద నుంచి వేయి సంవత్సరాల వరకు పెంచుకోవచ్చు అంటోంది వేదం.

సాధారణ మానవుని ఆయుష్య 100 సంవత్సరాలు.

సత్ప్రవర్తన వల్ల 300 సం॥లు

ఇంద్రియ నిగ్రహం వల్ల 300 సం॥లు

ప్రాణాయామం వల్ల 300 సం॥లు వెరసి 1000 సంవత్సరాలు. రాజా ! నీ ఆయువు వేయి సంవత్సరాలున్నా కల్పాంతము వరకు ఉన్నా, లేదూ ఈ రోజే పూర్తయిపోయినా నీకు వచ్చింది ఏమీలేదు. సాధకుడు మృత్యువుకు భయపడడు. శరీరానికి ఆత్మకు ఏ సంబంధము లేదు. నీవే ఆత్మ చైతన్యానివి. రాజా! పరిశుద్ధమైన ఆత్మ స్వరూపానివి. ఈ విషయం తెలిసి సుఖంగా జీవించు అంటున్నాడు అష్టావక్రుడు.

**త్వయ్యనంత మహాంభోధౌ విశ్వవీచిః స్వభావతః ।**
**ఉదేతు వాఽస్తమాయతు న తే వృద్ధిర్న వా క్షతిః ॥ 11**

ఓ జనక హారాజా! నువ్వు చైతన్య సాగరానివి. నీలో నామరూపాత్మకమైన జగదృశ్యాలనే తరంగాలు ఎన్ని కనుపించినా నీకు ఏ రకమైన వృద్ధిక్షయము ఉండదు.

సముద్రము అపార జలరాశి. అందుకే దాన్ని 'అపార పారావారము' అంటారు. సముద్రంలో అలలు తరంగాలు వస్తే సముద్రంలోని నీరు పెరగదు. కెరటాలు క్రింద పడితే సముద్రంలోని నీరు తగ్గదు. ఎందుకంటే కెరటాలు, అలలు, తరంగాలు అనేవి వేరు కాదు. అవి కూడా సముద్రపు నీరే. అలాగే పరమేశ్వరుడే జగత్తు. జగత్తే పరమేశ్వరుడు. కాబట్టి ఎన్ని రూపాలతో సృష్టి జరిగినా ఇక్కడ ఏ రకమైన తేడా ఉండదు. ఎందుకంటే సృష్టి అనేది భ్రాంతి కాబట్టి. అసలు సృష్టే లేదు కాబట్టి. నిద్రపోతున్న వాడికి ఎన్నికలలు వస్తే ఏమిటి? వాటివల్ల లాభము లేదు నష్ట అంతకన్నా లేదు.

**తాత ! చిన్మాత్రరూపోఽసి న తే భిన్నమిదం జగత్ ।**
**అతః కస్య కథం కుత్ర హేయోపాదేయ కల్పనా ॥ 12**

రాజా ! నువు శుద్ధ చైతన్యానివి. జగత్తు నీకన్న వేరైనది కాదు. అలాంటప్పుడు నీలో అంగీకార తిరస్కారభావాలు ఎందుకు ఉంటాయి? ఉన్నదంతా ఒకటే. అదే ఆత్మ. అంతకు మించినది. అంతకన్న వేరైనది. అంతకన్న అధికమైనది ఏదీలేదు. రెండవది ఏదీ లేనప్పుడు ఇంకా ఇష్టము, అయిష్టము ఎక్కడ ఉంటుంది? భావాలన్నీ మనస్సుకు సంబంధించినవే. నువు పరమేశ్వరుడవు. నీకు మనస్సు లేదు. అలాంటప్పుడు మనోభావాలెక్కడ ఉంటాయి. అంటున్నాడు అష్టావక్రుడు.

**ఏకస్మిన్నవ్యయే శాంతే చిదాకాశే ఽమలే త్వయి ।**
**కుతో జన్మ కుతః కర్మ కుతోఽహంకార ఏవ చ ॥ 13**

నువ్వు ఆత్మస్వరూపానివి నీకు పరిణామము లేదు. శాంతము చిత్స్వరూపము నిష్కళంకము, అయిన ఆత్మవు నీవు. అలాంటి నీకు జనన మరణాలు, సుఖదుఃఖాలు ఎలా ఉంటాయి?

ఆత్మ అద్వయం రెండవది లేనిది. నీకు ఇతర జీవులకున్నట్లుగా పుట్టడం గాని, పెరగటంగాని, వృద్ధి చెందటం, రూపుమారటంగాని, ఎక్కడుంటాయి. పరబ్రహ్మ నిరాకారుడు, నిర్గుణుడు. ఆయనకు రూపం లేదు. నామం లేదు. మనస్సుకు అతీతంగా ఉంటుంది. మానసిక కల్లోలాలు చైతన్య రూపాన్ని దరిచేరలేవు. చైతన్యానికి వాసనలుండవు. అవ్యయము, నిష్కళంకము, నిరంజనము మొ॥న లక్షణాలు ఏవీ ఆత్మపురుషుడి తెలియవు. అంటున్నాడు అష్టావక్రుడు.

**యత్త్వం పశ్యసి తత్రైక స్త్వమేవ ప్రతిభాససే ।**
**కిం పృథగ్భాసతే స్వర్ణాత్కటకాంగదనూపురమ్ ॥ 14**

నీ కంటికి కనిపించేదంతా నువ్వే. రకరకాల ఆభరణాలు తమ మూల పదార్థమైన బంగారం కన్న వేరు కావు కదా?

చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. జగత్తే బ్రహ్మము. బ్రహ్మమే జగత్తు. జగత్తులో బ్రహ్మము కన్న వేరైన పదార్థము ఇంకొకటి లేదు. మనోకల్పనలతో ఈ జగత్తంతా బ్రహ్మము నందు కల్పించబడింది. జగత్తంతా కల్పన. అది వాస్తవం కాదు. రజ్జు సర్పభ్రాంతి లాగా ఈ జగత్తు అజ్ఞానంతో కల్పించబడింది. జ్ఞానం కలుగగానే సర్పము మాయమై పోయి రజ్జువే మిగిలినట్లుగా, ఈ జగత్తు మాయమై

పోతుంది. అంటే తన అధిష్ఠానమైన జగత్తులో లీనమవుతుంది. చూసేది చూడబడేది అంతా బ్రహ్మమే. కాబట్టి ఓ జనక మహారాజా! నువ్వు ఆత్మస్వరూపానివి. నీచే చూడబడుతున్న జగత్తు నీకన్న వేరైనది కాదు. కుమ్మరివాడు మట్టిని తెచ్చి నీళ్ళు పోసి కలిపి పాకం వచ్చే దాకా బాగా కాళ్ళతో తొక్కి, ఆ మట్టితో కుండలు, ముంతలు, బానలు, చట్లు, మూకుళ్ళు ఇలా అనేకమైన పాత్రలు తయారుచేస్తాడు. పాత్రల పేరు వేరైనా వాటికి అధిష్ఠానమైన మట్టి ఒకటే. అలాగే కంసాలివాడు బంగారం కరిగించి రకరకాల ఆభరణాలు తయారుచేస్తాడు. ఆభరణాల పేర్లు వేరైనా, రూపము వేరైనా వాటికి మూలమైనది బంగారమే. అదే విధంగా ఈ జగత్తుకు మూలమైనది అధిష్టానమైనది పరబ్రహ్మము తప్ప వేరు కాదు. అందుకే ఓ రాజా ! నువ్వు చూసే జగత్తంతా నీకన్న వేరైనది కాదు అంటున్నాడు అష్టావక్రుడు.

**అయం సోఽహమయం నాహం విభాగమితి సంత్యజ ।**
**సర్వమాత్మేతి నిశ్చిత్య నిస్సంకల్పః సుఖీభవ ॥ 15**

ఓ రాజా ! అది నేను. ఇది నేను కాదు అనే భేదభావాలు వదలి, ఉన్నదంతా ఆత్మే అని తెలుసుకుని కోరికలు లేకుండా హాయిగా జీవించు.

చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. **ఛాందోగ్యోపనిషత్తు**లో చెప్పినట్లుగా దశదిశలు పరబ్రహ్మ స్వరూపమే. నదీనదాలు అడవులు, కొండలు, ఎడారులు, సముద్రాలు, అన్నీ పరబ్రహ్మమే. నేల, నింగి, నీరు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు పరబ్రహ్మమే ప్రాణం, దృష్టి, శ్రోత్రం అన్నీ పరబ్రహ్మమే. జగత్తులోని 84 లక్షల జీవరాసి అంతా పరబ్రహ్మమే. నేను పరబ్రహ్మను. నువ్వు పరబ్రహ్మవు. ఇక్కడ ఉన్న పిపీలికాది బ్రహ్మ పర్యంతము అన్ని జీవరాసులు పరబ్రహ్మము. చలనమున్నవి చలనం లేనివి. ప్రాణమున్నవి ప్రాణం లేనివి అన్నీ పరబ్రహ్మ స్వరూపమే. జగత్తులో నేను నువ్వు నాది నీది అనే భావనలు లేవు. ఇవన్నీ మనోకల్పితాలు. అన్ని రూపాలు, అన్ని నామాలు పరబ్రహ్మమే. కాబట్టి ఓ రాజా! నేను నువ్వు నీది నాది అనే తేడాలు లేవు. అటువంటి భేద భావాలు వదలి ఉన్నదంతా పరబ్రహ్మమే అని గుర్తించి, కోరికలు లేకుండా హాయిగా జీవించు అంటున్నాడు అష్టావక్రుడు.

**తవైవా జ్ఞానతో విశ్వం త్వమేకః పరమార్థతః ।**
**త్వత్తోఽన్యోనాస్తి సంసారీ నాసంసారీ చ కశ్చన ॥** **16**

ఓ రాజా ! అజ్ఞానం వల్లనే జగత్తు ఉన్నట్లుగా కనుపిస్తోంది. నిజానికి ఉన్నది నీవే. నీకన్న వేరుగా జగత్తు లేదు. జీవుడు లేదు. అసలు ఏదీలేదు.

**బ్రహ్మసత్యం జగన్మిథ్య** చరాచర జగత్తులో బ్రహ్మము ఒక్కటే సత్యము నిత్యము శాశ్వతమైనది. ఈ జగత్తు వివర్త పరిణామము వల్ల ఆవిర్భవిస్తోందని గతంలో చెప్పుకున్నాం. అంటే అధిష్ఠానానికి ఏ మాత్రము వికారము లేకుండా నీ అజ్ఞానంతో భ్రాంతివల్ల ఒకటి ఇంకొకటిగా కనుపిస్తున్నది. మసకచీకటిలో త్రాడును చూసి పాము అనుకున్నావు. నిజంగా అక్కడ పాము లేదు. నిర్జన ప్రదేశంలో, చెట్లు, పిచ్చి మొక్కలు ఎక్కువగా ఉన్న ప్రదేశంలో కాలిబాటన పోతున్నావు. ఆ త్రోవలో చీకటి పడితే పాములు తిరుగుతాయి అని అనేకసార్లు విన్నావు. ఒకటి రెండు సార్లు చూశావు కూడా. కాబట్టి అక్కడ పాములు తిరుగుతాయనే విషయం నీకు ఖచ్చితంగా తెలుసు. ఇప్పుడు నువ్వు ఒంటరిగా ఆ త్రోవన పోతున్నావు. చీకటి పడుతోంది. చుట్టూ చెట్లు, పొదలు, ముళ్ళకంపలు. ఎవరూ తోడుకూడా లేరు. నీకు భయంగానే ఉంది పాములు వస్తాయేమో అని. ఇంతలో ఎదురుగా బాటుకు అడ్డంగా కనుపించింది నాలుగు అడుగులు పొడవున్న నల్లతాచు. మెలికలు తిరిగి ఉంది. దాన్ని చూడగానే పై ప్రాణాలు పైన పోయాయి. అంత పెద్దమనిషివి ఒక్కసారిగా పెద్దకేక పెట్టావు. అరిచావు. గడగడా వణికిపోతున్నావు. నోట్లో నుంచి మాట కూడా సరిగా రావటం లేదు. ఆ సమయంలో దైవవశాత్తు నీవెనకాల కొద్ది దూరంలో ఇద్దరు వ్యక్తులు వస్తున్నారు. నీ అరుపు విని వారు గబగబా పరుగెత్తుకు వచ్చారు. విషయం అర్థమైంది. చేతిలో కర్రలు సిద్ధంగా పట్టుకున్నారు పాము గనక మీదకి వస్తే చంపటానికి. ఇంత గందరగోళం జరుగుతున్నా పాము కదల్లేదు. అలాగే పడి ఉంది. వాళ్ళకి అనుమానం వచ్చింది ఒకవేళ అది చచ్చిపోయిందేమో అని. ఒకరాయి దానిమీద వేసి చూశారు. పాము కదల్లేదు. ధైర్యం చేసి అందులో ఒకడు నెమ్మదిగా కర్రతో దాన్ని కదిపాడు. చలనం లేదు. ఇంకొంచెం కదిపాడు. ఇప్పుడు తెలిసింది అది పాము కాదు. త్రాడు అని. త్రాడును చూసి పాము అనుకుని అందరినీ హడలగొట్టేసిన నీ అజ్ఞానాన్ని చూసి అందరూ నవ్వుకున్నారు. మొత్తం మీద

తెలిందేమంటే నీ అజ్ఞానం వల్ల త్రాడు పాముగా కనుపించింది. అది మనోకల్పన. వివర్త పరిణామము. నీ మనోభావాల వల్ల, అజ్ఞానం వల్ల త్రాడుపాముగా కనుపించింది. అది త్రాడు అనే జ్ఞానం కలగగానే అప్పటిదాకా కనుపించిన పాము తన అధిష్ఠానమైన త్రాడులో లీనమైంది. అలాగే నీ మనోకల్పన వల్ల, అజ్ఞానం వల్ల, భ్రాంతి వల్ల జగత్తు ఉన్నట్లుగా కనుపిస్తోంది. నిజానికి జగత్తు లేదు. నీకన్న వేరుగా ఏ జీవిగాని, వస్తువుగాని లేదు. బ్రహ్మ ఒక్కటే సత్యం ఈ జగత్తంతా మిథ్య అంటున్నాడు అష్టావక్రుడు.

**భ్రాంతి మాత్రమిదం విశ్వం న కించిదపి నిశ్చయీ ।**
**నిర్వాసనః స్ఫూర్తిమాత్రో న కించిదివ శామ్యతి ॥ 17**

రాజా ! ఈ జగత్తంతా మనస్సుచేత కల్పించబడిన భ్రాంతి. అనే నిశ్చయ జ్ఞానం కలిగితే, కోరికలు నశించి చైతన్య రూపంగా, శాంతంగా, ఏకంగా ఉండగలుగుతావు.

నిద్రించిన మానవుడికి కల వచ్చింది. ఆ కలలో తాను ఎక్కడికో పరిచయం లేని చోటకు వెళ్ళాడు. అక్కడ అంతా కోలాహలంగా ఉంది. ఊరిజనం అంతా ఎగబడి చూస్తున్నారు. తాను కూడా వెళ్ళాడు చూడటానికి ఒక పెద్ద ఏనుగు, అందంగా అలంకరించబడింది. దానితుండడానికి పెద్ద పూలమాల ఉన్నది. ఏనుగు అలా నడిచి వస్తోంది. జనం కేకలు పెడుతున్నారు. తానుకూడా వాళ్ళతో పాటు విచిత్రంగా చూస్తున్నాడు. ఇంతలో ఏనుగు తన దగ్గరకు వచ్చి పూలహారాన్ని తన మెడలో వేసింది. చుట్టూ ఉన్న ప్రజలు జయజయధ్వానాలు పలికారు. తనను రాజభటులు ఏనుగు ఎక్కించి ఊరేగింపుగా రాజదర్బారుకు తీసుకు వెళ్ళారు. అంతః పుర కాంతలు స్వాగతం చెప్పారు. రాకుమారి అందాలరాసి పుష్పహారం మెడలో వేసింది. తాను రాజైనాడు. రాకుమార్తెను వివాహం చేసుకున్నాడు. సభాసదులందరూ జయజయ ధ్వానాలు పలుకుతున్నారు. ఇంతలో మెలకువ వచ్చింది. ఇదంతా కల అనుకున్నాడు. ఈకల మనసుచేత కల్పించబడింది. తనకు ఒక్కడికే కనుపించింది. జగత్తు కూడా ఇలాంటిదే మనసుచేత కల్పించబడిన భ్రాంతి. ఇక్కడ చిన్న తేడా ఉంది. కల తన ఒక్కడికే కనిపిస్తుంది. జగత్తు అందరికీ కనిపిస్తుంది. దీని కారణం కల వ్యష్టిసృష్టి. జగత్తు సమిష్టిసృష్టి. మెలకువ రాగానే కల కరిగిపోతుంది. కాని

జాగ్రదావస్థలో వస్తువులను తాకుతున్నాం. చూస్తున్నాం అనుభవిస్తున్నాం. అందుకే ఇది భ్రమ అని తేలికగా నమ్మలేము. జ్ఞానం కలిగినట్లైతే భ్రమ తొలగిపోతుంది. జగత్తు కనుపించదు. అప్పుడు మిగిలేది ఒక్కటే అదే బ్రహ్మము. అదే నీవు. ఆ సమయంలో కోరికలు లేకుండా, పరమశాంతంగా, ఏకంగా ఉంటావు అని చెబుతున్నాడు అష్టావక్రుడు.

**ఏకఏవ భవాంభోధావాసీదస్తి భవిష్యతి ।**

**న తే బంధోఽస్తి మోక్షోవా కృతకృత్య స్సుఖంచర ॥** **18**

ముల్లోకాలలోను ఉన్నది ఆత్మ ఒక్కటే. నీకు బంధం లేదు. ముక్తి లేదు. నువు చెయ్యవలసినది కూడా ఏమీలేదు. ఈ భావనతోనే నిశ్చింతగా సుఖంగా ఉండవలసింది.

జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. పద్నాలుగు లోకాలలోను ఎక్కడ వెదికి చూసినా ఉన్నది ఆత్మ ఒక్కటే. ఆత్మ కన్న వేరైన పదార్థం ఏదీలేదు. నువ్వు పరబ్రహ్మ స్వరూపానివి. **ఐతరేయోపనిషత్తు**లో చెప్పిన విధంగా జ్ఞానేంద్రియాలతోను కర్మేంద్రియాలతోను దేహాన్ని సృష్టించిన తరువాత ఈ దేహంలో నేను లేకపోతే ఎలాగ అని భావించి ఆ పరమేశ్వరుడు బ్రహ్మరంధ్రం గుండా మానవదేహంలో ప్రవేశించాడు. అలా ప్రవేశించి ఇంద్రియాలతో తాదాత్మ్యం చెంది అన్ని సుఖాలు అనుభవిస్తూ వచ్చిన త్రోవను కూడా మరిచిపోయి నేను అంటే దేహము అనుకుంటున్నాడు. నిజానికి నేను అంటే దేహం కాదు. నేను అంటే ఆత్మ. కేవలము అజ్ఞానంతోనే నేను అంటే దేహము. ఈ కర్మలన్నింటికీ కర్తను భోక్తను నేనే అనుకుంటున్నాడు. తనకు అనేక బంధాలు ఉన్నాయి అనుకుంటున్నాడు. మమ అనుకుంటే బంధం. నమమ అనుకుంటే మోక్షము. కర్మలు అన్నీ నేనే చేస్తున్నాను అని భావన చేస్తున్నాడు. ఆ కర్మ ఫలితం తానే అనుభవించాలి. అనుభవిస్తాను అనుకుంటున్నాడు. నిజానికి జీవుడు కర్మలకు కర్తా కాదు భోక్తా కాదు. అతడికి ఏ రకమైన బంధాలు లేవు. ఈ బంధాలు వదిలితే మోక్షం పొందుతాను అనుకుంటున్నాడు. సరిగా ఆలోచిస్తే జీవుడు ఎప్పుడూ ముక్తావస్థలోనే ఉన్నాడు. అతనికి బంధాలు ఉంటే కదా వాటి నుంచి విముక్తి కలగటానికి. కాబట్టి బంధము లేదు విముక్తి అంతకన్నా లేదు. అతడు ఎప్పుడూ ముక్తుడే. అతడు చేయవలసిన

కర్మలు కూడా ఏవీలేవు. కాబట్టి ఓ రాజా! ఈ విషయం తెలుసుకుని నిశ్చింతగా సుఖంగా ఉండు అంటున్నాడు అష్టావక్రుడు.

**మా సంకల్పవికల్పాభ్యాం చిత్తం క్షోభయ చిన్మయ ।**
**ఉపశమ్య సుఖంతిష్ఠస్వాత్మ న్యానందవిగ్రహే ॥ 19**

ఓ చిన్మయా ! సంకల్ప వికల్ప రూపమైన అశాంతిని వదలి శాంతించిన మనసుసతో ఆనంద స్వరూపంతో హాయిగా జీవించు.

ఓ జనకరాజా ! శుద్ధ చైతన్యమే నీవు. నువ్వు ఆమోదించవలసినది కాని, నిరాకరించ వలసినది కాని ఏమీ లేదు. ఆత్మచైతన్యము అంటే నిరాకారము నిర్గుణము అంతే. మనస్సు, శరీరము, బుద్ధి ఇత్యాదులు అందులో లేవు. ఇదంతా భ్రమ. ఈ భ్రమను పూర్తిగా వదలిపెట్టు. సంకల్ప వికల్పాలను దగ్గరకు రానీయకు. స్వరూపానందంలోనే సదా దృష్టిని కలిగి ఉండు. జగత్తులో ఉన్న బాధలు అన్నీ ఒకటైనా సరే, అవి ఆత్మదగ్గరకు కూడా రాలేవు.

నేను, నాది అనే అహంకార మమకారాలు బంధానికి మూలము. ఇదంతా భ్రమ అని గుర్తించు. ఇదంతా భ్రమ అని గుర్తించగలిగితే ముక్తుడవైనట్లే. ఈ భ్రాంతి అంతా నీలోనే ఉన్నది. ఇది నాది అనే భావం బంధానికి దారి తీస్తుంది. మమ అనుకుంటే బంధం. నమమ అనుకుంటే మోక్షం. 'న' లేదు, కాదు. అనుకుంటే దీంతో నాకు ఏ రకమైన సంబంధం లేదు. ఇది నాది కాదు అనుకుంటే ముక్తి లభిస్తుంది. బంధము అనేది భావనే. లేదు అనేది భావనే. కాబట్టి ఓ రాజా! అంతా నీ భావనలోనే ఉంది. నువు అజ్ఞానివి అనుకుంటే అజ్ఞానివి. జ్ఞానివి అనుకుంటే జ్ఞానివి. నేను బద్ధుడను అని అనుకుంటే బంధాలలో తగులుకుంటావు. ముక్తుడను అనుఉంటే ముక్తి పొందుతావు. బంధమోక్షాలు అంతా నీ చేతుల్లోనే ఉన్నాయి. కాబట్టి సంకల్ప వికల్ప రూపమైన ఆలోచనలు విడిచిపెట్టు. ఆనందరూపమైన ఆత్మగా సుఖంగా ఉండు. అంటున్నాడు అష్టావక్రుడు.

**త్యజైవ ధ్యానం సర్వత్ర మాకించిద్ధృది ధారయ ।**
**ఆత్మా త్వముక్త ఏవాసి కిం విమృశ్య కరిష్యసి ॥ 20**

ధ్యానాన్ని కూడా విడిచిపెట్టు. మనస్సులో ఏ రకమైన ఆలోచనలు రానీకు. నువ్వు నిత్యముక్తమైన ఆత్మవు. ధ్యానంతో నీకు పనేమిటి?

బాగా అలసిపోయిన వాడు, నిద్ర పట్టనివాడు, నిద్ర రానివాడు, నిద్ర పోయేందుకు ప్రయత్నం చెయ్యాలి. అంతేకాని హాయిగా నిద్రపోతున్న వాడికి నిద్రపోయేందుకు ప్రయత్నం ఎందుకు? ముక్తి కావాలి అనుకున్నవాడు అష్టాంగ యోగంతో ఆత్మసాక్షాత్కారము చేసుకోవటానికి ప్రయత్నించాలి. దానిలో భాగంగా ధారణ, ధ్యానము, సమాధి. అభ్యాసం చెయ్యాలి. కాని నువ్వు నిత్యముక్తుడివి. చిదాత్మవు. మరి నీకు ధ్యానము, సమాధి ఎందుకు? ధ్యానంలో కూర్చున్నప్పుడు ధ్యేయాన్ని కూడా మరచిపోవటమే నిజమైన ధ్యానము. సమాధిలో ఉన్నప్పుడు తాను సమాధిలో ఉన్నాననే మాట కూడా మరచిపోవాలి. అది నిజమైన సమాధి. అక్కడకి చేరిన తరువాత ధ్యానము, సమాధిలో ఉన్నప్పుడు తాను సమాధిలో ఉన్నాననే మాట కూడా మరచిపోవాలి. అది నిజమైన సమాధి. అక్కడికి చేరిన తరువాత ధ్యానము, సమాధిలతో పనిలేదు. వాటిని కూడా విడిచిపెట్టు. మనసులో ఏ రకమైన ఆలోచనలు రానీకు. నీవు నిత్యముక్తుడవు. నీవే ఆత్మవు. నీకు ధ్యానము, సమాధి వీటితో ఏ రకంగాను అవసరం లేదు అంటున్నాడు అష్టావక్రుడు.

# అధ్యాయం-16

## ఆత్మనిష్ఠకు ఆటంకాలు - సూచనలు

మనస్సును బుద్ధిని ఆత్మయందు లయం చెయ్యటమే ఆత్మనిష్ఠ అనబడుతుంది. ఆత్మనిష్ఠ అంటే ఏమిటి? దీన్ని ఎలా సాధించాలి? అనే విషయాలను 12వ అధ్యాయంలో చెప్పటం జరిగింది. ఇప్పుడు ఈ అధ్యాయంలో ఆత్మనిష్ఠ సాధించటానికి ఆటంకాలు తగిన సూచనలు చేస్తున్నాడు అష్టావక్రుడు.

**ఆటంకాలు, సూచనలు :** విషయభోగాలను త్యజించటం, వాటిమీద కోరికలు పూర్తిగా నాశనంకావటం, దృశ్యమానమైన జగత్తంతా ఆత్మజ్ఞానంలో లయం కావటం. ఈ విధంగా ఐహికబంధనాలు పూర్తిగా తెగిపోవటం – ఇదే ముక్తి. ఐహికబంధనాల నుంచి విముక్తి. చిత్తశుద్ధి కలిగిన సాధకులు ఆత్మానుభవాన్ని అప్పుడప్పుడు పొందుతుంటారు. కాని వారికి ఆత్మనిష్ఠ అనేది ఉండదు. ఇలా ఎందుకు జరుగుతున్నది? ఆత్మనిష్ఠకు అడ్డంకులు ఏమిటి ? వీటిని ఏ రకంగా అధిగమించవచ్చు. ఆ విషయాలు చూద్దాం.

**1. శాస్త్రపరిజ్ఞానం :** సాధకుడు అనేక గ్రంథాలు చదివాడు. వాటిమీద చర్చలు జరిపాడు ఉపాన్యాసాలిచ్చాడు. వాటి సారమంతా అతని మస్తకంలో పాతుకుపోయి ఉంది. ఇప్పుడు ఆ విషయపరిజ్ఞానమే మాటిమాటికీ గుర్తువస్తుంది. ఆత్మనిష్ఠకు అదే పెద్దఅడ్డంకి. ఆత్మనిష్ఠ కావాలంటే తాను చదువుకున్న శాస్త్రపరిజ్ఞానాన్ని పూర్తిగా మరిచిపోవాలి. విషయమే గుర్తుండాలి. అంతేకాని శాస్త్రాలపేర్లు మాత్రం కాదు.

**2. స్వరూపానందం :** విషయభోగాలు అనుభవించినా, ధర్మకర్మలు నిర్వహించినా, సమాధిస్థితిని అభ్యసించినా, సాధకుని మనస్సు సహజస్వరూప ఆనందస్థితిని కోరుతూ ఉంటుంది. సహజస్వరూపమనేది సర్వ విషయాలకు అతీతంగా ఉంటుంది. ప్రతిమనిషీ కోరికలు తీర్చుకోవాలని ప్రయత్నిస్తుంటాడు. అంటే కోరికలులేకుండా ఉండటానికి ప్రయత్నిస్తున్నాడన్న మాట. ఏదైనా ఒక వస్తువును కోరుకున్నప్పుడు, అనుభవించాలనుకున్నప్పుడు, మనస్సు అశాంతితో నిండిపోతుంది. అహంకారం ఆ వస్తువును పొందాలని నిశ్చయించుకుంటుంది. ఆ వస్తువు సంపాదించగానే ఎంతో ఆనందం కలుగుతుంది. అయితే ఈ ఆనందం

ఆ వస్తువు పొందటంవల్ల రావటంలేదు. తన స్వభావానికి విరుద్ధమైన కోరిక లేకపోవటంతో వస్తోంది. కోరిక తీరటంవల్ల మనస్సులోని అశాంతి పోయి, శాంతి ఏర్పడుతుంది. కాబట్టి మానవుడు ఎన్ని భోగాలనుభవించినా, ధర్మకార్యాలు చేసినా, సమాధిస్థితిని అభ్యసించినా శాంతి దొరకదు. దీనికి మూలకారణం ఏదో శోధించి, దానికి సరైన విధానం అవలంబించాలి.

**3. కోరికలకతీతం :** ప్రతివాడికీ కొన్ని కోరికలుంటాయి. వాటిని తీర్చుకోటానికి అహరహము శ్రమిస్తూనే ఉంటాడు. ఆ కోరికలు తీర్చుకోవాలనే భావనతో తాను కష్టపడుతున్నాడు. ఇతరులను కష్టపెడుతున్నాడు. ఇలా ప్రతివాడు విషయభోగాల వెంట పరుగులు పెడుతున్నారు. ఎంతగా అనుభవించినా ఈ కోరికలు తీరవు. ఒక కోరిక తీరితే, దాని స్థానంలో ఇంకొకటి పుడుతుంది. దీంతో అశాంతి, అలజడి మానవుణ్ణి పట్టిపీడిస్తాయి. ఇప్పుడు మానవుడు కోరికలను త్యజించి, ఆ కోరికల కతీతంగా నిలబడగలిగితే, మనసులో అశాంతి, అలజడి, అనే వాటికి చోటుండదు. సర్వవాసనల నుండి విముక్తుడయి శాంత నిశ్చల మనస్సుతో నిలవగలగటం కన్న గొప్పస్థితి ఇంకొకటి లేదు.

**4. ఉదాసీనత :** మానవుడి అంతరంగంలో ఉండే ఆలోచనలే కర్మలుగా వ్యక్తమవుతాయి. మనసులో కోరికలున్నవాడు వాటిని తీర్చుకోవటానికి ఏదో ఒక పని చేస్తాడు. కోరికలు లేని వాడికి ఆలోచనలే ఉండవు. ఏ రకమైనకర్మ చెయ్యడు. అతడు ఆనందమయము, అనంతము అయిన తన ఆత్మలోనే స్థితుడై ఉంటాడు. అతనికి శరీరము అనే స్పృహకూడా ఉండదు. అతడు జీవించి ఉన్నా లేనట్లే. దృశ్యమానమైన జగత్తునుచూస్తున్నా పట్టించుకోడు. అన్నింటిపట్ల ఉదాసీనంగా ఉంటాడు. ఈ స్థితినే "సహజసమాధి" అంటారు. ఇతడు కళ్ళు మూయటం తెరవటం కూడా కష్టమే ఇతడు సర్వదా ఆత్మనిష్టలోఉంటాడు.

**5. ద్వంద్వాతీతము :** రాగద్వేషాలు, సుఖదుఃఖాలు అనే ద్వంద్వాలలో చిక్కి దుఃఖాలు కోరితెచ్చుకుంటాడు. సుఖం వెనకే దుఃఖం ఉంటుంది. ఈ విషయం తెలుసుకున్న వాడు, వాటి నుంచి విడివడతాడు. ఈ రకంగా ద్వంద్వాలనుంచి విడివడిన మనస్సు ఐశ్వర్యము, కోరికలు, ముక్తిపట్ల కూడా ఉదాసీనంగానే ఉంటుంది. కాబట్టి ద్వంద్వాల నుంచి విముక్తి పొందినవాడు సర్వదా ఆత్మనిష్ఠలో ఉండగలుగుతాడు.

**6. వైరాగ్యం :** విషయవాంఛలు లేనిస్థితినే వైరాగ్యము అంటారు. ఎప్పుడైతే వైరాగ్యం వచ్చిందో, అప్పుడు ఇంకా కోరికలనేవి ఉండవు. మనసు పరమశాంతంగా ఉంటుంది. అటువంటి వాడు సర్వదా ఆత్మనిష్ఠలో ఉంటాడు.

**7. బీజనాశనం :** కోరికలున్నంత కాలము బుద్ధిలో వాటిని స్వాగతించటం, వ్యతిరేకించటం అనే భావాలుంటాయి. వస్తువులను గురించి ఆలోచిస్తే వాటిమీద రాగం ఏర్పడుతుంది. రాగం నుంచే కోరికలు పుడతాయి. కోరికల నుంచి క్రోధము, క్రోధము నుంచి భ్రమ, భ్రమ నుంచి – విభ్రమము, విభ్రమము వల్ల – బుద్ధినాశనము జరుగుతుంది. అంటే వివేకాన్ని కోల్పోతాడు. సంసారమనే వృక్షానికి కోరికలే బీజాలు. కర్మలవల్ల విషయాల మీద రాగంఏర్పడుతుంది. విషయాలు పొందలేకపోతే ద్వేషం వస్తుంది. అందుకే ద్వంద్వాలకు అతీతంగా సంచరించగలిగినవాడు ఆత్మ నిష్ఠుడవుతాడు.

**8. మోహత్యాగం :** జగత్తు మీద వ్యామోహమున్న వారు, అందులోని బాధల ననుభవించి, జగత్తును త్యజిస్తారు. అందుచేత మోహాన్ని త్యాగం చేసినవారు బాధలకు లోను కారు. లోకంలో దేహాన్ని తనదిగా భావించేవాడు, మోక్షాన్ని కోరేవాడు ఇద్దరూ ఒకటే. వీరి మధ్య తేడాలేదు. మోక్షంకావాలనుకునే వాడు జ్ఞానీ కాదు, యోగి కాదు. కేవలం బాధామయుడు. కాబట్టి వీటన్నింటినీ త్యజించినవాడే ఆత్మనిష్ఠుడౌతాడు.

**9. మరుపు :** సాధకుడు తాను చదువుకున్న శాస్త్రాలు, గురువు ఉపదేశాలు, వేదవేదాంగాలు అన్నీ మరచిపోవాలి. అపరోక్ష జ్ఞానం కలగటానికి అవన్నీ సాధనాలు. అపరోక్షజ్ఞానం కలిగిన తరువాత వాటన్నింటినీ మరచిపోవాలి. ఏరు దాటిన తరువాత తెప్పతో పనిలేదు. అలా కాకపోతే సాక్షాత్తు త్రిమూర్తులే నీకు గురువులైనా నీకు ఆత్మానుభవం సిద్ధించదు.

**10. నిరంతర దృష్టి :** ఆత్మనిష్ఠుడు కావాలంటే నిరంతరము ఆత్మ మీదనే దృష్టి నిలపాలి. సత్త్వరజస్తమో గుణాలు లేనప్పుడు మనస్సు శుద్ధమవుతుంది. శుద్ధమయిన మనస్సు విషయాలు, ఉద్రేకాలు పొందదు. పరమశాంతంగా ఉంటుంది. అందుకే మనస్సు నిశ్చలమైనప్పుడు పూర్ణము, నిత్యము అయిన ఆత్మను సాధకుడు తన స్వరూపంగా గ్రహించగలుగుతాడు. అజ్ఞానంవల్ల కల్పించబడిన దేహము,

ఇంద్రియాలు, ప్రాణాలు, మనస్సు మొదలైన ఉపాధుల నుంచి విముక్తిచెంది ఆత్మ అఖండము, పూర్ణము అయిన మహాకాశంలాగా ప్రకాశిస్తుంది, జగత్తులో ఉపాధి భేదంచేత ఆత్మ అనేకరూపాలుగా కనిపిస్తోంది. ఉపాధులను గనక తొలగించి చూసినట్లైతే, మిగిలేది పరబ్రహ్మ మొక్కటే. బ్రహ్మ నుండి స్తంబం దాకా ఉన్న ఉపాధులన్నీ మిధ్య. కాబట్టి సాధకునిలో ఉన్న ఆత్మ పూర్ణము, ఏకము అయినది. భ్రమతొలగిపోతే, మిగిలినఅధిష్టానం స్పష్టంగాకనిపిస్తుంది. భూతంకనిపిస్తే స్తంభం కనిపించదు. భ్రమ ఉంటేనే భూతం కనిపిస్తుంది. వివేకంతో కూడిన బుద్ధి వికసించగానే భ్రమ తొలగిపోతుంది. భూతం అదృశ్యమవుతుంది. భూతానికి ఆధారమైన స్తంబంమాత్రమే కనిపిస్తుంది. అసలు ఉన్నది స్తంబంమాత్రమే. ఈ జగత్తంతా ఆత్మస్వరూపమే. త్రిమూర్తులు, త్రిశక్తులు, అంతా ఆత్మస్వరూపమే. ఆత్మ కాక రెండవది ఏదీలేదు. పైన, క్రింద, ప్రక్కన, లోపల, బయట సర్వత్ర వ్యాపించి ఉన్నది ఆత్మే. సముద్రంలో అలలు, కెరటాలు, నీటిబిందువులు, గాలిబుడగలు, తుంపర్లు అన్నీ సముద్రమే. అంతా నీరే. అలాగే జగత్తులో కనిపించేదంతా ఆత్మస్వరూపమే. ఇంద్రియాల చేత గుర్తించబడే జగత్తు బ్రహ్మము. దీనికి అతీతంగా ఉన్నది బ్రహ్మమే. మట్టితో తయారయిన కుండ, కూజా వంటి వాటికి మూలము మట్టి. అలాగే ఈ జగత్తుకు మూలము, ఆధారము పరబ్రహ్మ. కంటికి కనిపించే ద్వైతమంతా భావన మాత్రమే. ఆకాశంలాగానే పరబ్రహ్మ కూడా నిర్వికల్పము, నిరంజనము, నిర్మలము, అనంతము. దీనికి బాహ్యాభ్యంతరాలు ఉండవు. ఆత్మ ఏకము, అద్వయము, స్వయము. స్వయంగా జీవుడు బ్రహ్మ. జగత్తుగా కనిపించే ఈ విశాలవిశ్వమంతా బ్రహ్మమయము. ఇది ఆ పరబ్రహ్మ కన్న వేరు కాదు.

శరీరం శవంతోసమానం. ఈ శరీరాన్ని ప్రేమతో చూసినంత వరకు జనన మరణాలు తప్పవు. సంసారబంధనాలు తప్పవు. పరిశుద్ధమైన ఆత్మస్వరూపమే తాను అని తెలుసుకున్న జ్ఞాని సదా ఆత్మనిష్ఠుడై తానే స్వయంగా పరబ్రహ్మ అవుతాడు.

**11. ఆత్మవిచారం** : శాస్త్రాలు చదవటం ద్వారా, గురూపదేశాలు వినటం ద్వారా సముపార్జించిన జ్ఞానంతో, ఆత్మవిచారణతో ప్రత్యక్షజ్ఞానం పొందాలి. ఈ జగత్తంతా మిధ్య. కేవలము భ్రాంతివల్లనే ఇలా కనిపిస్తోంది. చీకట్లో తాడును చూసి పాము అని ఊహిస్తున్నాము. అందుకే అది పాములాగా కనిపిస్తోంది. అంటే

అధిష్టానం కన్న వేరుగా కనిపిస్తోంది. ఈ విషయాన్ని జ్ఞానులు గుర్తించరు. ఎందుకంటే అది మిథ్య, భ్రాంతి అని వారికి తెలుసు. త్రాడును చూసి పాము అనుకునేది అజ్ఞాని. అవిద్య వల్ల ఈ రకంగా భావనచేస్తాడు. కంటికికనిపించే జగత్తు యొక్క మూలమంతా మనస్సులోనే ఉంది. మనస్సు నశిస్తే ఈ భావన నశిస్తుంది. కాబట్టి అంతరాంతరాళాల్లో ఉన్న ఆత్మమీద దృష్టిని నిలిపి మనసును ఏకాగ్రం చెయ్యాలి. అందుకే సమాధిస్థితిలో ఉన్నవారు బ్రహ్మతత్త్వాన్ని పూర్ణంగా గ్రహించగలుగుతారు. దీనికి కారణం వారిమనసు శుద్ధము, నిర్మలము అయిఉండటమే. సమాధిస్థితిలో అనంతమయిన పరబ్రహ్మతత్త్వాన్ని, సాధకుడు తన హృదయంలో చూడగలుగుతాడు. ఆ పరబ్రహ్మ అజరము, అమరము, అయిన ఏకైక వస్తువు. దానికి పేరు లేదు. గుణం లేదు. అది నిత్యము, సత్యము, శాశ్వతము అయినది. ఇంతవరకు సముపార్జించిన జ్ఞానంతో వాసనాబంధనాలు ఛేదించి, సచ్చిదానందస్వరూపము, అద్వయము, ఏకము అయిన ఆత్మను తన హృత్పద్మంలోనే దర్శించగలుగుతాడు. ఈ విధంగా ఆత్మవిచారణ చేసినందువల్ల ఆత్మనిష్ఠ కలుగుతుంది.

ఈ అధ్యాయంలో మొత్తం 11 శ్లోకాలున్నాయి. వీటిలో ఆత్మనిష్ఠకు అవసరమైన సూచనలు చేస్తున్నాడు అష్టావక్రుడు.

**ఆచక్ష్వ శృణువాతాత నానాశాస్త్రాణ్యనేకశః ।**
**తథాఽపి న తవ స్వాస్థ్యం సర్వ విస్మరణాదృతే ॥** **1**

రాజా ! ఇప్పటిదాకా చాలా శాస్త్రాలు చదివావు. ఉపన్యాసాలు విన్నావు. గురూపదేశం జరిగింది. తోటివారితో బాగా తర్కించావు. నువ్వు ఈ జ్ఞానాన్ని ఎంత తెలుసుకున్నా, దాన్ని మరచిపోలేకపోతే ఆత్మనిష్ఠుడవు కాలేవు. ఈ శ్లోకంలో **శాస్త్రపరిజ్ఞానం** గురించి చెబుతున్నారు. అదే మొదటి ఆటంకం.

ఇప్పటిదాకా అనేక గ్రంథాలు చదివావు. అనేక రకాలుగా విషయాన్ని తెలుసుకున్నావు. ఆత్మ జ్ఞానాన్ని తెలుసుకోవటానికి అనేకమంది అనేక మార్గాలు చెప్పారు. ఇవన్నీ చదివిన తరువాత చివరకు మిగిలినవి రెండే మార్గాలు 1.ద్వైతము 2.అద్వైతము. ద్వైతాన్ని అనుసరిస్తే సాయుజ్యం లభించదు. ఈ మాట మనం చెప్పటం లేదు. ద్వైతులే చెబుతున్నారు. భగవంతుణ్ణి పరమభక్తితో సేవించినవారు

పరమపదం చేరతారు. అది విష్ణుపదం, శివపదం, శక్తిపదం ఏదైనా కావచ్చు. అలా చేరిన వారు అంగుష్టమాత్రదేహులై అపరబ్రహ్మను సేవిస్తూ కల్పాంతం వరకు అక్కడే ఉండి కల్పాంతాన అపరబ్రహ్మతో పాటుగా పరబ్రహ్మలో లీనమై పోతారు. ఇదే క్రమముక్తి. అయితే అపరబ్రహ్మను చేరిన వారంతా, పరమపదము చేరిన వారంతా కల్పాంతాన అపరబ్రహ్మతో పాటుగా పరబ్రహ్మలో లీనమై పోతారా? అంటే అలా జరగదు. పరమపదం చేరిన వారిలో కూడా జ్ఞానసముపార్జన చేసిన వారు మాత్రమే పరబ్రహ్మలో లీనమవుతారు. మిగిలిన వారు అటువంటి అర్హమైన జ్ఞానం సంపాదించలేని వారు తిరిగి ఈ లోకంలో ఉన్నతమైన వంశంలో మహారాజులుగానో, మహర్షులుగానో జన్మించి ఆ జ్ఞాన సముపార్జన చేసి అప్పుడు పరబ్రహ్మలో లీనమవుతారు. విదేహ దేశాధిపతి జనకమహారాజు కాశీరాజుఅశ్వపతి, పాంచాల దేశాధిపతి ప్రవాహణుడు, మహావృషరాజ్యాధిపతి జానశృతి మొదలైన రాజులు, దధ్యుడు, ఉద్దాలకుడు, యాజ్ఞవల్క్యుడు, గార్గాయణి మొ॥ మహర్షులు ఈ కోవకు చెందినవారే. ఇక్కడ ఇంకొక్క మాట. అపరబ్రహ్మ అంటే చతుర్ముఖ బ్రహ్మ కదా? చాలామంది అవుననే చెబుతున్నారు. అపరబ్రహ్మ అంటే చతుర్ముఖబ్రహ్మ కాదు. ఇతడు పరబ్రహ్మకు ప్రతీక, ప్రతిబింబం, సాకారబ్రహ్మ. సాధకుడు ఎవరినైతే, ఏ రూపాన్నైతే పరబ్రహ్మగా అర్చిస్తున్నాడో అతడు అపరబ్రహ్మ. రాముడు, కృష్ణుడు, నారాయణుడు, శ్రీమహావిష్ణువు, ఈశ్వరుడు, పరాశక్తి. వీరంతా అపరబ్రహ్మలు. వీరు ఉండే ప్రదేశాలు.

శ్రీకృష్ణుడు – గోలోకం

శ్రీమన్నారాయణుడు – శ్వేతద్వీపం

శ్రీమహావిష్ణువు – వైకుంఠం

రాముడు, వేంకటేశ్వరుడు – వీరికి ప్రత్యేకమైన లోకం లేదు. కాబట్టి వైకుంఠంలోనే ఉంటారని చెప్పాలి.

ఈశ్వరుడు – కైలాసం

పరాశక్తి – మణిద్వీపం

వీటినే మనం **పరమపదము** అంటాం. అయితే సృష్టికర్త అయిన చతుర్ముఖ బ్రహ్మ సత్యలోకంలో ఉంటాడు కదా? ఆయన సృష్టికర్త. త్రిమూర్తులలో ఒకడు.

అంతే. అపరబ్రహ్మకు సృష్టి స్థితి లయాలు చేసే శక్తి ఉంటుంది. చతుర్ముఖ బ్రహ్మకు ఆ శక్తి లేదు. అందుకే చాలా సమయాలలో లోకాలను రక్షించమని శ్రీమహావిష్ణువును ప్రార్థించారు. కాబట్టి చతుర్ముఖబ్రహ్మ సృష్టికర్తే కాని అపరబ్రహ్మ మాత్రం కాదు.

ఇక రెండవది అద్వైతం ఇది నిరాకారోపాసన. పరబ్రహ్మ నిరాకారుడు, నిర్గుణుడు. సాధకుడు ఏ దేవతనైతో ఆరాధిస్తాడో, మరణకాలంలో ఏ రూపాన్నైతే స్మరిస్తాడో మరనానంతరము తాను కూడా అదే రూపాన్ని పొందుతాడు. అతడి దగ్గరకే చేరతాడు అని చెబుతున్నాయి శాస్త్రాలు.

జడభరతుడు లేడిని స్మరిస్తూ మరణించాడు మరుజన్మలో లేడిగా జన్మించాడు. పురంజనుడనే రాజు తన భార్యనే తలచుకుంటూ మరణించాడు. దాని ఫలితంగా మరుజన్మలో స్త్రీగా జన్మించాడు. అజామిళుడు దుర్మార్గుడై ఉండి కూడా నారాయణా అంటూ ప్రాణాలు వదిలి వైకుంఠం చేరాడు. అలాగే నిరాకారోపాసన చేసినవాడు మరణానంతరము నిరాకారుడౌతాడు. నేనే పరబ్రహ్మని అని భావన చేస్తూ కన్ను మూసినవాడు తప్పనిసరిగా సాయుజ్యం పొందుతాడు. సాయుజ్యం పొందాలంటే జ్ఞానం కావాలి. అది కేవలము జ్ఞానంవల్లనే సాధ్యం. శంకర భగవత్పాదుల వారు **ఆత్మబోధలో**

**బోధోన్యసాధనేభ్యోహి సాక్షాన్మోక్షైక సాధనమ్**

**పాకస్యవహ్నివత్ జ్ఞానం వినామోక్షోన సిద్ధ్యతి ॥**

మోక్షం పొందాలంటే జ్ఞానానికి మించిన సాధనం లేదు. అగ్ని లేకుండా వంట చెయ్యటం కుదరనట్లే జ్ఞానం లేకుండా మోక్షం రాదు. అంటారు. జ్ఞానాదేవతు కైవల్యం జ్ఞానమే మోక్షప్రదాత. **అష్టావక్రగీత అంతా అద్వైత సిద్ధాంతమే.**

ఒకసారి ఒక సాధకుడు బ్రహ్మజ్ఞాని దగ్గరకు వెళ్ళి ఆత్మని గురించి వివరించమని అడిగాడు. దాని ఆ జ్ఞాని ఇప్పటిదాకా ఆత్మను గురించి నువ్వు తెలుసుకున్నది చెప్పు. మిగిలింది నేను చెబతాను' అన్నాడు. సాధకుడు ఆత్మను గురించి భగవద్గతలో ఇలా ఉంది. పురాణాలలో ఇలా చెప్పారు. ఉపనిషత్తులు ఇలా అంటున్నాయి. అని చెప్పటం మొదలుపెట్టాడు. అప్పుడు జ్ఞాని అంటాడు "నాయనా ! ఏ గ్రంథం ఏం చెప్పింది అనేది కాదు కావలసింది. ఆత్మను గురించి నువ్వు ఏమనుకుంటున్నావు? నీకు అర్థమైంది ఏమిటి? అది చెప్పు" అన్నాడు.

ఇప్పటిదాకా చదివిన శాస్త్రాలు, గ్రంథాలు, వాటి పేర్లు కాదు కావలసింది. **కఠోపనిషత్తు**లో ఆత్మను గురించి యముడు ఏం చెప్పాడు? అనేది కాదు. అందులో నీకేం అర్థమయింది? ఈ విషయం కావాలి. నువు చదివిన శాస్త్రాల పేర్లు, అందులో ఎవరు ఏం చెప్పారు? అనేది అవసరం లేదు. చెప్పిన విషయం ఏమిటో, అది నీకు ఎంతవరకు అర్థం అయిందో కావాలి. అంటే నువు చదివిన గ్రంథాల పేర్లు పూర్తిగా మరచిపోవాలి. విషయం మాత్రమే గుర్తుండాలి.

**భోగం కర్మ సమాధిం వా కురు విజ్ఞ తథాఽపి తే ।**
**చిత్తం నిరస్త సర్వాశమత్యర్థం రోచయిష్యతి ॥ 2**

ఓ రాజా ! లౌకికమైన భోగాలు అనేకానేకాలు అనుభవించి ఉండవచ్చు. యజ్ఞయాగాదులు చెయ్యచ్చు. దానధర్మాలు చెయ్యవచ్చు. యోగాభ్యాసం చేసి ఉండవచ్చు. అయినా నీ మనసు ఇంకా సహజ స్వరూపమైన ఆనందాన్ని కోరుతున్నది. ఈ సహజ స్వరూపం అనేది ఇప్పటి వరకు నువ్వు చేసిన వాటికన్న, చేయవలసిన వాటికన్న, అన్ని విషయాలకన్న అతీతమైనది. ఆ స్థితిలో అన్ని కోరికలు నశించిపోతాయి.

ఈ శ్లోకంలో స్వరూపానందం పొందాలి అంటున్నారు. స్వరూపము అంటే నీ యొక్క అసలైన రూపము. అదే పరమాత్మ. **ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా మానవదేహం సృష్టించిన తరువాత బ్రహ్మరంధ్రం ద్వారా ఆ దేహంలో ప్రవేశించి అజ్ఞానంతో నేను అంటే దేహము అనుకుంటున్నాడు. ఘటంలో ఉన్నది ఘటాకాశం. బయట జగత్తంతా వ్యాపించి ఉన్నది మహదాకాశము. అలాగే జీవిలో ఉన్నది కాబట్టి దీన్ని జీవాత్మ అన్నారు. బయట అంతటా వ్యాపించి ఉన్నది పరమాత్మ. అజ్ఞానం గనక వదలిపోయి జ్ఞానం వస్తే జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే అవుతాయి. అదే సాయుజ్యము లేదా మోక్షము. కాబట్టి జీవాత్మ యొక్క స్వస్వరూపము, దాని అసలు రూపము ఏమిటి అంటే పరమాత్మ. అందుకే స్వస్వరూపం పొందుతాడు అంటే నీ రూపమైన పరమాత్మవు అవుతావు. పరబ్రహ్మ నిరాకారుడు, నిర్గుణుడు, నిష్కాముడు, ఆప్తకాముడు, పూర్ణకాముడు. అతడికి కోరికలు ఉండవు. అన్ని కోరికలు తీరినవాడు. మనసును జయించినవాడు. కోరికలు అనేవి మనసు నుంచే పుడతాయి.

అవి మనోవికల్పాలు. పరబ్రహ్మకు సంకల్ప వికల్పాలుండవు. ఎప్పుడైతే రాగద్వేషాలు, అహంకార మమకారాలు మొ॥ ద్వంద్వములు నశిస్తాయో, అప్పుడే అతడు ముక్తుడౌతాడు. పరిపూర్ణమైన జ్ఞానం వచ్చిన తరువాత సాయుజ్యం పొందుతాడు. ముక్తి అంటే భగవంతుని సన్నిధికి చేరటం. పరమపదం చేరటం. సాయుజ్యము అంటే పరబ్రహ్మలో లీనం కావటం. జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటి కావటం. కాబట్టి ఓ జనక మహారాజా! అన్ని కోరికలు తీరిపోవటం వల్ల మనసులోని అశాంతి పోయి పరమశాంతి ఏర్పడుతుంది. మానవుడు ఎన్ని కర్మలు చేసినా, ధర్మకార్యాలు చేసినా ఈ శాంత స్థితి రాదు. కోరికలను పూర్తిగా నాశనం చెయ్యటమే. దీనికి మార్గము.

**ఆయాసాత్సకలో దుఃఖీ నైనంజానాతి కశ్చన ।**
**అనేనైవోపదేశేన ధన్యః ప్రాప్నోతి నిర్వృతిమ్ ॥ 3**

ప్రతిక్షణము తీరిక లేకుండా జనులంతా ఏదో ఒక పని చేస్తూ విపరీతంగా శ్రమ పడుతున్నారు. దానివల్లనే అశాంతి పాలౌతున్నారు. ఈ సంగతి వారెవరికీ అర్థం కావటం లేదు.

**కోరికల కతీతంగా ఉండాలి** అంటున్నారీ శ్లోకంలో

రాజా ! మానవుడి అశాంతికి కారణము కోరికలు. ఇవి అనంతమైనవి. ఒకటి. తీరితే ఇంకొకటి పుడుతుంది. మనసు అక్షయపాత్రలాంటిది. అందులోని ఒక కోరిక తీరితే ఇంకొకటి, ఇంకొకటి అలా పుట్టుకొస్తూనే ఉంటాయి. కోరికలు పూర్తిగా తీరటముఅనేది ఎవరికీ ఉండదు.

**న జాతుకామః కామానాముప భోగేన శామ్యతి**

అగ్నిలో ఆజ్యం పోసిన కొద్దీ అగ్ని ప్రజ్వరిల్లుతూనే ఉంటుంది కాని ఆరదు. అగ్నిని ఆర్పాలంటే నీరు పొయ్యాలి. అలాగే అనుభవించటం వల్ల కోరికలు తీరవు. ఇంకా ఇంకా పెరుగుతాయి.

రామకృష్ణ పరమహంసకి మామిడిపండంటే విపరీతమైన ఇష్టం. అందుకని ఒకసారి శిష్యులు వందకాయలు తెచ్చిపెట్టారు. అవి అన్నీ తిన్నా ఆ కోరిక తీరదు. ఇంకా కావాలనే అనిపిస్తుంది. అందుకని రామకృష్ణ పరమహంస బాగామగ్గిన

పండ్లు రెండు తిన్నాడు. ఇప్పుడు ఆ తిన్నదాన్ని కక్కేశాడు. ఆ కక్కిన పదార్థం తీసుకుని మళ్ళీ తిన్నాడు. ఇలా రెండు మూడు సార్లు చేస్తున్నాడు. అది చూసిన శిష్యులు పరమ అసహ్యంతో "స్వామి ! కావాలంటే ఇంకొక కాయ తినవచ్చు కదా! ఇలా కక్కిన దాన్ని తీసుకుని తినటం దేనికి?' అన్నారు. అప్పుడు ఆయన 'నాయనా! ఇలా తింటూ ఉంటే జీవితాంతం తిన్నా మామిడి పండు మీద కోరిక తీరదు. కోరిక తీరాలంటే దానిమీద అసహ్యం కలగాలి. అందుకే ఇలా చేస్తున్నాను' అంటారు. కాబట్టి అనుభవించటం వల్ల కోరికలు తీరవు. వాటిమీద అసహ్యం కలగాలి. కోరికలన్నింటిలోకి స్త్రీ వ్యామోహము, రతిసుఖము చాలా ముఖ్యమైనవి. వాటిని గనక జయించగలిగితే అన్నింటినీ జయించినట్లే. అందుకే **కాళహస్తీశ్వర శతకం** లో అంటాడు ధూర్జటి.

**కాయల్గాచె వధూనఖాగ్రములచే గాయంబు, వక్షోజముల్**
**రాయన్ రాపడెరొమ్ము, మన్మథ విహారక్లేశ విభ్రాంతిచే**
**బ్రాయంబాయెను, బట్టగట్టెదల, చెప్పన్ రోత సంసారమే**
**జేయంజాల విరక్తు చేయగదవే శ్రీకాళహస్తీశ్వరా ॥**

స్వామి ! కాళహస్తీశ్వరా ! నన్ను ఈ భవబంధాల నుండి విముక్తి చెయ్యి అంటున్నాడు.

కోరిక తీర్చుకుంటే చాలా హాయిగా సుఖంగా ఉంటుంది అని అనుకుంటారు. అది నిజం కాదు. ఇదే విషయం **త్రిపురారహస్యం**. జ్ఞానఖండంలో హేమలేఖ తన భర్త అయిన హేమచూడమహారాజుతో చెబుతుంది. 'రాజా ! రతిసౌఖ్యం చాలా హాయిని, సుఖాన్ని ఇస్తుంది అంటున్నావు. అదే నిజమైతే ఆ ప్రక్రియలో పాల్గొన్న వారు అలసిపోయి ఎందుకు నిద్రపోతారు. ఆడపశువు ఆ ప్రక్రియ తరువాత వంటి నొప్పితో ఎందుకు బాధ పడుతుంది? రాజా నీకు ఓ కథ చెబుతాను విను. పూర్వకాలంలో విశాల నగరాన్ని విష్ణువర్ధనుడనే రాజు పరిపాలిస్తుండే వాడు. ఆయనకు ఒకడే కుమారుడు, అతడు బాగా చదువుకున్నాడు. యుద్ధ విద్యలలో నేర్పరి. మంచి అందగాడు, గుణవంతుడు. కాబట్టి రాజుగారు ఒక మంచి అందగత్తెను తెచ్చి అతనికి వివాహం చెయ్యాలి అనుకున్నాడు.

పోరుగుదేశపు రాకుమార్తెతో అతడి వివాహం జరిపించాడు. ఆ పిల్ల అపురూప సౌందర్యవతి. ఇద్దరూ రతీ మన్మథులు లాగా ఉండేవారు.

ప్రతిరోజు భోజనం అయిన తరువాత రాకుమారుడు మధుపానం చేసి, తరువాత తన అంతఃపురానికి వెడతాడు. అక్కడ అపురూప సౌందర్యరాసి అయిన భార్యతో స్వర్గలోకపు అంచులదాకా వెళ్ళి తిరిగి వస్తుంటాడు. యువరాజు మధుపానం చేస్తుంటే, మధువు పొయ్యటానికి ఒక పనివాడు ఉండేవాడు. అతడు ఏదో మాటలు చెబుతూ గ్లాసులో మధువును పోసేవాడు. యువరాజు త్రాగేసేవాడు, ఆ రోజున యువరాజు అన్యమనస్కంగా ఉన్నాడు. మధువును గ్లాసులో పోసే పనివాడు ఏదో పని ఉండి రాలేదు. యువరాజు కూడా రోజులాగా మధుపానం చెయ్యకుండానే లేచి అంతఃపురానికి వెళ్ళాడు. అక్కడ తన భార్య తనకోసం మంచంమీద ఎదురు చూస్తోంది. యువరాజు ఆమెను సమీపించాడు. వారిద్దరూ మన్మథ సామ్రాజ్యం అంచులదాకా వెళ్ళి వచ్చారు. ఇప్పుడు తన భార్య అలసిపోయి పడుకుంది. ఈ సమయంలో ఆమె ముఖము ఎలా ఉంటుందో చూడాలి అనిపించింది యువరాజుకు. దీపపు వెలుగులో ఆమె ముఖం చూశాడు. మరుక్షణమే గట్టి గట్టిగా అరిచేశాడు. మంచంమీద పడుకున్నది తన భార్యకాదు. ఒక దాసి. చాలా వికృతంగా ఉంది. వెంటనే ఎడమచేత్తో ఆమె జుట్టు పట్టుకుని, కుడిచేత్తో కత్తి తీసుకుని, నా భార్య ఎక్కడ? నిజం చెప్పు నువ్వెవరు? ఇక్కడికి ఎలా వచ్చావు?' అన్నాడు. మరుక్షణంలోనే ఆ దాసి గడగడ వణికిపోతూ యువరాజా ! నన్ను సంహరించవద్దు. ఈ రోజే కాదు. ప్రతిరోజు ఇక్కడ నేనే ఉంటున్నాను. నువ్వు సుఖాలు అనుభవిస్తున్నది నాతోనే. నీ భార్య ఇక్కడ లేదు. నాకు ప్రాణభిక్ష పెడితే నేను ఆమెను చూపిస్తాను' అంది సరే అన్నాడు యువరాజు. దాసి రాజుగారిని అంతఃపురంలోని వేరే గదికి తీసుకుపోయింది. అక్కడ తన భార్య, ఇందాకటి దాకా తనకు మధువును గ్లాసులో పోసిన కురూపి అయిన దాసీ వాడితో ఆనంద డోలికలలో తేలియాడుతున్నది. ఆ తమకంలో ఏదో మాట్లాడుతున్నది. కళ్ళతో చూశాడు. చెవులలో విన్నాడు యువరాజు. నిశ్చేతనుడు అయిపోయాడు. చేతిలో కత్తి జారి క్రింద పడిపోయింది. హతాసుడై అలా చూస్తు ఉండిపోయాడు. తాను ఏం తక్కువ చేశాడు. అతడు తనకన్న అందగాడు కాదు. శ్రీమంతుడు కాదు. అధికారం లేదు. మరి ఎందుకు అతడంటే ఆమె

ఇష్టపడింది? ఆలోచిస్తున్నాడు. అని చెప్పి ఇప్పుడంటోంది హేమలేఖ. రాజా ఇప్పుడు చెప్పు. రాకుమారుడు అంతవరకు దాసితో సర్వసుఖాలను అనుభవించాడు. ఇప్పుడు ఆమె దాసి అని తెలిసేటప్పటికి ఆ ఆనందం కాస్తా పోయింది. ఎందుకు అలా జరిగింది? రాకుమారా ! ఇంతవరకు మనసులో తన దగ్గర ఉన్నది. తన భార్య అని ఊహించుకున్నాడు. సుఖాన్ని పొందాడు. ఇప్పుడు అది ఒక కురూపియైన దాసి అని తెలిసి అసహ్యించుకున్నాడు. సంతోషము, విచారము రెండూ మనసువల్లనే కలుగుతాయి. కాబట్టి కోరికలకు మూలము మనస్సు. ఆ మనసును జయించిన వాడికి కోరికలుండవు' అంటుంది.

కాబట్టి ఓ జనక మహారాజా ! కోరికల వలయంలో చిక్కుకుని మానవుడు ఏదో సాధించాలని నిత్యము శ్రమ పడుతూ అశాంతిని అనుభవిస్తున్నాడు. ఓ రాజా! సంకల్ప వికల్పాల వల్ల మనసు అశాంతికి లోనవుతుంది. అందుచేత మనసును జయిస్తే కోరికలు నశిస్తాయి.

**వ్యాపారే ఖిద్యతే యస్తు నిమేషోన్మేషయోరపి ।**
**తస్యాలస్య ధురీణస్య సుఖం నాన్యస్య కస్యచిత్ ॥** **4**

కళ్ళు మూయటం తెరవటం కూడా కష్టంగా భావించే ఉదాసీన శ్రేష్ఠుడే (సోమరిపోతు. బద్ధకస్తుడు) అనంతమైన సుఖాన్ని పొందుతాడు.

ఈ శ్లోకంలో **ఉదాసీనత** గురించి చెబుతున్నారు.

జ్ఞాని ఆనందమవయ స్థితికి చేరాడు. అంటే ఆత్మారాముడైనాడు. నిరంతరము సమాధి స్థితిలోనే అలా ఉండిపోతాడు. చూసేవారికి ఏమీ తెలియదు. అతడు ధ్యానం చేస్తున్నాడా? నిద్రపోతున్నాడా? ఏమీ తెలియదు. రామకృష్ణ పరమహంస కాళీమాత దేవాలయంలో పూజారి. అమ్మవారి దగ్గర కూర్చుని అలా నిశ్చలంగా ఉండిపోయేవాడు. ఒక్కొక్కసారి అలాగే స్పృహ లేకుండా పడిపోయేవాడట. నిద్ర పోతున్నాడని కొన్ని రోజులు, తరువాత మూర్ఛరోగం ఉన్నది అని అనుకునే వారట. అలా గంటల తరబడి ఉండిపోయే వాడు. మహాత్ములు సమాధిలోకి వెడితే 12 సం॥ల పాటు అలాగే ఉంటారు. అని చెబుతారు. త్రిపురారహస్యంలో తంగణుడు అనే మహర్షి కోసం ఆ దేశపు రాజు తమ్ముడు వస్తాడు. అప్పుడు ఆ ఋషి కుమారుడు

అతడికి ప్రత్యేకంగా పేరులేదు. తంగణపుత్రుడు అంటారు. అతడు చెబుతాడు. నా తండ్రి సమాధిలో ఉన్నాడు 12 సం॥దాకా లేవడు అంటాడు. అటువంటి స్థితిలో జ్ఞానికి బాహ్యప్రపంచం తెలియదు. అసలు లౌకికమైన స్పృహ ఉండదు. తన ఆత్మతో తాను రమిస్తూ ఉంటాడు. అదే స్వరూపస్థితి. వీరి దృష్టిలో లౌకికమైన వన్నీ వృథా. ఏ కర్మ చేసినా వృథా. కాబట్టే ఏ పనీ చెయ్యడు. కళ్ళు మూసి తెరవటం కూడా అనవసరము అనుకుంటారు. చూసేవాళ్ళు ఇతడు చాలా బద్ధకస్తుడు అని భావిస్తారు. అందుకే ఇక్కడ **అలస్యధురీణః** అంటే ఉదాసీనంగా ఉండే వారిలో అగ్రగణ్యుడు అని అర్థం. మన భాషలో చెప్పాలంటే పెద్ద సోమరిపోతు. పరమబద్ధకస్తుడు.

ఒకసారి ఒకరాజు గారికి తనదేశంలో ఎవరు గొప్ప బద్ధకస్తుడో తెలుసుకోవాలని పించింది. దేశంలో అతిపెద్ద బద్ధకస్తుడుగా నిలిచిన వాడికి వెయ్యి బంగారు నాణాలు బహుమానం ఇస్తాను అన్నాడు. ఆ చాటింపు విని చాలామంది వచ్చారు. వారందరితోను సమావేశం ఏర్పాటు చేసి బస చూపించాడు రాజుగారు. మరునాడు మధ్యాహ్నం మంచి విందు భోజనం ఏర్పాటు చేశాడు. విందు పూర్తయిన తరువాత విశ్రాంతిగా పడుకున్నారు బద్ధకస్తులు. వారు విడిది చేసిన ఇంటికి నిప్పు అంటించారు రాజభటులు. మంటలు చెలరేగగానే నెమ్మది నెమ్మదిగా ఒక్కొక్కరే లేచి వెళ్ళిపోతున్నారు. విడిది సగం తలబడి పోయింది. మంటలు ఉవ్వెత్తున లేస్తున్నాయి. అయినా ఇద్దరు మాత్రం పడుకున్న చోటి నుంచి కదల్లేదు. మంటలు మనదాకా వచ్చాక చూద్దాంలే అన్నారు. మంటలు ఇంకా దగ్గరకొచ్చేశాయి. అందులో ఒకడు మెల్లగా లేచి బయటకు వచ్చాడు. రెండవ వాడు 'మంటలు నాదాకా వచ్చేసరికి భటులు వాటిని ఆర్పకపోతారా?' అని ప్రక్కకు తిరిగి పడుకున్నాడు కాని లేవలేదు. అతణ్ణి విజేతగా ప్రకటించి **పరమబద్ధకస్తుడు** అని బిరుదుతో పాటు వేయి బంగారు వరహాలు కూడా ఇచ్చి పంపారు రాజుగారు. ఇతడు లేవటానికి కూడా ఇష్టపడని బద్ధకస్తుడు.

కాని ఇందాక చెప్పిన జ్ఞాని అలాకాదు. అతడికి వళ్ళు తెలియదు. లౌకికమైన విషయాలు తెలియవు అసలు స్పృహలో ఉండడు. తన ఆత్మయందే రమిస్తూ ఉంటాడు. ఇతణ్ణే **అలస్యధురీణః** అంటారు. అతడు పొందేది శాశ్వతమైన సుఖం.

పరబ్రహ్మ పొందే ఆనందాన్ని బ్రహ్మానందము అంటారు. ఇటువంటి ఆనందాన్ని ఈ లోకంలో అహంకార మమకారాలు, రాగద్వేషాలు విడిచిన జ్ఞాని జీవించి ఉండగానే పొందుతాడు. కాబట్టి ఓ జనక మహారాజా ! ఆ రకమైన సుఖం, ఆనందం అతడికి తప్ప వేరెవరికీ దక్కదు. అతడే మహాజ్ఞాని.

**ఇదంకృతమిదంనేతి ద్వంద్వైర్ముక్తం యదా మనః ।**
**ధర్మార్థ కామ మోక్షేషు నిరపేక్షం తదా భవేత్ ॥ 5**

ఈ పని చెయ్యబడింది. ఇది ఇంకా లేదు అనే ఆలోచనల నుండి, ద్వంద్వాల నుండి విడివడిన మనస్సు ధనధాన్యాలు, భోగభాగ్యాలు, సిరిసంపదల పట్ల కోరిక చివరకు ముక్తి కావలనే కోరిక కూడా లేకుండా ఉదాసీనంగా ఉంటుంది. ఈ శ్లోకంలో **ద్వంద్వాల** గురించి చెబుతున్నారు.

ఈ లోకంలో పనులు అంటే లౌకికమైన పనులన్నీ కూడా మనసు వల్లనే జరుగుతాయి. మనసు ఉంటేనే ఆ పనుల పట్ల ఆసక్తి ఉంటుంది. మనసు లేకపోతే ఆసక్తి ఉండదు.

మనస్సును గురించి గతంలో చెప్పుకున్నాం. ఇప్పుడు మళ్ళీ ఒకసారి గుర్తు తెచ్చుకుందాం. మనసు శుద్ధము అశుద్ధము అని రెండు రకాలు. కామసంకల్పాలు గల మనస్సు అశుద్ధము, కామసంకల్పాలు లేని మనస్సు శుద్ధము. మానవుడి బంధమోక్షాలకు కారణం మనస్సే.

సంసారానికి కారణం మనస్సు. ఈ మనస్సు వల్లనే రాగద్వేషాలు, అహంకార మమకారాలు కలుగుతున్నాయి. మమ అనుకుంటే బంధం. నమమ అనుకుంటే మోక్షం. మనసుంటేనే సంసారముంటుంది. మనస్సు లేనివాడికి పిచ్చివాడికి, పసిపిల్లవాడికి సంసారం ఉండదు. బంధాలు ఉండవు. అలాగే ముముక్షువుకు బంధాలుండవు. నేను నాది అనే అహంకార మమకారాల నుండి విడివడిన వాడే జ్ఞాని. అతడికి సిరిసంపదలు, భోగభాగ్యాలు, ధర్మాధర్మాల పట్ల, చివరకు ముక్తిపట్ల కూడా కోరిక ఉండదు. ఎందుకంటే అతడు మనసును జయించినవాడు. ద్వంద్వాతీతుడు.

**విరక్తో విషయ ద్వేష్టా రాగీ విషయలోలుపః ।**

**గ్రహమోక్ష విహీనస్తు న విరక్తో న రాగవాన్ ॥ 6**

లోకంలో విషయాల యందు ఆసక్తి గలవాణ్ణి 'రాగి' అంటారు. విషయాసక్తి లేనివాడు 'విరాగి' ప్రపంచాన్ని మిథ్యగా తెలుసుకున్న జ్ఞాని రాగి కాదు విరాగీకాడు.

ఈ శ్లోకంలో **వైరాగ్యం** గురించి చెబుతున్నారు.

లోకంలో విషయాల యందు ఆసక్తి కలవాడు. కోరికలు అనుభవించాలి అనుకునే వాడు, దాని కోసం ప్రయత్నం చేసేవాడు 'రాగి' అనబడతాడు. ఇతడు లౌకిక లంపటంలో ఇంకా ఇంకా కూరుకుపోతూ ఉంటాడు. మోక్షం కావాలనుకునే వాడు విషయ వాంఛల నుండి బయటకు రావాలి. వాటిపట్ల విముఖత ప్రదర్శించాలి. జ్ఞానిదృష్టిలో అసలు జగత్తే లేదు. కాబట్టి రాగి అనుభవించాలనుకుంటున్న కోరికలు ఎక్కడున్నాయి? అనుభవించేదెవరు? అనుభవించబడే వస్తువేది? అనుభవం ఏది? ఇవన్నీ మిథ్య. కాబట్టి కోరికల పట్ల విముఖత ప్రదర్శించాలి. వైరాగ్యం కావాలి అంటారు. కాని గుర్తించవలసిన విషయం ఏమంటే అనుభవించే కోరిక లేదు. అనుభవం లేదు. అనుభవింపబడే వస్తువు లేదు. వస్తువులను చూసే మనస్సు లేదు. కోరిక అంతకన్నా లేదు. కాబట్టి జ్ఞాని దృష్టిలో రాగి లేడు విరాగిలేడు. వైరాగ్యం ప్రత్యేకంగా ప్రదర్శించటం కాదు. జ్ఞాని దృష్టిలో బంధం లేదు మోక్షం రాలేదు. అలాగే రాగిలేడు విరాగి అంతకన్నా లేడు.

**హేయోపాదేయతా తావత్సంసార విటపాంకురః ।**

**స్పృహా జీవతి యావద్వై నిర్విచార దశాస్పదమ్ ॥ 7**

కోరికలున్నంత వరకు ఆమోద విసర్జనలుంటాయి. అవే సంసారమనే వృక్షానికి అంకురాలు. బీజాలు. ఇవి నాశనం కావాలి.

ఈ శ్లోకంలో **బీజనాశనం** గురించి చెబుతున్నారు.

లౌకిక వ్యవహారాల గురించి ఆలోచించినప్పుడు మనిషి తనకు తెలియకుండానే విషయవాంఛలలో చిక్కుకుంటాడు. దానివల్ల కోరికలు కలుగుతాయి. దీనివల్ల రాగం కలుగుతుంది. కోరికలు తీరకపోతే ద్వేషం, క్రోధం పెరుగుతాయి. ఈ రకంగా అరిషడ్వర్గాలు, అహంకార మమకారాలు పెరుగుతాయి. వీటన్నింటి వల్లనే

సంసారమనే వృక్షం మూడు పువ్వులు, ఆరు కాయలుగా విలసిల్లుతుంది. భగవానుడు గీతలో చెప్పినట్లుగా

**ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే**
**సంగాత్సంజాయతే కామః కామాత్ క్రోధోభిజాయతే**
**క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతి విభ్రమః**
**స్మృతిభ్రంశాత్ బుద్ధి నాశః బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥**

మనిషి లౌకిక విషయాల గురించి ఆలోచించినప్పుడు వాటిమీద రాగం కలుగుతంది. ఆ రాగం నుంచే కోరికలు పుడతాయి. కోరికల నుండి క్రోధం వస్తుంది. క్రోధం నుంచి భ్రమ, భ్రమ నుంచి స్మృతి విభ్రమము, మతిభ్రమణంతో బుద్ధి నాశనము జరుగుతుంది. ఇక్కడ బుద్ధినాశనము అంటే వివేకవంతమైన బుద్ధి నశించటమే.

అవివేకం, అజ్ఞానం కారణంగానే కోరికలు పుడతాయి. ఆ కోరికలు తీర్చుకోవాలి అనే ఆలోచనతో, వాటిని ఎలాగైనా పొందాలి అనే ఆలోచనతో ఆలోచనా రహితమైన కర్మలు చేస్తాం. అంటే తప్పులు చేస్తామన్న మాట. దీనికి కారణం వివేకం నశించటం. కోరికల బలం వల్ల ఉచ్ఛనీచాలు మరచిపోతాం. అంటే వివేకం నశిస్తుంది. ఎప్పుడైతే వివేకము అంటే బుద్ధి నశించిందో, అప్పుడు విచక్షణా జ్ఞానం నశిస్తుంది. ఏది మంచో, ఏది చెడో తెలుసుకునే శక్తి తగ్గిపోతుంది. మనసు స్థిరంగా ఉండదు. దాంతో ఆలోచనలు మారిపోతాయి. అశాంతి నెలకొంటుంది. దీనికంతటికీ కారనం కోరికలు. సంసారమనే మహావృక్షానికి కోరికలే విత్తనాలు. వీటివల్లే సంసారం పెరిగి పెద్దదవుతుంది. కాబట్టి ఆత్మనిష్ఠ కావాలంటే సంసారానికి బీజాలయిన కోరికలను నాశనం చెయ్యాలి.

**ప్రవృత్తౌ జాయతే రాగో నివృత్తౌ ద్వేష ఏవహి ।**
**నిర్ద్వంద్వో బాలవద్ధీ మానేవమేవ వ్యవస్థితః ॥** 8

కర్మలు చెయ్యటం వల్ల విషయాలమీద రాగం పుడుతుంది. విషయాలకు దూరంగా ఉంటే ద్వేషం పుడుతుంది. జ్ఞానియైన వాడు రాగద్వేషాలకు అతీతంగా నిత్యము ఆత్మస్థితుడై ఉంటాడు.

ఈ శ్లోకంలో **మోహాన్ని త్యాగం చెయ్యాలని** చెబుతున్నారు.

విషయాలమీద వ్యామోహం ఉన్నవారు, వాటిలోని బాధలను అనుభవించి, జగత్తును వదిలేస్తారు. మోహాన్ని వదలినవారు బాధలకు గురికారు. కాబట్టి మోహాన్ని వదలాలి.

మానవుడికి కోరికలు ఎక్కువగా ఉంటాయి. ఆ కోరికలు తీర్చుకోటానికే కర్మలు చేస్తుంటాడు. కోరికలు లేకపోతే కర్మలు చెయ్యడు. కోరికలు కూడా మనం చేసే పనిని పట్టి, పరిసర ప్రాంతాలను పట్టి ఉంటాయి. ఏ ప్రాంతంలో పని చేస్తున్నామో దానికి సంబంధించిన కోరికలే ఎక్కువగా ఉంటాయి. ఈ కోరికలు కలగటానికి కారణం బాహ్యప్రపంచంతో మన మనసు ముడిపడి ఉండటమే. దీన్నే రాగము అంటారు. ఈ కర్మలలో కూడా కొన్నింటిని ఇష్టంగా చేస్తాం. కొన్ని కర్మలు అంత పెద్దగా ఇష్టం ఉండవు. కొన్ని అసలు ఇష్టం ఉండవు. ఉదాహరణకు ఒక వ్యక్తికి వైష్ణవుడికి శ్రీమహావిష్ణువుకు సంబంధించిన పూజలు, అర్చనలు, ఆచారాలు, కర్మలయందు ఇష్టత ఉంటుంది. అదే ఈశ్వరుడికి సంబంధించిన కర్మలు అతడికి నచ్చవు. ఇలాగే ప్రతి మనిషికీ కూడా. దీనికి అతడి పూర్వజన్మ కృతం, చిన్నప్పటి నుంచి పెరిగిన వాతావరణం, తిరుగాడిన పరిసరాలు, స్నేహితులు, చుట్టాలు, పని చేసే ప్రాంతం. అన్నీ కారణమవుతాయి. తెనాలి రామకృష్ణుని అసలు పేరు రామలింగడు, మొదట ఇతడు శైవుడు. కాని కృష్ణదేవరాయల ఆస్థానం చేరిన తరువాత వైష్ణవమతం తీసుకుని రామకృష్ణుడు అయినాడు. వాటిని బట్టే అతడు కర్మలు చేస్తాడు. అయితే జ్ఞానికి ఇలాంటివి ఉండవు. అతడికి ఇష్టాఇష్టాలు, రాగద్వేషాలు ఉండవు. ద్వంద్వాలకు అతీతంగా, అనంతమైన ఆనందం అదే బ్రహ్మానందంలో మునిగి తేలుతూ ఉంటాడు. సంభవించిన ఘటనలు ఏ రకమైన భావన లేకుండా స్వీకరిస్తాడు. జ్ఞానికి విషయాలమీద కోరికా ఉండదు. విరక్తీ ఉండదు. ఇటువంటి జ్ఞాని మాత్రమే ఆత్మనిష్ఠ పొందుతాడు. జీవన్ముక్తుడైన జ్ఞాని చిన్నపిల్లవాడిలాగా కల్లాకపటం లేకుండా ఉంటాడు. ఇక్కడ చిన్నపిల్లలు అని చెప్పటంలో ప్రత్యేకత ఏమంటే ఇందాకనే చెప్పుకున్నాం అతడికి కల్లాకపటం ఉండదు. కోపము, ప్రేమ ఏది వచ్చినా, ఏ రకమైన భావం కలిగినా అప్పుడు వ్యక్తం చేస్తాడు అంతే. తరువాత దాన్ని గుర్తుంచుకోడు. కోపం వచ్చింది. దాన్ని ప్రదర్శిస్తాడు.

మరుక్షణంలో మరచిపోతాడు. అందుకే మహర్షుల మాట కటువు. మనసువెన్న. ఆయనకు నీమీద కోపం కలిగింది. విపరీతమైన కోపంతో శాపం పెడతాడు. నీ తప్పు తెలుసుకుని క్షమించమన్నావు. వేడుకున్నావు. అతని మనస్సు కరిగిపోతుంది. అనుగ్రహిస్తాడు. శాపవిమోచనం చెబుతాడు. ఇదే చిన్నపిల్లవాడి మనస్తత్వం జ్ఞాని ద్వంద్వాలకు అతీతంగా నిత్యమూ ఆత్మనిష్ఠుడై ఉండాలి అంటే మోహాన్ని త్యజించాలి అంటున్నాడు అష్టావక్రుడు.

**హాతుమిచ్ఛతి సంసారం రాగీ దుఃఖజిహాసయా ।**
**వీతరాగో హి నిర్దుఃఖ స్తస్మిన్నపి న ఖిద్యతే ॥ 9**

ప్రపంచంమీద వ్యామోహం ఉన్నవారు బాధలు అనుభవిస్తారు. ఆ కారణంగా ప్రపంచాన్ని త్యజిస్తారు. అసలు మోహమే లేనివారికి విచారముండదు. వారిని ఈ బాధలు ఏమీ చెయ్యలేవు.

ఈ శ్లోకంలో **మరుపు**ని వివరిస్తున్నారు.

చరాచర జగత్తులో చాలామంది దరిదాపుగా 90 శాతము మంది ఐహికమైన బాధలు అనుభవిస్తూనే ఉంటారు. ఇంకా చెప్పాలి అంటే ఈ ప్రపంచంలో బాధలు లేనిది ఎవరికి ? కష్టసుఖాల సమ్మేళనమే జీవితం. సాక్షాత్తు భగవంతుడే ఈ భూమి మీద అవతరించినా, అతడికూడా బాధలు తప్పవు. సాక్షాత్తు శ్రీకృష్ణ పరమాత్ముడికే బాధలు తప్పలేదు చూడండి. పుట్టటమే చెరసాలలో పుట్టాడు. తల్లితండ్రులు చాలా కాలం ఖైదీలుగా ఉన్నారు. పాలు త్రాగే పసిప్రాయంలో పూతన, తరువాత బాల్యంలో అనేకమంది రాక్షసులు అతణ్ణి చంపటానికి ప్రయత్నించారు. కృష్ణుణ్ణి సంహరించటానికి శతవిధాలా ప్రయత్నించాడు కంసుడు. చిన్నతనంలో అతడి అల్లరి భరించలేక తల్లి రోటికి తాడుతో కట్టేసింది. పెద్ద అయిన తరువాత భార్యే ముఖంమీద కాలితో తన్నింది. ఎవరికైనా బాధలు తప్పవు. అవతార పురుషుడైన రామచంద్రునికి అడవులపాలు కాక తప్పలేదు. జగత్తంతా జడపదార్థం. ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఏమంటే జడపదార్థం ఎప్పుడూ తనంత తానుగా కష్టాలను సుఖాలను ఇవ్వలేదు. మరి కష్టసుఖాలు ఎలా వస్తాయి అంటే, వస్తువుల మీద మనకున్న కోరికలు, ఇష్టత, అయిష్టత. వీటివల్లనే కష్టసుఖాలు కలుగుతాయి. అంటే

కష్టసుఖాలను మనమే తెచ్చుకుంటున్నాం. వస్తువు మీద మనకున్న ఇష్టమే సుఖాన్నిస్తుంది. వస్తువుమీదమనకున్న అయిష్టమే దుఃఖాన్నిస్తుంది. మనకు కావలసిన కోరుకున్న వస్తువు లభిస్తే ఆనందం కలుగుతంది. ఇష్టంలేని వస్తువు లభిస్తే దుఃఖం వస్తుంది. ఒకే వస్తువు ఒక సమయంలో సుఖాన్ని, ఇంకొక సమయంలో దుఃఖాన్ని ఇస్తుంది. శీతాకాలంలో చలిమంట వెచ్చదనాన్నిస్తుంది. కాని వేసవి కాలంలో అదే మంట మంటెక్కిస్తుండి. చిన్న ఉదాహరణ చూడండి. ఒక బ్రాహ్మణుడు బ్రహ్మదేవుణ్ణి గురించి తపస్సు చేశాడు. బ్రహ్మప్రత్యక్షమై ఏం వరం కావాలో కోరుకో అన్నాడు. నాకు రంభ కావాలి. కనీసం ఒక గంట కాలం ఆవిడ నాతో ఉండాలి అన్నాడు బ్రాహ్మణుడు. సరే అన్నాడు బ్రహ్మదేవుడు.

కొంతకాలం గడిచింది. రంభ కోసం ఎదురు చూస్తున్నాడు బ్రాహ్మణుడు రంభరాలా, ఇతనికన్నా ముందు కాలంలో రంభ కావాలని అడిగిన వారు చాలామంది ఉన్నారు. ఆ వరుసలో ఇతడి పేరు రావాలి. ఇంకొంతకాలం పోయింది బ్రాహ్మణుడు రంభ కోసం ఎదురు చూస్తున్నాడు. కాలచక్రం గిర్రున తిరిగింది. బ్రాహ్మణుడి ఆరోగ్యం చెడిపోయింది. ముసలివాడయినాడు. మంచాన పడ్డాడు. అవసాన కాలం సమీపిస్తోంది. బ్రాహ్మణుడు కూర్చోలేక పోతున్నాడు. ఓపిక లేదు. నీరసంగా ఉంది. కదిలే పరిస్థితి లేదు. ఈ సమయంలో బ్రహ్మదేవుడు రంభను బ్రాహ్మణుడి దగ్గరకు వెళ్ళమన్నాడు. రంభ వచ్చింది. మంచంమీద బ్రాహ్మణుడి ప్రక్కన కూర్చుంది. 'నాథా ! నన్ను రమ్మన్నావట కదా? నాకు ఇప్పుడే తీరుబడి అయింది. నీ కోరిక చెల్లిస్తాను రా!' అంటూ కౌగిలించుకోబోయింది. ఈ విపరీతంగా బాధ పడుతున్నాడు. భరించలేకపోతున్నాడు. ఊపిరి పీల్చను కూడా లేకపోతున్నాడు. ఈ సమయంలో రంభ వచ్చి నాథా నీ కోసమే వచ్చాను. రా ! అనుభవించు అన్నది. అసలే లేవలేకపోతున్నాడు. ఊపిరి అందటం లేదు. దాంతో చాలా బాధ పడుతున్నాడు. ఇంతలో తపోఫలం వల్ల రంభ వచ్చింది. నాథా వచ్చి నన్ను కౌగిలించుకో నీ కోరిక తీర్చుకో అంది. రంభని చూసిన ఆనందం కన్న, తాను పడుతున్న బాధ ఎక్కువగా ఉంది. అందుకే చికాకు పడ్డాడు. నాకు ఇప్పుడేమీ అక్కర్లేదు ఫో అన్నాడు. రంభ బ్రతిమిలాడినా వినలేదు.

జ్ఞానికి కోరికలు ఉండవు. జగత్తు మీద వ్యామోహం ఉండదు. వైరాగ్యంతో ఉన్నాడు కాబట్టి మనసు ప్రశాంతంగా ఉంటుంది. అందుకే మోక్షమార్గం దొరకాలంటే మనసు మోహరహితం కావాలి. అంటున్నాడు అష్టావక్రుడు.

**యస్యాభిమానో మోక్షేఽపి దేహేఽపి మమతా తథా ।**

**న చ జ్ఞానీ న వా యోగీ కేవలం దుఃఖభాగసౌః ॥ 10**

నేను అంటే దేహము అని భావించినా, నాకు మోక్షం కావాలి అని భావించినా రెండూ ఒకటే. ఇలాంటివాడు కేవలము బాధామయ జీవి మాత్రమే.

ఈ శ్లోకంలో నిరంతర దృష్టిని వివరిస్తున్నారు.

**ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా బ్రహ్మరంధ్రం గుండా మానవ శరీరంలో ప్రవేశించి నవరంధ్రాలతోను ఐహిక సుఖాలు అనుభవిస్తూ, వచ్చిన త్రోవకూడా మరచిపోయి అజ్ఞానంతో నేను అంటే దేహము అనుకుంటున్నాడు. ఇది పూర్తిగా అజ్ఞానము. ఈ అజ్ఞానం వదలిపోయి జ్ఞానోదయమయి నేను అంటే దేహము కాదు ఆత్మ అని తెలుసుకుంటే ముక్తి పొందుతాడు. నేను అంటే దేహము అని భావించేవారు అజ్ఞానంతో కొట్టుమిట్టాడుతున్నారు.

మోక్షమార్గంలో పయనించేవాడికి కోరికలు ఉండవు. మనస్సు ఉండదు. సుఖదుఃఖాలు, పాపపుణ్యాలు ఉండవు. అతడు ద్వంద్వాలకు అతీతుడు అని చెప్పుకున్నాం. అతడికి రాగద్వేషాలు, అహంకార మమకారాలు ఉండవు. నాకు ముక్తి కావాలి అనుకోవటం చాలా అజ్ఞానం. మానవుడు ఎప్పుడూ ముక్త పురుషుడే. ముక్తి ఎక్కడిదో కాదు. నీ దగ్గర ఉన్న దాన్నే గుర్తు తెచ్చుకుని పొందుతున్నావు. నువ్వు మహాజ్ఞాని. ఇతడికి కోరికలుండవు. ముక్తి అప్రాప్యవస్తువు. దాన్ని గతంలో మరచిపోయావు. ఇప్పుడు గుర్తు తెచ్చుకుంటున్నావు. జీవాత్మ పరమాత్మల ఏకీకరణమే మోక్షము. కాబట్టి నాకు ముక్తి కావాలనే కోరిక ఉంటే అది అజ్ఞానమవుతుంది. అందుకే ఈ శరీరాన్ని తనదిగా భావించేవాడు, తనకు ముక్తి కావాలనుకునే వాడు ఒకటే ముక్తి కావాలనుకోవటం కూడా అజ్ఞానమే. నువ్వు ముక్తపురుషుడవు. నీకింకా ముక్తేమిటి. ముక్తి ఎక్కడి నుంచో రైల్లోనో, బస్సులోనో రాదు. అది నీ దగ్గరే ఉన్నది. అందుకే **ముక్తి కావాలనుకునే వాడు అటు జ్ఞానీ కాదు ఇటు యోగీకాదు. కేవలము బాధామయ జీవి. అంతే**

నేను ముక్తి కోసం ప్రయత్నిస్తున్నాను. నేను ముక్తుడిని అనుకుంటే ఇంకా అతడికి అహంకారం ఉన్నది అని అర్థం. ఇంకా దేన్నైనా నాది అనుకుంటే కూడా అతడికి మోహం ఉన్నట్లే, మమత్వ రూపంలో అహంకారమున్నట్లే. అహంకార మమకారాలు ఏ రూపంలో ఉన్నా సరే రాగద్వేషాలు ఉన్నట్లే. అతడు రాగద్వేషాలతో శతమతమవుతూ బాధామయ జీవితం గడపవలసిందే. రాగద్వేషాలు ఉన్నంతవరకు ఆత్మనిష్ఠ కుదరదు. నిరంతరము దృష్టి ఆత్మమీదనే నిలపాలి. అంటున్నారు అష్టావక్రులు.

**హరోయద్యుపదేష్టా తే హరిః కమలజోఽపివా ।**
**తథాఽపి న తవ స్వాస్థ్యం సర్వవిస్మరణాదృతే ॥ 11**

త్రిమూర్తులు నీకు గురువులైనా సర్వాన్ని మరచిపోతేనే గాని నీకు ఆత్మనిష్ఠ కలగదు.

ఈ శ్లోకంలో **ఆత్మవిచారము**ను వివరిస్తున్నారు.

సాధకుడు మంచి గురువును చూసుకుని శిష్యరికం చెయ్యాలి. ఆయన చెప్పే ప్రతి అక్షరాన్ని జాగ్రత్తగా వినాలి. ప్రతి విషయాన్ని తు.చ. తప్పకుండా పాటించాలి. కేవలము మా గురువు గొప్పవాడు అని గురువుకు జయధ్వానాలు చేస్తే ఉపయోగం లేదు. గురువు చెప్పిన దాన్ని వినాలి. శాస్త్రాలు చదవాలి. తోటి విద్యార్థులతో విషయం తర్కించాలి. వాటిని విచారించాలి. మననం చెయ్యాలి. ఆచరించాలి. కేవలము మందుపేరు చెప్పినంత మాత్రం చేత రోగం తగ్గదు. ఆ మందును వాడాలి. అలాగే నేర్చుకున్న దాన్ని తెలుసుకున్నదాన్నిఆచరణలో పెట్టాలి. గురువు గొప్పవాడు కాకపోతే నిన్ను సంసార సాగరం నుంచి దాటించలేడు అని చెబుతాం. ఇక్కడ ఒక్క విషయాన్ని గుర్తించాలి. కేవలము గురూపదేశమే చాలదు. ఐఎయస్ సెలక్టు కావాలి అని దేశంలోనే అతిగొప్పది అయిన సంస్థలో శిక్షణ తీసుకోవటానికి చేరావు. అంత మాత్రాన ఐఎయస్ సెలక్టు కావు. నీ సంస్థ పేరు ప్రఖ్యాతులను బట్టి నిన్ను సెలక్టు చెయ్యరు. అలాగే గురువు చాలా గొప్పవాడు. సాక్షాత్తు త్రిమూర్తులు నీకు గురువులు. వారు గొప్పతనం నిన్ను ఆత్మనిష్ఠగా చెయ్యదు. నువ్వు ఆత్మనిష్ఠుడు కావాలంటే అన్నింటినీ వదిలెయ్యాలి. సర్వాన్ని మరిచిపోవాలి. అప్పుడు గాని నువ్వు

ఆత్మనిష్ఠుడవు కాలేవు. నీకు ఆత్మనిష్ఠ కుదరలేదు అంటే అదేదో గురువు గారి లోపము అని భావించి ఉపయోగం లేదు. వారి బోధన వల్లనే పూర్తి ప్రయోజనం ఉండదు. గురువు ఎంత గొప్పవాడైనా సాధకుడిలో అర్హత ఉంటేనే అతడికి సత్యం అవగతమవుతుంది. కాబట్టి ముందు సాధకుడు అర్హత సంపాదించాలి. గురువు యొక్క బోధనలు తనను ఉపకరించకుండా అడ్డుపడేది తన మనస్సే. అవే గతజన్మ స్మృతులు. **గత జన్మస్మృతుల సారమే అహంకారము** అంటారు. ఈ అహంకారం వల్లనే మనకు అడ్డంకులు వస్తాయి.

ఇప్పుడు చేయవలసింది ఏమంటే, గతజన్మ స్మృతులను పూర్తిగా తుడిచి వెయ్యాలి. అప్పుడు అహంకారం అంతమవుతుంది. అందుకే నీ అహంకారం పూర్తిగా అంతం కాకపోతే సాక్షాత్తు త్రిమూర్తులే నీకు గురువులైనా ఆత్మనిష్ఠ కలగదు. సాధకుడు ఎంత భక్తుడైనా, ఎంత కాలం తపస్సు చేసినా, శ్రీమహావిష్ణువు కూడా ఆయనకు జ్ఞానాన్ని ఇవ్వలేదు. ఆ జ్ఞానాన్ని స్వయంగా నువ్వు సంపాదించుకోవాలి. ఈ విషయాన్నే ఈ శ్లోకంలో చెబుతున్నాడు అష్టావక్రుడు.

# అధ్యాయం-17

# జ్ఞాని యొక్క స్థితి

ఈ అధ్యాయంలో 20 శ్లోకాలున్నాయి. దీనిలో జ్ఞానియొక్క స్థితిని వివరిస్తున్నాడు అష్టావక్రుడు. **సుబాలోపనిషత్తు, పైంగలోపనిషత్తు**లలో చెప్పినట్లుగా

ఆత్మజ్ఞాన సంపన్నుడు ముముక్షువు. అతడు ఇరవై ఒక్క తరాలను తరింప చేస్తాడు. బ్రహ్మజ్ఞానమాత్రంచేత నూట ఒక్క తరాలను తరింపచేస్తాడు. జీవాత్మకు ఈ శరీరమే రథము. ఆ రథంలో కూర్చునే రథికుడు–జీవాత్మ. ఈ రథానికి సారథి– బుద్ధి. మనసు – ప్రగ్రహము (పట్టుకునే త్రాడు) ఇంద్రియాలే – అశ్వాలు. విషయాలే – మార్గాలు. ఆత్మేంద్రియ మనోయుక్తుడైన ఆ పరమేశ్వరుడే – భోక్త అతడే – ప్రత్యగాత్మ. అతడు హృదయమందే సుప్రతిష్ఠితుడై ఉన్నాడు. ఆత్మవేత్త ప్రారబ్ధకర్మ ఉన్నంతవరకు పాము కుబుసానికి వేరుగా ఉన్నట్లుగా వ్యవహారం చేస్తాడు. అంటే తామరాకుమీద నీటిబొట్టులాగా, కర్మ చేస్తూ కూడా, దాని ఫలితాన్ని పొందకుండా ఉంటాడు. జీవన్ముక్తుడైన దేహి, ఆకాశంలో చంద్రునిలాగా అంతటా సంచరిస్తాడు. ప్రపంచంలో ఎక్కడైనా తిరుగుతాడు. ఇతడు తన ఇంట్లోగాని, ఏదైనా క్షేత్రములోగాని, శరీరాన్ని వదలి 'పరమపదము' అని చెప్పబడే కైవల్యము పొందుతాడు.

జ్ఞానియైనవాడు మహత్పదాన్ని తెలుసుకుని వృక్షమూలమున కూర్చోవాలి. మాసినగుడ్డలు ధరించి, ఏకాకియై సమాధియందుండి, ఆత్మనుకోరువాడై, ఆప్తకాముడై, (కోరికలను పొందినవాడు) నిష్కాముడై, జీర్ణకాముడై ఉండాలి. ఏనుగునందు, సింహమందు, దోమయందు, ముంగిసయందు, సర్పమునందు, యక్ష, రాక్షస, గరుడ, గంధర్వులయందు మృత్యువు యొక్క రూపము తెలుసుకున్నవాడు దేనికీ భయపడడు.

అతడు వృక్షంలాగానే ఉండాలి. నరకబడుచున్న వాడైనప్పటికీ కోపగించరాదు. ఆకాశములాగా ఉండాలి. కొట్టినా కోపించరాదు, సత్యముతో ఉండాలి. ఈ ఆత్మ సత్యరూపము. అన్ని గంధములకు భూమి హృదయము. అన్ని శబ్దాలకీ ఆకాశము హృదయము. గీతములన్నింటికీ అవ్యక్తము హృదయము. సత్త్వములన్నింటికీ మృత్యువు హృదయము. మృత్యువు పరుడైన దేవునియందు ఏకీభవిస్తుంది. ఆపైన సత్తులేదు. అసత్తులేదు సదసత్తు లేదు.

విదేహముక్తుడు దేహము చాలించినప్పుడు అతని శరీరాన్ని దహనం చేస్తారు లేదా గోతిలో పాతిపెడతారు. బ్రహ్మవేత్తకు మాత్రమే 'ప్రవ్రజన దీక్ష' తగినది. ప్రవ్రజన దీక్ష అంటే సన్యాసము. గృహస్థాశ్రమంలో ఉన్న భార్యపుత్రులను విడిచిపెట్టి వేయటము. ఇతరులకు ఆ దీక్ష పనికిరాదు. బ్రహ్మభూతుడైన భిక్షువు (అతడే బ్రహ్మవేత్త) ఈ దేహాన్ని వదలివేసినప్పుడు, అంటే మరణించినప్పుడు సామాన్యుడికి జరిగినట్లుగా అగ్నికార్యములు, అశౌచములు, పిండోదకాలు, శ్రాద్ధకర్మలు, ఇవేవీ ఉండవు. దహించిన దానికి దహనంతో పనిలేదు. పక్వమైన దానికి వచనముతో పనిలేదు. జ్ఞానాగ్నిలో అతని కర్మ అంతా దహనమై పోయింది కాబట్టి, మళ్ళీ వేరుగా అతనికి కర్మకాండ చేయవలసిన పనిలేదు. అలాగే అతని ఆత్మ అజ్ఞానం నుంచి విడివడింది. అతని దేహము జ్ఞానాగ్నిలో ఇంతకుముందే దహించబడింది. అందుచేతనే అతడికి శ్రాద్ధకర్మలవంటివి ఏవీ ఉండవు. ఉపాధి (శరీరము) ఉన్నంతవరకు సద్గురువుకు సేవ చెయ్యాలి. ఒకవేళ గురువు గనక గృహస్తు అయినట్లైతే, అతని పుత్రులను కూడా సేవించాలి. శుద్ధమనస్సు, శుద్ధ చిద్రూపము గలిగి, సహిష్ణుడైన బ్రహ్మనిష్ఠుడు "పరమాత్మను నేను" అనే జ్ఞానం కలుగగా, దానివల్ల విజ్ఞానం కలిగి, జ్ఞేయమైన పరమాత్మను హృదయంలో దర్శించి, శాంతిని పొందగా, అప్పుడు అతడు మనస్సు, బుద్ధికూడా లేనటువంటి, నశించినటువంటి ఆ పరబ్రహ్మ స్వరూపమే అవుతాడు.

అమృతం తాగేవాడికి పాలతో పనిఉండదు. అలాగే జ్ఞానామృతంతో సంతృప్తుడయిన యోగీంద్రుడికి కర్తవ్యము ఏదీ ఉండదు. ఆత్మజ్ఞానము గలవాడే తత్త్వవేత్త. బ్రహ్మవేత్త దూరంగా ఉన్నప్పటికీ నిజానికి దూరంగా ఉండడు. ప్రత్యగాత్మ పిండస్తుడై ఉన్నప్పటికీ అనగా శరీరమునందున్నప్పటికీ, పిండవర్జితుడై అనగా శరీరాన్ని వేరుగా శవంలాగా చూస్తున్నవాడై, సర్వసన్యాసిగా ఉంటాడు. హృదయాన్ని నిర్మలం చేసుకుని, పరమాత్మను ధ్యానించి, "ఆ పరమాత్మను నేనే" అని తెలిసి, జీవుడు పరమానందము పొందాలి. జలముతో చేరిన జలములాగా, పాలతో కలిసిన పాలులాగా, నేతితో కలిసిన నెయ్యిలాగా, జీవాత్మ పరమాత్మలు ఏకీభావం చెందుతున్నాయి. ఈ రెండింటి మధ్య తేడా లేదు.

దేహమునందు జ్ఞానదీపము ప్రకాశించగా, బుద్ధి అఖండాకార రూపమవుతుంది. అప్పుడు విద్వాంసుడు బ్రహ్మజ్ఞానమనే అగ్నితో కర్మబంధనాలను దహించివేస్తాడు.

తరువాత బ్రహ్మవేత్త పవిత్రుడు, అద్వైతరూపుడు అయిన పరమేశ్వరునిలో ఆత్మైక్యము పొంది, జలములో జలము కలిసిపోయినట్లుగా, స్వాత్మరూపుడై నిరూపాధి సంస్థితు డవుతున్నాడు. ఆ స్థితిలో ఆత్మకు ఉపాధి (ఆధారము) ఏదీ ఉండదు. ఆకాశంలాగా ఆత్మ సూక్ష్మరూపం గలది. వాయువులాగా అది దృష్టికి గోచరించదు. బాహ్యమందు, అంతరమునందు కూడా ఆత్మనిశ్చలమైనది. జ్ఞానమనే దీపముద్వారా జ్ఞాని అంతరాత్మను దర్శిస్తున్నాడు. బ్రహ్మవేత్త అయినవాడు ఎక్కడ ఏ ప్రదేశంలో మరణించినప్పటికీ అక్కడే సర్వగతమైన ఆకాశంలాగా లయం పొందుతున్నాడు. మహదాకాశములో ఘటాకాశము లయమైనట్లుగా, తత్త్వజ్ఞాని ఆ పరమాత్మయందు తన ఆత్మను లయం చేసి నిరాలంబయోగ దర్శనము పొందుతాడు.

ధ్యానయోగము చాలాగొప్పది. వేలకొలది సంవత్సరాలు ఒంటికాలి మీద నిలబడి తపస్సు చేసినప్పటికీ, ఒక్క ధ్యానయోగముయొక్క పదహారవ వంతుతో కూడా సమానం కాదు. ఇదే తెలుసుకోవలసిన జ్ఞానము, జ్ఞేయము కూడా. లోకంలో సర్వాన్నీ తెలుసుకోవాలని ప్రయత్నం చేసేవాడు. వేలకొలది సంవత్సరాలు జీవించి కృషి చేసినా శాస్త్రముల సారాన్ని గ్రహించలేడు. అక్షర పరమాత్మను తెలుసుకోవాలి. జీవితము క్షణభంగురము. శాస్త్రపరిజ్ఞానాన్ని వదలిపెట్టి సత్యమైన పరబ్రహ్మను ఉపాసించాలి. మానవుడు బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకోలేనంత వరకు కర్మలు, శౌచము, జపము, యజ్ఞము, తీర్థయాత్రలు చేస్తుండాలి. మహాత్ములైన వారికి 'అహంబ్రహ్మాస్మి' అనే భావమే మోక్షహేతువు. బంధానికి, మోక్షానికి కేవలము ఒక్క అక్షరమే తేడా. మమ (నాది) అనేది బంధానికి, నమము (నాదికాదు) అనేది మోక్షానికి హేతువు. ఈ భావనతోనే జీవి మోక్షం పొందుతాడు. మనసు గనక 'ఉన్మన' భావము (మనసును దాటిన స్థితి, మనసు పని చేయని స్థితి) పొందినట్లైతే ద్వైతభావము కలగదు. ఉన్మనాస్థితిలో జీవుడికి పరమానందము కలుగుతుంది. మనసు ఏ ప్రదేశానికి పోతుందో అక్కడే పరమపదము ప్రాప్తిస్తుంది. పరబ్రహ్మ సర్వత్ర వ్యాపించి ఉన్నది. సమస్తము బ్రహ్మమయమే. ఈ జగత్తులో బ్రహ్మముకాని వస్తువు ఏదీలేదు. ఆకాశాన్ని ముష్టిఘాతాలతో ముక్కలుగా చేయవచ్చు. బాగా ఆకలిగా ఉన్నవాడు ఆకలి రాకుండా చేసుకోవచ్చు. అంటే అసాధ్యమైన దాన్ని కూడా సుసాధ్యంగా చేయవచ్చు. కాని నేను బ్రహ్మను కాను అని భావించేవాడు మాత్రం మోక్షం పొందలేడు.

జ్ఞాని తాను కృతార్థుడైనందుకు సంతోషిస్తూ ఉంటాడు. మాధవ విద్యారణ్యుడు **వేదాంత పంచదశిలో** చెప్పినట్లుగా

**ధన్యోహం ధన్యోహం నిత్యం స్వాత్మాన మంజసావేద్మి**

**ధన్యోహం ధన్యోహం బ్రహ్మానందో విభాతిమే స్పష్టమ్ ॥**

'నేను ధన్యుణ్ణి. నేను ధన్యుణ్ణి' ఈ విధంగా నిరంతరము తన స్వరూపాన్ని తెలుసుకుని తాను ధన్యుడైనట్లు భావిస్తాడు. నిజస్వరూపమైన ఆత్మను దేశకాలాన విచ్ఛినమైన బ్రహ్మ రూపంగా సాక్షాత్కారం పొదుతూ 'నాకు బ్రహ్మానందం స్పష్టంగా భాసిస్తోంది' అని భావిస్తాడు.

**ధన్యోహం ధన్యోహం దుఃఖం సాంసారికం న వీక్షేద్య**

**ధన్యోహం ధన్యోహం స్వస్యా జ్ఞానం పలాయితం క్వాపి ॥**

ఇప్పుడు నాకు సాంసారికమైన సుఖదుఃఖాలు ఏవీ కనుపించటం లేదు. అందువల్ల నేను ధన్యుణ్ణి. నా అజ్ఞానం కూడా దూరమై పోయింది. కాబట్టి నేను ధన్యుణ్ణి.

**ధన్యోహం ధన్యోహం కర్తవ్యం యే నవిద్యతే కించిత్**

**ధన్యోహం ధన్యోహం ప్రాప్తవ్యం సర్వమద్య సంపన్నమ్ ॥**

ఇప్పుడు నాకు మిగిలిన కర్తవ్యాలు ఏవీ లేవు. అందుచేత నేను ధన్యుణ్ణి. నాకు ఇక పొందవలసినదంటూ ఏదీలేదు కాబట్టి నేను ధన్యుణ్ణి.

**ధన్యోహం ధన్యోహం తృప్తేర్మే కోపమా భలేల్లోకే ।**

**ధన్యోహం ధన్యోహం ధన్యోధన్యః పునః పునర్ధన్యః ॥**

నేను ధన్యుణ్ణి. నాకున్న తృప్తి లాంటి తృప్తి ఈ లోకంలో ఇంకెక్కడుంది? కాబట్టి నేను మరీ ధన్యుణ్ణి.

**అహోపుణ్య మహోపుణ్యం ఫలితం ఫలితం దృఢమ్ ।**

**అస్య పుణ్య సంపత్తేర్ అహం వయమహోవయమ్ ॥**

అహో నా పుణ్యము ధన్యమైనది. ఆ పుణ్యఫలమే నాకు ఈ విధంగా లభించింది. ఆ పుణ్యాన్ని సంపాదించిన నేను గొప్ప ధనుడనైనాను.

**అహోశాస్త్రమహోశాస్త్రం అహోగురురహోగురుః ।**

**అహో జ్ఞానమహోజ్ఞానం అహో సుఖమహో సుఖమ్ ॥**

అహో శాస్త్రం చాలా గొప్పది. గురువుగారు చాలా గొప్పవాడు. ఆ శాస్త్రం వల్ల, గురువు వల్ల లభించిన జ్ఞానం ఇంకా గొప్పది. ఆ జ్ఞానం వల్ల లభించిన సుఖం మరీ గొప్పది అని ఆనంద తాండవం చేస్తాడు.

జ్ఞాని యొక్క భావన ఇలానే ఉంటుంది. శాంతించిన ఇంద్రియాలతో, ఏ కోరికలు లేకుండా, తృప్తిగా నిత్యము ఏకాంతాన్ని అనుభవించే వాడికి యోగాభ్యాస ఫలము, జ్ఞానాధ్యయన ఫలము కూడా సిద్ధించినట్లే. సత్యాన్ని తెలుసుకున్న ఆ వ్యక్తికి జగత్తంతా నేనే వ్యాపించి ఉన్నాను అని నిశ్చయంగా తెలుసు. అందువల్ల అతడికి విచారం కలిగించేది ఏదీ ఉండదు.

సల్లకి వృక్షపు చిగుళ్ళు తిని ఆనందించే ఏనుగును వేపాకులు ఏ రకంగా తృప్తిపరచలేవో, అలాగే ఆనందరూపుడు, ఆత్మనిష్ఠుడు అయిన జ్ఞానిని ప్రాపంచిక విషయాలు తృప్తిపరచలేవు. అనుభవించిన విషయాల స్మృతులు, అనుభవాలు, అందుబాటులో లేని విషయాల గురించిన ఆలోచనలు జ్ఞానికి ఉండవు. అతడు నిశ్చలమైన మనస్సుతో శాంతంగా ఉంటాడు. ఈ లోకంలో ప్రాపంచికమైన విషయ భోగాలు కోరేవారుంటారు. అలాగే ఇవి నాకు కావాలి. ఇవి వద్దు అనుకునే వారుంటారు. కాని విషయవాంఛలు, ముక్తి ఈ రెండింటినీ కోరకుండా ఆనందంతో జీవించే జ్ఞానులు చాలా అరుదుగా ఉంటారు.

ధర్మార్థ కామ మోక్షాలు, జనన మరణాలు మొ॥ వాటియందు సమానమైన బుద్ధి కలిగి, దేనినీ కోరకుండా, వచ్చిన దానిని నిరాకరించకుండా, సమబుద్ధితో అన్నింటినీ స్వీకరిస్తూ జీవించేవాడు కనుపించటం లోకంలో చాలా దుర్లభము. ఈ జగత్తంతా ఇలా ఉండాలి అని గాని, నశించిపోవాలి అని గాని, జ్ఞాని ఎప్పుడూ కోరడు. ప్రస్తుతము ఉన్న స్థితిమీద ఏ మాత్రము ద్వేషం కూడా ఉండదు. ప్రారబ్ధానుసారంగా వచ్చినదేన్నయినా సరే, సంతోషంగా స్వీకరించి, ఆనందంగా జీవిస్తాడు. నుంచున్నా, కూర్చున్నా, నడుస్తున్నా, తింటున్నా, అన్ని సమయాలలోను తమ శక్తినే గమనిస్తూ, నిశ్చలమైన మనస్సుతో నిర్మల జ్ఞానంతో సుఖంగా జీవిస్తాడు.

జ్ఞానికి బాహ్య ప్రపంచం అంతా యధార్థం కాదు. కేవలము భావనా మాత్రము అని ఖచ్చితంగా తెలుసు. దీనివల్ల లౌకిక విషయాల మీద కోరిక ఉండదు. ఇష్టాఇష్టాలు ఉండవు. దీంతో అతడి దృష్టంతా భావశూన్యంగా ఉంటుంది. అతడు చేసే కర్మలకు అర్థము ప్రయోజనము ఉండవు. అతని ఇంద్రియాలు దేన్నీ కోరవు. జ్ఞానికి జాగ్రదావస్థ, నిద్రావస్థ అనేవి లేవు. కళ్ళు తెరవటం మూయటం లేదు. జీవన్ముక్తుడైన జ్ఞాని అన్ని సందర్భాలలోను పరమాత్మగా తాను మాత్రమే ఉంటాడు.

జ్ఞాని సర్వకాల సర్వావస్థల యందు సర్వదా, ఏ మాత్రము కోరికలు లేకుండా, వాసనలు లేనివాడై, నిత్యతృప్తుడై, పరమశాంతంగా స్వరూప స్థితిలో ఉంటాడు.

జ్ఞాని చూడటం, వినటం, తినటం, మాట్లాడటం మొ॥ పనులన్నీ చేస్తున్నా కూడా, ఏ మాత్రము క్రోధము మోహము లేకుండా, నిశ్చలంగా, స్వతంత్రంగా, నిత్యముక్తుడై జీవిస్తాడు. జీవన్ముక్తుడైన జ్ఞాని ఎవరినీ నిందించడు, స్తుతించడు, అతడికి సంతోషము, కోపము ఉండవు. ఇవ్వటము, తీసుకోవటము ఉండదు. విషయానుభవాల నుంచి విడిగా ఉంటాడు.

అనురాగవతి అయిన స్త్రీని చూసినా, మృత్యువును చూసినా ఒకటిగానే భావిస్తాడు.

సర్వే సర్వత్రా ఆత్మనే చూస్తున్న జ్ఞానికి సుఖదుఃఖాలలో గాని, అదృష్టాదృష్టాలలో కాని, స్త్రీ పురుషులలో గాని తేడా కనుపించదు.

సంసార బంధనాల నుండి విముక్తుడైన వాడికి కరుణ, హింస, దీనత్వము అనేవి ఏవీ ఉండవు.

జ్ఞానికి దేహము, ఇంద్రియాలు, విషయాల మీద కోరికా ఉండదు, ద్వేషము ఉండదు. ఏ రకమైన మోహము లేకుండా ప్రాప్తించినవి అనుభవిస్తూ, ప్రాప్తించని వాటిని గురించి ఆలోచించకుండా ప్రశాంతంగా జీవిస్తాడు.

అతడికి అహంకార మమకారాలుండవు. జగత్తులో నామరూపాలు తప్ప ఏవీ లేవు అనే దృఢమైన జ్ఞానం కలిగి ఉంటాడు. ఏ రకమైన కోరికలు ఉండవు. అతడు కర్మలు చేస్తున్నా, ఏ కర్మను చెయ్యనట్లే లెక్క.

జ్ఞాని మనస్సు అమనస్కమవుతుంది. కోరికలుండవు. భ్రమలు ఉండవు. అనిర్వచనీయమైన ఆనందం పొందుతూ ఉంటాడు.

ఈ విషయాలే ఇక్కడ వివరిస్తున్నాడు అష్టావక్రుడు.

**తేన జ్ఞానఫలం ప్రాప్తం యోగాభ్యాసఫలం తథా ।**
**తృప్త స్స్వచ్ఛేంద్రియో నిత్యమే కాకీ రమతే తు యః ॥** 1

శాంతించిన ఇంద్రియాలతో, కోరికలు లేకుండా, తృప్తిగా నిత్యము ఏకాంతాన్ని అనుభవించే వాడికి యోగాభ్యాస ఫలము, జ్ఞానాధ్యయన ఫలము కూడా సిద్ధించినట్లే.

ఐహికమైన భోగభాగ్యాలు కోరకుండా, అంటే ఇహానికి సంబంధించి ఏ కోరకలు లేకుండా, తన ఆత్మయందు తాను స్థితుడైన వాడికి, యోగాభ్యాసము చేసిన ఫలము, జ్ఞానఫలము కూడా సిద్ధిస్తాయి. కాబట్టి ఆత్మారాముడు భ్రమతో కూడిన విషయాలు ఏవీ కోరకుండా చిద్రూపుడై ఆనందిస్తాడు. ఇక్కడ ఒక విషయాన్ని గుర్తించాలి. కోరికలు లేకుండా ఏకాంతంగా ఉన్నాడు అంటే అది సమాధి స్థితి.

ధ్యానంలో ఉన్నప్పుడు కేవలము ధ్యేయాన్ని మాత్రమే చూస్తూ, నేను ధ్యానం చేస్తున్నాను అనే మాట కూడా మరచిపోవాలి. దాన్ని సమాధి అంటారు. ఆ స్థితిలో చిత్తం స్వరూపస్థితి పొందుతుంది. ధ్యానానికి అంతిమ ఘట్టం, యోగానికి పరమావస్థ ఈ సమాధి. సమాధి స్థితి చేరటం అంత తేలిక కాదు. గతజన్మల పుణ్యఫలం, గురుకృప. ఈ రెండూ ఉంటేనే సమాధిస్థితి లభిస్తుంది. మనసును దేహం నుంచి వేరు చేసి, పరమాత్మతో అనుసంధానం చెయ్యటమే సమాధి. ఏ రకమైన బంధాలు లేని స్థితే సమాధి.

సమాధి రెండు రకాలుగా ఉంటుంది. 1.సవికల్ప సమాధి 2.నిర్వికల్ప సమాధి

**1. సవికల్ప సమాధి :** ఈ స్థితికి చేరిన తరువాత కూడా మనసు పని చేస్తుంది. సంకల్ప వికల్పాలు కలుగుతాయి. ఇతర విషయాలు తెలుస్తాయి. హిరణ్యకశిపుడు మొదలైన రాక్షసులు బ్రహ్మను గురించి తపస్సు చేశారు. అయితే బ్రహ్మదేవుడు ప్రత్యక్షమైనప్పుడు ఆయన్ని ఏ రకంగా స్తుతించాలి? ఏ వరం కోరుకోవాలి అనేవి ముందుగానే నిర్ణయించుకుని తపస్సు ప్రారంభించారు. సమాధిస్థితికి చేరారు. భగవంతుడు ప్రత్యక్షం కాగానే ముందుగా నిర్ణయించుకున్న ప్రకారమే వరాలడిగారు. ఇది సవికల్ప సమాధి. సుమన. మనస్సు పని చేసే స్థితి.

**2. నిర్వికల్ప సమాధి :** ఈ స్థితిలో మనసు కూడా పని చేయదు. దీన్నే ఉన్మన అంటారు. ముముక్షువుకు కావలసినది నిర్వికల్ప సమాధి స్థితే. నేనే పరమాత్మ స్వరూపాన్ని. నాకన్న ఇతరమైనది ఏదీలేదు.

సవికల్ప సమాధి రెండు రకాలు. 1.దృశ్యానువిద్ధము 2.శబ్దానువిద్ధము. మూడవది నిర్వికల్ప సమాధి. ఈ మూడు అంతరము, బాహ్యము అని విభజింపబడి మొత్తం ఆరు రకాలవుతాయి. అవి

1. బాహ్యదృశ్యానువిద్ధ సవికల్ప సమాధి
2. అంతర దృశ్యానువిద్ధ సవికల్ప సమాధి
3. బాహ్యశబ్దానువిద్ధ సవికల్ప సమాధి
4. అంతరశబ్దానువిద్ధ సవికల్ప సమాధి
5. బాహ్య నిర్వికల్ప సమాధి
6. అంతర నిర్వికల్ప సమాధి

ఈ ఆరింటినీ కలిపి **సమాధిషట్కము** అంటారు.

ఈ స్థితిలో ఉన్న వాడికి యోగాభ్యాస ఫలము, జ్ఞానఫలము కూడా సిద్ధిస్తాయి.

ఆత్మ ఆనందం, అద్వయంగా ఉంది. ఆ స్థితికి చేరుకున్న సాధకుడి సర్వ కోరికలు అదృశ్యమయి పోతాయి. కావలసినవన్నీ సిద్ధించే ఉన్నాయి. ఆ స్థితిలో ముక్తి పొందాలనే కోరిక కూడా హాస్యాస్పదంగానే అనిపిస్తుంది. మనస్సు మౌనంగా, శాంతంగా, నిశ్చలంగా ఉంటుంది. దుఃఖాలన్నీ మటుమాయమై పోతాయి. మనస్సు శరీరాలతో తాదాత్మ్యం తొలగిపోయి మహానంద స్వరూపమయిన కైవల్యస్థితిలో సాధకుడు శాంతంగా, నిశ్చలంగా ఉండిపోతాడు.

శాంతించిన ఇంద్రియాలతో, కోరికలు ఏవీ లేకుండా, తృప్తిగా నిత్యము ఏకాంతం అనుభవించే వాడికి యోగాభ్యాస ఫలము, జ్ఞానఫలము కూడా సిద్ధం చేస్తాయి. అతడు సత్యాన్ని తెలుసుకున్నాడు. సత్యాన్ని తెలుసుకున్న వాడికి సంతాపాన్ని కలిగించేవి ఏవీ ఉండవు. ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నది తానే అనే భావన అతనికి ఉంటుంది. లేత చిగుళ్ళయందు మక్కువ గల ఏనుగుకు వేపాకులు ఏ విధంగా అప్రియం అవుతాయో, అదే విధంగా ఆ తపోనిష్ఠుడైన జ్ఞానికి ప్రాపంచిక

విషయాలు రుచించవు. గతంలో తాను అనుభవించిన విషయాలు గాని, అనుభవించని విషయాలు గాని అతని ఆలోచనలో ఉండవు. నిశ్చలమైన మనస్సుతో శాంతంగా ఉంటాడు. ఈ జగత్తులో విషయభోగాలు కోరేవారు కొందరయితే, స్వర్గసుఖాలు కోరేవారు కొందరు. ముక్తిని కోరేవారు మరి కొందరు. ఇహాపర భోగాలు కాని, ముక్తిని కాని కోరకుండా, అసలు ఏ కోరికా లేకుండా, నిత్యానందంలో జీవించే జ్ఞానిదర్శనం దుర్లభం. పురుషార్థాలయిన ధర్మార్థ కామమోక్షాల యందు, జనన మరణాల యందు సమానమైన బుద్ధి గలిగి, దేనినీ కోరకుండా, ప్రాప్తించిన వాటిని స్వాగతించకుండా, నిరాకరించకుండా జీవించే మహానుభావుడు అత్యంత అరుదుగా ఉంటాడు. ఈ జగత్తు ఈ రకంగా ఉండాలని గాని, నశించాలని గాని జ్ఞాని ఎన్నడూ కోరడు. ఉన్న స్థితి మీద ప్రేమ ఉండదు. ద్వేషము ఉండదు. తన ప్రారబ్ధం ప్రకారము వచ్చిన వాటిని ఆనందంగా స్వీకరిస్తాడు. అతడు చూస్తున్నా, వింటున్నా, తింటున్నా, మాట్లాడుతున్నా, ఏ పని చేస్తున్నా, ఆనందమయమైన తన శక్తినే గమనిస్తూ నిశ్చలమైన జ్ఞానంతో సుఖంగా జీవిస్తాడు. ఈ జగత్తంతా యథార్థం కాదని అతనికి తెలుసు. ఆ కారణం చేత విషయాల మీద ఆసక్తి ఉండదు. దీనివల్ల అతని దృష్టి భావశూన్యంగా, నిర్లిప్తంగా ఉంటుంది. అతని శారీరక కర్మలకు ప్రత్యేకత ఉండదు. ఇంద్రియాలు కూడా దేన్నీకోరి పనిచెయ్యవు.

**న జాగర్తి ననిద్రాతి నోన్మీలతి నమీలతి ।**
**అహోపరదశా క్వాపి వర్తతే ముక్త చేతసః ॥**

జ్ఞానికి జాగ్రదావస్థ లేదు. నిద్రావస్థ అంతకన్నా లేదు. కళ్ళు తెరవటం లేదు ముయ్యటం లేదు. జీవన్ముక్తుడైన అటువంటి జ్ఞాని, అన్ని వేళల యందు పరమాత్మగా మాత్రమే ఉంటాడు. సర్వకాల సర్వావస్థలలోను కోరికలతో చలించకుండా, శాంతమైన స్వస్థితిలో నిత్యతృప్తుడై జీవిస్తుంటాడు. అతను ఏ పని చేస్తున్నా, తింటున్నా, తిరుగుతున్నా, రాగద్వేషాలు లేకుండా, నిశ్చలంగా, స్వతంత్రంగా, నిత్యముక్తుడై ఉంటాడు. జీవన్ముక్తుడు ఎవరినీ నిందించడు, స్తుతించడు. దుఃఖం, సంతోషం అనేవి ఉండవు. దానం చెయ్యడు, పరిగ్రహించడు. సర్వవిషయానుభవాల నుండి విడిగా ఉంటాడు. అందము అనురాగము కలిగిన స్త్రీని చూసినా, మృత్యువును చూసినా సమబుద్ధితో శాంతంగా ఉంటాడు. సర్వత్రా ఆత్మనే దర్శిస్తున్న జ్ఞానికి సుఖదుఃఖాలలో, స్త్రీపురుషులలో, అదృష్ట దురదృష్టాలలో తేడా కనిపించదు.

ఆత్మానుభవంతో సంసారం నుంచి విముక్తుడైన జ్ఞానికి కరుణ, హింస, దీనత్వం, గొప్పదనం, ఆశ్చర్యము, అలజడి లాంటివి ఏవీ ఉండవు. జీవన్ముక్తుడికి ఇంద్రియాల మీద, విషయాల మీద, ఆసక్తి, ద్వేషము అనేవి ఉండవు. ఈ రకంగా శూన్యచిత్తుడైన జ్ఞానిలో అశాంతి, శాంతి, మంచి చెడు మొదలైన మానసిక ఉద్రేకాలు, ద్వంద్వాలు ఏవీ ఉండవు. కేవలము తానొక్కడే ఉన్నట్లుగా, సంతోషాంతరంగంతో జీవిస్తాడు. అహంకార మమకారాలు లేనివాడు, కేవలము నామరూపాలు తప్ప సృష్టే లేదనే వాడు, సర్వ కోరికలు నశించిన వాడు అయిన జ్ఞాని కర్మలు చేస్తున్నా, నిజానికి ఏ కర్మలు చెయ్యడు. అతను చేసిన కర్మలకు ఫలం అతన్నంటదు.

**మనః ప్రకాశం సంమోహ స్వప్నజాడ్య వివర్జితః ।**
**దశాంకామపి సంప్రాప్తో భవేద్గలిత మానసః ॥**

మనస్సు అమనస్కం కాగా, కోరికలు, కోరికలతో చేసే పనులు, భ్రమ, స్వప్నం, తమస్సు వీటినుంచి విముక్తి పొందిన జ్ఞాని అనిర్వచనీయమైన ఆనందాన్ని అనుభవిస్తాడు. అది అనుభవైక వేద్యము.

**న కదా చిజ్జగత్యస్మిన్ తత్త్వజ్ఞో హంత ఖిద్యతి ।**
**యత ఏకేన తేనేదం పూర్ణం బ్రహ్మాండమండలమ్ ॥ 2**

సత్యాన్ని తెలుసుకున్న మనిషికి జగత్తంతా నేనే వ్యాపించి ఉన్నాను. అని దృఢంగా తెలుసు. అందువల్ల అతనికి సంతాపం కలిగించేది ఏదీ ఉండదు.

ఈ జగత్తులో తత్త్వం తెలిసిన జ్ఞాని ఎవరూ దుఃఖించడు. ఎందుకంటే అతడి ఆత్మ చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నది. ఆత్మకన్న వేరే వస్తువు ఏదీలేదు. అందుకే అతడికి దుఃఖము ఉండదు. ఉన్నది ఒక్కడే అయినప్పుడు భయము, దుఃఖము ఉండవు.

భయానికి కారణము ఈ బ్రహ్మాండం నుంచి వేరుగా ఉన్నానే భావన. ఇది మన అల్పత్వాన్ని సూచిస్తుంది. భయభ్రాంతుల్ని చేస్తుంది. ఎప్పుడైతే ద్వైతభావం వచ్చిందో అప్పుడు అనేక విషయాలు వచ్చి చేరతాయి. జగత్తు వేరు నేను వేరు. అంటే ఆత్మవేరు నేను వేరు అనే భావన. నేను అంటే దేహము అనే భావన. ఈ జగత్తులో నేను కాక ఇంకొకరున్నారనే భావన. ఈ భావన వల్ల భయం కలుగుతుంది.

దుఃఖం కలుగుతుంది. ఈ సృష్టి నుంచి నేను వేరుగా ఉన్నాననే భావనే అన్ని బాధలకు కారణం.

సత్యాన్ని గుర్తించిన జ్ఞానికి ఈ జగత్తంతా తనలోని భావతరంగాలే అని స్పష్టంగా తెలుస్తుంది. ప్రపంచం అంతా తనలోని భాగమే. నేనే జగత్తు. జగత్తే నేను అనే విషయం స్పష్టంగా తెలుస్తుంది.

**తేన ఇదం పూర్ణం బ్రహ్మాండ మండలమ్**

ఈ బ్రహ్మాండమంతా నేనే ఆవరించి ఉన్నాను. కాబట్టి జ్ఞాని అయిన వాడు **కదాచిత్ న ఖిద్యతి** దుఃఖము పొందడు. బాధలకు లోను కాడు. సత్యాన్ని దర్శించి అన్ని జీవులను తనలాగే భావిస్తూ సంతోషంగా ఉండే జ్ఞాని వెన్నంటి నేను చరిస్తుంటాను.' అంటాడు శ్రీకృష్ణ భగవానుడు **శ్రీమద్భాగవతం**లో అతని పాదధూళితో నేను పవిత్రుడనవుతాను అంటాడు. కాబట్టి జగత్తంతా తన స్వరూపమే అని తెలిసిన జ్ఞానికి ఏ రకంగాను దుఃఖాలు ఉండవు.

**న జాతు విషయాః కేపి స్వారామం హర్షయంత్యమీ ।**
**సల్లకీ పల్లవ ప్రీతమివేభం నింబపల్లవాః ॥** **3**

సల్లకి ఆకులతో సంతోషించే ఏనుగును వేప ఆకులు ఏ రకంగా సంతోషపరచ లేవో, అలాగే ఆనందరూపుడు ఆత్మనిష్ఠుడు అయిన జ్ఞానిని ప్రాపంచిక విషయాలు తృప్తిపరచలేవు.

మనం గతంలో చెప్పుకున్నట్లుగా ఎల్లప్పుడూ ఆత్మయందే క్రీడించే వాడిని ఆత్మారాముడు అంటారు. అటువంటి వాడు ఇంద్రియాలకు లోబడడు. కాబట్టి లౌకిక వాంఛలలో అతడికి కోరిక ఉండదు, ఆనందం కూడా ఉండదు. సల్లకీ వృక్షము అంటే ఇందుగుచెట్టు. దీన్ని అందుకుచెట్టు అని కూడా అంటారు. ఇందుగు చెట్టు ఆకులు ఏనుగుకు అత్యంత ప్రీతి. ఇందుగుచెట్టు చిగురుటాకులు తినటానికి ఆసక్తి చూపే ఏనుగు వేపచిగుళ్ళను తినని విధంగా స్వాత్మారాముడైన జ్ఞాని విషయ భోగాలు ఆశించడు.

జ్ఞానియైన వాడు లౌకిక విషయాల గురించి ఆలోచించడు. విషయభోగాల యందు చిక్కుకోడు. ఎప్పుడూ బ్రహ్మానంద స్థితిలోనే ఉంటాడు. ఇతర విషయాలను

పట్టించుకోకుండా తన ఆత్మతోనే తాను రమిస్తుంటాడు. **తైత్తిరీయోపనిషత్తు**లో చెప్పినట్లుగా ఈ లోకంలో ఆరోగ్యవంతుడైన మానవుడు, ధనవంతుడు, విద్యావంతుడు అనుభవించాలనే కోరిక ఉన్నవాడు, ఆరోగ్యవంతుడు, బలశాలి అయిన మానవుడు అనుభవించే ఆనందమే మానుషానందం దానికి కొన్నికోట్ల రెట్లుంటుంది పరబ్రహ్మ పొందే ఆనందం దీన్నే బ్రహ్మానందము అంటారు. విషయ వాంఛలు లేని జ్ఞాని ఈ లోకంలోనే బ్రహ్మానందాన్ని అనుభవిస్తాడు. లౌకిక విషయాలు అతణ్ణి తృప్తిపరచలేవు.

**యస్తుభోగేషు భుక్తేషు న భవిత్యధివాసితః ।**
**అభుక్తేషు నిరాకాంక్షీ తాదృశో బహుదుర్లభః ॥ 4**

అనుభవించిన విషయాల స్మృతులు, అనుభవాలు, అందుబాటులో లేని విషయాల గురించిన ఆలోచనలు జ్ఞానికి ఉండవు. ఇతడు నిశ్చలమైన మనస్సుతో శాంతంగా ఉంటాడు.

జీవితంలో కొన్ని సుఖాలు అనుభవించాడు. ఆ సుఖాల అనుభవం మళ్ళీ మళ్ళీ నెమరువేసుకోవటం మానవ సహజం. ఆ అనుభవం మళ్ళీ పొందాలి అనుకుంటాడు. ఒక సుఖాన్ని అనుభవించాక అందులోని మాధుర్యాన్ని రుచి చూశాడు కాబట్టి, దాన్ని మళ్ళీ పొందాలి అనుకుంటాడు. అతని ఆలోచనలో ఆ అనుభవం తీపిగుర్తులు ఉంటాయి. ఇది సామాన్యుడి స్థితి. అలాగే అందుబాటులో లేని విషయాల గురించి విపరీతంగా ఆలోచిస్తాడు. వాటిని పొందాలని శతవిధాల ప్రయత్నిస్తాడు. కాని జ్ఞానియైన వాడికి ఈ ఆలోచనలు ఉండవు.

సర్వవ్యాప్తమైన ఆత్మతత్త్వంలో అహంకారాన్ని లయంచేసి, అన్ని సంకల్పాలను వదలివేసిన వాడే జ్ఞాని. అటువంటి జ్ఞాని అన్ని సంఘటనలను సాక్షిగా చూస్తూ ఉంటాడు. అతడికి దేనిమీదా ఇష్టత ఉండదు. అయిష్టత అంతకన్న ఉండదు. అందుకే గతంలోని అనుభవాలు మళ్ళీ రావాలని కోరుకోడు, భవిష్యత్తులో ఈ పనులు చెయ్యాలని ఆలోచించడు. భూత, భవిష్యత్తులు అతడికి అవసరం లేదు. కేవలము వర్తమానంలోనే ఉండి, ప్రాప్తించిన వాటిని అనుభవిస్తుంటాడు. అన్నిసంఘటనలు చూస్తూ పరమశాంతంగా జీవిస్తాడు. అహంకారం లేకుండా చేసే కర్మలకు ఫలితం ఉండదు. కేవలము ప్రారబ్ధాన్ని మాత్రమే అనుభవిస్తాడు.

జ్ఞాని చేసినట్లుగా కనుపించే కర్మలేవీ అతన్ని బాధించవు. అనంతమైన ఆనందంతో నిండిపోయిన ఆత్మను నేనే అని తెలుసుకున్న జ్ఞాని భ్రాంతితో ఏర్పడిన ప్రాపంచిక విషయాల గురించి ఆలోచించడు. అతడు చేసే కర్మలన్నీ ప్రారబ్ధవశాన జరిగేవే. అందుచేతనే విషయవాంఛల గురించి ఆలోచించకుండా నిశ్చలమైన మనస్సుతో పరమశాంతంగా ఉంటాడు అంటున్నాడు అష్టావక్రుడు.

**బుభుక్షురిహ సంసారే ముముక్షురపి దృశ్యతే ।**
**భోగ మోక్ష నిరాకాంక్షీ విరలో హి మహాశయః ॥ 5**

ఈ లోకంలో ప్రాంచికమైన విషయ భోగాలు కోరేవారుంటారు. అలాగే ఇవేవీ నాకు వద్దు. కేవలము ముక్తి మాత్రమే కావాలి అనుకునేవారు ఉంటారు. కాని విషయవాంఛలు, ముక్తి ఈ రెండింటినీ కోరకుండా ఆనందంతో జీవించే జ్ఞానులు చాలా అరుదుగా ఉంటారు.

జగత్తులో మానవులు రెండు రకాలుగా ఉంటారు.

**1.బుభుక్షువులు :** లౌకిక సుఖాల యందు కోరిక కలవారు. వీరు చేసేవి కామ్యకర్మలు.

**2. ముముక్షువులు :** మోక్షము కావాలనుకునే వారు. వీరు కర్మలు చెయ్యరు. ఒక వేళ చేసినా నిష్కామ్య కర్మలు చేస్తారు కాబట్టి ఫలితంఉండదు. ఈ విధంగా ఏ కోరికా లేక సచ్చిదానందరూపులై ఉంటారు.

ఆకలితో ఉన్నవాడు ఆహారం కావాలనుకుంటాడు. అది రుచిగా ఉన్నదా లేదా అని ఆలోచించడు. ఎందుకంటే **ఆకలి రుచిని నిద్ర సుఖాన్ని ఎరుగదు.** అందుకే ఆకలితో ఉన్నవాడికి ఆహారం కావాలి అంతే. ఒకసారి విశ్వామిత్రుడు చాలాకాలం తపస్సు చేసి తిరిగి వస్తున్నాడు. విపరీతమైన ఆకలిగా ఉన్నది. కొన్ని సంవత్సరాలైంది ఆహారం తిని. తినటానికి ఏదైనా దొరుకుతుందేమో అని చుట్టూ చూస్తున్నాడు దగ్గరలో ఏదో వాసన వస్తున్నట్లనిపించింది. దూరంగా ఒక కుక్క చచ్చి ఉన్నది. దాని శరీరం నుంచి కుళ్ళువాసన వస్తోంది. విశ్వామిత్రుడు గబగబా వెళ్ళి కుళ్ళిపోయిన కుక్క కళేబరాన్ని పీక్కు తింటాడు. ఇప్పుడు మనకు అనుమానం వస్తుంది. ఒక ఋషీశ్వరుడు ఈ విధంగా చెయ్యవచ్చునా? ఆహార నియమాలుండవా? ప్రాణాపాయ స్థితిలో ఆహార నియమాలుండవు అంటాడు వ్యాసుడు బ్రహ్మసూత్రాలలో.

ఒక వేళ అతడికి రుచికరమైన ఆహారం దొరికితే మహదానందం. నీటిలో మునిగిపోతున్న వాడు ఏదైనా ఆధారం దొరికితే ప్రాణం రక్షించుకుని వడ్డుకు చేరదాము అనుకుంటాడు. దానికోసం ప్రయత్నిస్తాడు. ఆ ప్రయత్నమే కర్మ. లోకంలో బాధలతో కూడిన జీవితం గడిపేవాడు విషయవాంఛలు కోరతాడు. ముముక్షువు బంధ విముక్తుడు కావాలనుకుంటాడు. ముక్తి పొందాలనుకుంటాడు. అయితే జ్ఞాని సచ్చిదానంద స్వరూపమైన ఆత్మను నేనే అని తెలుసుకుంటాడు కాబట్టి అతడికి వేరే కోరికలు ఉండవు. ఇటువంటి మహానుభావుల దర్శనం కావటంకూడా కష్టమే.

**ధర్మార్థ కామమోక్షేషు జీవితే మరణే తథా ।**
**కస్యాప్యుదారచిత్తస్య హేయోపాదేయతా న హి ॥ 6**

ధర్మార్థ కామ మోక్షాలు, జనన మరణాలు వీటియందు సమానమైన బుద్ధి కలిగి,దేనినీ కోరకుండా, వచ్చిన దానిని నిరాకరించకుండా, సమబుద్ధితో అన్నింటినీ స్వీకరిస్తూ జీవించేవాడు కనుపించటం చాలా దుర్లభము.

పురుషార్థాలు నాలుగు. ధర్మార్థ కామ మోక్షాలు. వీటిలో అసలైన పురుషార్థం అంటే మోక్షమే. ధర్మార్థ కామాలు మూడు మోక్షసాధనకు సోపానాలు. ఇప్పుడు చతుర్విధ పురుషార్థాలు గాని, జనన మరణాలు గాని వేటిమీదా కూడా హేయము ఉపాధేయము లేకుండా అనాసక్తి, సమబుద్ధి కలిగినవాడు దొరకటం దుర్లభము.

పరమేశ్వరుడికి హేయము ఉపాధేయము రెండూ ఉండవు. హేయము అంటే – విసర్జించటము, వదిలి పెట్టటము ఉపాధేయము అంటే గ్రహించటము, తీసుకోవటము. **లలితా సహస్రం**లో 304వ నామము **హేయోపాధేయవర్జితా** అక్కడ పరాశక్తియే పరబ్రహ్మ అని చెప్పబడింది పరబ్రహ్మకు జాతి, కుల, మత, సంపద, వర్ణ, ఆశ్రమ మొదలైన తేడాలుండవు. ఇవి లేకుండా మానవుల భక్తిని మాత్రమే స్వీకరిస్తాడు. జ్ఞానికూడా ఆత్మస్వరూపుడు. ఆత్మారాముడు. అందుకే జనన మరణాల యందు, పురుషార్థాల యందు సమంగా ఉంటాడు. సామాన్యంగా లోకంలో ఎవరనా పుట్టారు అంటే ఆనందిస్తారు. మరణించారు అంటే దుఃఖిస్తారు. జ్ఞాని దృష్టిలో రెండూ ఒకటే. అలాగే ధర్మార్థ కామమోక్షాలు కూడా. ఇందాకనే మనం చెప్పుకున్నాం. అసలు పురుషార్థము అంటే మోక్షమే అని. కాని జ్ఞాని దృష్టిలో మోక్షమనేది లేదు.

ఉన్నది ఒక్కటే పరబ్రహ్మ. అదే నేను. అలాంటప్పుడు ఇంకా స్వర్గనరకాలెక్కడున్నాయి? మోక్షము ఎక్కడుంది? బంధం ఎక్కడుంది? నేను బద్ధుడను కాను, ముక్తుడను కాను. నాకు జనన మరణాలు లేవు అనే భావంకల జ్ఞాని కనుపించటం కడుదుర్లభము అంటున్నాడు అష్టావక్రుడు.

**వాంఛా న విశ్వవిలయే న ద్వేష స్తస్య చ స్థితౌ ।**
**యథా జీవికయా తస్మాద్ధన్య ఆస్తే యథా సుఖమ్ ॥ 7**

ఈ జగత్తంతా ఇలా ఉండాలి అనిగాని, నశించిపోవాలి అని గాని, జ్ఞాని ఎప్పుడూ కోరడు. ప్రస్తుతము ఉన్న స్థితిమీద ద్వేషం కూడా ఉండదు. ప్రారబ్ధానుసారము వచ్చినదేన్నయినా సరే సంతోషంగా స్వీకరించి, ఆనందంగా జీవిస్తాడు. జ్ఞానికి సృష్టియందు గాని, స్థితి లయముల యందు గాని ఏ మాత్రము ఆసక్తి ఉండదు. ఆ స్థాయిలో ఉన్నవాడు ప్రారబ్ధవశాన లభించిన విషయ వాంఛలమీద నిర్లిప్తుడై, సర్వదా సచ్చిదానందరూపుడై జీవిస్తాడు.

జ్ఞాని ఆత్మస్వరూపుడు అని గతంలో అనేకసార్లు చెప్పుకున్నాం. అతడికి కోరికలుండవు. అతడు పూర్ణకాముడు. కోరికలు పూర్తిగా తీరినవాడు. నిష్కాముడు – కోరికలు లేనివాడు. కాబట్టి కోరికలకు అతీతమైన స్థితిలో ఉంటాడు. అనంత చైతన్యంలో ఈ జగత్తంతా, సముద్రంలో కెరటం లాంటిది. ఈ విషయం జ్ఞానికి స్పష్టంగా తెలుసు. ఆత్మ అనే సముద్రంలో ఈ జగత్తు ఒక అలలాంటిది. అటువంటప్పుడు ఈ దేహమెంత? మహాసముద్రంలో ఒక చిన్న బిందువు. పెద్ద ఎడారిలో ఇసుకరేణువు. కాబట్టి ఈ బిందువు సముద్రంలో కలిసిపోయినా, విడిగా ఉన్నా జ్ఞానికి సమానమే. జ్ఞానికి శరీరంతో తాదాత్మ్యత ఉండదు.

అటువంటి జ్ఞానికి ఈ ప్రపంచం ఉన్నా ఒకటే నశించిపోయినా ఒకటే. కాని సమాజం దృష్టిలో జ్ఞానికూడా మానవుడే. అతడికి కూడా సామాన్యావసరాలుంటాయి. తిండి బట్ట, ఇల్లు మొ॥ కావాలి. సామాన్యమైన అజ్ఞానికి, జ్ఞానికి తేడా ఏమంటే, సామాన్యుడు నాకు అది కావాలి. ఇది కావాలి. దీన్ని సాధించటం కోసం ఏం చెయ్యాలి? అని ఆలోచిస్తాడు. జ్ఞాని వీటిని గురించి పట్టించుకోడు. ప్రారబ్దవశాన లభించిన వాటితో తృప్తి పడతాడు. మహదానందంగా జీవిస్తాడు. అటువంటి

మహానుభావుడు మన మధ్యనే ఉన్నా అతణ్ణి గుర్తించలేము. అతడు ఈ ప్రపంచానికి చెందినవాడు కాదు. దేన్నైనా సంతోషంగా స్వీకరిస్తాడు.

**కృతార్థోఽనేన జ్ఞానేనేత్యవం గలితధీః కృతీ ।**
**పశ్యన్శృణ్వన్ స్పృశన్జిఘ్రన్నశ్నన్నాస్తే యథా సుఖమ్ ॥ 8**

జ్ఞాని నుంచున్నా, కూర్చున్నా, నడుస్తున్నా, తింటున్నా, అన్ని పనులలోను తన శక్తినే గమనిస్తూ, నిశ్చలమై మనస్సుతో, నిర్మల జ్ఞానంతో సుఖంగా జీవిస్తాడు.

అద్వైత జ్ఞానంతో కృతార్థుడనయ్యాను అనే సంకల్పం లేకుండా, నిత్యకృత్యాలు నెరవేరుస్తున్నప్పటికీ అతడు చిద్రూపుడుగానే ఉంటాడు. చేయవలసిన పనులన్నీ చేశాడు కాబట్టి ఇంద్రియాలతో పనులు చేస్తున్నప్పటికీ దుఃఖించడు.

మనసులో అశాంతి కలిగితే, దాన్నుంచి కోరికలు ఆవిర్భవించి మనసును ఇంకా కల్లోలం చేస్తాయి. ఈ కోరికలు తీరితే శాంతి లభిస్తుంది అనే భావనతో కోరికలు తీర్చుకోవటానికి ప్రయత్నం చేస్తాడు. దానిలో భాగంగా కొన్ని విషయాలు, వస్తువులు తాను పొందాలి అనుకుంటాడు. ఇది సామాన్యుడి స్థితి.

ఈ జగత్తంతా తన భావాలకన్న విడిగా లేదని తెలుసు. కోరికలను సృష్టించింది మనస్సు. ఈ మనస్సే విషయాలను చూస్తున్నది. విషయాలుగా మారిపోతున్నది. వాటికోసం ప్రయత్నిస్తున్నది. ఇంకా కోరికలను పెంచుకుంటున్నది. ఈ విషయం జ్ఞానికి నిశ్చయంగా తెలుసు. కాబట్టి జ్ఞాని మనస్సు తనంత తానుగా మనస్సుచేత కల్పించబడిన భోగాలవైపు పరుగులు తీయదు. అలా పరుగులు తీయకుండా నిశ్చలంగా ఉంటుంది. బాహ్యజగత్తును భావాల రూపంలో గుర్తిస్తున్నా ఆ భావాలు తనకన్న వేరు కావని తెలిసి ఇదంతా ఒక ఆట, లీల అని భావిస్తాడు. అతడు ఏ స్థితిలో ఉన్నా పరమ శాంతంగా, సర్వసాక్షిగా చూడగలుగుతాడు. ఈ బాహ్య ప్రపంచం వల్ల బాధలు కలిగినా బాధ పడడు. అనంతమైన శాంతితో సుఖంగా ఉంటాడు చూస్తూ, వింటూ, నడుస్తూ, జీవిస్తూనే ఉంటాడు. దేన్నీ తప్పించుకోవాలి అనుకోడు. దేన్నుంచీ పారిపోడు. ఏదీ కావాలనుకోడు ఉన్నది ఒక్కటే. అదే తను. ఈ విషయం తెలుసు కాబట్టి శాంతంగా, స్థిరంగా ఉంటాడు.

**శూన్యాదృష్టి ర్వృథా చేష్టా వికలా నీంద్రియాణి చ ।**
**న స్పృహా న విరక్తి ర్వాక్షీణ సంసారసాగరే ॥** 9

జ్ఞానికి బాహ్య ప్రపంచం అంతా యధార్థం కాదు. ఇది భావనామాత్రము అని ఖచ్చితంగా తెలుస్తుంది. దీనివల్ల లౌకిక విషయాలమీద కోరిక ఉండదు. ఇష్టాఇష్టాలు ఉండవు. దీంతో అతడి దృష్టి అంతా భావశూన్యంగా ఉంటుంది. అతడు శారీరికంగా చేసే పనులకు (కర్మలకు) ఒక అర్థము, ప్రయోజనము ఉండదు. అతని ఇంద్రియాలు కూడా దేన్నీ కోరవు.

ప్రాపంచిక దృష్టి లేని జ్ఞాని **'క్షీణసంసారసాగరుడు'** అనబడతాడు. అటువంటి మహానుభావుడికి లౌకిక విషయాల మీద కోరిక ఉండదు. అతడు శారీరకంగా గాని, మానసికంగా గాని, వాక్కు ద్వారా గాని చేసే కర్మలు పిశాచం ఆవహించిన పిల్లవాడు చేసే చేష్టలలాగా అర్థం లేకుండా ఉంటాయి. అతడి దృష్టి, మనోవ్యాపారము రెండూ కూడా సంకల్ప వికల్పాలు లేకుండా ఉంటాయి.

జ్ఞాని ఆత్మస్వరూపుడు. ఇతని దృష్టిలో సంసారం లేదు. ఇక్కడ ఒక్క మాట గమనించండి. జ్ఞానం కలగగానే సంసారం నశిస్తుంది అని చెబుతారు. నిజంగా సంసారం నశించదు. ఈ జగత్తంతా ఎక్కడ ఉన్నది అక్కడే, ఎలా ఉన్నది అలానే ఉంటుంది. నీకు జ్ఞానం కలిగింది కదా అని జగత్తు ఎక్కడికీ పారిపోదు. మాయం కాదు. నాశనమై పోదు. ఎలా ఉన్నది అలానే ఉంటుంది. మరి జ్ఞాని దృష్టిలో సంసారం లేదు అంటే **బ్రహ్మసత్యం జగన్మిథ్య** అనే విషయం అతడికి తెలుస్తుంది. ఈ జగత్తంతా మాయచేత అజ్ఞానం చేత, భ్రాంతి చేత కల్పించబడింది. భ్రాంతితో ఆవిర్భవించిన వస్తువు జ్ఞానం కలగగానే తన అధిష్ఠానంలో విలీనమై పోతుంది. అంటే భ్రాంతివల్ల కల్పించబడిన జగత్తంతా త్రాడుతో పాములీనమై పోయినట్లుగా తన అధిష్ఠానమైన బ్రహ్మము నందు లీనమై పోతుంది. అందుచేత జ్ఞానికి జగత్తు ప్రత్యేకంగా కనుపించదు. **జ్ఞాని దృష్టిలో మాత్రమే జగత్తు లేదు. ఇతరుల దృష్టిలో జగత్తు యథాతథంగా ఉన్నది. జ్ఞాని దృష్టిలో సంసారం లేదు అంటే ఇది అర్థం.**

జ్ఞాని నేను ఆత్మస్వరూపాన్ని అని తెలుసుకున్నాడు. అయినప్పటికీ ఈ జగత్తులోనే, ఈ సమాజంలోనే అందరితోపాటే సామాజిక ధర్మాలకు అనుగుణంగా

జీవిస్తున్నాడు. కాని అంతరంగంలో ప్రతిక్షణము నేను ఆత్మని అని గుర్తిస్తుంటాడు. ఇతడు జీవించి ఉండగానే ముక్తి పొందాడు. కాబట్టి జీవన్ముక్తుడు అంటారు. బాహ్య ప్రపంచంలో సమాజంలో ఒక సభ్యునిగా జీవిస్తున్నా, అంతరంగంలో మాత్రం సహజమైన సమాధి స్థితిలో ఉంటాడు. ఎప్పుడూ నేను పరమాత్మని అని భావన చేస్తూనే ఉంటాడు.

అతడిది శూన్యదృష్టి. జగత్తును చూస్తూనే ఉంటాడు. కాని జగత్తులోని దృశ్యాలు ఏవీ అతని కంటికి కనుపించవు. దృశ్యమానమైనదంతా పరమేశ్వరమయంగా కనుపిస్తుంది. అందుకే అతనివి **శూన్యదృష్టిః వృధాచేష్టా** భావరహితమైన దృష్టితో పాటుగా, అతడు చేసే పనికూడా ఉపయోగం లేనిది. ఏ ప్రయోజనాన్ని ఆశించనిది. అతడు చేసే కర్మలవల్ల ఫలితం ఉండదు. అందుకే ఆ కర్మలను **'వృధాచేష్టా'** అంటారు. అసలు ఆ కర్మలను ఫలితం ఆశించి చేసేవి కావు. పిచ్చివాడి పనులు లాగా ఉంటాయి.

ఇక ఇంద్రియాల దృష్టికి వస్తే, ఇంద్రియాలు ఎప్పుడూ తనచుట్టూ ఏ రకమైన వస్తువులు ఉన్నాయి? ఏం జరుగుతున్నది. అనే విషయ సమాచారాన్ని సేకరించి మనసుకు అందిస్తాయి. దృశ్యాలను కళ్ళు చూస్తాయి. శబ్దాలను చెవులు వింటాయి. ముక్కు వాసన చూస్తున్నది చర్మం స్పర్శను తెలుసుకుంటుంది. వస్తువుల రుచిని నాలుక తెలుసుకుంటుంది. ఈ రకంగా ఇంద్రియాలు తమ చుట్టూ ఉన్న విషయాలను గ్రహించి మనసుకు చేరవేస్తాయి. వాటిలో తనకు కావలసిన వాటిని మనసు నిర్ణయించుకుంటుంది. ఇప్పుడు కర్మేంద్రియాలు వాటిని సేకరిస్తాయి. ఇది సామాన్యుడి పరిస్థితి. కాని జీవన్ముక్తుడి పరిస్థితి వేరు. అతని ఇంద్రియాలు చూస్తున్నా, తింటున్నా, వాసన చూస్తున్నా కూడా పని చెయ్యనట్లే లెక్క. వీటివల్ల మనసులో కోరికలు పుట్టవు. ఆ కోరికలు తీరటానికి శ్రమ పడవు. కోరికలు సృష్టించే మనసు జ్ఞానిలో లయమయిపోయింది. కాబట్టి ఇంద్రియాలు పరమశాంతంగా స్పందిస్తాయి. అంతేకాని అలజడి సృష్టించవు. జ్ఞాని యొక్క ఇంద్రియాలు తమంత తాము దేన్నీ కోరవు.

**న జాగర్తి న నిద్రాతి నోన్మీలతి న మీలతి ।**
**అహో ! పరదశాక్వాఽపి వర్తతే ముక్తచేతసః ॥** **10**

జ్ఞానికి జాగ్రదావస్థ లేదు. నిద్రావస్థ అంతకన్నా లేదు. కండ్లు తెరవటమూ లేదు. మూయటము లేదు. జీవన్ముక్తుడైన జ్ఞాని అన్ని సందర్భాలలోను పరమాత్మగా తాను మాత్రమే ఉంటాడు.

అందరికీ అంటే సామాన్య మానవులకు ఉన్నట్లుగా జ్ఞానికి జాగ్రదావస్థ లేదు. అతడికి ప్రాపంచిక విషయాలతో సంబంధం లేదు. కాబట్టి కళ్ళు మూయటం తెరవటం ఉండదు. అతడు నిద్ర పోడు. సర్వకాల సర్వావస్థల యందు అంతటా పరబ్రహ్మనే చూస్తుంటాడు. కాబట్టి జాగ్రస్వప్న సుషుప్తుల యందు ఏ స్థితిలోనైనా ఉన్మత్తుడు లాగా ప్రవర్తిస్తాడు. ఈ రకంగా జ్ఞాని సర్వదా తురీయాతీత స్థితియందే ఉంటాడు.

జీవన్ముక్తుని యొక్క స్థితి ఖచ్చితంగా చెప్పటం చాలా కష్టం. ఆ స్థితిని మన మాటలలో, భావంలో వ్యక్తీకరించలేము. ఒక జ్ఞాని స్థితిని ఇంకొక జ్ఞాని మాత్రమే చెప్పగలడు. **భగవద్గీత**లోని 2వ అధ్యాయం 69వ శ్లోకంలో

**యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ**

**యస్యాం జాగ్రతి భూతాని సానిశా పశ్యతో మునేః ॥**

జీవులన్నింటికీ రాత్రి సమయంలో జ్ఞాని మేల్కొని ఉంటాడు. అందరికీ పగలు అయినప్పుడు జ్ఞానికి రాత్రి.

మనసును, ఇంద్రియాలను వశపరచుకుని పరమాత్మను పొందిన స్థితప్రజ్ఞుడిని **'సంయమి'** అంటారు. అతడే జ్ఞాని. అజ్ఞానులకు జ్ఞానులకు అనుభవం విషయంలో చాలా తేడా ఉంటుంది. దాన్ని చెప్పటానికే రాత్రింబవళ్ళు అంటున్నారు. రాత్రి అంటే సూర్యాస్తమాన నుంచి సూర్యోదయం వరకు అని అర్థం కాదు. గుడ్లగూబకు పగటి పూట కళ్ళు కనుపించవు. అందుకే దాన్ని దివాంధము అంటారు. అలాగే అజ్ఞాని పరమాత్మను చూడలేడు. సూర్యోదయం కాగానే వెలుగు వస్తుంది. కాని పరబ్రహ్మ తత్త్వము తెలియని వారికి అది రాత్రే. అంటే రాత్రితో సమానము. ఎందుకంటే ప్రపంచంలో వారు నిద్రాళువులే. ఆ పరమానందాన్ని గూర్చి వారికి ఏమాత్రము తెలియదు. పరమాత్మ ప్రాప్తే ప్రాణులందరికీ రాత్రి. కాని పరమాత్మ ప్రాప్తి పొందిన జ్ఞానికి అది పగటితో సమానము. స్థితప్రజ్ఞుడు పరమాత్మ స్వరూపాన్ని సాక్షాత్కరింప

చేసుకుని, దానియందే స్థితుడై ఉంటాడు. సమస్త ప్రాణుల రాత్రియందు అతడు మేల్కొని ఉండటము అంటే ఇదే.

మనం మేల్కొని ఉన్నప్పుడు ఇష్టాఇష్టాలతో కర్మలు చేస్తుంటాము. ఈ సమయంలో జ్ఞాని మేల్కొని ఉన్నా జగత్తంతా తన రూపమే అని గుర్తించి శాంతంగా ఉంటాడు కాబట్టి మేల్కొని ఉన్నట్లే. జ్ఞాని శుద్ధ చైతన్యరూపుడు. అతడిని జడత్వం సమీపించదు. మనస్సు ఇంద్రియాలు పని చెయ్యని స్థితిలో మనం నిద్రపోతాం. జ్ఞాని చైతన్యరూపుడు కాబట్టి అతడికి నిద్రలేదు. కంటిరెప్పలు కూడా తెరవటం మూయటం ఉండదు. ఈ రకంగా జ్ఞాని పరమాత్మగా తాను మాత్రమే ఉంటాడు.

**సర్వత్ర దృశ్యతే స్వస్థ స్సర్వత్ర విమలాశయః ।**
**సమస్త వాసనా ముక్తో ముక్త స్సర్వత్ర రాజతే ॥** **11**

జ్ఞాని సర్వకాల సర్వావస్థలలోను, సర్వదా, ఏ మాత్రము కోరికలు లేకుండా, వాసనలు లేనివాడై, నిత్యతృప్తుడై, పరమశాంతంగా స్వస్థితిలో జీవిస్తాడు.

అటువంటి మహానుభావుడు సుఖము వచ్చినా, దుఃఖము వచ్చినా ఏ మాత్రము చలించనివాడై, శత్రువులను, మిత్రులను సమానంగా చూస్తూ, ఏ మాత్రము విషయ వాంఛలకు లోబడక అన్ని అవస్థల యందు చిద్రూపుడై ఉంటాడు.

ఇటువంటి మహాజ్ఞాని దేశకాల ప్రాంతాలతో సంబంధం లేకుండా ఎక్కడైనా సరే అలాగే చిద్రూపుడై ఉంటాడు. అతడికి కోరికలు, ఉద్రేకాలు ఉండవు. పరమశాంతంగా ఉంటాడు. వాసనారూపమైన అన్ని బంధాల నుంచి విముక్తి పొంది పరమపదం చేరి పరమానందంగా ఉంటాడు. అజ్ఞానం పూర్తిగా నశించి జ్ఞాన స్వరూపంతో ప్రకాశిస్తుంటాడు.

**పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్గృహ్ణన్వదన్ వ్రజన్ ।**
**ఈహితా నీహితైర్ముక్తో ముక్తఏవ మహాశయః ॥** **12**

జ్ఞాని మిగిలిన పనులన్నీ అంటే చూడటం, వినటం, తినటం, తిరగటం, మాట్లాడటం, నడవటం మొదలైన పనులన్నీ చేస్తున్నా కూడా ఏ మాత్రమూ క్రోధము, మోహము లేకుండా నిశ్చలంగా, స్వతంత్రంగా, నిత్యముక్తుడై జీవిస్తాడు.

ప్రారబ్ధం వల్ల ఇంద్రియాలకు సంబంధించిన పనులన్నీ చేస్తున్నప్పటికీ, వాటియందు ఏ రకమైన భావన అంటే ఇష్టము, అయిష్టము లేని మహాత్ముడికి మనోవికారాలుండవు. కాబట్టి అతడు ముక్తుడు.

జ్ఞాని కూడా మనలాగానే, మనతోపాటే ఈ ప్రపంచంలోనే ఉంటాడు. బంధాల నుంచి గాని, జగత్తు నుంచిగాని దూరంగా పారిపోడు. శరీరము మన ప్రారబ్ధ ఫలము. ఆ ప్రారబ్ధం ఉన్నంతవరకు అతడు కూడా మన మధ్యనే జీవిస్తాడు. విషయాలతో వ్యవహరించేటప్పుడు జ్ఞానియొక్క ఇంద్రియాలు కూడా మన ఇంద్రియాలకు మల్లేనే స్పందిస్తాయి. అతడు కూడా మనలాగే అన్ని కర్మలు చేస్తాడు. జ్ఞానికి అజ్ఞానికి ఉన్న తేడా అంతరంగంలోనే. జ్ఞాని ఏం చేసినా వాటి ఛాయలు జ్ఞాని హృదయంలో ఏ మాత్రం కనుపించవు. అజ్ఞాని గనక కర్మలు చేస్తే అందులో ఇష్టాఇష్టాలు ఉంటాయి. ఆ కర్మల వల్ల కోరికలు పెరుగుతాయి. ఆ కోరికలు తీర్చుకోవటానికి మళ్ళీ కర్మలు చేస్తాం. కర్మలు చేస్తూ సంసార వృక్షాన్ని ఇంకా ఇంకా పెంచి పోషిస్తాం. జ్ఞాని కర్మలు చేసినా అందులో కామక్రోధాలు, మోహము ఏమీ ఉండవు. అతడు నిత్యముక్తుడై జీవిస్తాడు.

**న విందతి న చ స్తౌతి న హృష్యతి, న కుప్యతి ।**
**న దదాతి న గృహ్ణాతి ముక్తస్సర్వత్ర నీరసః ॥ 13**

జీవన్ముక్తుడైన జ్ఞాని ఎవరినీ నిందించడు, స్తుతించడు, అతనికి సంతోషము, కోపము ఉండవు. ఇవ్వటము తీసుకోవటము ఉండదు. విషయానుభవాల నుంచి విడిగా ఉంటాడు.

అటువంటి మహానుభావుడు దానప్రతిగ్రహణములు, సంతోషము, దుఃఖము, నిందాస్తుతులు లేనివాడై దేనియందు సంగమము లేనివాడై సర్వత్ర చిద్రూపుడై భాసిస్తాడు.

జీవన్ముక్తుడైన జ్ఞాని అన్నింటి యందు సమభావంతో ఉంటాడు. దేనినీ అనుభవించాలనే కోరిక ఉండదు. అయినప్పటికీ విషయాలన్నింటినీ అనుభవించినట్లే. అతడు సాక్షాత్తు పరమేశ్వర స్వరూపము. మనసుచేత గాని, శరీరం చేతగాని చేసే పనులతో ఆత్మకు ఏ సంబంధము ఉండదు. నిందాస్తుతి ఇవి బుద్ధియొక్క లక్షణాలు.

సంతోషము, దుఃఖము, కోపము ఇవి మనసు యొక్క లక్షణాలు, ఇవ్వటం పుచ్చుకోవటం, దానధర్మాలు శరీరంతో చేసే పనులు. ఇవేవీ ఆత్మకు చెందవు. జ్ఞానికి ఈ పనులతో ఏ సంబంధము ఉండదు. మనస్సుతో గాని శరీరంతో గాని ప్రారబ్దానుసారము ఏ కర్మ చేసినా జ్ఞానికి ఏ బాధ్యతా ఉండదు. అతడు కేవలము సాక్షిగా చూస్తూ ఉంటాడు.

**సానురాగాం స్త్రియం దృష్ట్వా మృత్యుంవా సముపస్థితమ్ ।**
**అవిహ్వాల మనాః స్వస్థః ముక్త ఏవ మహాశయః ॥ 14**

అనురాగవతి అయిన స్త్రీని చూసినా, మృత్యువును చూసినా ఒకటిగానే భావన చేస్తాడు.

అటువంటి జ్ఞాని తనయందు అనురాగం పంచే స్త్రీని చూసినా మోహపరవసుడు కాడు. భయంకరమైన మృత్యుదేవతను చూసినా భయపడడు. ఇలా నిశ్చలమైన చిత్తంతో ఉండేవాడు జీవన్ముక్తుడు.

జ్ఞాని అన్ని సందర్భాల యందు సమత్వదృష్టితోనే ఉంటాడు. ఇతడు జీవన్ముక్తుడా కాదా? అనే విషయం గుర్తించటానికి ఇదే ఆఖరు పరీక్ష. మహామోహము అనేదే పరీక్ష. ఏ మానవుడైనా సరే అయితే ధనము లేదా స్త్రీ. ఈ రెండింటిలోను ఏదో ఒక దానికి లొంగుతాడు. విశ్వామిత్రుడంతటి వాడు హిమాలయాలకు వెళ్ళి గంగానది వడ్డున ఆశ్రమం నిర్మించుకుని పదివేల సంవత్సరాలు అకుంఠితమైన దీక్షతో తపస్సు చేశాడు. ఒకరోజు ఉదయం మహర్షి ఆశ్రమంలో నుంచి బయటకు వస్తున్నాడు. ఎదురుగా శెలయేరులో జలకాలాడుతున్నది మేనక. అంగాంగాలు ప్రదర్శిస్తూ స్నానాలు చేస్తోంది. చూశాడు మహర్షి. తట్టుకోవటం అతడి వల్ల కాలా. వెంటనే ఆమె దగ్గరకు వెళ్ళి వివాహమాడవలసింది అని అడిగాడు. సరే అంది మేనక. సంవత్సర కాలం అతనితో కాపురం చేసింది. తరువాత మహర్షిని వదిలి స్వర్గానికి వెళ్ళిపోయింది. విశ్వామిత్రుడి పదివేల సంవత్సరాల తపస్సు, కఠోరదీక్ష అంతా గంగలోకలిసిపోయింది. స్త్రీనిమించిన వశీకరణం లోకంలో ఇంకొకటి లేదు. అందుకని ఇప్పుడు ఆఖరుగా చెబుతున్నాడు అష్టావక్రుడు. అందమైనది, యవ్వనవతి, అనురాగవతి అయిన స్త్రీ తనయందు అమితమైన ప్రేమతో ముందుకు వస్తే ఏ

మాత్రము చలించనివాడు. భయంకరమైన మృత్యుదేవతను చూసినా ఏ మాత్రము చలించనివాడు, ఈ రెండింటినీ సమానంగా చూసేవాడు, సమత్వబుద్ధితో పరమ శాంతంగా ఉంటాడు. సౌందర్యవతి అయిన స్త్రీ దరి చేరినా, మృత్యువు దాపురించినా సమానంగా చూస్తాడు. పరమ శాంతంతో అంతా ఒక నాటకంలాగా చూస్తుంటాడు. అటువంటి వాడు బంధాల నుంచి విముక్తుడైనట్లే, అతడు మహాజ్ఞాని.

**సుఖేః దుఃఖే నరే నార్యాం సంపత్సు చ విపత్సుచ ।**
**విశేషోనైవ ధీరస్య సర్వత్ర సమదర్శినః ॥ 15**

సర్వే సర్వత్ర ఆత్మనే చూస్తున్న జ్ఞానికి సుఖదుఃఖాలలోగాని అదృష్టాదృష్టాలలో గాని, స్త్రీ పురుషులలో గాని తేడా కనుపించదు. చరాచర జగత్తంతా నిండి ఉన్నది బ్రహ్మమే. అదే నేను. అని భావించిన జ్ఞానికి సుఖమేమిటి? దుఃఖమేమిటి? అసలు స్త్రీ ఎవరు? పురుషుడు ఎవరు? భోగమేమిటి? భాగ్యమేమిటి? నువ్వెవరు? నేనెవరు? అంతా ఒక్కటే అనిపిస్తుంది. వీటి మధ్యన ఏ రకమైన తేడా ఉండదు. ఏ రకమైన వికారము పొందదు.

అన్ని వేళల యందు, అన్ని ప్రదేశాలలోను అన్నింటినీ సమంగా చూసే జ్ఞానికి బేధభావాలుండవు. పిపీలికాది బ్రహ్మ పర్యంతము ఒకటిగానే చూస్తాడు. మనుషులు, జంతువులు, పశువులు, పక్షులు, క్రిమికీటకాలు, కొండలు, బండలు, నదులు, సముద్రాలు, పర్వతాలు, లోయలు, ఎడారులు ఒకటేమిటి చలనమున్నవి చలనం లేనివి, ప్రాణమున్నవి ప్రాణం లేనివి అన్నీ పరమేశ్వర స్వరూపమే. ఆ పరమేశ్వరుడికి స్త్రీ పురుష నపుంసకాది భేదాలు లేవు. పరమేశ్వర స్వరూపం గురించి చెబుతూ **నస్త్రీరూపం, నపుంరూపం అథోభయమ్** అది స్త్రీ రూపము కాదు. పురుషరూపము కాదు అలా అని రెండూ కానిది అంతకాన్న కాదు అని చెబుతోంది **దేవీభాగవతం.** లోకంలో ఉన్నది ఒక్కటి అదే పరబ్రహ్మ. అంతకు తప్ప వేరేదీ లేదు. అన్నప్పుడు మళ్ళీ స్త్రీలు, పురుషులు ఎక్కడ నుంచి వస్తున్నారు? నేనే పరబ్రహ్మను జగత్తులో నేను తప్ప ఇంకేదీ లేదు అన్నప్పుడు పశువులు పక్షులు ఇవన్నీ ఎక్కడ నుంచి వచ్చాయి? అంతా భ్రమ. మనమంతా కలిసి సమిష్టిగా ఒకపేరుతో పిలుస్తున్నాం కాబట్టి దానికి ఆ పేరు వచ్చింది. రూ. 500 నోటును మనమంతా అది ఐదువందల

రూపాయల నోటు అంటున్నాం కాబట్టి అది ఐదువందల నోటుగా చెల్లుబాటవుతోంది లేకపోతే చెల్లుబాటు కాదు. ఇవాల్టి రోజున చూడండి పదిరూపాయల నాణేలు కొన్నే చెల్లుతాయి. మిగిలినవి చెల్లవు. అవి దొంగ నాణాలు అని ఒక పుకారు వచ్చింది. అంతే అందరూ పది రూపాయల నాణాలు తీసుకోవటం మానేశారు. అవి దొంగ నాణాలు కావు. మంచి నాణాలే అని రిజర్వు బ్యాంకు వారు ప్రకటన ఇచ్చినా సరే వాటిని తీసుకోవటం లేదు. ఎందుకంటే సమిష్టిగా మనమంతా అవి దొంగ నాణాలు అని నిర్ణయించాం అంతే. మనమంతా ఒక మృగాన్ని చూసి ఇది పులి అన్నాం. అదే పేరు దానికి స్థిరపడి పోయింది. అందరూ కలిసి దానికి ఇంకొక పేరు నిర్ణయిస్తే ఆ పేరుతోనే పిలువబడుతుంది.

సృష్టి వ్యష్టి, సమిష్టి అని రెండు రకాలు అని గతంలో చెప్పుకున్నాం. వ్యష్టి సృష్టి అనేది గారడీ విద్య. సమిష్టి సృష్టి బ్రహ్మ చేశాడని చెబుతున్న సృష్టి. సమిష్టి సృష్టిలో ఆ వస్తువులకు, జీవులకు ఆ పేర్లు పెట్టబడినాయి. అందుకే అవి అలా అందరిచేతా పిలువబడుతున్నాయి. ఈ కారణం చేతనే జగత్తులో నానాత్వము కనుపిస్తున్నది. ఈ సృష్టి జగత్తు అంతా మనోకల్పితము. అందుచేతనే మనస్సు లేనివాడికి ఈ జగత్తు లేదు. పరబ్రహ్మకు మనస్సు లేదు. జ్ఞానికి మనోలయం అయింది. కాబట్టి జ్ఞాని దృష్టిలోను కూడా జగత్తు లేదు. ఉన్నదంతా ఒక్కటే పరబ్రహ్మ. అందుకే అతని దృష్టిలో ఏ రకమైన తేడాలు ఉండవు. అందరినీ, అన్నిటినీ సమంగా దర్శిస్తాడు కాబట్టి ప్రత్యేకంగా సుఖము, దుఃఖము అనేవి కూడా ఉండవు.

**నహింసా నైవకారుణ్యం నౌద్ధత్యం నచ దీనతా ।**
**నాశ్చర్యం నైవ చ క్షోభః క్షీణసంసరణే నరే ॥ 16**

సంసార బంధనాల నుండి విముక్తుడైన వాడికి కరుణ హింస, దీనత్వం అనేవి ఏవీ ఉండవు.

దేహము యొక్క స్ఫురణ సామాన్య మానవుడికి ఉంటుంది. జ్ఞానికి ఉండదు. జ్ఞాని దృష్టిలో దేహము లేదు. మనస్సు అంతకన్నా లేదు. మనస్సు ఉన్న వాడికి భావాలుంటాయి. దేహం కూడా ఉన్నవాడికి బాధలుంటాయి. ఇక్కడ ఒక విషయం జాగ్రత్తగా గమనించండి. బాధలు రెండు రకాలు 1.దేహానికి సంబంధించినవి.

ప్రమాదాలు జరగటం, గాయాలవటం, తలనొప్పి, జ్వరం, రోగం ఇలాంటి బాధలు దేహానికి వస్తాయి.

2. మనసుకు సంబంధించినవి. జరిగిపోయిన జ్ఞాపకాలు, మనకు దక్కని విషయాల గురించి ఆలోచన. దీన్నే చింత అంటారు. చితి శవాన్ని దహిస్తుంది. చింత జీవిని దహించి వేస్తుంది. జ్ఞానికి దేహము లేదు. మనస్సు లేదు. అందుకే ఈ రెండు రకాల బాధలు ఉండవు. అందుచేతనే కరుణ, దీనత్వము, ఆశ్చర్యము, క్షోభణ మొదలైన వికారాలు జ్ఞానికి ఉండవు.

**నముక్తో విషయద్వేష్టా న వా విషయలోలుపః ।**
**అసంసక్తమనాః నిత్యం ప్రాప్తాప్రాప్తముపాశ్నుతేః ॥ 17**

జ్ఞాని అంటే జీవన్ముక్తుడు. అతడికి దేహము, ఇంద్రియాలు, ఇంద్రియ విషయాల మీద కోరిక ఉండదు ద్వేషము ఉండదు. ఏ రకమైన మోహము లేకుండా ప్రాప్తించినవి అనుభవిస్తూ, ప్రాప్తించని వాటిని గురించి ఆలోచించకుండా ప్రశాంతంగా జీవిస్తాడు.

జ్ఞాని తురీయాతీత స్థితికి చేరినవాడు. తురీయాతీతుడు అంటే ఎవరో చూద్దాం. తురీయాతీతుణ్ణే అవధూత అని కూడా అంటారు. శుక్ల యజుర్వేదంలో **తురీయాతీతోపనిషత్తు** ఉన్నది. అందులో తురీయాతీతుడంటే ఎవరో వివరించారు.

“అవధూత మార్గంలో ఉన్నవాడు దుర్లభతరుడు. ఎక్కడో ఒక్కడుంటాడు. అయినప్పటికీ అతడు నిత్యపూజ్యుడు. అతడే వైరాగ్యమూర్తి అతడే జ్ఞానకారుడు. అతడే వేదపురుషుడు. ఎవడు మహాపురుషుడో వాని చిత్తము నాయందే ఉంటుంది. నేనూ అతని యందే ఉంటాను. అతడు మొదట కుటీచకుడై, కుటీచకుడు బహూదకుడై, ‘అహంసత్యం’ను అవలంభించి హంసుడై, హంసుడు పరమహంసుడై, స్వరూపానుసంధానముచే సర్వప్రపంచాన్ని తెలుసుకుని, దండము, కమండలము, కటిసూత్రము, కౌపీనము, ఆచ్ఛాదనము, విద్యుక్తక్రియలు అన్నీ నీటిలో వదిలి, దిగంబరుడై, రంగులేని పాతనారచీరలు, కృష్ణాజినము కూడావదిలి, నిత్యక్రియలను అమంత్రకముగా చేస్తూ, అభ్యంగనస్నానము, ఊర్ధ్వపుండ్రధారణ వదలి, లౌకిక, వైదిక కర్మలను విసర్జించి, సర్వత్ర పుణ్యాపుణ్యములను వదిలి, జ్ఞానాజ్ఞానములను వదిలి, శీతోష్ణములు, సుఖదుఃఖములు, మానావమానములు జయించి, వాసనాత్రయ

పూర్వకమైన నింద, అనింద, గర్వము, మత్సర్యము, దంభము, దర్పము, ఇచ్ఛ, ద్వేషము, కామము, క్రోధము, లోభము, మోహము, హర్షము, అమర్షము, అసూయ, ఆత్మసంరక్షణాదికము అన్నీ వదలి, తన శరీరాన్ని శవంలాగా చూస్తూ, అప్రయత్నంగా, నియమం లేకుండా, లాభాలాభములను సమంగా చేసి, ఆవులాగా దొరికింది తిని ప్రాణాలు నిలుపుకుంటూ, లభించిన దానితో తృప్తిపడి ఆశలేనివాడూ, సర్వవిధ పాండిత్యము భస్మం చేసి అంటే దాన్ని తలచకుండా, స్వరూపమును మరుగుపరచి, పెద్ద, చిన్న అనే మాటలాడక, సర్వోత్కృష్టత్వము, సర్వాత్మకత్వములకు అద్వైతము కల్పించి, అప్రమత్తుడై నాకన్న వేరెవరూ లేరని, దేహగుహ్యాదీం ధనము ఆత్మయందు ఉపసంహరించి, దుఃఖముతో ఉద్వేగము చెందక, సుఖముతో మోదముపొందక, రాగమందు కోరికలేనివాడై, శుభాశుభములందంతట స్నేహములేనివాడై, సర్వేంద్రియుడై, పరముడై, పూర్వమందున్న ఆశ్రమాచారాలను స్మరిస్తూ, విద్యాధర్మములను స్మరిస్తూ, వర్ణాశ్రమాచారాలనువదలి, పగలు, రాత్రి కూడా జాగరూకుడూ, సంచారశీలుడై, దేహముమాత్రము మిగిలినవాడై, ఎల్లప్పుడు ఉన్మత్తత లేనివాడై, బాలుడు, ఉన్మత్తుడు, పిశాచంపట్టినవాడిలాగా ఏకాకిగా తిరుగుతాడు. ఎవరితోనూ మాట్లాడకుండా, ఎప్పుడూ స్వరూపాన్నే ధ్యానం చేస్తూ, అన్నింటినీ వదలి, ప్రణవాత్మకంగా దేహాన్ని వదలిపెట్టినవాడు 'అవధూత' అనబడతాడు.

నేను నాది అనే అహంకార మమకారాలున్న వాడికే భావాలు, ఉద్రేకాలు ఉంటాయి. మమ అనుకుంటే బంధం. నమమ అనుకుంటే మోక్షం. జ్ఞానికి మమత్వం ఉండదు. అందుకే ప్రాపంచిక విషయాల పట్ల ఆసక్తి ఉండదు. అవి ఏ రకంగాను అతనికి సుఖాన్నివ్వవు. దేన్నీ కోరడు. వచ్చిన దాన్ని అది కష్టమైనా సుఖమైనా వద్దనడు. అసలు కష్టసుఖాలనేవి మనసుకు సంబంధించినవి. జ్ఞాని మనసు లయమై పోయింది. కాబట్టి మమత్వం లేకుండా సమత్వ బుద్ధితో ఆనందంగా ఉంటాడు.

**సమాధానా సమాధాన హితాహితవికల్పనాః ।**
**శూన్యచత్తో నజానాతి కైవల్యమివ సంస్థితః ॥ 18**

జ్ఞాని యొక్క చిత్తం శూన్యంగా ఉంటుంది. అతడికి శాంతి, ప్రశాంతి, కష్టము సుఖము, మంచి చెడు అనే భావోద్రేకాలుండవు కేవలము తానొక్కడే ఉన్నానని సంతోషంగా ఉంటాడు.

పరిసరాల పరిజ్ఞానము కూడా లేని ఆత్మరాముడికి నచ్చటం నచ్చకపోవటం ఉండదు. ఏ రకమైన భ్రమలు ఉండవు. అటువంటి జ్ఞాని విదేహముక్తి పొందిన వాడిలాగా ఉంటాడు.

అటువంటి యోగి **కైవల్యమివసంస్థితః** కేవలము మూర్తీభవించిన మోక్షము లాగా ఉంటాడు. అసలు కైవల్యము అంటే ఏమిటి? ముక్తి, మోక్షము, కైవల్యము అన్నీ ఒకే అర్థంలో వాడతాము. విశిష్టాద్వైతంలో కైవల్యాన్ని కూడాఒక పురుషార్థంగా చెప్పారు. కైవల్యము అంటే జీవుడు ప్రకృతి బంధనాల నుండి విడివడి స్వస్వరూపంలో కేవలుడై ఉండటము. అరిషడ్వర్గాలు, ద్వందాల నుంచి విడివడి కేవలుడుగా ఉండటము. సామాన్య మానవుడెవరైనా సరే జాగ్రదావస్థలో ఉంటే అతడి మనసు పూర్తిగా ఆలోచనలలో నిండి ఉంటుంది. ఏదో ఒక విషయాన్ని ఆలోచిస్తుంటాడు. కాని జ్ఞానికి ఆలోచనలు ఏవీ ఉండవు. అతనికి ద్వంద్వాలు అసలే ఉండవు. ఎవరిమీద మోహము ద్వేషము ఉండవు. ఏ పరిస్థితులు, ఏ విషయాలు అతణ్ణి బాధ పెట్టలేవు. ఏ రకమైన భావాలు లేకుండా నేను ఒక్కడినే ఉన్నాను అనే భావనతో పరమ సంతోషంతో శాంతంగా ఉంటాడు.

**నిర్మమో, నిరహంకారో నకించిదితి నిశ్చితః ।**
**అంతర్గళిత సర్వాశః కుర్వన్నపి కలిప్యతే న ॥ 19**

జ్ఞానికి అహంకార మమకారాలు ఉండవు. జగత్తులో ఆత్మకన్న వేరే పదార్థం ఏదీలేదు అని తెలుసుకున్నాడు. కోరికలు లేవు. ఇటువంటి వాడు ఏ కర్మ చేసినా, ఆ కర్మయందు అభిమానము ఏ మాత్రము ఉండదు. కాబట్టి అతడు ఏ పని చేసినా దానివల్ల ఫలితం లేదు కాబట్టి పని చెయ్యనట్లే లెక్క. అందుకే అతడు కర్మలు చేస్తున్నా ఏ కర్మనూ చెయ్యటం లేదు.

నిశితంగా పరిశీలించాలంటే అహంకార రహితంగా చేసే కర్మలు కర్మలే కావు. కర్మకు కారణమే కోరికలు కర్మలు చేసేవాడు తన కోరిక తీరాలి అని సంకల్పించి కర్మ చేస్తాడు. జ్ఞాని కోరికలు, అహంకారము లేకుండా చేసే కర్మ కర్మ క్రిందికి రాదు. జ్ఞానిలో వ్యక్తిగతమైన కర్మలు ఉండవు. వ్యక్తిగతమైన మనస్సు ఉండదు.

లోకకళ్యాణం కోసం మాత్రమే అతడు కర్మలు చేస్తాడు. కాబట్టి అవి కర్మలు కాదని చెప్పబడింది. ఈ కారణం చేతనే అతడు కర్మలు చేస్తున్నా కర్మలు చెయ్యనట్లే లెక్క.

**మనః ప్రకాశ సమ్మోహ స్వప్నజాడ్యవివర్జితః ।**
**దశాం కామపి సంప్రాప్తో భవేద్గళిత మానసః ॥ 20**

జ్ఞాని యొక్క మనస్సు అమనస్కమవుతుంది. కోరికలుండవు. భ్రమ నుంచి విడివడినాడు. ఇప్పుడు అనిర్వచనీయమైన స్థితిలో ఉంటాడు.

మనస్సు ఆత్మలో లయమయిన జ్ఞాని అనిర్వచనీయమైన ఆనందం పొందుతాడు. ఆ సమయంలో అతడికి మనస్సే ఉండదు. ఇంద్రియ వ్యాపారము ఉండదు. సర్వదా సచ్చిదానందరూపుడయి జాగరూకుడై ఉంటాడు.

జ్ఞానియొక్క స్థితి మాటలకు అందనిది. అందుకే అనిర్వచనీయము, అనుభవైక వేద్యము. ఇతని మనసు పూర్తిగా లయమయిపోతుంది. అందులో సత్త్వగుణం కూడా కనపడదు. రజోగుణం అదృశ్యమవుతుంది. తమోగుణం నశించిపోతుంది. ఈ రకంగా మూడు గుణాలు లేని స్థితి. అదే గుణాతీతమైన స్థితి. ఈ స్థితిలో అతడికి ఏ భావాలు ఉండవు. కోరికలు ఉండవు. ఉద్రేకం ఉండదు. పరమశాంతంగా ఉంటాడు. మనసు నశించిపోతుంది. అన్ని రకాల భ్రమలు తొలగిపోతాయి. జగత్తంతా పరమాత్మ స్వరూపంగానే కనుపిస్తుంది. జగత్తులోని వస్తువులు ప్రాణులు అన్నీ తనలాగే కనిపిస్తాయి. ఆ స్థితిలో అతడు ఎవరితోను మాట్లాడడు. ఏ విషయము ఆలోచించడు. భావాతీతమైన స్థితిలో ఆనంద డోలికలలో తేలియాడుతుంటాడు. ఆ స్థితి అనిర్వచనీయము, అనుభవైక వేద్యము.

# అధ్యాయం-18

# లక్ష్యము

మానవుడు లోకంలో సాధించవలసినవి చతుర్విధ పురుషార్థాలు. ధర్మార్థకామ మోక్షాలు. అసలు పురుషార్థం అంటే మోక్షమే. ఆ మోక్షం సాధించేందుకు మిగిలిన మూడు ధర్మార్థ కామాలు మెట్లు. అష్టావక్రగీత సామాన్యుడి కోసం చెప్పింది కాదు. జనకుడు మహాజ్ఞాని. అంత కాకపోయినా కనీస జ్ఞానమున్న వారి కోసం చెప్పబడింది ఈ గీత. ఇప్పుడు ఈ అధ్యాయంలో జీవిత లక్ష్యాన్ని వివరిస్తున్నారు. గతంలో చెప్పినట్లుగా జీవిత లక్ష్యం మోక్షం. మోక్షాన్ని ఎలా సాధించాలి? సామాన్య మానవుడికి జ్ఞానికి తేడా ఏమిటి? ఈ విషయాలు ఇక్కడ చెబుతున్నారు.

ఆత్మజ్ఞానం గనక లభిస్తే మనకి ఉండే అజ్ఞానజనిత భ్రమాజ్ఞానమంతా కలలాగా కరిగిపోతుంది. అసంఖ్యాకమైన వస్తువులను సంపాదించి సుఖభోగా లనుభవించవచ్చును. వీటన్నింటినీ త్యజిస్తే తప్ప నిజమైన ఆనందం రాదు. తన కర్మలవల్ల జనించే దుఃఖమే తనను దగ్ధం చేస్తుంది. కోరికలు లేని స్థితి మాత్రమే ఆనందాన్ని ఇవ్వగలదు. ఈ జగత్తంతా భావనామాత్రమే భావానికి వేరుగా జగత్తు లేనేలేదు. పరిణామరహితము నిష్కళంకము అయిన ఆత్మ ఎక్కడా దూరంగా అందరానిదిగా లేదు. ఉన్నట్లుగా మనం గుర్తించేదంతా మన భావాలు మాత్రమే. ఆత్మ నిత్యము ముక్తంగానే ఉంటుంది. ఆత్మానుభవం కలిగి తాను బ్రహ్మముకన్న వేరు కాదని, సృష్టి ఉండటము లేకపోవటము కూడా తన భావాలేనని తెలిసిన జ్ఞానికి కోరికలు ఉండవు. జగత్తంతా ఆత్మే అని తెలిసిన జ్ఞానికి అది ఇది అనే భావాలు ఉండవు. శాంతస్థితి పొందిన యోగిలో భావకల్లోలం ఉండదు. అతడికి సుఖదుఃఖాలుండవు.

అన్ని భోగాలు ఉన్నా, భిక్షాటనమైనా, అడవిలో గాని జనారణ్యంలో గాని కోరికల నుండి విముక్తుడైన వాడు పరమశాంతంగా జీవిస్తాడు. ద్వంద్వాలను అధిగమించిన యోగికి ఆచరించవలసిన ధర్మం ఏమీ లేదు. జీవన్ముక్తుడి ఆచరించ వలసిన ధర్మాలు లేవు. అతనికి ఇష్టాఇష్టాలుండవు. కోరికల కల్లోలాన్ని జయించిన శాంతమనస్కుడైన మౌనికి ముక్తి మాత్రం ఎందుకు? కోరికలతో నిండిన మనసుతో

చూస్తున్న వ్యక్తి ప్రపంచాన్ని మార్చాలనుకుంటాడు. కోరికలు లేని జ్ఞానికి ఏ భావనా ఉండదు. పరబ్రహ్మ స్వరూపాన్ని బుద్ధితో చూసినవాడు 'నేనే బ్రహ్మమును' అని నిత్యము ధ్యానిస్తాడు. కాని ఆత్మస్థితుడైన వాడు దేన్ని ధ్యానిస్తాడు? కోరికలతో మనసు అశాంతిగా ఉంటే శాంతింప చెయ్యాలి. కోరికలు లేనివాడు చెయ్యవలసినది ఏముంది? ఆత్మనిష్ఠుడైన వాడు సామాన్యుడిలా ప్రవర్తించినా అతడు అసామాన్యుడే. అతనికి సమాధి, మనోచలనము, విషయలగ్న మానసం ఏవీ ఉండవు. వాసనారహితుడైన జ్ఞాని ఎన్ని కర్మలు చేసినా చెయ్యనట్లే. ప్రాప్తించిన కర్మలను సంతోషంగా నిర్వహించే జ్ఞాని కర్మలు చేసినా, మానినా సుఖదుఃఖాలు పొందడు.

జీవన్ముక్తుడు కోరికల రూపమైన బంధం లేకుండా స్వతంత్రంగా హాయిగా జీవిస్తాడు. లౌకిక ప్రపంచానికి సంబంధించిన అనుభవాలను అధిగమించిన స్థితిలో జీవించే వారికి సుఖదుఃఖాలుండవు. పవిత్రము, శాంతము అయిన మనస్సుతో నిత్యము ఆత్మానంద స్థితుడైన యోగి దేనినీ త్యజించాలి అనుకోడు. ఏం జరిగినా బాధ పడడు. ప్రారబ్ధానుగుణంగా సంభవించే సంఘటనలను సాక్షి మాత్రంగా చూస్తూ జ్ఞాని మానావమానాలకు లోనుగాకుండా శాంతంగా జీవిస్తాడు. చైతన్యవంతునిగా తనను తాను గుర్తిస్తూ, శరీరం పని చేస్తున్నదని, తానేమీ పని చెయ్యటం లేదని గుర్తించిన జ్ఞాని కర్మలనాచరించినా ఆచరించటం లేదనే లెక్క. జీవన్ముక్తుడు చేసే కర్మలకు ఆధారం చూపలేడు. మనోబుద్ధుల తాదాత్మ్యం నుండి బయటపడి, తనలోని భావాలను సాక్షిగా చూస్తూ, శాంతంగా జీవించే జ్ఞాని దేన్నీ ఆలోచించడు. మనసులో కల్లోలాలు లేకపోవటంతో శాంతుడైన వాడు ఏకాగ్రత నిచ్చే ధ్యానాన్ని విడిచిపెడతాడు. నేనే కర్తను అనే కర్తృత్వ భావం లేనప్పుడు అతడు కర్మలు చేస్తున్నా చెయ్యనట్లే లెక్క. జ్ఞానిమనస్సు సుఖదుఃఖాల కతీతంగా ఉంటుంది. మానసికోద్రేకాలు, కోరికలు ఏవీ ఉండవు.

జీవన్ముక్తుని మనస్సు ధ్యానంలో గాని కర్మలోగాని లీనంకాదు. నిస్వార్థంగా కర్మల నాచరిస్తుంది. అజ్ఞాని తత్త్వసారాన్ని విని సందేహాలపాలౌతాడు. బుద్ధిమంతుడు అంతర్ముఖుడై సత్యాన్ని గ్రహించి దర్శించి పైకి మాత్రం అజ్ఞానిలా కనిపిస్తాడు. మూర్ఖులు మాత్రమే మనస్సును నియంత్రించి ఏకాగ్రత నభ్యసిస్తారు. జ్ఞాని దేన్నీ సాధించాలనుకోడు. మూర్ఖుడు కర్మవల్ల గాని అకర్మవల్ల గాని శాంతిని పొందలేడు.

జ్ఞాని సత్యాన్ని తెలుసుకుని శాంతంగా ఉంటాడు. అనేక అభ్యాసాలకు అలవాటు పడిన జనులు ఆత్మతత్త్వాన్ని పొందలేరు. అజ్ఞాని ధ్యానంతోను సమాధితోను మనస్సును నియంత్రించి ఆత్మానుభూతి పొందలేడు. సుకృతం కలిగినవాడు శ్రవణ మననాలతో ముక్తి పొంది, ఆత్మలో స్థితుడై ఉంటాడు. మూఢుడు ఎన్నటికీ బ్రహత్త్వాన్ని సాధించలేడు సాధించాలనే కోరికే అతనికి అడ్డుగా నిలుస్తుంది. జ్ఞాని కోరకుండానే బ్రహ్మమై నిలుస్తాడు. ముక్తిని సాధించాలనే తపనతో మూర్ఖులు సంసారాన్ని పెంచి పోషిస్తున్నారు.తెలివైన వారు సంసార వృక్షాన్ని ఛేదించి హాయిగా ఉంటారు. మనస్సును నియంత్రించి శాంతిని సాధించాలనుకునే వాడికి అది ఎప్పటికీ సాధ్యం కాదు. సత్యాన్ని తెలుసుకున్న జ్ఞాని ఎప్పుడూ శాంతంగానే ఉంటాడు. దృశ్యమానమైన ప్రపంచాన్ని చూస్తున్న వాడికి ఆత్మదర్శనం ఎన్నటికీ సాధ్యం కాదు. జ్ఞాని తాను చూసేదంతా ఆత్మతత్త్వమే అని భావిస్తాడు.

మనస్సును నియంత్రించాలని ప్రయత్నించే వాడికి అది సాధ్యంకాదు. జ్ఞానికి ఆత్మానుభవం తప్ప మనస్సు ఉండదు. కొందరు ఆధారమైన సత్యం ఉందంటారు. కొందరు లేదంటారు. జ్ఞాని ఈ రెండింటినీ నమ్మడు. ఆత్మశుద్ధము అద్వితీయము అని భావించే మూఢులు ఆత్మానుభవం పొందలేరు. ముక్తిని కాంక్షించే సాధకుడి బుద్ధి ఏదో ఒక ఆధారాన్ని ఆశ్రయించే పని చేస్తుంది. కోరిక లేని జీవన్ముక్తుడి బుద్ధికి ఆధారం అవసరం లేదు. నిత్యముక్తమైన భావం సర్వదా ఉంటుంది. విషయ భోగాలకు భయపడేవారు బుద్ధి గుహలో ప్రవేశించి, మనస్సును ఏకాగ్రం చేసి నిరోధించాలని ప్రయత్నిస్తారు. వాసనారహితుడిని చూసి విషయాలు పారిపోతాయి లేదా మంచి సేవకులు లాగా సేవిస్తాయి. సందేహాలు లేకుండా తనను తాను ఆత్మగా తెలుసుకున్న వ్యక్తి ముక్తి కోసం ధ్యానం చెయ్యాలనుకోడు. జ్ఞాని తనకు ప్రాప్తించిన కర్మలు ఏవైనా సమదృష్టితో శాంతంగా ఆచరిస్తాడు. సుఖము, సుఖాతీతమైన ఆనందస్థితి, భావరహిత శాంతస్థితి, ఆత్మానుభవం అన్నీ స్వతంత్రం వల్లనే లభిస్తాయి. తనలో ఉన్న ఆత్మ నిజానికి కర్తా కాదు భోక్తా కాదు అని తెలిసిన జ్ఞానిలో అన్ని భావాలు సమసిపోతాయి. విధి నిషేధాల నుంచి విడివడిన జ్ఞాని ప్రవర్తన సహజానందంతో ప్రకాశిస్తుంటుంది. తమను తాము ఆత్మగా గుర్తించిన జ్ఞానులు సంతోషంగా, సరదాగా, మనోబుద్ధులతో ప్రపంచంలో తిరుగుతారు. అప్పుడప్పుడు కొండ గుహలలో ధ్యానంలో ఉంటారు.

వేదవిదులను పూజించినా, తీర్థాలు సేవించినా, అందమైన స్త్రీలను చూసినా జ్ఞానిలో కోరికలు ఏ మాత్రము ఉదయించవు. భార్య, పిల్లలు, సేవకులు, బంధువులు, మిత్రులు ఎవరు ఏ రకంగా దూషించినా జ్ఞాని వికారం చెందదు. అతడు సంతుష్టుడైతే సంతోషించడు. విచారం వస్తే దుఃఖించడు. తనను తాను పరమాత్మగా గుర్తించిన జ్ఞానికి ధర్మాధర్మాల ప్రసక్తే ఉండదు. మూర్ఖుడు ఏ పని చేస్తున్నా, చెయ్యకపోయినా ఆందోళన గానే ఉంటాడు. జ్ఞాని పరమశాంతంగా ఉంటాడు. నిత్య జీవితంలో కూడా జ్ఞాని పరమశాంతంగానే ఉంటాడు. హాయిగా, ఆనందంగా తిరుగుతాడు. జ్ఞాని సామాన్యుడిలాగా జీవన వ్యాపారాలు చేస్తున్నా విచారానికి లోనుకాడు. మూర్ఖుడికి నిర్వృత్తి, వృత్తిరాహిత్యం కూడా శ్రమ కలిగించే కర్మే అవుతుంది. జ్ఞానికి కర్మలు కూడా శాంతినిస్తాయి.

మూర్ఖులే తమకున్న వస్తువులమీద వైరాగ్యం చూపుతారు. జ్ఞానికి రాగద్వేషాలుండవు. మూర్ఖుని దృష్టి ఎప్పుడూ వస్తువులమీదా, వాటి అభావం మీదా ఉంటుంది. జ్ఞాని వస్తువుల గురించి ఆలోచించినా ఆలోచించనట్లే. ఏ కోరికలు లేకుండా కర్మలు ఆచరించే జ్ఞానికి, కర్మలలో అతని ప్రమేయం ఉండదు. అతడు వాటిచేత బంధింపబడడు. జ్ఞాని అన్ని పనులు చేస్తున్నా, దేనికోసం తపించడు శాంతంగా ఉంటాడు. తాను నిత్యుడు అని తెలుసుకున్నజ్ఞానికి ఈ ప్రపంచ మెక్కడ? అహంకార మెక్కడ? సత్యదృష్టి గలవాడు అన్ని భోగాల నుండి విముక్తుడవుతాడు. అతడికి ముక్తి కావాలని కూడా ఉండదు. జ్ఞాని చెయ్యవలసిన కార్యాలు ఏవీ ఉండవు. దృశ్యమానమైన ప్రపంచమంతా భ్రమాజన్యముని, ఎక్కడా ఉనికి లేదని జ్ఞానికి స్పష్టంగా తెలుసు అతడు ఆత్మానుభూతి పొంది పరమశాంతుడైనాడు.

శుద్ధ చైతన్యరూపుడై భౌతిక ప్రపంచాన్నే చూడని మహాత్ముడికి జీవిత ధర్మాలు, వైరాగ్యం, త్యాగం అర్థరహితాలు. అతడికి బంధాలు మోక్షము ఉండవు. ఆత్మజ్ఞానం లభించేదాకా భౌతికప్రపంచ భ్రమ బాధిస్తుంది. జ్ఞాని అన్ని కోరికలు వదలి సుఖంగా ఉంటాడు. తనను తాను ఆత్మగా గుర్తించిన వాడికి జగత్తెక్కడ? జ్ఞానమెక్కడ? నేను నాది అనే అహంకార మమకారాలెక్కడ? జడమైన బుద్ధిగల వాడు మనోనియంత్రణ ఆపిన మరుక్షణం నుంచీ కోరికలు, మనఃస్సంకల్పాలు విజృంభిస్తాయి. ఆ మందబుద్ధులకు ఆత్మజ్ఞానాన్ని వివరించినా వారు మనోభ్రమలు విడనాడలేరు. బయటకు వారు శాంతంగా కనిపించినా కోరికల విత్తనాలు అంతరంగంలో

ఉంటాయి. జ్ఞానంతో కర్మల ఆవశ్యకత, కర్తృత్వము వదలిపెట్టిన జ్ఞాని లోకం దృష్టిలో కర్మల నాచరించినట్లు కనిపించినా నిజానికి అతడు ఏ పని చెయ్యటం లేదు. నిర్భయంగా, నిశ్చలంగా శాంతమైన మనస్సుతో చరించే జ్ఞానికి అంధకారం లేదు. వెలుతురు లేదు. అతనికి ఏ భావాలు ఉండవు. స్వస్వరూపుడైన యోగికి ధైర్యమేమిటి? భయం ఎక్కడ? జ్ఞాని దృష్టిలో స్వర్గం లేదు నరకం లేదు. జీవన్ముక్త స్థితి అంతకన్నా లేదు. యోగిదృష్టిలో దేనికీ ఉనికి లేదు. జ్ఞాని లాభం కావాలనుకోడు. నష్టం వస్తే విచారించడు. నిశ్చలమైన శాంత చిత్తంతో సదా ఆత్మానందంలో ఉంటాడు. వాసనారహితుడు శాంతిని పొగడడు దుష్టత్వాన్ని చిందించడు సమత్వబుద్ధితో ఉంటాడు. నిత్యము పరిణామశీలమైన సంసారాన్ని ద్వేషించడు. ఆత్మదర్శనం కావాలి అనుకోడు. అతడు సుఖదుఃఖాల నుండి విముక్తుడు. జీవించినవాడు కాదు మృతుడు అంతకన్నా కాదు. భార్యాపుత్రులు, విషయ వాంఛలు, శరీరం వేటిమీద కోరిక శ్రద్ధాలేని వారి జీవితం పరమ ఆనందంగా ఉంటుంది. జ్ఞాని ఎప్పుడూ నిత్యతృప్తుడై ఉంటాడు. కోరకుండానే ప్రాప్తించిన వాటితో సుఖంగా జీవిస్తాడు. జనన మరణ చక్రం నుంచి విడివడిన వాడు తన దేహం మృతి చెందినా, సజీవంగా ఉన్నా లెక్క చెయ్యడు. పరమశాంతంగా ఉంటాడు. మోహింప చేసేది రెండవది ఏదీలేదని తెలిసిన వాడికి ఏ కోరికా ఉండదు. అజ్ఞానము, అహంకారము నశించిన జ్ఞానికి మట్టి, బంగారము, రాయి రత్నము రెండూ సమానమే. ఏ కోరికలు లేని నిత్యతృప్తుడు. ఉదాసీనతలో అతడికి సాటి ఎవరూలేరు. అతనికి అతడే సాటి.

జ్ఞాని భిక్షకుడైనా, మహారాజైనా అతనికతడే సాటి. మమత్త్వము మోహత్వము వదలి శాంతంగా ఉంటాడు. జీవిత పరమార్థాన్ని సాధించిన వాడికి నియమనిష్ఠలు ఏవీ ఉండవు. సుఖదుఃఖాలను దాటి, ఆత్మానంద స్థితుడై నిత్యతృప్తి పొందిన వాడిని అలాంటి ఇంకొక జ్ఞాని మాత్రమే అర్థం చేసుకోగలడు. జ్ఞాని సుషుప్తిలో ఉన్నా, స్వప్నావస్థలో ఉన్నా లేనట్లే. జ్ఞాని ఆలోచిస్తున్నా అతని ఆలోచనలు అతనిలో ఉండవు. అతడు ఇంద్రియాలు ఉపయోగిస్తున్నా లేనట్లే లెక్క. అతడికి సంతోషము దుఃఖము ఉండవు. రక్తుడు కాదు విరక్తుడు కాదు. ముక్తి కావాలనే కోరిక ఉన్నా లేనట్లే. జ్ఞాని సమాధిలో ఉన్నా ధ్యానించడు. జడంగా ఉన్నా తపించడు. పండితుడిగా కనిపించినా అతనికి పాండిత్యం లేదు. సర్వకాల సర్వావస్థలలోను ఆత్మస్థితుడై ఉంటాడు. జీవన్ముక్తుడు, కర్మలు, ధర్మాల నుంచి విడివడి ముక్తుడవుతున్నాడు. అతణ్ణి పొగిడితే

పొంగిపోడు తెగడితే విచారించడు. అతడు స్థితప్రజ్ఞుడు. మరణమంటే భయం ఉండదు జ్ఞాని నిత్యతృప్తశాంతమానసుడై ఉంటాడు. ఏకాంతంగా అరణ్యాలలో నివాసం కావాలని అనుకోడు. ఎప్పుడైనా, ఎక్కడైనా సమత్వబుద్ధితోనే పరమ శాంతంగా జీవిస్తాడు.

ఈ విషయాన్నే ఈ అధ్యాయంలోని 100 శ్లోకాలలో వివరించటం జరిగింది. అష్టావక్రుడు చెబుతున్నాడు.

**యస్యబోధోదయే తావత్స్వప్నవద్భవతి భ్రమః ।**
**తస్మై సుఖైకరూపాయ నమశ్శాంతాయ తేజసే ॥ 1**

ఆత్మనిత్యానందము, తేజోవిరాజితము అటువంటి ఆత్మకు నమస్కారము. ఆత్మజ్ఞానం గనక కలిగినట్లైతే, అజ్ఞానం వల్ల జనించిన భ్రమలు అన్నీ కలలాగా అదృశ్యమై పోతాయి.

ఆత్మ సత్యము నిత్యము శాశ్వతమైనది. ఆత్మ అంటే ఆనంద స్వరూపము. తైత్తిరీయోపనిషత్తులో

సాధకుడు ఎప్పుడైతే జ్ఞానసముపార్జన చేశాడో, అప్పుడు అతడికి ఉన్న భ్రమలు అన్నీ తొలగిపోతాయి. అప్పుడు సంకల్ప వికల్పాలు లేకుండా చిదానంద స్వరూపుడౌతాడు.

**ఆర్జయిత్వాఖిలా నర్థాన్భోగా నాప్నోతిపుష్కలాన్ ।**
**న హి సర్వపరిత్యాగమంతరేణ సుఖీభవేత్ ॥ 2**

అసంఖ్యాకమైన వస్తువులను సంపాదించి లౌకిక సుఖాలు అనుభవించవచ్చు. వీటన్నింటినీ త్యజిస్తే తప్ప నిజమైన ఆనందం రాదు.

జీవన వ్యాపారం కొనసాగిస్తున్న వాడు ధనధాన్యాలు, సిరిసంపదలు, భోగభాగ్యాలు, భార్యాపుత్రులు, మిత్రులు, బంధువులు, అధికారము, పదవులు వీటన్నింటినీ సమకూర్చుకోవటానికి ప్రయత్నిస్తాడు. వీటితోనే సుఖంగా ఉండగలను అనుకుంటాడు. నిజానికి అవేవీ అతడికి సుఖాన్ని ఇవ్వవు. ఎందుకంటే ఒకటి పొందితే దాంతో తృప్తి పడడు. ఇంకా ఇంకా కావాలనుకుంటాడు. రాజు అయిన

వాడు మహారాజు కావాలనుకుంటాడు. మహారాజు చక్రవర్తి కావాలనుకుంటాడు. చక్రవర్తి అఖండ భూమండలాన్ని ఆక్రమించాలి అనుకుంటాడు. గ్రీకువీరుడు అలెగ్జాండరు ప్రపంచ విజేత కావాలనుకున్నాడు. తీరా అవి సమకూరిన తరువాత ఏదో తెలియని అసహనం. అతడికి ఏ మాత్రము సుఖము ఉండదు. దేవేంద్రుణ్ణి చూడండి. దేవతలకు రాజు, స్వర్గలోకంలో నిరంతరము సుఖసంతోషాలలో తేలియాడుతుంటాడు. అయినప్పటికీ అతడికి సుఖం లేదు. తన అధికారాన్ని, పదవిని ఎవరైనా ఎత్తుకుపోతారేమో అనే భయం కాబట్టి అతడు సుఖంగా ఉండడు. తాను సంపాదించినవి గనక నశిస్తే దుఃఖం వస్తుంది. ఊరిలో ఒక బిచ్చగాడున్నాడు. నాలుగు ఇళ్ళలో అడుక్కొని తెచ్చుకున్నది తిని, ఊరి చివర చెరువు గట్టున, చెట్టు క్రింద హాయిగా నిద్రపోతాడు. అతడికి ఏ చీకు చింతా ఉండదు. అతని దగ్గర ఉన్నదీ లేదు పోయేది అంతకన్నా లేదు. నిజం చెప్పాలంటే అతడు అనుభవించే ఆనందం దేవేంద్రుడికి కూడా ఉండదు. కాబట్టి సంపాదించిటంలో ఆనందము సుఖము ఉండవు. త్యాగంలోనే సుఖం ప్రాప్తిస్తుంది.

**కర్తవ్య దుఃఖ మార్తాండజ్వాలా దగ్ధాంతరాత్మనః ।**
**కుతః ప్రశమపీయూష ధారాసారామృతే సుఖమ్ ॥ 3**

తాను చేసిన కర్మలవల్లనే దుఃఖం కలుగుతుంది. అటువంటప్పుడు అంతరంగానికి శాంతి ఎలా కలుగుతుంది? తెలిసో, తెలియకో నిప్పులో చెయ్యి పెట్టాడు. అది కాలుతుంది. చెయ్యి కాలి బొబ్బలెక్కింది. ఇదంతా తాను చేసుకున్న కర్మ ఫలితమే. అంతేకాదు ఇంకా ఇది చెయ్యాలి, అది చెయ్యాలి అనుకుంటాడు. ఆ పని చేస్తే ఫలితం సరిగా రాలేదని అసంతృప్తి. పని చెయ్యకపోతే చెయ్యలేక పోయామనే బాధ. ఈ రెండూ కూడా మండు వేసవి కాలంలో నడిరోడ్డుమీద 50 డిగ్రీల ఎండలో నిర్జన ప్రదేశంలో ఒంటరిగా నడుస్తున్నప్పుడు ఎలా ఉంటుందో, అలాగే ఉంటుంది. కాబట్టి దుఃఖానికి కారణం తను చేసిన కర్మలు, చెయ్యాలని సంకల్పించిన కర్మలు కారణమవుతాయి. కర్మలు చెయ్యాలని, ఏదో ఫలితం సాధించాలనీ అనుకున్నప్పుడే అశాంతి, దుఃఖం వస్తాయి. కర్మలు చెయ్యని వాడికి, ఏదో సాధించాలనే కోరిక లేని వాడికి దుఃఖం ఉండదు. ఆశ కోరిక లేని వాడికి

దుఃఖం ఉండదు. ఆశ కోరిక లేని వాడికి దుఃఖం ఉండదు. త్యాగంతోనే శాంతి కలుగుతుంది. పూర్వకాలంలో ఒక జమిందారు గారు బ్రాహ్మణ సంతర్పణ చేస్తున్నారు. వచ్చిన వారందరూ భోజనాలు చేస్తున్నారు. భోజనాలలో భాగంగా నెయ్యి వడ్డిస్తున్నారు. బ్రాహ్మణ భోజనాలలో నేతికి చాలా ప్రాధాన్యత ఉన్నది. నెయ్యి వడ్డించటం కోసం ప్రత్యేకంగా తయారుచేసిన జారీ చెంబులు వాడేవారు. ఆ చెంబులతో నెయ్యి వడ్డిస్తే ధారగాపడేది. ఒక్కొక్క చెంబులో కనీసం కిలోనెయ్యి పడుతుంది. జమీందారు గారు కూడా నడుంకట్టి నేతి జారీ తీసుకుని నెయ్యి వడ్డిస్తున్నారు. అలా వడ్డిస్తూ ఒక విస్తరిదగ్గరకు వచ్చారు. బ్రాహ్మణుడు చెయ్యి పట్టాడు. చేతిలో నెయ్యి వేసి ప్రక్కకు వెళ్ళబోయారు జమిందారు గారు. ఆయన సామాన్య దుస్తులలో ఉన్నాడు. అందుకని ఆయనే జమిందారనే సంగతి అక్కడ ఎవరికీ తెలియదు. ఆ బ్రాహ్మణుడు తనచేతినిండా నెయ్యి వెయ్యలేదని సాచి చెంపమీద కొట్టాడు జమిందారు గారిని. ఒక్కక్షణం అవాక్కై పోయి, తేరుకుని పనివాళ్ళని పిలిచి ఆ బ్రాహ్మణుడి త్రాగినంత నెయ్యి పొయ్యండి. వద్దన్నా వదలద్దు అన్నాడు. అలాగే చేశారు వడ్డించేవారు. బ్రాహ్మణుడు బాగా నెయ్యి తాగేశాడు. దాంతో ఆయాసం శ్వాస కూడా పీల్చలేక కూచున్న చోటనే ఆపసోపాలు పడుతూ దొర్లుతున్నాడు. అప్పుడు జమిందారుగారు అతణ్ణి వేడిగా ఉండే నీటితొట్టిలో పడెయ్యండి. కొంతసేపటికి నెయ్యి బయటకు వస్తుంది. అని అలా పడేయించారు. మనం చేసిన కర్మలవల్లనే అశాంతి ఏర్పడుతుందనటానికి ఇది మంచి ఉదాహరణ శాంతిని పొందాలంటే కోరికల త్యాగం అవసరం.

**భవోఽయం భావనామాత్రో న కించిత్పరమార్థతః ।**
**నాస్త్యభావోహి భావానాం భావా భావ విభావినామ్ ॥ 4**

ఈ జగత్తంతా భావనామాత్రమే. భావానికి వేరుగా ప్రపంచం లేదు. అస్థిత్వం కలిగిన ఆత్మ, అభావమయిన జగత్తు ఎప్పుడూ తమ స్వభావంలోనే ఉంటాయి. అసలు ఈ సంసారమంతా సంకల్పంచేతనే కలుగుతున్నది. ఇదంతా ఉన్నది అనుకుంటే ఉంది. లేదు అనుకుంటే లేదు. అజ్ఞాని అయినవాడు మోహాంధకారంలో పడి ఇదంతా నాదే. అని నేను లేకపోతే ఇక్కడ ఏమీ జరగదు. నా భార్య, నా

పిల్లలు, నా సంసారం, నా బంధువులు, నా మిత్రులు అనుకుంటాడు. వారి కోసం ఏమైనా చేస్తాను అంటాడు. చేస్తాడు కూడా. ఇదంతా ఒక పెద్ద ఊబి. లంపటం. ఇందులో దిగటమే కాని బయటకు రావటం మనవల్ల కాదు. ఇది ఒక పద్మవ్యూహం. **కాళహస్తీశ్వర శతకం**లో ధూర్జటి చెబుతున్నాడు.

**ఆలంచున్మెడగట్టి, దానికిన్ అపత్యశ్రేణి గల్పించి త**
**ద్బాలవ్రాతము నిచ్చి పుచ్చుకొను సంబంధంబు గావించి, యా**
**మాలాకోటిని బాంధవంబనెడి ప్రేమంగొందరం ద్రిప్పగా**
**సీలన్సీల అమర్చినట్లొసగితో శ్రీకాళహస్తీశ్వరా ॥**

ఒక ఆడపిల్లను తెచ్చి, ఇది నీ భార్య అని మెడకు తగిలించి, దానియందు సంతానము నేర్పరచి, వారికి పెండ్లి, పేరంటము అంటూ ఇచ్చి పుచ్చుకునే బాంధవ్యము ఏర్పరచి, కొలికి పూస చుట్టూ మిగిలిన పూసలన్నీ తిరుగునట్లు సంసార చక్ర బంధము అనే యంత్రంలో బడేశావు గదా కాళహస్తీశ్వరా ! అంటున్నాడు ధూర్జటి.

పద్మవ్యూహంలో చిక్కినవాడు బయటకు రాలేడు. అలాగే అజ్ఞాని సంసార లంపటంలో పడి శ్లేష్మంలో పడ్డ ఈగలాగా, కుడితో పడ్డ ఎలుకలాగా బయటకు రాలేక కొట్టుమిట్టాడుతున్నాడు. ఇదంతా కేవలము తన భావన వల్లనే జరుగుతున్నది. ఇక్కడ చాలా విచిత్రం చూడండి. మనసున్న అజ్ఞాని లంపటంలో పడుతున్నాడు. అదే మనసు లేనివాడికి ఈ సంసారం ఉండటం లేదు. అందుకే **మనయేన మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః** మానవుల బంధ మోక్షాలకు మనస్సే కారణము. అంతా మిధ్య అని తెలిసిన మరుక్షణమే భ్రాంతి పూర్తిగా పోతుంది. జగత్తంతా పరమేశ్వరమయం అనిపిస్తుంది.

**న దూరం న చ సంకోచాత్లబ్ధ మేవాత్మనః పదమ్ ।**
**నిర్వికల్పం నిరాయాసం నిర్వికారం నిరంజనమ్ ॥ 5**

కేవలము అప్రయత్నము, పరిణామ రహితము, నిష్కళంకము అయిన ఆత్మ ఎక్కడో దూరంగా అందరానిదిగా లేదు. దీనికి పరిమితులు లేవు. అసాధ్యమూ కాదు. ఇది నిత్య సిద్ధమైనది.

ఆత్మసర్వపరిపూర్ణమయినది. అందుచేత దూరంగా లేదు. **ఈశావాస్యోప నిషత్తు**లో చెప్పినట్లుగా

**తదేజతి తన్నైజతి తద్దూరే తద్వంతికే**

ఆత్మ చలిస్తుంది చలించదు. ఆత్మ దూరంగా ఉన్నది. దగ్గరగా ఉన్నది. పరిపూర్ణమైన ఆత్మ దూరంగా లేదు. ఎవరికి దూరంగా లేదు అంటే తెలిసిన వారికి దూరంగా లేదు. తెలియని వారికి మాత్రమే దూరంగా ఉన్నది.

ఆత్మ దేనియందు ఇమిడి ఉన్నది కాదు. అందుచేత నిత్యప్రాప్తమై ఉన్నది. ఒక మూర్ఖుడు మెడలో హారము వేసుకున్నాడు. కొంత సమయం అయ్యేసరికి హారం గుర్తు వచ్చింది. అది ఎక్కడ ఉందో తెలియలేదు. దానికోసం ఇల్లంతా వెతుకున్నాడు. అది ఎక్కడో లేదు. అతని మెడలోనే ఉంది. ఈ విషయం అతడికి గుర్తు లేదు. అందుకే మూర్ఖుడు అన్నారు. ఇలాగే అజ్ఞానులు ఏదో సంకల్పం చేసి, దానికోసం ప్రాకులాడుతూ ఆత్మప్రాప్తి కలగలేదు అని భావిస్తారు. అంటే సంకల్పం లేని జ్ఞానులకు ఆత్మనిత్యప్రాప్తము. ఆత్మనిర్వికల్పము, నిర్వికారము నిరంజనము, కాబట్టి నిర్వికల్పులకు నిత్యప్రాప్తము.

**వ్యామోహమాత్ర విరతౌ స్వరూపాదాన మాత్రతః ।**
**వీతశోకా విరాజంతే నిరావరణ దృష్టయః ॥ 6**

మనోబుద్ధులలోని భ్రమలు తొలగిపోగానే, అధిష్ఠానము, అద్వయము, అయిన ఆత్మతత్త్వాన్ని తెలుసుకోగలుగుతారు. సాధకుడికి జ్ఞానోదయం గనక అయితే భయాలు, బాధలు అదృశ్యమై పోతాయి. అప్పటి వరకు బుద్ధిని ఆవరించిన అజ్ఞానం నశిస్తుంది. శాస్త్రాలు చదవటం వల్ల, గురూపదేశం వల్ల జ్ఞానం కలుగుతుంది. అప్పుడు తెలిసిన విషయాన్ని తర్కించి చూస్తే విషయం పూర్తిగా తెలుస్తుంది. సంపూర్ణ జ్ఞానం కలుగుతుంది. దీంతో ఇది జగత్తు అనే భ్రమ తొలగిపోతుంది. దాంతో దుఃఖాలు పటాపంచలవుతాయి. అప్పుడు ఏ ప్రయత్నము లేకుండానే అద్వితీయ పరిపూర్ణ ఆత్మస్వరూపుడౌతాడు.

సాధకుడిలో ఉండే అజ్ఞానము, అహంకారమే అతని సహజ స్వరూపాన్ని మరుగు పరుస్తాయి. తనకు వచ్చిన కష్టాల గురించి ఎప్పుడూ ఆలోచిస్తుంటాడు.

దాంతో అతని బుద్ధి తమోగుణంతో ఆవరింపబడి, రజోగుణం చేత కల్లోలమై అశాంతి పాలౌతుంది. కాబట్టి మనస్సు యొక్క ఈ రెండు స్థితులను సత్వగుణం వల్ల కలిగిన శాంతివైపుకి గనక మళ్ళించినట్లైతే, మనసు కాస్తా ధ్యానానికి అనుకూల మవుతుంది. ఈ ధ్యానంలో తన భ్రమలను, అధిష్ఠానమయిన సత్యాన్ని కూడా స్పష్టంగా తెలుసుకోగలుగుతాడు. అటువంటి చిత్తశుద్ధి గల సాధకుల అంతరంగం ఆత్మానుభవంతో మహదానందంగా ఉంటుంది.

**సమస్తం కల్పనామాత్ర మాత్మాముక్తస్సనాతనః ।**
**ఇతి విజ్ఞాయ ధీరో హి కిమభ్యస్యతి బాలవత్ ॥ 7**

మనం ఉన్నది అనుకునేది కేవలము మన భావాలను మాత్రమే. ఆత్మ ఎప్పుడూ ముక్తంగానేఉంటుంది. ఈ సత్యం తెలిసినవారు అజ్ఞానాన్ని ప్రదర్శించరు.

దేహము, జగత్తు ఈ రెండూ ఆత్మయందు కల్పించబడినవి. ఆత్మ సనాతనమైనది. నిత్యముక్త స్వరూపము. ఈ విషయం గనక దృఢంగా తెలిస్తే జ్ఞానము లేని బాలుని లాగా ఇంకా తెలుసుకోవలనిదేమీ ఉండదు.

నిద్రలో కలగన్న వ్యక్తికి మెలకువ వచ్చినప్పుడు తాను ఇంత వరకు చూసినదంతా కల. మనోకల్పిత భావాలు మాత్రమే అని స్పష్టంగా తెలుస్తుంది. అప్పుడు కల అంతా అబద్ధం. ఇప్పుడు చూస్తున్నదే నిజం అనుకుంటాడు. భావానికి విడిగా ఏదీ లేదనే విషయం కూడా తెలుస్తుంది. శరీరము, బుద్ధి, మనసులు దేనితోనైనా ఏ అనుభవమైనా భావం మాత్రమే. మనస్సే అనేక ఆలోచనలు చేస్తుంది. ఇదే ప్రపంచం. జ్ఞాని అయినవాడు తాను చూస్తున్నదంతా తన భావాలే అని గుర్తించి, విచారం లేకుండా నిశ్చలమనస్కుడై ఆత్మానుభవం పొందుతాడు. ఈ రకంగా తన స్వరూపంలో ఉన్న జ్ఞాని, బాలుడిలాగా కోరికలతో సంచరించలేడు.

ఇక్కడ **బాలవత్** అంటే

1. బాధ్యతారహితంగా 2. తెలివితక్కువగా 3. పెంకితనంతో 4. అజ్ఞానంతో

పిల్లలకు బాధ్యత ఏ మాత్రము ఉండదు. దాంతో ఆలోచన లేకుండా, తెలివితక్కువ ఆలోచనతో ప్రవర్తిస్తారు. పెంకితనంతో మొండిగా, మూర్ఖంగా ఉంటారు. అజ్ఞానంతో వ్యవహరిస్తారు. దీనివల్ల తమకు ప్రమాదం కలగవచ్చు.

ఇతరులకు కూడా ప్రమాదం సంభవించవచ్చు. స్వస్వరూపంలో ఉన్న జ్ఞాని అలా సంచరించలేడు.

**ఆత్మా బ్రహ్మేతి నిశ్చిత్య భావాభావౌ చ కల్పితౌ ।**
**నిష్కామః కిం విజానాతి కిం బ్రూతే చ కరోతి కిమ్ ॥ 8**

పూర్తిగా ఆత్మానుభవం కలిగిన జ్ఞానికి తాను బ్రహ్మము కన్న వేరు కాదని, జగస్సృష్టి ఉండటము లేకపోవటము కూడా తన భావాలే అని తెలిసిన జ్ఞానికి అసలు కోరికలే ఉండవు. ఇంకా అతడు తెలుసుకోవలసింది ఏమీ ఉండదు. చెయ్యవలసినది గాని, చెప్పవలసినది గాని ఏదీ ఉండదు.

తత్ పదార్థమైన పరమాత్మ, త్వం పదార్థమైన జీవాత్మ. ఈ రెండూ వేరుకాదు. శంకర భగవత్పాదుల వారు **స్వరూపానుసంధానాష్టకమ్** లో చెప్పినట్లుగా

**తపో యజ్ఞదానాదిభిశ్శుద్ధబుద్ధి**
**ర్విరక్తో నృపాదేః పదేతుచ్ఛ బుద్ధ్యా ।**
**పరిత్యజ్యసర్వం యదాప్నోతి తత్త్వం**
**పరంబ్రహ్మ నిత్యం తదేవాహమస్మి ॥**

యజ్ఞము దానము తపస్సులు యథావిధిగా చెయ్యటం చేత పరిశుద్ధమైన చిత్తము గలవాడై మహారాజపదవి కూడా తుచ్ఛమైనదిగా భావించి, విరక్తుడై, దృశ్య ప్రపంచాన్ని పరిత్యజించి ఏ తత్త్వాన్ని బ్రహ్మవిదుడు పొందుతున్నాడో, నిత్యమైన ఆ పరబ్రహ్మను నేనే. తత్త్వమసి. ఇక్కడ బ్రహ్మవిదుడు అన్నారు. అసలు బ్రహ్మవిదుడు అంటే ఎవరో చూద్దాం.

జ్ఞానులు నాలుగు రకాలుగా ఉంటారు.

1. బ్రహ్మవిదుడు 2. బ్రహ్మవిద్వరుడు 3. బ్రహ్మవిద్వరీయుడు 4. బ్రహ్మవిద్వరిష్ఠుడు

భూమిక అంటే 'మారు రూపము' అని అర్థం. మోక్షం కావాలంటే అజ్ఞానాన్ని పూర్తిగా వదిలి జ్ఞానమార్గాన్ని ఆశ్రయించాలి. మహోపనిషత్తులో అజ్ఞానము ఏడు రకాలు జ్ఞానము ఏడు రకాలు అంటున్నారు. ఇవే 1.అజ్ఞాన భూమికలు 2.జ్ఞానభూమికలు.

జ్ఞాన భూమికలకు సంబంధించిన జ్ఞానమే యథార్థ జ్ఞానము. ఇవి ఏడు రకాలు

1. శుభేచ్ఛ 2. విచారణ 3. తనుమానసి 4. సత్త్వాపత్తి 5. అసంసక్తి 6. పదార్థ భావన 7. తుర్యగ

ఈ భూమికలను ఆచరించిన వారికి మోక్షం సిద్ధిస్తుంది. బ్రహ్మవిదుడు అంటే సత్త్వాపత్తి అనే నాల్గవ భూమికలో ఉంటాడు.

సత్త్వాపత్తి : మొదటి మూడు భూమికలు అభ్యాసం చెయ్యటం వల్ల చిత్తంలో వైరాగ్యం ఏర్పడుతుంది. ఆ తరువాత శుద్ధ సత్వస్థితి పొంది అంటే కేవలము సత్త్వగుణ ప్రభావము మాత్రమే కలిగి, ఆత్మయందు నిలకడ పొందుతుంది. మానవుడి ధ్యాస అంతా ఆత్మమీదనే ఉంటుంది. ఆ స్థితినే సత్త్వాపత్తి అంటారు. బ్రహ్మవిదుడు ఈ సత్త్వాపత్తిలోనే ఉంటాడు.

ఈ బ్రహ్మవిదుడు పొందుతున్న పరమాత్మను నేనే. ఈ రకంగా జీవాత్మ పరమాత్మ రెండూ వేరు కాదు. నేనే పరమాత్మని అనే విషయం తెలుసుకొని, ఆత్మసాక్షాత్కారము పొంది ఘటపటాదులన్నీ కల్పించబడినవి అని నిశ్చయించి, దీనికి కారణమైన అవిద్యను తొలగించి, నిష్కాముడై, సర్వదా ఆత్మారాముడై ఉండే జ్ఞానికి తనకన్న వేరుగా తెలుసుకోదగినది ఏదీలేదు.

**ఆయం సోఽహమయం నాహమితి క్షీణా వికల్పనాః ।**
**సర్వమాత్మేతి నిశ్చిత్య తూష్ణీ భూతస్య యోగినః ॥ 9**

సర్వము ఆత్మస్వరూపము అని తెలిసి మౌని అయిన యోగిలో అది ఇది నేను నాది అనే భావాలుండవు. సంపూర్ణమైన తత్త్వజ్ఞానం గలవాడు మౌని అనబడతాడు. యోగి అంటే యోగం తెలిసినవాడు. యోగము అంటే మనసులో ఏ రకమైన సంకల్పాలు లేకుండా జీవాత్మని పరమాత్మలో లయం చెయ్యటమే యోగము. ఈ రకంగా బాహ్యాంభ్యంతర వ్యాపారాలు వదలి, ఆత్మయే సర్వస్వము అని దృఢముగా నమ్మిన యోగికి సంకల్పాలన్నీ తమకు తామే క్షీణించి పోతాయి. నేను చేస్తున్నాను. నేను చూస్తున్నాను అనే భావాలు నశించిపోయి ఆత్మేతర వృత్తి శూన్యుడు అంటే ఆత్మకన్న ఇతర వృత్తులు ఏవీ లేవు అని నిశ్చయించిన వాడు తానే పరబ్రహ్మము అవుతాడు.

అనంతమైన ఆత్మమాత్రమే అంతటా అన్నిటి యందు ఉన్నదని, రెండవది ఏదీ లేదని దృఢమైన జ్ఞానం కలిగిన వాని మనసులో ఆలోచనలన్నీ ఆగిపోతాయి. సామాన్యంగా దేహమే నేను. మనస్సే నేను. దేహం నేను కాదు. ఇలాంటి ఆలోచనలుంటాయి. ఇవన్నీ కేవలము ఊహలు. ఆత్మానుభవంలో స్థితుడవటము అంటే ఈ రకమైన ఆలోచనలు ఆగిపోవాలి. అప్పుడు మాత్రమే మనస్సు నిశ్చల మవుతుంది. ఆ స్థితిలో మాత్రమే సాధకుడు తనను తానుగా తెలుసుకుంటాడు.

**న విక్షేపో న చైకాగ్ర్యం నాతిబోధో న మూఢతా ।**
**న సుఖం న చ వా దుఃఖ ముపశాంతస్య యోగినః ॥ 10**

పరమశాంతిని పొందిన యోగిలో భావాల కల్లోలం అనేది ఉండదు. కాబట్టి అతడికి ఇంక మానసిక ఏకాగ్రతఅవసరం లేదు. అతడికి జ్ఞానం పెరిగేది లేదు తగ్గేది  లేదు. అసలు సుఖదుఃఖాలు ఉండవు.

యోగికి సంకల్ప వికల్పాలుండవు. అతడు నిర్వికల్పుడు. కాబట్టి అతడికి యోగసాధన అవసరం లేదు. చిత్తనిరోధము అవసరం లేదు. సమాధిస్థితి అంతకన్న అవసరం లేదు. అతడికి సుఖదుఃఖాలుండవు. అజ్ఞానము ఉండదు.

మనస్సు నేను బుద్ధిని నేను అనే భ్రమ జీవన్ముక్తునికి ఉండదు. అతడు పరమ శాంతంగా ఉంటాడు.

**స్వరాజ్యే భైక్ష్యవృత్తౌ చ లాభాలాభే జనే వనే ।**
**నిర్వికల్ప స్వభావస్య నవి శేషోస్తి యోగినః ॥ 11**

యోగి అన్ని భోగాలు అనుభవించవచ్చు. బిక్షుక వృత్తిలో ఉండవచ్చు. లాభం రావచ్చు, నష్టంరావచ్చు. అతడు అడవిలో ఉండచ్చు, జనం మధ్యన ఉండచ్చు. కోరికల నుండి ముక్తుడైనాడు కాబట్టి సమత్వబుద్ధితో శాంతంగా ఉంటాడు.

సంకల్పశూన్యుడైన యోగికి స్వర్గాధిపత్యమైనా, భిక్షాటనమైనా ఒక్కటే. ఏదైనా ఒక వస్తువు లభించినా లభించకపోయినా ఒకటే. భీకరమైన అరణ్యం మధ్యలో ఉండచ్చు. జనసమూహంలో పెద్ద పట్టణంలో ఉండచ్చు అతని దృష్టిలో అందరూ, అన్ని ప్రదేశాలు, అన్ని వస్తువులు ఒకటే. వీటిమధ్య అతడికి భేదము ఏ మాత్రము ఉండదు.

ఆ స్థితిలో ఉన్న యోగి అన్నింటినీ సమభావంతో చూస్తాడు. స్వర్గభోగాలలో తేలియాడితే ఆనందించడు. భిక్షాటన చేయవలసి వస్తే బాధ పడడు. అతడి దృష్టిలో లాభనష్టాలు, సుఖదుఃఖాలు సమానమే. వీటివల్ల సంతోషము గాని, విచారము గాని ఉండవు. ప్రాపంచిక విషయాలతో అతడికి ఏ మాత్రం సంబంధం ఉండదు. అటువంటి వారు అజ్ఞానులమైన మనతోపాటే ఉంటున్నప్పటికీ వారి హృదయం మాత్రం పరమశాంతంగా ఉంటుంది.

**క్వ ధర్మః క్వ చ వా కామః క్వ చార్థః క్వ వివేకితాః ।**
**ఇదం కృతమిదం నేతి ద్వంద్వైర్ముక్తస్య యోగినః ॥ 12**

యోగీశ్వరుడు ఆచరించవలసినధర్మం ప్రత్యేకంగా ఏమీ లేదు. అతడు చేయవలసినది లేదు. అతడికి ద్వంద్వములు లేవు. కామం అంటే ఏమిటి? వివేకమంటే ఏమిటి? యోగికి ఇవేవీ ఉండవు. ఇది చెయ్యాలి ఇది చెయ్యకూడదు అనేది లేదు. అతడు చేసిందే ధర్మం. చెప్పిందే ధర్మం. అతడికి అవిద్య పూర్తిగా నశించిపోయింది. కాబట్టి ఇంక చతుర్విధ పురుషార్థాలు కూడా ఉండవు.

సాధారణ మానవుడు తమ కోరికలకు అనుగుణంగా బుద్ధి విలువలు మార్చుకుంటారు. కోరికలకు అనువైన వస్తువులు సంపాదిస్తారు. కాని యోగివిషయంలో అలా ఉండదు. ఇతడికి కోరికలే ఉండవు. కావలసిన వస్తువులు అసలే ఉండవు. అటువంటివాడు సర్వకాల సర్వావస్థల యందు పరమ శాంతంగానే ఉంటాడు.

**కృత్యం కిమపి నైవాస్తి న కోపి హృది రంజనా ।**
**యథా జీవన మేవేహ జీవన్ముక్తస్య యోగినః ॥ 13**

జీవన్ముక్తుడైన జ్ఞాని ఆచరించాల్సింది ఏదీలేదు. దేనిమీదా అతనికి యిష్టాయిష్టాలుండవు. ప్రారబ్ధాన్ని బట్టి పనులు జరుగుతూ ఉంటాయి.

అతడికి సంకల్ప వికల్పాలుండవు. చేయవలసిన పని కూడా ఏదీ ఉండదు. అతడు అన్ని పనులు చేసేశాడు. ఇంక చెయ్యవలసినది ఏదీలేదు. దేనిమీదా ప్రేమ, అభిమానం, ఆప్యాయత ఉండవు. రాగద్వేషాలుండవు. అజ్ఞానము మచ్చుకు కూడాఉండదు. మన ఊళ్ళలో ఒక విచిత్రం జరుగుతుంటుంది. రైతు బండి కట్టి

ప్రయాణం చేస్తుంటాడు. త్రోవలో నిద్ర వస్తుంది. నిద్రపోతాడు. ఎడ్లు మాత్రం రైతుతో పని లేకుండా బండి లాగుతూనే ఉంటాయి.అవి అలా వెళ్ళి సరిగ్గా రైతు ఇంటిదగ్గర ఆరుతాయి. అలాగే జీవన్ముక్తుడైన వాడికి కూడా ఏ ప్రయత్నం లేకుండానే ఇంద్రియాల ద్వారా పనులన్నీ జరిగిపోతాయి. అయినప్పటికీ ఇంద్రియాలకు అతనికీ ఏ సంబంధము ఉండదు. ఇంద్రియ వ్యాపారానికి అతడు అతీతుడు. ఆత్మానుభవం పొందిన వాడికి అహంకారం ఉండదు. అతనికి నేను, నాది అనే భావన ఉండదు. ఎప్పుడైతే నేను నాది అనే భావన లేదో, అప్పుడు విషయాల మీద ఆసక్తి ఉండదు. దాంతో వస్తువులు సేకరించాలి. ధనార్జన చెయ్యాలి. దాచుకోవాలి. అనుభవించాలి అనే ఆలోచన ఉండదు. కోరికలు ఉంటేనే వస్తువులను సంపాదిస్తాడు. కోరికలు లేనివాడికి ఇటువంటి భావాలుండవు. అందుచేతనే జ్ఞానికి దేనిమీదా శ్రద్ధ ఉండదు. ఏ పనీ చెయ్యడు.

అజ్ఞానుల దృష్టిలో జ్ఞానికూడా సామాన్యుడు లాగానే కనిపిస్తాడు. మన మధ్యనే తిరుగుతుంటాడు. అయితే జ్ఞాని ఎప్పుడూ తనను తాను ఆత్మగా గుర్తిస్తూనే ఉంటాడు. తన శరీరం అనుభవించే అన్ని అనుభవాలకు అతడే సాక్షి.

**క్వ మోహః క్వ చ వా విశ్వం క్వ తద్ధ్యానం క్వ ముక్తతా ।**
**సర్వసంకల్ప సీమాయం విశ్రాంతస్య మహాత్మనః ॥ 14**

భ్రమ ఎక్కడుంది? మోహం ఎక్కడుంది? జగత్తెక్కడ? దీన్ని త్యజించటం ఏమిటి? కోరికలు జయించి శాంతుడుగా ఉన్న జ్ఞానికి ముక్తి ఎందుకు?

అన్ని ఆలోచనలకు మూలము మనస్సు. ఆ మనస్సు గనక ఆత్మలో లయమై పోతే, అటువంటి యోగికి ఈ ప్రపంచము యొక్క స్థితి, మోహము, ధ్యానము ఏవీ ఉండవు. ముక్తి అని వేరుగా ఏదీ ఉండదు. ఇవి ఏవీ అవసరం లేదు.

ఇక్కడ మనస్సు ఆత్మలో లయమవటము అంటున్నారు. ఈ విషయం ఇప్పటికి చాలాసార్లు చెప్పుకున్నాం. అయితే మనోలయమంటే ఒక్కసారి చూద్దాం.

మనోజయము అంటే మనస్సును జయించటం. దీన్నే మనోనాశనము అని కూడా అంటారు.

'మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః'

బంధ మోక్షాలకు కారణం మనస్సు. **మమ** అనుకుంటే బంధం **'నమమ'** అనుకుంటే మోక్షం. మనసుతోనే సంసారం సృష్టించబడుతున్నది. ఏ పదార్థం మీద మనకు ప్రేమ అభిమానం ఉంటుందో దాని స్వరూపంగానే మనసుంటుంది. ఇది మనసు యొక్క లక్షణం. మోక్షం కావాలి అంటే మనసును అదుపులో పెట్టుకోవాలి. మనసు ఎప్పుడూ అదుపులో ఉండదు. ఒక విషయం మీద నుంచి ఇంకొక విషయం మీదకి దూకుతూ ఉంటుంది. పరుగులు పెడుతుంది. ఇంద్రియాలు మనసు యొక్క అధీనంలో ఉంటాయి. మనసు సక్రమంగా ఉంటే ఇంద్రియాలు సక్రమంగానే ఉంటాయి. మనసు సక్రమంగా ఉండటము అంటే అదుపులో ఉండటం. విషయవాసనల యందు చిక్కకుండా ఉండటం. ఎవరి మనసు విషయ వాసనల యందు చిక్కకుండా ఉంటుందో, అతడు మనసును జయించినట్లే. అజ్ఞానాన్ని వదిలి జగత్తంతా బ్రహ్మమయము అని భావన చేయగలిగినవాడే మనసును జయించినవాడు. మనసును జయించటం తేలిక కాదు అంటారు. ఇది అజ్ఞానులు చెప్పే మాట. ఆత్మజ్ఞానం కల పురుషుడికి మనసును జయించటమనేదికళ్ళుమూసి తెరిచినంత తేలిక. 'సర్వవ్యాపకుడైన బ్రహ్మమును నేనే' అని భావించిన వాడి మనస్సు అతని అదుపులోనే ఉంటుంది. జగత్తంతా పరబ్రహ్మలో కల్పించబడినదే. శబ్దాది విషయాలకు ప్రత్యేకమైన ఉనికి లేదు. అని తెలుసుకోవటమే మనోజయము. చరాచర జగత్తులో వినబడేవి, చూడబడేవి, మనసుతో భావించబడేవి అన్నీ పరబ్రహ్మ స్వరూపమే అని తెలిసిన జ్ఞానిమనసు అదుపులో ఉంటుంది. జీవబ్రహ్మలకు భేదము లేదని తెలిసిన జ్ఞానిమనసు అదుపులో ఉంటుంది.

ఈ రకంగా మనసును లౌకిక విషయాల యందు లగ్నం కానీకుండా కట్టడి చేసి జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే అని భావన చేయగలిగినవాడే మనసును జయించిన వాడు. **మోక్షం కావాలంటే మనోనాశనము జరిగి తీరాలి.**

**యేన విశ్వమిదం దృష్టం స నాస్తీతి కరోతు వై ।**
**నిర్వాసనః కిం కురుతే పశ్యన్నపి న పశ్యతి ॥ 15**

కోరికలతో నిండిన వ్యక్తి ప్రపంచాన్ని చూస్తున్నప్పుడు, ఆ ప్రపంచాన్ని మార్చాలని, లేదా తాను మారాలని అనుకుంటాడు. కోరికలు లేని జ్ఞానికి ఏ భావాలు

ఉండవు. అతడు ఉన్నా లేనట్లే. అజ్ఞాని ఈ జగత్తును చూసినప్పుడు తనకు చేతనైనంత వరకు ఈ జగత్తును మార్చాలని అనుకుంటాడు. ఉదాహరణకి కొంతమంది వ్యక్తుల సమూహం ఒక విహార యాత్రకు వెళ్ళింది. అక్కడ వాళ్ళకి ఖాళీగా ఉన్న నాలుగు ఎకరాల భూమి కనిపించింది. ఆ ప్రదేశమంతా చూడటానికి చాలా ఆహ్లాదకరంగా ఉంది. యాత్రకు వచ్చిన వారిలో ఒక బిల్డరు ఉన్నాడు. ఇళ్ళు కట్టి అమ్ముతుంటాడు. అతడికి ఈ ఖాళీ స్థలం చూడగానే ఇందులో మంచి అపార్టుమెంటు కట్టవచ్చు అని ఆలోచిస్తాడు. అదే ఒక రైతు మంచి పొలంగా ఉపయోగించవచ్చు. మంచి పూలతోట పెంచవచ్చు. ఇలాంటి భావనలు కలుగుతాయి. అయితే ఇవన్నీ అజ్ఞానికే కలుగుతాయి. జ్ఞానికి ఏ రకమైన భావనా ఉండదు. యోగి వాసనాశూన్యుడు. కాబట్టి అతడికి ఏ భావాలు ఉండవు.

విచిత్ర ఏమంటే మనలో ఉండే అహంకారమే శరీరము, మనస్సు బుద్ధులతో తాదాత్మ్యం చెంది, వస్తువులను గుర్తిస్తుంది. మానసిక ఉద్రేకాలు, కోరికలు కలుగచేస్తుంది. అహంకారము ఉన్నంతసేపు మనోబుద్ధులచే గుర్తింపబడే నామరూపాత్మకమైన జగత్తు కంటికి కనిపిస్తూనే ఉంటుంది. భ్రమకు లోనై ఉన్నంతసేపు రజ్జువులో సర్పము, స్తంభంలో భూతము కనిపిస్తూనే ఉంటాయి. కాని రజ్జువు గాని స్తంభం గాని కనిపించవు. ఇది భూతం కాదు స్తంభము అని నిశ్చయమైన దృష్టితో చూసేవాడు జ్ఞాని. అతడికి ఏ మాత్రము భ్రమ ఉండదు. అతడికి ఏ కోరికా ఉండదు. కోరికలు లేని జ్ఞానికి ఏ భావము ఉండదు. అతడు చూస్తున్నా చూడనట్లే వింటున్నా విననట్లే.

**యేన దృష్టం పరం బ్రహ్మ సోహం బ్రహ్మేతి చింతయేత్ ।**
**కిం చింతయతి నిశ్చింతో ద్వితీయం యోన పశ్యతి ॥ 16**

పరబ్రహ్మ స్వరూపాన్ని దర్శించిన వాడు 'నేనే పరబ్రహ్మను' అని ప్రతిదినము ధ్యానం చేస్తాడు. అయితే ఆత్మలో స్థితుడైన వాడు దేన్ని ధ్యానం చేస్తాడు? ఎందుకు ధ్యానం చేస్తాడు?

ముముక్షువు. అంటే ఇతడు ముక్తి మార్గంలో నడుస్తున్నాడు గమ్యం చేరుకోలేదు. ఇప్పుడు ఇంతవరకు చేసిన ధ్యానము ఫలితంగా తానే పరబ్రహ్మ అనే విషయం తెలుస్తుంది. అందుకని 'నేనే పరబ్రహ్మను' అని ప్రతినిత్యం ధ్యానం చేస్తుంటాడు.

కాని ముక్తి మార్గంలో పయనించి గమ్యస్థానం చేరుకున్నాడు. నేను తప్ప జగత్తులో ఇంకేది లేదు అని తెలుసుకున్నాడు. ఆత్మయందు స్థితుడైనాడు. నిరంతరము తన ఆత్మతోనే క్రీడిస్తున్నాడు. అలాంటి వాడికి ఇంకా ధ్యానం ఏమిటి? దేన్ని ధ్యానం చెయ్యాలి? అద్వితీయానుభవము పొందిన వాడికి ఇంక భావనలు, చింతనలు ఉండవు. ఇటువంటి జ్ఞానిని **బ్రహ్మవిద్వరిష్ఠుడు** అంటారు. ఇతడు జ్ఞానభూమికలలో ఏడవదయిన 'తుర్యగ'లో ఉంటాడు. ఇతడు ఎల్లవేళల యందు తురీయస్థితిలోనే ఉంటాడు. ఇతడు విదేహముక్తుడు. అన్నపానాలు తీసుకోడు. బలవంతంగా తినిపించాలి. ఇతడు లోకానికి ఏమీ చేయడు. ఒంటి మీద స్పృహ కూడా ఉండదు. పూర్తిగా అవధూత.

ఇక్కడ ఒక చిన్న విషయం చూడండి. రాత్రిపూట పడుకున్నాం. నిద్ర పట్టలేదు. అటూ ఇటూ దొర్లాం. లాభం లేదు. లేచి అటు ఇటు తిరిగాం. కాస్సేపు టి.వి చూశాం. ఇష్టమైన ప్రవచనాలు విన్నాం. ఇలా నిద్రపట్టేదాకా ఏదో పని చేస్తాం. నిద్ర పోయేందుకు ప్రయత్నం చేస్తాం. నిద్ర పట్టిన తరువాత ఇంకా నిద్రకోసం ప్రయత్నం ఎందుకు? అలాగే పూర్తిగా ఆత్మస్థితుడు కానివాడు ధ్యానాదులు చేస్తాడు. అంతే గాని మహాజ్ఞాని, ఆత్మారాముడికి ఆ అవసరం లేదు.

**దృష్టోయేనాత్మ విక్షేపో నిరోధం కురుతేత్వసౌ ।**
**ఉదారస్తున నిక్షిప్తః సాధ్యాభావాత్కరోతికిం ॥** **17**

కోరికలతో గనక మనసును చలింపచేసి అశాంతిగా ఉంటే అప్పుడు కోరికలు నిరోధించి మనసును శాంతింప చెయ్యాలి. కాని కోరికలే లేనివాడు చేసేది ఏముంది? మనిషికి వచ్చే ఆలోచనలు, కోరికలు అన్నీ భ్రమవల్ల వచ్చేవి. ఈ విషయం తెలిసిన మహాజ్ఞాని తన చిత్తాన్ని కోరికల మీదికి ప్రసరింపనీయడు. జ్ఞానికి మనోభావాలు ఉండవు. కోరికలుండవు. అతని దృష్టిలో ఆత్మ తప్ప ఇంకొకటి లేదు. కాబట్టి అతనికి మనోచలనమే ఉండదు. మనోచలనం లేనివాడికి మనసు చలించకుండా ఉండే సమాధి ఎందుకు? ఇవేవీ అవసరం లేదు.

జరిగేదేమంటే, ఉన్నటువంటి సత్యాన్ని సరిగా చూడలేని మనస్సు ఊహలలో విహరిస్తూ కల్పనలు చేస్తుంది. సత్యాన్ని గ్రహించలేదు అంటే అజ్ఞానమే దానికి

కారణము. ఆత్మ విషయంలో అజ్ఞానమే అహంకారానికి, అహంకారం చూసే జగత్తుకు కూడా కారణమవుతోంది. ఈ అహంకారం జగత్తును చూస్తూ, విషయాల వైపు, సుఖాల వైపు ఆకర్షింపబడుతుంది. ఆత్మని పొందాలి అనుకునే వాడు బాహ్య విషయాలు నిరోధించి, మనస్సును కట్టడి చేసి ధ్యానం చెయ్యాలి. పరిపూర్ణమైన జ్ఞానం కోసం ప్రయత్నించాలి. అది సాధకుడు చేయవలసిన పని. కాని ఇక్కడ ఇతడు సాధకుడు కాదు జ్ఞాని. పరిపూర్ణమైన జ్ఞాని నిరంతరము తన ఆత్మయందే రమించే ఆత్మారాముడు. అటువంటి మహాత్ముడికి చెయ్యవలసినది ఏముంటుంది?

**ధీరోలోక విపర్యస్తో వర్తమానోపి లోకవత్ ।**

**న సమాధిం న విక్షేపం న లేపం స్వస్యపశ్యతి ॥ 18**

ఆత్మనిష్ఠుడైన వాడు సామాన్యుడిలా కనిపించినప్పటికీ అతడు సామాన్యుడు కాదు. అతడి మనస్సు వికారాలు పొందదు. విషయముల యందు లగ్నం కాదు. సమాధి స్థితి అవసరం లేదు.

ఎప్పుడూ చిద్రూపుడై అద్వితీయమైన ఆత్మయందు స్థితుడైన యోగికి పరమాత్మ యందు కూడా లక్ష్యముండదు. అతడికి లౌకిక వాసనలుండవు. ప్రారబ్ధవశాన వచ్చిన కర్మలు నిర్వహిస్తున్నప్పటికీ వాటి స్ఫురణ ఏ మాత్రము ఉండదు. అటువంటి జ్ఞానికి మనోచాంచల్యము, సమాధి ఉండవు. ఆత్మస్థితుడైన యోగి. 'అహం బ్రహ్మాస్మి' నేనే పరబ్రహ్మను అనే భావం నిశ్చయంగా గలవాడు, సంపూర్ణమైన జ్ఞానం కలవాడు, నిరంతరము తన ఆత్మలోనే రమించే ఆత్మారాముడు, తుర్యగ అనే జ్ఞాన భూమికలో ఉన్నవాడు అతని దృష్టిలో తానే పరబ్రహ్మ. తనకన్న వేరైనది జగత్తులో ఏదీలేదు. కాబట్టి ఇంకా పరమాత్మ ఎవరు? ఆ పరమాత్మ వేరుగా ఎక్కడున్నాడు? ఎక్కడా లేడు. కాబట్టి అతడికి పరమాత్మ యందు కూడా స్ఫురణ ఉండదు. కారణం అతడు చిద్రూపుడు. ఎల్లప్పుడు ఆత్మయందే ఉంటాడు.

ఇతడు కర్మలు చెయ్యడు. ఒకవేళ చేసినా నిష్కామ్యంగా చేస్తాడు. ఏ రకమైన కోరికలు ఉండవు. అతడు చేసే పనులలో స్వార్థం ఉండదు. ఏ కర్మా తనకోసం చేసుకోడు. కాబట్టి అతడికి కర్మఫలం అంటదు. దేశం కోసం, ప్రజల కోసం చేస్తాడు. దేశము అన్నా ప్రజలు అన్నా రెండూ ఒకటే. లేదా 'పరమేశ్వర ముద్దిస్య, పరమేశ్వర ప్రీత్యర్థం' కర్మ చేస్తాడు. ఇందులో అతని స్వార్థం అణుమాత్రం కూడా ఉండదు.

**భావాభావ విహీనో యస్తృప్తో నిర్వాసనో బుధః ।**
**నైవ కించిత్కృతంతేన లోకదృష్ట్యా వికుర్వతా ॥** **19**

భావాభావ రూపమయిన సృష్టిని, దానికి విరుద్ధమైన అభావాన్ని భావించకుండా నిత్యతృప్తుడు, వాసనారహితుడు అయిన జ్ఞాని ఎన్ని కర్మలు చేస్తున్నట్లు కనిపించినా అతడు ఏదీ చెయ్యటం లేదు.

సచ్చిదానంద స్వరూపుడై ఏ విధమైన ఆలోచనలు, కోరికలు లేకుండా, ఇంద్రియాలను నశింపచేసి అంటే ఇంద్రియాలను అదుపులో పెట్టి, ఇంద్రియాలను జయించిన జ్ఞానికి కర్తృత్వ భావన ఉండదు. కాబట్టి అందరి దృష్టిలోను అతడు కర్మలు చేస్తున్నా చెయ్యనట్లే లెక్క. కర్మలమీద అతనికి ధ్యాస ఉండదు. కర్తృత్వ భోక్తృత్వాలు ఉండవు.

జీవన్ముక్తుడైన వాడు క్షణం తీరిక లేకుండా నిష్కామ్యంగా కర్మల నాచరించ వచ్చు. నారదుడు నిత్యముక్తుడు. కాని అతడు ఎల్లవేళల యందు హరినామస్మరణ చేస్తూ ముల్లోకాలు తిరుగుతుంటాడు. ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. నారదుడు ముక్తుడైనప్పుడు హరినామ స్మరణ ఎందుకు? అని ఇక్కడ హరి అంటే శ్రీమన్నారాయణుడు. వైష్ణవంలో అతడు సాకార బ్రహ్మము. అంటే అతడే పరబ్రహ్మ. అతడికి రూపం ఉంది కాబట్టి హరి అని నామం కూడా ఉంది.ఆ నామాన్ని నారదుడు ఎందుకు ఎల్లవేళలా జపిస్తాడు? అంటే జ్ఞానులు తాము జ్ఞానులయి కూడా అజ్ఞానులతో కలిసినప్పుడు కర్మ చెయ్యాలి. అందుకే హరినామ స్మరణ నిరంతరము చేస్తాడు నారదుడు. అతణ్ణి చూసి మనబోటి వారు కూడా అలా చేస్తారని నమ్మకం. నారదుడు దేవతలు, రాక్షసులు, మానవులు అందరి దగ్గరకు పోతూనే ఉంటాడు. వాళ్ళకి నచ్చే విషయాలు, నచ్చని విషయాలు అన్నీ చెబుతుంటాడు. వారితో చేయకూడని పనులు చేయించి, కష్టాలపాలు చేసి వారికి ఆత్మజ్ఞానం కలిగిస్తాడు. కాబట్టి జ్ఞాని కర్మలు చేసినా వాటివల్ల అతనికి లాభనష్టాలుండవు. సమాజం కోసం ఈ కర్మలు చేస్తాడు. అంతే అతడు ఈ పనులు చేసినా నిజానికి ఏ పనీ చెయ్యనట్లే లెక్క. అతడు కర్మలను బావాభావ విహీనుడై చేస్తాడు. అందుచేత అతడు ఆ కర్మలు చెయ్యనట్లే లెక్క.

**ప్రవృత్తౌ వా నివృత్తౌ వా నైవ ధీరస్య దుర్గ్రహః ।**

**యదాయత్కర్తుమాయాతి తత్కృత్వా తిష్ఠతస్సుఖమ్ ॥** 20

ప్రాప్తించి కర్మలను సంతోషంగా నిర్వర్తించే జ్ఞాని, కర్మలు చెయ్యటంలో గాని, మానటంలో గాని సుఖదుఃఖాలు పొందదు. జ్ఞాని ఆత్మ స్వరూపుడు. ప్రారబ్ధవశాన కర్మలు మాత్రం జీవించి ఉన్నంత వరకు చెయ్యవలసిందే. ప్రారబ్ధం గనక అయిపోతే ఆయుష్య ఉన్నంత వరకు జీవించి విదేహ ముక్తుడవుతాడు. అతడి కర్మలు చేస్తున్నప్పుడు 'నేను కర్మ చేస్తున్నాను' అనే కర్తృత్వ ధ్యాస ఉండదు. ఏ పని చేసినా సరే అప్రయత్నంగానే ఆ పని చేస్తాడు. ఆ పనియందు ఏ రకమైన స్పృహ ఉండదు. కర్మలు చేస్తున్నప్పటికీ యోగి సచ్చిదానంద స్వరూపుడై ఉంటాడు. ఇతడు కర్మలు చేసినా చేస్తున్నా కర్తృత్వభావము ఉండదు కాబట్టి ఆ కర్మలు అతడు చెయ్యనివే అవుతాయి.

ఈ కర్మలు చేస్తే అతడికి కొత్తగా వచ్చే లాభనష్టాలు ఏవీ ఉండవు. ఉత్తమమైన కర్మ యోగికి ఉదాహరణ శ్రీకృష్ణపరమాత్ముడు. **భగవద్గీత**లో పరమాత్ముడు అర్జునుడితో అంటాడు.

**నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషులోకేషు కించన**

**నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి ॥**

ఓ అర్జునా ! ముల్లోకాలలోను నాకు కర్తవ్యము అనేదే లేదు. పొందదగిన వస్తువులలో పొందనిది ఏదీ లేదు. అయినను నేను కర్మల యందే ప్రవర్తిల్లుతున్నాను.

భగవంతుడికి ఏ కర్తవ్యము లేదు. ఆయన పొందవలసినది అంతకన్న లేదు. అయినప్పటికీ లోకం కోసం కర్మలు చెయ్యటమందే నిమగ్నమై ఉంటాడు. కర్మత్యాగం మాత్రం చెయ్యడు. కాబట్టి ఇక్కడ విషయం ఏమంటే ఎవరైనా సరే నాకు దాంతో పనిలేదు. నాకు అది అవసరం లేదు. కాబట్టి నేను కర్మలు చెయ్యను అనరాదు. పరమపదం పొందినవాడు కూడా కర్మ చెయ్యవలసిన అవసరం లేదని భావించి కర్మలు చెయ్యటం మానరాదు. లోకహితం కోసం కర్మలు చేస్తూనే ఉండాలి.

అందుకే జ్ఞాని కర్మలు చెయ్యటంలో గాని, మానటంలో గాని సుఖదుఃఖాలు పొందదు. నిత్యతృప్తుడై సుఖంగా ఉంటాడు.

**నిర్వాసనో నిరాలంబః స్వచ్ఛందో ముక్తబంధనః ।**
**క్షిప్త స్సంస్కారవాతేన చేష్టతే శుష్క పర్ణవత్ ॥ 21**

సంస్కారాలు అనబడే వాయువులు వీచటం వల్ల ఎగిరిపోయే ఎండుటాకుల లాగా జీవన్ముక్తుని యాత్ర సాగిపోతూ ఉంటుంది. అతడు కోరికల రూపంలో ఏ బంధము లేకుండా హాయిగా జీవిస్తాడు. సంకల్ప వికల్పాలు లేనివాడు, వాసనాశూన్యుడు, రాగద్వేషాలు లేనివాడు, బంధాలకు కట్టుబడని వాడు అయిన జ్ఞాని ప్రారబ్ధ కర్మలకు కట్టుబడి చలింపకుండా ఉంటాడు. కర్మానుభవము అతణ్ణి ఏ మాత్రము బంధింపదు. గతజన్మ వాసనలు అనుభవించకపోతే నశించవు. ప్రారబ్ధకర్మ ఎక్కుపెట్టి వదిలిన బాణం వంటిది. దాన్ని ఆపటం ఎవరితరం కాదు. కాబట్టి ప్రారబ్ధం అనుభవించి తీరాల్సిందే. కాబట్టి రాగద్వేషాలకు లోనుగాకుండా నిర్లిప్తుడై కర్మానుభవాన్ని సాక్షిమాత్రుడిగా ఉండి గమనిస్తుంటాడు.

నేనే ఆత్మస్వరూపాన్ని, సర్వవ్యాపిని అని గుర్తించిన మహాజ్ఞానికి ఈ శరీరం మీద మమకారం ఉండదు. శరీరాన్ని శవంలాగా చూస్తాడు. ఎండిపోయిన ఆకు చెట్టు నుంచి ఊడి క్రిందపడి గాలి వాలుకు కొట్టుకుపోతుంటుంది. అలాగే జ్ఞాని కూడా బంధాల నుంచి బయటపడి, ప్రారబ్ధం ప్రకారం మిగిలి ఉన్న సంస్కారాల కనుగుణంగా కర్మలు చేస్తుంటాడు. ఇలా కర్మలు చెయ్యటం వల్ల అతడికి క్రొత్తవాసన లేవీ ఏర్పడవు. అతని దేహం కాని, మనస్సు కాని సంసారము అనే వృక్షం నుంచి రాలిపోయిన ఎండుటాకులే. అందుకే జ్ఞాని కోరికల రూపమయిన బంధం లేకుండా స్వతంత్రంగా జీవిస్తాడు.

**అసంసారస్య తు క్వాపి న హర్షో నవిషాదతా ।**
**స శీతల మనా నిత్యం విదేహ యివ రాజతే ॥ 22**

ప్రాపంచిక అనుభవాలను అనుభవించిన స్థితిలో జీవించే వాడికి సుఖ దుఃఖాలుండవు. పరిపూర్ణమైన శాంతమైన మనస్సుతో దేహం లేనివాడిలాగా జీవిస్తాడు.

సంసారిక వ్యవహారాలకు దూరమైన వాడు అసంసారి. సంసారం లేనివాడు అవుతాడు. సంసారానికి అతడికి సంబంధం ఉండదు. అటువంటి అసంసారి

చిద్రూపుడు. అతడికి ఏ రకమైన సుఖదుఃఖాలు ఉండవు. కాబట్టి అటువంటి జ్ఞాని శాంతచిత్తుడై షడూర్మిలు లేని శివస్వరూపుడై విలసిల్లుతాడు. షడూర్మిలు అంటే ఇవి మూడు జట్లుగా ఉంటాయి. 1.మనోధర్మాలు 2.దేహధర్మాలు 3.ప్రాణధర్మాలు. ఇవి ఒకొక్కటి రెండుగా ఉంటాయి.

**1.మనోధర్మాలు :** ఇవి రెండు రకాలు 1.శోకము 2.మోహము

**2.దేహధర్మాలు :** ఇవి రెండు రకాలు 1.జర 2.మరణము

**3.ప్రాణధర్మాలు :** ఇవి రెండు రకాలు 1.ఆకలి 2. దప్పిక

మొత్తం ఈ ఆరింటినీ కలిపి షడూర్మిలు అంటారు. ఇవి పరమేశ్వరుడికి ఉండవు.

అహంకారాన్ని గనక వదలిపెడితే మస్సు, శరీరాలతో తాదాత్మ్యత వదిలి పోతుంది. అంతరిస్తుంది. సుఖదుసఖాలు మనోధర్మాలు. మనోభావాలు అవి మనసులోనే అనుభవింపబడతాయి. మన కోరికలు తీరని సమయంలో, ఇవి మనసుని వశపరచుకుని అలజడి సృష్టిస్తాయి. జీవన్ముక్తుడికి అహంకారం గనక నశించిపోతే, కోరికలుండవు. అతని మనస్సు సదా శాంతంగా ఉంటుంది.

**కుత్రాపి న జీహాసాస్తి అశావాపి న కుత్రచిత్ ।**
**ఆత్మారామస్య ధీరస్య శీతలాచ్ఛతరాత్మనః ॥ 23**

పవిత్రము శాంతము అయిన మనస్సుతో సర్వకాల సర్వావస్థల యందు ఆత్మస్థితుడైన యోగి దేనినీ త్యజించాలనుకోడు. ఏది జరిగినా విచారించడు. సచ్చిదానంద రూపుడై చలించని చిత్తము గలవాడు మహాజ్ఞాని. అటువంటి వాడు నిర్మలమైన మనస్సు గలవాడు కావటంచేత **శీతలాచ్ఛతురాత్మనః** చల్లనైన మిక్కిలి నిర్మలమైన మనస్సు గలవాడు. శాంత స్వభావుడు. అటువంటి జ్ఞానికి రాగద్వేషాలు ఉండవు కాబట్టి **జిహాసా** అంటే త్యాగబుద్ధి కూడా లేదు. అంటే దేహంమీద గాని, ఇంద్రియాల మీద గాని అభిమానము గాని, దేహేంద్రియాలు నాశనమవుతాయనే భయం గాని కలగవు. అసలు అన్ని అనర్ధాలకు హేతువు అజ్ఞానము. ఆ అజ్ఞానమే లేనందున సచ్చిదానందరూపుడై విలసిల్లుతాడు.

మనస్సు జయిస్తేనే ఆత్మానుభవం కలుగుతుంది. మనిషిలోని ఆలోచనలే మనసుగా పరిణమిస్తాయి. ఈ పరిణామానికి కారణం మనస్సు, అహంకారము, కోరికలు నశిస్తేనే మనస్సు నశిస్తుంది. ఎప్పుడైతే మనసు అచేతనమయిందో అప్పుడు భ్రమలన్నీ నాశనమవుతాయి. అప్పుడు కేవలము ఆత్మ మాత్రమే ఉంటుంది. ఆత్మానందాన్ని అనుభవించే యోగిలో ఏ విధమైన కోరికలు ఉండవు. ఇది కావాలని, ఇది వద్దని అనుకోడు. అసలు అతనికి జగత్తే కనిపించదు. పరమపవిత్రమైన శాంతితో నిండిన అంతరంగంతో అతడు జీవిస్తాడు.

**ప్రకృత్యా శూన్య చిత్తస్య కుర్వతోఽస్య యదృచ్ఛయా ।**
**ప్రాకృతస్యేవ ధీరస్య న మానో నావమానతా ॥ 24**

జ్ఞానిది స్వభావతః శూన్యమైన మనస్సు. అతడు ప్రారబ్ధానుసారంగా సంభవించే సంఘటనలను సాక్షిమాత్రంగా చూస్తూ, సామాన్యుడిలా కాక మానావమానాలకు, సుఖదుఃఖాలకు లోను కాడు. శాంతంగా జీవిస్తాడు.

జ్ఞానికి స్వభావతః చిత్తవికారములు ఉండవు. ఆత్మారాముడైన జ్ఞాని ప్రారబ్ధవశాన వచ్చే కర్మలన్నీ చేసినా, అతని మనసులో మానావమానాలకు తావుండదు.

జీవన్ముక్తుడైన జ్ఞాని సహజంగా కోరికల నుంచి బయట పడతాడు. ఆలోచనలు ఉండవు. పరమశాంతంగా ఉంటాడు. మానసిక సంఘటనలు ఏవీ అతని మనశ్శాంతిని భంగపరచలేవు. ప్రారబ్ధవశాన జరిగే పనులన్నింటినీ సాక్షిగా చూస్తుంటాడు. సామాన్య మానవుడి లాగా జీవిస్తున్నట్లు కనిపిస్తున్నా మానావమానాలను సమానంగా చూస్తాడు. పరమశాంతితో ఉంటాడు.

**కృతం దేహే న కర్మేదం న మయా శుద్ధరూపిణా ।**
**ఇతి చింతానురోధీ యః కుర్వన్నపి కరోతి న ॥ 25**

చైతన్యరూపమైనది ఆత్మ. తన దేహం సంస్కారాల వల్ల నడుస్తున్నది. తాను ఏమీ చెయ్యటం లేదు అని తెలుసుకున్నజ్ఞాని కర్మలు చేస్తున్నా చెయ్యనట్లే లెక్క.

ఇంద్రియాలతో కూడిన శరీరం చేసే పనులయందు కర్తృత్వభావము ఏ మాత్రము లేకుండా, సాక్షిగా ఉండి, నిరంతరము చిద్రూపుడుగా ఉన్న జ్ఞాని ఏ పని

చేస్తున్నా చెయ్యనివాడే అని లెక్క. కర్మ చెయ్యటం అంటే కేవలము ఇంద్రియాలను కదలించటము కాదు. సంస్కారానుసారము కేవలము శరీరావయాల కదలికతో పాటుగా కర్మను చేసే బుద్ధి అహంకారము ఉంటేనే కర్మ జరుగుతుంది. మంచి నిద్రలో ఉన్న గురువును కాలితో తన్నినా అది నీ కర్మ అని గుర్తించబడదు. ఏదైనా ఒకపని చిన్న పిల్లలు చేస్తే ఆ పనికి వారే కర్త అని దూషించబడరు. జరిగిన పనికి చిన్నపిల్లల వెనక వారి సంస్కారం ఫలితంగా చేసే పనులకు వారిని కర్తగా గుర్తించరు.

**అతద్వాదీవ కురుతే న భవేదపి బాలిశః ।**
**జీవన్ముక్తస్సుఖీ శ్రీమాన్ సంసరన్నపి శోభతే ॥ 26**

జీవన్ముక్తుడు అనేక పనులు చెయ్యవచ్చు. కాని తాను చేసే ఏ పనికీ ఏ కారణాన్నీ చూపలేడు. అతడు ఉన్మాది లేదా తెలివితక్కువ వాడు కాదు. లౌకికమైన ప్రపంచంలో జీవిస్తున్నా పవిత్రాంతరంగంతో నిత్యానందంతో జీవిస్తుంటాడు.

జ్ఞాని ఈ పని చేస్తున్నాను. ఈ పని చెయ్యటం లేదు అని భావించడు. ఈ పని ఈ కారణం వల్ల చేస్తున్నాను. దీనికి ఫలితం ఇది అని కూడా లెక్క కట్టడు. ఏ కోరిక లేకుండానే ఏ పని అయినా చేస్తాడు. ఇవన్నీ కూడా ప్రారబ్ధం ప్రకారం జరుగుతాయి. అతని మనసు మహానిర్మలంగా ఉంటుంది. అతడు ఉన్మాది కాడు. అలా అని మూర్ఖుడు అంతకన్నా కాదు. అటువంటి జ్ఞాని సంసారంలో ఉన్నప్పటికీ బురదలో ఉండే కుమ్మరి పురుగులాగా ఉంటాడు. కుమ్మరి పురుగు బురదలోనే తిరుగుతుంది. కాని దానికి ఏ మాత్రము బురద అంటదు. తామరాకు మీద నీరు పడుతుంది. అది ఆకుకు ఏ మాత్రము అంటదు. అలాగే జ్ఞాని సంసారంలో ఉన్నా సంసార బంధాలు, అజ్ఞానము అనేవి ఏవీ అతనికి అంటవు. అతడు ఎల్లప్పుడు ఆత్మ సుఖంతోనే జీవిస్తాడు. తెలివిగలవాడు ఏ పనిచేసినా పక్కా ప్రణాళిక ద్వారా చేస్తాడు. జ్ఞాని చేసే కర్మలకు ఆలోచనా కారణం ఉండవు. అంతమాత్రంచేత అతడు తెలివి లేనివాడు, మూర్ఖుడు కాదు. పిచ్చివాడిలా కనిపిస్తాడు అందుచేత ఉన్మాది అనటానికి లేదు. తాను చేస్తున్న పని ఎందుకు చేస్తున్నాడో, ఏ ఉద్దేశ్యంతో చేస్తున్నాడో స్పష్టంగా తెలియని వాణ్ణి **అతద్వాది** అంటారు.

జీవన్ముక్తుడు కర్మలు చేస్తాడు. కాని అది స్వార్థంతో కాదు. ప్రారబ్ధాన్ననుసరించి చేస్తాడు. ఆ కర్మలన్నీ నిష్కామ్యంగా లోకోపకారకంగా ఉంటాయి. పూర్వకాలంలో

మహర్షులు యజ్ఞాలు చేసేవారు. వీటికి కావలసిన సంబారాలు, రక్షణ బాధ్యత రాజే వహించేవాడు. దీనికి కారణం ఆ యజ్ఞం చెయ్యటంలో ఋషిస్వార్థం ఏ మాత్రము ఉండదు. ఫలితం రాజుకి, దేశానికి. ఈ రకంగా జ్ఞాని అయినవాడు నిష్కామ్యకర్మలే చేస్తాడు. సంవర్తుడు, దత్తాత్రేయుడు వంటి అవధూతలు పిచ్చివాళ్ళలా ఉన్మాదులులా ఉంటారు.

**నానావిచార సుశ్రాంతో ధీరో విశ్రాంతి మాగతః ।**
**న కల్పతే న జానాతి న శృణోతి న పశ్యతి ॥ 27**

మనోబుద్ధులతో తాదాత్మ్యం పొందకుండా, తనలోని భావాలను సాక్షిగా చూస్తూ, శాంతంగా జీవించే జ్ఞాని దేన్ని గురించీ ఆలోచించడు. దేన్నీ చూడడు, వినడు మాట్లాడడు.

ఇంతవరకు ఎన్నో కర్మలు చేశాడు. ఆలోచనలు చేశాడు. బాగా అలిసిపోయాడు. ఇప్పుడు అవన్నీ వదిలేసి తన ఆత్మయందే సుఖంగా ఉన్నాడు. మానసిక వికారాలు ఏవీ లేవు. కర్తృత్వాభిమానం కూడా లేదు. ఇంద్రియాలను బుద్ధిని గురించిన ఆలోచన ఉండదు. దేహంమీద అభిమానం ఉండదు. అతడికి అహంకారం ఉండదు. దాంతో తాను కర్తనని గాని భోక్తనని కాని భావించడు. దేన్ని గురించీ ఆలోచించడు. మాట్లాడడు. కనడు, వినడు, చూడడు, అసలు ఈ జగత్తుతో అతడికి ఏ పనీ ఉండదు. ఏ రకమైన సంబంధము ఉండదు.

నేను చేస్తున్నాను నేను చూస్తున్నాను అని భావించటానికి కారణం అహంకారం. ఇప్పుడు అహంకారం అంతరించింది. కాబట్టి ఆత్మస్వరూపంగా పరమశాంతిలో ఆనందరూపుడై ఉంటాడు.

**అసమాధే రవిక్షేపాన్న ముముక్షుర్న చేతరః ।**
**నిశ్చిత్య కల్పితం పశ్యన్బ్రహ్మైవాస్తే మహాశయః ॥ 28**

మనసులో భావనారూపమైన కల్లోలాలు ఏ మాత్రము ఉండవు. దాంతో జ్ఞానికి ధ్యానంతో పనిలేదు. ఇతడికి బంధాలు లేవు కాబట్టి ముక్తిని కోరడు. ఈ జగత్తంతా తనలోని కదలికలే అని భావిస్తాడు. అటువంటి జ్ఞాని సర్వదా పరబ్రహ్మమే.

జ్ఞాని అన్ని బంధాల నుంచి విడిపడ్డాడు కాబట్టి అతడికి సంకల్ప వికల్పాలుండవు. వికారాలు అసలే ఉండవు. కర్తృత్వం ఉండదు. కాబట్టి బుద్ధి ఇంద్రియాల వ్యాపకం ఉండదు.

అతడి మనసులో కల్లోలాలుండవు. కాబట్టి ధ్యానంతో పనిలేదు. 'ధ్యానం' అంటే ఏమిటి.

యోగసాధనలో అష్టాంగాలు చెప్పాడు పతంజలి మహర్షి. ఇవన్నీ ఉపనిషత్తులలో చెప్పినవే. **మండల బ్రాహ్మణ, దర్శన, శాండిల్యోపనిషత్తు**లలో అష్టాంగ యోన్ని వివరించగా **యోగచూడామణి** ఉపనిషత్తు షష్టాంగ యోగాన్ని చెబుతోంది. **షష్టాంగ యోగంలో**

1. ఆసనము 2. ప్రాణ సంరోధము 3. ప్రత్యాహారము 4. ధారణ 5. ధ్యానము 6. సమాధి అనేవి ఆరు అంగాలు.

**అష్టాంగ యోగంలో**

**యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధి యోష్టాంగాని.**

మొత్తం ఎనిమిది అంగాలున్నాయి. అవి

1. యమము 2. నియమము 3. ఆసనము 4. ప్రాణాయామము 5.ప్రత్యాహారము 6. ధారణ 7. ధ్యానము 8. సమాధి

వీటిలో మొదటి ఐదింటినీ **యమాది పంచకము** అంటారు. మిగిలిన మూడింటినీ **'సంయమము'** అంటారు. యోగానికి కావలసింది చివరి మూడు అంగాలే. **ధ్యానము** యోగానికి చాలా ప్రధానమైనది. ఏ ప్రదేశంలో చిత్తాన్ని లగ్నం చేశామో, దానియందే జ్ఞానవృత్తి అఖండ ధారావాహిక రూపంలో సాగినప్పుడు దాన్ని ధ్యానము అంటారు. మనసును ఇతర విషయాలమీదకి పోకుండా జ్ఞానవృత్తి మన ధ్యేయం వైపుకు తైలధారగా సాగటాన్నే ధ్యానము అంటారు. మనసును ఏకాగ్రం చేసి ధ్యేయంమీదనే ఉంచటము.

జ్ఞానికి మానసిక కల్లోలాలు లేవు. మనసు నిశ్చలంగా ఉంది. కాబట్టి ఇక ధ్యానంతో పనిలేదు. అతడికి బంధాలు లేవు. కాబట్టి లేని బంధాల నుండి విడివడటం ఉండదు. ముక్తిని కోరడు. ఎందుకంటే నిత్యముక్తుడు అతడు సదా పరబ్రహ్మమే.

జ్ఞాని మోక్షాసక్తుడు కాదు. విషయ భ్రమలు లేనివాడు. కాబట్టి ఇంకా జ్ఞానం కావాలని ధ్యానము, సమాధులు ఆచరించడు. ఆత్మ తప్ప మిగిలినవన్నీ కల్పితాలనే విషయం తెలుసు. కాబట్టి చిద్రూపుడైన జ్ఞాని బ్రహ్మమై విలసిల్లుతాడు. అతడు బ్రాహ్మీ స్థితిలో ఉంటూ, అచేతన స్వరూపంగా నిత్యమూ గుర్తిస్తూ ఉంటాడు.

**యస్యాంతః స్యా దహంకారో న కరోతి కరోతి సః ।**

**నిరహంకార ధీరేణ న కించిదకృతంకృతమ్ ॥ 29**

నేనే కర్తని అనే భావం తనలో ఉన్నవాడు కర్మలు చెయ్యకపోయినా చేసినట్లే. అహంకారం లేని జ్ఞాని కర్మలు చేసినా చెయ్యనట్లే.

ఎవరి అంతఃకరణలో అహంకారం ఉంటుందో, వాడు బయటకి ఏ పని చెయ్యకపోయినా, అన్నీ నేనే చేస్తున్నాను అనే భావనతో కర్మలు చేసినవాడే అవుతాడు. కర్తృత్వ భావన లేని జ్ఞాని కర్మలు చేసినా చెయ్యనట్లే లెక్క. ఇక్కడ చాలా జాగ్రత్తగా చూడండి. స్వయంగా తాను కర్మ చెయ్యకపోయినా, చేసినట్లు భావిస్తే, ఆ కర్మని అతడు చేసినట్లే లెక్క. ఒక చిన్న ఉదాహరణ.

ఒకసారి ఒక రైతు తన జాతకం తీసుకుని, తనకు రెండు మైళ్ళ దూరంలో ఉన్న పండితుడి దగ్గరకు వెళ్ళాడు. అప్పటికే బాగా చీకటి పడుతోంది. జాతకం తీసి శాస్త్రిగారికిచ్చాడు రైతు. ఒక్క నిమిషం తదేకంగా చూశాడు శాస్త్రిగారు. రైతు వైపు తిరిగి అర్జంటుగా నేను బయటకు వెళ్ళవలసిన పని ఉంది. రేపు ఉదయం రా! నీ జాతకం తప్పకుండా చూస్తాను అన్నాడు. సరే అని ఇంటికి బయల్దేరాడు రైతు.

లోపలికి వెళ్ళిన శాస్త్రిగారిని ఆయన భార్య అడిగింది. 'ఎక్కడికో అర్జంటుగా వెళ్ళాలన్నారు?' అని. దానికి శాస్త్రిగారు. "నాకు పని ఏమీలేదు. వచ్చినవాడి జాతకం అస్సలు బాగాలేదు. ఈ రాత్రి గడవటం కూడా కష్టమే. ఆ మాట అతనితో ఎలా చెబుతాను? అందుకే నేను అర్జంటుగా బయటకు వెళ్ళాలి రేపు ఉదయం రా. అన్నాను. తెల్లవారే సరికి అతడు ఎలాగూ మరణిస్తాడు. దీనిలోంచి బయట పడాలంటే శివాలయం కట్టించి, మహాకుంభాభిషేకం జరిపించాలి" ఈ సమయంలో అదెలాగూ సాధ్యం కాదు" అన్నాడు.

శాస్త్రిగారి ఇంటి దగ్గర నుంచి బయల్దేరాడు రైతు. ఆకాశం మేఘావృతం అయింది. చల్లని గాలి కూడా వస్తోంది. మెరుపులు మెరుస్తున్నాయి. పెద్దగా వర్షం వచ్చేట్లుంది. వేగంగా ఇంటికి వెళ్ళిపోవాలి. దారి మధ్యలో చిన్న అడవికూడా ఉంది. ఎందుకైనా మంచిది త్వరగా వెళ్ళాలి అనుకుంటూ వేగంగా అడుగులు వేస్తున్నాడు. వర్షం మొదలైంది. ఒక్కసారిగా జోరున వాన. ఊరు దాటి చిట్టడవిలోకి ప్రవేశించాడు. వర్షం నుంచి రక్షించుకోవటానికి ఎక్కడా ఇల్లుకూడా లేదు. కొంత దూరం వెడితే గాని గ్రామం రాదు. ఏం చెయ్యాలి? అనుకుంటూ ఆ చీకట్లో వర్షంలో అలాగే నడుస్తున్నాడు. ఇంతలో ఒకపాడు పడిన ఆలయం అక్కడ ఉన్నట్లు గుర్తొచ్చింది. ఆ చీకట్లో గ్రామం రాదు. ఏం చెయ్యాలి? అనుకుంటూ ఆ చీకట్లో వర్షంలో అలాగే నడుస్తున్నాడు.ఇ ంతలో ఒకపాడు పడిన ఆలయం అక్కడ ఉన్నట్లు గుర్తొచ్చింది. ఆ చీకట్లో చుట్టూ పరికించి చూశాడు. మెరుపుకాంతులలో శివాలయం దగ్గరలోనే కనుపించింది. చకచకా అడుగులు వేసి ఆలయంలోకి ప్రవేశించాడు. వానజోరున కురుస్తూనే ఉంది. ఆలయంలో ఎవరో దీపారాధన చేసి వెళ్ళారు. ఇంకా దీపం వెలుగుతోంది. ఆ కాంతిలో పరికించి చూశాడు ఆలయాన్ని ఇంతకు ముందు ఎప్పుడూ రాలేదు ఆ ఆలయానికి. ఇదే మొదటిసారి. ఆలయం బాగా పాడుపడి పోయింది. గోడలు చాలా వరకు శిథిలమై పోయాయి. నేలంతా గుంటలు గుంటలుగా అయిపోయింది. ఇవాళ్ళో రేపో కూలిపోయేట్లుంది. శివలింగానికి దగ్గరగా కూర్చున్నాడు. ఆలోచిస్తున్నాడు ఈ ఆలయాన్ని ఎవరైనా మనసున్న మహారాజు బాగుచేస్తే. కళ్ళు మూసుకుని ఆలోచిస్తున్నాడు. ఎవరో ఏమిటి? తనే నడుం కట్టాడు. క్రొత్త ఆలయం నిర్మించాడు. చాలా పెద్దది. విశాలంగా ఉంది. అందంగా ఉంది. ఆలయం అంతా రంగులు వేశారు. విద్యుత్ దీపాలు అలంకరించారు. ఆలయం అంతా జనం కిక్కిరిసి పోయి ఉన్నారు. వేదపండితులు మంత్రాలు చదువుతున్నారు. ఈశ్వరుడికి అభిషేకం జరుగుతోంది. బయట మహాకుంభాభిషేకం జరుగుతున్నది. అన్నింటికీ తానే కర్త. దగ్గర నిలబడి అన్ని పనులు చూసుకుంటున్నాడు. హరహరా అంటూ నమస్కారం చేశాడు. దీపం మిణుకు మిణుకు మంటోంది. వాన తగ్గిపోయింది. ఆలోచనలలో నుంచి బయటకు వచ్చాడు. స్వామి వారికి నమస్కారం చేశాడు. క్రొత్త ఆలయం నిర్మించే శక్తి తనకున్నదా? క్షమించు స్వామీ ! అనుకుంటూ బయలుదేరి ఇంటికి చేరాడు. మరునాడు ఉదయం శాస్త్రిగారింటికి వెళ్ళాడు.

రైతును చూడగానే ఆశ్చర్యపోయాడు శాస్త్రిగారు. రాత్రి ఏం జరిగింది? అన్నాడు జరిగిందంతా చెప్పాడు రైతు. అప్పుడు భార్యతో అంటాడు. 'చూశావా! నేను రాత్రి చెప్పాను శివాలయం కట్టించి, మహాకుంభాభిషేకం చేస్తేనే ఈ దోషం పోతుందని, ఇతడు నిన్న రాత్రి త్రోవలో క్రొత్తగా ఆలయ నిర్మాణం చేసినట్లు, కుంభాభిషేకం కూడా నిర్వహించినట్లు భావన చేశాడు. నిజంగా కర్మ అవసరం లేదు. కర్మ చేసినట్లు భావించినా అతడికి ఆ ఫలితం వస్తుంది. అందుకే ఈ రైతు బ్రతికి బయట పడ్డాడు. కాబట్టి కర్మలు ఆచరించకపోయినా, కర్మ చేసినట్లుగా భావిస్తే, కర్మ చేసిన ఫలితం వస్తుంది. కర్తృత్వ భావన లేనివాడు నిజంగా కర్మ చేసినా అతడికి ఫలితం ఉండదు.

**నోద్విగ్నం నచ సంతుష్ట మకర్తృత్వస్పంద వర్జితమ్ ।**
**నిరాశం గతసందేహం చిత్త ముక్తస్య రాజతే ॥ 30**

జ్ఞాని మనస్సు సుఖదుఃఖాల కతీతంగా ఉంటుంది. అతనికి మానసిక ఉద్రేకాలుండవు. కోరికలుండవు. సందేహాలుండవు. సమాధానాలు అంతకన్నా ఉండవు. అతని మనస్సు సదా స్థిరంగా ఉంటుంది.

జ్ఞాని మనస్సు కేవలము ప్రకాశమానమై విరాజిల్లుతూ ఉంటుంది. అతడికి చిత్తచాంచల్యము ఉండదు. ఆ కారణంగా ద్వేషము, సంతోషము, అనురాగము ఏవీ ఉండవు. అతనికి సంకల్ప వికల్పాలుండవు కాబట్టి చలనముండదు. ఏ రకమైన ఆశ, కోరిక ఉండదు. అన్ని బాధలకు కారణం అవిద్య. అతడికి అవిద్య లేదు. కాబట్టి ఏ రకమైన సంశయము. బాధ, అతనికి ఉండవు. ఎవరి మనసైతే మరణ కాలమందు, ఉత్సవములందు, యుద్ధమందు కూడా, ఏ మాత్రము వ్యాకులత లేకుండా స్వచ్ఛంగా ఉంటుందో అటువంటివాడు శాంతుడు. తపస్సంపన్నుల దగ్గర, బుద్ధిశాలుల యందు, యజ్ఞములు చేసినవారి యందు, చక్రవర్తుల యందు, బలవంతుల యందు, సద్గుణ సంపన్నుల యందు అంతరింద్రియ నిగ్రహం కలిగి ఉన్నవాడే ప్రశస్తిని పొందుతాడు. సంతోషామృతపానంతో శాంతచిత్తుడైన వాడే పరమపదము పొందుతాడు. ప్రాప్తించని వాటికోసం దుఃఖించని వాడు, ప్రాప్తించిన వాటితో తృప్తి పొందేవాడు భేదభావాలు లేనివాడు, సంతుష్టుడు జీవన్ముక్త స్థితిని పొందుతాడు. అతని మనస్సు సుఖదుఃఖాల కతీతంగా నిశ్చలంగా ఉంటుంది.

**నిర్ధ్యాతుం చేష్టితుం వాఽపి యచ్చిత్తం న ప్రవర్తతే ।**

**నిర్నిమిత్తమిదం కిం తు నిర్ధ్యాయతి విచేష్టతే ॥ 31**

జీవన్ముక్తుని మనస్సు ధ్యానంలో లీనమవదు. కర్మలో కూడా లీనమవదు. నిస్వార్థంగా కర్మల నాచరిస్తుంది.

చిద్రూపుడి మనస్సు ఎప్పుడూ ఏ సంకల్పాలు లేకుండా ఉంటుంది. అటువంటి వాడు. ఒకసారి నిశ్చలుడుగా కనిపిస్తాడు ఇంకొకసారి కర్మలు చేస్తూ క్రియాశీలుడుగా కనిపిస్తాడు. అయినప్పటికీ అతడికి కర్మబంధాలు ఉండవు.

మనసుతో భావించబడిన వాడైనజీవుడు దేహవాసన కలిగి ఉంటాడు. దేహవాసన పోయిన తరువాత అతడు దేహధర్మాలకు అంటుకోడు. మనస్సుకు గొప్పశక్తి ఉంది. అది ఒక కల్పము కాలాన్ని క్షణంగా చేస్తుంది. అలాగే ఒక క్షణాన్ని ఒక కల్పముగా చేస్తుంది. సంసారమంతా మనోవిలాసమే. దుష్ప్రవర్తన వదలని వాడు, అశాంతుడు, కేవలము ప్రజ్ఞాబలంతో ఆత్మసాక్షాత్కారం పొందలేడు. ద్వంద్వ రహితమైన నిర్గుణమై, సత్యమై చిద్ఘనమైనట్టి బ్రహ్మానందాన్ని తన ఆత్మరూపంగా తెలుసుకున్న వాడు ఎన్నటికీ భయపడడు. ఉత్తమోత్తమమైనది, మహత్తరమైనది, తేజోమయమైనది, కళ్యాణకారకమైనది శాశ్వతమైనది, సర్వజ్ఞము, పురాణము, సనాతనము, సకల దేవతలచేత ఆరాధింపబడునది, అయిన సర్వేశ్వర రూపాన్ని తెలుసుకున్న వాడు దేనికీభయపడడు. అతని మనసు దేనిలోను లీనమవదు. నిస్వార్థంగా కర్మలనాచరిస్తుంది.

**తత్త్వం యథార్థ మాకర్ణ్యమందః ప్రాప్నోతి మూఢతాం ।**

**అథవాఽయాతి సంకోచః మమూఢః కోఽపి మూఢవత్ ॥ 32**

తెలివి లేనివాడు తత్త్వసారాన్ని విని సందేహంలో పడతాడు. బుద్ధిమంతుడు తత్త్వజ్ఞానసారాన్ని గ్రహించి అంతర్ దృష్టితో, అంతర్ముఖుడై సత్యాన్ని దర్శించి బాహ్యంగా మూఢునిలాగా కనిపిస్తాడు.

అవిద్యతో కూడిన అజ్ఞాని, తత్, త్వంల ఐక్యతను మంచి గురువు ద్వారా విని, దాన్ని సరిగా అర్థం చేసుకోలేక, విపరీతార్థాలు తీసుకుని వివేక శూన్యుడవుతాడు.

లక్షలో ఒకరు మాత్రమే యథార్థాన్ని గ్రహించి బయటకు మాత్రం మూఢునిలాగా కనిపిస్తాడు.

ఇక్కడ మనకు రెండు పదాలు దర్శనమిస్తున్నాయి. **1.మమ 2.నమమ**. ఈ రెండు పదాలే బంధ మోక్షాలకు కారణం. మమ అనుకుంటే బద్ధుడు, నమమ అనుకుంటే ముక్తుడు. చేతనాచేతనాత్మకమైన జగత్తు జీవేశ్వరాది రూపంలో ప్రకాశిస్తున్నది. ఈ సృష్టి అంతా పరమేశ్వర సంకల్పమైనది. జాగ్రాదావస్థ నుంచి మోక్షం వచ్చేదాకా సంసారము జీవకల్పితమైనది. నాచికేతాగ్ని మొదలు యోగందాకా ఉన్న మతాలన్నీ ఈశ్వరుని విషయంలో భ్రాంతిని ఆశ్రయించి ఉన్నాయి. పొరపాటు పడుతున్నాయి. చార్వాకుల నుంచి సాంఖ్యలదాకా జీవభ్రాంతిని ఆశ్రయించి ఉన్నారు. అందువల్ల ముముక్షువులు జీవేశ్వర సిద్ధాంతంలో బుద్ధిని ప్రవేశింప నీయరాదు. నిశ్చలమైన బుద్ధితో బ్రహ్మతత్త్వ విచారణ చెయ్యాలి. అన్వయ వ్యతిరేక సిద్ధాంతాల ద్వారా ఈతడు సాక్షాత్తు జ్ఞాని. ఇతడే శివుడు, ఇతడే హరి. ఇతడే బ్రహ్మ. సద్గురువు కరుణ లేకపోతే విషయ త్యాగం చాలా కష్టం. తత్త్వదర్శనం దుర్లభం. సహజావస్థ మరీ దుర్లభం.

తెలివి లేనివాడు తత్త్వసారాన్నివ ఇని సందేహాస్పదుడవుతాడు. అదే బుద్ధిమంతుడు తత్త్వజ్ఞానసారాన్ని గ్రహించి అంతర్ముఖుడై సత్యాన్ని దర్శించి పైకి మాత్రం మూఢునిలాగా కనిపిస్తాడు.

**ఏకాగ్రతా నిరోధో వా మూఢై రభ్యస్యతే భృశమ్ ।**
**ధీరాః కృత్యం న పశ్యంతి ససుప్తవత్స్వపదే స్థితాః ॥ 33**

మూర్ఖులు మాత్రమే మనసును నియంత్రించి ఏకాగ్రత అభ్యసిస్తూ ఉంటారు. జ్ఞాని తన సహజ సిద్ధమైన రూపంలో ఉండి, సుషుప్తిలో ఉన్నవాడిలాగా దేన్నీ సాధించాలనుకోడు. అసలు ఏకాగ్రత అంటే ఏమిటి? మనసును, దృష్టిని ఒకే వస్తువు లేదా విషయం మీద లగ్నం చెయ్యటం. ఇతర విషయాల గురించి ఆలోచించక పోవటం. దేనిమీదయితే మనసును లగ్నం చేశామో దానియందే దృష్టిని నిలిపి, ఇతర ఆలోచనలు లేకుండా, దాన్నే ఆలోచించటాన్ని ధ్యానము అంటారు. ఇతర విషయాల మీదకు మళ్ళకుండా ఉన్న జ్ఞానవృత్తి ధ్యేయం వైపుకు

తైలధారలాగా సాగుతుంది. ఇలా ఏకాగ్రత సాధించనటువంటి వారు విరుద్ధభావాలు కలగకుండా, మనసు ఇతర విషయాలమీదకి వెళ్ళకుండా, అత్యంతమైన శ్రద్ధతో ఏకాగ్రత సాధిస్తారు. నేను అంటే దేహము అనే విపరీత భావన లేని జ్ఞానులు సచ్చిదానంద స్వరూపులై ఏకాగ్రత సాధించటానికి ఏ రకమైన అభ్యాసము చెయ్యవలసిన పనిలేదు.

జీవన్ముక్తుడు తన ప్రపంచంలో జీవిస్తూ ఉంటాడు. అతని దృక్పథంలో మనకు సహజంగా కనుపించే ఇంద్రియానుభవ క్షేత్రాలు ఏవీ ఉండవు. సర్వత్రా ఆత్మతత్త్వమే ఉంటుంది. అటువంటి యోగి ఆత్మలో ఆత్మగా ఉంటాడు. ఇంక అతనికి కోరటానికి ఏమీ ఉండదు. అతడికి ధ్యానింపదగినది ఏదీ లేదు. అతడు ధ్యానం చేసేది ఏదీలేదు. అతడు చేరవలసిన గమ్యాన్ని చేరేశాడు. కాబట్టి ఇంక సాధించవలసినది ఏదీలేదు.

**అప్రయత్నా త్ప్రయత్నాద్వా మూఢోనాప్నోతి నిర్వృతిమ్ ।**
**తత్త్వనిశ్చయ మాత్రేణ ప్రాజ్ఞో భవతి నిర్వృతః ॥ 34**

మూఢుడు కర్మవల్ల, అకర్మవల్ల కూడా శాంతిని పొందలేడు. జ్ఞాని సత్యాన్ని తెలుసుకుని శాంతంగా ఉండగలుగుతాడు.

మూఢుడు అంటే అజ్ఞాని. చిద్రూపుడు కానివాడు. ఇతడు తన చిత్తాన్ని నిరోధించటం వల్ల గాని, కర్మలు చెయ్యటం వల్లగాని కర్మలు మానటం వల్ల గాని, ఏ రకమైన సుఖాన్ని శాంతిని పొందలేడు. ఎందుకంటే అతనికి ఆనందాన్ని, శాంతిని ఇచ్చే సచ్చిదానందానుభూతి లేదు. జ్ఞానికి తత్త్వజ్ఞానము దృఢపడినంతనే, అజ్ఞానము నశించగానే, జపతపాదులు, సమాధి, దానము మొదలైనవి లేకుండానే అతడు సచ్చిదానంద రూపుడౌతాడు.

అహంకారాన్ని పూర్తిగా నశింపచేసి, మనస్సును శుద్ధపరచుకుని, వాసనా రహితుడైన సాధకుడు మాత్రమే ధ్యానానికి అనుకూలమైన మనస్సును సాధించ గలుగుతున్నాడు. అటువంటి మనస్సు మాత్రమే సాధకుణ్ణి గమ్యానికి చేరుస్తుంది. అటువంటి వ్యక్తి శాస్త్రప్రకారము నడిచి, గురూపదేశంతో అద్వితీయమైన ఆత్మతత్త్వానుభూతిని పొందుతాడు.

భగవద్గీతలో

**యస్త్వాత్మరతిరేవస్యాదాత్మ తృప్తశ్చ మానవః।**

**ఆత్మన్యేవచ సంతుష్టః తస్యకార్యం న విద్యతే ॥**

సచ్చిదానంద ఘన పరమాత్మ ప్రాప్తి నొందిన మహాత్ముడు. నిత్యమైన ఆత్మయందే రమిస్తాడు. అతడు పూర్ణకాముడు. కోరికలు తీరినవాడు. కాబట్టి ఆత్మయందే తృప్తి పొందుతాడు. అతడు ఆత్మయందే నిత్యసంతుష్టుడు. అతడికి ఏ రకమైన కర్తవ్యము ఉండదు.

పరమాత్మ ప్రాప్తి పొందిన వాడికి అన్ని కర్తవ్యాలు పూర్తవుతాయి. అతడు కృత్యుడు. మనం చేసే పనులన్నింటికీ అంతిమ లక్ష్యం మోక్షసాధన. అదే పరమాత్మ ప్రాప్తి. ఆ లక్ష్యం నెరవేరింది. కాబట్టి అతడికి చేయవలసిన పనులు కర్తవ్యాలు అనేవి ఉండవు.

జ్ఞానియైనవాడు ఏ కర్మనూ చెయ్యడు. అతడికి దేహము, ఇంద్రియాలు, మనస్సులతో పని ఉండదు. కాబట్టి వాస్తవంగా ఏ పని చెయ్యడు. కాని ప్రారబ్ధానుసారము కర్మలు జరిగిపోతూనే ఉంటాయి. ఆ కర్మలను ఆసక్తి, కోరిక ఏవీ లేకుండానే చెయ్యటం చేత అవి పవిత్రకర్మలౌతాయి.

అందుకే అజ్ఞాని కర్మలు చేసినా చెయ్యకపోయినా అశాంతిగానేఉంటాడు. అదే జ్ఞాని కర్మలు చేసినా చెయ్యకపోయినా శాంతిగానే ఉంటాడు.

**శుద్ధం బుద్ధం ప్రియం పూర్ణం నిష్ప్రపంచం నిరామయమ్ ।**

**ఆత్మానం తం న జానంతి తత్రాభ్యాసపరా జనాః ॥ 35**

అనేక రకాలయిన సాధనలు, అభ్యాసాలు, చేస్తున్న జనులు ఆత్మతత్వానుభూతిని పొందలేరు.

యోగసాధన చేసేవారు, తాంత్రికులు ఎవరూ కూడా ఆత్మానుభూతిని పొందలేరు.

గతంలో మనం చాలాసార్లు చెప్పుకున్నాం. వేదాలు చదివితే మోక్షం రాదు. కర్మలు చేస్తే మోక్షం రాదు. ఉపన్యాసాలు చెబితే మోక్షం రాదు. ఉపన్యాసాలు

వింటే మోక్షం రాదు. శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు వింటే మోక్షం రాదు. మరి దేనివల్ల మోక్షం వస్తుంది. **జ్ఞానాదేవతుకైవల్యం**. జ్ఞానం వల్లనే మోక్షం వస్తుంది. కొంతమంది ఆధ్యాత్మిక జీవనము అనే పేరుతో ఉపవాసాలు చేస్తారు. పూజలు, జపాలు, హోమాలు, తపస్సు చేస్తారు. వ్రతాలు, అర్చనలు చేస్తారు. దానధర్మాలు చేస్తారు. శరీరాన్ని సుష్కింపచేస్తారు. ఒంటికాలి మీద నుంచుని జపం చేస్తారు. తలక్రిందులుగా నుంచుని తపస్సు చేస్తారు. పీకలోతు నీటిలో మునిగి మంత్రజపం చేస్తారు. వీటివల్ల కార్యసాధన జరుగుతుంది. పూర్వకాలంలో శుక్రాచార్యుడు సదాశివుణ్ణి మృతసంజీవినీ విద్యను అనుగ్రహించమని అడిగాడు. దానికి శివుడు చుట్టూ పచ్చికట్టెలు మండబెట్టి ఆ మధ్యలో తలక్రిందులుగా నుంచుని, కట్టెల పొగ పీలుస్తూ పదివేల సంవత్సరాలు తపస్సు చెయ్యమన్నాడు. అలాగేచేశాడు శుక్రాచార్యుడు. మృతసంజీవినీ విద్యని సాధించాడు. ఈ రకంగా నియమ నిష్ఠలతో తపస్సు చేసినా, చాంద్రాయణాది వ్రతాలు చేస్తూ శరీరాన్ని సుష్కింపచేసినా కోరికలు తీరతాయి. అంతేగాని మోక్షం రాదు. మోక్షం కావాలంటే చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపము అని గుర్తించాలి. జగత్తులో ప్రతి వస్తువు నందు తన ఆత్మనే చూడాలి. అన్ని జీవుల యందు అంతర్యామిగా ఉన్నది ఆ పరమేశ్వరుడే అని గుర్తించాలి. జగత్తును, జగత్తులోని 84 లక్షల జీవరాసిని ఆత్మస్వరూపంగా గుర్తించాలి. జగత్తులో నాకన్న భిన్నమైనది ఏదీలేదు. నేనే ఆత్మస్వరూపాన్ని అని దృఢంగా నమ్మినవాడికి సాయుజ్యం సిద్ధిస్తుంది.

**నాప్నోతి కర్మణామోక్షం విమూఢోఽభ్యాసరూపిణా ।**
**ధన్యో విజ్ఞానమాత్రేణ ముక్త స్తిష్ఠత్య విక్రయః ॥ 36**

అజ్ఞాని ధ్యానము సమాధిలతో మనస్సును నియంత్రించటానికి ప్రయత్నించినా, ఆత్మానుభూతి మాత్రం పొందలేడు. గతజన్మ పుణ్యఫలం ఉన్న సాధకుడు శ్రవణ మననాలతో ముక్తి పొది ఆత్మలో స్థితుడై ఉంటాడు. యోగాభ్యాసము మొదలైన కర్మలవల్ల మోక్షం రాదు. **జ్ఞానదేవతుకైవల్యం** జ్ఞానం మాత్రమే మోక్షాన్నిస్తుంది.

యోగాభ్యాసంలో ఎనిమిది అంగాలున్నాయని గతంలో చెప్పుకున్నాం. అవి

1 యమ 2. నియమ 3. ఆసన 4. ప్రాణాయామ 5. ప్రత్యాహార 6. ధారణ 7. ధ్యాన 7. సమాధులు

వీటిలో మొదటి ఐదు **యమాది పంచకము** అనబడతాయి. యోగానికి ఇవి సహాయకారి. చివరి మూడింటినీ **సంయమము** అంటారు. యోగానికి కావలసినవి ఇవే. వీటిలో ధ్యానము సమాధి పరమోత్కృష్టమైనవి. శంకర భగవత్పాదుల వారు ధ్యానాన్ని వివరిస్తూ **అహంబ్రహ్మాస్మి** నేనే పరబ్రహ్మను అనే భావనతో పరమానందాన్ని కలిగించే నిరాలంబ స్థితే ధ్యానము. ధ్యానానికి ప్రధానమైన లక్షణాలు రెండు. 1.బ్రహ్మభావన 2.నిరాలంబ స్థితి. రెండవది సమాధి. ధ్యానంలో ఉన్నప్పుడు కేవలము ధ్యేయాన్ని మాత్రమే చూస్తూ, నేను ధ్యానం చేస్తున్నాననే మాట కూడా మరిచిపోవాలి. ఆ స్థితిలో చిత్తం స్వరూపస్థితి పొందుతుంది. దాన్నే సమాధిస్థితి అంటారు. ఇంద్రియాలను వదిలేసిన ఏ రకమైన బంధము లేని స్థితి. సమాధి రెండు రకాలు 1.సవికల్ప సమాధి 2.నిర్వకల్ప సమాధి. సవికల్ప సమాధిలో మనసు పని చేస్తుంది. నిర్వికల్ప సమాధిలో మనసుకుడా పని చేయని స్థితి. యోగానికి ఆత్మసాక్షాత్కారానికి కావలసింది ఇదే.

అజ్ఞాని ధ్యానము సమాధులతో మనసును నియంత్రించి తద్వారా ఆత్మానుభవం పొందాలనుకోవటం జరగదు. ఆత్మానుభవం కావాలంటే గతజన్మలలో చేసిన పుణ్యఫలం ఎక్కువ ఉండాలి.

ఇక్కడ మనం బాగా గుర్తించవలసిన విషయం ఒకటుంది. ఏ వ్యక్తిఅయినా సరే ఏదో ఒక వృత్తిలో విజయం సాధించాలంటే, అది ఈ జన్మలో చేసిన కృషివల్ల కాదు. గతజన్మల సంస్కారము ఉండి తీరాలి. గతజన్మలలో యోగసాధన ధ్యానము, సమాధి మొదలైనవి చేస్తూ మరణించాడు. ఈ జన్మలో గతంలో అభ్యసించిన విద్య అంతా కూడా గుర్తుంటుంది. చాలా తేలికగా సాధనలోకి వస్తుంది. కాబట్టి ఈ జన్మలో చేసిన శ్రమవల్లనే మోక్షం రాదు. గతజన్మలలో చేసిన కర్మలు, వాటి ఫలితము బట్టి ఈ జన్మ ఉంటుంది. పుణ్యకర్మలు చేసినవారు ఉత్తమ యోనుల యందు జన్మిస్తారు. పాపకర్మలు చేసేవారు. నీచజన్మ లెత్తుతారు. గతజన్మ పుణ్యం ఉంటేనే ధ్యానము సమాధి చేస్తాడు. వాటిలో కృతకృత్యుడవుతాడు. సుకృతమున్న వాడు జనన మరణాలతో ముక్తి పొంది, ఆత్మానుభవంలో కూరుకుపోతాడు. పుణ్యకర్మలు గతజన్మలో చేసినవాడే, ఇప్పుడు సాధనలో ముందుకు వెడతాడు. నిర్వకల్ప సమాధిలో ఉన్నవాడు, ఆత్మానుభూతిలో స్థిరచిత్తుడై ఉండగలుగుతాడు.

**మూఢో నాప్నోతి తద్బ్రహ్మ యతో భవితు మిచ్ఛతి ।**
**అనిచ్ఛన్నపి ధీరో హి పరబ్రహ్మ స్వరూపభాక్ ॥** **37**

అజ్ఞాని బ్రహ్మత్వం పొందలేడు. అతని కోరికలే అతనికి అడ్డమవుతాయి. జ్ఞాని కోరకుండానే బ్రహ్మత్వం పొందుతాడు.

జ్ఞానికానివాడు మనసును అదుపులో ఉంచుకుని బ్రహ్మత్వాన్ని పొందాలనుకుంటాడు. కాని పొందలేడు. అదే జ్ఞానికి మోక్షం పొందాలనే కోరిక కూడా ఉండదు. కాని అతడు బ్రహ్మస్వరూపుడవుతాడు.

ఎప్పుడూ కూడా దాని వెంటపడితే రాదు. మన ప్రయత్నం మనం చేస్తూ, దానికోసం ఎదురు చూడకుండా ఉంటే అదే మనకు వశమవుతుంది అనేది సూత్రం. ఇది కావాలి అనుకోవటం కాదు. దానికి సంబంధించిన శ్రమ చెయ్యాలి. కలెక్టరు కావాలనుంటే తప్పులేదు. దానికి అర్హత అయిన ఐ ఎ యస్‌లో ఉత్తీర్ణులు కావాలి. ఐ ఎ యస్‌లో ఉత్తీర్ణుడైతే అతడు కలెక్టరు కాకుండా ఎవరూ ఆపలేరు. అలాగే ఇక్కడ కూడా బ్రహ్మత్వం పొందాలంటే కావలసిన జ్ఞానం సముపార్జించాలి. ఇక్కడ ఒక విషయం గుర్తుంచుకోవాలి. బ్రహ్మత్వం పొందాలంటే విషయవాసనలను త్యజించాలి. కోరికలను పూర్తిగా జయించాలి. మోక్షగామికి బలీయమైన కోరిక మోక్షం పొందాలనేది. మోక్షం పొందాలి అనే కోరిక కూడా ఉండరాదు. సాధకుడికి ఆ కోరిక ఉండి తీరుతుంది. అది సాధకుణ్ణి బందీ చేస్తుంది. కోరికలన్నింటి కన్నా ఇది చాలా బలమైనది. దీనికోసం సాధన చెయ్యాలి అనే కోరికతో సాధకుణ్ణి బందీ చేస్తుంది.

మొదట్లో సాధన ప్రారంభించినప్పుడు మోక్షం పొందాలి అనే కోరిక ఉంటుంది. మోక్షం కోసం అనేక విషయాలను త్యాగం చేస్తూ వెడుతుంటాం. అలా వెళ్ళి చివరిదైన ఈ అంతిమ లక్ష్యం మోక్షం కావాలనే కోరిక బలీయమవుతుంది. దాంతో అహంకారం పెరుగుతుంది. దీనివల్ల ద్వైతభావం ఇంకా బలపడుతుంది. అసలు ద్వైతం పనికిరాదు. ద్వైతం ఉంటే మోక్షం రాదు. అందుకే ద్వైతాన్ని నాశనం చెయ్యాలి. ముముక్షత్వ సాధన మొదట బాగానే ఉంటుంది. కాని చివరకొచ్చే టప్పటికి చాలా బలపడి, బంధం అవుతుంది. ఇక్కడ గురువుగారి ఉపదేశం ముఖ్యం. మనస్సులో ఆలోచనలు ఆగిపోతే అద్వయమైన ఆత్మతత్త్వం నిశ్చలంగా ఉంటుంది.

ఇక్కడ చాలా ముఖ్యమైన విషయం ఏమంటే, **ఆత్మతత్త్వాన్ని సాధించాలనే కోరిక ఉన్నంత కాలము అది కోరికగానే ఉండిపోతుంది. అందుకే సాధన, శాస్త్రాధ్యయనం చేసే వారందరూ ఈ విషయాన్ని గుర్తించి సరైన సమయంలో మోక్షం పొందాలనే కోరికను వదిలెయ్యాలి.** ప్రారంభదశలో యమ, నియమాలు మొదలైన సాధనలన్నీ ఉపయోగించి మనస్సును ఏకాగ్రం చెయ్యాలి. తరువాత ఈ చివరి కోరికను కూడా వదలిపెట్టాలి. లేకపోతే బ్రహ్మత్వం పొందాలనే కోరికే అందుకు అవరోధమవుతుంది. ప్రాపంచికమైన కోరికలు వదలటం కష్టం ఏమీ కాదు. ఇష్టమైన పదార్థాలు తినటం, దృశ్యాలు చూడటం వంటి కోరికలు చాలా చిన్నవి. **ఆత్మసాక్షాత్కార మనేది చాలా పెద్ద కోరిక. ఈ కోరికను వదలి పెట్టటమే కష్టం. దీన్ని వదలగలిగిన వాడే అసలైన సన్యాసి.**

**నిరాధారా గ్రహవ్యగ్రా మూఢా స్సంసారపోషకాః ।**
**ఏతస్యానర్థ మూలస్య మూలచ్ఛేదః కృతో బుధైః ॥ 38**

ముక్తిని సాధించాలనే తపనతోనే అజ్ఞానులు సంసారాన్ని పోషిస్తున్నారు. తెలివైన వారు సంసార వృక్షాన్ని ఛేదించి హాయిగా ఉంటారు.

అజ్ఞానులకు సదభ్యాసము ఉండదు. దాంతో కేవలము చిత్తవృత్తి నిరోధం వల్లనే ముక్తిని పొందగలము అనే నమ్మకంతో దురహంకారులై, జనన మరణాలతో కూడిన సంసారాన్ని పెంచి పోషిస్తున్నారు. జ్ఞానులు మాత్రం జ్ఞానఖడ్గంతో సంసార వృక్షాన్ని సమూలంగా నాశనం చేసి మోక్షం పొందుతారు.

అజ్ఞానం వల్లనే ఈ సంసారం ప్రవర్తిల్లుతున్నది. జగత్తంతా మనోకల్పితము. భ్రమాజన్యము. కాబట్టి అజ్ఞానం లేకపోతే జగత్తే లేదు. కాని సాధకుడు సామాన్య మానవుడు అజ్ఞాని. అతని దృష్టిలో జగత్తు ఉంది. మోక్షం సాధించాలంటే ధ్యానము, సమాధి వంటి ప్రక్రియల ద్వారా మనసును నిశ్చలంగా చెయ్యాలి. అప్పుడు మోక్షం సిద్ధిస్తుంది. ఇది వారి నమ్మకం కాని ఇది నిజం కాదు. జ్ఞానం లేని యోగంవల్ల గాని, యోగం లేని జ్ఞానం వల్ల గాని మోక్షం రాదు. కేవలము సాధనలతోనే మోక్షం సిద్ధించదు. అజ్ఞానం పటాపంచలైతే మోక్షం తేలికగా సిద్ధిస్తుంది. అజ్ఞానం రెండు రకాలుగా ఉంటుంది. 1.అగ్రాహ్యము 2.అన్యథాగ్రాహ్యము. వస్తువు యొక్క

సహజ రూపాన్ని తెలుసుకోలేకపోవటము. దాన్ని ఇంకొక రకంగా భావించటము. ఈ భావము గనక పోతే, వస్తువు సహజ రూపాన్ని తెలుసుకోగలిగితే అజ్ఞానం నశిస్తుంది. సాధకులు మనసును నియంత్రించటానికి అనేక సాధనలు చేసి సమయం వృధా చేస్తారు. మనస్సు వల్లనే భ్రమలు పుడుతున్నాయని మరచిపోవద్దు. మనస్సే వల్లనే ద్వైదీభావము కలుగుతుంది. ఈ విషయాన్ని గుర్తించి అజ్ఞానాన్ని ఛేదించాలి. కాని సాధకులు అజ్ఞానంతో కూడిన మనసును నియంత్రించాలి అనుకుంటున్నారు. ఇది తప్పు, మనసులో ఉన్న అజ్ఞానం ఛేదించబడితే మోక్షం సిద్ధిస్తుంది. మనసును నియంత్రించాలనుకోవటం అంటే తాడులోని పామును చంపటానికి కర్రతో బాదటం వంటిది. నువ్వు ఎంత బాదినా అసలు అక్కడ పాము ఉంటే కదా చావటానికి? అలాగే మూర్ఖులు మనసుని నియంత్రించాలనే ప్రయత్నంలో సంసారాన్ని పెంచి పోషిస్తున్నారు. అదే జ్ఞానులు అజ్ఞానాన్ని ఛేదించి మోక్షం పొందుతారు.

**న శాంతిం లభతే మూఢో యతశ్శమితు మిచ్ఛతి ।**
**ధీరస్తత్త్వం వినిశ్చిత్య సర్వదా శాంతమానసః ॥ 39**

మనసును నియంత్రించి శాంతి పొందటం జరగదు. నిశ్చయంగా సత్యాన్ని తెలుసుకున్నవాడే శాంతి పొందుతాడు.

ఆత్మతత్త్వము తెలియనివాడు చిత్తాన్ని నిరోధించి శాంతిని పొందాలి అనుకుంటాడు. అతడు పూర్తిగా అజ్ఞాని. అతడికి ఎప్పటికీ శాంతి కలగదు. జ్ఞానికి ఆ శాంతి పొందాలనే కోరిక ఉండదు. అది అతనికి సిద్ధిస్తుంది.

మసక చీకట్లో స్తంభంలో భూతం కనిపించింది. ఇదంతా భ్రమ. అజ్ఞాని అక్కడ భూతం కనపడకుండా ఉండాలి అనుకుంటాడు. తద్వారా శాంతి పొందాలి అనుకుంటాడు. కాని నీలో అజ్ఞానం ఉన్నంత వరకు అక్కడభూతం కనిపిస్తూనే ఉంటుంది. అతని మనస్సులో భూతభావన ఉన్నంత వరకు స్తంభంలో కాకపోతే ఇంకొక చోట భూతం కనిపిస్తుంది. దాంతో అతనికి శాంతి ఉండదు. ఇక్కడ కావలసింది మనస్సును నిశ్చలం చేసి ఇక్కడ భూతంలేదు అనుకోవటం కాదు. ఇది స్తంభము. ఇక్కడ భూతం ఎలా ఉంటుంది. ఉండదు. భూతం లేదు. అనే నిశ్చమయిన జ్ఞానం నీకు కలగాలి. అసలు భూతమే లేదు. అనే విషయం తెలిస్తే నీకు శాంతి లభిస్తుంది.

**క్వాత్మనో దర్శనం తస్య యద్దృష్టమవలంబతే ।**
**ధీరాస్తం తం న పశ్యంతి పశ్యంత్యాత్మాన మవ్యయం ॥ 40**

వ్యక్తమైన ప్రపంచాన్ని చూస్తున్న వాడికి ఆత్మదర్శనం ఏ రకంగా సాధ్యమవుతుంది. జ్ఞాని తాను చూస్తున్నదంతా ఆత్మతత్త్వమే అనే జ్ఞానం కలిగి ఉంటాడు.

దృశ్యమానమైన జగత్తును ఇంద్రియాలతో చూసేవాడికి ఆత్మదర్శనము కాదు. నామరూపాత్మకమైనది జగత్తు. ఆ జగత్తును ఇంద్రియాల ద్వారా చూడటం జరుగుతుంది. ఇక్కడ ప్రతిరూపాన్ని కంటితో చూడం. వస్తువుల ఉనికిని జ్ఞానేంద్రియాలతో తెలుసుకుంటాం.

| | |
|---|---|
| కళ్ళతో | – చూస్తాం |
| చెవులతో | – వింటాం |
| ముక్కుతో | – వాసన చూస్తాం |
| నాలుకతో | – రుచి చూస్తాం |
| చర్మంతో | – స్పర్శ తెలుసుకుంటాం |

దృశ్యమానమైన జగత్తును ఇంద్రియాల ద్వారా చూడటమంటే ఇదే.

బాహ్యజగత్తును చూసేవాడు అజ్ఞాని. జగత్తంతా మనోభ్రమ వల్ల ఏర్పడింది. భ్రమ నశించిపోతే జగత్తు లేదు. అజ్ఞానం వల్ల భ్రమ వస్తోంది. అందుకే బాహ్య జగత్తును చూసేవాడు అజ్ఞాని. అజ్ఞానికి ఆత్మదర్శనం కాదు. జ్ఞాని దృష్టిలో చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపము. పరబ్రహ్మకన్న వేరైనది ఏదీలేదు. జగత్తంతా మనోవికారము వల్లనే కలుగుతోంది. అసలు మనస్సే లేదు. ఇంకా దానికి వికారము ఎలాఉంటుంది? కాబట్టి మనస్సు లేదు దాని వికారము లేదు. సంకల్పము లేదు. జగత్తు అంతకన్న లేదు. కాని అజ్ఞానికి ఆత్మజ్ఞానము లేదు. అందుచేత ఈ జగత్తు ప్రత్యేకంగా కనుపిస్తుంది. నామరూపాలు గల వస్తువులు, ప్రాణులు, జీవులు అన్నీ విడివిడిగా కనిపిస్తాయి.

**క్వ నిరోధో విమూఢస్య యో నిర్బంధం కరోతి వై ।**
**స్వారామస్యైవ ధీరస్య సర్వదా సావ కృత్రిమః ॥ 41**

అజ్ఞాని మనస్సుని నిరోధించాలని చూస్తాడు. కాని అది సాధ్యం కాదు. అంత తేలిక అయిన విషయం కాదు. ఆత్మానుభవం పొందిన వాడికి మనస్సు ఉండదు. అలాంటప్పుడు మనసును విరోధించటం అనే ప్రశ్న ఎందుకు వస్తుంది?

యోగము అంటే చిత్తవృత్తులను నిరోధించటం. ధ్యానంలో కూచున్నాడు. మనసును నియంత్రించాడు. ఒక గంట గడిచింది లేచాడు. కళ్ళ ఎదురుగా మళ్ళీ జగత్తు కనిపిస్తోంది. అంటే మనసు మళ్ళీ పని చేస్తోంది. కాబట్టి అజ్ఞానంతో కూడిన మనోలయము, సమాధివంటివన్నీ ఉపయోగం లేని పనులు. అయితే చిద్రూపుడు అయిన జ్ఞానికి అసలు మనస్సే ఉండదు. మనస్సే లేనప్పుడు మనోచాంచల్యము ఎందుకుంటుంది? కాబట్టి అతడికి సమాధిగాని, మనోనిరోధము గాని స్వభావ సిద్ధంగా జరిగేవే.

మనస్సును నిరోధించాలని ప్రయత్నించటం నిష్ఫలం. కుక్క తోక వంకర. ఆ వంకర తీర్చగలమా? లేదు. అలాగే మనోనిరోధం కూడా. మనస్సు అంటేనే విషయాలను ఆశ్రయించి ఉండేది అని అర్థం. అసలు విషయాలే లేకపోతే ఇంక మనస్సెక్కడ ఉంటుంది. కాబట్టి చెయ్యవలసింది ఏమంటే విషయ నాశనం. అంతే కాని మనోనిరోధము కాదు. ఇక్కడ కేవలము అజ్ఞానులు మూర్ఖులు మాత్రమే మనస్సును నియంత్రించాలనుకుంటారు. ప్రపంచం ఉన్నంతసేపు అజ్ఞానికి మనస్సు ఉంటుంది.

అయితే మనోజయము అవసరం లేదా? అంటే లేదని కాదు. ప్రాథమిక దశలో ఉన్నవాడికి మనోలయము తప్పనిసరి. అయితే సాధనలో చాలాముందుకు వెళ్ళిన వారికి మనోలయం కన్న జ్ఞానం అవసరం. జ్ఞానికి మనోలయము తప్పనిసరిగా జరుగుతుంది.

**భావస్య భావకః కశ్చిత్ న కించిత్ భావకోపరః ।**
**ఉభయాభావకః కశ్చి దేవమేవ నిరాకులః ॥ 42**

కొందరు ఈ జగత్తుకు ఆధారమైన సత్యం అంటే పరబ్రహ్మము ఉన్నదని నమ్ముతారు. మరికొందరు శూన్యము మాత్రమే ఉందంటారు. ఇలా ఏదీ భావించని జ్ఞాని చాలా అరుదుగా కనిపిస్తాడు. అతడు ముక్తుడై శాంతంగా ఉంటాడు.

జగత్సృష్టిమీద అనేకమంది అనేక భావాలు వ్యక్తం చేశారు. ప్రకృతి పురుషుల కలయిక చేతనే సష్టి జరిగింది అన్నారు. అయితే సృష్టిని ఋజువు చేసే ఆధారాలు లేవు అన్నారు సాంఖ్యులు. ప్రతి వస్తువు నిరంతరము మారుతూ ఉంటుంది. అదే పరిణామవాదము. యోగులు ఈ సిద్ధాంతాన్ని అంగీకరించారు. మీమాంసకాలరుల దృష్టిలో జగత్తు ఎవరి చేతా సృష్టించబడలేదు. శాశ్వతంగా ఇలాగే ఉంటుంది. పరమేశ్వరుడే సృష్టికర్త అన్నాడు వ్యాసుడు, జగత్తు పరమాణువుల కలయికతో ఏర్పడింది అంటాడు కణాదుడు. చార్వాకులు సృష్టి స్వాభావికము అన్నారు. కొన్ని పదార్థాలు కలిస్తే కొత్త రూపం ఏర్పడుతుంది. పసుపు సున్నం కలిపితే పారాణి అవుతుంది. అలాగే జగత్తు కూడా. సృష్టి అనాదిగా ఉన్నదని జైనుల విశ్వాసం. ఒక దానివల్ల ఇంకొకటి కలుగుతోంది అంటాడు బుద్ధుడు. ఈ రకంగా జగత్తులో పరబ్రహ్మము ఉన్నదని కొందరు అసలు లేరని కొందరు భిన్నవాదనలు చేస్తుంటారు. వీరంతా అవివేకులే. జ్ఞాని దృష్టిలో అసలు జగత్తే లేదు. అందుకే జగత్తంతా మిధ్య అంటాడు శంకరుడు.

**శుద్ధమద్వయమాత్మానం భావయంతి కుబుద్ధయః ।**
**నతుజానంతి సమ్మోహాత్ దాయ్యావజ్జీవ మనిర్వృతాః ॥ 43**

ఆత్మశుద్ధమని అద్వితీయమని ధ్యానించే వారు ఆత్మానుభవాన్ని పొందలేరు. ఆత్మానుభవాన్ని సాధించాలనే పట్టుదలతో, సాధించలేకపోయామనే అసంతృప్తితో జీవితమంతా గడిపేస్తారు.

ఆత్మానుభవం లేని అజ్ఞానులు ఆత్మ అద్వితీయమని, సర్వవ్యాపకము, నిర్మలము అని ఆలోచిస్తారు కాని ఆత్మసాక్షాత్కారము మాత్రము పొందలేదు. దీనికి కారణం ఏమిటి? అంటే మోహము. ఆత్మనిర్మలము. అసలు నిర్మలమంటే ఏమిటి?మలములు ఐదు రకాలు.

**1.అణవమలము :** పరబ్రహ్మను తెలుసుకోవాలనే జ్ఞానము అప్పుడప్పుడు కలగగా, దాన్ని మరుగు పరచేది.

**2. కార్మికమలము :** పెద్దల వలన వేదాంత శాస్త్ర విషయాలను, రహస్యాలను తెలుసుకొనేటప్పుడు, వాటియందు బుద్ధి చొరనీయనిది.

**3. మాయికమలము :** ఎక్కువ అజ్ఞానము. పరబ్రహ్మను తెలుసుకోవాలనే జ్ఞానాన్ని కలగనీయనిది.

**4. మాయేకమలము :** మాయా సంబంధమైన పాపకార్యముల యందు మనసును ప్రవేశపెట్టేది.

**5. తిరోధానమలము :** పరబ్రహ్మ కన్న వేరుగా దేవతలున్నారు. వారికి అర్చనలు, పూజలు, మంత్రాలు, తంత్రాలు, సాధనలు ఉన్నాయి. ఇది సత్యము అనే భావాన్ని కలగజేసి, జననమరణాది దుఃఖాల అనుభవానికి కారణమైనది. ఇటువంటి మలము లేకుండా ఉండటమే నిర్మలత్వము. ఆత్మఅద్వయము - అద్వయు అంటే న+ద్వయము. రెండవది లేనిది. పరమేశ్వర స్వరూపం **ఏకాకీభూమారూపానిర్ద్వైతా ద్వైతవర్జితా** అంటోంది **లలితా సహస్రం.** భూమము అంటే బ్రహ్మము అని అర్థం. **ఛాందోగ్యోపనిషత్తు**లో ఒకసారి నారదుడు సనత్కుమారుడి దగ్గరకు వచ్చి మనశ్శాంతి కావాలి. అని అడుగుతాడు. అప్పుడు మనశ్శాంతి కోసం భూమావిద్యను అదే బ్రహ్మవిద్యను ఉపదేశిస్తాడు సనత్కుమారుడు. పరబ్రహ్మతో సమానమైనది కాని, అంతకన్న ఎక్కువైనది గాని ఏదీలేదు.

**ఆత్మసర్వవ్యాపకము :** సర్వత్ర వ్యాపించినది. ఆకాశము వలె అంతటా వ్యాపించినది. **అంతర్‌బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః** పరమేశ్వర స్వరూపం జగత్తు లోపల బయట అంతా వ్యాపించింది. బయట ఉన్నది మహదాకాశం. ఘటంలో ఉన్నది ఘటాకాశం. ఘటం విచ్ఛిన్నమైతే ఘటాకాశం మహదాకాశంలో లీనమై పోతుంది. అలాగే జీవాత్మ పరమాత్మలో లీనమై పోతుంది. ఆత్మస్వయంజ్యోతి వెలుగులకు వెలుగు. కాంతులకు కాంతి ఆత్మ కొన్నివేల కోట్ల సూర్యులకాంతి కిరణాలతో ప్రకాశిస్తున్నది. అందులో నుంచి 108 కిరణాలను అగ్నిదేవుడు, 116 కిరణాలను సూర్యుడు, 132 కిరణాలను చంద్రుడు తీసుకున్నారు. ఈ కిరణముల

వల్లనే అంటే పగటిపూట సూర్యునికాంతులతోను, రాత్రిపూట చంద్రుని వెలుగుల తోను, సంధ్య వేళలయందు అగ్నియొక్క కాంతులతోను లోకాలు ప్రకాశిస్తున్నాయి. సూర్యుడు, చంద్రుడు, అగ్ని వీరెవరూ లేనప్పుడు పరమేశ్వరుని కాంతులతోనే లోకాలు ప్రకాశిస్తున్నాయి. అన్నింటికీ వెలుగుల నిచ్చేది ఆత్మ. కాని ఆత్మకు కాంతినిచ్చేది ఏదీలేదు. **ఆత్మస్వయంప్రకాశి.**

అందుకే ఆత్మసత్యము నిత్యము శాశ్వతము. అయితే ఆత్మశుద్ధము. అద్వితీయము అని ధ్యానించే వారికి ఆత్మతత్త్వం తెలియదు. వీరు ఆత్మను సాధించాలనే కోరికతోనే జీవితాన్ని గడిపేస్తారు.

**ముముక్షో ర్బుద్ధిరాలంబమంతరేణ న విద్యతే ।**
**నిరాలంబైవ నిష్కామా బుద్ధిర్ముక్తస్య సర్వదా ॥** **44**

ముక్తిని కోరేవాడి బుద్ధి ఏదో ఒకదాన్ని ఆశ్రయించి పని చేస్తుంది. జీవన్ముక్తుని బుద్ధికి ఆధారం అవసరం లేదు. అతడికి నిత్యముక్త భావనా రూపమయిన ఆనందం సర్వదా ఉంటుంది.

ఆత్మసాక్షాత్కారము కలిగితే సరే కలగకపోతే, అటువంటివాడు విగ్రహారాధన చేస్తాడు. ఆత్మజ్ఞాని చిద్రూపుడు. అతని బుద్ధి నిరాలంబమై ఏ ఆధారం లేకుండానే ఉంటుంది. ఈశ్వరుడిని, శ్రీమహావిష్ణువును ఆరాధించి తద్వారా ముక్తి పొందాలని ప్రయత్నిస్తాడు. కాని ఆత్మానుభవం ఉన్న జ్ఞాని ఆత్మకన్న ఇతరమైన వేటి గురించీ ఆలోచించడు. సర్వదా చిద్రూపుడై ఉంటాడు. ఈ సమయంలో ఒక విషయాన్ని గమనించాలిక్కడ. ముక్తి, మోక్షము అనే పదాలు రెండూ ఒకే అర్థంలో వాడేస్తున్నారు. కాని ముక్తి వేరు. మోక్షం వేరు. సాకారాన్ని అర్చించేవాడు పొందేది ముక్తి. సాకారాన్ని అర్చించేవాడు మరణానంతరము పరమపదం చేరి కార్యబ్రహ్మను సేవిస్తూ అక్కడే ఉండిపోతాడు. ఇది ముక్తి. నిరాకారాన్ని ఉపాసించే వాడి జీవాత్మ మరణానంతరము పరమాత్మలో లీనమవుతుంది. ఇది సాయుజ్యము లేదా మోక్షము. దీనిమీద వివరణకు గ్రంథం మొదట్లో ఇచ్చిన 'ముక్తి–మోక్షము' వివరణ చూడండి.

**విషయద్వీపినోవీక్ష్య చకితాః శరణార్థినః ।**
**విశంతి ఝటితి క్రోఢం నిరోధైకాగ్రసిద్ధయే ॥** **45**

విషయ భోగాలు భయంకరమైన పులుల లాంటివి. వీటికి భయపడి బుద్ధి గుహలోకి జొరపడి మనసును ఏకాగ్రం చేసి, మనసును నిరోధించాలి అని ప్రయత్నిస్తున్నారు సాధకులు.

విషయ వాసనల నుంచి బయటపడని వాడు మనసును జయించటం కోసం అరణ్యాలలోను, కొండగుహలలోను నివసిస్తారు. అలా ఏకాంతంగా ఉన్నంత మాత్రం చేత మనోజయము కలుగుతుంది అనే నమ్మకం ఏమీ లేదు. దీనికి విశ్వామిత్రుడే మంచి ఉదాహరణ. హిమాలయ పర్వతాల్లో ఆశ్రమం నిర్మించుకుని తపస్సు చెయ్యాలని నిర్ణయించుకున్నాడు. పడమర దిక్కుగా తిరిగి పదివేల సంవత్సరాలు తపస్సు చేశాడు. ఒకరోజు ఉదయం నిద్రలేచి ఆశ్రమ ప్రాంగణంలోకి వచ్చాడు. ఎదురుగా సెలయేరు. గలగలా పారుతోంది. రాయంచలు తిరుగాడుతున్నాయి. పక్షుల కిలకిలారావాలు ప్రతిధ్వనిస్తున్నాయి. ఆ సెలయేరులో అర్థనగ్నంగా స్నానం చేస్తోంది అప్సరాంగన మేనక. అపురూప సౌందర్యరాశి. ఆమెను చూడగానే స్తబ్దుడై పోయాడు మహర్షి. చేతిలోని కమండలం జారి క్రింద పడిపోయింది. పులితోలు ఎక్కడో పడిపోయింది. తనను తాను నిగ్రహించుకోలేక పోయాడు. మేనక వెనుక పరుగులు తీశాడు. ఆవిడతో కాపురం చేశాడు. శకుంతలను కన్నాడు. పదివేల సంవత్సరాల తపస్సు బుగ్గిపాలయింది. మేనక వచ్చి నాకు తపోభంగము కలిగించింది అనుకున్నాడు మహర్షి. చాలా జాగ్రత్తగా చూడండి. మేనక నీకు తపోభంగం కలిగించలా, నువ్వు మనసుని అదుపు చేసుకోలేక పోయావు. ఇంద్రియాలను జయించలేకపోయారు.

మహర్షులు తపస్సు చేస్తుంటే ఇంద్రుడు అప్సరాంగనలను పంపి వారికి తపోభంగం కలిగిస్తాడు అనుకుంటారు. అలా ఏమీకాదు. పరమాత్మ సన్నిదికి చేరాలి అనుకుంటున్నావు. దానికి అర్హత సాధించాలి అంటే పరీక్షలో నెగ్గాలి. పరీక్షాధికారి ఇంద్రుడు, పరీక్షావస్తువు మేనక. పరీక్ష పెట్టాడు. ఇది మొదటి పరీక్ష కామము ఇందులో నువు ఉత్తీర్ణుడవు కాలా. అర్హత సాధించలా. అది నీ తప్పు. నీ చేతకానితనం కప్పిపుచ్చుకోటానికి ఇంద్రుణ్ణి సాకుగా చూపుతున్నావు.

కాబట్టి కొండగుహలో కూచున్న మాత్రం చేత మనోజయం కలగదు. జ్ఞానికి ఆ అవసరం లేదు. విషయవాసనలున్న వారు, వాటిని జయించలేక భయంతో

అరణ్యాలకు పోయి, సాధుపుంగవులను ఆశ్రయించి కొండగుహలు, పర్వతాలు, అరణ్యాలు, చెట్టుతొర్రలు నివాసంగా ఎంచుకుంటారు. అక్కడ ఉన్నంత మాత్రం చేత మనోనిగ్రహం రాదు. ఏకాగ్రత అంతకన్నా రాదు.

**నిర్వాసనం హరిం దృష్ట్వా తూష్ణీం విషయదంతినః ।**
**పలాయంతే న శక్తాస్తే సేవంతే కృతచాటవః ॥ 46**

వాసనారహితుడైన జ్ఞానిని చూసి విషయాలు పారిపోతాయి. లేదా విధేయులైన సేవకులలాగా పనిచేస్తాయి.

ఇక్కడ **నిర్వాసనంహరిం** అంటున్నారు. వాసనారహితుడైన వాడిని 'హరిం' సింహంతో పోలుస్తున్నారు. **విషయదంతినః** విషయ వాసనలను ఏనుగులతో పోల్చి చెబుతున్నారు. వాసనారహితుడైన పురుషసింహాన్ని చూసి విషయములనే ఏనుగులు పలాయనం చిత్తగిస్తాయి. లేదా అతడికి వశమయి దాసులవలె ఉంటాయి. అంటే మహాత్ముడైన జ్ఞాని దగ్గరకు విషయ వాసనలు చేరవు. ఇది జీవన్ముక్తుని గొప్పదనం. అతడు జనం మధ్యలో అంటే విషయాల మధ్య నివసిస్తున్నాడు. కాని ఆ విషయాలు అతణ్ణి ఏమీ చేయవు. బురదలో తిరిగే కుమ్మరి పురుగులా ఉంటాడతడు.

వాసనలు కోరికలు ఈ రెండూ ఒకటే. బుద్ధిలో ఉన్న అవ్యక్తరూపం వాసనలు. అవి వ్యక్తమైతే కోరికలు. జ్ఞాని వాసనారహితుడు, అతడికి కోరికలుండవు. మనలో ఉన్న కోరికలే మనల్ని బానిసలుగా చేస్తాయి. కోరికలు లేనివ్యక్తిని అతడి ముందు విషయాలున్నా అవి అతణ్ణి ఏమీ చెయ్యలేవు. అతణ్ణి వశపరచుకోలేవు. జ్ఞానికి కోరికలుండవు కాబట్టి ప్రాపంచిక సుఖాలు అతణ్ణి బాధించవు. పూర్వకాలంలో నరనారాయణులు బదరికావనంలో తపస్సు చేస్తున్నారు. ఆ సమయంలో ఇంద్రుడి పనుపున అప్సరాంగనలు వచ్చి నాట్యం చేస్తున్నారు. ఇక్కడ ఒక విషయం గమనించండి. అప్సరాంగనలు వచ్చారు అంటే అందుకు అవసరమైన వాతావరణం కూడా ఏర్పడుతుంది. వసంతకాలం, కోకిలల కూతలు, పచ్చని చిలకలు, చల్లగాలి ఈ స్థితిలో మన్మథుడు రతీదేవి సహితుడై వస్తాడు. అప్పుడు అప్సరాంగనలు వచ్చి వయ్యారాలు ఒలకపోస్తారు. ఇప్పుడు నరనారాయణుల తపోభంగం కోసం అప్సరసలు వచ్చారు. నారాయణుడు వారి అందచందాలకు ఆకర్షితుడు కాలేదు

సరికదా, తన తొడమీద అరచేత్తో రాచాడు. అతని తొడనుంచి ఒక అప్సరాంగన ఆవిర్భవించింది. ఊరువు నుంచి వచ్చింది కాబట్టి **'ఊర్వసి'** అని నామకరణం చేశారు. ఊర్వసి చాలా అందగత్తె. వచ్చిన అప్సరాంగనలందరి కన్నా అందగత్తె. ఆమెను చూసి వారు తలదించుకున్నారు. ఇక్కడ గమనించాల్సిందేమంటే నారాయణుడు మహాజ్ఞాని. అతనికి వాసనలు లేవు. అందుకే అతడు మోహపడలేదు.

భగవద్గీతలో

**విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః ।**

**రసవర్జం రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥**

ఇంద్రియాల ద్వారా విషయాలను గ్రహించని వాని నుండి ఇంద్రియ పదార్థాలు వెళ్ళిపోతాయి. కాని వాటిపై ఆసక్తి మాత్రం మిగిలి ఉంటుంది. స్థితప్రజ్ఞుడికి పరమాత్మ సాక్షాత్కారమైంది కాబట్టి అతని నుండి ఆసక్తి కూడా తొలగిపోతుంది.

**నముక్తికారికాంధత్తే నిశ్శంకో యుక్తమానసః ।**

**పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్నాస్తే యథాసుఖమ్ ॥ 47**

సందేహం లేకుండా నేనే ఆత్మని అని తెలుసుకున్న వ్యక్తి ముక్తి కోసం ధ్యానం చెయ్యాలని అనుకోడు. చూస్తూ, వింటూ, తింటూ ఆనందంగా తిరుగుతుంటాడు.

నేనే ఆత్మని అనే జ్ఞానం కలిగినవాడు ముక్తుడు. ఇందులో సందేహం లేదు. అతనికి అహంకారముండదు. అతడు చేసే కర్మలవల్ల క్రొత్తగా ఏ ఫలితము రాదు. క్రొత్త వాసనలు సృష్టించబడవు.

నిశ్చలమైన మనస్సు కలవాడు జ్ఞాని. అతడికి యమనియమాలు వాటంతటవే జరుగుతుంటాయి. లోకం దృష్టిలో తినటం, తాగటం, చూడటం వంటి పనులు చేస్తూనే ఉంటాడు. ఆ పనుల యందు అతడికి కర్తృత్వాభిమానము ఉండదు.

జీవన్ముక్తుని ఇంద్రియాలు వాటి పని అవి చేస్తున్నా అవేవీ అతడికి సంబంధించవు. కర్మలు ఇంద్రియాలకు చెందినవి మాత్రమే. ఇంద్రియాలు జడాలు. వాటికి చైతన్యాన్నిచ్చేది ఆత్మ. అదే తను. ఈ విషయం తెలిసిన జ్ఞానిని కర్మలు ఏమీ చెయ్యలేవు. ఏమీ బంధించలేవు, జీవన్ముక్తుని సన్నిధిలో శరీరం పనిచేస్తున్నా, ఆ కర్మలేవీ అతడికి అంటవు.

**వస్తుశ్రవణ మాత్రేణ శుద్ధ బుద్ధిర్నిరాకులః ।**
**నైవాచార మనాచార మౌదాస్యం వా నపశ్యతి ॥ 48**

ఆత్మతత్త్వాన్ని గురించి విన్నంత మాత్రం చేతనే తెలివిగల వాడి బుద్ధి శుద్ధమవుతుంది. అతడు శాంతంగా జీవిస్తాడు. ఈ పని చెయ్యాలి. ఇది చెయ్యకూడదనే భావం అతనికి ఉండదు. ఈ పని చేస్తున్నాను, చెయ్యటం లేదు అనే భావనే అతనికి ఉండదు.

ఆత్మసాక్షాత్కారం కావాలంటే ఈ జన్మలో చేసిన కర్మ ఫలితం చాలదు. ఎన్నో జన్మల తపః ఫలం కావాలి. గురువుదగ్గర ఉపదేశం పొంది, గురూపదేశాలు విని, మహావాక్యాలకు అర్థం తెలుసుకోవాలి. **చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. నేనే పరబ్రహ్మాని. ఈ జగత్తులో నేను తప్ప ఇంకేదీ లేదు.** ఇదే మహావాక్యాల అర్థం. గతజన్మల కర్మఫలం ఉన్నవాడికి ఆత్మసాక్షాత్కారం త్వరగా జరుగుతుంది. అటువంటివాడు తానే పరబ్రహ్మము అవుతాడు. కాబట్టి అతడు కర్మలు ఆచరిస్తే ఆచారవంతుడు కాడు. కర్మల నాచరించకపోతే అనాచారి అంతకన్నా కాదు. అతడు తటస్తుడుగా ఉంటాడు. చిద్రూపుడికి శుభాశుభాలతో పనిలేదు.

**యదా యత్కర్తుమాయాతి తదాతత్కురుతే ఋజుః ।**
**శుభం వాప్య శుభం వాపి తస్యచేష్టా హి బాలవత్ ॥ 49**

జ్ఞాని తనకు ప్రాప్తించిన ఏ కర్మలైనా సరే మంచి చెడు అని చూడకుండా సమదృష్టితో శాంతంగా చూస్తాడు, కేవలము చిన్నపిల్లవాడు లాగా ప్రవర్తిస్తాడు.

చిన్నపిల్లలకు ఏమీ తెలియదు. అక్కడ దీపం వెలుగుతూ ఉంటుంది. పిల్లవాడు వెళ్ళి దాన్ని ముట్టుకుంటాడు. అది దీపం. వేడిగా ఉంటుంది కాలుతుంది అని అతనికి తెలియదు. పిల్లల చేష్టలు చాలా విచిత్రంగా ఉంటాయి. నేలమీద చీమలు కనిపిస్తే చంపేస్తారు. ఒక్కోసారి వాటిని పట్టుకుని నోట్లో పెట్టుకుంటారు. అవి నోరంతా కుట్టేస్తాయి. వారికి భయముండదు. పాపభీతి అంతకన్న ఉండదు. అలాగే జ్ఞాని కూడా లోకం దృష్టిలో ప్రారబ్ధవశాన వచ్చిన కర్మలు చేస్తున్నప్పటికీ వాటిమీద కర్తృత్వాభిమానముండదు. ఆ కర్మలన్నీ చిన్నపిల్లల చేష్టలు లాగానే ఉంటాయి. **తస్యచేష్టాహిబాలవత్** ఇంకో విషయం ఏమంటే అన్ని సందర్భాలలోను జ్ఞాని సమదృష్టితో ఉంటాడు. ప్రారబ్ధానుసారం ప్రాప్తించిన కర్మను కర్తృత్వ భోక్తృత్వాలు లేకుండా చేస్తాడు.

**స్వాతంత్ర్యాత్సుఖమాప్నోతి స్వాతంత్ర్యాల్లక్షతే పరమ్ ।**

**స్వాతంత్ర్యాన్నిర్వృతిం గచ్ఛేత్ స్వాతంత్ర్యాత్పరమంపదమ్ ॥ 50**

సుఖము, సుఖాతీతము అయిన ఆనందస్థితి, భావరహితమైన శాంతస్థితి, ఆత్మానుభవం ఇవన్నీ స్వతంత్రం వల్లనే వస్తాయి. 'స్వం' అంటే తను, ఆత్మ' పరం అంటే ఇతరమైనది. అనాత్మ. ఇక్కడ స్వతంత్ర పరతంత్రాలు. అనాత్మ జడము అనృతము దుఃఖము వీటికి శం కావటమే పరతంత్రత, దీనికి వ్యతిరేకమైనది స్వతంత్రత. అదే ఆత్మసాక్షాత్కారము. స్వాతంత్ర్యము వలన మంచి జ్ఞానం కలుగుతుంది. రాగద్వేషాలు నశిస్తాయి. రాగద్వేషాలు **చిత్తమలములు** అనబడతాయి. ఈ చిత్తమలములు లేకపోవటమే **మనఃప్రసాదము** అంటారు. కాబట్టి స్వాతంత్ర్యము వల్ల మనః ప్రసాదము, తరువాత జ్ఞానము కలుగుతాయి. స్వాతంత్ర్యము వల్లనే ఆత్మానంద సుఖము కూడా కలుగుతుంది. దాని వల్ల స్వస్వరూప విశ్రాంతి కలుగుతుంది.

**అకర్తృత్వ మభోక్తృత్వం స్వాత్మనో మన్యతే యదా ।**

**తదా క్షీణా భవంత్యేవ సమస్తాశ్చిత్త వృత్తయః ॥ 51**

తనలో ఉన్నది అనుకుంటున్న ఆత్మ దేనికీ కర్తా కాదు భోక్తా కాదు అని తెలుసుకున్న జ్ఞానిలో అన్ని రకాల భావసంచలనాలు సమసిపోతాయి.

జీవుడు నేను కర్తను కాను. భోక్తను అంతకన్నా కాను అని భావించినప్పుడే చిత్తవృత్తులు నశిస్తాయి. ఈ ధర్మాలన్నీ జాగ్రదావస్థ, స్వప్నావస్థల యందు ఉంటాయి. కాని సుషుప్తి యందు ఉండవు. కాబట్టి కోరికలన్నీ బుద్ధి ధర్మాలు అంతేకాని ఆత్మధర్మాలు కావు. అందుచేత బుద్ధి ధర్మాలు తొలగిపోతేనే ఆత్మదర్శనమవుతుంది. కర్తృత్వ భోక్తృత్వాలు నశించగానే అహంకారం అదృశ్యమయి 'అహం'గా సర్వభూతాత్మగా, సచ్చిదానందంగా మిగిలిపోతుంది.

**ఉచ్ఛృంఖలా ప్యకృతికా స్థితిర్ధీరస్య రాజతే ।**

**నతు సంస్పృహా చిత్తస్య శాంతిర్మూఢస్య కృత్రిమా ॥ 52**

విధి నిషేధాల నుండి విడివడిన జ్ఞాని ప్రవర్తన సహజమైన ఆనందంతో ప్రకాశిస్తూ ఉంటుంది. అదే అజ్ఞానికి కేవలం సాధనవల్ల ప్రయత్నించినా, అతడి

మనసు కోరికలతో నిండి ఉంటుంది కాబట్టి అతని చేష్టలు కూడా కృత్రిమంగానే ఉంటాయి.

జ్ఞానికి తాను చేసే పనులయందు ఏ మాత్రము స్పృహ ఉండదు. ఆ పనులన్నీ కూడా నిష్కామ్యంగా చేస్తాడు. బయటి వారి దృష్టికి శాంతి లేనట్లుగా కనిపించినా నిజానికి పరమశాంతితో ఉంటాడు. కాని అజ్ఞాని కపటంతో శాంతంగా ఉన్నట్లు నటిస్తాడు. అందుచేత అతడు జ్ఞానిలాగా అనిపిస్తాడు.

జీవన్ముక్తునిలో ఇంద్రియాల ద్వారా సుఖాన్ని అనుభవించాలనే కోరిక ఉండదు. అసలు ఏ రకమైన కోరికలు ఉండవు. విధినిషేధాలతో పని లేకుండా స్వతంత్రంగాచరిస్తాడు. దాంతో ఎప్పుడూ ఆత్మానుభవనిష్ఠుడై పరమశాంతంగా, ఆనందంగా జీవిస్తాడు.

అటువంటి జ్ఞానిని మూర్ఖుడితో పోల్చి చెబుతున్నారు. జ్ఞానికి పూర్తి వ్యతిరేక దిశలో ఉంటాడు అజ్ఞాని. అతడు తనలోని కోరికలు, ఉద్రేకాలు అణచుకుని పైకి ప్రశాంతంగా కనిపిస్తాడు. కాని అతడు చేసే పనులలో కృత్రిమత్వం అడుగడుగునా కనిపిస్తూనే ఉంటుంది. పైకి శాంతంగా కనిపించినా, లోపల అశాంతితోనే ఉంటాడు. నిజమైన శాంతి ఆత్మానుభవంలోనే వస్తుంది. అంతేకాని కపటపు ప్రవర్తనతో రాదు.

**విలసంతి మహాభోగైర్విశంతి గిరిగహ్వరాన్ ।**
**నిరస్త కల్పనా ధీరా అబద్ధా ముక్త బుద్ధయః ॥ 53**

మనోబుద్ధులలోని భావాల తాదాత్మ్యం నుంచి బయటపడి, తనను తాను ఆత్మగా గుర్తించిన జ్ఞాని అప్పుడప్పుడు సంతోషంగా మనోబుద్ధులతో జగత్తులో విహరిస్తాడు. ఒక్కొక్కసారి కొండగుహలలో ధ్యానంలో ఉండిపోగలడు. జ్ఞాని సంకల్ప వికల్పాలు లేనివాడు. ఒకసారి భోగాలనుభవిస్తాడు. ఇంకోసారి కొండగుహలు, పర్వతాలు, అరణ్యాలు నదీతీరాలలో ఒంటరిగా సంచరిస్తుంటాడు. అతడికి కర్తృత్వాభిమానముండదు.

జీవన్ముక్తుడు ఎప్పుడూ ముక్తస్థితిలో ఉంటాడు. అతడికి అహంకారం ఉండదు. మనోబుద్ధులను అధిగమించి ఉంటాడు. కాబట్టి బాహ్య విషయాలపట్ల ఆసక్తత ఏ మాత్రము ఉండదు. అతని మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. అతనికి బంధుత్వ

భావన ఉండదు. కోరికలుండవు. ఈ రకంగా మనోబుద్ధుల సహజగుణాలయిన కోరికల భావాల వత్తిడి అతనికి ఏమాత్రము ఉండదు. పరమశాంతంగా తృప్తిగా ఉండగలుగుతాడు.

అతడికి శరీరంతో నిమిత్తం లేదు. అరణ్యాలలో ఉండనీ, ఎడారిలో, కొండ గుహలో, జనారణ్యంలో ఎక్కడ ఉన్నా పరమశాంతంగా ఉంటాడు. దీనికి కారణం అహంకార మమకారాలు లేకపోవటము.

అతడు సుఖాలు అనుభవిస్తున్నట్లుగా మనకు కనిపిస్తాడు. నిజానికి అతనిలో ఏ భావనా ఉండదు.

**శ్రోత్రియం దేవతాం తీర్థమంగనాం భూపతిం ప్రియం ।**
**దృష్ట్వా సంపూజ్య ధీరస్య న కాఽపి హృది వాసనా ॥ 54**

వేదపండితులను దర్శిస్తున్నా, దేవతలను అర్చిస్తున్నా, తీర్థాలు సేవిస్తున్నా, సౌందర్యవతి అయిన స్త్రీని చూసినా, ఎవరిని చూసినా అతనిలో ఏ భావము ఉండదు. జడుడులాగా స్థిరచిత్తంతోఉంటాడు.

తాను సచ్చిదానందరూపుడు. జగత్తంతా అలాగే ఉంటుందని భావిస్తాడు. ఏ రకమైన వాసనలు ఉండవు. వేదపండితుడు, రాజు, అప్సరాంగన, ఎవరినైనా ఒకే రకంగా చూస్తాడు. ఇతనికి ఆదరణ, అనాదరణ అనే భావాలుండవు.

ఇలాంటి స్థితి సాధ్యమేనా? అని చాలామందికి అనుమానం వస్తుంది. జనసమూహంలోకి ఒక అతిలోక సౌందర్యవతి వచ్చింది. ఆవిడ పలుకులు వీణానాదం లాగా ఉన్నాయి. నడకలు రాజహంసలను మైమరపిస్తున్నాయి. మెరుతీగలా ఉంది. చూడగానే ఎదుటివారి మతిపోతుంది. అక్కడున్న వారందరూ ఆ స్త్రీని చూశారు. అందరి భావాలు ఒకే రకంగా ఉండవు. సాటి స్త్రీలకు ఒక రకమైన అసూయ ఉంటుంది. చిన్నపిల్లలు ఏమీ తెలియని స్థితిలో ఉంటారు. వయోవృద్ధుల భావాలు ఎలా ఉన్నా, మనకెందుకులే అని వెళ్ళిపోతారు. సాధుపుంగవులు, జ్ఞానులు ఆమెను పట్టించుకోరు. ఆమెను చూసి వికారం పొందే వారు కేవలము యవ్వనంలో ఉన్నవారు మాత్రమే. కాబట్టి జ్ఞాని వేదపండితులను పూజించినా, తీర్థాలు సేవించినా, అందమైన స్త్రీలు, రాజులు, ప్రజలు ఎవరి దగ్గరైనా

సరే ఒకే రకంగా ఉంటాడు. **పండితాస్సమదర్శనః** పండితుడు అంటే జ్ఞాని. పండ గలిగినవాడు పండితుడు, పండ అంటే జ్ఞానము. పండితుడు అంటే జ్ఞానము కలవాడు. జ్ఞాని అందరినీ, అన్నింటినీ సమానంగానే చూస్తాడు.

**భృత్యైః పుత్రైః కళత్రైశ్చ దౌహిత్రైశ్చాపి గోత్రజైః ।**
**విహస్య ధిక్కృతో యోగీ నయాతి వికృతిం మనాక్ ॥ 55**

భార్య, పుత్రులు, బంధువులు, మిత్రులు, ఎవరు ఏ విధంగా దూషించినా, బాధించినా, వికారం చెందడు. బాధ పడడు. అతడు చిద్రూపుడు, రాగద్వేషాలు, మానావమానాలు, సుఖదుఃఖాలు అన్నింటికీ అతీతుడు. భార్యాపిల్లలతో సహా బంధువులు ఎవరు ఎలా వ్యవహరించినా బాధ పడడు. అపహాస్యము అవమానము జరిగినా చలించడు.

ఒకసారి కొత్తగా పెళ్ళైన దంపతులు రాత్రి 8 గం॥ల సమయంలో ఒక టీ స్టాలు దగ్గర ఆ టీ తాగుతున్నారు. ఆ సమయంలో ఒక వ్యక్తి. వటిమీద బట్టలు లేవు. పూర్తిగా దిగంబరుడు. నెత్తిన జుట్టు, గడ్డము బాగా పెరిగి ఉన్నాయి. చూడటానికి అసహ్యంగా ఉన్నాడు. అతడు వీరికి దగ్గరలోనే నుంచుని ఆ అమ్మాయిని తదేకంగా చూస్తున్నాడు. భర్తకి కోపం వచ్చి తాగుతున్న వేడి టీ అతని ముఖాన కొట్టాడు. అతడు ఏ మాత్రం చలించలా. అలాగే ఉన్నాడు. ఈ దంపతులు ఇంటికి వెళ్ళేసరికి, ఇల్లు అగ్ని ప్రమాదానికి గురైంది. ఆమెకు సంబంధించిన వస్తువులన్నీ దరిదాపుగా కాలిపోయాయి. ఇది జరిగిన సంఘటన. యధార్థ సంఘటన.

ఒకసారి బుద్ధభగవానుడు శిష్యులతో పాటు వెడుతున్నాడు. అంతలో ఒక వ్యక్తి వచ్చి బుద్ధుణ్ణి నోటికి వచ్చినట్లు తిట్టేశాడు. అంతా అయిపోయిన తరువాత బుద్ధుడు ఆ వ్యక్తిని చూసి 'అయిపోయిందా? బయలుదేరనా?' అని అతని అంగీకారం కోసం ఎదురు చూడకుండా బయలుదేరాడు. కాని బుద్ధుని శిష్యులలో ఒకతనికి మాత్రం తీవ్రమైన కోపం వచ్చింది. అతడు బుద్ధుడి దగ్గరకు వచ్చి స్వామీ, మీరు అతనికి ఏమీ సమాధానం చెప్పలేదు. అతడు నోటికి వచ్చినట్లు మాట్లాడాడు. మీరు అనుజ్ఞ ఇవ్వండి. నేను వెళ్ళి అతనికి సమాధానం చెప్పి వస్తాను అన్నాడు. దానికి బుద్ధభగవానుడు 'నాయనా! అతడు అన్న వీటినీ నేను స్వీకరించలేదు. అందుకే తిరిగి ఇవ్వలేదు. ఒకవేళ నువ్వు గనక స్వీకరిస్తే, వెళ్ళి తిరిగి ఇవ్వు!' అన్నాడు.

బుద్ధుడు కూడా ఆత్మజ్ఞాన సముపార్జన చేసినవాడే. అందుకే అలా అన్నాడు. జ్ఞానులు ఎప్పుడూ దూషణ, భూషణ, తిరస్కారాలు అన్నీ సమానంగానే చూస్తారు.

**సంతుష్టోఽపి న సంతుష్టః ఖిన్నోఽపి న చ ఖిద్యతే ।**

**తస్యాశ్చర్యదశాంతాం తాం తాదృశా యేవ జానతే ॥ 56**

జ్ఞానికి సంతోషం కలగితే సంతోషించడు. విచారం కలిగితే దుఃఖించడు. ఇతడు జ్ఞాని అనే విషయం ఇంకొక జ్ఞాని మాత్రమే గుర్తించగలుగుతాడు.

జ్ఞాని చిద్రూపుడు. సామాన్య జనులకు అతడు సంతృప్తుడైనా సంతోషంగా కనపడడు. విచారం వచ్చినా దుఃఖిస్తున్నట్లుండడు. ఒకవేళ దుఃఖిస్తున్నట్లు కనిపించినా అతడు నిజంగా దుఃఖించడు. సర్వదా సచ్చిదానందరూపుడు. అటువంటి జ్ఞాని చర్యలు ఇతర జ్ఞానులకు మాత్రమే తెలుస్తాయి.

జ్ఞాని మనోధర్మాలను అధిగమించినవాడు, మనోనాశనము చేశాడు. మనసును జయించాడు. కాబట్టి అతడికి సుఖదుఃఖాలతో పనిలేదు. సంతోషము విచారములతో పనిలేదు. అతడు నిత్యతృప్తుడు. అతనికి కావలసింది ఏదీలేదు. అవసరం లేనిది అంతకన్నా లేదు. జగత్తులో సుఖం లేదు దుఃఖం లేదు. సంతోషం లేదు విచారం అంతకన్నా లేవు. అసలు మనస్సే లేదు. మనస్సే లేనప్పుడు మనస్సు చేత కల్పించబడిన ఈ జగత్తు ఎలా ఉంటుంది? మనోధర్మాలయిన సుఖదుఃఖాలు, సంతోష విచారాలు ఎలా ఉంటాయి? ఇవి ఏవీ ఉండవు. అందుచేతనే ఒక జ్ఞాని యొక్క స్థితి ఇంకొక జ్ఞాని మాత్రమే తెలుసుకోగలడు.

**కర్తవ్యతైవ సంసారో న తాం పశ్యంతి సూరయః ।**

**శూన్యాకారా నిరాకారా నిర్వికారా నిరామయః ॥ 57**

కర్తవ్య దృష్టి, ధర్మాచరణ భావము ఈ రెండే ఈ సృష్టి అంటే. అలాగే సర్వవ్యాపి, నిరాకారము, పరిణామ రహితము నిష్కళంకము పరబ్రహ్మ. అదే తాను. జ్ఞాని సాక్షాత్తు పరబ్రహ్మము. ఆత్మసాక్షాత్కారము పొందినవాడు. ఇతడికి ధర్మాధర్మాల ప్రసక్తే ఉండు.

నిద్ర పోతున్నాం ఒక కల వచ్చింది. నిద్ర పోతున్నంత సేపు అది నిజము అని భావిస్తాం. కష్టం కలిగితే ఏడుస్తాం. బాధ కలిగితే దుఃఖిస్తాం. మెలకువ వచ్చింది.

కల కరిగిపోయింది. జాగ్రదావస్థలోకి వచ్చాం. ఇందాక కలలో ఎదురైన మనోభావాలు సంతోషము, దుఃఖము ఇప్పుడుండవు. అని కలలోనే ఉంటాయి. ఎందుకంటే కల మనోకల్పితము. మనోకల్పితమైన కలలోనే మనోధర్మాలు ఉంటాయి. ఇప్పుడు జాగ్రదావస్థలో మనోకల్పితమైన కలలేదు. అలాంటప్పుడు మనోధర్మాలు మాత్రం ఎలా ఉంటాయి? ఉండవు. అందుకే జ్ఞాని మనోలయము చేసినవాడు. కాబట్టి అతడికి మనోధర్మాలు వర్తించవు.

**అకుర్వన్నపి సంక్షోభాద్వ్యగ్రస్సర్వత్ర మూఢధీః ।**
**కుర్వన్నపి తు కృత్యాని కుశలో హి నిరాకులః ॥ 58**

అజ్ఞాని ఏ పని చెయ్యకపోయినా ఆందోళనతో సతమతమవుతూ ఉంటాడు. అదే జ్ఞాని ఏ పని చేసినా నిశ్చయమైన జ్ఞానంతో పరమ శాంతంగా ఉంటాడు. అజ్ఞానికి ఏ పని చెయ్యకపోయినా, ఇది సత్యమా, ఇది అసత్యమా, ఇది అవుతుందా కాదా? ఈ జగత్తు సత్యమేనా? అసత్యమా? అసలు మోక్షం ఉన్నదా? ఇలాంటి ఉపయోగం లేని, అసందర్భమైన ప్రశ్నలు అనేకం వస్తాయి. వీటన్నింటికీ తానే సమాధానంచెప్పుకుంటూ ఉంటాడు. దృశ్యమానమైన జగత్తంతా సత్యమా అసత్యమా? ఒకవేళ సత్యమేనేమో? ఇలాంటి అనుమానాలు అజ్ఞానికే వస్తాయి. అతను ఏ పని చెయ్యకపోయినా అనుమానాలు వస్తాయి. **జ్ఞాని దృష్టిలో దృశ్యమానమైన జగత్తంతా అసత్యము బ్రహ్మ ఒక్కటే సత్యము. తానే పరబ్రహ్మ.** ఈ విషయం నమ్మి అతడు చిద్రూపుడై ఉంటాడు.

**సుఖమాస్తే సుఖం శేతే సుఖమాయాతి యాతి చ ।**
**సుఖం వక్తి సుఖం భుంక్తే వ్యవహారేపి శాంతధీః ॥ 59**

దైనందిన జీవితంలో, నిత్యకృత్యంలో జ్ఞాని శాంతమైన మనస్సుతో హాయిగా సుఖంగా ఉంటాడు. తింటాడు, తిరుగుతాడు, నిద్రపోతాడు.

జ్ఞాని ఆత్మవిదుడు. విదుడు అంటే తెలిసిన వాడు. ఆత్మవిదుడు. ఆత్మను గురించి తెలిసిన వాడు. ప్రారబ్ధానుసారము ప్రాప్తించిన పనులన్నీ చేస్తూ ఆత్మారాముడై ఉంటాడు. ఇంద్రియాలన్నీ వాటి పని అవి చేస్తుంటాయి. అయినప్పటికీ కర్తృత్వ భావన లేక సచ్చిదానందరూపుడై ఉంటాడు.

మహాత్ముడైన వాడికి లోపల బయట అనే తేడాలుండవు. అంతరంగంలోని ఆత్మానుభవము, బాహ్య ప్రపంచంలోని అనుభవాలు ఒకటే. వేరు కావు. అనంతమైన చైతన్యమే ఏకంగా నేను అనే భావనతో ఉంటాడు. ఒకే చైతన్యం అనేక భావాలుగా వ్యక్తం కావటాన్ని శాంతంగా వీక్షిస్తుంటాడు. అందుకే అన్ని జీవులను ఒకే రకంగా చూడగలడు. ఎటువంటి పరిస్థితిలోను అంతరంగ శాంతిని పోగొట్టుకోడు.

**స్వభావాద్యస్య నై వార్తిర్లోకవద్వ్యవహారిణః ।**
**మహాహ్రద ఇవాక్షోభ్యో గతక్లేశస్సు శోభతే ॥ 60**

జ్ఞాని దైనందిన కార్యక్రమాల్లో పాల్గొన్నా, సామాన్యునిలాగా విచారించడు. విశాలమైన సరోవరంలాగా నిశ్చల శాంత గంభీరుడై ప్రకాశిస్తాడు. సచ్చిదానంద రూపుడైన ఆత్మవిదుడు, సామాన్యునిలాగా పనులు చేస్తున్నప్పటికీ, సాంసారిక దుఃఖాన్ని పొందడు. అటువంటి చిద్రూపుడు లోతైన చెరువులో నీరు ఏ రకంగా చలించదో, అదే విధంగా నిరాకారుడు, నిశ్చలచిత్తుడై, సంక్షోభాలు లేకుండా సర్వదా ఆత్మారాముడై ఉంటాడు.

మనస్సు అనే సరోవరం భావతరంగాలతో కల్లోలమవుతుంది. దీనికి రెండు కారణాలున్నాయి.

1. బాహ్యావిషయాలు – ఇవి ఇంద్రియాల ద్వారా మనసును చేరి కోరికలతో ఉద్రేకపరుస్తాయి.

2. గతజ్ఞాపకాలు : గతంలో జరిగిపోయిన జ్ఞాపకాలతో, భవిష్యత్తులో అనుభవించాలనే కోరికతో కల్లోలాన్ని సృష్టించగలవు.

మనోబుద్ధులను అధిగమించి, అహంకార వర్జితుడై ఆత్మానుభవస్థితుడైన జ్ఞానిని బాహ్య విషయాలు మోహపరచలేవు. అతని మనస్సు సర్వదా ప్రశాంతంగా ఉంటుంది.

**నివృత్తిరపి మూఢస్య ప్రవృత్తి రుపజాయతే ।**
**ప్రవృత్తిరపి ధీరస్య నివృత్తి ఫలభాగినీ ॥ 61**

అజ్ఞానికి నిర్వృత్తి, వృత్తిరాహిత్యం. ఇవికూడా శ్రమ కలిగించేవే అనిపిస్తాయి. జ్ఞానికి కర్మలు కూడా శాంతిని కలిగిస్తాయి.

అహంకార మమకారాలు కలిగిన పామరుడు పదిమంది తనను మెచ్చుకోవాలనే కోరికతో బాహ్యేంద్రియ వ్యాపారము, అంతరింద్రియ వ్యాపారములన్నీ వదిలేసిన వాడిలాగా నటిస్తాడు. అయినప్పటికీ వాడి చిత్తవృత్తి ప్రవృత్తిమార్గంలోనే ఉంటుంది. జ్ఞాని ప్రారబ్ధ కర్మలు చేస్తూ కూడా, వ్యావహారికంలో ప్రవృత్తి మార్గంలో ఉన్నట్లుగా కనిపించినప్పటికీ, అతడికి కర్తృత్వాభిమానముండదు కాబట్టి నిర్వృత్తిమార్గంలోనే ఉంటాడు.

మానవ జీవితానికి రెండు మార్గాలున్నాయి. 1.ప్రవృత్తిమార్గము 2.నిర్వృత్తి మార్గము.

**1.ప్రవృత్తిమార్గము :** అంటే లౌకిక జీవన విధానము. గురుకులంలో విద్యాభ్యాసం పూర్తి చేసి సమావర్తనమయి ఇంటికి వచ్చి, నచ్చిన పిల్లను ఎంచుకుని స్నాతక వ్రతమాచరించి, దేశాటన చేసి, తిరిగి వచ్చి, ఎంచుకున్న పిల్లను వివాహం చేసుకుని గృహస్థాశ్రమంలో స్థిరపడతాడు. తాను నేర్చుకున్న విద్యను బట్టి, యజ్ఞయాగాది క్రతువులు, పౌరోహిత్యము, వేదాధ్యయనము, శాస్త్రపాండిత్యములలో ఏదో ఒకటి వృత్తిగా ఎంచుకుని జీవితం ప్రారంభిస్తాడు. ఇక్కడ అవసరం లేకపోయి నప్పటికీ, సందర్భం వచ్చింది కాబట్టి చెబుతున్నాను.

గురుకులం నుంచి ఇంటికి వచ్చిన విద్యార్థి తగిన పిల్లను ఎంచుకుని దేశాటనకు వెడతాడు. తగిన పిల్ల అంటే సామాన్యంగా తెలిసిన వారింటి పిల్ల, బంధువుల పిల్ల అయి ఉంటుంది. ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమంటే ఆ పిల్ల ఎనిమిది సంవత్సరాలలోపు కన్య కాదు. యుక్తవయస్సు వచ్చిన పిల్ల, **వేదంలో ఎక్కడా రజస్వల కాని పిల్లను వివాహం చేసుకోమని చెప్పలేదు.** పురాణాలలో ఏ వివాహమైనా యుక్తవయస్సు వచ్చిన కన్యకే జరిగింది కాని ఎనిమిది సంవత్సరాలలోపు పిల్లలకు జరగలేదు జాగ్రత్తగా గమనించండి. **వేదంలో బాల్యవివాహం చెప్పలేదు.**

**2. నివృత్తిమార్గము :** సంసార బంధనాలు ఇష్టంలేక భార్యని కుమారుల కప్పగించి తాను సన్యాసదీక్ష తీసుకుని అడవుల వెంబడి, కొండల వెంబడి పడి సత్యాన్వేషణలో తిరగటం, బ్రహ్మవిద్య నభ్యసించటం, నిర్వృత్తి మార్గంలో ఉన్నవారెవరూ కర్మలు చెయ్యరు.

అజ్ఞాని ఏ పని చెయ్యకుండా నిర్వృత్తి మార్గంలో ఉంటాను అనుకొంటే అది కూడా శ్రమతో కూడినదే. శాంతి అనేది ఉండదు. అదే జ్ఞాని కర్మలు చేస్తున్నా పరమ శాంతంగా ఉంటాడు.

**పరిగ్రహేషు వైరాగ్యం ప్రాయో మూఢస్య దృశ్యతే ।**
**దేహే విగళితాశస్య క్వ రాగః క్వ విరాగతా ॥ 62**

అజ్ఞానులు తమకు ఉన్న వస్తువుల మీద వైరాగ్యం చూపుతారు. దేహం మీద అభిమానమే లేని జ్ఞానికి రాగద్వేషాలుండవు. అజ్ఞానులకు దేహతాదాత్మ్యత ఉంటుంది. నేను అంటే దేహమే అనేది వారి భావన. లౌకిక సుఖాల కోసం విపరీతంగా పాకులాడతారు. అటువంటి వారు ఒక్కొక్కసారి ఈ సుఖాలు, ఈ వస్తువులు మాకొద్దు అంటారు. ఇంక ఈ ధనం మాకు వద్దు బాబూ, వేశ్యలతో పొందు ఛీఛీ అసలే వద్దు అంటారు. ఇదంతా సాంసారిక ఇబ్బందుల వల్ల కలిగేదే కాని నిజమైన వైరాగ్యం కాదు. లౌకికంలో వైరాగ్యం రెండు రకాలుగా చెబుతారు. 1.స్మశాన వైరాగ్యం 2.ప్రసూతివైరాగ్యం

**1. స్మశాన వైరాగ్యం :** తమ వారెవరైనా మరణించినప్పుడు మృతదేహంతో పాటు స్మశానానికి వెడతారు. అక్కడ దహన సంస్కారాలు జరిపేటప్పుడు వైరాగ్యం వస్తుంది. "ఛీ వెధవ జన్మ. ఇవాళ్ళ వీడు. రేపు ఇంకొకరు. ఏదో ఒకరోజు మనమైనా అంతే. ఎవరైనా ఏదో ఒకరోజు పోవాల్సిన వాళ్ళమే. ఎంత సంపాదిస్తే ఏమిటి? గంపెడు మంది సంతానం. పోయేటప్పుడు ఒక్కరు కూడా దగ్గరలేదు. ఎవరికి ఎంత ప్రాప్తమో?" ఇలా మాట్లాడతారు. దహనసంస్కారాలై వెనుతిరిగేటప్పటికి మళ్ళీ లౌకికంలో కూరుకుపోతారు.

**2. ప్రసూతి వైరాగ్యం :** గర్భవతి అయిన స్త్రీ ప్రసవవేదన అనుభవించలేక ఇంక నాకీ సంసారం వద్దు పాడూ వద్దు. ఈ బాధలు నేను పడలేను. ఈ పిల్లల్ని పెంచలేను అనుకుంటుంది. ప్రసవం అయిపోయిన తరువాత మళ్ళీ మామూలే.

ఇదంతా తాత్కాలికమైన వైరాగ్యం. అంతే కాని జ్ఞానం వల్ల వచ్చింది కాదు. అజ్ఞానులకు దేహవాసన పూర్తిగా ఉంటుంది. కాబట్టి ఈ వైరాగ్యము మళ్ళీ అనురాగమవుతుంది.

దేహేంద్రియాల యందు అసలు అభిమానమే లేని చిద్రూపుడికి, దేహానికి సంబంధించిన భార్య పిల్లలు ఇల్లు వాకిలి, ఆస్తిపాస్తులు వీటిమీద ధ్యాసే ఉండదు. అలాగే శత్రువుల యందు, క్రూరమృగాల యందు కూడా ద్వేషభావము కలగదు. దేహం మీదే అభిమానం లేనివాడికి దేహ సంబంధమైన విషయాల యందు అభిమానం ఎలా ఉంటుంది?

**భావనా భావనాసక్తా దృష్టిర్మూఢస్య సర్వదా ।**
**భావ్యభావనయా సా తు స్వస్థస్యాదృష్టి రూపిణి ॥ 63**

అజ్ఞాని దృష్టి ఎప్పుడూ వస్తువుల యొక్క భావాభావాల మీదే ఉంటుంది. కాని జ్ఞాని వస్తువుల గురించి భావిస్తున్నా భావించనట్లే లెక్క.

సామాన్య మానవుడి దృష్టి ఎప్పుడూ కూడా వస్తువుల మీదనే ఉంటుంది. ఆత్మకు ఇతరమైన అంటే అనాత్మ పదార్థాలమీదనే దృష్టి ఉంటుంది. అహంకారంతో నిండిపోయి ఉంటుంది. వస్తు సముదాయము మీద ఎక్కువ ఆసక్తి గలదై ఉంటుంది. అంతేగాని ఆత్మను దర్శిద్దాము అనుకోదు. ఆత్మసాక్షాత్కారం కోసం ప్రయత్నించదు. కాని జ్ఞాని యొక్క దృష్టి వస్తుసముదాయముల మీద ఉండదు. ఆత్మేతర వస్తువుల మీద, అనాత్మ వస్తువుల మీద ఉండదు. ఒకవేళ ఆ వస్తువులు చూస్తున్నా చూడనట్లే. జ్ఞాని ఎప్పుడూ స్వరూపధ్యానమందే ఉంటాడు. అతనికి ఆత్మ తప్ప ఇతరమైనవి ఏవీ కనిపించవు.

**సర్వారంభేషు నిష్కామో యశ్చరేత్ బాలవన్మునిః ।**
**న లేపస్తస్య శుద్ధస్య క్రియమాణోఽపి కర్మణి ॥ 64**

మనసులో ఆలోచనలున్నాయా లేదా అనేది ముఖ్యం కాదు. వాటితో తాదాత్మ్యం ఎంత వరకు ఉన్నది అనేదే ముఖ్యము. యోగి ఆలోచనల నుంచి విడివడి ఉంటాడు. కాబట్టి ఆలోచనలు ఉన్నా లేకపోయినా అవి అతన్ని బాధించవు.

నువ్వు సముద్రం దగ్గర ఉన్నంతసేపు కెరటాలు నిన్నేమీ చెయ్యలేవు. సముద్రంలో దిగితేనే వాటి ప్రభావం చూపిస్తాయి.

మనసులో ఆలోచనలు ఉండటం వల్ల బుద్ధిహీనుడు కాడు. వాటితో తాదాత్మ్యం చెంది వాటి మూలాన్ని విస్మరిస్తే బుద్ధిహీనుడవుతాడు. ఏ కోరికలు లేకుండా కర్మల

నాచరించే జ్ఞాని చిన్న పిల్లవాడి లాగా చరిస్తూ ఉంటాడు. అతడు చేసే పనిలో కూడా అతని ప్రమేయం ఉండదు. ఆ కర్మలతో అతడు బాధించబడడు. చిద్రూపి అయిన జ్ఞాని ఏ రకమైన సంకల్పము లేకుండా కోరికలు లేనివాడై ప్రారబ్ధవశాన వచ్చే అన్ని పనులు చేస్తుంటాడు. అతడి మానసిక స్థితి పసిపిల్ల వాడిలాగా ఉంటుంది. అటువంటి జ్ఞాని ఏ పని చేసినా అతనికి కర్తవ్యముండదు. అందుచే కర్మ సంబంధము కూడా ఉండదు.

అహంకారం లేనివాడిలో కర్తృత్వ భోక్తృత్వాలుండవు. చిన్నపిల్లవాడు చేసిన పనివల్ల నష్టం వాటిల్లినా దానికి అతడు బాధ్యుడు అని నిందించము. హాని చెయ్యాలి. నష్టం చెయ్యాలి అనే భావన అతనికి ఉండదు. అలాగే జ్ఞానికి కూడా కర్తృత్వ, భోక్తృత్వ భావాలుండవు. కాబట్టి అతడి చేష్టలన్నీ పిల్లవాడివి లాగానే ఉంటాయి. అందుచేతనే జ్ఞాని బాలుడితో పోల్చబడుతున్నాడు.

అహంకారము చాలా ప్రమాదకరమైనది. దీనివల్ల జనించే కోరికలే బాహ్య విషయాలకు మనల్ని బందీలుగా చేస్తాయి. దీంతోనే దుఃఖాలన్నీ కుప్పలు తెప్పలుగా వస్తాయి. వ్యామోహమే సర్వదుఃఖాలకు మూలకారణం. జ్ఞాని ప్రారబ్ధవశాన తనకు ప్రాప్తించిన కర్మలు చేస్తూ, వాటికి బందీ కాకుండా అంటే కర్తృత్వ భోక్తృత్వాలు లేకుండా హాయిగా సంతోషంగా ఉంటాడు. అన్ని కర్మలు అతడికి లీలామాత్రంగానే ఉంటాయి.

**స ఏవ ధన్య ఆత్మజ్ఞ స్సర్వభావేషు యస్సమః ।**
**పశ్యన్శృణ్వన్ స్పృశన్జిఘ్రన్నశ్న న్నిస్తర్షమానసః ॥ 65**

ఆత్మజ్ఞాని చూస్తూ, వింటూ, వాసన చూస్తూ, తింటూ, కూడా దేని కోసము తపించడు. పరమశాంతంగా ఉంటాడు. జ్ఞాని నిజంగా ధన్యుడు. అన్ని వస్తువుల యందు, అన్ని జీవుల యందు సమభావం కలిగి ఉంటాడు. అన్నింటినీ ఆత్మస్వరూపం గానే భావిస్తాడు. తినటము, తాగటము, చూడటము, వినటము వంటి పనులు చేస్తున్నా వాటిమీద కోరిక ఉండదు. అహంభావము అంతకన్నా ఉండదు.

జనారణ్యంలో సంచరిస్తూ కూడా వాటి ప్రభావానికి లోనుకాడు. మిఠాయి దుకాణం ముందు నుంచి వెడుతున్నాడు. మిఠాయి ఉచితంగా తీసుకుపోవచ్చు.

ధర చెల్లించవలసిన అవసరం లేదు. అతడికి చక్కెర వ్యాధి లేదు. అయినా ఆ మిఠాయి వైపు కన్నెత్తి చూడడు. అందరినీ విపరీతంగా ఆకర్షించే దృశ్యాలు చూపిస్తున్నారు. అటువైపు కన్నెత్తి చూడడు. పన్నెత్తి మాట్లాడడు. సర్వకాల సర్వావస్థల యందు పరమశాంతంగా ఉంటాడు.

ఈ జగత్తు మహాద్భుతమైంది. మాయామయమైనది. ఎన్నో గొప్ప గొప్ప విషయాలు ఇక్కడున్నాయి. వాటిని దర్శించటాని మనవాళ్ళుయాత్రలుచేస్తుంటారు. తీర్థయాత్రలు, విలాసయాత్రలు చేస్తారు. దేశం నలుమూలలా తిరుగుతారు. అన్నీ చూస్తారు. కాని జ్ఞాని ఎక్కడికీ వెళ్ళడు. దేన్నీ చూడడు. చూడాలనే కోరికల అతడిలో ఉండదు. అతడికి జగత్తంతా పరమేశ్వరమయంగా కనిపిస్తుంది. ఒకవేళ ఏ దృశ్యాన్నయినా చూసినా దానికోసం తపించడు. పరమశాంతంగా ఉంటాడు.

**క్వ సంసారః క్వ చాభాసః క్వ సాధ్యం క్వ చ సాధనమ్ ।**
**ఆకాశస్యేవ ధీరస్య నిర్వికల్పస్య సర్వదా ॥ 66**

ఆకాశంలాగా సర్వవ్యాపిగా, నిత్యంగా పరిణామ రహితంగా ఉన్నాను అని తెలిసిన జ్ఞానికి ఈ జగత్తు, అహంకారము, సాధన సాధ్యము ఎక్కడుంటాయి?

ఉపాధి శూన్యము, సర్వపూర్ణుడై ఆకాశంలాగా ఉండే జ్ఞానికి సంకల్ప వికల్పాలుడవు. కాబట్టి ఈ ప్రపంచం కూడా ఉండదు. సంసారము ఉండదు. భ్రమలు ఉండవు. సంసారిలాగా ప్రవర్తిస్తుంటాడు కాని సంసారి కాదు. అతడు పరమోత్కృష్టమైన జీవన్ముక్త స్థితిలో ఉన్నాడు కాబట్టి యజ్ఞయాగాదులు, వాటి ద్వారా వచ్చే స్వర్గము అతడికి అవసరం లేదు.

ఆత్మానుభవం పొందిన జ్ఞానికి తనకన్న వేరైనది, రెండవది ఏదీ ఉండదు. ఈ జగత్తు ఉండదు. అహంకారము అంతకన్న ఉండదు. అతడు సాధించవలసిన పరమార్థాన్ని సాధించాడు. కాబట్టి ఇంకా సాధించాల్సింది ఏమీ లేదు. అనుసరించవలసిన నియమ నిష్ఠలు, విధివిధానాలు కూడా ఏవీ ఉండవు. నేనే పరమాత్మను అని తెలుసుకోవటంతో అహంకారము పూర్తిగా అంతమయింది. అతడు సర్వవ్యాపి పరిమితులు ఏవీ లేవు. ఘటం పగిలిపోయింది. ఘటాకాశం మహదాకాశంలో కలిసిపోయింది. అలాగే అహంకారం నశిస్తే ఆత్మసాక్షాత్కారమైనట్లే.

ఘటం విచిన్నమయి ఘటాకాశం మహదాకాశంలో కలిసిపోయింది.

కుండ పగిలి - మట్టిలో కలిసిపోయింది

సముద్ర తరంగాలు - సముద్రంలో కలిసిపోయాయి

అహంకారం నశించిపోయింది - ఆత్మసాక్షాత్కారమైంది జీవుడే దేవుడైనాడు

అతనికి ఇంకా సాధన, సాధ్యం, జగత్తు ఎక్కడున్నాయి?

**స జయత్యర్థ సన్న్యాసీ పూర్ణస్వరస విగ్రహః ।**

**ఆకృతిమోఽనవచ్ఛిన్నో సమాధిర్యస్య వర్తతే ॥ 67**

అన్ని కోరికలు జయించి, స్వస్వరూప స్థితుడయి, సహజము అపరిచ్ఛిన్నము అయి చరించే మహాత్ముడికి జయమగు గాక.

జ్ఞాని దృష్టాదృష్టములతో ప్రయోజనం లేనివాడు కాబట్టి - అర్థసన్న్యాసి

పూర్ణ స్వభావమే స్వరూపంగా కలవాడు కాబట్టి - పూర్ణ సర్వవిగ్రహుడు

మహనీయుడికి సమాధి - పరిపూర్ణత్వమే.

అతడు తప్పక మోక్షం పొందుతాడు.

దృశ్యములందు విశ్వాసము, ప్రీతి విడిచిపెట్టి ఉండటమే మోక్షము. దృశ్యములందు విశ్వాసము, ప్రీతి కలిగి ఉండటమే దుఃఖము. అవిద్య అనేది లేదు. అయినప్పటికీ అష్టప్రజ్ఞల యందు అవిద్య కనిపిస్తోంది. నామమాత్రంగా ఉన్న అవిద్య సమ్యజ్ఞానం కలవారి యందు అసలు కనపడదు. సమ్యక్ ప్రజ్ఞ సిద్ధించేదాకా అవిద్య అమాయకుడైన జీవిని తీసుకుపోయి ముళ్ళ పొదలలో తోసేస్తుంది. సమ్యక్ ప్రజ్ఞ గలవారిని అవిద్య ఏమీ చెయ్యలేదు. మోహకారకమైన కోరికలున్నంత వరకు అవిద్య వెంటాడుతూనే ఉంటుంది. పరతత్త్వాన్ని అవలోకించిన వెంటనే అవిద్య నశించి పోతుంది అని చెబుతోంది **మహోపనిషత్తు.**

కాబట్టి అన్ని కోరికలను జయించి, స్వరూప స్థితుడయి చరించే మహాత్ముడికి జయమగు గాక అంటున్నాడు అష్టావక్రుడు.

**బహూనాత్ర కిముక్తేన జ్ఞాతతత్త్వో మహాశయః ।**

**భోగమోక్ష నిరాకాంక్షీ సదా సర్వత్రనీరసః ॥ 68**

ఇంతవరకు చెప్పింది చాలు. ఇంక చెప్పవలసిన పనిలేదు. సత్యదృష్టి గల ఆ మహానుభావుడు సమస్త విషయవాంఛల నుంచి విముక్తుడైనాడు. అతనికి ముక్తి పొందాలనే కోరిక కూడా లేదు. సర్వకాల సర్వావస్థల యందు అతడు ఏ కోరికలు, దుఃఖాలు లేకుండా ఉంటాడు.

జ్ఞానిని గురించి ఇన్ని మాటలు చెప్పటం ఎందుకు? చిద్రూపియైన ఆ మహానుభావుడు భోగమోక్ష ఫలములందు అపేక్ష లేనివాడు. అనురాగము కూడా లేనివాడు.

ఈ శ్లోకంలో అష్టావక్రుడు అంటున్నాడు **బహునాత్ర కిముక్తేన** ఇంతకన్న ఇంక ఏం చెప్పగలను? **అంతఃకరణ శుద్ధి గలవారికి ఇంతకన్న చెప్పనవసరం లేదు. అది లేని వారికి చెప్పి ప్రయోజనం లేదు.** అంటున్నారు.

**మహదాది జగద్ద్వైతం నామమాత్ర విజృంభితమ్ ।**
**విహాయ శుద్ధబోధస్య కిం కృత్య మవశిష్యతే ॥ 69**

శుద్ధ చైతన్యరూపుడు చేసే పనులేముంటాయి. కుండ, మూకుడు, చట్టి మొదలైనవన్నీ నామరూపాలతో పిలువబడుతున్నప్పటికీ వాటన్నింటికీ మూలం మట్టి. అందుకే మట్టి సత్యం. ఈ రూపాలు, నామాలు అన్నీ అసత్యం. అలాగే అహంకారం దగ్గర నుంచి శబ్ద స్పర్శ రూప రస గంధాలనే పంచ తన్మాత్రలు వాటికి అధిష్టానమైన పంచభూతాలతో కల్పించబడిన ఈ జగత్తంతా నామమాత్రమైనది. అంతేకాని వాస్తవం కాదు అని తెలుసుకొన్న మహాత్ముడు ఇక చేయవలసినది ఏదీలేదు.

పరిపూర్ణమైన ఆత్మానుభవంలో అన్నీ సిద్ధించే ఉన్నాయి. నామరూపాత్మకమైన ఈ జగత్తు నుండి జ్ఞాని సాధించాల్సింది ఏమీ లేదు. ఆత్మను గురించి తెలిసిన జ్ఞానికి జగత్తుతో ఏ విధంగాను సంబంధం ఉండదు.

గ్రామీణులు వారి గ్రామవీధుల గుండా పోయే యాత్రికులను ఎలా చూస్తారో, అదే విధంగా జ్ఞాని ఈ జగల్లీలు చూస్తుంటాడు. గ్రామీణులు యాత్రికులను చూసినా వారిపై ప్రత్యేక భావం ఏమీ ఉండదు. వారి కళ్ళముందుగా కొంతమంది నడిచి వెళ్ళారనే భావనే వారికి ఉంటుంది. జ్ఞాని కూడా ఇదే విధంగా జగద్భావాలను గుర్తిస్తాడు.

**భ్రమభూత మిదం సర్వం కించిన్నాస్తీతి నిశ్చయీ ।**
**అలక్ష్య స్ఫురణ శ్శుద్ధ స్స్వభావేనైవ శామ్యతి ॥ 70**

కనిపించే జగత్తంతా భ్రమాజన్యము. నిజానికి దీనికి ఉనికి లేదు. ఈ విషయం జ్ఞానికి తెలుసు. అందుచేతనే పరమశాంతంగా ఉంటాడు.

చిద్రూపుడైన జ్ఞానికి ఈ జగత్తంతా భ్రమచేత కల్పించబడింది. నామరూపాలన్నీ కల్పితాలు అని నిశ్చయంగా తెలుసు. దానివల్ల అతడికి సుఖము శాంతి ఆనందము లభిస్తాయి. జ్ఞానసముపార్జన చెయ్యాలంటే జ్ఞానము వల్లనే సాధ్యమవుతుంది.

**శుద్ధస్ఫురణ రూపస్య దృశ్యభావ మపశ్యతః ।**
**క్వ విధిః క్వ చ వైరాగ్యం క్వ త్యాగః క్వ శమోఽపివా ॥ 71**

దృశ్యమానమైన జగత్తంతా మనోకల్పితము. శరీరము, మనస్సు, బుద్ధిల చేత మాత్రమే విషయాలు గుర్తింపబడతాయి. ఆత్మ దేనిచేతా గుర్తింపబడదు. ఈ విషయం గతంలో చాలాసార్లు చెప్పుకున్నాం. ఆత్మ ఉన్నచోటికి కళ్ళు వెళ్ళలేవు. వాక్కు వెళ్ళలేదు. మనసు వెళ్ళలేదు అంటోంది **కేనోపనిషత్తు** ఇంద్రియాలకు చైతన్యాన్నిచ్చేదే ఆత్మ. కాబట్టి ఆత్మను గుర్తించటానికి వేరే ప్రత్యేకమైన సాధనం ఏదీలేదు. ఆత్మ దేనిచేతను తెలియబడదు. ఆత్మ చూడబడదు. కాని చూస్తుంది. వినబడదు – కాని వింటుంది. కాబట్టి ఆత్మ దేనిచేతా స్ఫురించబడదు. శుద్ధ చైతన్యరూపుడై భౌతిక ప్రపంచంతో సంబంధం లేని వాడికి జీవిత ధర్మాలయిన వైరాగ్యం, త్యాగం, సంయమనం ఇవన్నీ ఎక్కడుంటాయి?

జ్ఞాని చిద్రూపుడు. అతడికి దృశ్యపదార్థం ఏదీ కంటికి కనిపించదు. నియమాలు, నిష్ఠలు లేవు. అతడు పరిగ్రహించవలసినవి, పరిత్యజించవలసినవి ఏవీ ఉండవు.

తనకన్న ఇతరమైన జగత్తు లేదని తెలుసుకున్న జ్ఞానికి జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. బాహ్యంగా జగత్తు లేదని తెలిసిన జ్ఞానికి నియమనిష్ఠలు, పరిగ్రహణము, పరిత్యాగము వంటివి ఏవీ ఉండవు. అతను చేసే కర్మలన్నీ ధర్మాలే. అతడు కేవలము ధర్మమే చేస్తాడు. అందుకే జ్ఞానియొక్క వాక్కు శిరోధార్యం.

స్ఫురతోనంతరూపేణ ప్రకృతిం చ న పశ్యతః ।
క్వ బంధః క్వ చ వా మోక్షః క్వ హర్షః క్వ విషాదతా ॥ 72

ఈ జగత్తంతా పరస్పరాధారంగా ఉనికి కలిగి ఉంది. అలాంటిజగత్తును, ప్రకృతిని దాటి, ఆత్మచైతన్యమే అంతా ఉన్నది అని తెలుసుకున్న జ్ఞానికి బంధ మోక్షాలు ఎలా ఉంటాయి? సుఖదుఃఖాలు ఎక్కడుంటాయి?

జ్ఞాని సచ్చిదానంద స్వరూపుడు. ఇతడి దృష్టిలో పంచభూతాలతో కల్పించబడిన జగత్తు ఉండదు. అటువంటి నిర్మల జ్ఞానికి బంధ మోక్షాలెలా ఉంటాయి?

జ్ఞాని సాక్షాత్తు పరమేశ్వరుడు. సచ్చిదానందరూపుడు. సృష్టి జరిగిన క్రమంలో మొదటగా

| | | |
|---|---|---|
| పరబ్రహ్మ నుంచి | – | అవ్యక్తము వచ్చింది. అదే సత్త్వగుణము, మాయ. |
| అవ్యక్తము నుంచి | – | మహత్తత్త్వము, రజోగుణము హిరణ్యగర్భుడు |
| మహత్తత్త్వము నుంచి | – | అహంకారము, తమోగుణము విరాడ్రూపము |
| అహంకారము నుంచి | – | పంచతన్మాత్రలు |
| పంచతన్మాత్రల నుంచి | – | పంచభూతాలు, వీటిలో మొదటగా ఆకాశము |
| ఆకాశము నుంచి | – | వాయువు |
| వాయువు నుంచి | – | అగ్ని |
| అగ్ని నుంచి | – | జలము |
| జలము నుంచి | – | భూమి ఆవిర్భవించాయి |

ఈ పంచభూతాలు పంచీకరణ చెంది, త్రిగుణాలతో కలియటం చేత జగత్తు ఏర్పడింది. కాబట్టి ఈ జగత్తంతా పంచభూతాల వల్లనే ఏర్పడింది. అంతే కాకుండా ఈ దేహం కూడా పాంచభౌతికమైనది. ఇందులో

| వ.సం. | భూతము | లక్షణము | శరీర భాగము |
|---|---|---|---|
| 1. | ఆకాశము | శబ్దము | చెవి |
| 2. | వాయువు | స్పర్శ | చర్మము |
| 3. | అగ్ని | రూపము | కన్ను |
| 4. | జలము | రసము | నాలుక |
| 5. | గంధము | వాసన | ముక్కు |

ఈ రకంగా ఈ దేహం పాంచభౌతికమైనదని చెప్పబడుతున్నది. ఇలా పంచభూతాల వల్ల ఏర్పడ్డ దేహం మీద కాని జగత్తు మీద కాని జ్ఞానికి దృష్టి ఉండదు. అటువంటి జ్ఞానికి రాగద్వేషాలు, బంధ మోక్షాలు, సుఖదుఃఖాలు ఎలా ఉంటాయి?

**బుద్ధిపర్యంత సంసారే మాయామాత్రం వివర్తతే ।**
**నిర్మమో నిరహంకారో నిష్కామశ్శోభతే బుధః ॥ 73**

రజ్జు సర్పభ్రాంతి లాగానే, ఆత్మజ్ఞానం కలగగానే ఈ సంంసారం నశిస్తుంది. ఆత్మజ్ఞానం కలిగే వరకే జగత్తు బాధిస్తుంది.

బ్రహ్మసత్యం జగన్మిథ్య ఇది అద్వైత సిద్ధాంతము. చరాచర జగత్తంతా మిథ్యయే. పరబ్రహ్మ ఒక్కటే సత్యము, నిత్యము, శాశ్వతమైనది.

చరాచర జగత్తంతా వివర్త పరిణామము వల్ల ఏర్పడింది. ఇదంతా మనస్సుచేత కల్పించబడిన భ్రమ. వివర్త పరిణామము అంటే – అసలు మూలమైన వస్తువు లక్షణాలు పోయి కొత్త లక్షణాలు వస్తాయి. పాలు తోడువేస్తే పెరుగవుతుంది. ఇందులో పాల లక్షణాలు ఉండవు. ఈ రజ్జు సర్పభ్రాంతి. మసక చీకటిలో తాడును చూశాడు. అతడి మనస్సులో అంతకు ముందు నుంచి పామును గురించి ఆలోచిస్తున్నాడు. కాబట్టి తాను చూసింది పామే అనుకున్నాడు. భయపడి కేకలు వేశాడు. గోల చేశాడు. తీరా దీపపు వెలుగులో పరిశీలిస్తే అప్పుడు తెలిసింది అది పాముకాదు తాడని. ఈ విషయం తెలిసిన తరువాత అంతవరకు కనిపించిన పాము ఇప్పుడు కనపడలేదు. ఏమై పోయింది? అంటే తన అధిష్ఠానంలో కలిసిపోయింది. అలాగే మనోభ్రమతో ఏర్పడిన జగత్తు భ్రమ తొలగిపోగానే తన అధిష్ఠానమైన బ్రహ్మము నందు లీనమై పోయింది.

జ్ఞానం కలిగే వరకు భ్రమ అలాగే ఉంటుంది. జ్ఞానం కలిగిన తరువాత, అప్పటివరకు కనిపించిన వస్తువు తన అధిష్ఠానంలో కలిసిపోతుంది. అలాగే జ్ఞాని దృష్టిలో జగత్తుండదు. మిగిలిన అజ్ఞానులకు మాత్రం జగత్తు కనిపిస్తూనే ఉంటుంది.

ఈ విషయం తెలుసుకున్న జ్ఞాని అహంకార మమకారాలు వదలి సుఖంగా శాంతంగా ఉంటాడు.

**అక్షయం గతసంతాపమాత్మానం పశ్యతోమునేః ।**

**క్వ విద్యా చ క్వ వా విశ్వం క్వ దేహోऽహం మమేతి చ ॥ 74**

చిదానంద స్వరూపుడైన జ్ఞానికి జ్ఞానమెక్కడ? అజ్ఞానమెక్కడ? జగత్తెక్కడ? దేహమెక్కడ? నేను నాది అనే అహంకార మమకారాలు ఎలా ఉంటాయి?

నాశనము లేనిది, సర్వసంతాపరహితమైనది అయిన ఆత్మవిదుడికి, ఆత్మకన్న వ్యతిరేకమైన శాస్త్రాలు, ప్రపంచము, దేహము, అహంకారము మొ॥వి ఎలా ఉంటాయి? ఇప్పుడు ఇక్కడ జీవన్ముక్తావస్త చెప్పబడుతోంది. జీవన్ముక్తుడు సాక్షాత్తు తానే పరబ్రహ్మ. ఆనందమయకోశంలో అమితమైన ఆనందంతో, చెప్పలేని ఆనందంతో, ఎక్కడా కూడా అంతకన్న ఇంకా ఎక్కువ లేని ఆనందంతో పరబ్రహ్మ ఉన్నాడు. అది పరబ్రహ్మ పొందే ఆనందం కాబట్టి దాన్ని బ్రహ్మానందము అన్నారు. ఈ ఆనందము కేవలము పరబ్రహ్మకే సాధ్యం. వేరెవరూ దీన్ని పొందలేరు. ఒకవేళ ఎవరైనా ఈ ఆనందాన్ని పొందితే వారు కూడా పరబ్రహ్మ స్వరూపమే అని గుర్తించాలి. నేనే పరబ్రహ్మను, ఆనందరూపుణ్ణి అని గుర్తించిన జ్ఞానికి ఇంకా దేహం ఎక్కడ? జగత్తు ఎక్కడ? అహంకార మమకారాలు ఎలా ఉంటాయి? అంటున్నాడు అష్టావక్రుడు.

ఆత్మజ్ఞానాన్ని తెలుసుకుంటే అన్నీ తెలుస్తాయి. తెలుసుకోవలసిన విషయం ఏదీ ఉండదు.

పుణ్యానంద మునీంద్రుడు ఆశ్రమ ప్రాంగణంలో కూర్చున్నప్పుడు ఆకాశంలో రెండు హంసలు ఎగురుతూ వాటిలో అని మాట్లాడుకుంటున్నాయి. ముందుగా ఆడహంస ఆడుతోంది.

'నాథా! లోకంలో దేన్ని గురించి తెలుసుకుంటే, అన్ని విషయాలు తెలుస్తాయో దాన్ని గురించి వివరించండి' అంది దానికి మగహంస 'ఓ దేవీ! మట్టితో అనేక రకాలయిన పాత్రలు తయారుచేస్తారు. పాత్రల నామరూపాలు వేరైనా పాత్రలలో ఉన్నదంతా మట్టే. బంగారం కరిగించి అనేక ఆభరణాలు తయారుచేస్తారు. ఆభరణాల నామరూపాలు వేరైనా వాటిలో ఉన్నది బంగారమే' అంది. ఆ మాటలు విన్న ఆడహంస' తెలిసింది. జగత్కారకుడైన పరమాత్మను గురించి తెలుసుకుంటే జగత్తులోని

అన్ని విషయాలు తెలుస్తాయి అని తెలిసింది? అని చెప్పింది ఈ మాటలు విన్న మునీశ్వరుడు **'కామకలావిలాసము'** అనే సూత్రగ్రంథం వ్రాశాడు. దానికి నేను వ్రాసిన వ్యాఖ్య **'శ్రీవిద్యా సర్వస్వము'**

కాబట్టి నేనే పరబ్రహ్మ నని తెలుసుకున్న జ్ఞానికి ఇంక వాసనలుండవు.

**నిరాధాదీని కర్మాణి జహాతి జడధీర్యది ।**

**మనోరథాన్ప్రలాపాంశ్చ కర్తుమాప్నోత్య తత్క్షణాత్ ॥ 75**

అజ్ఞాని మనోనిరోధాలు ఆపిన వెంటనే చిత్తవృత్తులు విజృంభిస్తాయి.

సామాన్య సాధకుడు ఆత్మని పొందాలనే కోరికతో చిత్తాన్ని నిరోధిస్తాడు. కాని ఆ నిరోధ ప్రక్రియ ఆగిన మరుక్షణం నుంచే చిత్తము తన ఇష్టానుసారంగా ప్రవర్తిల్లుతుంది. ఇష్టమైన పనులు చేస్తుంది. కాబట్టి అజ్ఞాని చిత్తనిరోధం కోసం చేసే ప్రయత్నాలు గజస్నానం వంటివి అంటారు విజ్ఞులు. ఒక్క క్షణం గజస్నానము అంటే ఏమిటో చూద్దాం. ఏనుగు నీటిలో దిగుతుంది. తొండంతో నీరు తీసుకుని వళ్ళంతా తడుపుకుంటుంది. ఈ రకంగా స్నానం పూర్తి అయిన తరువాత వడ్డుకు వచ్చి నేలమీద ఉన్న దుమ్మును తన తుండంతో తీసుకుని ఒళ్ళంతా చిమ్ముకుంటుంది. తడి వంటి మీద ఈ దుమ్ము అతుక్కుపోతుంది. స్నానం చెయ్యక ముందు ఏనుగు శరీరం మీద ఉన్న దానికన్న స్నానం చేసి దుమ్ముకొట్టుకున్న తరువాత ఆ దుమ్ము రెండింతలు పైగా ఉంటుంది. ఎండ వేడి నుంచి, దోమలుమొదలైన సూక్ష్మజీవుల బారి నుండి తప్పించుకోటానికే ఏనుగు ఈ రకంగా చేస్తుంది. ఇక్కడ మనకి కావలసింది ఏమంటే స్నానం చెయ్యక ముందుకన్న స్నానం చేసిన తరువాత ఏనుగు వంటి మీద రెట్టింపు దుమ్ము ఉంటుంది. అలాగే అజ్ఞాని చిత్తనిరోధంతో ఆపగలిగే కోరికలన్న నిరోధ ప్రక్రియ పూర్తిగా ఆగిన తరువాత వచ్చే కోరికల పరంపర కొన్ని రెట్లు ఎక్కువ ఉంటుంది. కాబట్టి ఇది ఉపయోగం లేనిది. అజ్ఞానికి చిత్తనిరోధంవల్ల చిత్తశుద్ధి కలుగుతుంది కాని ఆత్మజ్ఞానం కలగదు.

ఆత్మసాక్షాత్కారము పొందాలంటే విపరీతమైన శ్రమ పడాలి. ముందుగా అజ్ఞానాన్ని వదిలించుకోవాలి. అజ్ఞానం ఈ జన్మలోనో లేదా ఏదో ఒక జన్మలో వచ్చింది కాదు. కొన్ని లక్షల సంవత్సరాల నుంచి వచ్చింది. **ఐతరేయోపనిషత్తు**లో

చెప్పినట్లుగా, పరమేశ్వరుడు జీవిని సృష్టించిన తరువాత తానుకూడా ఆ జీవిలో ప్రవేశించాడు. అలా ప్రవేశించి ఇంద్రియాలతో లౌకిక సుఖాలు అనుభవిస్తూ, తాను పరబ్రహ్మను అనే మాట మరిచిపోయి అజ్ఞానంతో నేను అంటే దేహము అని భావన చేశాడు. ఇదే అజ్ఞానం. అంటే ఈ అజ్ఞానం సృష్ట్యారంభం దగ్గర నుంచీ ఉన్నది. ఇంతకాలం నుంచీ ఉన్న అజ్ఞానం కేవలం ఒక జన్మలో నాశనం కావాలంటే కాదు. చాలా జన్మలెత్తాలి. కనీసం ఏడు జన్మలలో చేసిన పుణ్యఫలం ఉంటేనే గాని వేదాంతం మీద ఆసక్తి కలగదు. తరువాత ఎన్నో జన్మలు నిరంతర సాధన చేస్తేనే ఆత్మసాక్షాత్కారమవుతుంది.

ముందుగా అష్టాంగ యోగాన్ని అవలంభించాలి. 1.యమ 2.నియమ 3.ఆసన 4.ప్రాణాయామ 5.ప్రత్యాహార 6.ధారణ 7.ధ్యాన, 8.సమాధులు. ఇవి అష్టాంగాలు ఇవన్నీ ఉపనిషత్తులలో చెప్పినవే. వీటిలో మొదటి ఐదింటినీ **యమాది పంచకము** అంటారు. ఇవి శరీరాన్ని అదుపులో ఉంచటానికి, ఇంద్రియ నిగ్రహానికి బాగా ఉపయోగిస్తాయి. చివరి మూడింటినీ **సంయమము** అంటారు. ధారణ ధ్యాన సమాధుల వల్లనే యోగం సిద్ధిస్తుంది. అయితే **జ్ఞానం లేని యోగము, లేదా యోగం లేని జ్ఞానము ఉపకరించవు.** సద్గురువును ఆశ్రయించాలి. గురూపదేశము, శాస్త్రాధ్యయనము విచారణల వల్ల ఆత్మజ్ఞాన సముపార్జన చెయ్యాలి. అప్పుడు ఆత్మసాక్షాత్కారమవుతుంది.

**మందః శ్రుత్వాఽపి తద్వస్తు న జహాతి విమూఢతాం ।**
**నిర్వికల్పో బహిర్యత్నా దంతర్విషయలాలసః ॥ 76**

సత్యమైన ఈ జ్ఞానాన్ని విన్న తరువాత కూడా మందబుద్ధులు తమ మనోభ్రమలు వదలలేరు. వారు బయటకి శాంతమూర్తులు లాగా కనిపించినా లోపల మాత్రం కోరికలు ఉంటాయి.

ఇప్పటివరకూ ఆత్మతత్త్వ స్వరూపాన్ని గురించి చెప్పుకున్నాం. ఈ విషయమంతా తెలుసుకుని కూడా అజ్ఞాని తన అజ్ఞానాన్ని వదలలేడు. చిత్తము మలినంగా ఉంటే ఉపదేశాల వల్ల జ్ఞానం రాదు. అందువల్ల మూర్ఖుడు చిత్తనిరోధాది ప్రయత్నాల చేత లోకదృష్టికి వ్యాపారము లేనివాడై కనిపించినప్పటికీ, అతని మనసులో అనేక విషయాలు తొలుస్తూ ఉంటాయి.

అజ్ఞాని అంటే సాధకుడు సాధన కొనసాగిస్తూ ఇవాళ్ళ కాకపోతే రేపు ఎప్పటికైనా సాధన సిద్ధించక పోదు అనే భావనతో ఉంటాడు. ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఒకటుంది. ఆత్మ సాధించవలసినది కాదు. ఆత్మ ఎక్కడో లేదు మనలోనే ఉంది. స్కందోపనిషత్తులో

**దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః**

**త్యజే దజ్ఞాన నిర్మాల్యం శోహం భావేన పూజయేత్ ॥**

దేహమే దేవాలయం అందులో ఉన్న జీవుడే సనాతనమైన దేవుడు పరమేశ్వర స్వరూపం. అజ్ఞానాన్ని వదలి సోహం అని జపించినట్లైతే ఆత్మసాక్షాత్కారం పొందుతారు.

పరమేశ్వరుడు ఎక్కడో లేడు నీలోనే ఉన్నాడు. నువ్వే పరమేశ్వరుడివి. మన అంతరంగమే భావనా మేఘాలతో తన స్వస్వరూపాన్ని కప్పేస్తోంది. ఆత్మానుభవం కలిగితేనే అంతఃకరణ అదృశ్యమవుతుంది. ఎంత సాధన చేసినా సాధకుల హృదయాంతరాళాలలో ఎక్కడో ఇంకా లోపల లీలామాత్రంగా విషయ భోగాలమీద కోరికలు, నేనే దేహాన్ని అనే భావన నిలిచి ఉంటాయి. భగవద్గీతలో భగవానుడు

**విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః ।**

**రసవర్జం రసోప్యస్య పరందృష్ట్వా నివర్తతే ॥**

ఇంద్రియాల ద్వారా విషయాలను గ్రహించిన వాడి నుండి ఇంద్రియార్థాలు మాత్రం వైదొలగుతాయి. కాని వాటిమీద ఆసక్తి మాత్రం ఇంకా మిగిలి ఉంటుంది. స్థితప్రజ్ఞుడికి పరమాత్మ సాక్షాత్కారమైనందువల్ల అతని నుంచి ఆ ఆసక్తి కూడా తొలగిపోతుంది.

ఇంద్రియ సంయమనము కలిగి ఉన్నప్పటికీ, మనస్సు గనక వశంలో లేకపోతే సాధకుడు పతనమవుతాడు. మనస్సు బుద్ధి కూడా పరమాత్మ యందు లగ్నం కాకపోతే అవి స్థిరంగా ఉండలేవు. అందుకని సాధకుడు భగవత్పరాయణుడై ధ్యానము నందే కూర్చోవాలి. మమతాసక్తులు, కోరికలు, అన్నీ పూర్తిగా వదలి, మనసును ఇంద్రియాలను సంయమితం చేసి, బుద్ధిని పరమాత్మ యందు స్థిరపరచాలి. ఎందుకంటే మనస్సుతో సహా ఇంద్రియాలను వశపరచుకున్న సాధకుడి బుద్ధిస్థిరంగా

ఉంటుంది. మనస్సు ఇంద్రియాలు స్థిరంగా లేనివారిలో బుద్ధి స్థిరంగా ఉండదు. కాబట్టి సాధకుడు మనస్సును ఇంద్రియాలను వశంలో ఉంచుకోవాలి. లేకపోతే విషయ వాంఛల విత్తనాలు మళ్ళీ మొలకెత్తుతాయి.

**జ్ఞానాద్గళిత కర్మా యో లోకదృష్ట్యాఽపి కర్మకృత్ ।**
**నాప్నోత్యవసరం కర్తుం వక్తుమేవ న కించన ॥ 77**

జ్ఞానంతో అన్ని కర్మల ఆవశ్యకత భావాన్ని, కర్తృత్వాన్ని విడనాడిన జ్ఞాని లోకం దృష్టిలో కర్మల నాచరిస్తున్నట్లు కనిపిస్తున్నా ఏ కర్మా చెయ్యటం లేదు. కర్తృత్వ ధ్యాస లేని జ్ఞాని నలుగురి దృష్టికి కర్మలు చేస్తున్నట్లు వ్యవహారాలు జరుపుతున్నట్లు కనిపించినా, నేను ఈ పని చేస్తున్నాను అని అహంకరించకుండా సర్వదా చిద్రూపుడై ప్రకాశిస్తుంటాడు.

జ్ఞాని ఏ పనులూ చెయ్యడు. ప్రారబ్దానుసారము వచ్చిన పనులు మాత్రం యాంత్రికంగా చేస్తాడు. వాటిమీద అతడికి ఈ పనులు నేనే చేస్తున్నాననే కర్తృత్వ భావన ఉండదు. అహంకారం అంతకన్నా ఉండదు. యాదృచ్ఛికంగా కర్మలు చేస్తూ చిద్రూపుడై ఉంటాడు.

ఆత్మానుభవం పొందిన జ్ఞానిలో అహంకారముండదు.

**క్వ తమః క్వ ప్రకాశో వా హానం క్వ చ న కించన ।**
**నిర్వికారస్య ధీరస్య నిరాతంకస్య సర్వదా ॥ 78**

నిశ్చలంగా శాంతించిన మనస్సుతో చరించే జ్ఞానికి ఏది అంధకారం? ఏది ప్రకాశం? ఏది లాభం? ఏది నష్టం? అనే భావాలు ఉండవు.

చిత్తవికారాలన్నీ నశించిన జ్ఞానికి అజ్ఞానమనేది ఉండదు. అసలు అజ్ఞానమే లేనప్పుడు, అజ్ఞానాన్ని తొలగించే జ్ఞానమెందుకు? త్రికాలములందు భయమే లేనివాడికి పరిత్యజించేదేది? పరిగ్రహించేదిది? రాగద్వేషాలు లేనివాడికి కోరతగినది ఏది? చిద్రూపుడికి జ్ఞానము, అజ్ఞానము, ఇవ్వటము పుచ్చుకోవటము, ఏవీ ఉండవు.

**లలితా సహస్రంలో జ్ఞానాజ్ఞేయ స్వరూపిణి; హేయోపాధేయవర్జితా.** అని చెప్పటం జరిగింది. ఇవి పరబ్రహ్మ లక్షణాలు. ఇవేవీ పరబ్రహ్మకు ఉండవు.

జ్ఞాని పరమాత్మ స్వరూపుడు. అతడు నిశ్చలమైన మనస్సుతో పరమ శాంతంగా ఉంటాడు. అటువంటి వాడికి చీకటి ఏమిటి? వెలుతురు ఏమిటి? లాభనష్టాలు, హేయోపాధేయాలు ఉండవు. పరమశాంతంగా ఉంటాడు.

**క్వధైర్యం క్వ వివేకిత్వం క్వ నిరాతంకతాఽపివా ।**

**అనిర్వాచ్య స్వభావస్య నిస్స్వభావస్య యోగినః ॥ 79**

అనిర్వచనీయమైన స్థితిలో స్వభావరహితుడై స్థితుడైన యోగికి ధైర్యం ఏమిటి? భయం ఎక్కడ? వివేకం ఏమిటి?

ఏ స్వభావము లేనివాడు, ఇటువంటిది అని నిర్వచించటానికి వీలు కానివాడు అయిన జ్ఞానికి ధైర్యము, వివేకము, నిబ్బరము మొదలైన ధర్మాలు కూడా ఏవీ ఉండవు.

ఒక బాటసారి అడవి మార్గం గుండా వెడుతున్నాడు. త్రోవలో ఒక నది అడ్డు వచ్చింది. నదిని దాటాలంటే తెప్ప కావాలి. అతిప్రయత్నం మీద అడవిలో దొరికే కర్రలు, తీగలు సేకరించి చిన్న తెప్ప తయారు చేసి నదిని దాటాడు. అక్కడ నుండి బయలుదేరి వెడుతున్నాడు. ఇప్పుడు తెప్పని ఏం చెయ్యాలి? నది దాటేదాకా తెప్ప చాలా అవసరం. నది దాటిన తరువాత కూడా తెప్పను చంకలో పెట్టుకుని తీసుకుపోవాలా? ఇప్పుడిక తెప్ప అవసరం లేదు. దాన్ని అక్కడే వదిలేసి వెళ్ళిపోవచ్చు. అలాగే ఆధ్యాత్మిక సాధనలో 1.ధైర్యం 2.వివేకం 3.నిర్భయత్వం. ఈ మూడు గుణాలు ఉండి తీరాలి. వాటిని సంపాదించుకుని లక్ష్యం సాధించాడు సాధకుడు. మరి ఇప్పుడు ఇంకా వాటితో అవసరం ఏమిటి? సాధన మొదట్లో ఇవి కావాలి.

ఒకటో క్లాసులో చేరిన పిల్లవాడు ప్రతిరోజు అక్షరాలు దిద్దాలి. అదే పి.జి. పూర్తయిన తరువాత కూడా అక్షరాలు దిద్దనవసరం లేదు.

**న స్వర్గో నైవ నరకో జీవన్ముక్తిర్న చైవ హి ।**

**బహూనాత్ర కిముక్తేన యోగదృష్ట్యా న కించన ॥ 80**

**నస్వర్గో, నైవనరకో జీవన్ముక్తిర్నచైవహి** స్వర్గం లేదు. నరకం లేదు. జీవన్ముక్త స్థితి అసలే లేదు. **బహూనాత్రకిముక్తేన** ఇన్ని చెప్పటం ఎందుకు? **యోగదృష్ట్యా**

యోగి దృష్టిలో **నకించన** ఏదీలేదు. ఇక్కడ యోగి అంటే మహాజ్ఞాని. యోగం లేని జ్ఞానంవల్ల గాని, జ్ఞానం లేని యోగంవల్ల గాని మోక్షం సిద్ధించదు. ఈ మాట గతంలో కూడా చెప్పుకున్నాం. అందుకే ఇక్కడ యోగి అంటే జ్ఞానసముపార్జన చేసిన మహాయోగి అతని దృష్టిలో స్వర్గ నరకాల్లేవు. జీవన్ముక్తి విదేహముక్తి అసలే లేవు. ఇవన్నీ భ్రాంతిరూపాలు.

జగత్తులో మానవుడు కర్మలు చేస్తున్నాడు. ఈ కర్మల వల్ల పాపపుణ్యాలు వస్తాయి. స్వర్గనరకాల్లో వాటిని అనుభవిస్తున్నాడు. అనేక జన్మల పుణ్యఫలం వల్ల ఆధ్యాత్మిక ధ్యాస వచ్చింది. సాధన చేశాడు. పరమాత్మ స్వరూపాన్ని తెలుసుకున్నాడు. జీవన్ముక్తుడైనాడు.

ఇప్పుడు చూడండి అసలు జగత్తే లేదిక్కడ, ఇదంతా మనస్సుచేత కల్పించబడిన భ్రమ. జగత్తే భ్రమ అయినప్పుడు అందులో మానవుడెక్కడున్నాడు అతడు చేసే కర్మలు ఎక్కడ? కర్మ ఫలితం ఎక్కడ? పాపపుణ్యాలు ఎక్కడ? స్వర్గనరకాలు ఎక్కడున్నాయి? సాధన ఎక్కడ? సాధ్యం ఏది? జీవన్ముక్తుడెవరు? నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని నాకన్న వేరైన దేదీలేదు. అటువంటప్పుడు ఇవన్నీ ఎక్కడున్నాయి? అందుకే జ్ఞాని దృష్టిలో ఏవీలేవు.

**నైవ ప్రార్థయతే లాభం నాలాభే నాను శోచతి ।**
**ధీరస్య శీతలం చిత్త మమృతేనైవ పూరితమ్ ॥ 81**

తెలివైన వాడు లాభం కావాలని కోరడు. అలాగే నష్టం వస్తే విచారించడు. నిశ్చలమైన అతని శాంతచిత్తం ఎప్పుడూ ఆత్మానందంతో నిండి ఉంటుంది.

తెలివైనవాడు అంటే జ్ఞాని. అతడు చిద్రూపుడు. అతడి మనస్సు ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికము లనబడే మూడు రకాలైన తాపత్రయాలు లేకుండా ఎప్పుడూ పరమానందభరితమై ఉంటుంది. అందువల్ల దేహధారణకు ఏదీ కోరడు. కోరినది లభించకపోతే విచారించడు.

జీవన్ముక్తుడు తనను తాను పరమాత్మగా గుర్తించాడు. కాబట్టి అతనిలో ఇంద్రియ తాదాత్మ్య రూపమైన అశాంతి ఉండదు. పరిపూర్ణత్వం భ్రమవల్ల ఏర్పడ్డ జగత్తు నుంచి ఏమీ ఆశించదు. భ్రమాజన్యమైన దానిలో దేనికి నష్టం జరిగినా బాధ పడడు.

**పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే**

**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే ॥**

పూర్ణము నుండి పూర్ణము పుడుతోంది. పూర్ణమునకు పూర్ణము కలిపినా, పూర్ణము తీసివేసినా మిగిలేది పూర్ణమే సున్నా నుంచి సున్నా తీసివేసినా, సున్నకు సున్నా కలిపినా సున్నా విలువ మారదు. బిందువు పరిపూర్ణంగా అలాగే ఉంటుంది. అందుకే జ్ఞాని ఏది కావాలని కోరడు. కోరినది రాకపోయినా విచారించడు. వచ్చినా రాకపోయినా అతనికి పోయేది ఏమీలేదు. అతని జ్ఞానానికి ఏ రకంగాను భంగం కలగదు.

పూర్ణపురుషుడైన జీవన్ముక్తుని మనస్సు సదా శాంతంగా నిశ్చలంగా ఉంటుంది.

**నశాంతం స్తౌతి నిష్కామో న దుష్టమపి నిందతి ।**

**సమదుఃఖ సుఖస్తృప్తః కించిత్కృత్యం న పశ్యతి ॥ 82**

వాసనలు లేనివాడు శాంతిని పొగడడు. విచారాన్ని నిందించడు. సదా శాంతంగా సుఖదుఃఖాలలో సమత్వబుద్ధితో ఉంటాడు. ఏవీ కావాలని కోరడు. ఏ రకమైన కోరికలు లేని చిద్రూపుడు శాంతి మొదలైన శుద్ధ సత్వగుణం గలవారిని స్తుతించడు. దుష్టులు తనను ఎంతగా హింసించినా వారిని నిందించడు. పరిపూర్ణమైన తృప్తితో సుఖదుఃఖాలను సమానంగా చూస్తాడు.

అసలు పరిపూర్ణత్వం అంటే ఏమిటి? ఆత్మత్వము యొక్క ప్రత్యక్షానుభూతితో కోరికలు లేని స్థితికి చేరుకోవటమే పరిపూర్ణ స్థితి. ఇది కోరికలు అణిచివేసిన స్థితి కాదు. కోరికలే కలగని స్థితి. కోరికలు ఉండటానికి వీలు లేని స్థితి. పరమేశ్వరుడు పూర్ణకాముడు. ఆప్తకాముడు, నిష్కాముడు. కోరికలు తీరినవాడు. కోరికలు లేనివాడు. తనకు కావలసినది ఇంక ఏదీలేదు. అందుకే అతడు నిత్యానందుడు. అది అనుభవైకవేద్యము. అనిర్వచనీయము. పూర్ణత్వాన్ని పొందినవాడు జ్ఞాని. దేన్నీ సాధించాలనుకోడు. అతడి నుండి విడిగా ఏమీలేదు.

**ధీరో న ద్వేష్టి సంసారమాత్మానం న దిదృక్షతి ।**

**హర్షామర్షవినిర్ముక్తః న మృతో నచ జీవతి ॥ 83**

జ్ఞాని పరిణామశీలమైన సంసారాన్ని ద్వేషించడు. ఆత్మను దర్శించాలనీ కోరడు. అతడు సుఖదుఃఖాల నుండి విముక్తుడు, అతడు జీవించిలేడు. మృతుడు కాడు. లౌకిక దృష్టి జ్ఞానికి ఉండదు. లౌకిక బాధలు గమనించడు. లౌకిక విషయాలను ఆదరించడు. అతడికి జీవించాలని కోరిక ఉండదు. మరణించాలని అంతకన్న ఉండదు.

సంసారము నిత్యము పరిణామశీలమైనది. ప్రతిరోజు మార్పు చెందుతుంది. ఒక విత్తనాన్ని నాటాము. మరునాటికి మొలకెత్తుతుంది. మూడవరోజున మారాకు వేస్తుంది. ఇలా రోజుకు ఒక రకమైన మార్పు వస్తుంది. దీన్నే నిత్యపరిణామశీలము అంటారు. ఇటువంటి జగత్తులో జ్ఞానికి లౌకికదృష్టి ఉండదు. లోకంలో ఏం జరుగుతున్నది అనే విషయం అవసరం ఉండదు. లోకబాధలు అవసరం లేదు. లోకాన్ని ద్వేషించడు. అతడికి ఆత్మసాక్షాత్కారమైంది. తానే పరబ్రహ్మ అని తెలుసుకున్నాడు. తనకన్న వేరుగా ఇంకేదీ లేదు. అందుకనే లోకాన్ని ఆదరించడు. అతడికి దేనిమీదా ఆశ ఉండదు. విరక్తి ఉండదు. జీవించాలి అనుకోడు. మరణించాలని అంతకన్నా అనుకోడు. అతడి పరిస్థితి చాలా విచిత్రంగా ఉంటుంది. అతడికి ఆత్మను చూడాలనే కోరిక ఉండదు. తానే ఆత్మ. సంసారమంటే ద్వేషం ఉండదు. తానే జగత్తు. జగత్తే తాను. తనకన్న భిన్నమైనది ఏదీలేదు.

ఇతడు మరణించాడా అంటే లేదు. మనకిలాగానే తింటున్నాడు తిరుగు తున్నాడు. పోనీ జీవించి ఉన్నాడా అంటే లోకంతో ఏ రకమైన సంబంధం ఉండదు.

**నిస్స్నేహః పుత్రదారాదౌ నిష్కామో విషయేషు చ ।**
**నిశ్చింత స్స్వశరీరేఽపి నిరాశ శ్శోభతే బుధః ॥ 84**

భార్యబిడ్డలమీద మోహం, విషయ వాంఛలు, దేహాభిమానం ఏవీ లేని మహనీయుని జీవితం ధన్యం. ఎప్పుడూ ఆనందంతో నర్తిస్తుంటుంది.

చిద్రూపుడికి దారాపుత్రులమీద ప్రేమ ఉండదు. అసలు అతడికి బంధాలే ఉండవు. భార్య ఎవరు? పిల్లలు ఎవరు? దేనియందు కోరిక ఉండదు. అతడు అనుభవించాల్సింది ఏమీ లేదు. అతడు పూర్ణకాముడు కోరికలన్నీ తీరినవాడు. నిష్కాముడు కోరికలు లేనివాడు. అతడికి దేహాభిమానం కూడా ఉండదు. ఈ శరీరాన్ని

శవంలా చూస్తాడు. నేను అంటే ఆత్మ అంతేకాని దేహంకాదు. కనీసం దైనందిన కార్యక్రమాలపైన తినటం, తాగటం వంటి వాటిపైన కూడా ఆసక్తి ఉండదు.

జీవన్ముక్తుని స్థితి మరి ఒక జీవన్ముక్తునికి మాత్రమే తెలుస్తుంది. అతన్ని గురించి మనం ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. పరిపూర్ణమైన శాంతితో ఉండే అతని మనసును ఊహించటం కూడా కష్టమే. అపూర్వమైన కాంతితో పరిపూర్ణమైన తేజస్సుతో **శోభతేబుధః** పండితుడు ప్రకాశిస్తున్నాడు. భూతభవిష్యద్వర్తమానాలు అంటే ప్రస్తుతం జరుగుతున్న పనులు, జరిగిన పనులు, జరగబోయే పనులు ఏవీ అతణ్ణి చలింపచేయలేవు. వ్యామోహానికి కారణం గతస్మృతులు. పుట్టనిపిల్లలపై ప్రేమ, వివాహం కాని భార్యమీద మమకారం, సంపాదించని ధనంపై వ్యామోహం ఉండవు. ఇవి ఉన్నాయంటే దీనికి కారణం గతస్మృతులు.

మానవుడు శరీర తాదాత్మ్యం చెందటం వల్ల

1. ప్రాపంచిక వ్యవహారాలలో సుఖాన్ని పొందటం
2. తనవారి పట్ల అభిమానము, ప్రేమ
3. భవిష్యత్తులో ఏదో సాధించాలనే కోరిక.

ఈ మూడు కలుగుతాయి. దేహాభిమానమున్న వారెవరూ ఈ మూడింటి నుంచి బయట పడలేరు. దానివల్ల నిత్యము అశాంతికి లోనవుతారు.

జ్ఞానికి భార్యాపుత్రులమీద వ్యామోహం ఉండదు. విషయవాంఛలు ఉండవు. దేహాభిమానం ఉండదు. కాబట్టి అతడి జీవితం ధన్యమైనది. అతడు సుఖంగా శాంతంగా ఉంటాడు.

**తుష్టి స్సర్వ ధీరస్య యధాపతిత వర్తినః ।**
**స్వచ్ఛందం చరతో దేశాన్యత్రాస్త మిత శాయినః ॥ 85**

జ్ఞాని తన హృదయంలో నిత్యతృప్తుడై ఉంటాడు. కోరకుండా ప్రాప్తించిన వాటితో సుఖంగా జీవిస్తాడు.

ఇది మంచి, ఇది చెడు, ఇది కష్టము, ఇది సుఖము అని భావించకుండా, ప్రాప్తించిన దానిని అనుభవిస్తూ నిత్య సంతోషియై ఎటువంటి కోరికలు లేక స్వేచ్ఛగా

గాలివాటున పయనిస్తూ, అరణ్యంలో గాని, పట్టణంలో గాని ఎడారిలోగాని సూర్యాస్తమానం అయిన తరువాత అక్కడే విశ్రమిస్తాడు. ఈ రకంగా ఆత్మారాముడై విరాజిల్లుతుంటాడు. మానవుడికి అసంతృప్తి ఎందుకు వస్తుంది అంటే తనచుట్టు ఉన్న ప్రదేశాలు నచ్చక, వాటిని మార్చలేక, వాటిలో ఇమడలేక, ఇంతకన్న ఎక్కువ సుఖం కావాలనీ ఆలోచించేవాడు అసంతృప్తిగా ఉంటాడు. ఈ ప్రపంచంలో ఇంకా సుఖం పొందవచ్చు అనే నిశ్చయంతో మానవుడు తన ప్రయత్నం విఫలం చేసుకున్నాడు. ఇతరులను ఇబ్బంది పెడుతాడు.

బాహ్యప్రపంచం నుండి ఏమీ కోరకుండా సదా సంతోషంగా జీవించే జ్ఞాని శరీరం ప్రారబ్ధానుసారం కర్మలు నిర్వహిస్తుంది. అతనికి అహంకారము లేదు. కాబట్టి ఏ కోరిక ఉండదు. దేని ఫలితాలు అతనికి చెందవు. జ్ఞాని నిర్జన ప్రదేశంలో ఒంటరిగా చరిస్తాడు. అలా వెడుతున్నప్పుడు ఏ ప్రదేశంలో సూర్యుడు అస్తమిస్తే అక్కడే విశ్రాంతి తీసుకుంటాడు. దేన్నీ పట్టించుకోడు. అన్నింటినీ సమానంగా చూస్తాడు.

**పతతూదేతు వా దేహో నాస్య చింతా మహాత్మనః ।**
**స్వభావ భూమి విశ్రాంతి విస్మృతాశేష సంసృతే ॥ 86**

తన స్వభావంలో స్థితుడై జనన మరణచక్రం నుండి విముక్తి పొందిన జ్ఞాని తన శరీరం ఉన్నా లేకపోయినా సదా శాంతంగా ఉంటాడు.

తన స్వభావము అంటే తన యొక్క ఆత్మస్వరూపమే అధిష్ఠానంగా అందులో విశ్రాంతి తీసుకుంటున్న జ్ఞాని అతడే ఆత్మారాముడు. అతడు స్వస్వరూపంలో అంటే తనయొక్క స్వరూపంలో లీనమై ఉంటాడు. అటువంటి జ్ఞాని జీవించి ఉన్నా మరణించినా ఏమాత్రము చింతించడు. జీవించి ఉండగానే ముక్తి పొందినవాడు జీవన్ముక్తుడు. అటువంటివాడు తన ఆయువు ఉన్నంత వరకు జీవించి, ఆ తరువాత ఈ దేహాన్ని విడిచి పరబ్రహ్మలో లీనమవుతాడు. ఈ రకంగా పరబ్రహ్మలో లీనం కావటాన్నే విదేహముక్తి అంటారు. ఆత్మజ్ఞాని సర్వదా తన స్వస్థితిలోనే ఉంటూ చరిస్తూ ఉంటాడు. అందుకే ఈ భ్రమాజగత్తులో అతని శరీరము ఏ స్థితిలో ఉన్నా అతనికి ఒకటే. నిద్ర పోతున్నాడు. కల వచ్చింది. కలలోంచి లేచాడు. కలలో

అతను చాలా అందంగా ఉన్నాడు. మెలకువ వచ్చిన తరువాత యథార్థ స్థితి. ఇప్పుడు కలలో ఉన్న అందమైన శరీరానికి, తనకు సంబంధం ఏమిటి? ఆ శరీరము జీవించి ఉన్నా, మరణించినా నీకు ఒకటే. అలాగే జీవన్ముక్తుడు కూడా, అతడికి శరీరం ఉన్నా లేకపోయినా ఒకటే. శరీరాన్ని శవంలాగా చూస్తాడు. అందుచేతనే అతడు సశరీరుడైనా, అశరీరుడైనా తేడాలేదు.

**అకించనః కామచారో నిర్ద్వంద్వశ్ఛిన్న సంశయః ।**
**అసక్త స్సర్వభావేషు కేవలో రమతే బుధః ॥ 87**

తనను మోహింపచేసేది, ప్రలోభ పెట్టేది ఏదీలేదు అనే దృఢమైన జ్ఞానంతో, దేన్నీ సంపాదించాలనే కోరిక లేకుండా, తన ఇష్టం వచ్చినట్లు చరిస్తూ ఉంటాడు. ఏ సంశయాలు లేకుండా, ద్వంద్వాలకు లోనుగాకుండా నిత్యము ఆనందంగా ఉంటాడు.

చిద్రూపుడికి తాను పరిగ్రహించేది ఏదీలేదు కాబట్టి **'అకించనుడు'** అనబడతాడు. నియమ నిష్టలు, విధి నిషేధాలు ఏవీ లేవు కాబట్టి **స్వేచ్ఛావిహారి, కామచారి** (కోరుకున్నట్లుగా చరించేవాడు) అనబడతాడు. అతడికి సుఖదుఃఖాలుండవు. తనకన్న ఇతరమైనది ఏదీలేదనే దృఢమైన నిశ్చయం కలిగి ఉంటాడు. నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని. నాకన్న వేరైనదేదీ లేదు అని గ్రహించి ఏ సంశయాలు లేకుండా, ఏ కోరికా లేనివాడై నిర్వికారుడై విరాజిల్లుతాడు.

ఇతడు మహాజ్ఞాని. పూర్ణకాముడు. నిష్కాముడు తనకు ఇంకా కావలసినది ఏదీలేదు. అతడికి ఈ పని చెయ్యవచ్చు. ఇది చెయ్యరాదు. ఇది ఇలాగే చెయ్యాలి. అనే నియమ నిష్ఠలు ఉండవు. శివపురాణము, శివమహాపురాణము, శివభక్తులు వీటిలో ఇలాంటి అనేక విశేషాలు కనిపిస్తాయి. ఈశ్వరుడు పరమేశ్వరుడు. అతడికి ఏ నియమాలు ఆచారాలు ధర్మాలు ఉండవు. భక్తుడు పిలిస్తే భోజనానికి వస్తాడు. ఇంటికి వచ్చినవాడు స్నానం చెయ్యటం కాదుకదా కనీసం కాళ్ళు కూడా కడుక్కోడు. వళ్ళంతా దుమ్ము కొట్టుకుపోయి చూడటానికి కూడా అసహ్యంగా ఉంటుంది. అలాగే భోజనానికి కూచుంటాడు. అటువంటి స్థితి చూస్తే ఎటువంటి భక్తుడికైనా విపరీతమైన కోపం వస్తుంది. ఇక్కడ గ్రహించాల్సిందేమంటే ఆయన పరమేశ్వరుడు. ఆయన

దృష్టిలో మన్ను మిన్ను అంతా ఒకటే. ఇలాంటి మహానుభావులు ఆచరించిందే నియమము, ధర్మము. అన్నింటికీ అతీతమైనవాడు, ఏ పని కావాలంటే ఆ పని చేస్తాడు. వాళ్ళు చేశారు కదా అని సామాన్య ప్రజలు చెయ్యకూడదు. వాళ్ళు ఘటనాఘటన సమర్థులు. శంకరాచార్యులవారు త్రోవన పోతున్నప్పుడు ప్రక్కన ఒక కల్లుపాక కనిపించింది. లోపలికి వెళ్ళి కల్లుకుండ ఎత్తి తాగేశాడు. చూశారు శిష్యులు. గురువుగారే త్రాగగా లేనిది మనం త్రాగితే వచ్చిందా అని తలా ఒక కుండ తాగేశారు. కొంత దూరం వెళ్ళిన తరువాత కమ్మరి కొలిమి వచ్చింది. అక్కడ ఇనుము కరుగుతున్నారు. శంకరుడు పాత్ర తీసుకుని కరిగిన ఇనుమును గటగటా తాగేశాడు. శిష్యులు నివ్వెరబోయారు. కల్లైతే తాగేశారు. కాని ఇది కరిగిన ఇనుము. ఎవరివల్ల అవుతుంది? వెంటనే గురువుగారి కాళ్ళమీద పడ్డారు. షిర్డీసాయి ఉడుకుతున్న అన్నాన్ని చేత్తో కలియబెట్టాడు. చేయకాలదా? ఇది అనుమానం. అసలు చెయ్యి ఉంటేగా కాలటానికి ఆయన సమాధానం. మహాజ్ఞానులు ఇలాగే చేస్తారు.

ఈ రకంగా జ్ఞాని నిస్సంశయుడై, కోరికలు లేనివాడై నిర్వికారుడై ఉంటాడు.

**నిర్మమశ్శోభతే ధీరః సమలోష్టాశ్మ కాంచనః ।**
**సుభిన్న హృదయగ్రంథిర్వినిర్ధూత రజస్తమః ॥ 88**

మనిషి లోపల ఉండే అజ్ఞాన గ్రంథులు నశిస్తే అహంకారం పోతుంది. అటువంటి జ్ఞానికి రాయి రత్నం, మట్టి బంగారం అన్నీ సమానంగానే కనిపిస్తాయి. అహంకారం లేదు రజోగుణము తమోగుణము లేవు. కేవలం సత్వగుణ ప్రధానుడుగా ఉంటాడు.

జ్ఞాని గురువును ఆశ్రయించాడు. సేవించాడు. జ్ఞాన సముపార్జన చేశాడు. ఆ జ్ఞానంతో అహంకార మమకారాలను నాశనం చేశాడు. హృదయ గ్రంథిని ఛేదించాడు. రాయిరత్నము, మట్టి బంగారము సమానంగా చూస్తున్నాడు. ఇతడికి ఏ ఆశా లేదు.

గ్రంథి అంటే – ముడి, కణుపు అని అర్థం. అడ్డుగా ఉండేది. వేదాంత పరిభాషలో లౌకిక విషయ సమూహాన్నే గ్రంథి అంటారు. మానవ శరీరంలో

షట్చక్రాల్లోను మూడు గ్రంథులు ఉన్నాయి. 1.బ్రహ్మగ్రంథి 2.విష్ణుగ్రంథి 3.రుద్రగ్రంథి. ఆధార చక్రంలో అథోముఖంగా నిద్రావస్థలో ఉన్న కుండలినీశక్తి ప్రాణాయామం వల్ల జాగృతమై సుషుమ్నానాడి గుండా ఊర్ధ్వముఖంగా బయలుదేరి, గ్రంథిత్రయాన్ని ఛేదించుకుని సహస్రదళ పద్మం చేరుతుంది. ఇక్కడ గ్రంథిభేదనము అంటే అక్కడ ఉండే విషయ వాసనలు నాశనం చెయ్యటం. బ్రహ్మగ్రంథిభేదనము అంటే సాధకుడికి నేను నాది అనే భావం పోయి స్వరూపజ్ఞానం కలగటం. విష్ణుగ్రంథి భేదనము అంటే సాధకుడికి తనవల్లనే జగత్తంతా నడుస్తోంది అనే భావన నశించటం. ఇదే హృదయగ్రంథి. రుద్రగ్రంథి భేదనము అంటే – సర్వాన్ని లయం చేసి అమృతత్త్వాన్ని పొందటం.

ఎప్పుడైతే ఈ గ్రంథులు విడిపోయాయో జగత్తుకు తనకు మధ్యన ఉన్న బంధాలు తెగిపోతాయి. అప్పుడు లోకంలో అన్నీ సమానంగానే కనిపిస్తాయి. రాయికీ రత్నానికీ తేడా ఉండదు. ఈ గ్రంథులవల్లనే బంధాలు ఏర్పడతాయి. గ్రంథులు విడిపోతే సాధకుడు అమరుడవుతాడు.

**సర్వత్రానవధానస్య న కించి ద్వాసనాహృది ।**
**ముక్తాత్మనో వితృప్తస్య తులనా కేన జాయతే ॥ 89**

ఏ కోరికలు లేకుండా నిత్యతృప్త హృదయంతో అన్నింటినీ ఉదాసీనంగా చూడగలిగే జ్ఞానికి ఎవరూ సరికాదు. జ్ఞానికి ఏ విషయమందు ఆసక్తి ఉండదు. ఇది చూడాలి, ఇది చెయ్యాలి, ఇది తినాలి ఇలా ఏమీ ఉండదు. అసలు దేన్ని గురించి ఆలోచించడు పట్టించుకోడు. అతని హృదయంలో ఏ రకమైన వాసనలు ఉండవు. దేనిమీద అపేక్ష ఉండదు. నేను ఈ పని చేస్తున్నాననే ధ్యాసే ఉండదు. అతడు తాను దేనికి కర్తని అని భావించడు. అతడికి కర్తృత్వభావన ఉండదు. తాను భోక్తని అనికూడా అనుకోడు. అతడికి దేనితోను అవసరం లేదు. నిరంతరము ఆత్మానందంలో తేలియాడతాడు. అటువంటి మహానుభావుడితో సమానమైన వారు ఎవరూ లేరు.

**జానన్నపి నజానాతి పశ్యన్నపి న పశ్యతి ।**
**బ్రువన్నపి న చ బ్రూతే కోఽన్యో నిర్వాసనాదృశే ॥ 90**

అతణ్ణి మరొక జీవన్ముక్తుడు తప్ప ఇంకొకరు గుర్తించలేరు. పరిపూర్ణుడయిన ఆ వ్యక్తిలో బాహ్యాభ్యంతర ఇంద్రియాలు పరిశుద్ధము, నిర్మలము అయి ఉంటాయి. అతడికి కర్తృత్వ భోక్తృత్వాలు ఏవీ ఉండవు. అతడు ఏ పనిచేసినా చెయ్యనట్లే. చూసినా చూడనట్లే. వింటున్నా విననట్లే. మాట్లాడుతున్నా మాట్లాడనట్లే. ఈ పనులు నేనే చేస్తున్నానే భావన కూడా అతనిలో ఉండదు. అతడికి అన్ని తెలుసు. కళ్ళు లేకుండానే చూస్తాడు. చెవులు లేకుండానే వింటాడు పరమేశ్వరుడు. కైవల్యోపనిషత్తులో

**పశ్యమ్యచక్షుః సః శృణోమ్యకర్మణః**

కళ్ళు లేకుండానే చూస్తున్నాను. చెవులు లేకుండానే వింటున్నాను.

**భిక్షుర్వా భూపతిర్వాఽపి యో నిష్కామస్స శోభతే ।**
**భావేషు గలితాయస్య శోభనాఽశోభనా మతిః ॥ 91**

జ్ఞాని భిక్షకుడైనా మహారాజైనా తేడాలేదు. జగత్తంతా పరబ్రహ్మ స్వరూపము అదే నేను. ఈ జగత్తులో దృశ్యమానమైనది ఏదీ నాకన్న వేరుకాదు అనే దృఢమైన జ్ఞానంతో అహంకార మమకారాలు వదలి మంచి చెడు భావాలనుంచి బయటపడి పరమశాంతంగా జీవిస్తాడు. అతడి జన్మధన్యము.

జ్ఞాని పదవులను ఆశించడు. ఉన్నత పదవులు కావాలనుకోడు. నీచమైనవి వద్దనుకోడు. అతనిలో కోరిక ఉండదు. అటువంటివాడు రాజైనా, బిచ్చగాడైనా ఒకటే.

ఒక బిచ్చగాడు మిట్టమధ్యాహ్నం మంచి ఎండలో ఊరిబయట చెరువుగట్టున ఉన్న పెద్దరావిచెట్టు క్రింద పడుకుని హాయిగా నిద్ర పోతున్నాడు. పైనుంచి దేవేంద్రుడు వెడుతున్నాడు. క్రిందికి చూశాడు. బిచ్చగాడు చీకుచింతా లేకుండా హాయిగా నిద్ర పోతున్నాడు. ఇంద్రుడికి అనుమానం వచ్చింది. "నేను ముల్లోకాలకు అధిపతిని. స్వర్గాధిపతిని. దేవతలకు రాజును. నూరు అశ్వమేధ యాగాలుచేసి ఈ పదవి సంపాదించాను. నేను సభకు వస్తే త్రిమూర్తులు కూడా గౌరవిస్తారు. నాది అత్యంత విలాసవంతమైన జీవితం. గొప్ప అందగత్తెలు అని పేరు పొందిన అప్సరాంగనలు నా సభలో నాట్యం చేస్తారు. నేను ఎక్కడికి వెళ్ళమంటే అక్కడికి వెడతారు. నాశయ్యా

మందిరం, విశ్రాంతి మందిరం అన్నీ చాలా చక్కగా అలంకరించి ఉంటాయి. కాని నాకు ఏ రోజు నిద్రపట్టదు. మనసులో శాంతి ఉండదు. చెప్పలేని భయం తెలియని ఆందోళన నన్ను వెంటాడుతున్నాయి. మరి ఈ భిక్షకుడు హాయిగా ఎలా పడుకుని నిద్ర పోతున్నాడు? సరే ఈ విషయం అతణ్ణే అడుగుదాం?" అనుకుని భూమిమీదకి దిగాడు. ఆ ప్రాంతమంతా నిర్మానుష్యంగా ఉంది. బిచ్చగాడు మాత్రం వళ్ళు తెలియకుండా నిద్ర పోతున్నాడు. ప్రశాంతంగా ఉన్నాడు. అతనికి సంబంధించిన జోలె అతడి పక్కనే ఉంది. దగ్గరకు వెళ్ళి భిక్షకుణ్ణి నిద్రలేపి ఇదే విషయాన్ని అడిగాడు. ఓ భిక్షకా ! అన్ని సౌకర్యాలు ఉన్న నాకు నిద్ర పట్టటం లేదు. కటిక నేలమీద ఆరు బయటపడుకుని హాయిగా ఎలా నిద్రిస్తున్నావు? అన్నాడు. దానికి ఆ భిక్షకుడు 'దేవేంద్రా! నువ్వెక్కడికి వెడుతున్నావు' అన్నాడు.

"వింధ్య పర్వతాల్లో ఒక మహర్షి తీవ్రంగా తపస్సు చేస్తున్నాడు. అతనికి ఇంద్రపదవి కావాలట. అతడి తపస్సు భగ్నం చెయ్యటానికి అప్సరసలను పంపాను. వారి వల్ల కాలేదు. ఇప్పుడు స్వయంగా నేనే బయలుదేరాను' అన్నాడు.

దానికి బిచ్చగాడు నవ్వి ఇంద్రా ! నూరు అశ్వమేధ యాగాలు చేసి ఇంద్రపదవి సాధించావు. సుఖాలనుభవిస్తున్నావు. కాని ఆ పదవి ఎంత కాలం ఉంటుందో నీకు తెలియదు. రాక్షసులు దండయాత్ర చేస్తారు. నిన్ను ఓడించి నీ పదవి లాక్కుంటారు. అలాగే ఏ మహానుభావుడైనా తపస్సు చేసి ఈ పదవి సంపాదించవచ్చు. ఎవరైనా నూరు అశ్వమేధ యాగాలు చేస్తే అతడు ఇంద్రుడౌతాడు. ఏ మహర్షి అయినా కోపం వచ్చి శాపం పెడితే మరుక్షణంలోనే నీ పదవి పోతుంది. నీకు ఇన్ని సౌకర్యాలున్నాయి. కాని వాటిని అనుభవించే తీరిక ఎక్కడుంది? ఎంతసేపు నీ పదవి ఎక్కడ పోతుందో అనే భయం. దాన్ని రక్షించుకోటానికే అహరహము ప్రయత్నం చేస్తావు. దాంతో అశాంతికి గురైన మనసుకు సుఖంగా నిద్ర ఎలా పడుతుంది?

నన్ను చూడు. నాకు ఉన్నది లేదు పోయేది లేదు. నాలుగు ఇళ్ళల్లో అడుక్కుని తెచ్చుకున్న అన్నం, ఇదిగో ఈ చెరువు గట్టున తిని, చెరువులో నీరు త్రాగి, ఈ చెట్టు క్రింద చల్లటిగాలిలో నిద్ర పోతాను. నాకు ఏమీ కావాలనే కోరిక లేదు. నా దగ్గర ఉన్నది ఎవరో లాక్కెడతారనే భయం అంతకన్నా లేదు. నాకున్న సుఖము శాంతి నీకెలా ఉంటాయి? అన్నాడు.

జనకమహారాజు దేశానికి రాజైనా మహాజ్ఞాని. అందుకే జ్ఞాని అయినవాడు బిక్షకుడైనా, మహారాజైనా ఒక్కటే. పరమశాంతంగా ఉంటాడు. అజ్ఞానిలో ఉద్రేకాలు కలిగించే వస్తువులు జ్ఞానిలో వైరాగ్యాన్ని నింపుతాయి.

**క్వ స్వాచ్ఛంద్యం క్వ సంకోచః క్వ వా తత్త్వవినిశ్చయః ।**
**నిర్వ్యాజార్జవ భూతస్య చరితార్థస్య యోగినః ॥ 92**

ఇంతవరకు జీవిత పరమార్థాన్ని గ్రహించాడు. సాధించాడు అవ్యాజమైన పరిపూర్ణానందంతో నిండి ఉన్నాడు. అంటే అతడే పరబ్రహ్మ. ఇంక అతనికి నియమ బంధనలేమిటి? స్వేచ్ఛాప్రవృత్తి ఏమిటి? తత్త్వజ్ఞానంతో పని ఏమిటి? ఈ జ్ఞాని సచ్చిదానందమయుడు, అన్ని వస్తువుల యందు, అన్ని జీవుల యందు సమభావం కలిగినవాడు. అతడికి నియమాలు, స్వేచ్ఛ, కర్తృత్వభావన ఎలా ఉంటాయి? జ్ఞాని స్వస్థితిలో ఉన్నాడు. అంటే స్వరూపానందం పొందుతున్నాడు. అదే బ్రహ్మానందం. ఈ ఆనందాన్ని ఇద్దరే పొందగలరు. ఒకరు పరబ్రహ్మ. రెండవ వాడు సర్వసంగ పరిత్యాగి అయిన మహాజ్ఞాని. అతడు బ్రహ్మానందాన్ని అనుభవిస్తున్నాడు అంటే అతడే సాక్షాత్తు పరబ్రహ్మ. ఇంకా జీవించి ఉన్నాడు కాబట్టి జీవన్ముక్తుడు. అటువంటి పరమేశ్వరుడికి బంధ మోక్షాలు, సుఖదుఃఖాలు, కర్తృత్వ భోక్తృత్వాలు ఎలా ఉంటాయి? అతని దృష్టిలో జగత్తంతా తానే. తానే జగత్తు, జగత్తే తను. ఇక్కడ నామరూపాలు ప్రత్యేకంగా ఏవీలేవు. ఒకవేళ ఉన్నాయనుకున్నా పిపీలికాది బ్రహ్మపర్యంతము అన్ని జీవులు సమానమే. అన్ని వస్తువులు సమానమే. అతనికి సర్వభూతములందు సమత్వదృష్టి ఉంటుంది.

**ఆత్మవిశ్రాంతి తృప్తేన నిరాశేన గతార్తినా ।**
**అంతర్యదనుభూయేత తత్కథం కస్య కథ్యతే ॥ 93**

సుఖదుఃఖాల నధిగమించి కోరికలు లేకుండా అనంతమైన ఆత్మతత్త్వంలో నిత్యతృప్తుడై ఉన్న జ్ఞాని స్థితిని అతడు మాత్రమే అర్థం చేసుకోగలడు.

ఆత్మ విశ్రాంతి చేత తృప్తుడై, ఆశారహితుడైన జ్ఞాని అంతఃకరణలో కలిగే ఆనందం ఇలా ఉంటుంది అని ఎవరు చెప్పగలరు? అతడి స్థితి ఇంకొక జ్ఞానికే తెలుస్తుంది. జ్ఞాని సాక్షాత్తు పరబ్రహ్మము. అతడికి ఈ జగత్తుకు సంబంధం ఉండదు.

అతడికి దేహానికి సంబంధంఉండదు. నిరంతరము ఆనంద డోలికలలో తేలియాడు తుంటాడు. అతడికి మనోధర్మాలు దేహధర్మాలు, బుద్ధిధర్మాలు ఏవీ ఉండవు. అతడు పొందే ఆనందం అనంతమైనది. అనిర్వచనీయము అనుభవైక వేద్యము.

పరమేశ్వరుడు ఎక్కడ ఉంటాడు అంటే అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములనబడునున్న ఆనందమయకోశంలో ఉంటాడు. అక్కడ ఉండే ఆనందమయుడే పరబ్రహ్మ. అంటే ఆనందాన్ని కలుగజేసేవాడు. ఆ ఆనందము క్షణికమా శాశ్వతమా? **తైత్తిరీయోపనిషత్తు**లో చెప్పినట్లుగా

కోరికలను అనుభవించటం వల్ల పొందే ఆనందం క్షణికానందం. అనుభవించ గానే ఈ ఆనందము తరిగిపోతుంది. రెండవది శాశ్వతమైన ఆనందం. అదే బ్రహ్మానందం. ఈ లోకంలోని సంపదఅంతా యువకుడు, సదాచార సంపన్నుడు, వేదాధ్యాయి, శరీరబలము గలవాడు అనుభవించటానికే ఉన్నది. ఇటువంటి వ్యక్తి అనుభవించే ఆనందాన్ని మానుషానందము అంటారు.

| | |
|---|---|
| మానుషానందానికి నూరు రెట్లు | – మనుష్యగంధర్వానందం |
| మనుష్య గంధర్వానందానికి నూరురెట్లు | – దేవగంధర్వానందం |
| దేవగంధర్వానందానికి నూరురెట్లు | – చిరలోక పితరానందం |
| చిరలోకపితరానందానికి నూరురెట్లు | – అజానజదేవానందం |
| అజానజదేవానందానికి నూరురెట్లు | – కర్మదేవానందం |
| కర్మదేవానందానికి నూరురెట్లు | – దేవానందం |
| దేవానందానికి నూరురెట్లు | – ఇంద్రానందం |
| ఇంద్రుని ఆనందానికి నూరురెట్లు | – బృహస్పతి పొందే ఆనందం |
| బృహస్పతి ఆనందానికి నూరురెట్లు | – ప్రజాపతి ఆనందం |
| ప్రజాపతి ఆనందానికి నూరురెట్లు | – బ్రహ్మానందం |

బ్రహ్మానందము అనేది ఐదు రకాల ఆనందాల కలయిక. అవి 1. జ్ఞానానందము 2. విషయానందము 3. ఆత్మానందము 4. అద్వైతానందము 5. యోగానందము.

ఇతడే ఆనందస్వరూపుడైన పరబ్రహ్మ.

చూసేవారికి జ్ఞాని సామాన్యుడులాగా ఉంటాడు. అతని స్థితి ఇంకొక జ్ఞానికి మాత్రమే తెలుస్తుంది.

**సుప్తోఽపి న సుషుప్తౌ చ స్వప్నేఽపి శయితో న చ ।**

**జాగరేఽపి న జాగర్తి ధీరస్తృప్తః పదే పదే ॥ 94**

జ్ఞాని జాగ్రదావస్థలో ఉన్నా మేలుకొని ఉన్నవాడు కాదు. స్వప్నావస్థలో నిద్రించనట్లే. సుషుప్తిలో ఉన్నా నిద్రించనట్లే సర్వదా స్వస్థిలో శాంతంగా ఉంటాడు.

అన్ని సమయాలలోను ఆనంద స్థితిలో ఉండే యోగి ఏ అవస్థలో ఉన్నా అతడు అవస్థాత్రయానికి సాక్షి మాత్రమే. ఆ అవస్థలతో అతనికి సంబంధం ఏ మాత్రము లేదు.

మనం అజ్ఞానం కారణంగా జాగ్రస్వప్న సుషుప్తులు అనుభవిస్తుంటాము. ఆ అవస్థలలో జ్ఞాని ఉన్నా లేనట్లే. అతడు విశ్వుడు కాదు తైజసుడు కాదు ప్రాజ్ఞుడు అంతకన్నా కాదు. మరి ఎవరు? సర్వానికి అధిష్ఠానమైన ఆత్మతత్త్వము.

**జ్ఞస్సచింతోఽపి నిశ్చింతః సేంద్రియోఽపి నిరింద్రియః ।**

**స బుద్ధిరపి నిర్బుద్ధిస్సాహంకారో ఽనహంకృతిః ॥ 95**

అతడు ఆలోచిస్తున్నట్లుగా ఉన్నా అతనిలో ఏ ఆలోచనలు ఉండవు. ఇంద్రియాలు ఉపయోగిస్తున్నా ఇంద్రియాలు లేవు. బుద్ధి ఉన్నా బుద్ధిగతమైన తెలివి లేదు. తనలో అహంకారం ఉన్నా అతనికి అహంకారం ఉండదు.

చిద్రూపుడు చింత మొదలైన వాటితో ఇంద్రియ వ్యాపారం చేస్తున్నప్పటికీ, బుద్ధిచేత ప్రేరేపితుడై ఇంద్రియాలకు వశుడైనట్లు అందరికీ కనిపించినా, అహంకారము లేనివాడు. కాబట్టి చింతాదులతో వ్యవహార స్ఫురణ లేనివాడు.

అందరిలాగానే జ్ఞాని మనసులో ఆలోచనలు, ఇంద్రియాలు, వాటి ధర్మాలు అన్నీ ఉంటాయి. అయితే అతడు ప్రత్యేకమైన వ్యక్తి కాబట్టి అతడిలో అహంకారం ఉండి తీరాలి. అతడికి ఉపాధితో తాదాత్మ్యం ఉండదు. అందుకే అతడికి ఇంద్రియాలు ఉన్నా అతడిలో అవి లేనట్లే. అతడికి అహంకారము ఉన్నా అతడిలో అహంకారము లేనట్లే.

**న సుఖీ న చ వా దుఃఖీ న విరక్తో న సంగవాన్ ।**

**న ముముక్షుర్న వా ముక్తో న కించిన్న చ కించన ॥ 96**

జ్ఞానికి సంతోషమూ లేదు దుఃఖము లేదు. రక్తీ లేదు విరక్తీ లేదు. అతడు ముక్తుడు కాదు. ముక్తి పొందాలనే కోరిక ఉండదు. అతడు ఏదీకాదు.

సచ్చిదానందరూపుడికి అంతఃకరణ ధ్యాసే ఉండదు. కాబట్టి లౌకిక సంబంధమైన సుఖము, దుఃఖము ఉండవు. ఏ విషయం మీదా కోరిక ఉండదు విరక్తి అంతకన్న ఉండదు. అతడికి బంధాలు అనుబంధాలు లేవు. ముక్తి కావాలనే కోరిక ఉండదు. అలా అని ముక్తుడు కూడా కాదు. ఆత్మకు నామరూపాలు లేవు. అటువంటి స్థితిలో ఉన్న జ్ఞానిని గురించి ఏమీ చెప్పటానికి లేదు.

సుఖదుఃఖాలు మనస్సు యొక్క భావాలు. అవి జీవన్ముక్తుడికి ఉండవు. అంటే అతనికి మనస్సులేదు. మనస్సును జయించాడు మనస్సును నాశనం చేశాడు.

రాగద్వేషాలు వైరాగ్యము. ఇవి బుద్ధియొక్క భావాలు. జ్ఞాని బుద్ధిని కూడా జయించాడు. కాబట్టి ఈ భావాలు అతనికుండవు.

జ్ఞాని పరబ్రహ్మ స్వరూపుడు. కాబట్టి అతడి దృష్టిలో బంధాలు లేవు. బంధాల నుండి విడివడటం అంతకన్న లేదు. బంధాలు తెంచుకోవటం కోసం అతడు ఆరాటపడడు.

జగత్తులో అతనికన్న రెండవది ఏదీలేదు. మరి ముక్తి ఎలా వస్తుంది? ఎవరిస్తారు? ఉన్నది తాను ఒక్కడే. కలలో బంధించబడ్డాడు. మెలకువ వచ్చిన తరువాత బంధాలు తెంచుకునే ప్రయత్నం చేయడు కదా. ఇంతకీ జ్ఞాని ఏమిటి? అంటే **న కించన్న కించన** అదీ కాదు ఇదీ కాదు అసలు ఏదీకాదు. కాని అన్నీ అతడే.

మనస్సు వ్యామోహము అహంకారములను ఎప్పుడు వదులుతుందో, ఆ క్షణమే అనిర్వచనీయమైన ఆనంద స్థితిలో ఉంటుంది.

**విక్షేపేఽపి న విక్షిప్తస్సమాధౌ న సమాధిమాన్ ।**
**జాడ్యేఽపి న జడోధన్యః పాండిత్యేఽపి న పండితః ॥ 97**

జ్ఞాని విక్షేపంలో కూడా విక్షేపాన్ని చూడడు. సమాధిలో ఉన్నా ధ్యానం చెయ్యడు. జడుడులాగా కనిపించినా జడుడు కాడు. పండితుడులాగా కనిపించినా అతనికి పాండిత్యము లేదు.

ఆత్మసాక్షాత్కారము పొందిన జ్ఞాని అందరికి మల్లేనే వ్యవహారాలు జరుపుతున్నట్లుగా కనిపించినా అది ఏమాత్రము లేనివాడు. సమాధిలో ఉన్నట్లు కనిపించినా అతడు సమాధిలో ఉండడు. జడుడులాగా కనిపించినా అతడు ఆత్మనిష్ఠుడు కాబట్టి జడుడు కాదు. అతనికి అన్ని శాస్త్రాలు తెలుసు చాలా గొప్ప పండితుడు అయినప్పటికి జ్ఞానం లేదు కాబట్టి పండితుడు కాదు. ఈ రకంగా లోకం దృష్టిలో ఏమికాదు.

జ్ఞాని ఎలా కనిపిస్తాడో అదేదీ అతడు కాదు. సమస్త జగత్తు నుండి భిన్నంగా ఉన్నట్లు కనిపిస్తాడు. అతడికి మానసిక స్థితితోనే కాదు శారీరక స్థితితో కూడా ఏమాత్రము సంబంధము ఉండదు. ధ్యానము, సమాధి, పాండిత్యము, ఇవన్నీ మనోబుద్ధులకు సంబంధించినవి. జ్ఞానికి మనస్సుఉండదు. బుద్ధి ఉండదు. అలాంటప్పుడు వాటి లక్షణాలు ధర్మాలు ఎలా ఉంటాయి? ఉండవు.

**ముక్తోయథాస్థితి స్వస్థః కృతకర్తవ్య నిర్వృతః ।**
**సమస్సర్వత్ర వైతీష్ణ్యాన్న స్మరత్య కృతం కృతమ్ ॥ 98**

అతడు సర్వకాల సర్వావస్థల యందు ఆత్మస్థితుడు. కర్మ, ధర్మం అనే భావాల నుండి విముక్తుడవుతున్నాడు. సర్వత్రా సమత్వబుద్ధితో ఉంటాడు. అతడికి కోరికలు ఉండవు. గతంలో తాను చేసిన కర్మలగురించి కాని, చెయ్యనివాటిని గురించిగానీ ఏమీ ఆలోచించడు.

ప్రారబ్దవశంగా వచ్చే కర్మలు ఆచరిస్తాడు. కాని వాటికి అతడు కర్తా కాదు భోక్తా కాదు. సుఖదుఃఖాలు అనుభవిస్తాడు. కాని వాటివల్ల ఆనందించడు దుఃఖించడు. పరమ ప్రశాంతచిత్తుడై ఉంటాడు. ఇది చెయ్యాలి. ఇది చెయ్యకూడదు అనే పట్టుదల, కోరికలు ఉండవు. కాబట్టి గతంలో చేసిన కర్మలు, ముందు చెయ్యబోయే కర్మల బంధాలుండవు. ఇది కావాలి. దీన్ని పొందాలి అనే ఆశ కోరిక ఉండదు. కాబట్టి ఈ పని చేశాను ఈ పని చెయ్యలేదు అనే ఆలోచన కూడా ఉండదు.

**న ప్రీయతే వన్ద్యమానో నింద్యమానో న కుప్యతి ।**
**నై వోద్విజతి మరణే జీవనే నాభినందతి ॥ 99**

జీవన్ముక్తుడు పొగిడితే పొంగిపోడు. తిడితే కుంగిపోడు, విచారించడు. లౌకిక జీవితంలో ఆనందాన్ని అనుభవించడు. అతడికి మరణం లేదు.

ఈ జగత్తంతా అనిత్యము అని అతడికి తెలుసు. కాబట్టి మరణం సమీపిస్తోంది అంటే భయపడడు. మరణము అనేది దేహానికే కాని ఆత్మకు కాదు. అతడు దేహాన్ని శవంలాగా చూస్తాడు. అందుకే మరణం సంభవిస్తే దేహం పోతుంది నాకేమిటి? అని భావిస్తాడు. లౌకిక జీవితంలో ఆనందాన్ని అనుభవించడు. ఎందుచేతనంటే అసలు లౌకిక జీవనమే నిజంకాదు. అది ఒక కలలాంటిది. కలలో పొందే ఆనందం ఎలాంటిదో జీవితంలో పొందే ఆనందం కూడా అలాంటిదే. అతడు పొందేది శాశ్వతమైన ఆనందం. అదే బ్రహ్మానందం. అది అనిర్వచనీయము. అనుభవైకవేద్యము.

**న ధావతి జనాకీర్ణం నారణ్య ముపశాంతధీః ।**

**యథా తథా యత్ర తత్ర సమయేవావతిష్ఠతే ॥** **100**

నిత్యశాంత తృప్తమానసుడైన జ్ఞాని జనసమూహం మధ్యన గాని, ఏకాంతవాసం గాని కోరుకోడు. ఏ ప్రదేశంలోనైనా సమబుద్ధితో శాంతంగా ఉంటాడు.

జ్ఞాని ఆత్మసాక్షాత్కారము పొందినవాడు కాబట్టి జనారణ్యం మధ్యలో ఉండాలని గాని, లేదా ఒంటరిగా, ఏకాంతంగా అరణ్యాలలో గాని, కొండగుహలలో గాని ఉండాలనుకోడు. అంటే ఫలానా ప్రదేశము నాకు అనుకూలము అనే భావన అతనికి ఉండదు. ఎక్కడ ఉన్నప్పటికీ అతడు చిద్రూపుడే కాబట్టి పరమశాంతంగా ఉంటాడు.

ఆకాశంలో సూర్యబింబం తేజోవంతంగా ప్రకాశిస్తోంది. అది నీటిలో చూస్తే విరిగి ముక్కలు కావచ్చు. నాట్యం చెయ్యవచ్చు. ఏది ఏమైనా ఆకాశంలోని సూర్యుడికి ఏ రకమైన హాని కలగదు. అతడికి అహంకారం ఉండదు. కాబట్టి బాహ్యస్థితిగతులతో అతడికి సంబంధం ఉండదు.

# అధ్యాయం-19

## అఖండానందైకరసచిన్మాత్ర స్వరూపము (ఆత్మానుభవము)

ఈ విషయాన్ని ఛాందోగ్యోపనిషత్తు, తేజోబిందూపనిషత్తులలో వివరంగా చెప్పారు.

అఖండైక రసము అంటే సంపూర్ణమైన ఒకే ఆనందరసము గలది. అని అర్థం. ఈ ఆనందము ఖండఖండాలుగా కాకుండా సంపూర్ణంగా ఉంటుంది. ఈ లోకంలో శిష్టాచార సంపన్నుడు, సిరిసంపదలు, భోగభాగ్యాలు ఉన్నవాడు, వేదవేదాంగవిదుడు, మంచి యౌవ్వనంలో ఉన్న మానవుడు పొందే ఆనందము మానుషానందము. దానికి ఒకటి ప్రక్కన పదిహేడు సున్నాలు పెడితే ఎంత అవుతుందో, అన్ని రెట్లుంటుంది బ్రహ్మానందం. అటువంటి సంపూర్ణమైన, అఖండైక రసమైన ఆనంద డోలికలలో విహరించేవాడు చిన్మాత్ర స్వరూపుడు. అతడే పరబ్రహ్మ.

దృశ్యమానమైన ఈ జగత్తు అఖండైక రసము. తాను అఖండైక రసమే. మంత్రము, క్రియ, జ్ఞానము, జలము, భూమి, ఆకాశము, శాస్త్రము, త్రయీవిద్య, బ్రహ్మ, జీవుడు, అన్నీ అఖండైక రసాలే. సృష్టికర్త అయిన బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, అహం అనబడే నేను (జీవుడు) తత్ అనబడే పరమేశ్వరుడు, గురువు, శిష్యుడు, మనస్సు, దేహము, బుద్ధి, చిత్తము, అహంకారము, విద్య, సుఖము, పరము అన్నీ అఖండైక రసాలే. అఖండైక రసముకన్న వేరైనది ఏదీలేదు. నేను, నువ్వు, స్థూలము, సూక్ష్మము, జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము, తల్లి, తండ్రి, భ్రాత, పతి, పత్ని అన్నీ అఖండైక రసాలే.

శాంతము, గుణము, సాక్షి, స్నేహితుడు, బంధువు, మిత్రుడు, రాజు, రాజ్యము, పురము, ప్రజలు, జపము, ధ్యానము, పదము, గ్రాహ్యము, మహత్తు, జ్యోతిస్సు, హవిస్సు, హోమము, జపము, స్వర్గము, నరకము, ఘనము, భోజ్యము, తాను అన్నీ అఖండైక రసమైన చిన్మాత్ర స్వరూపాలే. ఈ సర్వము చిన్మాత్రయే. అఖండైక రసమే. ఈ లోకమంతా చిన్మాత్ర స్వరూపమే. నువ్వు, నేను, ఆకాశము, భూమి, వాయువు, అగ్ని, జలము, త్రిమూర్తులు, మూర్తామూర్తములు (రూపముగలవి,

రూపము లేనివి) అంతా చిన్మాత్రయే. భూతము, భవ్యము, భవిష్యత్తు అంతా చిన్మాత్రయే. ద్రవ్యము, కాలము చిన్మాత్ర. జ్ఞానము, జ్ఞేయము చిన్మాత్ర. జ్ఞాతచిన్మాత్ర. సంభాషణ ఏదైతే ఉన్నదో అదంతా చిన్మాత్ర. సత్తు అసత్తు. ఆది అంతము, చిన్మాత్రయే. గురుశిష్యులు, దృక్కు దృశ్యము అన్నీ చిన్మాత్రయే.

లోకంలో దృశ్యమానమైన సర్వవస్తువులు, స్థూలదేహము, సూక్ష్మదేహము, కారణదేహము, అంతా చిన్మాత్రయే. పాపపుణ్యాలుకూడా చిన్మాత్రయే. చిన్మాత్రకన్న వేరైనది లేదు. చిన్మాత్రకన్న సంకల్పము లేదు. వేదనము (తెలివి) లేదు. మంత్రం లేదు, దేవతలేదు, వ్యావహారికము లేదు. పరబ్రహ్మ లేడు. ఏదీలేదు. ఎవడూ లేడు.

చిన్మాత్రకన్న మాయలేదు. పూజనము లేదు. మంతవ్యము (ఆలోచింపదగినది, ఊహించతగినది) లేదు. మౌనము లేదు, అమౌనము లేదు. వైరాగ్యము లేదు. సర్వమూ చిన్మాత్రయే. కంటికి కనిపించనిది చిన్మాత్రయే. వేదాంతమంతా చిన్మాత్రయే. చిన్మాత్ర కన్న గమనము లేదు. మోక్షము లేదు. లక్ష్యము అంతకన్నా లేదు. సర్వము చిన్మాత్రయే. అఖండైక రసమైన పరబ్రహ్మ చిన్మాత్రకన్న వేరుకాదు. శాస్త్రమునందు, నాయందు, నీయందు, ఈశ్వరునియందు, అఖండైకరసుడనైన నేను ఉన్నాను అని తెలుసుకున్నవాడు సకృత్ (వెంటనే) అద్వైత సిద్ధాంత జ్ఞానముతో ముక్తి పొందుతాడు. బ్రహ్మజ్ఞానము రాగానే స్వయముగా తానే గురువవుతాడు.

చిన్మాత్ర అంటే పరబ్రహ్మకన్న వేరు కాదు. ఛాందోగ్యోపనిషత్తులో బ్రహ్మతత్త్వ విజ్ఞానము నాలుగు పాదములుగా ఉన్నది. అంటూ ఈ విశాల విశ్వంలో నాలుగు దిక్కులూ బ్రహ్మతత్త్వములో ఒక భాగము.

భూమి, ఆకాశము, సముద్రాలు, నదులు, పర్వతాలు అన్నీ రెండవ భాగము.

సూర్యుడు, చంద్రుడు, విద్యుల్లతలు, అగ్ని మూడవ భాగము. ఇక నాల్గవ భాగం. ప్రాణం బ్రహ్మ, దృష్టి బ్రహ్మ, శ్రవణం బ్రహ్మ. మనస్సు బ్రహ్మ అని చెప్పబడింది. అంతేకాదు.

భూమి, సూర్యుడు, చంద్రుడు, ఆ పరబ్రహ్మయొక్క రూపాంతరాలే. సూర్యునిలోను, చంద్రునిలోనూ నీలోనూ ఉన్న తత్త్వము ఒక్కటే. దశదిశలు, నక్షత్రాలు, నేల, నీరు, నింగి, వీటిలో ఉన్న తత్త్వమంతా ఒక్కటే. ఆకాశంలోని

మెరుపులో ఏ తత్త్వమైతే ఉన్నదో అదే నీలోనూ, నాలోనూ, చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నది. అదే పరబ్రహ్మ తత్త్వము. చిన్మాత్ర స్వరూపము. అఖండైక రసము. దీనిని తెలుసుకున్నవాడే మహాజ్ఞాని

ఆత్మానుభవాన్ని గురించి **తేజోబిందూపనిషత్తు** చెబుతోంది.

అతడికి ఆత్మసాక్షాత్కారమైంది. తానే పరబ్రహ్మ స్వరూపము అని తెలిసింది. తానుతప్ప ఈజగత్తులో వేరెవరూలేరు. ఉన్నది ఒక్కటే అదేపరబ్రహ్మ. అదేతను. కాబట్టి, "నేను పరబ్రహ్మస్వరూపుణ్ణి, జ్ఞానరూపుడను, పరముడను, కేవలము శాంతరూపుడను, చిన్మయుడను, నిత్యరూపుడను, శాశ్వతుడను, సత్యరూపుడను, నేను కలిసి ఉన్నాను, నేను విడిచి ఉన్నాను. సర్వజీవస్వరూపుడను. చిదాకాశమయుడను.

నేను సత్పరానందరూపుడను. చిత్పరానంద రూపుడను. అవాఙ్మానస గోచరుణ్ణి. వాక్కుకు మనస్సుకు అందని వాణ్ణి. ఆత్మానందరూపుడను. సత్యానందరూపుడను. ఆత్మారాముడను. నేనేఆత్మను, నేనేసదాశివుడను. ఆత్మప్రకాశరూపుడను. ఆత్మజ్యోతిని ఆదిమధ్యాంతరహితుడను, ఆకాశసదృశుడను. నిత్యశుద్ధుడను, చిదానందుడను, సత్తామాత్రుడను. నిత్యబుద్ధుడను. ఏకసచ్చిదానందమును. సర్వాతీతుడను. రూపాతీతుడను. పరమైన ఆకాశవిగ్రహుడను. భూమానంద స్వరూపుడను. భాషాహీనుడను, సర్వాధిష్ఠానరూపుడను. దేహభావం లేనివాడను. చింతలులేని వాడను. చిత్తవృత్తులు లేనివాడను. చిదాత్మైకరసుడను. ద్రుగ్రూపుడను. పూర్ణరూపుడను. నిత్యతృప్తుడను. నేనే బ్రహ్మను. సర్వము నేనే. చైతన్యము నేనే, జడము నేనే. ఆకాశ స్వరూపుడను నేనే. ఆత్మను నేనే. నేను ఎవరిలాగానో ప్రకాశిస్తుంటాను. నేను శరీరంలాగాభాసిస్తాను.

నేను శిష్యునిలాగా భాసిస్తాను. లోకత్రయాశ్రయుడను. త్రికాలాతీతుడను. వేదాలచే ఉపాసింపదగినవాడనునేనే. శాస్త్రాలతో నిర్ణయింపబడేవాడను, చిత్తంలో ఉన్నవాడను. నేనులేనిది ఎక్కడాలేదు. నేను బ్రహ్మను. సిద్ధుడను, నిత్యశుద్ధడను. నిర్గుణుడను. కేవలము ఆత్మరూపిని. నిరాకారుడను. కేవలము బ్రహ్మమాత్రుడను. అజరుడను, అమరుడను. నాకునేనే ప్రకాశిస్తాను. నాకునేనే సదాత్మకుడను. స్వయంగా ఆత్మయందున్నాను. నాకుపరాగతినేనే. స్వయంగా భుజిస్తాను. స్వయంగా క్రీడిస్తాను.

స్వయంగా జ్యోతిస్వరూపాన్ని. స్వయంగా మహారూపాన్ని. నా ఆత్మలో నేనే క్రీడిస్తాను. నా ఆత్మయందే అన్నీ చూస్తాను. స్వాత్మయందు సుఖాసీనుడనై స్వాత్మమాత్రావశిష్ఠుడనై ఉంటాను. స్వచైతన్యంలో స్వయంగాఉంటాను. స్వాత్మ రాజ్యంలో సుఖమందురమిస్తాను. స్వాత్మసింహాసనము నుండి స్వాత్మకన్న ఇతరమైన దాన్ని చింతించను.

చిద్రూపమైన బ్రహ్మను. చిదానంద స్వరూపుడను. అద్వయుడను. నేను ఆనంద ఘనుడను. నేను కేవలము బ్రహ్మను. నేను ఎప్పుడూ సర్వశూన్యుడను. ఆనందవంతుడను. నిత్యానంద స్వరూపుడను. ఆత్మాకాశుడను. హృదయాకాశంలో చిదాదిత్య స్వరూపుడను నేనే. ఆత్మచే, ఆత్మయందు తృప్తుడను. అరూపుడను. అవ్యయుడను. నిత్యము ముక్తస్వరూపుడను. ఆకాశముకన్న మహాస్వరూపుడను. ఆద్యంతములు లేనివాడిని. సర్వప్రకాశరూపుడను. సత్తామాత్ర స్వరూపుడను. శుద్ధమోక్ష స్వరూపుడను. సత్యానంద స్వరూపుడను. జ్ఞానానంద ఘనుడను. విజ్ఞానమాత్ర రూపుడను. సచ్చిదానందలక్షణుడను. ఈసర్వజగత్తు బ్రహ్మముమాత్రమే. బ్రహ్మకన్న వేరైనది ఏదీలేదు. అదే నేను. సచ్చిదానందస్వరూపుడను. సనాతనమైన బ్రహ్మను నేనే. నీవు, అతడు అనేవి నాకన్న వేరుగా లేవు. నేనే పరమశివుడను.

నేను అతిభావస్వరూపుడను. నాకు సాక్షిత్వంలేదు. నేనే సనాతనమైన ఆత్మను. ఆదిశేషుడునేనే. నామరూపాలులేనివాడను. ఆనందవిగ్రహుడను. ఇంద్రియాభావ రూపుడను. సర్వాభావరూపుడను. బంధమోక్షాలు లేనివాడను. శాశ్వత ఆనంద విగ్రహుడను.

చైతన్యమాత్రుడను. అఖండైకరసుడను. అవాఙ్మానసగోచరుడను. సుఖవంతుడను. అన్నిప్రదేశాలయందు పూర్ణుడను. భూమానందమయుడను, తృప్తిరూపుడను. ఉత్కృష్టమైన అమృతరసుడను. అద్వితీయుడను, సత్తును, అసత్తును. నేనేబ్రహ్మను. సంశయము లేదు. సర్వశూన్యస్వరూపుడను. సకలాగమములందు గోచరుడను. ముక్తుడను. మోక్షరూపుడను. నిర్వాణసుఖస్వరూపుడను.

సత్యవిజ్ఞానమాత్రుడను. సన్మాత్రుడను. సదానందుడను. తురీయాతీతరూపుడను. నిర్వికల్పుడను. అజుడను. రాగము లేనివాడను. నిరంజనుడను. శుద్ధుడను. బుద్ధుడను, నిత్యుడను, విభుడను. ఓంకారానికి అర్థరూపాన్ని. నిష్కళంకమైన చిదాకార స్వరూపాన్ని. నేను అనేది లేదు. అతడు నేను కాదు. నేను ఏ స్వరూపము కాదు.

నిర్వ్యాపార స్వరూపుడను. నిరంజనుడను. నిరాభాసుడను. నేనుఅంటే మనస్సును కాదు. ఇంద్రియాలుకాదు. బుద్ధికాదు, వికల్పముకాదు, దేహత్రయముకాదు, అవస్త్రాత్రయముకాదు, తాపత్రయముకాదు, ఈషణత్రయముకాదు. నాకు శ్రవణం లేదు. మననంలేదు. సజాతీయములేదు విజాతీయములేదు.

మనోరూపముఅసత్యము. బుద్ధిఅసత్యము. అహంకారముఅసత్యము. నేను నిత్యుడను. శాశ్వతుడను. దేహత్రయము, కాలత్రయము, గుణత్రయము అంతా అసత్తే. నేను సత్యాత్మకుడను. శుచియైనవాడను. శ్రుతము, వేదము, శాస్త్రము, అంతా అసత్తే. నేనొక్కడనే చిదాత్మకుడను. సత్యము, మూర్తిత్రయము అంతా అసత్తే. సర్వభూతాలుఅసత్తు. సర్వతత్త్వాలుఅసత్తు. నేను సర్వమూవ్యాపించిఉన్నాను. నేనేశివుడను.

గురువులేడు శిష్యుడులేడు. మంత్రంలేదు తంత్రంలేదు. దృశ్యములేదు దృక్కులేదు. నేనుమాత్రమేఉన్నాను. చింత్యమైనది, న్యాయమైనది, హితమైనది ఏదీలేదు. ప్రాణాలన్నీఅసత్తే. భోగాలుఅసత్తే. చూడబడేది, వినబడేది, అంతా అసత్తే. కార్యము అకార్యము అసత్తే. నష్టమైనది ప్రాప్తమైనది కూడా అసత్తే.

సుఖంలేదు దుఃఖంలేదు. పూర్ణంలేదు అపూర్ణంలేదు. ధర్మంలేదు అధర్మం లేదు. స్వరూపములేదు. అంతా అసత్తే. నేనుసన్మాత్రుడను. **"ఆత్మసాక్షాత్కారం"** పొందిన వాడు ఈ విధంగా ఆత్మానుభవం పొందుతాడు.

'అతడికి ఆత్మసాక్షాత్కారం పొందినవాడు జ్ఞానం అనే పటకారతో తన హృదయంలో గ్రుచ్చుకున్న భ్రమలనే ముళ్ళను తొలగించగలిగాడు.

అతడికి ధర్మాధర్మాలు, అర్థకామాలు, పురుషార్థాలు ఏవీలేవు. ద్వైతము, అద్వైతము కూడా లేవు.

భూతభవిష్యద్వర్తమానాలు లేవు. దేశకాలమానాలు లేవు నిత్యానిత్యాలు లేవు.

అతడి దృష్టిలో ఆత్మలేదు అనాత్మ అంతకన్నా లేదు. సుఖదుఃఖాలు లేవు.

అతడికి జాగ్రదావస్థ, స్వప్నావస్థ, సుషుప్తి, తురీయము మొదలైన అవస్థలు లేవు. దగ్గర, దూరము, స్థూలము సూక్ష్మము అనేవి లేవు. జనన మరణాలు లేవు. ప్రపంచం లేదు. ప్రాపంచిక విషయాలు లేవు. ధారణ, ధ్యానము, సమాధి లేవు. ఎలా జీవించాలి? జీవితంలో ఏం సాధించాలి? అనే వాటిమీద ఉపన్యాసాలు, ఉపదేశాలు అవసరం లేదు. జ్ఞానోపదేశం కూడా అవసరం లేదు.

అతడికి ఆత్మసాక్షాత్కారమైంది. నిరంతరము తన ఆత్మలోనే స్థితుడై ఆత్మారాముడైనాడు. కాబట్టి అతడికి ఇంక దేనితోను అవసరం లేదు.

ఆ విషయాన్నే జనక మహారాజు ఇక్కడ చెబుతున్నాడు. ఈ అధ్యాయంలో ఎనిమి శ్లోకాలున్నాయి. 2 నుంచి 7 వరకు గల ఆరు శ్లోకాలు **స్వమహిమ్నిస్థిత్వమే.** అంటే నా మహిమలో ఉన్న నాకు. నేనే ఆత్మారాముణ్ణి అంటున్నాడు జనక మహారాజు.

**తత్త్వవిజ్ఞాన సందంశమాదాయ హృదయోదరాత్ ।**
**నానావిధ పరామర్శ శల్యోద్ధారః కృతోమయా ॥ 1**

సత్యాన్ని గురించిన జ్ఞానం అనే శ్రావణంతో, నా హృదయంలో ముళ్ళలా ఉన్న భ్రమలను తొలగించగలిగాను.

జనక మహారాజు అంటున్నాడు. గురుదేవా! నా మీద పరిపూర్ణమైన వాత్సల్యంతో మీరు నాకు ఉపదేశించిన తత్త్వవిజ్ఞానము అనే పటకారతో నా హృదయంలో గ్రుచ్చుకొని ఉన్న అనేక రకాలైన సంకల్ప వికల్పాలనే ముళ్ళను తీసేశారు. నేను అన్ని రకాల సంశయాల నుండి బయట పడ్డాను.

పూర్వకాలంలో అనేకమంది మహర్షులు పరబ్రహ్మ తత్త్వాన్ని గురించి శోధించారు. వీరిలో 1.ఆత్రేయుడు 2.అశ్మరథ్యుడు 3.ఔఢులోమి 4.కార్ష్ణాజిని 5. కాశకృత్స్నుడు 6.జైమిని 7.బాదరాయణుడు (వ్యాసుడు) 8. బాదరి. అనేవారు ప్రసిద్ధులు. బ్రహ్మసూత్రభాష్యంలో వీరిని చెప్పటం జరుగుతుంది. భారతీయ తత్త్వ శాస్త్రాన్ని మధించి దర్శన శాస్త్రంగా వ్రాసిన 1.పతంజలి 2.పాణిని 3.జైమిని 4.వ్యాసుడు 5.కపిలుడు 6.కణాదుడు 7.అక్షపాదుడు ఇతణ్ణే గౌతముడు అని కూడా అంటారు. శంకర భగవత్పాదుల వారు, రామానుజుల వారు, మధ్వాచార్యులు వీరు అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతమతాలను ప్రచారం చేశారు. వీరు కాక బ్రహ్మనిష్ఠా గరిష్ఠులైన గౌతముడు, దధ్యుడు, ఉద్దాలకుడు, వశిష్ఠుడు మొదలైన వారు. ఆధ్యాత్మిక విద్యలో ఆరితేరినవారు బ్రాహ్మణేతరులు కూడా ఉన్నారు. మిథిలానగరాధిపతి జనక మహారాజు, కాశీరాజు అశ్వపతి, పాంచాలదేశాదీసుడైన ప్రవాహణుడు. వీరందరూ క్షత్రియులు. గార్గేయి, మైత్రేయి వంటి స్త్రీలు కూడా బ్రహ్మవిద్యలో ఆరితేరిన వారు.

వీరందరూ తమ శిష్యులకు బ్రహ్మవిద్యను ఉపదేశించటానికి అనేక మార్గాలు అనుసరించారు. **ఏకం సద్ విప్రాబహుధావదంతి** ఉన్నది ఒక్కటే సత్యం. అదే పరబ్రహ్మ. దాన్ని మహర్షులు ఎన్నో విధాలుగా చెప్పారు. ప్రతి మహర్షీ శాస్త్రంలోని విషయాన్ని ప్రవచనాల ద్వారా తార్కిక దృష్టితో, తన మేధాశక్తితో, అనితర సాధ్యంగా పరబ్రహ్మను వివరించారు. ఈ వివరణలో ఎవరి మార్గం వారిది. అలా మహర్షులు ఇచ్చిన వివరణలే ఉపనిషత్తులు. ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. ఉపనిషత్తులు వేదంలో భాగం కదా? అని. నిజమే. ఉపనిషత్తులు వేదంలో చివరి భాగము. అవి ఋషి ప్రోక్తాలు.

పరబ్రహ్మ తత్త్వాన్ని వివరించటానికి విపరీతమైన కృషి చేశాయి ఉపనిషత్తులు. అందులో చాలావరకు కృతకృత్యమైనాయి కూడా. అయితే ఆధ్యాత్మిక విషయాలు అందరికీ అర్థం కావు. అవి అర్థం కావాలంటే గతజన్మలలో చేసిన సుకృతం విపరీతంగాఉండాలి. లేకపోతే 'బధిరశంఖారావం' లాగా ఉంటుంది. పూర్వకాలంలో పండితులందరికీ ఉపనిషత్తుల మీద పట్టు ఉండేది. ఆ రోజుల్లో చదువుకోవటం అంటే వేదాధ్యయనము, శాస్త్రాధ్యయనము. అవి తప్ప ఇంకొకటి లేదు. కాబట్టి అందరికీ ఉపనిషత్తులు కరతామలకంగా ఉండేవి. ఈ రోజున బ్రతుకు తెరువు కోసం చదువులైనాయి. వేదాధ్యయనం వెనకపడి పోయింది. ఆధ్యాత్మిక విద్య అడుగంటి పోయింది. పండితులు తమ పాండిత్యం ప్రదర్శించటానికి గ్రంథాలు వ్రాస్తున్నారు. సామాన్యుడికి అవి అర్థం కావు. "తత్త్వశాస్త్ర గ్రంథాలు శబ్దజాలంతో కూడిన మహారణ్యాల వంటివి. అందులో చరించే మనస్సు దారి తప్పి అరణ్యం మధ్యలో చిక్కుపడిపోయే ప్రమాదం ఉంది" అంటున్నారు శంకరులు తమ **వివేక చూడామణి**లో.

ఈ రకంగా పరమేశ్వర తత్త్వాన్ని గురించి విన్న బోధనలనే పటకారతో నా హృదయంలో గ్రుచ్చుకున్న భ్రమలనే ముళ్ళను బయటకు తీసి నన్ను కృతార్థుణ్ణి చేశావు. అని గురువుకు కృతజ్ఞతలు చెబుతున్నాడు జనక మహారాజు.

**క్వ ధర్మః క్వ చ వా కామః క్వ చార్థః క్వ వివేకితా ।**
**క్వ ద్వైతం క్వ చవాఽద్వైతం స్వమహిమ్ని స్థితస్యమే ॥ 2**

నా స్వరూపస్థితిలో ఉన్న నాకు ధర్మమేమిటి? అర్థమేమిటి? వివేకమేమిటి? ద్వైతమెక్కడ? అద్వైతమెక్కడ?

ఓ గురుదేవా! ధర్మార్థ కామాలనబడే పురుషార్థాలు అశాశ్వతమైనవి. అవి కూడా మీ బోధల వల్ల నా హృదయంలో నుంచి తొలగిపోయినాయి. దీంతో నేను అచంచలుడనై స్థిరంగా ఉన్నాను. అటువంటి నాకు జ్ఞానమేమిటి? ద్వైతమెక్కడ? అద్వైతమెక్కడ? అసలు వాటితో పని ఏమిటి? నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని అంటున్నాడు జనక మహారాజు.

ధర్మార్థ కామమోక్షాలు చతుర్విధ పురుషార్థాలు. అయితే కైవల్యాన్ని కూడా పురుషార్థంగానే చెబుతున్నారు విశిష్టాద్వైతులు. పురుషార్థాలలో చివరిది మోక్షము. అదే సాయుజ్యము. ధర్మార్థ కామాలు మూడు, నాల్గవదైన మోక్షం సాధించటానికి సోపానాలు. సామాన్యుడికి వీటిలో ముందుగా చెప్పాల్సినవి అర్థకామాలు. అర్థము అంటే విత్తం. ధనసంపాదన, మోక్షగామికి ధనంతో పని ఏమిటి? అని అనుమానం వస్తుంది. **బృహదారణ్యకోపనిషత్తు**లో జనక మహారాజు ఒకసారి యజ్ఞం చేస్తున్నాడు. ఆ యజ్ఞకర్మలో భాగంగా వేదాంత చర్చలు జరుగుతున్నాయి. అప్పుడు అనుకోకుండా జనకుడికి ఒక విచిత్రమైన కోరిక కలిగింది. ఆధ్యాత్మిక ప్రపంచానికి రారాజు ఎవరో తెలుసుకోవాలనుకున్నాడు రాజు. వేదాంత, ఆధ్యాత్మిక సభ జరుగుతోంది. సభలోకి బాగా బలిసిన వేయి ఆవులను, ఆబోతులు, దూడలతో సహా తీసుకువచ్చారు. వాటివీపున పట్టు వస్త్రాలు కప్పి ఉన్నాయి. మెడలోను, కాళ్ళకు, మూపురానికి, ముఖానికి బంగారు హారాలు తగిలించి ఉన్నాయి. ఇప్పుడు మహారాజు లేచి 'ఓ సభికులారా! ఆధ్యాత్మిక ప్రపంచానికి రారాజు ఎవరో, వారు ఈ ఆవులను తోలుకుపోవచ్చు అన్నాడు. సభలో ఎవరూ లేవలేదు. సభంతా నిశ్శబ్దంగా ఉంది. అప్పుడు యాజ్ఞవల్క్యుడు లేచి శిష్యుణ్ణి పిలిచి 'ఈ ఆవులను ఆశ్రమానికి తోలుకు వెళ్ళు' అన్నాడు. శిష్యుడు ఆవులను తోలుకుపోతున్నాడు. ఇప్పుడు సభాసదులు లేచి అడ్డగించారు. యాజ్ఞవల్క్యుణ్ణి అడిగారు.

సభికులు – నువ్వు పండితుడివా?

యాజ్ఞవల్క్యుడు– కాదు

స – నువ్వు ఆధ్యాత్మిక ప్రపంచానికి రారాజువా?

యా – కాదు

స – మరి ఈ ఆవులను ఎందుకు తోలుకుపోతున్నావు?

యా – 'నేను ఒక యాగం చెయ్యాలనుకుంటున్నాను. దాని కోసం నాకు బంగారము, ధనము, పట్టు వస్త్రాలు కావాలి. వాటి కోసం ఎలాగూ రాజుగారినే ఆశ్రయించాలి. ఇప్పుడు రాజుగారు అడగకుండానే వాటిని ఇస్తున్నారు. అందుకే వాటిని నేను తీసుకుపోతున్నాను' అన్నాడు.

మోక్షగాములకు ధనమెందుకు? అనే మాటకు సమాధానం చెప్పాడు యాజ్ఞవల్క్యుడు. యజ్ఞాలు, యాగాలు చెయ్యాలంటే చాలా ధనం కావాలి. 2009 సంవత్సరంలో **సహస్ర చండీయాగం** చేశాను. డిసెంబరు 25న దానికి పూర్ణాహుతి జరిగింది. ఆ ఒక్కరోజునే నాకు లక్ష రూపాయలు ఖర్చైంది. 2017లో మళ్ళీ సహస్ర చండీయాగం చేసి డిసెంబరు 25న పూర్ణాహుతి చేశాను. దానికి లక్షాపాతిక వేలయింది. నాకే ఇంతైతే పెద్ద వాళ్ళు చేసే వాటికి ఇంకా ఎంత ఖర్చు అవుతుందో చూడండి. దానికోసమే ధనార్జన.

యజ్ఞయాగాలు చేస్తే మోక్షం రాదు. స్వర్గం వస్తుంది. కాని మనసు నిర్మలమవుతుంది. నిర్మలమైన మనసులో పరమేశ్వరుడు తాండవం చేస్తాడు. వాటికోసం ధనార్జన చెయ్యాలి. కామము అంటే కోరిక. మోక్షసాధనకు ఉపకరించే కోరికలు. ఇవి తీర్చుకోవటానికి ధనం కావాలి. ఇప్పుడు ధార్మికమైన పనులు చెయ్యాలి. విద్యాలయాలు, అన్నసత్రాలు, దేవాలయాలు, కట్టించటం, బాటలు నిర్మించటం. వాపీకూప తటాకాలు నిర్మించటం వంటి ప్రజోపయోగమైన పనులు చెయ్యటం. ఇదంతా ప్రత్యక్షంగా పరమేశ్వరుణ్ణి అర్చించటమే. రామాయణంలో కుంభకర్ణుడు అన్నగారైన రావణుడికి చెబుతాడు. ఉదయంపూట ధర్మము, మధ్యాహ్నం అర్థము, సాయంత్రం కామము అర్థరాత్రికి మోక్షము. ఇలా వీటిని ఆచరించాలి అని. పురుషార్థ సాధన అంటే మోక్షసాధన. జనక మహారాజు అంటున్నాడు. నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని నాకు పురుషార్థాలేమిటి?

కోరికలు, ఐశ్వర్యం. ఇవి పూర్తిగా లౌకికమైనవి. ఇవి నాకెందుకు? బ్రాహ్మణుడనే వాడికి సిరిసంపదలు, భోగభాగ్యాలతో పనిలేదు. అతడికి కావలసింది బ్రహ్మైక్యం. అయితే జనకుడు బ్రాహ్మణుడు కాదు కదా? ఇది అనుమానం. చాలా జాగ్రత్తగా చూడండి. ఎవరు బ్రాహ్మణుడు? **వజ్రసూచికోపనిషత్తు**లో ఈ విషయం చెప్పబడింది. నిరంతరము సత్యాన్వేషణలో కాలం గడిపేవాడు. బ్రహ్మజ్ఞాన సముపార్జన చేసేవాడు బ్రాహ్మణుడు. బ్రాహ్మణత్వం కలిగినవాడు బ్రాహ్మణుడు.

బ్రాహ్మణత్వం అంటే – సత్యం

బ్రాహ్మణత్వం అంటే – నియమం

బ్రాహ్మణత్వం అంటే – నీతి

బ్రాహ్మణత్వం అంటే – ధర్మం

బ్రాహ్మణత్వం అంటే – విజ్ఞానం

బ్రాహ్మణత్వం అంటే – జ్ఞానం

బ్రాహ్మణత్వం అంటే – నిష్ఠ

**బ్రాహ్మణుడుగా జన్మించటం గొప్ప కాదు. బ్రాహ్మణుడుగా జీవించటం గొప్ప. ధార్మిక లక్షణాలున్న వారందరూ బ్రాహ్మణులే. బ్రాహ్మణ్యం కులానికి సంకేత పదం కాదు గుణానికి సంకేతపదం.**

ద్వైతాద్వైతాలు మానవులు ఏర్పాటు చేసుకున్నవి. పరమేశ్వరుడు చరాచర జగత్తంతా వ్యాపించి ఉన్నాడు. అన్నిచోట్లా, అందరిలోను ఉన్నాడు. అందుకే ఆయన నిరాకారుడు అన్నారు. జగత్తు అంతా పరబ్రహ్మ స్వరూపమే. నేనే పరబ్రహ్మను. నాకన్న వేరైనది ఏదీలేదు. అనటం **అద్వైత సిద్ధాంతం** నిరాకారాన్ని ఉపాసించాలంటే మనసు లగ్నం కాదు కాబట్టి, పరమేశ్వరుడికి ఒక రూపం కల్పించారు. అదే శ్రీమహావిష్ణువు, కృష్ణుడు, ఈశ్వరుడు, పరాశక్తి ఇది సాకారం. సాకారోపాసన చేసిన వారు పరమపదం చేరి అక్కడ అపరబ్రహ్మ దగ్గరే ఆయన్ను సేవిస్తూ ఉంటారు. ఇదే శాశ్వతమైన ముక్తి అంటుంది ద్వైతం. మరణానంతరము జీవాత్మ పరమాత్మ రెండూ ఏకం కావటమే సాయుజ్యము లేదా మోక్షము అంటుంది అద్వైతం

ద్వైతాద్వైతాలు రెండూ మనం ఏర్పాటు చేసుకున్నవి. అందుకే అంటున్నాడు జనకుడు. నేను పరబ్రహ్మను నాకు ద్వైతాద్వైతాలతో పనిలేదు" అని

**క్వ భూతం క్వ భవిష్యద్వావర్తమానమపి క్వవా ।**
**క్వ దేశః క్వ చ వా నిత్యం స్వమహిమ్ని స్థితస్య మే ॥ 3**

ఓ గురుదేవా ! స్వరూపస్థితిలో ఉన్న నాకు భూత, భవిష్యద్వర్తమాన కాలాలెక్కడ? దేశము ఎక్కడ? నిత్యానిత్యాలు ఎక్కడ?

నేను సచ్చిదానందరూపుణ్ణి. అసలు కాలము ఎలా ఉంటుందో నాకు తెలియదు. అలాంటప్పుడు భూతభవిష్యద్వర్తమాన కాలాలెక్కడున్నాయి? దేశమెక్కడ? నిత్యమెక్కడ? అంటున్నాడు జనకుడు.

రెండు అనుభవాల మధ్య సమయాన్ని కాలము అంటారు. ఒక సంఘటన జరిగిన తరువాత ఇంకొక సంఘటన జరిగింది. ఈ రెండు సంఘటనల మధ్య సమయాన్ని కాలము అంటారు. కాలాన్ని మూడు రకాలుగా విభజించారు.

1. జరిగిపోయిన కాలము ఇదే భూతకాలము
2. జరుగుతున్న కాలము ఇదే వర్తమానకాలము
3. జరుగబోయే కాలము ఇదే భవిష్యత్‌కాలము

కాలచక్రం గిరగిరా తిరుగుతుంటుంది. నిన్న భవిష్యత్తు అయినది నేడు వర్తమానమవుతుంది. రేపటికి భూతకాలమవుతుంది. ఇక్కడున్నది ఒకే అనుభవం ఒకే సంఘటన. రెండవది లేదు. అలాంటప్పుడు ప్రత్యేకంగా కాలము, అందులో తేడాలు ఎలా ఉంటాయి? ఉండవు. **క్వదేశః** దేశమెక్కడ? దేశము అంటే ఒక ప్రాంతం. చరాచర జగత్తంతా నేనే ఆవరించి ఉన్నాను. అలాంటప్పుడు ఇంకా ఒక ప్రాంతం ఏమిటి? అన్ని ప్రాంతాలు నావే. **క్వచవానిత్యం** నిత్యము అంటే ఎల్లప్పుడూ ఉండేది శాశ్వతమైనది. జగత్తులో ఉన్నది నేనే. నిన్న ఉన్నాను. ఇవాళ్ళ ఉన్నాను. రేపు ఉంటాను. రెండవదేదీ లేదు. అలాంటప్పుడు నిత్యానిత్యాల తేడా ఎందుకు వస్తుంది. అసలు నిత్యం లేదు. అనిత్యం అంతకన్న లేదు. అంటున్నాడు జనకుడు. మనసును లయం చేసిన వాడికి దేశకాలమానాలు, నిత్యానిత్యాలు, ద్వంద్వాలు ఏవీఉండవు.

**క్వ చాత్మా క్వ చ వా నాత్మా క్వ శుభం క్వాశుభం తథా ।**
**క్వ చింతా క్వ చ వాఽచింతా స్వమహిమ్ని స్థితస్య మే ॥ 4**

ఆత్మ ఏది; అనాత్మ ఏది? మంచి చెడు, సుఖము దుఃఖము ఎక్కడున్నాయి. నా మహిమతో నేను మాత్రమే ఉన్నాను.

చరాచర జగత్తంతా వ్యాపించింది ఆత్మ. ఆత్మకు నామరూపాలుండవు. అటువంటి చిద్రూపుడనైన నాకు ఆత్మ అనాత్మ, మంచి చెడులు, శుభాశుభాలు, మొ॥ తేడాలు లేవు. ముందుగా ఆత్మ అంటే ఏమిటో చూద్దాం. జగత్తుకంతటికీ మూలాధారమైంది ఆత్మ. ఒకటిగానే ఉన్నది. రెండవది లేనిది ఆత్మ. ఇంద్రియాలకు చైతన్యాన్నిచ్చేది ఆత్మ. **కేనోపనిషత్తు**లో ఆత్మచైతన్యాన్ని వివరిస్తూ

"ఇంద్రియాలు వేరు ఆత్మ వేరు. ఇంద్రియాలే ఆత్మకాదు. చెవికి శబ్ద గ్రహణశక్తిని మనస్సుకు ఆలోచనా శక్తిని, వాక్కుకు సంభాషణా శక్తిని, కంటికి దృశ్యశక్తిని ప్రసాదించే చైతన్యమూర్తి 'ఆత్మ' కాబట్టి ఇంద్రియాలే ఆత్మ అనే భ్రాంతిని వీడి వాటికి వశ్యుడు కానివాడు అమరుడౌతాడు.

ఇంద్రియాలను ప్రేరేపించేది ఆత్మ. కాబట్టి వాటికి ఆత్మతత్త్వము ఏమిటో తెలియదు. ఆత్మయొక్క శక్తిచేతనే కన్నుచూస్తోంది. చెవివింటోంది. నోరు మాట్లాడుతోంది. మనస్సుఆలోచిస్తుంది. ప్రాణంపనిచేస్తోంది. కాబట్టి వాటికి ఆత్మను గురించి తెలియదు. అటువంటి ఆత్మను ఇంద్రియాల నుండి వేరుచేసి, ఇంద్రియాలకు లోబడకుండా జీవించేవాడు మృత్యువుని జయిస్తాడు. ఇంద్రియాలన్నీ జడాలు. వాటికి చైతన్యం లేదు. కాని చైతన్యం ఉన్నట్టు కనిపిస్తాయి. ఆత్మశక్తి వాటి వెనుక ఉండి నడిపిస్తున్నది. అజ్ఞాని ఇంద్రియాలుచేతనాలు అనుకుంటాడు. జ్ఞాని ఆత్మస్వరూపం తెలుసుకుంటాడు. ఆత్మను గుర్తించటం ఎలా? అంటే....

ఆత్మ ఎక్కడైతే ఉన్నదో అక్కడికి కన్నుగాని, మాటలుగాని పోలేవు. అందుచేత ఇంద్రియాలతో ఆత్మను గుర్తించ వీలుకాదు. ఇంద్రియాలను ప్రేరేపించేదే ఆత్మ కాబట్టి ఇంద్రియాలు తమను నడిపించే ఆత్మను చేరలేవు. ఆత్మ ఇంద్రియాలకే కనిపించనప్పుడు వాటిద్వారా ఆత్మను మనమెలా చూడగలం? ఆత్మ అనేది మనకు తెలిసిన దానికన్నా భిన్నమైనది. తెలియని దానికన్న అతీతమైనది. అంటే అవ్యక్తమైనది. దాన్ని అనుభవం ద్వారా మాత్రమే తెలుసుకోవాలి. ఇది ప్రమాణాలకు, తర్కానికి అందదు. అందుచేత గురువు ద్వారా మాత్రమే ఆత్మను గురించి తెలుసుకోవాలి.

మాటలు దేనిని, ప్రకటించలేవో, దేనివల్ల మాటలు ప్రకాశితమౌతున్నాయో అదియే బ్రహ్మము, ఆత్మ. సామాన్య జనులుపాసించే దేవతాప్రతిమలు బ్రహ్మము కాదు. వాటి రూపంలో ప్రకాశించే మూలతత్త్వమే బ్రహ్మ. కనులు ఆత్మను చూడలేవు. కాని కనులకు చూసేశక్తిని ప్రసాదిస్తున్నదే ఆత్మ. ముక్కు ఆత్మను వాసన చూడలేదు. కానీ ముక్కుకు వాసన చూసే శక్తిని ప్రసాదించేది ఆత్మ. ఈ రకంగా ఇంద్రియాలన్నీ పనిచేసే శక్తిని ఆత్మద్వారానే పొందుతాయి. ఇంద్రియాల కార్యకలాపాలకు సాక్షి. నియంత కూడా ఆత్మే. ఈ రకంగా ఇంద్రియాలకు శక్తిని ప్రసాదించే బ్రహ్మమును గురించి ఇంద్రియాలు తెలుసుకోలేవు.

నాయనా ! పరబ్రహ్మ స్వరూపమును నేను తెలుసుకున్నాను' అని ఎవరైనా అంటే అది వట్టి అబద్ధము. అతని జ్ఞానము అత్యల్పమైనది. మానవులేకాదు, ఈ మాట దేవతలు చెప్పినా అబద్ధమే. **నేను బ్రహ్మమును బాగా తెలుసుకున్నాను అని అన్నవాడికి తెలిసింది చాలా తక్కువ. అతడు తెలుసుకోవలసినది చాలా ఉన్నది"** అన్నాడు.

గురువుగారి మాటలకు శిష్యుడు ఆలోచించి బ్రహ్మను సాక్షాత్కరింపచేసుకుని "గురువర్యా ! నేను బ్రహ్మము గూర్చి తెలుసుకున్నాను" అన్నాడు. దానికి గురువుగారు.

నాయనా ! నీవు తెలుసుకున్నది చాలా తక్కువ బ్రహ్మజ్ఞానం పొందినవాడు బ్రహ్మమే సర్వస్వము అంటాడు. బ్రహ్మము గురించి ఎవరికి తెలియదో అతనికి తెలుసు. ఎవరికి తెలుసో అతనికి తెలియదు. ఎందుచేతనంటే పండితులకు బ్రహ్మము తెలియదు. జ్ఞానులకు తెలుసు. బ్రహ్మము మానసిక భావాలకతీతమైనది. ఎవరైతే బ్రహ్మసాక్షాత్కారం పొందుతారో వారు మాత్రమే దాన్ని గురించి గ్రహిస్తారు. మానసిక వికారం ద్వారా ఆత్మస్ఫూర్తిని గోచరింప చేసుకునేవాడు అమరత్వం పొందుతాడు. అమరత్వం పొందటమంటే ఆత్మయొక్క స్వభావాన్ని పొందటం. అజ్ఞానమనేది సంసార బంధనానికి కారణం మనోవికారాలన్నిటిలోనూ ఆత్మ కలిసి ఉంటుంది. ఆ వికారాలకు స్ఫూర్తినిచ్చేది ఆత్మ. ఆత్మసాక్షాత్కారం పొందినవాడు ప్రతివికారంలోనూ ఆత్మను చూడగలుగుతాడు.

భ్రమచేత కల్పించబడినదంతా అనాత్మ. అజ్ఞానం చేత కల్పించబడినదంతా అనాత్మ. లోకంలో ఉన్నదంతా ఆత్మే అయినప్పుడు ఇంకా ఆత్మ, అనాత్మ అనే తేడా ఎక్కడుంది? మంచి చెడు, కష్టము సుఖము, సంతోషము, దుఃఖము ఇవన్నీ

ఎక్కడున్నాయి? ఇవన్నీ మనసుకు సంబంధించిన విషయాలు. జ్ఞానికి మనస్సు లేదు. మనోలయం చేశాడు. కాబట్టి ఇంకా కష్టసుఖాలు, సంతోషము దుఃఖము అనే ద్వంద్వాలు ఎక్కడున్నాయి? జ్ఞానిదృష్టిలో ఇవేవీ ఉండవు.

**క్వ స్వప్నః క్వ సుషుప్తిర్వా క్వ చ జాగరణం తథా ।**
**క్వ తురీయం భయంవాఽపి స్వమహిమ్ని స్థితస్య మే ॥ 5**

స్వరూప స్థితిలో ఉన్న నాకు జాగ్రదావస్థ ఏది ? స్వప్నావస్థ ఎక్కడ? సుషుప్తి ఎక్కడ? తురీయం ఎక్కడ? భయమంటే ఎలా ఉంటుంది?

అవస్థలు గాని భయము గాని బుద్ధికి సంబంధించిన అంశాలు. అవి ఆత్మధర్మాలు కావు. అందుకనే ఆ అవస్థలు కూడా నాకులేవు. భయాదులు లేవు నేను చిద్రూపుణ్ణి.

అవస్థలు మూడు. అవే జాగ్రస్వప్న సుషుప్తులు. వీటినే 1. జాగ్రదావస్థ 2. స్వప్నావస్థ 3. సుషుప్తి అంటారు. పరమేశ్వర స్వరూపం ఈ అవస్థలు మూడింటికీ సాక్షీభూతము.

**1. జాగ్రదావస్థ :** ఇది జీవుడు మేలుకొని ఉన్న స్థితి. ఈ స్థితిని అనుభవించేది స్థూలదేహము. రక్తము, మాంసము, మలమూత్రాలు, మజ్జ, శుక్లము, నరాలు, ఎముకలు మొదలైన అసహ్యకరమైన పదార్థాలతో నిండి పైన అందంగా చర్మం కప్పబడి ఉంటుంది. అదే స్థూలదేహము. మానవుడు తాను చేసిన కర్మననుభవించటానికే ఈ దేహాన్ని ధరిస్తాడు. సుఖదుఃఖాలు, మానావమానాలు, అనుభవించేది ఈ దేహంతోనే. వర్ణాశ్రమ ధర్మాలు, వివిధ దశలు ఈ దేహానికే వర్తిస్తాయి. జీవుడు భోగాలు అనుభవించటానికి ఈ దేహమే ఆధారము. స్థూలశరీరం ఎప్పుడూ జాగ్రదావస్థలోనే అనుభవం పొందుతుంది. ఈ స్థూలశరీరానికి, జాగ్రదావస్థకు అభిమాని వైశ్వానరుడు. జాగ్రదావస్థే ఇతని సంచార స్థానము. జగత్తంతా బ్రహ్మమయమే. వ్యష్టిగా విశ్వుడు. సమిష్టిగా విరాడ్రూపుడు.

**స్వప్నావస్థ :** నిద్రలో కలలుగనే స్థితి. ఈ స్థితిలో జీవుడు కంఠస్థానంలో ఉంటాడు. జాగ్రదావస్థలో పురుషుని అనుభవాలే స్వప్నావస్థలో సాక్షాత్కరిస్తాయి. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, అంతఃకరణ చతుష్టయముతో కంఠస్థానానికి

వచ్చినప్పుడు జీవుడు కనేది స్వప్నము. జాగ్రదావస్థలో అనుభవించిన విషయాలు జ్ఞాపకానికి రావటమే స్వప్నము. ఈ స్థితిలో మనసు చిత్రవిచిత్రాలైన కల్పనలు చేస్తుంది. రాజులు, రాజ్యాలు, రథాలు, గుర్రాలు, ఏనుగులు, సైనికులు, యుద్ధాలు, జయాపజయాలు. వీటన్నింటినీ ఊహించుకుంటుంది. తానే రాజు అయినట్లు భావిస్తుంది. మహదానందాన్ని అనుభవిస్తుంది. ఒక్కొక్కసారి కష్టాలు కలిగినట్లుగా భావించి దుఃఖిస్తుంది. భయపడుతుంది. ఏడుస్తుంది. ఇలా సుఖదుఃఖాలన్నీ అనుభవిస్తుంది. ఈ అవస్థకు అభిమాని – తైజసుడు, స్వప్నకల్పితుడు, ప్రాతిభాసికుడు అనబడతాడు. జాగ్రస్వప్నాలు రెండు స్థితులందు రాగము, ద్వేషము, కామక్రోధాలు, దర్పము, మాత్సర్యము, అహంకారము, ఈర్ష్య, అసూయ, సుఖము, దుఃఖము కలుగుతాయి.

జాగ్రదావస్థలో అనుభవాలు బీజరూపంలో ఉండి స్వప్నకాలంలో మనకు కనిపిస్తాయి. ఇవన్నీ ఈ జన్మలోని అనుభవాలే కానక్కరలేదు. గతజన్మలవి కూడా కావచ్చు. ఈ దశలో ఇంద్రియాలన్నీ విశ్రాంతి తీసుకుంటూ ఉంటాయి. మనస్సు మేల్కొని ఉంటుంది. మనస్సు ఇంద్రియ ధర్మాలు నిర్వర్తిస్తూ ఉంటుంది. జాగ్రదావస్థలో ఇంద్రియ జ్ఞానం స్థిరంగా ఉంటుంది. స్వప్నావస్థలో స్థిరంగా ఉండదు. మనసే ఇంద్రియాల పనులన్నీ చేస్తుంది. స్వప్నమనేది కేవలము మానసిక సంబంధము. నిద్రలో విషయాలు తెలుస్తాయి. మెలకువ రాగానే అన్నీ మాయమవుతాయి. ఈ రకంగా సూక్ష్మశరీరంతో మానవుడు ఈ అనుభూతులు పొందుతాడు. స్వప్నము సూక్ష్మదేహముయొక్క వ్యవహారము. ఈ స్థితిలో వ్యష్టిదేహాభిమాని తైజసుడు. సమిష్టిగా అతడే హిరణ్యగర్భుడు.

**3. సుషుప్తి :** అంతఃకరణలో చిత్తాహంకారాలను వదలి, మనోబుద్ధులతో జీవుడు హృదయ స్థానానికి వచ్చినప్పుడు, దాన్ని సుషుప్తి అంటారు. ఇంద్రియాలన్నీ అవిద్యలో కలసిపోవటమే సుషుప్తి. ఇంద్రియాలన్నీ వ్యాపార శూన్యమైనప్పుడు నిద్రపోతున్నాడు అంటారు. ఇదే సుషుప్తి. దీని అభిమాని – ప్రాజ్ఞుడు, అవిచ్ఛిన్నుడు, పారమార్థికుడు అనబడతాడు. ఇంద్రియ వ్యాపారము నశించిన స్థితే సుషుప్తి. శివసూత్రాలలో దీన్నే మాయ, అజ్ఞానము అన్నారు. ఇక్కడ బాహ్యవస్తుజ్ఞానము ఏమాత్రము ఉండదు. నేను హాయిగా నిద్ర పోయాను. నాకేం తెలియదు అంటాడు. ఇలా అనటం వల్ల అవిద్యా వృత్తులు మూడు ప్రకటింపబడుతున్నాయి. – 1. అజ్ఞానము 2.

అహంభావము 3. సుఖము. ఈ మూడు అవస్థలు కలిసినదే సుషుప్తి. అదే నిర్వికార స్వరూపస్థితి. దీన్ని "సంప్రసాదావస్థ" అని కూడా అంటారు. మనస్సు బుద్ధి కూడా హృదయంలో లీనమయ్యే స్థితి. ఈ స్థితిలో ఇంద్రియాలు, బుద్ధి ముఖ్య ప్రాణంలో కలిసిపోతాయి. ఈ రకంగా మనసు, బుద్ధి కూడా లయమయినప్పటికీ, మెలకువ రాగానే తాను సుఖంగా నిద్రించాను అని తెలుస్తోంది. అంటే జ్ఞానము మాత్రమున్నది. ఈ స్థితిలో జీవుడు వ్యష్టిగా ప్రాజ్ఞుడు సమిష్టిగా ఈశ్వరుడు. నిద్రించినప్పుడు ఏ రకమైన కోరికలు, కలలు కూడా లేని స్థితి. ప్రాజ్ఞుడు, సుషుప్తిలో సంచారం చేస్తాడు. ఇక్కడ అతని అనుభవాలన్నీ ఏకమై పోతాయి. చేతనాశక్తి లేదా గ్రహణశక్తి అస్పష్టంగా నిలచిపోతోంది. అతను అసలు చేతనుడా కాదా ? అనే అనుమానం కూడా వస్తుంది.

సుషుప్తిలో ప్రాజ్ఞుడికి బ్రహ్మభావన కలుగుతుంది. ఛాందోగ్యోపనిషత్తులో ఉద్ధాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు సుషుప్తిని గురించి వివరిస్తూ "కుమారా! గాఢనిద్రలో ఉన్నప్పుడు ఇతడు సుషుప్తిలో ఉన్నాడు అంటారు. ఆ స్థితిలో జీవుడు పరమసత్తను పొందుతాడు. అంటే తన నిజస్వరూపాన్ని పొందుతాడు. తన ఆత్మను తాను పొందుతాడు. కాబట్టి అతన్ని గురించి చెప్పేటప్పుడు నిద్రిస్తున్నాడు అంటారు.

సుషుప్తిలో ద్వైతం ఉండదు. అది అద్వైత స్వరూపం. సుషుప్తి కాలంలో సుషుప్తిని గుర్తించే ఇంద్రియాలేవీ ఉండవు. అవన్నీ తమకు కారణమైన అజ్ఞానంలో లీనమై పోతాయి. ఇతరమైన దృష్టాంతాలు ఏమీ ఉండవు. ఇలా జ్ఞానసాధనాలేవీ లేనప్పుడు కూడా ప్రకాశితమవుతున్నది కాబట్టే సుషుప్తి స్వయంప్రకాశంకలది అంటున్నాం. సుషుప్తిలో సుఖానికి విరోధియైన దుఃఖం ఉండటం లేదు. కాబట్టి మిగిలేది సుఖమే. దుఃఖము లేక అంధత్వము లేనివాడవుతున్నాడు. అంటే దేహాభిమానం కారణంగా కలిగిన అంధత్వం లాంటి దోషాలేవీ సుషుప్తిలో ఉండవు. సుషుప్తిలో గాయం తగిలినవాడు బాధను అనుభవించటం లేదు. రోగిష్టి వాడు కూడా రోగం లేనివాడు గానే ఉంటున్నాడు. ఈ రకంగా సుషుప్తిలో దుఃఖం ఉండదు అని తెలుస్తోంది. సుఖదుఃఖాలు అనుభవ ప్రమాణంచేత తెలియబడతాయి. సుషుప్తిలో కలిగే సుఖం శయ్య మొ॥ సాధనాల వల్ల వచ్చింది కాదు. నిద్రపట్టకముందు వచ్చేది విషయ జన్యమవుతుంది. కాని నిద్రపట్టిన తరువాత వచ్చే సుఖం అలాంటిది కాదు. జగద్వ్యాపారాలతో అలసిపోయిన ఆత్మ మృదువైన పాన్పుమీద విశ్రమించినప్పుడు,

అలసట, దుఃఖాలను పారద్రోలి స్వస్థచిత్తంతో శయ్యాది సుఖాల వల్ల వచ్చే సుఖం అనుభవిస్తోంది. అంతర్ముఖమైన బుద్ధివృత్తిలో తన ఆనందమే ప్రతిబింబమవుతుంది. అంటే – ఆ విధంగా అంతర్ముఖమైన బుద్ధి వృత్తిలో అద్దంలో ముఖంలాగా స్వస్వరూపభూతమైన ఆనందం ప్రతిబింబిస్తుంది. ఇదే విషయానందము. సుషుప్తిలో సమస్త ప్రపంచము ప్రకృతిలో లీనమైపోతుంది. అప్పుడు జీవుడు తమస్సుచే ఆచరించబడినవాడై సుఖాన్నిపొందుతాడు అని చెబుతోంది అధర్వ వేదంలోని **కైవల్యోపనిషత్తు.** కాబట్టి సుషుప్తిలో సుఖము, అజ్ఞానము రెండూ ఉంటాయి.

నేను ఉన్నది ఒక్కడినే. నేనే బ్రహ్మమును. నాకు జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి, తురీయము అనే అవస్థలు ఏవీలేవు. భయాదులు లేవు. అంటున్నాడు. జనక మహారాజు

**క్వ దూరం క్వ సమీపం వా బాహ్యం క్వాభ్యంతరం క్వ వా ।**

**క్వ స్థూలం క్వ చ వా సూక్ష్మం స్వమహిమ్ని స్థితస్య మే ॥ 6**

నా మహిమలో స్థితుడనైన నాకు దగ్గరేది? దూరం ఏది? ఏది స్థూలం? ఏది సూక్ష్మం ?

గురుదేవా! నేను సర్వపరిపూర్ణుడును. మనసుచేత కల్పించబడిన ధర్మాలు దూరము దగ్గర, స్థూలము సూక్ష్మము అనేవి ఏవీ నాకు లేవు అంటున్నాడు జనక మహారాజు.

స్థూలసూక్ష్మాలు, లాభనష్టాలు ఇవన్నీ మనసుతో కల్పించబడినవి. మనోధర్మాలు, శుక్లయజుర్వేదానికి సంబంధించినది **ఈశావాస్యోపనిషత్తు.** ఇందులో 5వ మంత్రంలో చెబుతున్నారు.

**తదేజతి తన్నైజతి తద్దూరే తద్వంతికే**

**తదంతరస్య సర్వస్య తదుసర్వస్యాస్య బాహ్యతః**

ఆత్మకు చలనమున్నది చలనం లేదు. నిజమైన స్థితిలో ఆత్మ చరించదు. ఆత్మ నిశ్చలమైనప్పటికీ మనసుకు ఆధారం కావటంచేత చరించినట్లుగా కనుపిస్తుంది. ఆత్మ దూరంగా ఉన్నది. దగ్గరగాఉన్నది. అంటే ఆత్మ సర్వత్రా వ్యాపించి ఉన్నది. తెలియని వారికి చాలా దూరంగా ఉన్నది. తెలిసిన వారికి అత్యంత దగ్గరగా ఉన్నది.

అజ్ఞానులకు దూరంగా ఉన్నది. జ్ఞానులకు దగ్గరగా ఉన్నది. అజ్ఞానులు దాన్ని చేరుకోలేరు.

ద్వంద్వాలతో కూడిన ఈ జగత్తు బాహ్యంగా అంటే మనసుతో చూసినప్పుడు మాత్రమే ఈ తేడాలు కనుపిస్తాయి. అజ్ఞానులు, సత్యదర్శం చేయని వారికి మాత్రమే ద్వంద్వాలు కనుపిస్తాయి. జనక మహారాజు సత్యదర్శనం చేశాడు. ఆత్మసాక్షాత్కారం చేసుకున్నాడు. తానే పరబ్రహ్మ అని తెలుసుకున్నాడు. అందుకే అంటున్నాడు. ఓ గురుదేవా! ఆత్మారాముడనైన నాకు దూరము దగ్గర, స్థూలము, సూక్ష్మము వంటి ధర్మాలు ద్వంద్వాలు ఎలా ఉంటాయి అని

**క్వ మృత్యుర్జీవితం వా క్వ లోకాః క్వాస్య స్వ లౌకికమ్ ।**
**క్వ లయః క్వ సమాధిర్వా స్వమహిమ్ని స్థితస్య మే ॥ 7**

నా మహిమలో స్థితుడనైన నాకు మరణమెక్కడ? జీవితమెక్కడ? ప్రపంచ మెక్కడ? ప్రాపంచిక సంబంధాలు ఎక్కడ? ఏది ధ్యానం ? ఏది సమాధి? అని అడుగుతున్నాడు.

ఆత్మారాముడనై నాఆత్మలో నేను రమిస్తున్న నాకు జనన మరణాలు లేవు. లోకాలు లేవు లౌకిక కార్యాలు లేవు. ధ్యానము సమాధి కూడా లేవు.

సత్యము నిత్యము శాశ్వతమైన వాడు పరబ్రహ్మ. **ఐతరేయోపనిషత్తు**లో చెప్పినట్లుగా మానవదేహాన్ని సృష్టించిన తరువాత బ్రహ్మరంధ్రం గుండా ఆత్మ ఈ దేహంలో ప్రవేశించి నవరంధ్రాలతో లౌకిక సుఖాలనుభవిస్తూ అజ్ఞానంతో నేను అంటే దేహము. దేహంతో చేసే కర్మలన్నింటికీ కర్త భోక్త నేనే అనుకుంటోంది. దేహంలో ఉన్నది జీవాత్మ. బయట ఉన్నది పరమాత్మ. రెండూ వేరు కాదు. అజ్ఞానంతో జీవాత్మ వేరు, పరమాత్మ వేరు అనుకుంటున్నాడు జీవుడు. అజ్ఞానం తొలగిపోతే, జ్ఞానసముపార్జన జరిగితే జీవాత్మ పరమాత్మలు రెండూ వేరు కాదు ఒకటే అని తెలుస్తుంది.

పొడుగుపొట్టి, లావు సన్నము, జనన మరణాలు, కష్టసుఖాలు మొ॥వి ఉండవు. ఆత్మకు చావులేదు. నిత్యము సత్యము శాశ్వతమైనది ఆత్మ. దేహం మరణిస్తుంది. జీర్ణమైన వస్త్రాన్ని వదిలి మానవుడు కొత్త వస్త్రాన్ని ఎలా ధరిస్తాడో అలాగే ఆత్మ

జీర్ణమైన దేహాన్ని వదిలి క్రొత్త దేహంలో ప్రవేశిస్తుంది. జీర్ణమైన దేహాన్ని వదలటమే మరణము. క్రొత్త దేహంలో ప్రవేశించటం జననము. ఈ జనన మరణాలు దేహానికే గాని ఆత్మకు లేవు.

**బ్రహ్మసత్యం జగన్మిథ్య.** జగత్తులో బ్రహ్మము ఒక్కటే సత్యము. ఈ జగత్తు అంతా భ్రాంతి, మాయ. అసలు జగత్తే లేదు. ఇదంతా రజ్జు సర్పభ్రాంతి అని గతంలో చెప్పుకున్నాం. జగత్తే లేనప్పుడు జగత్తుకు సంబంధించిన వ్యవహారాలు మాత్రం ఎలా ఉంటాయి?

**ధ్యానము :** ఏ ప్రదేశంలో చిత్తాన్ని లగ్నం చేశామో, దానియందే జ్ఞానివృత్తి అఖండ ధారావాహిక రూపంలో సాగినప్పుడు దాన్ని ధ్యానమంటారు అంటాడు పతంజలి మహర్షి. ధ్యానము అనేది ధారణవల్ల తేలికగా సిద్ధిస్తుంది. ఇతర విషయాల మీదకు పోకుండాఉన్న జ్ఞానవృత్తి మన ధ్యేయం వైపుకు తైలధారగా సాగుతుంది. ధ్యేయంమీద చిత్తాన్నిలగ్నంచెయ్యటమే ధారణ. చిత్తాన్ని ధ్యేయం వైపుకు సాగనీయటం ధ్యానం. ధ్యానం చేసేటప్పుడు ఏకాగ్రమైన చిత్తం ధ్యేయవస్తువు మీదనే లగ్నమయి ఉండాలి. అంటే మధ్యలో ఇతర విషయాలను గురించిన ఆలోచనలు రాకూడదు.

శంకరులు ఈ ధ్యానాన్ని వివరిస్తూ "అహంబ్రహ్మాస్మి" నేనే పరబ్రహ్మను అనే సద్వృత్తితో, పరమానందాన్ని కలిగించే నిరాలంబస్థితి. దేనిమీద ఆధారపడకుండా ఉండే స్థితిని ధ్యానము" అన్నారు. అయితే ధ్యానానికి ప్రధానమైన లక్షణాలు రెండు.

1. నేనే బ్రహ్మననే భావన 2. నిరాలంబ స్థితి

ఏదైనా ఒక విషయం లేదా వస్తువుమీద మనసును నిలిపిఉంచవచ్చు. అది ధ్యానం కాదు. పరబ్రహ్మని లక్ష్యంగా చేసుకుని, ఆయనమీదనే మనసునిలపాలి. శరీరంలోని కన్ను, కాలువంటి బాహ్యేంద్రియాలు వాటి ఇష్టప్రకారము చలించకూడదు. వాటిని కట్టడి చెయ్యాలి. శరీరం కదలకుండా నిశ్చలంగా ఉండాలి. మనస్సులో అనేక రకాలైన ఆలోచనలు వస్తాయి. వాటిని పూర్తిగా వదిలెయ్యాలి. పరబ్రహ్మతో ఏకీభావం పొందాలి. అంటే మనస్సును పూర్తిగా పరబ్రహ్మమీదనే లగ్నంచెయ్యాలి. అప్పుడు మాత్రమే సాధకుడు తనలక్ష్యాన్ని నెరవేర్చగలుగుతాడు. ధ్యానంలో ఉన్నప్పుడు ఇతరవిషయాలచింతన ఏ మాత్రం పనికిరాదు. అనాత్మ వస్తువుల్ని గురించి చింతన వదిలెయ్యాలి. విజ్ఞానమయకోశంలో ఉండేఆత్మ సర్వదా

స్వయంగా ప్రకాశిస్తుంది. అనాత్మకన్న విలక్షణంగా ఉన్న ఈఆత్మనే ధ్యానంలో లక్ష్యంగా తీసుకోవాలి. అప్పుడు మిగిలిన ఆలోచనలను పూర్తిగా త్యజించి, పరమేశ్వర స్వరూపాన్ని మాత్రమే ధ్యానించాలి. ఇక్కడ చాలాముఖ్యమైనవిషయం ఏమంటే, ధ్యానంలో మిగిలిన విషయాలేవీ మధ్యలోకి రాకూడదు. అహం మొదలైన వాటిని పూర్తిగా వదిలేసి, ధ్యేయ వస్తువునందు మాత్రమే దృష్టినిలపాలి. అప్పుడే సాధకుడు చేసేధ్యానం ఫలిస్తుంది.

**సమాధి :** ధ్యానంలో ఉన్నప్పుడు కేవలము ధ్యేయాన్ని మాత్రమే చూస్తూ, నేను ధ్యానం చేస్తున్నాననే భావన కూడా మరిచిపోవాలి. ఆ స్థితిలో చిత్తం తన స్వరూపస్థితి పొందుతుంది. దాన్నే 'సమాధి' అంటారు. ధ్యానానికి అంతిమఘట్టం సమాధి. యోగానికి పరమావస్థ ఈ సమాధి. సమాధి స్థితిచేరటమనేది అంత తేలిక కాదు. గతజన్మల పుణ్యం, గురుకృప. వీటివల్లనే సమాధి స్థితి లభిస్తుంది. "మనసును దేహం నుంచి వేరు చేసి, పరమాత్మతో అనుసంధానం చేయటమే సమాధి"

దశేంద్రియాలను వదిలేసి, ఏ రకమైన బంధము లేనట్టి స్థితే సమాధి.

సమాధి రెండు రకాలుగా ఉంటుంది. 1. సవికల్పసమాధి 2. నిర్వికల్పసమాధి. సవికల్పసమాధిలో, ఆ స్థితికి చేరిన తరువాత కూడా మనసులో సంకల్ప వికల్పాలు కలుగుతాయి. అంటే ఇతర విషయాలు కూడా తెలుస్తాయన్నమాట. నిర్వికల్ప సమాధిలో మనసు కూడా పని చెయ్యదు. 'సుమన' అంటే మనసు పనిచేసే స్థితి. ఉన్మన అంటే మనసుకూడా పనిచెయ్యని స్థితి. సమాధిస్థితికి కావలసినది ఇదే.

ధారణ, ఈ ధ్యానము, సమాధి కూడా జగత్తు ఉన్నది అనుకునే వాడికి మాత్రమే. పరబ్రహ్మ సాక్షాత్కారం పొందని వాడికి మాత్రమే కావాలి. కాని జనక మహారాజు ఆత్మసాక్షాత్కారము పొందాడు. అతనికి ఇవేవీ అవసరం లేదు. అతడి దృష్టిలో ఇవి లేవు. అందుకే ధ్యానమెక్కడ? సమాధి ఎక్కడ? అంటున్నాడు.

**అలం త్రివర్గకథయా యోగస్య కథయాఽప్యలమ్ ।**

**అలం విజ్ఞానకథయా విశ్రాంతస్య మమాత్మని ॥ 8**

ఆత్మారాముడనైన నాకు జీవన ధ్యేయాల గురించిన ఉపన్యాసాలు అనవసరం. జ్ఞానోపదేశం కూడా అవసరం లేదు.

ఓ గురుదేవా! నేను గతంలో ధర్మవిచారణ చేశాను. యోగాభ్యాసం చేశాను జ్ఞాన విచారణ చేసి చివరకు ఆత్మారాముడనైనాను. ఇప్పుడు మళ్ళీ వాటితో పనిలేదు. సచ్చిదానంద సిద్ధి కలిగేదాకా ఇవన్నీ దానికి సాధనాలు. సిద్ధి కలిగిన తరువాత ఇంక వాటితో పనిలేదు. ఏరుదాటిన తరువాత ఇంక తెప్పతో అవసరం లేదు. అలాగే ప్పుడు నాకు వాటితో అవసరం లేదు. అంటున్నాడు జనక మహారాజు.

ఆత్మసాక్షాత్కారం జరిగేదాకా గురువుకు సేవ చెయ్యాలి. గురూపదేశాలు వినాలి. శాస్త్రాలు చదవాలి. సహాధ్యాయులతో, తెలిసిన వారితో చర్చలు జరపాలి. యోగము, ధ్యానము, సమాధి ఇవన్నీ కావాలి. నిరంతరం వీటిని చెయ్యాలి. ఆత్మసాక్షాత్కారమైన తరువాత, నేనే పరబ్రహ్మాని అని తెలిసిన తరువాత, ఇంక వీటితో పనిలేదు. చరాచర జగత్తంతా పరబ్రహ్మమే. గురువు లేడు శిష్యుడు లేడు. యోగము లేదు యాగము లేదు. మంత్రం, యంత్రం, తంత్రం ఏమీ లేవు. ఉన్నదల్లా ఒక్కటే అదే పరబ్రహ్మము. అదే నేను. అందుకే జనక మహారాజు అంటున్నాడు 'గురుదేవా! నేను ఆత్మారాముణ్ణి నాకు ఉపదేశాలు, ఉపన్యాసాలు, ఎందుకు. వీటితో పనిలేదు అని.

# అధ్యాయం-20

## పరమార్థ స్థితి (జీవన్ముక్తి)

ఇది అష్టావక్ర గీతలో చివరి అధ్యాయం ఇందులో ఫలశ్రుతి చెబుతున్నారు. జీవితం యొక్క పరమార్థం లేదా పురుషార్థం మోక్షసాధన. ఇప్పుడు ఇక్కడ ఆ మోక్షాన్ని గురించి చెబుతున్నారు.

ముక్తికీ మోక్షానికి చాలా తేడా ఉంది. ముక్తి పొందటము అంటే పరమపదము చేరటం. ఇది సాకార బ్రహ్మోపాసనలో జరుగుతుంది. మోక్షము అంటే జీవాత్మ పరమాత్మలు ఒకటై పోవటం. మోక్షం పొందటాన్నే సాయుజ్యము అనికూడా అంటారు. వీరికి పునర్జన్మ లేదు. పరమపదము చేరిన వారిలో కూడా జ్ఞానసంపన్ను లకు మాత్రమే పునర్జన్మ లేదు.

జీవించి ఉండగానే ముక్తి పొందటం జీవన్ముక్తి. అటువంటివాడు ఆయుష్షు ఉన్నంతవరకు జీవించి ఆ తరువాత ఈ దేహాన్ని విడిచి పరబ్రహ్మలో ఐక్యము పొందుతాడు. ఈరకంగా దేహాన్ని విడిచి పరమాత్మలో లీనం కావటాన్నే విదేహముక్తి అంటారు. జీవన్ముక్తిని **మహోపనిషత్తు**లో వివరించటం జరిగింది.

ఆత్మఅనేది అణువుకన్న చిన్నది, ఆకాశంకన్న పెద్దది. ఈ చిద్వస్తువునందు అనంతకోటి బ్రహ్మాండ రేణువులు ఉత్పత్తి స్థితిలయము పొందుతుంటాయి. బయటకు శూన్యంగా కనిపిస్తుంది కాబట్టి పరబ్రహ్మ ఆకాశము అని చెప్పబడుతున్నది. చిత్ స్వరూపముగా ఉన్నది కాబట్టి బ్రహ్మము ఆకాశముకన్న విలక్షణమైనది. అయితే బ్రహ్మము ఆకాశంకాదు. ఆకాశములేనిది. అదియే సత్తు చిత్తు. ఆత్మవస్తువు స్వయంప్రకాశ స్వరూపము. విజ్ఞాన ఘనమైన శిలాసదృశమైనది. ఆకాశంలాగా స్వస్వరూపంలో తదధిష్ఠానముగా అనుభూతమై ఉన్నది. చిత్రవిచిత్రముగా ఉన్న ఈ జగత్తుయొక్క వికాసాన్ని భేదిస్తున్నది. ఈ విశ్వము తత్పద లక్షణముగా ఉన్న పరమాత్మయొక్క ప్రకాశమాత్రము. అందువల్ల ఈ విశ్వము ఆత్మకన్న ప్రత్యేకమగు సత్తుగలది. ఈ జగత్తు యొక్క భేదభావముకూడా ఆత్మయందే ప్రకాశిస్తుంది. ఈ భేదమంతా ఆత్మమయమైనది. అధిష్ఠానరూపంలో ఈ ఆత్మ అన్నింటితోనూ

సంబంధం కలిగి ఉన్నది. జాతి గుణ క్రియాదులు ఆత్మకు లేవు. ఆత్మ త్రికాలభాధ్యమై సత్యమై ఉన్నది. అదే విజ్ఞానానందస్వరూపమగు పరబ్రహ్మ. త్యాగమూర్తులకు అది పరమగతి. సర్వసంకల్పాలను వదలివేసి శుద్ధమనస్సుతో ఆ ఆత్మను గ్రహించాలి. జాగ్రదావస్థలో ఉన్నప్పుడు ఎవరికి దృశ్యజ్ఞానము నశిస్తుందో, అతనియొక్క స్థితినే 'జ్ఞానము' అంటారు. వృత్తి జ్ఞానము లేకపోవుటయే జ్ఞానము. ఈ విషయాలను తెలుసుకున్నవాడు జీవన్ముక్తుడు. దృశ్యములేదు అనే ఆత్మజ్ఞానంతో, మనసులో ఉన్న దృశ్యభావాలను తుడిచి వేసినట్లైతే తక్షణమే మహోన్నతమైన నిర్వాణసుఖము ఉత్పన్నమవుతుంది. వాసనలను అంటే రాగద్వేషాలను సంపూర్ణంగా త్యజించటమే మోక్షము. ఎవరైతే పరిశుద్ధవాసనలతో నిండి ఉన్నారో, వారు తిరిగి జనన మరణాలు పొందరు. వాళ్ళు యదార్థాన్ని తెలుసుకోగలుగుతారు. వారే జీవన్ముక్తులు. దృఢమైన విషయ చింతనయే బంధము. వాసనాక్షయమే మోక్షము. దేహ, లోక, శాస్త్రవాసనలే సర్వవాసనలు.

తపస్సు మొదలైన సాధనలు చేయకుండానే సహజముగా ఎవరికి భోగాలు ఇష్టం ఉండవో, వారు జీవన్ముక్తులు. కాలానుగుణంగా సుఖదుఃఖాలు అనుభవిస్తున్నప్పటికీ, సంతోషము, విషాదము పొందనివాడు జీవన్ముక్తుడు. హర్షము (సంతోషము) అమర్షము (ఓర్వలేనితనము), భయము, క్రోధము, కామము, కార్పణ్యము వంటివి లేనివాడు జీవన్ముక్తుడు. అహంకారాన్ని వదిలి, దృశ్యమునుకూడా త్యాగం చేసినవాడు జీవన్ముక్తుడు. అంతర్ముఖుడై ఇష్టాయిష్టములు లేకుండా ఉండేవాడు, సుషుప్తావస్తలో ఉన్నవాడులాగా సంచరించేవాడు. జీవన్ముక్తుడు. ఎప్పుడూ ఆత్మానందం పొందేవాడు, మనసును పవిత్రంగా ఉంచుకునేవాడు, జీవన్ముక్తుడు. ఏ కోరికలు లేకుండా ఉండేవాడు జీవన్ముక్తుడు.

ఆకాశంలాగా ఎవరి హృదయము దృశ్యవిషయముల యందు సంగమము కాకుండా ఉంటుందో, ఎవరిబుద్ధి జడముకాదో, ఎవడు చైతన్యవంతుడో వాడు జీవన్ముక్తుడు. రాగద్వేషాలను, సుఖదుఃఖాలను, లక్ష్యం చెయ్యకుండా, కోరికలు లేకుండా, నిష్కామ్యభావనతో సత్కర్మలు చేసేవాడు జీవన్ముక్తుడు. మౌనమే దీక్షగా గలవాడు, అహంభావం లేనివాడు, సంకల్పాలు, ఉద్వేగాలు లేకుండా కర్తవ్య కర్మలు

చేసేవాడు జీవన్ముక్తుడు. సర్వత్ర విగతస్నేహితుడై సాక్షీభావముతో ఉండేవాడు, ఇచ్ఛారహితుడై సత్కర్మలు చేసేవాడు జీవన్ముక్తుడు. మనసునందు ధర్మాధర్మాలను, సమస్త సంకల్పాలను, ఇష్టాఇష్టాలను అన్నింటినీ వదలివేసివాడు జీవన్ముక్తుడు. కంటికి కనిపిస్తున్న ఈ దృశ్య ప్రపంచాన్ని సమ్యక్‌దృష్టితో పరిత్యజించినవాడు జీవన్ముక్తుడు. కారము, పులుపు, ఉప్పు, చేదు, రుచి, అరుచి వీటన్నింటినీ సమభావంతో భుజించేవాడు జీవన్ముక్తుడు. వార్ధక్యము, మరణము, ఆపద, రాజ్యము, దరిద్రము వీటన్నింటినీ సమభావంతో అనుభవించేవాడు జీవన్ముక్తుడు.

ధర్మాధర్మాలు, సుఖదుఃఖాలు, జరామరణాలు, సంపూర్ణంగా, బుద్ధిపూర్వకంగా త్యాగం చేసినవాడు జీవన్ముక్తుడు. ఉద్వేగము, ఆనందము లేకుండా స్వచ్ఛమైన సమత్వ బుద్ధి గలిగి, పొంగిపోవటము, క్రుంగిపోవటము, లేకుండా ఉన్నవాడు జీవన్ముక్తుడు. సర్వేచ్ఛలను, సంశయాలను, ప్రయత్నాలను, నిశ్చయాలను జ్ఞానబుద్ధితో పరిత్యజించినవాడు జీవన్ముక్తుడు. సృష్టి స్థితిలయాలయందు ఉదయాస్తమయాదు లందు, భావాభావములందు, సమభావంతో ఉండేవాడు జీవన్ముక్తుడు. కొంచెము కూడా ద్వేషించకుండా, కాంక్షించకుండా, రాగద్వేషాలులేనివాడు, ప్రారబ్ధకర్మలు అనుభవించనివాడు జీవన్ముక్తుడు. సంసార సంకులములో శాంతుడై ఉండేవాడు, కళాయుక్తుడైకూడా నిష్కళుడై ఉండేవాడు, మనసు ఉండికూడా అమనస్కుడైఉండేవాడు జీవన్ముక్తుడు. సమస్త సంపదలయందు, సమస్త వ్యవహారములయందు ఉండికూడా వాటి స్పృహలేనివాడు జీవన్ముక్తుడు.

జీవన్ముక్తుడు తనశరీరం పడిపోయిన సమయంలో, శ్వాస ఆగిపోయిన వెంటనే జీవన్ముక్త పదవిని దాటి విదేహముక్త పదవిని చేరతాడు. విదేహముక్తుడికి జనన మరణాలుండవు. అతడు నిర్వికారుడు, సత్తుకాడు అసత్తుకాడు. దూరముకాడు, దగ్గరాకాడు. అహముకాదు, తదితరము కాదు.

జీవన్ముక్తుని పరిస్థితి ఎలా ఉంటుందంటే, అత్యంత నిశ్చలము, మహాగంభీరము. అది ప్రకాశముకాదు, చీకటికాదు. మహావ్యాపకమై సర్వత్ర నిండి ఉంటుంది. అనాఖ్యముగా, అనభివ్యక్తముగా, అతీతముగా ఉంటుంది. అది శూన్యము కాదు. సాకారము కాదు. దృశ్యము కాదు, దర్శనము కాదు. భూతపదార్ధ సముదాయము కాదు. కేవలసత్తా మాత్రము. అనంతరూపంలో కలిసి ఉంటుంది.

ఇదమిద్ధమని చెప్పటానికి వీలుండదు. పరిపూర్ణముకన్న అధిక పరిపూర్ణముగా ఉంటుంది. సత్తు కాదు అసత్తుకాదు సదసత్తు కాదు. భావనకాదు భావముకాదు. కేవల చిత్ పదార్థము. మహాచైతన్యము. అనంతమై, అజరమై, శివమై, ఆది మధ్యాంత రహితమై, నిరామయై ఉన్నది. అది అనాదిగా ఉన్న సత్వపదార్థము. ద్రష్ట, దర్శనము, దృశ్యము అనే త్రిపుటి మధ్యభాగంలో కేవల దర్శనము ఏదైతే ఉన్నదో అది. దీనికన్న గొప్పది ఉత్తమమైనది ఏదీలేదు.

ముక్తి పొందిన పురుషుడు బ్రహ్మానందంలో తేలియాడుతుంటాడు. దీన్ని గురించి గతంలో చెప్పుకున్నాం. కాని ఆధ్యాత్మిక విషయాలు గుర్తుండవు కాబట్టి మళ్ళీ ఒకసారి చూద్దాం. **తైత్తిరీయోపనిషత్తు** మూడవ అధ్యాయం ఆనందవల్లిలో బ్రహ్మానందాన్ని వివరించారు. ఈ లోకంలో మంచి ఆరోగ్యవంతుడు, విద్యావంతుడు, ధనవంతుడు, సదాచార సంపన్నుడు, గుణవంతుడు అనుభవించాలనే కోరిక గలవాడు యవ్వనవంతుడు.

| | |
|---|---|
| అనుభవించే ఆనందాన్ని | – మానుషానందము అంటారు |
| మానుషానందానికి నూరు రెట్లు | – మానవ గంధర్వానందం |
| మానవ గంధర్వానందానికి నూరు రెట్లు | – నిజగంధర్వానందం |
| నిజగంధర్వానందానికి నూరు రెట్లు | – చిరలోక పితరానందం |
| చిరలోక పితరానందానికి నూరు రెట్లు | – అజానజదేవానందం |
| అజానజదేవానందానికి నూరు రెట్లు | – కర్మదేవానందం |
| కర్మదేవానందానికి నూరు రెట్లు | – నిజదేవానందం |
| నిజదేవానందానికి నూరు రెట్లు | – ఇంద్రనందం |
| ఇంద్రానందానికి నూరు రెట్లు | – బృహస్పతి ఆనందం |
| బృహస్పతి ఆనందానికి నూరు రెట్లు | – ప్రజాపతి ఆనందం |
| ప్రజాపతి ఆనందానికి నూరు రెట్లు | – బ్రహ్మానందం |

ఇది అనిర్వచనీయము అనుభవైక వేద్యము. ఈ లోకంలో ఈ ఆనందాన్ని సర్వసంఘ పరిత్యాగి అయిన మహాజ్ఞాని కూడా పొందుతాడు. అతడే జీవన్ముక్తుడు. ఆత్మసాక్షాత్కారము పొందినవాడు. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే.

అదే నేను. నాకన్న వేరుగా ఏదీలేదు అని నిశ్చయంగా తెలిసినవాడు మాత్రమే ఈ లోకంలో ఈ బ్రహ్మానందాన్ని పొందుతాడు. ఇప్పుడు జనకమహారాజు కూడా అదే స్థితిలో ఉన్నాడు.

మరణానంతరము ముక్తపురుషుడు మాత్రమే బ్రహ్మానందాన్ని పొందుతాడు. ముక్తపురుషుడు అంటే సాకారోపాసన చేసి, అంటే విష్ణువు, శివుడు, పరాశక్తి వీరే పరబ్రహ్మ అని ఉపాసన చేసి బ్రహ్మలోకం చేరినవారు (దీన్నే పరమపదము అంటారు) పొందుతారు. వీరు అపరబ్రహ్మ కన్న వేరే శరీరం కలిగి, అపరబ్రహ్మను సేవిస్తూ బ్రహ్మానందానుభూతిని పొందుతారు. మోక్షము పొందిన వారికి ఈ రకమైన ఆనందముండదు. మరణానంతరము వీరి జీవాత్మ పరమాత్మలు ఒకటై పోతాయి. ఇదే సాయుజ్యము. వీరంతా నిరాకారోపాసన చేసిన వారు.

అందుకే ఈ అధ్యాయంలో జనక మహారాజు ఓ గురుదేవా ! నేను నిరంజనుడను నాలో పంచభూతాలెక్కడ? దేహం ఎక్కడ? ఇంద్రియాలెక్కడ? మనస్సెక్కడ? శాస్త్రాలెక్కడ? ఆత్మజ్ఞానమెక్కడ? తృప్తి ఏది? కోరిక ఏది ? జ్ఞానమెక్కడ? అజ్ఞానమెక్కడ? బంధం ఏది? మోక్షం ఏది ? ముక్తి ఎక్కడ? కర్త ఎవరు? భోక్త ఎవరు? ఆలోచనలు రావటమేమిటి? వాటిని ఆపటం ఏమిటి? సాధకుడెవరు? సాధ్యమేది? సృష్టి ఎక్కడ? సంహారమెక్కడ? చలనమెక్కడ? ఏకాగ్రత ఎక్కడ? జ్ఞానమేది? మూఢత్వమేది? సుఖదుఃఖాలెక్కడ? కర్మలెక్కడ? వాటి ఫలితమెక్కడ? కర్మరహితమైన కేవల స్థితి ఏది? మాయ ఎక్కడ? సంసారమెక్కడ? రాగద్వేషాలెక్కడ? జీవుడెవరు? దేవుడెవరు? ప్రవృత్తి ఎక్కడ? నివృత్తి ఎక్కడ? గురువెవరు శిష్యుడెవరు? పురుషార్థమేది? ఏకంగా మంగళస్వరూపుడిగా నేనే ఉన్నాను. నాలో ఏవీ లేవు. నేను తప్ప జగత్తులో ఏదీలేదు అంటున్నాడు.

ఈ అధ్యాయంలో మొత్తం 14 శ్లోకాలున్నాయి. వీటిలో జీవిత పరమార్థమైన ఆత్మసాక్షాత్కారము, జీవన్ముక్తి వివరిస్తున్నాడు. **'నేను జీవన్ముక్తుడను'** అనిచెబుతున్నాడు జనక మహారాజు. ప్రతి శ్లోకంలోను నేను పరబ్రహ్మను అని చెబుతున్నాడు.

**మొదటి శ్లోకం** – **మత్స్వరూపేనిరంజనే** నేను నిరంజనుడను

**రెండవ శ్లోకం** – **గత ద్వంద్వస్యమే సదా** అన్ని ద్వంద్వాలకు అతీతంగా ఉన్నాను

**మూడవ శ్లోకం** – **స్వరూపస్యక్స్వరూపితా** అనంతమైన నాకు రూపం లేదు

**నాల్గవ శ్లోకం** – **నిర్విశేషస్యర్వదా** ఎల్లప్పుడూ విషయ రహితంగా ఉంటాను.

విషయ రహితంగా ఉంటాను.

**ఐదవ శ్లోకం** – **నిస్వభావస్యమేసదా** నేను స్వభావ రహితుడు

**ఆరవ శ్లోకం** – **స్వస్వరూపేహమద్వయే** నేను అద్వయము ఆత్మ స్వరూపము అయి ఉన్నాను

**ఏడవ శ్లోకం** – **స్వస్వరూపేహమద్వయే** నేను అద్వయము ఆత్మ స్వరూపము అయి ఉన్నాను

**ఎనిమిదవ శ్లోకం** – **సర్వదావిమలస్యమే** నిత్యశుద్ధుడను

**తొమ్మిదవ శ్లోకం** – **సర్వదానిష్క్రియస్యమే** సర్వదా నిష్క్రియుడను

**పదవ శ్లోకం** – **నిర్విమర్శస్యమేసదా** దోషరహితుడను

**పదకొండవ శ్లోకం** – **సర్వదావిమలస్యమే** నిత్యశుద్ధుడను

**పన్నెండవ శ్లోకం** – **స్వస్థస్యమమసర్వదా** నిత్యము. ఆత్మస్థితుడన్నె ఉన్నాను. ఆత్మారాముడను

**పదమూడవ శ్లోకం** – **నిరుపాధేఃశివస్యమే** ఉపాధిరహితమైన పరమేశ్వరుడను

ఇలా చెప్పి, పద్నాల్గవ శ్లోకంలో – **కించిన్నోత్తిష్ఠతేమమ** ఇక నా నుండి ఏదీ వ్యక్తం కావటం లేదు అంటున్నాడు జనక మహారాజు

**క్వ భూతాని క్వ దేహో వాక్వేంద్రియాణి క్వవా మనః ।**
**క్వ శూన్యం క్వచ నైరాశ్యం మత్స్వరూపే నిరంజనే ॥** **1**

ఓ గురుదేవా ! నేను నిరంజనుడను. నాలో పంచభూతాలెక్కడ? వాటితో నిర్మించబడిన దేహం ఎక్కడ? ఇంద్రియాలెక్కడ? మనస్సు ఎక్కడ? శూన్యమెక్కడ? నిరాశ ఎక్కడ?

జనక మహారాజు అంటున్నాడు. ఓ గురుదేవా! నేను నిరంజనుడను. నాకు ఉపాధి లేదు. ఏ రకమైన మలములు లేవు. అటువంటి నాయందు పంచభూతాలు,

దేహము, ఇంద్రియాలు, మనస్సు, వాటి వ్యాపారాలు ఎక్కడుంటాయి? ఇవన్నీ యథార్థం కాదు. కల్పితాలు. పోనీ అంటే శూన్యంకాదు. ఏ రకమైన ద్వంద్వాలు కూడా లేవు.

జ్ఞాని యొక్క జీవితం వర్ణించటానికి వీలుకాదు. అతని అనుభవాలు చాలా విచిత్రంగా ఉంటాయి. అవి మనకు అర్థం కావు. మన దృష్టిలో అతడు ఒక పిచ్చివాడు. సాక్షాత్తు భగవంతుడే వచ్చి మన ఎదుట నుంచుని 'నేను భగవంతుణ్ణి' అని చెప్పినా మనం నమ్మం. నీ ఆధార్ కార్డు, ఓటరు ఐడి చూపించమంటాం. మనది లౌకిక ప్రపంచం. ఇందులో విషయాలే నమ్ముతాం. అలాంటప్పుడు మాటలకు ఊహలకు అందని జ్ఞాని పరిస్థితి మనకెలా తెలుస్తుంది? మన దృష్టిలో అతడు పిచ్చివాడు.

పాంచభౌతికమైనది ఈ శరీరము. పంచభూతాలు పంచీకరణ చెంది, త్రిగుణాలతో కలియటం వల్ల ఈ శరీరము ఏర్పడుతోంది. గతజన్మ కర్మల ననుసరించి దేహము ఏర్పడుతుంది. కాని అన్ని అవస్థలను అధిగమించి, తురీయాతీత స్థితికిచేరి నేనే పరబ్రహ్మను. **అహంబ్రహ్మాస్మి.** అనే స్థితిలో ఉన్న జ్ఞానికి పాంచభౌతికమైన దేహమెక్కడ? పంచభూతాలు ఎక్కడ? ఇంద్రియాలన్నీ శరీరంలో భాగాలు అసలు దేహమే లేదన్నప్పుడు, ఇంక ఇంద్రియాలు ఎలా ఉంటాయి? ఎక్కడ ఉంటాయి?

అంతఃకరణ చతుష్టయం అంటే 1. మనస్సు 2. బుద్ధి 3. చిత్తము 4. అహంకారము వీటిలో మొదటిది మనస్సు. అన్ని కల్పనలకు, సృష్టికి మూలము ఈ మనస్సు. ఈ జగత్తంతా మనోకల్పితము, జ్ఞాని అయిన వాడు మనస్సును జయించాడు. మనసును లయం చేశాడు. మనసును నాశనం చేశాడు. కాబట్టి అతడికి ఇంకా మనస్సు ఎక్కడ ఉంటుంది?

కోరికల వల్లనే సంసారం ప్రవర్తిల్లుతున్నది. ఆ కోరికలన్నీ మనస్సు నుంచి ఆవిర్భవిస్తాయి. మనోలయం జరిగినప్పుడు, ఇంక మనసు పనిచెయ్యదు కదా? అటువంటప్పుడు కోరికలు ఎక్కడుంటాయి? మనసు లేనివాడికి కోరికలుండవు. అందుకే అంటున్నాడు జనక మహారాజు. ఓ గురుదేవా! నేను స్వభావతః నిరంజనుడను. నాలో పంచభూతాలు, వాటిలో నిర్మించబడిన దేహము, ఇంద్రియాలు, మనస్సు, కోరికలు ఎక్కడుంటాయి? ఉండవు. అందుకే **మత్స్వరూపే నిరంజనే** – నేను నిరంజనుడను అంటున్నాడు జనకమహారాజు.

**క్వ శాస్త్రం క్వాత్మ విజ్ఞానం క్వ వా నిర్విషయం మనః ।**

**క్వ తృప్తిః క్వ వితృష్ణత్వం గత ద్వంద్వస్య మే సదా ॥ 2**

సర్వద్వంద్వాలకు అతీతంగా ఉన్న నాలో శాస్త్రాలెక్కడ? ఆత్మజ్ఞానమెక్కడ? విషయరాహిత్యమైన మనస్సెక్కడ? తృప్తి ఏమిటి? కోరిక లేకపోవటం ఏమిటి?

ఓ గురుదేవా! నేను చిద్రూపుణ్ణి. సుఖదుఃఖాలు మొదలైన ద్వంద్వాలు ఏవీ నాలో లేవు. నాకు శాస్త్రంతో గాని, శాస్త్రవిజ్ఞానంతో గాని ప్రయోజనం లేదు. మనసు ఆత్మయందు లయం అయిపోయింది. కాబట్టి కోరికలుండవు. తృప్తి అంటే ఏమిటో తెలియదు. మామూలు మానవుడికి అంటే అజ్ఞానికి కాలచక్రం తిరుగుతుంది. అతడు గతజన్మ కర్మను బట్టి కర్మఫలాన్ని అనుభవిస్తాడు. సిరిసంపదలు, భోగభాగ్యాలు, కష్టసుఖాలు, పాపపుణ్యాలు అన్నీ అనుభవిస్తాడు. కాని ఆధ్యాత్మిక విద్యలో పైకి ఎదిగిపోయిన వాడికి అంటే జ్ఞానికి గతజన్మల కర్మఫలము, ద్వంద్వాలు ఏవీ ఉండవు.

యోగము, శాస్త్రాలు, పురాణాలు, ఉపనిషత్తులు, మంత్రాలు, తంత్రాలు, అర్చనలు, యజ్ఞయాగాలు అన్నీ అజ్ఞానికే. జ్ఞానికి ఇవేవీ అక్కరలేదు. అతడు దేనికీ కర్తకాడు భోక్త అంతకన్న కాడు. ఆత్మతత్త్వం కలగాలంటే మనస్సు బాహ్యావృత్తులు వదలి, అంతర్ముఖం కావాలి. దేహమే దేవాలయం – జీవుడే అందులోని దేవుడు. ఈ విషయం తెలుసుకున్నవాడు యోగి.

**దేహోదేవాలయః ప్రోక్తో జీవోదేవస్సనాతనః ।**

**త్యజేదజ్ఞాన నిర్మాల్యం శోహం భావేన పూజయేత్ ॥**

అంటోంది **స్కందోపనిషత్తు**

శాస్త్రాలు చెప్పే విషయాలన్నీ సాధకుణ్ణి బాహ్యావిషయాల నుండి తప్పించటానికి పనికి వస్తాయి. విషయ వాసనల నుంచి విముక్తుడైన వాడి మనస్సు నిర్మలంగా, పవిత్రంగా ఉంటుంది. పవిత్రమైన, నిర్మలమైన మనస్సులో పరమేశ్వరుడు తాండవం చేస్తాడు. సాధకుడే మహాజ్ఞాని. పరబ్రహ్మ అయినప్పుడు అతడికి ఏ రకమైన ద్వంద్వాలు ఉండవు. **గతద్వంద్వస్య మేసదా** – నేను అన్ని ద్వందాలకు అతీతంగా ఉన్నాను.

క్వ విద్యా క్వచ వావిద్యా క్వాహం క్వేదం మమ క్వవాః ।
క్వ బంధః క్వచవా మోక్షః స్వరూపస్య క్వ రూపితా ॥ 3

జ్ఞానం ఎక్కడ? అజ్ఞానం ఎక్కడ? నేను ఎవరు? నాది ఏమున్నది? బంధం ఏది? మోక్షం ఏది? అనంతమైన నా స్వరూపానికి రూపం ఏది?

ఓ గురుదేవా! నేను అద్వితీయమైన చిద్రూపుణ్ణి. ఆత్మకన్న ఇతరమైన వాటి మీద, అనాత్మ వస్తువుల మీద స్ఫురణ ఏ మాత్రం లేదు. విద్య అవిద్య, అహంకార మమకారాలు, బంధ మోక్షాలు ఎక్కడున్నాయి? లేవు. నాకన్న ఇతరమైనది ఏదీలేదు.

ఈ శ్లోకంలో జనక మహారాజు చెబుతున్నాడు. ఓ గురుదేవా! నేను చిద్రూపుడను. అద్వితీయుడిని. నాకన్న వేరైనది ఏదీలేదు. అనాత్మ వస్తువుల మీద నాకు స్ఫురణ లేదు. అనాత్మ వస్తువులు అంటే ఆత్మ కానటువంటివి అన్నీ అనాత్మయే. సృష్టి ప్రారంభానికి ముందు జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని పరమేశ్వర స్వరూపం ఆక్రమించింది. అంటే జగత్తంతా పరమేశ్వర స్వరూపం ఆక్రమించింది. జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. అదే ఆత్మ. ఆత్మ నిరాకారము నిర్గుణము. దానికి నామరూపాలు లేవు. జగత్తుకు నామరూపాలున్నాయి. దృశ్యమానమైనది ఈ జగత్తు. ఇదంతా అనాత్మ. ఇది ఎలా జరిగింది అంటే అసలు జగత్తే లేదు. ఉన్నదంతా ఆత్మే. అయితే కేవలము మనోకల్పితమైన భ్రమ చేత జగత్తు ఆవిర్భవించింది. అది ఎలా జరిగింది అనేది గతంలో చెప్పుకున్నాం. ఆధ్యాత్మిక విషయాల దగ్గరకు వచ్చేసరికి ఎప్పుడు చదివిన విషయాన్ని అప్పుడే మర్చిపోతాం. కాబట్టి మళ్ళీ జగదావిర్భావం గురించి గుర్తు చేసుకుందాం. జగత్తంతా ఒక భ్రాంతి. రజ్జు సర్పభ్రాంతిలాగా, మసకచీకటిలో సర్పం కనుపించింది. భయపడ్డాడు. కేకలు వేశాడు. జనం పోగయ్యారు. దీపపు కాంతిలో పరిశీలించారు. అది సర్పం కాదు. రజ్జువు. పాముకాదు త్రాడు. తన మనోభావాల వల్ల, మనోకల్పనల వల్ల త్రాడును చూసి పామనుకున్నాడు. జ్ఞానం కలగగానే పాము తన అధిష్ఠానమైన రజ్జువులో కలసిపోయింది. అలాగే ఈ జగత్తంతా మిధ్య. అజ్ఞానంతో మనోకల్పనలతో దృశ్యమానమై జగత్తును ఊహించుకుంటున్నాడు. జ్ఞానం కలగగానే జగత్తు తన అధిష్ఠానమైన బ్రహ్మమునందు లయమై పోతుంది. అందుకే జగత్తు అనాత్మ వస్తువు. అలాగే దేహము, ఇంద్రియాలు

కూడా. అందుకే అంటున్నాడు జనక మహారాజు అనాత్మ వస్తువుల యందు నాకు స్ఫురణ లేదు. ఇంకా చెబుతున్నాడు. ఓ గురువర్యా ! విద్యావిద్యలు అంటే – జ్ఞానము అజ్ఞానము ఇవెక్కడున్నాయి. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే అని తెలుసుకోవటమే జ్ఞానము. నామరూపాలను గుర్తించటం అజ్ఞానం. ఉన్నది ఒక్కటే పరబ్రహ్మ. అంతకన్న ఇంక ఏదీలేదు. అటువంటప్పుడు జగత్తంతా పరబ్రహ్మ అని గుర్తించటం ఏమిటి? బ్రహ్మము తప్ప ఇంకేదీ లేదు కదా? అలాంటప్పుడు ఇదంతా పరబ్రహ్మము అని ఎలా అనుకుంటాం? అసలు ఇది అది ఎక్కడుంది. కాబట్టి ఓ గురుదేవా ! ఉన్నదిఒక్కటే అదే బ్రహ్మము. అదే నేను. జ్ఞానం లేదు. అజ్ఞానం అంతకన్న లేదు. అహంకార మమకారాలు లేవు. ఓ గురుదేవా! బంధం ఎక్కడ? మోక్షం ఎక్కడ? నేను ముక్త పురుషుడిని. నాకు లౌకిక బంధాలు ఎలా ఉంటాయి? అసలు లౌకికమే లేదు కదా? గుణత్రయం లేదు. కోరికలు లేవు. ప్రారబ్ధం లేదు. మరి బంధం ఎక్కడ నుంచి వస్తుంది? నేనే ముక్తపురుషుణ్ణి. నాకు మోక్షం ఏమిటి? **స్వరూపస్య క్వరూపితా** – అనంతమైన నాకు రూపం లేదు. అంటున్నాడు జనక మహారాజు.

**క్వ ప్రారబ్ధాని కర్మాణి జీవన్ముక్తి రపి క్వ వా ।**
**క్వ తద్విదేహ కైవల్యం నిర్విశేషస్య సర్వదా ॥ 4**

నిర్విశేషంగా ఉండే నాలో ప్రారబ్దం ఏమిటి? జీవన్ముక్తి ఏమిటి? విదేహముక్తి ఏమిటి?

రెండవది ఏదీలేని నాకు ప్రారబ్దము ఏమిటి? జీవన్ముక్తి విదేహముక్తి ఏమిటి?

పరబ్రహ్మ ఒక్కటే. రెండవది లేదు. అది నిరాకారము, నిరంజనము, నిర్గుణము, ప్రారబ్దము అంటే ఈ జన్మలో అనుభవించవలసిన కర్మ. గతజన్మలలో చేసిన కర్మలో కొంత భాగము ఈ జన్మలో అనుభవిస్తాము. దాన్నే ప్రారబ్దము అంటారు. ప్రతివారు ఈ కర్మను అనుభవించి తీరాలి. పరామాత్ముడైన శ్రీకృష్ణుడు చెరసాలలో పుట్టాడు. అది ఆయన ప్రారబ్దం. చిన్నతనంలో అనేకసార్లు రాక్షసుల వారి నుండి బ్రతికి బయట పడ్డాడు. అది ప్రారబ్దము. వంశనాశనం కావాలని గాంధారి శాపం పెట్టింది. అది ప్రారబ్దము. ఈ రకంగా భూమిమీద పుట్టిన ప్రతిమానవుడు తన ప్రారబ్దాన్ని

అనుభవిస్తాడు. జ్ఞాని కూడా ఈ ప్రారబ్దాన్ని అనుభవించాల్సిందే. అయితే ఒక్క మాట గుర్తుంచుకోవాలి. కర్మలు చేసేది దేహము కాబట్టి కర్మఫలాన్ని అనుభవించేది ఈ దేహమే ఆత్మకాదు. ఆత్మ దేనికీ కర్తా కాదు, భోక్తా కాదు. ఆత్మకీ కర్మకీ ఏ రకమైన సంబంధము లేదు. అలాగే ముక్తి. ఈ ముక్తి రెండు రకాలు. జీవన్ముక్తిని దేహముక్తి. జీవించి ఉండగానే ముక్తి పొందటం జీవన్ముక్తి. మరణానంతరం పొందేది విదేహముక్తి. ముక్తి అంటే విడువబడటము అని అర్థం. లౌకిక బంధాల నుంచి విడివడటము. పరమపదము చేరటము. అసలు ఇక్కడ లోకమే లేదు. మరి లౌకిక బంధాలు ఎక్కడున్నాయి? లేని వాటినుంచి విడివడటమేమిటి? ఇదంతా వంధ్యాపుత్రుడు లాగా ఉన్నది. ఒకవేళ బంధాలున్నాయి అనుకున్నా అవన్నీ దేహానికే కాని ఆత్మకు కాదు. నేను ఆత్మపురుషుణ్ణి. అటువంటి నాకు బంధమేమిటి? మోక్షమేది? నేను చిద్రూపుడుగా ఉన్నాను. నాకు ఇవేమీ లేవు **నిర్విశేషస్య సర్వదా** – నేను ఎప్పుడూ విషయ రహితంగా ఉంటాను. అంటున్నాడు జనకమహారాజు తన గురువైన అష్టావక్రుడితో

**క్వ కర్తా క్వ చ వా భోక్తా నిష్క్రియం స్ఫురణం క్వ వా ।**
**క్వాపరోక్షం ఫలం వా క్వ నిస్స్వభావస్యమే సదా ॥** **5**

ఇక్కడ కర్త ఎవరు? భోక్త ఎవరు? ఆలోచనలు రావటం ఏమిటి? వాటిని ఆపటం ఏమిటి? పరోక్షజ్ఞానం ఏమిటి అపరోక్ష జ్ఞానం ఏమిటి? ఓ గురుదేవా! నేను మాత్రము నేను నేనుగానే ఉన్నాను.

నాకు ఏ రకమైన స్వభావము లేదు. నేను చిద్రూపుణ్ణి. నాకు కర్తృత్వ భోక్తృత్వాలు, నిష్క్రియాత్వము, వృత్తిపరమైన జ్ఞానము, విషయ సంబంధమైన అజ్ఞానము ఏమీలేవు. అంటున్నాడు జనకమహారాజు.

నేను పరబ్రహ్మ స్వరూపాన్ని. నాకు ఏ రకమైన గుణదోషాలు లేవు. నేను దేనికీ కర్తను కాదు. ఏ కర్మ అయినా చేసేది దేహము. అంతేకాని ఆత్మకాదు. కర్త ఎవరు అంటే దేహము. ఆ కర్మవల్ల ఫలితాన్ని అనుభవించేది దేహమే. ఆత్మకాదు. అందుకే జనక మహారాజు చెబుతున్నాడు. దేనికీ కూడా కర్తని భోక్తని నేను కాదు. అంటే ఆత్మకాదు. దేహంతో నాకు సంబంధం లేదు. గృహస్తుకు గృహంలాగా

జీవికి ఈ దేహము ఆవాసమైంది. కాబట్టి కర్మ చేసేది దేహము. కర్మఫలితాన్ని అనుభవించేది కూడా దేహమే. అజ్ఞానంతో జీవుడు కర్మఫలితాన్ని నేనే అనుభవిస్తున్నాను అనుకున్నాడు. నేనే కర్మని కూడా చేస్తున్నాను అనుకుంటున్నాడు. కాని అది నిజంకాదు అందుకే జనక మహారాజు అంటున్నాడు. ఓ గురుదేవా! నేను చిద్రూపమైన ఆత్మని. అందుచేత నేను కర్తని కాదు భోక్తని అంతకన్నా కాదు.

మనసు నుంచి ఆలోచనలు సంకల్పవికల్పాలు వస్తాయి. నాకు మనస్సు లేదు. జ్ఞాని మనస్సును జయించిన వాడు. అతడు అమనస్కుడు.అటువంటి నాకు ఇంకా ఆలోచనలు ఎలా వస్తాయి? ఒకవేళ ఆలోచనలు వస్తే వాటిని ఎలా ఆపాలి? అని చూడాలి. నాకు ఆలోచనలే లేవు. లేని వాటిని ఇంకా ఆపేదేమిటి? నిరోధించేదేమిటి? గాలిలో కట్టిన మేడను కూలగొట్టవలసిన అవసరం లేదు కదా? అలాగే అసలు మనసే లేని నాకు ఆలోచనలేమిటి? వాటిని ఆపటం ఏమిటి?

జ్ఞానం రెండు రకాలు 1.పరోక్షజ్ఞానము 2.ప్రత్యక్షజ్ఞానం

**1.పరోక్షజ్ఞానము :** చరాచర జగత్తంతా పరబ్రహ్మమే అని తెలుసుకోవటమే జ్ఞానము. గురూపదేశం ద్వారా, శాస్త్రాలు చదివి, చర్చలు చేసి సంపాదించిన జ్ఞానము పరోక్షజ్ఞానము. వీటివల్ల విషయం తెలుస్తుంది.

**2. ప్రత్యక్షజ్ఞానము :** దీన్నే అపరోక్ష జ్ఞానము అని కూడా అంటారు. శాస్త్రాలు చదివి సంపాదించిన దాన్ని ప్రత్యక్షంగా తెలుసుకోవటం.

ఒకసారి అడవిలో ఒక చెట్టుక్రింద ఒక బ్రాహ్మణ బాలుడు కూర్చుని ఉన్నాడు. చూడటానికి బ్రహ్మచారి (విద్యార్థి)లా ఉన్నాడు. చీకటి పడుతోంది. పక్షులన్నీ గూటికి చేరుకున్నాయి. అడవితో తిరిగే వారు కూడా త్వరగా ఇళ్ళకు వెళ్ళిపోతున్నారు. అది భీకరమైన అడవి. చీకటి పడితే క్రూరమృగాలు సంచరిస్తాయి. అలా త్వరగా వెడుతున్న బోయవాడు చెట్టుక్రింద కూర్చున్న ఈ బాలుణ్ణి చూసి 'స్వామీ ! ఎవరు నువ్వు. ఇది భయంకరమైన అడవి. చీకటి పడితే పులులు, సింహాలు తిరుగుతాయి. నీ ప్రాణాలకు ప్రమాదం. అసలు నువ్వు ఇక్కడెందుకు కూర్చున్నావు? నీకేం కావాలి?' అని అడిగాడు. దానికి ఆ బ్రాహ్మణ బాలుడు 'నాకు ఒక పక్షి కావాలి. ఆకుపచ్చగా ఉంటుంది. దాని ముక్కు ఎరుపుగా ఉంటుంది. దానిపేరు చిలక, మా గురువు

గారు అడవిలో నుంచి చిలకని తెమ్మన్నారు. ఆ చిలకకోసం ఎదురు చూస్తున్నాను' అన్నాడు. వెంటనే వారు నవ్వేసి 'ఓరి పిచ్చివాడా! ఆ పైన చెట్టుమీద ఉన్నవన్నీ చిలకలే కదా. ఉండు నేను పట్టి ఇస్తాను' అని ఒక చికలను పట్టి బ్రాహ్మణ బాలుడికిచ్చాడు.

ఇప్పుడు చూడండి చిలక ఎలా ఉంటుందో అతడికి తెలుసు. శాస్త్రాలలో చదివాడు. గురువుగారు చెప్పాడు. ఇది పరోక్షజ్ఞానము. ఆ జ్ఞానం అతడికి ఉంది. కాని ప్రత్యక్షంగా చిలకని ఎప్పుడూ చూడలేను. ఇది ప్రత్యక్షజ్ఞానం. అది లేదు. లోకంలో జీవించాలంటే ప్రత్యక్ష, పరోక్ష జ్ఞానాలు రెండూ కావాలి. కాని ఆత్మకు ఇవేవీ అవసరం లేదు. అందుకే జనకుడు అంటున్నాడు. నేను ఆత్మస్వరూపాన్ని నాకు ప్రత్యక్ష జ్ఞానమేమిటి? పరోక్ష జ్ఞానమేమిటి? **నిస్వభావస్యమేసదా** – నేను స్వభావ రహితుడను.

**క్వ లోకః క్వ ముముక్షుర్వా క్వ యోగీ జ్ఞానవాన్ క్వవా ।**
**క్వ బద్ధః క్వచవా ముక్త స్వస్వరూపేఽహమద్వయే ॥ 6**

అద్వయము ఆత్మస్వరూపము అయిన నాలో ప్రపంచం ఎక్కడ? ముక్తిని కోరే సాధకుడెక్కడ? ధ్యాన్యం చేసేదెవరు? జీవన్ముక్తుడెవరు? బద్ధుడెక్కడ? ముక్తుడెక్కడ? ఓ గురుదేవా! నేను పరిశుద్ధమైన ఆత్మని. అది ఇది అనే తేడాలు నాకు లేవు. మిథ్యాకల్పితమైన లోకము, యోగి, జ్ఞాని, ముముక్షువు, బద్ధుడు ముక్తుడు అనే సంకేతాలు ఏవీలేవు.

గురువుగారూ! నేను ఆత్మస్వరూపాన్ని ఆత్మ అనేది **అణోరణీయాం మహతోమహీయాం** అణువు కన్న చాలా చిన్నది, మహత్తు కన్న చాలా పెద్దది. కాబట్టే జగత్తంతా ఆవరించింది. ప్రపంచం అంతా భ్రాంతి వల్లనే ఆవిర్భవించింది. ఆ భ్రాంతి అజ్ఞానంవల్ల వచ్చింది. నాకు అజ్ఞానం లేదు. భ్రాంతి లేదు. కాబట్టి నా దృష్టిలో జగత్తే లేదు. నేను ముక్తపురుషుణ్ణి. నేనే పరబ్రహ్మను కాబట్టి ఇంకా విడిగా ముక్తపురుషుడు ఎక్కడ ? ధ్యానం అంటే ఏమిటి? ధ్యానం చేసేవారెవరు? బంధాలు ఐహిక వాంఛలున్న వారికే ఉంటాయి. నాకు లౌకిక వాంఛలు లేవు కాబట్టి బంధాలు లేవు. అసలు బంధాలే లేనప్పుడు వాటిని త్రెంచుకుని, వాటి నుండి విడివడటం

ఎలా జరుగుతుంది? నేనే ముక్తి స్వరూపాన్ని. నాకు ఇంకా వేరే ముక్తి ఎక్కడుంది? నాకు ఇవేవీ లేవు **స్వస్వరూపే హమద్వయే** – నేను ఆత్మస్వరూపుడనై ఉన్నాను. అంటున్నాడు జనక మహారాజు.

**క్వ సృష్టిః క్వచ సంహారః క్వ సాధ్యం క్వచ సాధనమ్ ।**
**క్వ సాధకః క్వ సిద్ధిర్వా స్వస్వరూపేఽహమద్వయే ॥** **7**

అద్వయము ఆత్మస్వరూపము అయిన నాలో సృష్టి ఎక్కడ ? సంహారమెక్కడ? సాధకుడెవరు? సాధన ఏమిటి? సాధించవలసిన దేమిటి? పొందవలసిన దేమిటి?

ఓ గురుదేవా! నేను అద్వైతస్థితిలో ఉన్న ఆత్మస్వరూపుడను, నాలో భ్రమచేత కల్పించబడిన సృష్టి, స్థితి, సంహారములు గాని, సాధన, సాధకుడు, సాధ్యము మొదలైన తేడాలు గాని లేవు. జనకమహారాజు అంటున్నాడు. **స్వస్వరూపే అహమద్వయే**

అహం–నేను, అద్వయే – అద్వయమైన, స్వస్వరూపే – నా నిజస్వరూపమందు ఉన్నాను.

అద్వయే – అద్వయమైన, రెండవది లేని స్థితి. అదే అద్వైత స్థితి. ఇక్కడ అద్వైత సిద్ధాంతాన్ని చెబుతున్నారు.

జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే. ఇదే అద్వైత సిద్ధాంతము. సంసారమనే వృక్షంమీద ఒకే రూపము, రంగు కలిగిన రెండు పక్షులు కూర్చుని ఉన్నాయి. అందులో ఒకటి దొరికిన కాయలు పండ్లు తింటున్నది. రెండవది ఏమీ తినకుండా చూస్తూ కూర్చున్నది. వీటిలో మొదటిది జీవాత్మ. రెండవది పరమాత్మ. ఈ రెండూ వేరు అనుకుంటున్నారు. జ్ఞానం కలిగినట్లైతే ఈ రెండూ ఒకటే అని తెలుస్తుంది. అప్పుడు అక్కడ రెండు పక్షులు ఉండవు. ఒకటే ఉంటుంది. అని చెబుతోంది. **ముండకోపనిషత్తు.** ఇదే విషయాన్ని జనక మహారాజు చెబుతున్నాడు. నేను అద్వైత స్థితిలో ఉన్న ఆత్మను. ఈ జగత్తులో నేను తప్ప ఇంకేదీ లేదు. **మాండూక్యోపనిషత్తు**లో

**ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోంతర్యామ్యేషయోనిః**
**సర్వస్య ప్రభావాప్య యౌహి భూతానామ్ ॥**

అతడే సర్వేశ్వరుడు, అతడే సర్వజ్ఞుడు. అతడే అంతర్యామి. ఇతడే అంతటికీ కారణము. ఇతడే అన్ని భూతాల యొక్క సృష్టి స్థితి లయాలకు స్థానము.

**మాండూక్య కారికలలో** గౌడపాదుల వారు "విశ్వుడు – బహిప్రజ్ఞ గల పరమాత్మ. తైజసుడు – అంతఃప్రజ్ఞ గల పరమాత్మ. ప్రాజ్ఞుడు – ఘనప్రజ్ఞ గల పరమాత్మ. ఈ విధంగా ఒకటిగా ఉన్న ఆత్మ మూడు అవస్థలలోను మూడు రూపాలుగా పరిగణింపబడుతున్నది.

**నాంతః ప్రజ్ఞం, న బహిః ప్రజ్ఞం, నోభయతః ప్రజ్ఞం, న ప్రజ్ఞానఘనం, న ప్రజ్ఞం, నా ప్రజ్ఞం, అదృశ్యమవ్యవహార్య గ్రాహ్యమలక్షణ మచింత్య మవ్యపదేశ్య మేకాత్మ ప్రత్యయసారం ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం, చతుర్థం మన్యంతే, స ఆత్మా, సవిజ్ఞేయః ॥**

ఆ తురీయుడు అంతఃప్రజ్ఞుడు కాదు, బహిప్రజ్ఞుడుకాదు. ఉభయప్రజ్ఞుడు కాదు. ప్రజ్ఞానఘనుడుకాదు. ప్రజ్ఞుడు కాదు. అప్రజ్ఞుడు కాదు. అదృశ్యుడు. వ్యవహారానికి అందనివాడు. గ్రహించటానికి కానివాడు. లక్షణ రహితుడు. చితింపరాని వాడు. శబ్దంతో నిర్దేశించటానికి వీలుకానివాడు. ఏకాత్మ ప్రత్యయసారుడు. ప్రపంచోపశముడు. శాంతుడు. శివుడు. అద్వైతుడు. అతడే తురీయుడు. అతడే ఆత్మ.

సృష్టి స్థితి సంహారము, సాధన సాధ్యం సిద్ధులు బద్ధుడు ముక్తుడు ఇలా అన్ని ద్వంద్వాలు కూడా అద్వయమైన ఆత్మతత్త్వంలో లేవు.

**మాండూక్యకారికలలో**

**నేనిరోధో నచోత్పత్తిః నబద్ధో నచ సాధకః**

**నముముక్షుః నవైముక్త ఇత్యేషా పరమార్థతా ॥**

ఉత్పత్తి లేదు. లయం లేదు. బద్ధులు కారు. ముక్తులు కారు. సాధకులు లేరు. ముక్తులు లేరు. పారమార్థిక దృష్ట్యా ఇవి లేనేలేవు. ఇదే పరమసత్యం.

అద్వయమైన ఆత్మానుభవ స్థితిలో ఉన్నజ్ఞాని మనస్సుకు అతీతంగా ఉంటాడు. కాబట్టి అతడికి మనస్సు చేత చూడబడే సృష్టి ఎలాఉంటుంది? లేని సృష్టికి సంహారము ఎక్కడ నుంచి వస్తుంది. సాధన లేదు సాధ్యము లేదు. అదే మాట జనకుడు ఇక్కడ చెబుతున్నాడు.

**క్వ ప్రమాతా ప్రమాణం వా క్వ ప్రమేయం క్వచ ప్రమా ।**

**క్వ కించిత్క్వ న కించిద్వా సర్వదా విమలస్య మే ॥ 8**

నిత్యశుద్ధుడనైన నాలో ప్రమాత ఎవరు? ప్రమేయం ఏది? ప్రమాణం ఏది? అసలు ఉన్నదేది? లేనిది ఏది?

ప్రమాత – తెలుసుకునేది, ప్రమేయం – తెలియబడేది

ప్రమాణము – జ్ఞానము, ప్రమా – యధార్థ జ్ఞానము

ఇవేవీ ఆత్మలో లేవు.

నాకు కాలంతో సంబంధం లేదు. ఉపాధితో సంబంధం లేదు. నేను నిర్మలతాత్ముడిని. నాకు ప్రమాతృ ప్రమాణ ప్రమేయములతో సంబంధం ఏమిటి? దేనితోను సంబంధం లేదు. నాకన్న వేరైనది లేదు. శూన్యమైనది లేదు.

ఈ శ్లోకంలో **సర్వదావిమలస్యమే** ఎప్పుడూ నిర్మలుడనై ఉన్నాను. అంటున్నాడు జనక మహారాజు.

**క్వ విక్షేపః క్వచైకాగ్ర్యం క్వ నిర్బోధః క్వ మూఢతా ।**

**క్వ హర్షః క్వ విషాదౌ వా సర్వదా నిష్క్రియస్య మే ॥ 9**

నేను నిష్క్రియుడను. నాలో చలనం (విక్షేపం) ఎక్కడుంది? ఏకాగ్రత ఎక్కడ? దృఢజ్ఞానం ఎక్కడ? మూఢత్వం ఎక్కడ ? సుఖాలు దుఃఖాలు ఎలా ఉంటాయి?

గురుదేవా ! నేను చిన్మాత్రుడను. సర్వదా నిష్క్రియుడను. నాకు ఏకాగ్రత, ఇంద్రియ నిగ్రహము, విక్షేపము, హర్షము, మూఢత్వము అనే మానసిక వ్యవహారాలు లేవు.

సంసార వృక్షానికి మూలం ఆశ, కోరిక. ఇవి లేకపోతే సంసారమే లేదు. అసలు జగత్తే ఉండదు. ఏకాగ్రత, చలనము, ఇంద్రియ నిగ్రహము, హర్షము, శోకము అనేవన్నీ మనసుకు సంబంధించిన వ్యవహారాలు. వీటి మూలంగా విషయ వాంఛలు అనుభవించాలని మనసు ఉవ్విళ్ళూరుతూ ఉంటుంది. వాటిని దక్కించుకోటానికి పరుగులు తీస్తుంది. ఇటువంటి మనసును కట్టడి చెయ్యటానికి ఏకాగ్రత, ధ్యానము అత్యంత ఆవశ్యకము. ఎన్ని భోగాలు అనుభవించినా మనస్సు

అశాంతితో కొట్టుకుంటూనే ఉంటుంది. ఇంకా ఏదో అసంతృప్తి. అవి పొందాలనే కోరిక కావాలనుకున్నవి దక్కలేదనే బాధ, ఇందులోంచి బయట పడాలంటే ధ్యానము ఏకైక మార్గము. ధ్యేయమైన వస్తువుమీద దృష్టి నిలపటమే ధ్యానము. ఇవన్నీ కూడా సామాన్య మానవుడు అజ్ఞాని చేస్తాడు. కాని జనక మహారాజు మహాజ్ఞాని. ఆత్మసాక్షాత్కారం పొందినవాడు. ఆయన మనస్సు ఏనాడో లయమై పోయింది. ఇప్పుడాయనకు మనసు లేదు. అది ఏమాత్రము పని చేయదు. కాబట్టి ఆలోచనలు లేవు. ఆశలు లేవు. కోరికలు లేవు. వాటిని సాధించాలనే పట్టుదల అంతకన్నా లేదు.

అద్వయములో స్థితుడైన మహాజ్ఞాని మనస్సుకు అతీతంగా ఉంటాడు. కాబట్టి మనస్సుతో చెయ్యబడే పనులు ఏవీ అతడికి ఉండవు. అతడి దృష్టిలో అసలు జగత్తే లేదు.

అజ్ఞాని అయిన వాడికి తమోగుణం ఆవరించి స్వస్వరూపం మరుగున పడుతుంది. దాంతో ఆశలు కోరికలు విజృంభిస్తాయి. కాని సత్వగుణ ప్రధానుడైన జ్ఞానికి ఇవేవీ ఉండవు. అసలు మనసే ఉండదు. కాబట్టి మనసు చేసే సంకల్ప వికల్పాలుండవు. చలనం ఉండదు. ఏకాగ్రత ఉండదు. మూఢత్వం ఉండదు. సుఖాలు దుఃఖాలు ఉండవు. ఎందుకంటే **సర్వదా నిష్క్రియస్యమే** అటువంటిజ్ఞాని ఎల్లప్పుడు నిష్క్రియుడుగానే ఉంటాడు.

**క్వ చైష వ్యవహారో వా క్వ చ సా పరమార్థతా ।**
**క్వ సుఖం క్వ చ వా దుఃఖం నిర్విమర్శస్య మే సదా ॥ 10**

నేను అన్ని భావాలకు అతీతంగా ఉన్నాను. అటువంటి నాలో కర్మలు ఎక్కడ? కర్మలు లేని కేవలస్థితి ఏది? సుఖాలెక్కడా? దుఃఖాలెక్కడ?

గురుదేవా ! లౌకిక వ్యవహారాలు, వాటికి సంబంధించిన జ్ఞానము నాకు ఏమాత్రము లేదు. సుఖదుఃఖాలు లేవు. ఇవన్నీ ఉపాధి వృత్తులు. నేను కేవలం వీటికి సాక్షిని నాకు వీటికీ సంబంధం ఏమున్నది? లేదు.

జ్ఞాని అన్ని భావాలకు అతీతంగా ఉన్నాడు. కర్మలు చేస్తే పాపపుణ్యాలు వస్తాయి. వాటివల్ల స్వర్గనరకాలు వస్తాయి. ఉత్తర జన్మలు ఉత్తమమైనవి వస్తాయి. ఇవన్నీ

కూడా సత్కర్మలు చేసిన వారికి. మరి దుష్కర్మలు చేసిన వారికి పాపము, నరక లోకప్రాప్తి, హీనజన్మ కలుగుతాయి. కర్మలు చెయ్యటం చెయ్యకపోవటం అనేది మనసు మీద ఆధారపడి ఉంటుంది. సామాన్యంగా మనసున్న వాడు కర్మల నాచరిస్తాడు. మనసులేని వాడు కర్మలు చెయ్యడు అతడు కర్మ ఫలితాన్ని అనుభవించ వలసిన అవసరం లేదు అసలు కర్మే చెయ్యనప్పుడు ఫలితం ఎక్కడ నుంచి వస్తుంది? కాబట్టి కర్మ ఫలితం ఉండదు. జ్ఞాని దృష్టిలో అసలు కర్మలే లేవు. కర్మలు చెయ్యనప్పుడు సుఖం దుఃఖం ఎక్కడి నుంచి వస్తాయి? అవేవీ కూడా నాలో లేవు **నిర్విమర్శస్యమే సదా** ఎప్పుడూవిమర్శించటానికి వీలు కానివాడుగా దోషరహితుడుగా ఉంటాను అంటున్నాడు జనక మహారాజు.

**క్వ మయా క్వ చ సంసారః క్వ ప్రీతిర్విరతిః క్వ వా ।**
**క్వ జీవః క్వ చ తద్బ్రహ్మ సర్వదా విమలస్యమే ॥** **11**

నేను నిత్యశుద్ధుడను. నాకు మాయ ఎక్కడ? సంసారమెక్కడ? నాకు రాగద్వేషాలు ఏ రకంగా ఉంటాయి? అసలు జీవుడెవరు? దేవుడెవరు?

నాకు ఉపాధి లేదు. కాబట్టి నాకు సంసారం లేదు. దానిమీద ప్రేమ అంతకన్నా లేదు. జీవభావం లేదు. బ్రహ్మభావం అంతకన్న లేదు.

గురుదేవా! నేను పవిత్రమైనవాడను. నిర్మలుడను.నాకు ఉపాధి లేదు అంటున్నాడు. ఉపాధి అంటే శరీరము. జ్ఞానికి శరీరం లేదా? ఇక్కడ దేహం వేరు, ఆత్మవేరు. శరీరం లేదా? అంటే ఉంది. కాని సామాన్య మానవుడిలాగా "ఈ దేహం నాది. దీనికి ప్రతిరోజు శుభ్రంగా స్నానం చేయించాలి. అందమైన వస్త్రాలు, వివిధ రకాల అలంకరణలు చేసి ఈ శరీరాన్ని అందంగా తీర్చిదిద్దాలి" అనే భావన ఉండదు. జ్ఞానికి శరీరంమీద ఏ మాత్రము శ్రద్ధ ఉండదు. అతడు స్నానం చెయ్యడు. వస్త్రాలు ధరించడు. అలంకారాలు చేసుకోడు. నెత్తిన జుట్టంతా బాగా పెరిగిపోయి ఉంటుంది. గడ్డాలు మీసాలు బాగా పెరిగి ఉంటాయి. వళ్ళు మట్టి కొట్టుకుపోయి ఉంటుంది. కనీసం భోజనం కూడా చెయ్యడు. ఇటువంటి స్థితిలో జ్ఞానికి శరీరం ఉన్నా లేనట్లే. శరీరాన్ని శవంలాగా చూస్తాడు. అందుకే నాకు ఉపాధి లేదు అంటున్నాడు జనక మహారాజు.

ఇటువంటి జ్ఞానులు ఈ కాలంలో ఉన్నారా? అంటే ఉన్నారు. కాని వారు జ్ఞానులని మనకు తెలియదు. జ్ఞానిని ఇంకొక జ్ఞానే గుర్తు పడతాడు. జనం దృష్టిలో అతడు పిచ్చివాడు. ప్రస్తుతం గుంటూరుజిల్లా ఉండవల్లి దగ్గర ఒక స్వామి ఉన్నాడు. అందరూ వెంకయ్యస్వామి అని పిలుస్తారు. పదిహేను సంవత్సరాల క్రితం నేను చూసినప్పుడు ఒక పిచ్చివాడులాగా ఒక దేవాలయం దగ్గర కూర్చుని ఉన్నాడు. తరువాత కాలంలో భక్తులు పెరగటం జరిగింది. ఒక చిన్న బసకూడా ఏర్పాటు చేశారు. ఆయన్ను మళ్ళీ నాలుగు సంవత్సరాల క్రితం చూశాను. గుంటూరులో ఒకరింట్లో జరిగిన ఒక ఆధ్యాత్మిక కార్యక్రమానికి ఆయన్ను తీసుకువచ్చారు. వంటిమీద వస్త్రాలు లేవు. చింపిరిజుట్టు. బాగా పెరిగిన గడ్డాలు మీసాలు. లోపలకు తీసుకువచ్చారు. ఒక సోఫాలో కూర్చోపెట్టారు. అందులోనే పడకున్నాడు. పైన బట్టకప్పారు. పిచ్చిచూపులు చూస్తున్నాడు. ఆహారం ఏమీ తీసుకోలేదు. ఒక అరగంట ఉండి వెళ్ళిపోయారు. వెళ్ళేటప్పుడు కొద్దిగా పెరుగు అన్నం కలిపి ఒకగిన్నెలో ఇచ్చారు. అది చూసి ఆయన ముఖం త్రిప్పుకున్నాడు. ఆయన శిష్యుడు ఆ గిన్నె తీసుకుని బలవంతంగా నాలుగుముద్దలు తినిపించాడు. తిన్నా తినకపోయినా ఏమీ స్పందించలేదు. జాగ్రత్తగా నడిపించి తీసుకువెళ్ళి కారు వెనక సీట్లో పడుకోపెట్టారు. మన తృప్తికోసం బట్టలు, కొద్దిగా డబ్బు ఇచ్చి పంపారు. ఒక ఇంజనీరుగారు ఉద్యోగం మానేసి ఆయనకు సేవ చేస్తూ ఉండిపోయాడు. ఇలాంటి వాళ్ళు ఇప్పుడు కూడా ఉన్నారు. వీరంతా అవధూత స్థితికి చెందినవారు మహాజ్ఞానులు. వారిది పారలౌకికమైన జ్ఞానం. మన కంటికి వారు పిచ్చివారులాగా కనుపిస్తారు. అందుకే హేతువాదులు వీరిని నమ్మరు.

జనక మహారాజు చెబుతున్నాడు. గురుదేవా ! నాకు శరీరం లేదు. మరి ఈ మాయ ఎక్కడ ఉంది? అసలు మాయ అంటే ఏమిటి? అనాదియైనది, అంతము గలది, ప్రమాణాలకు, అప్రమాణాలకు సాధారణమైనది, సత్తుకాదు అసత్తు కాదు సదసత్తు అంతకన్నా కాదు. స్వయముగా అధికమైనది. వికారాలు లేనిది. నిరూపించటానికి వీలైన లక్షణాలు లేనిది మాయ. మనస్సు కన్న వేరుగా మాయగాని, అజ్ఞానంగాని లేవు అంటారు భగవత్పాదుల వారు, తమ **వివేకచూడామణిలో**

**న హ్యస్య విద్యామనసోతిరిక్తా మనోహ్యావిద్యా భవబంధ హేతుః**

**తస్మిన్ వినష్టే సకలం వినష్టం విజృంభతేస్మిన్ సకలం విజృంభతే ॥**

మనస్సుకన్న వేరుగా అవిద్యలేదు. జనన మరణాల వలయం బంధించేదే అవిద్య. అవిద్యయొక్క వ్యక్తరూపమే మనస్సు మనస్సు నశిస్తే సర్వము నశిస్తుంది. మనస్సు ఉంటే సృష్టి అంతా రూపుదాలుస్తుంది.

కాబట్టి మాయ అంటే మనస్సు. సామాన్యుడికి మనస్సుంటుంది. జ్ఞానికి మనస్సుండదు. లయమయిపోతుంది. మనస్సు వల్లనే సంసారం ఆవిర్భవిస్తుంది. కాబట్టి నాకు మనస్సు లేదు. సంసారం అంతకన్నా లేదు. రాగద్వేషాలు, అహంకార మమకారాలు ఇవన్నీ సామాన్యుడికి. అంతేకాని జ్ఞానికి ఉండవు.

అజ్ఞానియైన సామాన్య సాధకుడికి నువ్వే పరమాత్మ స్వరము అని చెబుతారు. **స్కందోపనిషత్తులో** చెప్పినట్లుగా

**దేహో దేవాలయః ప్రోక్తోజీవో దేవ స్సనాతనః**

**త్యజే దజ్ఞాన నిర్మాల్యం శోహం భావేన పూజయేత్ ॥**

ఓ సాధకుడా ! నీ దేహమే దేవాలయం. అందులోని జీవుడే సనాతనమయిన పరబ్రహ్మ. అజ్ఞానాన్ని వదలి 'సోహం' అని జపిస్తే ఆత్మసాక్షాత్కారమవుతుంది.

ఇది కేవలం అజ్ఞానికి. కాని జనక మహారాజు చాలా గొప్ప జ్ఞాని. అందుకే జీవుడెవరు? దేవుడెవరు? అంటున్నాడు.

**ముండకోపనిషత్తులో**

**స మోహవై తత్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవభవతి**

బ్రహ్మము గురించి తెలుసుకున్న వాడు కూడా బ్రహ్మమే అవుతాడు. అందుచేతనే **సర్వదావిమలస్యమే** నేను దోషవర్జితుణ్ణి. నిత్యశుద్ధుడను అంటున్నాడు జనక మహారాజు.

**క్వ ప్రవృత్తి ర్నివృత్తిర్వా క్వ ముక్తిః క్వచ బంధనమ్ ।**

**కూటస్థ నిర్విభాగస్య స్వస్థస్య మమ సర్వదా ॥** **12**

ప్రవృత్తి ఎక్కడ? నివృత్తి ఎక్కడ? బంధమెవరికి? ముక్తి ఎవరికి? విభాగ రహితంగా నేను నిత్యము ఆత్మయందు స్థితుడనై ఉన్నాను.

నేను కూటస్థుడను. నాకు ఏ కర్మా లేదు నిష్క్రియుడను. ఏ రకమైన భేదాలు లేవు. భేదరహితుడను, అటువంటి నాకు ప్రవృత్తి, నివృత్తి, బంధ మోక్షాలు ఎలా ఉంటాయి?

నేను కూటస్థుడను అంటున్నాడు. కూటస్థుడు అంటే కూటము నందు ఉండేవాడు. కూటము అంటే – అసత్యము, కల్లయైనది. కృత్రిమమైనది. కపటము గలది అని అర్థం. కూటస్థుడు – నిర్వికారంగా ఉండేవాడు, మూలపురుషుడు. కబట్టి కూటస్థుడు అంటే పరమాత్మ. అదే మాట చెబుతున్నాడు జనక మహారాజు. నేను పరబ్రహ్మను. నాకు ఏ కర్మా లేదు. నేను ఏ కర్మలు చెయ్యను. సంచితము ప్రారబ్ధము ఆగామి అనే మూడు రకాల కర్మలలోను ఈ జన్మలో చేసేది ఆగామి కర్మ. అజ్ఞాని కర్మ చేస్తాడు. జ్ఞాని కర్మ చెయ్యడు. ఏ రకమైన కర్మా చెయ్యడు. అందుకే నేను నిష్క్రియుడను. నాకు ఏ రకమైన భేదభావాలు లేవు. అటువంటి నాకు ప్రవృత్తి, నివృత్తి ఎలా ఉంటాయి.

ప్రవృత్తి మార్గము అంటే లౌకికమైన మార్గము. సంసారానికి దోహదం చేసే మార్గము. సిరిసంపదలు భోగభాగ్యాలు, ఉన్నత పదవులు సంపాదించే మార్గం. ఐహికమైన కోరికలు తీర్చి జీవితంలో ఇంకా ఇంకా ఉన్నత స్థాయికి తీసుకుపోయే మార్గం. దీన్ని అజ్ఞానులు అనుసరిస్తారు.

నివృత్తి మార్గము. ఇది మోక్షమార్గం. సర్వాన్ని పరిత్యజించి, సత్యాన్వేషణలో కాలం గడుపుతూ, సంసార బంధనాలు వదిలించుకుని ఆత్మసాక్షాత్కారము కోసం ప్రయత్నించటం. జనక మహారాజు అడుగుతున్నాడు అసలు ఈ మార్గాలేమిటి? ఇవి నాకెందుకు? అని. అజ్ఞానియైన సాధకుడు నివృత్తి మార్గంలో పయనించి ఆత్మసాక్షాత్కారం పొంది జీవన్ముక్తుడై, మరణానంతరము సాయుజ్యం పొందుతాడు.

ఇప్పుడు జనకుడు అజ్ఞాని కాదు. మహాజ్ఞాని. లౌకిక ప్రపంచంలో లేడు. దీనికి అతీతంగా శుద్ధ బుద్ధ ముక్త స్వరూపంలో ఉన్నాడు. అందుకే అంటున్నాడు ఓ గురుదేవా! ఇవన్నీ నాకు ఎలా ఉంటాయి? **స్వస్థస్యమమసర్వదా** నేను సర్వదా ముక్తుడను.

**క్వోపదేశః క్వ వా శాస్త్రం క్వ శిష్యః క్వ చ వా గురుః ।**

**క్వ చాస్త పురుషార్థో వా నిరుపాధే శ్శివస్యమే ॥** **13**

ఉపదేశం ఎవరికి? శాస్త్రమెక్కడ? గురువెవరు? శిష్యుడెవరు. పురుషార్థాలెక్కడ? నేను పరమాత్మగా ఉన్నాను.

నేను నిత్యానంద శివరూపుడిని. ఉపదేశంతో గాని, ఉపదేశ శాస్త్రంతో గాని, నాకు ఉపయోగం లేదు. గురుశిష్య భావన లేదు. నేను ఉపాధి రహితుడనై ఉన్నాను. ఓ గురుదేవా! **నిరుపాధేశివశ్యమే** నిరుపాధేయుడ నైన ఈశ్వరుడను. నేను మంగళస్వరూపుణ్ణి. గురువుగారు రహస్యంగా శిష్యుడికి చెప్పే దాన్ని ఉపదేశము అంటారు? ఉన్నది ఒక్కటే. ఇందులో గురువెవరు? శిష్యుడెవరు? గురువు అంటే

**గుకారశ్చాంధకారోహి । రుకారస్తేజ ఉచ్యతే**

**అజ్ఞానగ్రాసకం బ్రహ్మ । గురురేవన సంశయః ॥**

'గు' అంటే అంధకారము. ఆ అంధకారాన్ని పోగొట్టి జ్ఞానజ్యోతులు వెలిగించే వాడు గురువు.

**ధ్యానమూలం గురోర్మూర్తిం । పూజామూలం గురోః పదం**

**మంత్రమూలం గురోర్వాక్యం । ముక్తిమూలం గ్రురోః కృపా ॥**

ధ్యానానికి మూలం గురుమూర్తి. పూజ చెయ్యటానికి మూలం గురుపదం. గురువాక్యమే మంత్రము, గురుకృప ఉంటేనే ముక్తి కలుగుతుంది. స్కాందపురాణంలోని **గురుగీత**లో ఈ విషయం చెప్పబడింది.

గురువుగారు శిష్యుడికి చెప్పే మంత్రాలు గాని, ఇతరత్రాగాని ఉపన్యాసాలు అన్నీ గురుకృప సాధించటానికి ఉపయోగించబడతాయి. గురుకృప వల్లనే మోక్షం సిద్ధిస్తుంది. అటువంటి గురువెక్కడ

**గురుర్ బ్రహ్మ, గురుర్ విష్ణుః గురుర్దేవో మహేశ్వరః**

**గురుస్సాక్షాత్తు పరబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః ॥**

శిష్యుడి హృదయంలో జ్ఞానబీజం నాటేది గురువు కనుక అతడు సృష్టికర్త అయిన బ్రహ్మస్వరూపము.

తాను నాటిన ఆ బీజాన్ని జాగ్రత్తగా పెంచి పోషించే స్థితికారకుడు. అజ్ఞానాన్ని లయం చేసే మహేశ్వరుడు. ఈ రకంగా గరువు త్రిమూర్తి స్వరూపుడు. అతడే మోక్షానిచ్చే పరబ్రహ్మ. అటువంటి గురువుకు నమస్కారము.

ఆ గురువెవరు? శిష్యుడెవరు? అంటున్నాడు. అసలు ఆ పురుషార్థాలు ఎన్ని? ఒక్కటే. అదే మోక్షసాధన. ఓ గురుదేవా! అసలు మోక్షమెక్కడుంది? బంధాలు ఎక్కడ? మోక్షము ఎక్కడ? **నిరుపాధేశివస్యమే** ఉపాధి లేని ఈశ్వరుణ్ణి నేను అంటున్నాడు జనక మహారాజు.

**క్వ చాస్తి క్వచ వా నాస్తి క్వాస్తి చైకం క్వచ ద్వయమ్ ।**
**బహునాత్ర కిముక్తేన కించిన్నోత్తిష్ఠతే మమ ॥** **14**

ఉన్నది ఏమిటి? లేనిది ఏమిటి? ఏకత్వం ఏది? ద్వైతం ఏది? ఇంతకన్న చెప్పవలసింది ఏముంది?

గురుదేవా! నేను చిద్రూపుణ్ణి. సాక్షాత్తు పరబ్రహ్మను. నాకు ఇది ఉన్నదని ఇది లేదని, ద్వైతము అద్వైతము అని, ఏ రకమైన తేడాలు స్ఫురించవు. షడ్భావ వికారాలు నాకు లేవు. గురువర్యా ! జగత్తులో కంటికి కనుపించే తేడా అంతా కేవలము ఉపాధి కల్పితము. ఆత్మ అనంతమైనది. అద్వితీయమైనది. పరబ్రహ్మ స్వరూపుడ నయిన నాకన్న వేరైనది ఏదీలేదు. అంటున్నాడు జనక మహారాజు.

ఓ గురుదేవా ! అష్టావక్ర మహర్షీ ! నేను చిదానందరూపుడను. పరాత్పరుడను. నేనే పరబ్రహ్మను. వాక్కుకు మనస్సుకు అందని ఆనందరూపుణ్ణి. ఆత్మానందరూపుడను ఆత్మారాముడను. నేనే ఆత్మను. నేనే సదాశివుడను. ఆత్మజ్యోతిని. నాకు ఆది మధ్య అంతము అనేవి లేవు. ఆకాశం లాగా జగత్తంతా వ్యాపించి ఉంటాను. నిత్యశుద్ధుడను. చిదానందుడను. నేను నిరాకారుడను. కేవలము బ్రహ్మమాత్రుడను. అజుడను అమరుడను. నాకు నేనే ప్రకాశిస్తాను. స్వయంగా ఆత్మయందు ఉన్నాను. నాకు పరాగతి నేనే. స్వయంగా భుజిస్తాను. స్వయంగా క్రీడిస్తాను. నేను జ్యోతిస్వరూపాన్ని మహారూపాన్ని నా ఆత్మలో నేనే క్రీడిస్తాను. నా ఆత్మయందే అన్ని వస్తువులను చూస్తాను. స్వాత్మరాజ్యంలో సుఖమందు రమిస్తాను. నాకన్న ఇతరమైనది లేదు.

చరాచర జగత్తు ఏమిటి? అది ఎక్కడుంది? ఎక్కడ నుంచి వచ్చింది? అసలు ఉన్నది ఏమిటి? లేనిది ఏమిటి? అంతా నేనే కదా? నాకన్న వేరైనది ఏముంది?

రెండేమిటి? ఒకటేమిటి? ద్వైతాద్వైతాలు ఎక్కడున్నాయి? ఒకటి అంటే అద్వైతము. రెండు అంటే ద్వైతము. ఇవన్నీ మనోకల్పిత భావనలు. అసలిక్కడ మనస్సే లేదు. (లయమై పోయింది) లేని మనసుకు భావనలు ఎలా ఉంటాయి? షడ్వికారాలు నాకు లేవు. షడ్వికారాలంటే

| | | | |
|---|---|---|---|
| 1. జాయత్ | – పుట్టుట | 4. పరిణయతే | – రూపుమారుట |
| 2. అస్థి | – పెరుగుట | 5. అపక్షీయతే | – క్షీణించటం |
| 3. వర్ధతే | – వృద్ధి చెందుట | 6. నాశయతే | – నాశనము |

ఇవన్నీ లౌకికమైనవి. ఇవి నాకెక్కడ ఉంటాయి. ఇక తేడాలు అంటారా? ఇవన్నీ భావకల్పితాలు మనస్సుచేత కల్పించబడ్డవి.

గురుదేవా! ఆఖరుగా ఒకమాట చెబుతాను. గురువు లేడు శిష్యుడు లేడు. మంత్రం లేదు తంత్రం లేదు. దృశ్యం లేదు. దృక్కు లేదు. కేవలము నేను మాత్రమే ఉన్నాను. చింత్యమైనది. న్యాయమైనది, హితమైనది ఏదీలేదు. ప్రాణాలన్నీ అసత్తు. భోగాలు అసత్తు. చూడబడేది, వినబడేది అంతా అసత్తు. కార్యము అకార్యము అసత్తు, నష్టమైనది అసత్తే, ప్రాప్తమైనది అసత్తే.

సుఖం లేదు, దుఃఖం లేదు. పూర్ణం లేదు, అపూర్ణం లేదు, ధర్మం లేదు, అధర్మం లేదు, స్వరూపం అంతకన్నా లేదు. అంతా అసత్తే. నేను ఒక్కడినే శాశ్వతమైన వాడను. నిత్యమైన వాడను. సచ్చిదానందుడను. నేను పరబ్రహ్మాను. నాకన్న ఇతరమైనది ఏదీలేదు. గురుదేవా! నేనే పరబ్రహ్మాను. నాకన్న ఇతరమైనది ఏదీలేదు. మీ దయవల్ల ఈ విషయాలన్నీ గ్రహించి కృతార్థుడనైనాను **కించిన్నోత్తిష్ఠతేమమ** – ఇంతకన్న నేను ఏమీ చెప్పలేను. నా నుంచి ఏమీ వ్యక్తం కావటం లేదు అంటున్నాడు జనక మహారాజు. **నిర్వాణషట్కం**లో భగవత్పాదుల వారు చెప్పనట్లుగా

**మనోబుద్ధ్యహంకార చిత్తాని నాహం**
**నకర్ణం (నశ్రోత్రం) నజిహ్వో నచ ఘ్రాణ నేత్రే**
**నచ వ్యోమ భూమి ర్న తేజో నవాయుః**
**చిదానందరూప శ్శివోహం శ్శివోఽహమ్ ॥** 1

మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అను నాలుగు విధములైన వృత్తులతో గూడిన అంతఃకరణము నేను కాను. నేత్రము, శ్రోత్రము, ఘ్రాణము, జిహ్వా మొదలగు జ్ఞానేంద్రియములును నేను కాను. ఆకాశము, వాయువు, తేజస్సు, జలము మొదలగు పంచ భూతములును నేను కాను. కాని చిదానంద స్వరూపుడగు పరమశివ (పరబ్రహ్మ) స్వరూపుడను నేనైయున్నాను. పరమశివ స్వరూపుడనే నేను.

**నచ ప్రాణసంజ్ఞో నవై పంచవాయు**
**ర్న వా సప్తధాతు ర్నవా పంచకోశాః**
**న వాక్పాణి పాదౌ న చోపస్థ పాయూ**
**చిదానందరూప శ్శివోహం శ్శివోఽహమ్ ॥ 2**

ప్రాణమను పేరుతో వ్యవహరింపబడు ప్రాణాపానాదికములగు ఐదు విధములగు వృత్తులతో దేహమధ్యమున సంచరించు వాయువును నేను కాను. స్థూల దేహధారకములగు రక్తము మాంసము మొదలుగా గల సప్తధాతువులును నేను కాను. అన్నమయము, ప్రాణమయము, మనోమయము మొదలుగా గల పంచకోశములును నేను కాను. హస్తములు, పాదములు, వాక్కు మొదలగు కర్మేంద్రియములును నేను కాను. కాని చిదానంద స్వరూపుడగు పరమశివ (పరబ్రహ్మ) స్వరూపుడనే నేనై యున్నాను.

**న మే ద్వేషరాగౌ న మే లోభమోహౌ**
**మదో నైవ మే నైవ మాత్సర్య భావః ।**
**న ధర్మో న చార్థో న కామో న మోక్షః**
**చిదానందరూప శ్శివోహం శ్శివోఽహమ్ ॥ 3**

రాగద్వేషములు కాని, లోభ మోహములు కాని, మదము కాని, మాత్సర్యము కాని నాకు (ఆత్మకు) సంబంధించినవి కావు. ఇవి పాంచ భౌతికమగు అంతఃకరణమునకు సంబంధించినవి. నేను సర్వాత్మకుడను, నిత్యముక్తుడను కావున ధర్మార్థ కామ మోక్షములనే పురుషార్థములు నావి కావు. అవి అజ్ఞాన దశయందున్న జీవాత్మలచే కోరబడునవి. కాని జ్ఞానియగు వానిచే కోరబడునవి కావు. సర్వమును తానని గుర్తించిన జ్ఞానికి తనచే పొందబడనిదియు, ప్రార్థింప దగినదియు వైన

వస్తువు ఏదియు నుండనేరదు గదా? నేను మాత్రము చిదానంద స్వరూపుడగు పరమశివ (పరబ్రహ్మ) స్వరూపుడనై ఉన్నాను.

**న పుణ్యం న పాపం న సౌఖ్యం న దుఃఖం**
**న మన్త్రో న తీర్థం న వేదా న యజ్ఞాః ।**
**అహం భోజనం నైవ భోజ్యం న భోక్తా**
**చిదానందరూప శ్శివోహం శ్శివోఽహమ్ ॥ 4**

పుణ్యము కాని, పాపము కాని నేను కాను. సుఖము కాని, దుఃఖము కాని నేను కాను. మంత్రము కాని, పుణ్యతీర్థము కాని నేను కాను. వేదములు కాని, వేదవిహితములగు యజ్ఞములు కాని నేను కాను. భుజింపదగిన పదార్థ జాతము కాని, భుజించుట యను క్రియ కాని, భుజించు (అనుభవించు) వాడను గాని నేను కాను. నేను మాత్రము చిదానంద స్వరూపుడగు పరమశివ (పరబ్రహ్మ) స్వరూపుడనై ఉన్నాను.

**న మృత్యు ర్న శంకా న మే జాతిభేదః**
**పితా నైవ మే నైవ మాతా చ జన్మ**
**న బంధు ర్న మిత్రం గురు ర్నైవ శిష్యః**
**చిదానందరూప శ్శివోహం శ్శివోఽహమ్ ॥ 5**

నాకు (ఆత్మకు) మరణము లేదు. భయము లేదు. స్త్రీ పుం నపుంసకములను జాతి భేదములును లేవు. నాకు పుట్టుక లేదు. కావుననే తల్లియును, తండ్రియును లేరు. నాకు బంధువు గాని, మిత్రుడు గాని, గురువుగాని, శిష్యుడు గాని లేరు. నేను మాత్రము చిదానంద స్వరూపుడగు పరమశివ (పరబ్రహ్మ) స్వరూపుడనై ఉన్నాను.

**అహం నిర్వికల్పో నిరాకార రూపో**
**విభుత్వాచ్చ సర్వత్ర సర్వేంద్రియాణామ్ ।**
**న చా సంగతం నైవ ముక్తి ర్న బన్ధః**
**చిదానందరూప శ్శివోహం శ్శివోఽహమ్ ॥ 6**

నేను ఏ విధమైన విశేషములును లేనివాడను, నిరాకారుడను, వ్యాపకుడను గాన నేను సర్వ దేశముల యందును, సర్వ కాలముల యందును, సర్వ వస్తువుల యందును యుండువాడను.కావుననే నా స్వరూపము సకలేంద్రియములచే గ్రహింపబడుచునే యుండును. నిత్యముక్త స్వరూపుడను గాన నాకు ముక్తిగాని, బంధము గాని లేదు. నేను మాత్రము చిదానంద స్వరూపుడగు పరమశివ (పరబ్రహ్మ) స్వరూపుడనై ఉన్నాను. ఇది జ్ఞాని యొక్క స్థితి.

చిదానందరూపుడైన జ్ఞానికి దేనితోను పనిలేదు. అతడే బ్రహ్మ.

ఒక్కడ ఒక్క మాట గుర్తించండి. ఓ సాధకుడా ! నీకు

ఈ పుట్టుక - ఇతరులు ఇచ్చారు

ఈ పేరు - ఇతరులు పెట్టారు

ఈ చదువు - ఇతరులు చెప్పించారు

ఈ సంపాదన - ఇతరులిచ్చిందే

మొదటి స్నానం - ఇతరులు చేయించారు

ఆఖరి స్నానం - ఇతరులే చేయిస్తారు

అంత్యక్రియలు - ఇతరులు చేస్తారు

మరణానంతరం నీ వస్తువులు

ఆస్థిపాస్థులు - ఇతరులు తీసుకుంటారు

మరింకెందుకు 'నేను' అనే ఈ అహంకారం? ఇక్కడ నీది ఏముంది?

అహం వీడితే - ఆనందం, శాశ్వతమైన ఆనందం

నిన్ను నువ్వు తెలుసుకోగలిగితే - మోక్షం

## 21. నువ్వెవరు?

అరవై నాలుగు లక్షల జీవకణాలు అత్యంత వేగంగా తల్లిలోకి ప్రవేశిస్తే, అందులో ఒకే ఒక్క జీవకణం మాత్రమే గర్భంలోకి ప్రవేశిస్తుంది. అవి కూడా మొండాని కోల్పోయి శిరస్సుతో మాత్రమే ప్రవేశిస్తుంది. ప్రవేశించిన తరువాత 24 గంటలలో అండాన్ని పట్టుకుని బ్రతకకపోతే, ముక్కలై బయటకు వచ్చేస్తుంది. అది ఒక పోరాటమే. ఆ పోరాటంలో గెలిచావా బ్రతుకుతావు. లేదా ముక్కలై బయటకు వచ్చేస్తావు.

అలా రూపం లేకుండా వెళ్ళిన కణం రూపాంతరం చెంది, రూపంతో బయటకు వస్తుంది. రూపాన్ని పొందుతుంది. కాళ్ళు చేతులు కదపలేని స్థితి. నోటితో ఏమీ చెప్పలేని స్థితి క్రమంగా దేహం పెరుగుతుంది. దేహం మీద మోహము పెరుగుతుంది. ఈ దేహం నేనే అంటున్నావు.

కాబట్టి ఓ ధన్యజీవీ ! జీవిత పరమార్ధమైన మోక్షం కోసం ప్రయత్నించు అంటూ మోక్షవాదులంతా ఈ విషయాన్ని ఆకళింపు చేసుకుని జ్ఞానసముపార్జన చేస్తారని భావిస్తూ సామాన్యుడికి కూడా అర్ధమయ్యే రీతిలో అతిసులభశైలిలో వ్రాసిన **అష్టావక్రగీత** అనే ఈ గ్రంథాన్ని పూర్తి చేస్తున్నారు **స్వామి పరమానందనాథులు.**

సర్వేజనాః సుఖినోభవంతు

సమస్త సన్మంగళానిభవంతు

ఓం తత్సత్